శ్రీరస్తు.

శ్రీ కల్యాణవర్మకృత

# సారావళి

## సాంధ్రతాత్పర్యము.



చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

వారిచే ప్రకటితము.

1935

# ప్రథమముద్రణపీఠిక.



సారావళి:—ఇయ్యది వేదాంగవిద్వర్యుఁడగు కల్యాణవర్మవిరచితమగు జాతకగ్రంథము ఈగ్రంథకర్త బృహజ్జాతకమును రచియించిన శ్రీమద్వరాహమిహిరాచార్యులకుఁ దరువాతివాఁడనుట స్పష్టము. గ్రంథకర్తయే సారావళి తొలియధ్యాయమున

"విస్తరకృతాని మునిభిః పరిహృత్య పురాతనాని శాస్త్రాణి,
హోరాతంత్రం రచితం వరాహమిహిరేణ సంక్షేపాత్."

అని చెప్పియుండుటంబట్టి పైయర్థము స్పష్టమే. ఈశ్లోకముంబట్టి విమర్శింపఁగా వరాహమిహిరాచార్యులమార్గము మునికృతపూర్వ జాతకశాస్త్రవిరుద్ధమని యీకవి యూహ యని తోఁచకమానదు.

వరాహమిహిరాచార్యులు అరేబియా దేశమునకుం బోయి జాతకశాస్త్రరహస్యములను దెలిసికొనివచ్చి బృహజ్జాతకమును రచించినట్లు నానుడికలదు. అట్లు కాఁబట్టియే బృహజ్జాతకమునందు సంస్కృత భాషేతరశబ్దములను "ఆకోకేర" ప్రభృతులను వాడియున్నారు. యవన మతమున మిక్కిలి గౌరవ మీమహాత్ములకుం గలదు. "మయయవన మణిత్థశక్తిపూర్వైః" అను చో యవనాచార్యులను బేర్కొనియుండుట పైనాయూహను దృఢపఱచుచున్నది. అంతియకాక ప్రాచీనశాస్త్రమున నొక క్రొత్తసంస్కార మీమహామహులచేఁ జేయఁబడిన దనక తప్పదు. యోగములను వ్రాయుచు,

"పూర్వశాస్త్రానుసారేణ మయా వజ్రాదయః కృతాః,
చతుర్థే భవనే సూర్యాత్ జ్ఞసితౌ నివసేత్కథమ్."

అని ప్రాచీనమతమునఁ గలదోషమును వెలిఁబుచ్చియున్నారు కావునఁ నాతనికాలమునఁ బ్రాచీనగ్రంథముల లేనివిషయములు పెక్కు చేర్పఁబడుటంజేసి క్రొత్తసంస్కరణముల నొనరించె ననుట వింతలోనిదికాదు.

ఈసారావళికర్త బృహజ్జాతకమునకంటె ఫలవిషయమున నెక్కువగాఁ దాఁ జెప్పినట్లు

"విషయవిభాగం స్పష్టం కర్తుం న తు శక్యతే యత స్తేన,
అత ఏవ విస్తరేభ్యో యవననరేంద్రాదిరచితశాస్త్రేభ్యః,
సకల మసారం త్యక్త్వా తేభ్యః సారం సముద్ధ్రియతే"

అనుశ్లోకములనుండి తేలకపోదు.

బృహజ్జాతకమునకు వ్యాఖ్యరచియించిన భట్టోత్పలాచార్యులు ఈసారావళినుండి పలుతావులఁ బ్రమాణశ్లోకములను దనవ్యాఖ్యలో నుదహరించియున్నారు. ఈభట్టోత్పలుఁడు క్రీస్తుశకం, ౧౬౦౫ సం॥ పట్టాభిషిక్తుఁడైన జహాంగీరుచక్రవర్తికాలములో నున్నవాఁ డనుటకనేకదృష్టాంతములు గలవు, అనఁగా నేఁటికి 313 సం॥ల క్రిందటివాఁడు బృహజ్జాతకకర్తయగు వరాహమిహిరాచార్యులు విక్రమార్కుని యాస్థానపండితు లనుట స్పష్టము. అంతకాలముక్రిందట రచింపఁబడిన యీజాతకగ్రంథము నేఁటికి మూఁడువందలసంవత్సరముల క్రిందనున్న భట్టోత్పలాచార్యునిచే వ్యాఖ్యాతమగుట కేమిహేతువో తెలియదు. పెక్కువ్యాఖ్యలుండి యవి క్షీణించిగాని లేక యవి యసంగతములుగ నుండుటంగాని యిందులకుం గారణమై యుండనోపు.

ప్రకృతగ్రంథకర్తయగు కల్యాణవర్మ భట్టోత్పలునకు ముందున్నవాఁ డని చెప్పనగునేకాని యీకాలమున నున్నవాఁడని చెప్పుటకాధారములు కానరావు. గ్రంథమునఁ జివరభాగము లభింపకుండుటంజేసి కాల మూహింపనుగూడ శక్యము గాకున్నది.

ఈగ్రంథకర్త క్షత్రియుఁడని పేరునుబట్టియే చెప్పవచ్చును. గ్రంథమునఁ బెక్కువిషయములు చమత్కారమును గొలుపునవి కలవు.

జాతకశాస్త్రమున కీగ్రంథము మహోపయుక్తమనుటకు సందియము లేదు.

ఈగ్రంథమునకుఁ దాత్పర్యము వ్రాయ నన్నుం బురికొల్పినది ఆంధ్రగ్రంథోద్ధారణసమర్థులని విఖ్యాతిగాంచిన మ-రా-రా-శ్రీ, వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారు నేను వారియాజ్ఞచేఁ గొంతభాగమునకు మాత్రము వ్రాసితి ఆంధ్రశ్రీమద్రామాయణమును రచించుచున్న నాకు నక్కాలమున వ్యవధిచాలకపోయెను అంత నాసహాధ్యాయులగు బ్రహ్మశ్రీ తెలకపల్లి వేంకటసుబ్రహ్మణ్యసిద్ధాంతిగారి నిప్పనికిం బూన్చితి. వారు తాత్పర్యమును సుబోధకమగునట్లు వ్రాసియున్నారు. ఇందలి లోపములు ద్వితీయముద్రణము కొనసాగుతఱి సవరింపఁబడును. విద్వాంసు లీయుత్తమగ్రంథమును దెలుఁగుదేశమునఁ బ్రబలునట్లుచేసి జాతకశాస్త్రమునకుఁ బ్రమాణతను గల్పింతురుగాక

ఇట్లు విన్నవించు సుజనసేవకుఁడు,

కావ్యస్మృతితీర్థః జనమంచి శేషాద్రిశర్మ.

# ద్వితీయముద్రణపీఠిక.

జ్యోతిశ్శాస్త్రము సిద్ధాంత-జాతక-ముహూర్తము లని మూఁడు భాగములు గలది. అందు దృష్టవిషయములను జెప్పునది సిద్ధాంతభాగము, అదృష్టవిషయములను జెప్పునది జాతకభాగము. దీనికే హోరాశాస్త్రమని పేరు ప్రసిద్ధిగ నున్నట్లు ఈగ్రంథకర్త ద్వితీయాధ్యాయ నాల్గవశ్లోకమున నిక్రిందివిధముగఁ దెలిపినాఁడు—

"జాతకమితి ప్రసిద్ధం యల్లోకే తదిహ కీర్త్యతే హోరా,
అథవా దైవవిమర్శనపర్యాయః ఖల్వయం శబ్దః."

"అహోరాత్ర" శబ్దమున ఆద్యంతవర్ణములు లోపించిన 'హోర' యని యగును. రాశ్యర్థమగు ౨½ గడియలకును హోర యను పేరు గలదు. దీనినే ఆంగ్లభాషయందు (Hour) అవర్ అని వ్యవహరింతురు. ఇట్టి హోరాశాస్త్రగ్రంథములలో విపులమయినది సారావళి; దీనిని రచియించినది కళ్యాణవర్మ. ఇతనికే వ్యాఘ్రపదీశ్వరుఁడను నామాంతరము గలిగియున్నట్లు తొలియధ్యాయమునఁ జెప్పఁబడెను. ప్రాచీనహోరాశాస్త్రజ్ఞులగు, పౌలిశ-రోమశ-వాసిష్ఠ-యవన-బాదరాయణ-శక్తి-అత్రి-భారద్వాజ-విశ్వామిత్ర-గుడాగ్ని-కేశ-గర్గాద్యాచార్యులచే రచియింపఁబడిన గ్రంథములలోని నిస్సారవిషయములను విడిచి సారవిషయములను గ్రహించి కూర్చుటచేత 'సారావళి' యను నామము కలిగెనని ఈగ్రంథాంతశ్లోకమువలనఁ దెలియుచున్నది—

"పౌలిశ రోమశ వాసిష్ఠ యవన బాదరాయణా శ్శక్తిః
అత్రిశ్చ భారద్వాజో విశ్వామిత్రో గుడాగ్ని కేశాచ." 54 అ 11 శ్లో.

హోరాశాస్త్రమనునామాంతరముగల జాతకశాస్త్రము మానవులకు మహోపకారకమని యీక్రిందిశ్లోకమున గ్రంథకర్త దెలిపినాఁడు—

"అర్థార్జనే సహాయః పురుషాణా మాపదర్ణవే పోతః,
యాత్రాసమయే మంత్రీ జాతక మపహాయ నా స్త్యపరః." 2. అ. 5. శ్లో.

ద్రవ్యార్జనమునందు సాహాయ్య మొనరించునదియు, ఆపత్సముద్రము నుండి తరింపఁజేయుటకు ఓడవంటిదియు, ప్రయాణసమయమున మంత్రి వలె నాలోచన చెప్పునదియు నగు జాతకశాస్త్రమునకన్న నుపయోగించునది మఱియొకటి లేదని తాత్పర్యము.

"హోరాశాస్త్రపరిశ్రమాత్ప్రథమత శ్చాయుర్బలం జ్ఞాయతే
ఆయుర్జ్ఞానవిశేషతశ్చ నితరాం సద్ధర్మబుద్ధి ర్భవేత్,
తద్ధర్మాగతపుణ్యభాగ్యవిభవా త్సాక్షాద్బ్రహ్మవిద్యానిధిః
దివ్యజ్ఞానవిశేషత స్తదనుభవేత్తై కైవల్యమాప్నోతి సః."

హోరాశాస్త్రపరిశీలనమువలన నాయుర్దాయము తెలియును. ఆయుర్దాయ మింతయని తెలియుటవలన జీవితకాలమును వ్యర్థము సేయక ధర్మమునందు బుద్ధి కలుగును ధార్మికబుద్ధివలన సత్కర్మానుష్ఠానమును, దానివలన నంతఃకరణశుద్ధియు, దానివలన బ్రహ్మవిద్యాప్రాప్తియు, దానివలన కైవల్యమును ఇటుల క్రమముగఁ గలుగునని తాత్పర్యము.

పైవిషయమునుబట్టి జ్యోతిశ్శాస్త్రాధ్యయనమువలనఁ బరమ పురుషార్థమగు కైవల్యము కలుగుచున్నది అంతరాదిత్యవిద్య నుపాసించుటచే మోక్షము ప్రాప్తించునని యుపనిషత్తులును జెప్పుచున్నవి. జ్యోతిశ్శాస్త్రమునఁ బ్రతిపాద్యమానమగు దైవము పరంజ్యోతియగు ఆదిత్యుఁడు. ఈయాదిత్యపరబ్రహ్మమే చరాచరప్రపంచముయొక్క సృష్టిస్థితిలయములకుఁ గారణభూతుఁడనియు, జ్యోతిర్మండలమంతయు నీతని శక్తిచేతనే ప్రకాశించుచున్నదనియు, జ్యోతిస్తత్త్వశాస్త్రజ్ఞులు నుడువుచున్నారు.

"రుద్రాత్మా సవితా పితా చ జననీ శక్త్యాత్మక శ్చంద్రమాః
భౌమేందూద్భవజీవశుక్రరవిజా స్తత్పంచభూతానిహి,
సత్త్వాజ్జీవకవీందుభాశ్చ రజసో భౌమ స్తమోజశ్శనిః
సూర్యేందూ నతు మారకౌ హి పితరౌ రంధ్రాధిపత్యేఽపి చ."

శివస్వరూపియగు సూర్యుఁడు పితృకారకుఁడనియు, శక్తిస్వరూపియగు చంద్రుఁడు మాతృకారకుఁడనియు, కుజాదిపంచగ్రహములు పాంచభౌతికతత్త్వములనియు, వీరివలననే చరాచరప్రపంచసృష్ట్యాదులు కలుగుచున్నవనియు, తత్త్వశాస్త్రపరిశీలనమువలన స్పష్టమగుచున్నది.

సూర్యుఁడు పరమేశ్వరుఁడు, చంద్రుఁడు పార్వతి, పార్వతీపరమేశ్వరులు ప్రపంచమునకు తల్లిదండ్రులయినట్లు శ్లో॥ జగతః పితరౌ వందే పార్వతీ పరమేశ్వరౌ. అని జ్యోతిర్విదాభరణగ్రంథకర్తయగు కాళిదాసమహాకవి రఘువంశమహాకావ్యమున వర్ణించియున్నవాఁడు ప్రకృతిశాస్త్రజ్ఞులును సూర్యచంద్రులవలన లోకమునకు ఆవశ్యకమగునదిఅంతయుఁ గలుగుచున్నదని చెప్పువిషయము సత్యమునకు దూరము కాఁజాలదు సూర్యుఁడు (Spirit) పురుషుఁడు, చంద్రుఁడు (Matter) ప్రకృతి. ప్రకృతిపురుషసంయోగము శివశక్తిసంబంధము సృష్టికిఁ గారణము పాశ్చాత్యులు సూర్యుని (He) పుంలింగముగను, చంద్రుని (She) స్త్రీలింగముగను వ్యవహరించుచుండుటవలన సూర్యచంద్రులు పితృమాతృకారకులనియు, జగదుత్పత్తికి హేతుభూతులనియు స్పష్టము సూర్యుఁడు ఆత్మకారకుఁడు, చంద్రుఁడు మనఃకారకుఁడని జ్యోతిశ్శాస్త్రమున వ్యవహరించుచున్నారు ప్రకృతిశాస్త్రము వేదాంతశాస్త్రము యందుకూడ నిదర్శనముగాఁ గన్పించెడిని. సూర్యకిరణప్రసారమువలన చంద్రమండలము ప్రకాశవంతమయినట్టుల ఆత్మసాన్నిధ్యమునందు జడమగుమనస్సుకూడ వృత్తిమంతమై ప్రకాశించుచుండును మనస్సు ఆత్మయందుఁజేరిన యోగమయినట్టుల చంద్రుఁడును సూర్యునితోఁ గూడిన యోగమనఁబడును. ఇదియే తిథ్యాదిసాధనమునకుఁ గారణము భగణము (రాశిచక్రము) అర్ధనారీశ్వరస్వరూపము ఈభగణమునకు పార్వతీపరమేశ్వరరూపులగు చంద్రసూర్యు లధిపతులగుచున్నారని గ్రంథకర్త యీ క్రిందిశ్లోకముచేతఁ దెలిపినాఁడు.

"ద్వాదశమండలభగణం తస్యార్ధే సింహతో రవిర్నాథః,
కర్కటకాత్ప్రతిలోమం శశీ తథాఽన్యేపి తద్భానాత్." 3. అ. 9 శ్లో.

పండ్రెండురాసులుగలిసిన భగణమనియు, లేక రాశికుండలి యనియు పేరు. సింహరాశినుండి క్రమముగ ఆఱురాసులకు భగణార్ధమని పేరు. దీనికి సూర్యుఁడధిపతి (పరమేశ్వరుఁడు) కర్కటకాదివిలోమముగా ఆఱురాసులకు భగణార్ధమని పేరు. దీనికి చంద్రుఁడధిపతి (పరమేశ్వరి). దక్షిణభాగము పరమేశ్వరుఁడు సూర్యస్థానము, వామభాగము పరమేశ్వరి చంద్రస్థానము. సూర్యచంద్రస్థానములగు సింహకర్కటక

ములనుండి సవ్యాపసవ్యములుగ లెక్కింపగ కన్యామిథునములు బుధున కును, తులావృషభములు శుక్రునకును, నిట్లే యితరగ్రహములకును స్థానము లేర్పడుచున్నవి. సూర్యచంద్రులకు సమీపమునందు బుధుం డున్నందున ఆత్మమనస్సులకు సన్నిధానమున బుద్ధి యున్నట్టుల విదిత మగుచున్నది. ఇట్లు జ్యోతిశ్శాస్త్రమువలన అధ్యాత్మశాస్త్రమునుం గన్గొనవచ్చును. మఱియు హోరాశాస్త్రజ్ఞునకు సిద్ధాంతభాగముం దెలిసి యుండవలెనని యీక్రిందిశ్లోకమునందు గ్రంథకర్త చెప్పియున్నాఁడు.

"ఇత్యాధానం ప్రథమం ప్రసూతికాలం సునిశ్చితం కృత్వా,
జాతకవిహితం విధిం విచింతయేత్తత్ర గణితజ్ఞః" 8. అ. 5. 2. శ్లో.

గణితశాస్త్రజ్ఞుఁడైన దైవజ్ఞుఁడు ప్రథమమున ఆధానకాలమును, పిమ్మట ప్రసూతికాలమును నిశ్చయముగాఁ దెలిసికొని, జాతకశాస్త్రఫల ములను జెప్పవలెనని నిర్దేశించుటచే, జన్మకాలఘుటికలును, లంకోదయ, స్వోదయరాశిప్రమాణములచే లగ్నమును సాధించి, గ్రహస్ఫుట భావ స్ఫుటములను జేసి, శ్రీపతిపద్ధతిని షడ్బలములను సాధించి, సంధిగత గ్రహబలములను దెలిసికొని, పిమ్మట జాతకఫలములను జెప్పవలెనని స్పష్టమగుచున్నది పైఁజెప్పఁబడిన గ్రహభావస్ఫుట షడ్బలసాధనములు లేక, స్థూలదృష్టితో ఫలముల దైవజ్ఞుఁడు చెప్పెనేని, అనుభవసిద్ధముగ నుండక శాస్త్రమున కపవాదము కలుగునుగాఁబట్టి దైవజ్ఞుఁడు గణిత జ్ఞుఁడై యుండవలెనని విదితమగుచున్నది.

గ్రహములిచ్చు శుభాశుభ ఫలములు, గ్రహరశ్ములపై నాధారపడి యున్నందున, పూర్వము మాణింథాదులచేఁ జెప్పఁబడిన రశ్మిఫలము లను బ్రయత్నపూర్వముగఁ జెప్పఁబోవుచున్నానని రశ్మిచింతాధ్యాయ మున గ్రంథకర్త చెప్పుటచేత, గణితాగతరశ్ములను దెలిసికొని ఫలము లను నిర్దేశింపవలెనని యీదిగువశ్లోకముచేఁ దెలియుచున్నది—

"రశ్మిప్రధానమేతద్వ్యస్తాచ్ఛాస్త్రం వదంతి మాణింథాః,
తస్మాత్ప్రయత్నతోఽహం కథయామి యథామతం తేషామ్. 36. అ. 1 శ్లో.
ఏవం మహేంద్రశాస్త్రే మణింథమయబాదరాయణప్రోక్తే,
సప్త [illegible] రశ్మయో గ్రహేంద్రాణామ్." 36-3

పూర్వజన్మకృత శుభాశుభకర్మఫలములతోఁ గూడిన విషయవృత్తి (వాసన) గర్భాధానకాలమున శుక్రశోణితములతోఁగూడి జీవుని కర్మానుభవమునకుఁ గారణమగుచున్నదని గ్రంథకర్త యీశ్లోకమునఁ జెప్పినాఁడు——

"తత్ర శుభాశుభమిశ్రైః కర్మభి రధివాసితా విషయవృత్తిః,
గర్భాధానే నిపతతి సంయోగే శుక్లశోణితయోః" 8 అ. 10 శ్లో

ఇట్లు చెప్పుటచే గర్భాధానమందుఁ గలుగు శుభాశుభ గ్రహస్థితి జీవుని పూర్వకర్మానుగుణ్యముగ ఘటించుచుండునని స్పష్టమగుచున్నది. చీఁకటియందున్న వస్తువులను దీపముచేఁ జూచినట్లుల పూర్వజన్మకృత శుభాశుభకర్మఫలముల దైవజ్ఞుఁడు హోరాశాస్త్రదీపముచేతఁ జూచి చెప్పుచున్నాఁడని లఘుజాతకమున వరాహమిహిరాచార్యులు "యదుపచితమన్యజన్మని శుభాశుభం కర్మ......తమసి ద్రవ్యాణి దీపఇవ" అనుశ్లోకముచేఁ జెప్పియున్న భావమునే ఈసారావళికారుఁడునూ అనువదించి యున్నాఁడు——

"విధాత్రా లిఖితా యాఽసౌ లలాటేఽక్షరమాలికా,
దైవజ్ఞ స్తాం పఠే ద్వ్యక్తం హోరానిర్మలచక్షుషా." 2. 1

గణితాగతాయుర్దాయమును గుఱించి యిట్లు చెప్పెను——

"పథ్యాశినాం శీలవతాం నరాణాం సద్వృత్తభాజాం విజితేంద్రియాణామ్,
ఏవం విధానా మిద మాయురత్ర చింత్యం సదా వృద్ధమునిప్రణీతమ్."
39. అ. 25. శ్లో.

వృద్ధులగుమునీశ్వరులచేఁ జెప్పఁబడిన గణితాగతాయుర్దాయము, హితమితముగ పథ్యముగ భుజించువారికిని, సత్ప్రవర్తకులగును, జితేంద్రియులకును, శీలసంపన్నులకును, సత్యసంధులకును యోగించును గాని, మితిలేని యాహారవిహారములుగలవారికిని, ఇంద్రియలోలుపులకును, దుశ్శీలురకును, అసత్ప్రవర్తకులకును, యోగింపదనియు, వారికృత్యములే వారి ననారోగ్యవంతులుగను, క్షీణాయుష్కులుగను జేయుచుండుననియు స్పష్టము "ఆచారా ద్వర్ధతే హ్యాయుః" సదాచారము

వలన నాయువు వృద్ధియగుననియు, అనాచారమువలన క్షీణించుననియు మనువు చెప్పెడివాక్యము పైశ్లోకభావమును దృఢపఱుచుచున్నది. నవగ్రహచారములను, వానిపైదృష్టులను 22 వ అధ్యాయము మొదలు 29 వ అధ్యాయమువఱకును, ప్రవ్రజ్యాయోగమును 20 వ అధ్యాయమునందును ఈగ్రంథమునందు విస్తరించిచెప్పినట్లు ఇతరత్ర ఎచ్చటను జెప్పఁబడియుండలేదు ఇట్లు 54 గు అధ్యాయములతో విస్తృత విషయములుగలుగునట్లు కల్యాణవర్మ సారావళిని రచియించెను గ్రంథమునఁ బెక్కువిషయములు చమత్కారమును గొలుపునవి కలవు. హోరాశాస్త్రమున కీగ్రంథము మహోపయుక్తమనుటకు సందియము లేదు

గ్రంథకర్తయగు కళ్యాణవర్మ, సిద్ధాంత, ముహూర్తభాగములను గూడ రచియించినట్లు యాజ్ఞవల్క్యస్మృతివ్యాఖ్యాతయగు అపరార్కుఁడు ప్రాయశ్చిత్తాధ్యాయ వ్యాఖ్యానమందు త్రిపుష్కరయోగమును వివరించుతఱి సారావళినుండి ఉదహరించిన యీదిగువ శ్లోకములవలన తెలియవచ్చుచున్నది—

"విషమచరణం ధిష్ణ్యం భద్రాతిథిర్యది జాయతే
శనిరవిగురుక్ష్మాపుత్రాణాం కథంచన వాసరే,
మునిభిరుదితస్సోఽయం యోగస్త్రిపుష్కరసంజ్ఞక
స్త్రిగుణఫలదో లబ్ధే నష్టే హృతేఽపి మృతేఽపి వా."
"ద్వితీయా సప్తమీ షష్ఠీ ద్వాదశీ దిగ్వసూతిథీ,
క్రమాద్రాహుబుధా శుక్రసౌరభౌమ నిశాకరాః.
ఏతైర్నష్టం హృతం లబ్ధం యచ్చాన్యత్కారణం భవేత్,
సర్వం తత్త్రిగుణం ప్రోక్తం తేన చైతత్త్రిపుష్కరః."
ఆనందాశ్రమ ముద్రిత యాజ్ఞవల్క్యస్మృతి అపరార్కవ్యాఖ్య. 872.

ఈ పైశ్లోకములు పంచాంగకర్తలకు నుపయోగించునవి. సిద్ధాంతభాగమున నుండును దీనివలన సారావళీ గ్రంథకర్త యగు కళ్యాణవర్మ త్రిస్కంధయుక్త జ్యోతిర్విద్వరేణ్యుఁడనియు వేరునుబట్టి క్షత్రియుఁడనియుఁ దెలియుచున్నది.

కల్యాణవర్మ కాల నిర్ణయాదికము.

సారావళీగ్రంథకర్తయగు కల్యాణవర్మయొక్క కాలాదికమును తెలిసికొనుటకు సారావళిగ్రంథముయొక్క చివరశ్లోకములుగల గ్రంథ భాగము నశించుటచేత స్పష్టముగాఁ దెలియకపోయినను తెలియవచ్చి నంతవరకు అనుమానప్రమాణములవలన నిరూపించవచ్చును.

ఇతఁడు వరాహమిహిరుని తర్వాతివాఁడనుట సుస్పష్టము. ఇతఁడు తననివాసగ్రామాదికమునుగూర్చి సారావళియం దిట్లు చెప్పియున్నాఁడు—

"దేవగ్రామపురప్రపోషణబలాద్భ్రష్టాండసత్వంజరే
కీర్తిర్హ్యంసవిలాసినీవ సహసా యస్యేహ భ్రాత్యాలతా,
శ్రీమద్వ్యాఘ్రపదీశ్వరో రచయతి స్పష్టాం స సారావళీం
హోరాశాస్త్రవినిర్మలీకృతమనాః కల్యాణవర్మా కృతీ." ౧. ౫.

పైశ్లోకమువలన సారావళీకర్తయగుకల్యాణవర్మ దేవగ్రామనివాసి యనియు, ఇతనికి వ్యాఘ్రపదీశ్వుఁడనినామాంతరముకూడ గలదనియు తెలియవచ్చుచున్నది. గణకతరంగిణీకారులగు సుధాకరద్వివేదిగారు "వ్యాఘ్రభటేశ్వరః" అని పఠించిరి. ఈకల్యాణవర్మ వాఘేలవంశీయులగురీవాసంస్థానాధిపతులయొక్క మూలపురుషుఁడని తలంచుచున్నారు. రీవాసంస్థానరాజధానీనగరమునకు ఆగ్నేయదిశయందు ౪ యోజనములదూరమునందు ఇప్పుడున్న దేవర అనుగ్రామమే కల్యాణవర్మనివాస గ్రామమగుదేవగ్రామపురమని సుధాకరద్వివేదిగారు తలంచుచున్నారు.

శా. శ. ౫౨౦-సం, జన్మించి వ్యాఘ్రముఖరాజుయొక్క రాజ్యకాలమునందు శా. శ. ౫౫౦.సంవత్సరమునందు బ్రాహ్మ సిద్ధాంతానుసారము బ్రహ్మసిద్ధాంతమును, ౫౮౭-వ సం. నందు ఖండఖాద్యమను కరణగ్రంథమును, రచించిన బ్రహ్మగుప్తుఁడు బ్రహ్మగుప్తసిద్ధాంతముయొక్క చివర ఇట్లు వ్రాయుచున్నాఁడు—

"శ్రీచాపవంశతిలకే శ్రీవ్యాఘ్రముఖే నృపే శకనృపాణాల్,
పంచాశత్సంయుక్తైః వర్షశతైః పంచభిరతీతైః,
[illegible]స్ఫుటసిద్ధాంతః సజ్జనగణితజ్ఞగోలవిత్ప్రీత్యై,
[illegible]ర్షేణ కృతో జిష్ణుసుతబ్రహ్మగుప్తేన."

అని చెప్పఁబడియుండుటచేత బ్రహ్మగుప్తుని సమకాలికుఁడగు వ్యాఘ్రనృపుఁడును, వ్యాఘ్రభటేశ్వరుఁడను నామాంతరముగల కల్యాణవర్మయు ఒక్కవ్యక్తియే యని పలువురుజ్యోతిశ్శాస్త్రజ్ఞుల తలంపయి యున్నది.

హోరాశాస్త్రము ఉష్ణాధిక్యముచేత పీడితులగుచున్న తన శిష్యులయొక్క పరితాపము నుపశమింపఁజేయుటకొఱకు కల్యాణవర్మ యనుపర్వతమువల్లనుండి చల్లనినీళ్లుగల 'సారావళి' యనునది ప్రాదుర్భవించినదని గ్రంథకర్తయే ఇట్లు చెప్పియున్నాఁడు—

"హోరాత్యుష్ణార్తానాం శిష్యాణాం స్ఫుటతరార్థశిశిరజలా,
కల్యాణవర్మశైలా న్నదీహ సారావళీ ప్రసృతా." ౧. ౬.

నిజముగా ఈసారావళి అట్టిగ్రంథమే యనుటకు సందేహము లేదు.

ఈసారావళిగ్రంథకారుఁడు వరాహమిహిరుఁడు పేర్కొన్నదైవజ్ఞులనుగాక,

౧ లగ్నపతేస్తుల్యం బలమిహ చూడామణి ర్వదతి.
అధ్యా. ౫-౨౦; ౪౦-౮

౨. వర్షైర్నవభి ర్యాతై రిత్యాహ బ్రహ్మశౌండాఖ్యః. ౧౧-౬.

౩. అన్యోన్యస్య దర్శనా దపి ఫలమేతత్కాందలాః ప్రాహుః.
అధ్యా ౧౯, ౮

౪ శుక్రే వేశ్యాప్రాయశ్చంద్రేఽపి వదంతి కేతుమాలాఖ్యాః
అధ్యా ౩౪, ౪౯

౫ శ్రీదేవకీర్తి రాజః పంచమహాపురుష సంజ్ఞితాకాన్నృపతీన్.
అధ్యా ౩౭. ౧

౬. క్షితిపతిమాండలికానా మపరిమితం ప్రాహ లోకాక్షః.
అధ్యా. ౩౪-౬౮.

౭. కనకాచార్యస్య మతాత్ వియోనిసంజ్ఞం ప్రవక్ష్యామి.
అధ్యా. ౫౩. ౧.

అనిక, చూడామణి, బ్రహ్మశౌండ, కేతుమాల, లోకాక్ష, కాందల, దేవకీర్తిరాజ, కనకాచార్యాదులగుదైవజ్ఞులను పేర్కొనియున్నాఁడు.

వరాహమిహిరాచార్యకృత బృహజ్జాతకమునకు వ్యాఖ్యరచి యించిన భట్టోత్పలుఁడు ఈసారావళినుండి పలుతావులఁ బ్రమాణ శ్లోకములను తనవ్యాఖ్యయందు నుదాహరించియున్నవాఁడు.

వరాహమిహిరాచార్యకృత బృహత్సంహిత యను సిద్ధాంత గ్రంథమునకు చింతామణి యను పేరుతో వ్యాఖ్యరచియించిన భట్టోత్పలుఁడు ఆవ్యాఖ్యానాంతమందు ఈక్రిందిశ్లోకము నుదహరించెను —

"చైత్రమాసస్య పంచమ్యాం సితాయాం గురువాసరే,
వస్వష్టాష్టమితే శాకే కృతేఽయం వివృతిర్మయా"

శా. 888 శకమందు, చైత్రశుక్లపంచమీగురువాసరమున చింతామణి యనువ్యాఖ్యానము నాచే రచియింపఁబడెనని యర్థము.

దీనింబట్టి విమర్శింపఁగ భట్టోత్పలుఁడు ఇప్పటికి 970 సంవత్సరములు క్రిందటివాఁడని తెలియుచున్నదికాని ఇతఁడు 'జహాంగీరు' కాలమునకు చేరినవాఁడగుటచేత క్రీ. శ. ౧౬౦౫ వ సం. ప్రాంతమున నున్నవాఁడని చెప్పుటమాత్రము ప్రామాదికము.

ప్రథమముద్రణమున విడిచిన కొన్నియధ్యాయములకుఁ దాత్పర్యము వ్రాయవలసినదని గీర్వాణాంధ్రభాషోద్ధారణ సముత్సుకులును, శ్రీవావిళ్ల రామస్వామిశాస్త్రులుపుత్రులును, త్రిలిఙ్గపత్రికాధిపతులును, దేశభాషాసేవాధురంధరులును, ఉదారాశయులునగు మ-రా-శ్రీ, వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారు నన్నుఁ బురికొల్పిరి వీరింకను అముద్రితములగు జ్యోతిశ్శాస్త్రగ్రంథములనుకూడ ఆంధ్రభాషయందు సతాత్పర్యముగ ముద్రించి దేశమునకు మహోపకారముఁ గావింపనెంచిరి. ఇట్టి మహోద్యమమును శ్రీపరమేశ్వరుఁడు నెఱవేర్చుఁగాఁత. వ్యయప్రయాసములకోర్చి దేశభాషయందనేకగ్రంథములు ముద్రించి సర్వజనులకు విజ్ఞానదానముచే మహోపకారముఁ గావించుచున్న వీరి కీర్తి యాచంద్రార్కస్థాయిగ వెలయుఁగాఁత.

ఇట్లు విన్నవించు సుధీవిధేయుఁడు,
ముక్తినూతులపాటి గోపాలకృష్ణశాస్త్రి,
పండితుఁడు పి. బి, ఎస్. కళాశాల, ఒంగోలు.

చెన్నపట్టణము }
24-6-1935 }

# విషయసూచిక



శ్రీ ర స్తు

# సారావళి

## సాంధ్ర తాత్పర్యము.

---

శ్లో. యస్యోదయే జగదిదం ప్రతిబోధమేతి
మధ్యస్థితే ప్రసరతి ప్రకృతిక్రియాసు,
అస్తంగతే స్వపతి చోఛ్వసితైకమాత్రం
భాను స్సఏష జగతి ప్రకటప్రభావః. 1

తాత్పర్యము. గ్రంథకర్తయగు కళ్యాణవర్మసూరి తన యుపాస్యదైవమగు భాస్కరుని నీలాగున నుతించి గ్రంథారంభప్రయోజనమును జెప్పుచున్నాఁడు.

విస్తరకృతాని మునిభిః పరిహృత్య పురాతనాని శాస్త్రాణి,
హోరాతంత్రం రచితం వరాహమిహిరేణ సంక్షేపాత్ 2

పూర్వశాస్త్రములు మునులచే విస్తారముగఁ జెప్పఁబడినవైనను వానిలోనిసారమును గ్రహించి సంకేతముగ వరాహమిహిరాచార్యుఁడు హోరాతంత్రము జేసి యున్నాఁడు.

రాశిదశవర్గభూపతి యోగాయుర్దాయతో దశాదీనాం,
విషయవిభాగం స్పష్టం కర్తుం నతు శక్యతే యతస్తేన. 3

రాశి దశవర్గ రాజయోగ దశాదులయొక్క విషయవిభాగమును స్పష్టముగాఁ జేయుటకు వరాహమిహిరకృత శాస్త్రముచే శక్యముగాదు.

అతఏవ విస్తరేభ్యో యవననరేంద్రాదిరచితశాస్త్రే[illegible]
సకల మసారం త్యక్త్వా తేభ్య స్సారం సముద్ధ్రియ

కావున యవనాచార్యముఖు లొనరించిన శాస్త్రములనుండి సారో గ్రహించి నిస్సారభాగమును వదలివేయుచున్నాను.

దేవగ్రామపుర ప్రపోషణబలా ద్బ్రిహ్మాండసత్పంజరే
కీర్తి ర్హంసవిలాసినీవ సహసా యస్యేహ ఖ్యాత్యాతతా,

శ్రీమద్వ్యాఘ్రపదీశ్వరో రచయతి స్పష్టాం ససారావళీం
హోరాశాస్త్రవినిర్మలీకృతమనాః కళ్యాణవర్మా కృతీ 5
హోరాతృష్ణార్తానాం శిష్యాణాం స్ఫుటతరార్థశిశిరజలా,
కల్యాణవర్మశైలా న్నదీవ సారావళీ ప్రసృతా. 6

కళ్యాణవర్మ యనుపేరుగల కృతికర్తనై వ్యాఘ్రపదీశ్వరుండ నగు నేను సారావళిని చేయుచున్నాను. హోరాశాస్త్రమును జదువ నెంచినశిష్యులకు నీసారావళి నదీప్రవాహమువలె నుపకరించును. అనఁగా, నద్యుదకము సకలజనతృష్ణాక్షయముజేసి న ట్లీసారావళి శిష్యవ్యాకృస్సందేహముల నెడబాపునని సారాంశము

ఇతి కల్యాణవర్మవిరచితాయాం సారావల్యాం శాస్త్రానతారోనామ
ప్రథమోఽధ్యాయః

---

హోరాశబ్దార్థమును దెలుపు రెండవఅధ్యాయము.

విధాత్రా లిఖితాయాసా లలాటేఽక్షరమాలికా,
దైవజ్ఞ స్తాం పఠే ద్వ్యక్తం హోరా నిర్మలచక్షుషా. 1

బ్రహ్మ వ్రాసిన నొసలివ్రాతను జ్యోతిశ్శాస్త్రవేత్త స్పష్టముగా హోరాశాస్త్ర మను నేత్రములోఁ బఠించెను.

ఆద్యంతవర్ణలోపా ద్ధోరాశాస్త్రం భవ త్యహోరాత్రాత్,
తత్ప్రతిబద్ధ శ్చాయం గ్రహాభగణ శ్చింత్యతే యస్మాత్. 2

అహోరాత్ర మనుశబ్దములోని మొదటిదయిన అకారము కడపటిత్రకారము లోపింపఁజేసినచో హోరా యనుశబ్దమగును. గ్రహాభగణాదులు ఈశాస్త్రమున నాలోచింపఁబడును గాన నిది హోరాశాస్త్ర మనఁబడుచున్నది.

కర్మఫలలాభహేతుం చతురా స్సంవర్ణయంత్య న్యే,
హోరేతి శాస్త్రసంజ్ఞా లగ్నస్య తథార్ధరాశేశ్చ. 3

కొందఱు పండితులు కర్మఫలములయొక్క లాభములకుఁ గారణముగ హోర యనునామ మీశాస్త్రమునకుఁ గలదని చెప్పుదురు. హోరాశబ్దము లగ్నమునకును రాశియందర్ధమునకును జేరు.

జాతకమితి ప్రసిద్ధం యల్లోకే తదిహ కీర్త్యతే హోరా,
అథ వా దైవవిమర్శన పర్యాయః ఖల్వయం శబ్దః. 4

లోకమున జాతకమని ప్రఖ్యాతి గలదానికే హోర యని పేరు. లేక అదృష్ట మిట్టిదని తెలుపునుగాన నీశబ్ద మదృష్టఫలమును బోధించునదియుం గావచ్చును.

అర్థార్జనే సహాయః పురుషాణా మాపదర్ణవే పోతః,
యాత్రాసమయే మంత్రీ జాతక మపహాయ నాస్త్యపరః. 5

ద్రవ్యార్జనయందు సహాయ మొనరించును. ఆపత్సముద్రమునకుఁ బడవవంటిది. (తరింపఁజేయుననుట) ప్రయాణసమయమున మంత్రివలె నాలోచన జెప్పును ఇన్నిపనుల కుపయోగించునది యీజాతకశాస్త్రము తప్ప వేఱొకటి లేనేలేదు.

ఇతి ద్వితీయోఽధ్యాయః.

---

హోరా రాశిభేదములను దెలుపు మూఁడవయధ్యాయము.

తమసావృతే సమంతాజ్జలభూతే భూతలే తతోఽకస్మాత్,
ఉదితో భగవాన్భానుః ప్రకాశయ న్స్వప్రకాశేన. 1
వ్యసృజజ్జగత్సమస్తం గ్రహర్క్షసంఘాతకల్పితావగతం,
ద్వాదశభేదైశ్చిత్రైః కాల స్సంప్రస్తుత స్తస్మాత్ 2
మేష వృష మిథున కర్కట సింహాః కన్యా తులాథ వృశ్చికకః,
ధన్వీ మకరః కుంభో మీనా వితి రాశినామాని. 3

ప్రపంచమును జీకట్లు గ్రమ్ముకొనియుండ భూమియంతయు జలమయ మగుచుండ హఠాత్తుగా సూర్యుఁ డుదయించి తనకాంతులచేఁ బ్రపంచమును వెలుఁగునట్లు చేయుచు గ్రహనక్షత్రకల్పనచేఁ గలుగు సమస్తప్రపంచమును బుట్టించెను. మరియుఁ బండ్రెండురాసులుగల జ్యోతిశ్చక్రమును బుట్టించెను. మేషవృషభాదులు రాశినామములు.

కుంభః కుంభధరో నరోఽథ మిథునం వీణాగదాభృన్నరో
మీనౌ మీనయుగం ధనుశ్చ సధనుః పశ్చాచ్ఛరీరో హయః,
ఏణాస్యో మకరః ప్రదీపసహితా కన్యా చ నౌసంస్థితా
శేషో రాశిగణస్స్వనామసదృశో ధత్తే తులాభృత్తులామ్. 4

కుంభరాశిరూపము రిక్తకుంభమును ధరించినపురుషుఁడు. మిథునము వీణాగదలను ధరించినమనుష్యుఁడు. మీనము రెండుమీనములస్వరూపము ధనుస్సు వెనుకటిభాగము హయమై ముందుభాగము ధనుస్సును ధరించినమనుష్యరూపము, లేడిముఖము గల్గినది మకరస్వరూపము. ప్రదీపముతోఁగూడి నౌకయందున్నస్త్రీ కన్యారాశిస్వరూపము.

త్రాసును ధరించుట తులారాశిస్వరూపము. తక్కిన మేషవృషభకర్కటసింహవృశ్చికములు తమ పేరులకుఁ దగినరూపములు గలవి.

శీర్షాస్యబాహు హృదయం జఠరం కటిబస్తి మేహనోరుయుగం,
జానూ జంఘే చరణౌ కాలస్యాంగాని రాశయోఽజాద్యాః. 5

మేషాదిరాసులు క్రమముగ కాలపురుషుని శిరస్సు ముఖము మొదలుగాగలవని తాత్పర్యము.

కాలనరస్యావయవాః పురుషాణాం కల్పయేత్ ప్రసవకాలే,
సదసద్గ్రహసంయోగాత్ పుష్టాః సోపద్రవాంశ్చాపి. 6

పైనజెప్పిన కాలపురుషుని అంగములను ప్రసవకాలమునందుఁ బురుషునియందుఁ గల్పించదగినవి. ఏరాశికి శుభగ్రహసంబంధములు గలవో ఆయంగము పుష్టమనియు పాపగ్రహసంబంధముగల రాశ్యంగము దుర్బలమనియు తెలియఁగవలెను.

మేషాదీనాం క్రియతావురుజితుమకులీరలేయపాథోనాః,
సంజ్ఞాస్తు జూకకౌర్పికతౌక్షికాకోకేరహృదయరోగాంత్యాః. 7
ఋక్షం భవననామాని రాశిః క్షేత్రం భమేవవా,
ఉక్తాని పూర్వమునిభిస్తుల్యార్థప్రతిపత్తయే 8
ద్వాదశమండలభగణం తస్యార్ధే సింహతో రవిర్నాథః,
కర్కటకాత్ప్రతిలోమం శశీ తథాన్యేపి తత్థానాత్. 9

మేషాదిద్వాదశరాసులకుఁ గ్రమంబుగ క్రియ తావురు మొదలగు నామములు గలవు. రాశి క్షేత్ర భ అనునవి రాశినామములు. రాశినామార్థతుల్యఫలము గలుగును గాన నాపేరులు పెట్టఁబడినవి. పండ్రెండురాసులు గలసిన భగణమని పేరు. సింహరాశి నుండి క్రమముగ నారురాసులకు భగణార్ధమని పేరు. ఈభగణార్ధమునకు సూర్యుఁడధిపతి కర్కటకాది విలోమముగా నారురాసులకు భగణార్ధ మని పేరు. ఈభగణార్ధమునకు చంద్రుఁడధిపతి. ఆస్థానములవల్లనుండి ఇతరగ్రహములస్థానములను తెలుసుకొనవలయునని భావము

భానో రర్ధే విహగాః శౌర్యా స్తేజస్వినశ్చ సాహసికాః,
శశినో మృదవస్సౌమ్యాస్సౌభాగ్యయుతాః ప్రజాయంతే 10

సూర్యునిభగణార్ధమందున్న గ్రహములచే జంతువులు శౌర్యము తేజస్సు సాహసము గలిగియుండుదురు. చంద్రునిభగణార్ధమునందున్న గ్రహములచే జంతువులు మార్దవము సాధుత్వము సౌందర్యము గలిగియుండుదురు.

కుజభృగుబుధేందురవిశశిసుతసితరుధిరార్యమందశనిజీవాః,
గృహపానవభాగానా మజమృగఘటకర్కటాశ్చాద్యాః 11

మేషము మొదలు రాసులకు క్రమముగా కుజ శుక్ర బుధ చంద్ర రవి బుధ శుక్ర కుజ గురు శని శని గురుడును అధిపతులు. మేషకర్కటకతులామకరములు నవాంశారంభరాసులు అనగా మేషసింహధనుస్సులకు నవాంశనిర్ణయమునందు మేషాదిగా లెక్కించవలెను. కర్కటవృశ్చికమీనములకు కర్కటాదిగా నవాంశములను గణించవలెను. తులాకుంభమిథునములకు తులారాశి మొదలుగా లెక్కసేయవలయును. మకర వృషభకన్యారాసులకు మకరాదిగా నవాంశనిర్ణయము సేయవలయునని తాత్పర్యము.

భవనాధిపైస్స్వస్థం జాతఃవిహితం విచింతయేన్మతిమాన్,
ఏభర్వినా న శక్యం పదమపి గంతుం మహాశాస్త్రే. 12

జాతకఫలము లన్నియు రాశ్యధిపతుల ననుసరించియే బుద్ధిమంతుడు ఆలోచించవలయును. రాశ్యధిపతులను విడచి యీజాతకశాస్త్రమును దొక్కయడుగైనను నడువరాదు. అనగా సత్ఫలము లివ్వ నవకాశము లేదని తాత్పర్యము.

వర్గోత్తమానవాంశా స్తథాదిమధ్యాంతగా శ్చరాద్యేషు,
సూతే కులముఖ్యకరా ద్వాదశభాగా స్స్వరాశ్యాద్యాః. 13

వర్గోత్తమాంశము లనగా నవాంశములలోనివే. చరరాసులయందు మొదటి నవాంశము, స్థిరరాసులయందు ఐదవనవాంశము, ద్విస్వభావరాసులయందు కడపటి నవాంశము వర్గోత్తమాంశములనగా. అనగా నేరాశినవాంశ మారాశిలో వర్గోత్తమాంశమని ముఖ్యతాత్పర్యము. వర్గోత్తమాంశమువలన లాభ మేమనగా జన్మకాలమున వర్గోత్తమాంశము నుండు నేని జాతకుడు కులశ్రేష్ఠుడగును ద్వాదశాంశమనునది యేరాశి కారాశినుండియే లెక్కపెట్టవలయును.

స్వర్క్షసుతనవమధపా ద్రేక్కాణానాం క్రమాచ్చ హోరాణాం,
రవిచంద్రావిందురవీవిషమసమే స్వార్ధరాశీనాం. 14

లగ్నపంచమనవమాధిపతులు ద్రేక్కాణాధిపతులు బేసిరాసులకు మొదటి హోర సూర్యహోర రెండవది చంద్రహోర సమరాసులకు మొదటిహోర చంద్రహోర. రెండవది సూర్యహోర. హోర యనగా లగ్నమునం దర్ధభాగము.

శరపంచాష్టమునీంద్రియభాగా స్త్రింశాంశకాస్తు విషమేషు,
యుగ్మేషూత్క్రమగణ్యాః కుజార్కిజీవజ్ఞశుక్రాణామ్. 15

శర ౫, పంచ ౫, అష్ట ౮, ముని ౭, ఇంద్రియ ౫ ఇవి త్రింశాంశభాగలు, ఇవి బేసిరాసులయందే క్రమముగా లెక్కించవలెను. సమరాసులయందు ౫, ౭, ౮, ౫, ౫, ఈరీతిగా లెక్కింపవలయును. బేసిరాసులకు వరుసగా కుజ శని గురు బుధ శుక్రులు అధిపతులు సమరాసులకు శుక్ర బుధ గురు శని కుజులు త్రింశాంశాధిపతులని తెలియవలెను.

మేషాళిమిధునమృగహరిమీనతులావృషభ చాపధరకర్కి,
ఘటధరకన్యాపూర్వా స్సప్తాంశానాం భవంతీశాః 16

లగ్నమును ఏడుచే భాగించిన సప్తాంశ యగును. మేషము లగ్నమైనయెడల మేషాదిగా లెక్కింపవలెను. వృషభమాయెనా వృశ్చికాదిగాను, మిథునమాయెనా మిథునాదిగాను, కర్కాటమాయెనా మకరాదిగాను లెక్కింపవలెను ఇట్లే అన్నిరాసులకు లెక్కింపవలెను. (అనఁగా నవాంశమునకు చెప్పినరీతియె యగును)

షష్ఠిర్హోరా త్రింశచ్చూడపదానాం ద్విసప్తతిపమేతాః,
లిప్తానా మష్టాదశశతాని పరివర్తనైస్స్వగృహాత్. 17
లగ్నాదీనాం లిప్తా జ్ఞేయాస్స్వగృహాదివర్గసంగుణితాః,
అష్టాదశశతభక్తాల్లబ్ధసాన్యదీప్సితో వర్గః. 18
ఏతేషాం గుణదోషాన్విస్తరతో నష్టజాతకే వక్ష్యే,
ఏభిస్స్పష్టతరం తత్ప్రీత్యైతుపరిక్షణం యస్మాత్. 19

షష్ట్యంశ, హోర; త్రింశాంశ పూర్వమువలె చూడఁదగును. ఒకరాశికి ౧౮౦౦ లిప్తలగును. లగ్నరాశిపర్యంతము గల లిప్తలను, అభీష్టవర్గముచే గుణించి రాశిలిప్తలగు ౧౮౦౦ చే భాగింపగ వచ్చిన లబ్ధము అభీష్టవర్గమగును. వీనియొక్క గుణదోషములు, ముస్ముందు నష్టజాతకాధ్యాయమునందుఁ జెప్పఁబడును గనుక, స్పష్టముగ విశదీకరింపఁబడు.

అజాదితః క్రూరశుభౌ పుమాంస్త్రీ చరస్థిరో మిశ్రతనుశ్చ సృష్టాః,
కుళీరమీనాళిగృహాంతసంధిం వదంతి గండాంతమితి ప్రసిద్ధమ్. 20

మేషాదిగా రాసులు క్రూరరాసులనియు శుభరాసు లనియు పురుషరాశియని స్త్రీరాశియని యెఱుంగవలయును. అనఁగా బేసిరాసులు క్రూరరాసులు. సమరాసులు శుభరాసులు. బేసిరాసులు పురుషరాసులు. సమరాసులు స్త్రీరాసులు. అని తాత్పర్యము. మేషాది మూఁడేసిరాసులు చరస్థిరద్విస్వభావము లనఁబడును. కర్కాటకాంతము వృశ్చికాంతము మీనాంతము గండాంతమని పేరుగలది.

జాతో న జీవతి నరో మాతురపథ్యో భవేత్స్వకులహంతా,
యది జీవతి గండాంతే బహుగజతురగో భవే ద్భూపః 21

గండాంతమున జన్మించిన శిశువు జీవించఁడు మాతృదోషకరుఁడు, కులహంతయును నగు ఒకవేళ జీవించెనేని చతురంగబలయుంతుండగు ప్రభువే యగు

ఐంద్రాద్యం పరివర్త్తైః త్రితయం త్రితయం త్రిభిస్తు మేషాద్యైః,
ఏభి ర్దిక్షు నిబద్ధై ర్యాత్రాది వికల్పయే త్కార్యే 22

మేషాది మూఁడురాసులు ప్రాగ్దిక్కున నుండును. కర్కాటకాది మూఁడురాసులు దక్షిణమున నుండును తులాది మూఁడురాసులు పడమర నుండును మకరాది మూఁడు రాసు లుత్తరమున నుండును ప్రయాణాదులయం దీదిక్కుల నుపయోగమును దెలియవలెను.

నరపశువృశ్చికజలజా యథాక్రమం ప్రాగ్దిగాదిగా బలినః,
నిశి దివసే సంధ్యాయాం పశవః పురుషామృగాళికర్కిఝషాః. 23

నరరాసులు అనగా మిథునకన్యాతులధనుఃకుంభములు ప్రాగ్దిక్కుగలవి అయిన యెడల బలవంతములు. అనఁగా నరరాసులు లగ్నమైనయెడల స్థానబలము గలవి యని తాత్పర్యము. పశురాసులు అనఁగా మేషవృషభసింహములు దక్షిణదిక్కు అనఁగా దశమస్థానమాయెనా బలవంతములు వృశ్చికము పశ్చిమదిక్కు అనఁగా సప్తమమాయెనా బలముగలది. కర్కాటమకరమీనములు ఉదగ్దిక్కు. అనఁగా చతుర్థమాయెనా బలవంతములు మరియు రాత్రియందు పశురాసులు పగటియందు పురుషరాసులు సంధ్యాకాలమందు కీటజలచరరాసులు బలవంతములని తాత్పర్యము.

నక్తంబలా మిథునకర్కిమృగాజగోశ్వాః
ద్యుశ్శీర్షకా హరితులాళిఘటాంత్యకన్యాః,
పృష్ఠోదయా స్వమిథునా మిథునం విహాయ
శేషా శ్శిరోభి రుదయం త్యుభయేన మీనః. 24

పృష్ఠోదయ శీర్షోదయోభయోదయము లని రాసులు మువ్విధములు. మిథునకర్కాటమకరమేషవృషభధనురాసులు రాత్రియందు బలముగలవి. సింహతులా వృశ్చికకుంభమీనకన్యలు పగటియందు బలముగలవి. మేషవృషభకర్కాటక ధనుర్మకరములు పృష్ఠోదయరాసులు. సింహకన్యాతులావృశ్చికకుంభములు శీర్షోదయరాసులు. మీనముభయోదయరాశి.

ఆత్మీయనాథదృష్టః స్వహిత స్తే నైవ తత్ప్రియై ర్వాపి,
శశిసుతజీవాభ్యామపి రాశి ర్బలవాన్న చేచ్ఛేషైః. 25

ఏరాశియైనను తనయధిపతిచేఁ జూడఁబడినను కూడియున్నను మిత్రగ్రహములచేఁ జూడఁబడినను కూడఁబడినను లేక బుధగురులచేఁ జూడఁబడినను కూడఁబడినను అగాని బలవంతమైనది. ఇతరులున్నను జూచినను బలవంతమైనది గాదని తాత్పర్యము

తన్వర్థసహజబాంధవపుత్రారిస్త్రీవినాశపుణ్యాని,
కర్మాయవ్యయభావాలగ్నాద్యాభావతశ్చింత్యాః 26

తను ధన భ్రాతృ బంధు పుత్ర శత్రు కళత్ర ఆయు ర్భాగ్య రాజ్య లాభ వ్యయములని లగ్నము మొదలు ద్వాదశరాసులయందైన భావములకు పేరులు. అట్లగా ఏ పేరుగల భావమువలన నాభావఫలము జూడవలయునని తాత్పర్యము.

శక్తిధనపౌరుషగృహప్రతిభా వ్రణకామదేవ ఛిద్రాణి,
గురుమానభవవ్యయమితి కథితాన్యపరాణి నామాని 27

శక్తి, ధన, పరాక్రమ, గృహ, ప్రజ్ఞా, వ్రణ, మదన, రంధ్ర, గురు, మాన, భవ, వ్యయములని ద్వాదశభావములకు మఱియొకరీతిని నామములు.

సంజ్ఞా వేశ్మాష్టమయోః శ్చతురశ్రం వై తపశ్చ నవమస్య,
హోరా స్తదశజలానాం చతుష్టయం కంటకం కేంద్రమ్. 28

నాల్గవరాశియు అష్టమరాశియు చతురస్రసంజ్ఞలు గలవి. నవమరాశి కి తపస్సంజ్ఞ గలది లగ్నచతుర్థసప్తమదశమరాసులు చతుష్టయమనియు కంటకమనియు కేంద్రమనియు సంజ్ఞలుగలవి.

నామాని చతుర్థస్యతు సుఖజలపాతాళబంధుహిబుకాని,
కర్మాజ్ఞామేషూరణగగనాఖ్యం కీర్త్యతే దశమమ్. 29

నాల్గవరాశికి సుఖ జల పాతాళ బంధు హిబుకసంజ్ఞలు గలవు. కర్మ ఆజ్ఞా మేషూరణ గగననామములు దశమరాశికి నామములు.

ధర్మసుతయోః త్రికోణం సుతస్య ధీస్త్రిత్రికోణ మిత్యేకస్య,
ద్యూనం జాయాస్తమయం జామిత్రం సప్తమస్యాఖ్యా. 30

పంచమనవమరాసులకు త్రికోణమని పేరు. పంచమరాశికి మంత్రము ధీస్థానమని పేరు. తొమ్మిదవరాశికి త్రిత్రికోణమని పేరు సప్తమరాశికి ద్యూన జాయా అస్తమయజామిత్రములని పేరులు.

షట్కోణం రిపుభవనం తృతీయ మథ కీర్తయంతి దుశ్చిక్యం,
రిష్ఫం ద్వాదశభవనం ద్వితీయసంజ్ఞం కుటుంబం చ. 31

ఆరవరాశి షట్కోణమనఁబడు. మూఁడవరాశి దుశ్చిక్యమను పేరొందు. పండ్రెండవరాశి రిఃఫమనంబడు. రెండవరాశి కుటుంబమను పేరునఁ దనరు

కేంద్రాత్పరం పణపరమాపోక్లిమసంజ్ఞితం తయోః పరతః,
బాలయువస్థవిరత్వే క్రమేణ ఫలదా గ్రహాస్తేషు. 32

లగ్నమునుండి వరుసగా కేంద్రమనియు పణపరమనియు నాపోక్లిమమనియును పేరులు. మరల నిట్లే లెక్కింపవలయును. కేంద్ర పణపర ఆపోక్లిమములయందున్న గ్రహములు బాల్యయౌవనవార్ధకములందుఁ క్రమముగా ఫలములను ఇచ్చెదరు.

షడ్దశభవదుశ్చిక్యాన్యుపచయసంజ్ఞాని కీర్త్యంతే,
స్వతనుసుఖసుతాస్తతపశ్ఛిద్రవ్యయసంజ్ఞితాని చాన్యాని. 33

ఆరు, పది, పదునొకండు, మూఁడు ఈరాసుల కుపచయములని పేరు. రెండు, ఒకటి, నాలుగు, ఐదు, ఏడు, తొమ్మిది, ఎనిమిది, పండ్రెండురాసుల కనుపచయములని పేరులు.

సింహవృషమేషకన్యాః కార్ముకభృత్తౌలికుంభధరాః,
సూర్యాదీనామేతే త్రికోణభవనాని కథ్యంతే. 34

రవికి సింహము చంద్రునకు వృషభము కుజునకు మేషము బుధునకు కన్య గురువునకు ధనుస్సు శుక్రునకు తుల శనికి కుంభము త్రికోణరాసులు.

సూర్యాదీనాముచ్చాః క్రియవృషమృగయువతికర్కిమీనతులాః,
స్వోచ్చగృహకథితభాగా యథాక్రమేణైవ పరమోచ్చాః. 35
దిగ్వహ్న్యష్టావింశతితిథిబాణత్రిఘనవింశతయః,
స్వోచ్చాత్సప్తమరాశిర్నీచస్స్యాదంశకాత్పరమమ్. 36

సూర్యాదులకు వరుసగా మేషవృషభమకరకన్యాకర్కాటకమీనతులారాసులుచ్చరాసులు. ఏయేరాశి కెన్నిభాగలు జెప్పఁబడునో అవి యారాశియందుఁ బరమోచ్చభాగలగును. పైరాసులకు వరుసగా ౧౦, ౩, ౨౮, ౧౫, ౫, ౨౭, ౨౦ ఇవి పరమోచ్చభాగలు. ఏగ్రహమున కేది యుచ్చస్థానమో దాని కేడవరాశి నీచరాశియని చెప్పఁబడును.

హ్రస్వాస్తిమిగోజఘటామిథునధనుఃకర్కిమృగముఖాశ్చ సమాః,
వృశ్చికకన్యామృగపతివణిజో దీర్ఘాస్సమాఖ్యాతాః. 37

మీన మేషవృషభములు కుంభము పొట్టిరాసులు. మిథునధనుఃకర్కాటకమకరములు సమరాసులు. వృశ్చికకన్యాసింహతులారాసులు పొడుగురాసులు.

ఏభి ర్లగ్నాధిగతై శ్శీర్షప్రభృతీని వై శరీరాణి,
సదృశాని విజానీయం తే యుతగగనచరైశ్చ తుల్యాని 38

వైసంజ్ఞలు గలరాసులు లగ్నమును బొందెనేని శిరస్సుమొదలు శరీరావయవములు ఆరాసులకనుగుణములుగ నుండును (అనఁగా మూర్ధాలోచనయను నాల్గవయధ్యాయమునందుండు శ్లోకమునుబట్టి ఏరాశి యేఅవయవమందుండునో ఆరాశినిబట్టి యూహించవలయుననుట) ఒక్కరాసులబట్టియెగాక ఆరాసులయందున్న గ్రహములను బట్టికూడఁ జెప్పవలయును.

భవనాధిపదిజ్నామప్లవ ఇతి యవనైః ప్రయత్నతః కథితః,
తత్ ప్లవగో వినిహన్యా దచిరేణ మహీపతి శ్శత్రూన్. 39

రాశినాథునిదిక్కు ప్లవమని యవనులు పట్టుదలతోఁ జెప్పుచున్నారు. రాజా దిక్కునొంది త్వరలో శత్రువుల జంపును.

లోహితశుకసితహరితాః పాటలహరిధూమ్రపాండుచిత్రాశ్చ,
కృష్ణకనకాభిపింగాః కర్బురబభ్రూత్వజాదివర్ణాస్స్యుః. 40

మేషాదిరాసులకు వరుసగా వై లోహితాదివర్ణములని తాత్పర్యము.

జన్మోదయగృహవర్ణా తదధిపతేః పూజితా ప్రతిమా,
హంతి హారే రిహ శత్రూ నింద్రధ్వజినీవ దేవరిపూన్. 41

జన్మలగ్నము వర్ణముతో ఆరాశినాథుని ప్రతిమను జేయించి పూజించినయెడల శత్రునాశనమగును.

ఇతి తృతీయోఽధ్యాయః.

---

## గ్రహయోనిభేదములను దెలుపు నాల్గవ యధ్యాయము.

ఆత్మా రవిశ్శీతకరస్తు చేతస్సత్త్వం ధరాజశ్శశిజోఽథ వాక్,
జ్ఞానం సుఖం దేవగురుర్మదశ్చ శుక్రశ్శనిః కాలనరస్య దుఃఖమ్ 1

కాలపురుషునకు సూర్యుఁడు దేహము, చంద్రుఁడు మనస్సు; కుజుఁడు సత్త్వము (బలము), బుధుఁడు వాక్కు, గురువు జ్ఞానసుఖములు; శుక్రుఁడు కామము; శని దుఃఖము;" అని తాత్పర్యము.

ఆత్మాదయో గగనగై ర్బలిభి ర్బలవత్తరాః,
దుర్బలై ర్దుర్బలాస్తే తు విపరీతం శనేః ఫలమ్. 2

పైనచెప్పిన అత్మాదులు బలవత్తరగ్రహములచే బలవత్తరములగును. దుర్బలులైనచో నాయవయవములు దుర్బలములగును. శనికి మాత్రము వ్యత్యయముగఁ జెప్పవలయును.

యథాయథాలగ్నగృహాశ్రయాణాంసముద్గమోభూరివికల్పనానాం,
తథాతథాశైలనవాష్టసంఖ్యాః క్రమేణ కాలావయవాః ప్రసూతాః.

ఏయేప్రకారము లగ్నరాశి నాశ్రయించిన భూరివికల్పనలు (ద్రేక్కాణనవాంశలు) ఉదయించునో, ఆయాప్రకారము, 7, 9, 8 సంఖ్యలుగల కాలపురుషావయవములు ప్రసూతములగును

లగ్నాత్తత్క్షణ ముదితం వామాంగగ మథాబలం,
సవ్యార్థావితరత్తస్య నోద్గతం సబలం చ తత్. 4

లగ్నమునకు వామభాగగతములగు నవయవము లప్పు డుదయించెనేని దుర్బలములనియుఁ, ఉదయింపని భాగగతములగు నవయవములు బలవంతములనియుఁ దాత్పర్యము.

మూర్ధాలోచనకర్ణగంధవహనం గండౌహనుశ్చాననం
గ్రీవాస్కంధభుజంతు పార్శ్వహృదయక్రోడాశ్చ నాభిఃపునః,
వస్తిర్లింగగుదే చ ముష్కయుగళం చోరుద్వయం జానునీ
జంఘే పాదయుగం విలగ్నభవనాత్పార్శ్వద్వయే కల్పితాః 5

జన్మలగ్నమునందు ప్రథమద్రేక్కాణ ముదయించెనేని లగ్నరాశి శిరస్సు. ద్వితీయద్వాదశము కన్నులు; అందు ద్వితీయము కుడికన్ను. ద్వాదశము ఎడమకన్ను. తృతీయైకాదశములు చెవులు; అందు తృతీయము కుడిచెవి. ఏకాదశము ఎడమచెవి. చతుర్థదశమములు నాసాపుటములు; అందు చతుర్థము దక్షిణనాసాపుటము. దశమము వామనాసాపుటము. పంచమనవమములు చెక్కిళ్లు; అందు పంచమము కుడిచెక్కిలి. నవమము ఎడమచెక్కిలి. షష్ఠాష్టమములు హనుప్రదేశములు; హనువనగా చెక్కిళ్లమీఁది పార్శ్వమునకును వెనుకటిపార్శ్వమునకును పేరు. అందు షష్ఠము దక్షిణహనువు అష్టమము వామహనువు. సప్తమము నోరు. ఈరీతిగా శీర్షాదిప్రథమాంగవిభాగము జేయఁదగినది. లగ్నమందు ద్వితీయద్రేక్కాణమాయెనేని లగ్నము. కంఠము ద్వితీయద్వాదశములు భుజశిరస్సులు; అందు ద్వితీయము కుడిభుజశిరస్సు. ద్వాదశము ఎడమభుజశిరస్సు. తృతీయైకాదశములు చేతులు; అందు తృతీయము కుడిచెయ్యి. ఏకాదశము ఎడమచెయ్యి చతుర్థదశమములు ప్రక్కలు. అందు చతుర్థము కుడిప్రక్క.

దశమము ఎడమప్రక్క. పంచమనవమములు హృదయప్రదేశము; అందు పంచమము దక్షిణభాగము. నవమము వామభాగము. షష్ఠాష్టమములు కడుపు; అందు షష్ఠము కుడికడుపు. అష్టమము ఎడమకడుపు. సప్తమము నాభి. ఈరీతిగా కంఠాదిద్వితీయావయవవిభాగము జేయఁదగినది. తృతీయద్రేక్కాణ ముదయించెనేని, లగ్నము నాభికిని మేఢ్రమునకును మధ్యప్రదేశము. ద్వితీయద్వాదశములు లింగగుదములు; ద్వితీయము లింగగుదముల కుడితట్టునున్నా, ద్వాదశము ఎడమతట్టునున్నా తృతీయైకాదశములు వృషణములు; అందు తృతీయము కుడివృషణము. ఏకాదశము ఎడమవృషణము, చతుర్థదశమములు తొడలు; అందు చతుర్థము కుడితొడ. దశమము ఎడమతొడ. పంచమనవమములు మోకాళ్లు; అందు పంచమము కుడిమోకాలు. నవమము ఎడమమోకాలు షష్ఠాష్టమములు పిక్కలు, అందు షష్ఠము కుడిప్రక్క అష్టమము ఎడమప్రక్క. సప్తమము పాదములు. ఈప్రకారము లగ్నముమొదలుగా పార్శ్వద్వయమందును కల్పించఁదగినదని ముఖ్యతాత్పర్యము.

పాపా వ్రణంలాంఛనమేషుసౌమ్యాస్స్వాంశేస్వరాశావథవాస్థితేషు,
కుర్వంతి జన్మోత్థితమేషు చిహ్నమేషు గ్రహా స్తద్విపరీతసంస్థాః. 6

పూర్వముచెప్పిన అవయవములయందు పాపగ్రహములుండిరేని వ్రణములు గలుగును. శుభగ్రహములుండిరేని మచ్చలుండును. శుభగ్రహములు స్వరాశియందుగాని స్వనవాంశయందుగాని యుండిరేని పుట్టుమచ్చయుండునని తెలియవలయును. శత్రునీచక్షేత్రములయందుండిరేని వికారచిహ్నములుండునని తాత్పర్యము.

రాజారవి శ్శశధర స్తు బుధః కుమార
స్సేనాపతిః క్షితిసుత స్సచివౌ సితేజ్యౌ,
భృత్య స్తయోశ్చ రవిజ స్సబలా నరాణాం
కుర్వంతి జన్మసమయే నిజమేవ సత్వమ్. 7

రవిచంద్రులు రాజులు. కుజుఁడు సేనాధిపతి. బుధుఁడు యువరాజు. గురుశుక్రులు మంత్రులు. శని దాసుఁడు. జన్మకాలమున రాజాదులైనసూర్యాదులు బలవంతులైయుండిరేని తమతమసంజ్ఞకుఁ దగినట్టుగా కార్యసాధకు లగుదురు. బలహీనులై రేని కార్యహానిని కలుగఁజేయుదురని భావము.

భానుశ్శుక్రః క్షమాపుత్రస్సైంహికేయశ్శనిశ్శశీ,
సౌమ్యస్త్రిదశమంత్రీ చ ప్రాచ్యాది దిగధీశ్వరాః. 8

సూర్యుఁడు శుక్రుఁడు కుజుఁడు రాహువు శని చంద్రుఁడు బుధుఁడు గురువు వీరలు క్రమముగా ప్రాగాది ఎనిమిదిదిక్కుల కధిపతులు.

గురుబుధశుక్రాస్సౌమ్యాస్సౌరికుజార్కా స్తు నిగదితాః పాపాః,
శశిజోఽశుభసంయుక్తః క్షీణశ్చ నిశాకరః పాపః. 9

పూర్ణచంద్రుఁడు బుధగురుశుక్రులు శుభగ్రహములు క్షీణచంద్రుఁడు రవికుజ శనులు పాపగ్రహములు పాపగ్రహయుతబుధుఁడును పాపగ్రహమని తాత్పర్యము.

హేళి ర్భాను శ్శశీ చంద్రః క్రూరాక్షః క్షితినందనః,
ఆరో రక్త స్తథా వక్రో హేమ్నో విద్జ్ఞోధబోధనః 10

ఈడ్యేజ్యావంగిరాజీవ ఆస్ఫుజిచ్చ సితో భృగుః,
మందః కోణో యమః కృష్ణో వింద్యాదన్యాని లోకతః. 11

హేళిః భానుః ఇవి సూర్యపర్యాయనామములు. శశి చంద్ర చంద్రనామములు. క్రూరాక్షః క్షితినందనః ఆరః రక్తః వక్రః ఇవి కుజనామములు. హేమ్నః విత్ జ్ఞః బోధనః బుధనామములు. ఈడ్యః ఇజ్యః అంగిరాః జీవః గురునామములు. ఆస్ఫుజిత్ సితః భృగుః శుక్రనామములు. మందః కోణః యమః కృష్ణః శనినామములు. ఇట్లే ఇతరపర్యాయనామములను గ్రంథాంతరముచే తెలియవలయును.

తామ్రసితారుణహరితకపీతవిచిత్రాసితాఇనాదీనాం,
పావకజలగుహకేశవశక్రశచీవేధసఃపతయః. 12

రవ్యాదిగ్రహములు క్రమముగా తామ్రాదివర్ణముల కధిపతు లగుదురు. అగ్ని జలము కుమారస్వామి విష్ణువు ఇంద్రుఁడు శచీదేవి బ్రహ్మ క్రమముగ సూర్యాదిసప్త గ్రహముల కధిపతులు.

అర్కాదిగ్రహదైవతమంత్రైస్సంపూజ్యతా మాశాం,
కనకగజవాహనాదీన్ప్రాప్నోతి గతోఽరితశ్శీఘ్రమ్. 13

ఏగ్రహము ఏదిక్కున కధిపతియో ఆగ్రహమును బూజించి ఆదిక్కునకు యుద్ధయాత్రనిముత్తమై వెళ్లినరాజు శత్రువులను జయించి కనకగజవాహనాదులను పొందునని తాత్పర్యము.

స్త్రీణాం చంద్రసితౌ నపుంసకపతీ సోమాత్మజార్కాత్మజౌ
పుంసాం జీవదివాకరక్షితిసుతా విప్రస్య శుక్రోఽంగిరాః,
రాజ్ఞాం సూర్యకుజౌ విశాం శశధరో మిశ్రస్య మందో బుధ
శ్శూద్రాణాం శిఖిభూఖతోయమరుతాం భౌమాదయః కీర్తితాః 14

స్త్రీలకు చంద్ర శుక్రులు నపుంసకులకు బుధశనులు పురుషులకు రవిగురుకుజులు అధిపతులు. బ్రాహ్మణులకు గురుశుక్రులు క్షత్రియులకు రవికుజులు వైశ్యులకు చంద్రుఁడు సంకరజాతికి శని శూద్రులకు బుధుఁడు అధిపతు లగుదురు. కుజుఁడు అగ్నికి బుధుఁడు భూమికి గురుఁ డాకాశమునకు శుక్రుఁడు జలమునకు శని వాయువుకు అధిపతులని తాత్పర్యము.

కటుకలవణతిక్తమిశ్రితమధురామ్లకషాయకరసవిశేషాణాం,
సురగృహకాగ్నివిహారార్థశయనపాంసూత్కరాణాం చ. 15

కారము లవణము చేదు షడ్రససంఘము మధురము పులుసు వగరు క్రమముగ వీటికి సూర్యాదిసప్తగ్రహము లధిపతులు. దేవస్థానమునకు రవి, సమీపభూమికి చంద్రుఁడు, అగ్నిసమీపభూమికి కుజుఁడు, క్రీడాప్రదేశమునకు బుధుఁడు, ధనగృహమునకు గురువు, శయనగృహమునకు శుక్రుఁడు, భూపరాగరాశికి శని అధిపతులని తాత్పర్యము.

వస్త్రాణాం స్థూలాహతశిఖిజలహతమధ్యదృఢసుజీర్ణానాం,
తామ్రమణిహేమమిశ్రితరూప్యకముక్తాయసాం వాపి. 16

సూర్యుఁడు ముదుగువస్త్రమునకు, చంద్రుఁడు క్రొత్తవస్త్రమునకు, కుజుఁడు కాలినవస్త్రమునకు, బుధుఁడు తడిసినవస్త్రమునకు, గురువు కొంత ప్రాతదైన వస్త్రమునకు, శుక్రుఁడు గట్టివస్త్రమునకు, శని చినిగినవస్త్రమునకు నధిపతులు. సూర్యుఁడు తామ్రము, చంద్రుఁడు మణులు, కుజుఁడు బంగారు, బుధుఁడు మిశ్రితలోహములు, గురువు వెండి, శుక్రుఁడు ముత్తెము, శని ఇనుము సీసములోనగువానికి నధిపతులని తాత్పర్యము.

అయనక్షణదివసర్తుకమాసపక్షశరదాం దినేశాద్యాః,
శిశిరాదీనా మీశా శ్శనిసితభౌమేందుబుధజీవాః. 17

అయనము క్షణము ఋతువు మాసము పక్షము సంవత్సరము క్రమముగా రవ్యాదు లధిపతులు. శని శుక్ర కుజ చంద్ర బుధ గురులు క్రమముగ శిశిరాదిఋతువుల కధిపతులని తాత్పర్యము.

లగ్నాధిపతేస్తుల్యః కాలో లగ్నాదితాంశకసమాఖ్యాతః,
వక్తవ్యో రిపువిజయో గర్భేషు చ కార్యసంయోగే. 18

శత్రువిజయము గర్భము కార్యఘటన మొదలగునవి లగ్నాధిపతివల్లనుంచి గాని లేక లగ్ననవాంశాధిపతివల్లనుంచి గాని పైన అయనక్షణదివసర్తుక యని చెప్పిన కాలముకుఁ గలుగునని చెప్పవలయును.

ఋగ్వేదాధిపతిర్జీవో యజుర్వేదపతి స్సితః,
సామవేదాధిపో వక్ర శ్శశిజోఽథర్వవేదరాట్. 19

గురుశుక్రకుజబుధులు క్రమముగ ఋగ్యజుస్సామాథర్వణవేదముల కధిపతులు

సురపూజ్యశ్శశిశుక్రౌ దినకరభౌమౌ బుధార్కజౌ నాథాః,
విబుధమనుష్యపితౄణాం తిర్యఙ్నరకాధివాసానామ్ 20

దేవతలకు గురువు మనుష్యులకు చంద్రశుక్రులు పితృదేవతలకు రవికుజులు తిర్యగ్జంతువులకు బుధుఁడు నరకాధివాసులకు శని అధిపతులని తాత్పర్యము

స్వల్పాకుంచితమూర్ధజః పటుమతి స్సుఖ్యస్స్వరూపస్స్వనో
నాత్యుచ్చో మధుపింగచారునయనశ్శూరః ప్రచండః స్థిరః,
రక్తశ్యామతనుర్విగూఢచరణః పిత్తాస్థిసారో మహా
న్గంభీరశ్చతురశ్రకః పృథుకరః కౌసుంభవాసా రవిః. 21

సూర్యుఁడు, స్వల్పము వంకరయగు వెంట్రుకలు, మంచిబుద్ధి, సుందరాకారము, సుస్వరము, మిక్కిలి యెత్తుగానివాఁడు, తేనెవంటి చక్కని నేత్రములు గలవాఁడు నగు. మఱియు, శూరుఁడు, ప్రచండుఁడు, స్థైర్యవంతుఁడు, ఎఱుపు నలుపుగల దేహకాంతిగలవాఁడు, గూఢపాదములు గలవాఁడు, పిత్తప్రకృతి మంతుఁడు, దృఢమైన యెముకలు గలవాఁడు, గంభీరుఁడు, చతుష్కోణాకారవంతుఁడు, విశాలబాహువు, పట్టువస్త్రము గలవాఁడని తాత్పర్యము.

సౌమ్యః కాంతివిలోచనో మధురవాగ్గౌరః కృశాంగో యువా
ప్రాంశుస్సూక్ష్మనికుంచితాసితకచః ప్రాజ్ఞో మృదుస్సాత్త్వికః,
చాపర్వాతకఫాత్మకః ప్రియసఖో రక్తైకసారో ఘృణీ
వృద్ధస్త్రీషు రతశ్చలోఽతిసుభగశ్శుభ్రాంబరశ్చంద్రమాః. 22

చంద్రుఁడు, సౌమ్యస్వభావుఁడు, కాంతియుక్త నేత్రములు గలవాఁడు, మధురవాక్కు గలవాఁడు, తెల్లనివన్నె గలవాఁడు, యౌవనవంతుఁడు, మిగుల పొడవైనవాఁడు, సూక్ష్మముగ ముడిచిన నల్లనివెంట్రుకలు గలవాఁడు, విద్వాంసుఁడు, సాత్త్వికమృదుస్వభావుఁడు, సుందరుఁడు, కఫవాత ప్రకృతిమంతుఁడు ప్రియమిత్రులు గలవాఁడు, రక్తపుష్టి మంతుఁడు, దయాళువు, వృద్ధస్త్రీలయందు బాసక్తుఁడు, చంచలుఁడు, మిగుల సొగసుగలవాఁడు, తెల్లనివస్త్రము ధరించినవాఁడు నని తాత్పర్యము.

హ్రస్వః పింగళలోచనో దృఢవపు ర్దీప్తాగ్ని కాంతిశ్చలో
మజ్జావానరుణాంబరః పటుతరశ్శూరశ్చ నిష్పన్నవాక్,
హ్రస్వాకుంచితకేశదీప్తతరుణః పిత్తాత్మకస్తామస
శ్చండస్సాహసికో విఘాతకుశలస్సంరక్తగౌరః కుజః 23

కుజుఁడు, పొట్టివాఁడును, పచ్చని నేత్రములు, దృఢశరీరము, ప్రజ్వలాగ్ని తుల్యమగు కాంతి, రక్తవర్ణము, మజ్జయు, రక్తవస్త్రము, సామర్థ్యము, శౌర్యము, కఠినవాక్కు, కుఱుచని వంకర వెండ్రుకలు, యౌవనము, పైత్యప్రకృతి, తామసస్వభావము, సాహసికత్వము, విఘాతము లొనరించుటయందు నేర్పరితనము, రక్తగౌరవర్ణము (ఎఱుపు, తెలుపు) గలవాఁడునని తాత్పర్యము.

రక్తాంతాయతలోచనో మధురవాగ్దూర్వాదళశ్శ్యామల
స్త్వక్సారోఽతిరజోఽధికస్స్ఫుటవచాస్సీఖతస్త్రిదోషాత్మకః,
హృష్టో మధ్యమరూపవా న్సునిపుణో నృత్తశ్శిరాభి స్తత
స్స్వర్ణస్సానుకరోతి వేషవచనైః పాలాశవాసా బుధః. 24

బుధుఁడు ఎఱ్ఱనై విశాలములైన నేత్రములు, మధురవాక్కులు, గఱికవంటి వన్నె, అధికరజోగుణము, మిగుల స్ఫుటమైనపలుకులు, వాతపిత్తకఫాత్మకమగు ప్రకృతి, సంతోషము, మధ్యమరూపము, వర్తులమైన నరములు, నైపుణ్యమును, వేషము చేతను, వాక్కులచేత నితరుల ననుకరించుట, మోదుగునారబట్టయుఁ గలవాఁడని తాత్పర్యము.

ఈషత్పింగళలోచనశ్శ్రుతిధరస్సింహోచ్ఛనాదస్థిరః
సత్వాఢ్యస్సువిశుద్ధకాంచనవపుః పీనోన్నతోరస్థ్సలః,
హ్రస్వో ధర్మరతో వినీతనిపుణో బద్ధోత్కటాక్షః క్షమీ
స్యాత్పీతాంబరధృత్కఫాత్మకతను ర్మేదః ప్రధానో గురుః. 25

బృహస్పతి పచ్చని నేత్రములు, వేదాధ్యయనము, సింహమువంటి ధ్వని, సాత్త్వికగుణము, మేలిమి బంగారువంటిశరీరము, బలిసిన యెత్తైన వక్షస్థలము, హ్రస్వాకారము, ధర్మమునందాసక్తి, నమ్రత్వము, క్రేగంటి చూపు, క్షమాస్వభావము, పీతాంబరధారణము, కఫాత్మకప్రకృతి, మేదస్థ్సానాధికారము గలవాఁడని తాత్పర్యము.

చారుర్దీర్ఘభుజః పృథూరువదనశ్శుక్లాధికః కాంతిమా
న్కృష్ణాకుంచితసూక్ష్మలంబిచికురో దూర్వాదళశ్యామలః,
కామీ వాతకఫాత్మకోఽతిసుభగశ్చిత్రాంబరో రాజసో
లీలావాన్మతిమా న్విశాలనయన స్థూలాంసదేశస్సితః. 26

శుక్రుఁడు, సుందరము, దీర్ఘభుజములు, గొప్పతొడలు, తెల్లనికాంతియు, నల్లనై వంకరగలిగి వ్రేలాడుచున్న సూక్ష్మవెంట్రుకలు, గరికవంటి పచ్చనికాంతి, కాముకత్వము, వాతకఫాత్మకమగు ప్రకృతి, మిగుల సొగసుందనము, చిత్రవర్ణముగల వస్త్రము, రాజసస్వభావము, విలాసత్వము, బుద్ధిశాలిత్వము, విశాలనేత్రములు, స్థూలమయిన మూపురము గలవాఁడని తాత్పర్యము.

పింగో నిమ్నవిలోచనః కృశతను ర్దీర్ఘస్సిరాలోలసః
కృష్ణాంగః పవనాత్మకోఽతిపిశునస్స్నాయ్వాతతో నిర్ఘృణః,
మూర్ఖస్థూలనఖద్విజోఽతిమలినో రూక్షోఽశుచిస్తామసో
రౌద్రః క్రోధపరో జరాపరిణతః కృష్ణాంబరో భాస్కరిః. 27

శని, పచ్చని లోతుగలనేత్రములు, కృశించినశరీరము, పొడవు, నలుపు, వాత ప్రకృతి, అతిలోభిత్వము, నరములచే వ్యాప్తమైన శరీరము, దయావిహీనత్వము, మూర్ఖత్వము, లావు పొడవుగలగోళ్లు, పండ్లు, మాలిన్యము, బిరుసుదనము, అనాచారము, తామసస్వభావము, రౌద్రాకారము, క్రోధపరత్వము, ముసలితనముచే జీర్ణమైనశరీరము, నల్లనివస్త్రముగలవాఁడని తాత్పర్యము.

మిత్రాణి సూర్యాద్గురుభౌమచంద్రా
స్సూర్యేందుపుత్రౌ రవిచంద్రజీవాః,
భానుశ్చ శుక్రశ్శశిసూర్యభౌమా
మందేందుజౌ శుక్రబుధౌ క్రమేణ 28

సూర్యునకు చంద్రకుజగురువులు మిత్రులు. చంద్రునకు రవిబుధులు మిత్రులు. కుజునకు రవిచంద్రగురువులు మిత్రులు. బుధునకు రవిశుక్రులు మిత్రులు. గురునకు రవిచంద్రకుజులు మిత్రులు. శుక్రునకు బుధశనులు మిత్రులు. శనికి బుధశుక్రులు మిత్రులు అని తెలియవలెను.

శుక్రార్కజౌ చంద్రమసో న కశ్చిత్సౌమ్యశ్శశీశుక్రబుధౌ రవీందూ,
సోమార్కవక్రా రవిజస్త్వమిత్రా మిత్రారిశేషో న సుహృన్న శత్రుః

సూర్యునకు శుక్రశనులు శత్రువులు. కుజునకు బుధుఁడు శత్రువు. బుధునకు చంద్రుఁడు శత్రువు. గురునకు బుధశుక్రులు శత్రువులు. శుక్రునకు రవిచంద్రులు శత్రువులు. శనికి రవిచంద్రకుజులు శత్రువులని తాత్పర్యము. శత్రువులు మిత్రులుగాక శేషించినగ్రహములు సములు. అనఁగా సూర్యునకు బుధుఁడు సముఁడు. చంద్రునకు కుజగురుశుక్రశనులు సములు. కుజునకు శుక్రశనులు సములు. బుధునకు గురుశనులు

సములు గురునకు శని సముఁడు. శుక్రునకు కుజగురువులు సములు. శనికి గురువు సముఁడు చంద్రునకు శత్రువులు లేరని తాత్పర్యము.

వ్యయాంబుధనఖాయేషు తృతీయే సుహృదస్థితాః,
తత్కాలరిపవష్షష్ఠసప్తాష్టైకత్రికోణగాః 30

ఒకరికొకరు ౧౨-౪-౨-౧౦-౧౧-౩ ఈస్థానములయందున్న గ్రహములు తత్కాలమిత్రులు ౧-౭-౬-౮-౫-౯ ఈస్థానములయందున్న గ్రహములు శత్రువులు అని తాత్పర్యము.

హితసమరిపుసంజ్ఞా యే నిసర్గాన్నిరుక్తా
హితతమహితమధ్యా స్తేఽపి తత్కాలమిత్రైః,
రిపుసమసుహృదాఖ్యాస్సంతి కాలే గ్రహేంద్రా
అరిరిపురిపుమధ్యా శ్శత్రుభిశ్చింతనీయాః. 31

నిసర్గతచే మిత్రుఁడైనగ్రహము తాత్కాలికమిత్రుఁడాయెనేని అధిమిత్రుఁడగును. నిసర్గసముఁడు తాత్కాలికమిత్రుఁడాయెనేని మిత్రుఁడగును నిసర్గశత్రువు తాత్కాలికమిత్రుఁడాయెనేని సముఁడగును. నిసర్గశత్రువుతాత్కాలికశత్రువాయెనేని అధిశత్రువనఁబడును. సముఁడు తాత్కాలికశత్రువాయెనేని శత్రువనఁబడును. నిసర్గమిత్రుఁడు తాత్కాలికశత్రువాయెనేని సముఁడనఁబడును. ఇట్లె పరస్పరము తెలియఁదగినది.

సంపశ్యంతి స్థానాత్సదా గ్రహాశ్చరణవృద్ధితస్సర్వే,
త్రిదశత్రికోణచతురశ్రసప్తమానాం ఫలం క్రమేణైవ. 32

గ్రహములన్నియుం దామున్నస్థానము మొదలు 3-౧౦ స్థానములను పాదదృష్టిచేతను ౫-౯ స్థానములను అర్ధదృష్టిచేతను ౪-౮ స్థానములను త్రిపాదదృష్టిచేతను ౭ స్థానమును పూర్ణదృష్టిచేతను జూచుచున్నవారై క్రమముగా పాదార్ధత్రిపాదపూర్ణ ఫలముల నిచ్చుచున్నారు.

పూర్ణం పశ్యతి రవిజ స్తృతీయదశమే త్రికోణమపి జీవః,
చతురశ్రం భూమిసుతో ద్యూనంచ సితార్కశశిబుధాః క్రమశః.

3-౧౦ స్థానములను శని ౫-౯ స్థానములను గురువు ౪-౮ స్థానములను కుజుఁడు. ౭ స్థానమును రవిచంద్రబుధశుక్రులు సంపూర్ణదృష్టిచే చూచుచున్నారని తాత్పర్యము.

దిక్స్థానకాలచేష్టాకృతం బలం సర్వనిర్ణయవిధానే,
వక్ష్యే చతుష్ప్రకారం గ్రహాస్తు రిక్తో భవేదబలః. 34

చెప్పఁబోవురీతిని దిక్స్థానకాలచేష్టాకృతబలములు లేనిగ్రహము దుర్బలము గల దని తాత్పర్యము

లగ్నే జీవబుధౌ దివాకరకుజౌ వ్యోమ్ని స్మరే భాస్కరి
ర్బంధావిందుసితౌ దిశాకృతమిదం స్వోచ్చే స్వకోణే స్వభే,
మిత్రస్వాంశకసంస్థిత శ్శుభఫలై ర్దృష్టో బలీయాన్గ్రహ
స్త్రీస్త్రీక్షేత్రే శశిభార్గవౌ నరగృహే శేషాబలేస్థానజే 35

లగ్నమందు గురుబుధులు, చతుర్థమందు చంద్రశుక్రులు, సప్తమమందు శని, దశమమందు రవికుజులు దిగ్బలము గలవారు. ఉచ్చత్రికోణస్వక్షేత్రమిత్రక్షేత్ర స్వాంశలయందున్నవాఁడును, శుభదృష్టిగలవాఁడును స్థానబలముగలవాఁడు మరియు స్త్రీక్షేత్రములగు వృషభాదిసమరాసులయందు చంద్రశుక్రులు పురుషరాసులగు మేషాది విషమరాసులయందు రవికుజబుధగురుశనులు స్థానబలము గలవారని తాత్పర్యము.

జీవార్కాస్ఫుజితోహ్ని విచ్చ సతతం మందేందుభౌమానిశి
హోరామాసదినాబ్దపాశ్చ బలినః సౌమ్యాస్సితేఽన్యేఽసితే,
సంగ్రామే జయినో విలోమగతయ స్సంపూర్ణ గావో గ్రహాః
సూర్యేందూ పునయ త్తరేణ బలినౌ సత్యోక్తచేష్టాబలే 36

రవికుజశుక్రులు పగటియందును బుధుఁడు సర్వకాలములయందును చంద్రకుజ శనులు రాత్రియందును హోరాదివసమాసవర్షాధిపతులు శుక్లపక్షమందు శుభగ్రహములు. కృష్ణపక్షమందు పాపగ్రహములు కాలబలము గలవారు. యుద్ధమందు జయించిన వాఁడును వక్రగతి గలవాఁడును సూర్యునకు దూరమందున్నవాఁడును చేష్టాబలముగల వారని తాత్పర్యము.

ఉత్తరమయనం ప్రాప్తాః శుక్రకుజార్కేంద్రమంత్రిణో బలినః,
యామ్యం శశిరవిపుత్రౌ ద్వయేఽపి శశిజస్స్వవర్గస్థః 37

ఉత్తరాయణమందు కుజరవిగురుశుక్రులు దక్షిణాయనమందు చంద్రశనులు అయనద్వయమందున్నూ స్వవర్గమును పొందిన బుధుఁడు చేష్టాబలముగలవారని తాత్పర్యము. ఇది కొందరిమతము.

స్త్రీపుంనపుంసకాఖ్యాః క్షేత్రే ష్వాద్యంతమధ్యసంప్రాప్తాః,
సూర్యాన్నిర్గత్య సదా నవోదితా యవనరాజమతమ్. 38

యవనరాజమతమందు స్త్రీగ్రహములు రాశ్యాదియందును పురుషగ్రహములు రాశిమధ్యయందును నపుంసకగ్రహములు రాశ్యంతమందును ఉన్నవారై చేష్టాబలమును పొందుచున్నారు. ఉదయించిన గ్రహములు చేష్టాబలములు గలవారని తాత్పర్యము.

ప్రాగ్రాత్రిభాగేఽతిబలశ్శశాంక
శ్శుక్రో నిశార్ధేఽవనిజో నిశాంతః,
ప్రాతర్బుధో మధ్యదినేచ సూర్య
స్సర్వత్ర జీవోఽర్కసుతో దినాంతే. 39

పూర్వరాత్రమునందు చంద్రుడును, నిశీథమునందు శుక్రుడును, నిశాంతము నందు కుజుడును, ఉదయకాలమునందు బుధుడును, మధ్యాహ్నమునందు సూర్యుడును, సాయంకాలమునందు శనియును, సర్వదా (అహోరాత్రములయందు) బృహస్పతియును బలవంతులని తాత్పర్యము.

కృష్ణారబుధగురుసితాశ్శశిసూర్యావుత్తరోత్తరం బలినః,
సాధారణబలమేతద్బలసామ్యే చింతయేత్ప్రాజ్ఞః. 40

శనికుజబుధగురుశుక్రచంద్రసూర్యులు ఒకరికంటె ఒకరు బలవంతులు. ఇది నైసర్గికబలము. పూర్వమందు జెప్పినబలముల సామ్యమందు ఈనైసర్గికబలము ననుసరించి న్యూనాధికము ప్రాజ్ఞులచే నాలోచించవలయునని తాత్పర్యము.

ఇతి చతుర్థోఽధ్యాయః.

---

మిశ్రిక యనుపేరుగల ఐదవ యధ్యాయము.

రాశిప్రభేదసంజ్ఞః కథితో గ్రహయోనిభిత్తిరధ్యాయః,
సర్వవ్యాపకమధునా కథయిష్యే మిశ్రికం నామ. 1

మిశ్రికాధ్యాయమును జెప్పబోవుచున్నాను అని తాత్పర్యము.

దీప్తస్స్వస్థో ముదితశ్శాంతశ్శక్తో నిపీడితో భీతః,
వికలః ఖలశ్చ కథితో నవప్రకారో గ్రహో హరిణా. 2

గ్రహము, దీప్తము, స్వస్థము, ముదితము, శాంతము, శక్తము, నిపీడితము, భీతము, వికలము, ఖల మని తొమ్మిదిఅవస్థలు కలవాడని తాత్పర్యము.

స్వోచ్చే భవతిచ దీప్తస్స్వస్థస్స్వగృహే సుహృద్గృహే ముదితః,
శాంతశ్శుభవర్గస్థ శ్శక్తస్స్ఫుటకరణజాలశ్చ. 3

వికలో రవిలుప్తకరో గ్రహాభిభూతో నిపీడితశ్చైవం,
పాపగణస్థశ్చ ఖలో నీచేభీతస్సమాఖ్యాతః. 4

ఉచ్చయందున్న గ్రహము దీప్తుఁడనియు, స్వక్షేత్రమందున్న స్వస్థుఁడు, మిత్రరాశియందున్న ముదితుఁడు, శుభవర్గమందున్న శాంతుఁడు, సూర్యునకు దూరమందున్న శక్తుఁడు, అస్తంగతుఁడైన వికలుఁడును, యుద్ధమందు పరాజయమును పొందినవాఁడు నిపీడితుఁడు, పాపవర్గమందున్న ఖలుఁడు, నీచయందున్న భీతుఁడు అని చెప్పవలయును.

దీప్తో విచరతి పురుషః ప్రతాపవిషమాగ్నిదగ్ధరిపువర్గః,
లక్ష్మ్యాలింగితదేహో గజమదసంసిక్తభూపృష్ఠః 5

గ్రహము దీప్తావస్థయందుండఁగా జనించినపురుషుఁడు పరాక్రమము గలవాఁడై గజాంతైశ్వర్యము గలవాఁడగును.

స్వస్థఃకరోతి జన్మని రత్నాని సుఖాని కనకపరివారాన్,
నృపతేర్దండపతిత్వం గృహధాన్యకుటుంబపరివృద్ధిమ్ 6

గ్రహము స్వస్థావస్థయందుండఁగా బుట్టినమనుజుఁడు రత్నములు సుఖము పరివారము మొదలగునవి కలవాఁడై సేనాధిపతియగును.

ముదితే విలసతి ముదితో విలాసిసీ కనకరత్నపరిపూర్ణః,
విజితసకలారిపక్షః స్సమస్తసుఖభాఙ్నరో భవతి. 7

గ్రహము ముదితావస్థయందుండఁగా బుట్టినమనుజుఁడు సంతోషము రత్నములు మొదలగునవి కలవాఁడై శత్రువులను నశింపజేయువాఁడై అత్యంతసుఖము నొందును.

శాంతే ప్రశాంతచిత్తస్సుఖధనభోగీ మహీపతేస్సచివః,
విద్వాన్పరోపకారీ ధర్మపరో జాయతే పురుషః. 8

గ్రహము శాంతావస్థయందుండఁగా బుట్టినమనుజుఁడు శాంతము సుఖము ధనము విద్య మొదలగునవి కలవాఁడగును.

స్త్రీవస్త్రమాల్యగంధై ర్విలసతి పురుష స్సదావితతకీర్తిః,
దయిత స్సర్వజనస్యచ శక్తాఖ్యే భవతి విఖ్యాతః. 9

గ్రహము శక్తావస్థయందుండఁగా బుట్టినశిశువు, స్త్రీమాల్యగంధాదులచే మిక్కిలి భోగము కీర్తియు మొదలగునవి గలవాఁడగును.

దుఃఖై ర్వ్యాధిభి రరిభిః ప్రపీడ్యతే పీడితాఖ్యేతు,
దేశాద్దేశం విచరతి బంధువియోగాభిసంతప్తః. 10

గ్రహము పీడితావస్థయందుండఁగాఁ బుట్టినవాఁడు దుఃఖములు, రోగములు, శత్రువులు వీనిచేఁ బీడింపఁబడి, బంధువులనెడఁబాసి దేశములనుండి దేశాంతరములకుఁ బోవుచుండును.

బహుసాధనోపి రాజా ప్రధ్వస్తబలః ప్రపీడితో రిపుణా,
నాశ ముపయాతి విజితో భీతే దైన్యం పర ప్రాప్తః 11

గ్రహము భీతావస్థయందుండఁగా బుట్టినవాఁడు రాజ్యాధిపత్యముగల రాజవంశమందు బుట్టినను అత్యంతదైన్యతను బొందునని తాత్పర్యము.

స్వస్థానపరిభ్రష్టః క్లిష్టో మలినః ప్రయాతి పరదేశం,
విధ్వస్తబలో వికలే రిపుబలసంచకితచిత్తశ్చ 12

గ్రహము వికలావస్థయందుండఁగా బుట్టినవాఁడు స్వస్థానత్యాగము క్లేశము ధనహీనత మొదలగునవి గలవాఁడగును

స్త్రీభరణదుఃఖత ప్త స్సమ స్తధననాశకలుషితమనస్కః,
నజహాతి శోకభారం కథమపి ఖలసంజ్ఞితె పురుషః 13

గ్రహము ఖలావస్థయందుండఁగా జన్మించినవాఁడు, సమస్తధనము నశించుటచే, మనస్సుచెడినవాఁడై, స్త్రీలనుఁ బోషించుటకు శక్తిలేకదుఃఖసంతప్తుఁడగునని తాత్పర్యము.

ఉచ్చరాజో విలోమేచ బలం నాన్యైర్హ్రియతే,
కాలస్యాతిబహుత్వాచ్చ తస్మా త్సోప్యుచ్చవత్స్మృతే. 14

గ్రహము ఉచ్చరాశియందున్నను వక్రించియున్నను బల మన్యులచే హరింపఁబడదు. కాలబహుత్వ మగుటవలన గ్రహము పరమోచ్చమందుండినను (అతివక్రమనగా వక్రించినగ్రహము శీఘ్రసీఘ్రభాగతుల్యుఁడై యుండఁగా యనితాత్పర్యము) అతివక్రమందుండఁగాను బల మన్యులచే హరింపఁబడదని ముఖ్యతాత్పర్యము.

స్వోచ్చాశ్రితా శ్శ్రేష్ఠబలాభవంతి
మూలత్రికోణే స్వగృహేచ మధ్యాః,
ఇష్టేక్షితా మిత్రగృహే శ్రితావా
వీర్యం కనీయ స్సముపోద్వహంతి. 15

స్వోచ్చలయందున్న గ్రహములు మిక్కిలి బలవంతులు. స్వమూలత్రికోణ స్వక్షేత్రముల యందున్నవారు మధ్యమబలవంతులు. మిత్రదృష్టిగలవారును మిత్రక్షేత్రమందున్నవారును స్వల్పబలము గలవారని తాత్పర్యము.

శుక్లప్రతిపద్దశకే మధ్యబలః కీర్త్యతే యవనవృద్ధైః,
శ్రేష్ఠో ద్వితీయదశకే స్వల్పబలశ్చంద్రమాస్తృతీయేచ 16

చంద్రుఁడు శుక్ల పాడ్యమి మొదలు మొదటి పదిరోజులు మధ్యబలుఁడును, రెండవపదిరోజులు పూర్ణబలుఁడును, మూఁడవపదిరోజులు బలహీనుఁడని తాత్పర్యము.

ఆహితకలాసమూహః ప్రసన్ననిజమండలః సుస్నిగ్ధపూర్ణః,
అప్రతిహతమిహకురుతే భూతిబలముడుగణాధిపతిః 17

జననకాలమున చంద్రుఁడు పూర్ణుఁడై యుండెనేని ఐశ్వర్యము నిచ్చునని తాత్పర్యము.

చంద్రాధ్యాసితరాశేర్నాథో లగ్నాధిపోఽపి వా యస్య,
కేంద్రే సురగురుమంత్రీ వయసో మధ్యే సుఖం తస్య 18

జన్మకాలమున చంద్రస్థితరాశ్యధిపతి లగ్నాధిపతియైనను కేంద్రమందు గురు వున్నను వానిమధ్యవయస్సు సుఖముగలది యగును.

రాశేస్తదీశ్వరస్య చ బలేన పరికల్ప్య మృతుభేశఫలం,
యుగపత్ఫలోపలబ్ధే రవధృతిరేకస్య కర్తవ్యా 19

రాశి. రాశ్యధిపతి బలముగనుండెనేని సంపూర్ణఫలము గలుగును అటుగానిచో మధ్యమఫలము గలుగునని తాత్పర్యము.

హోరాగ్రహబలసామ్యే నిసర్గజం చింతనీయమాచార్యైః,
లగ్నాధిపతేస్తుల్యం బలమిహ చూడామణిర్వదతి. 20

రాశి. రాశ్యధిపతులబలసామ్యమందు నిసర్గబలము చే [illegible], లగ్నాధిపతిబలమే లగ్నబలమని కొందరు చెప్పుదురు.

వింశతిరంశాస్సింహే త్రికోణమపరే స్వభవనమర్కస్య,
ఉచ్చంభాగత్రితయం వృషభ ఇందోశ్చ త్రికోణమపరేఽంశాః 21
ద్వాదశభాగా మేషే త్రికోణమపరే స్వభంతు భౌమస్య,
ఉచ్చబలం కన్యాయాం బుధస్య తిథ్యంశకైస్సదాచింత్యమ్ 22
పరతస్త్రికోణజాతం పంచభిరంశైస్స్వరాశిజం పరతః,
దశభాగా ఈడ్యస్యచ త్రికోణ మపరే స్వభంచాపే. 23
శుక్రస్య తు త్రికోణం పంచభి రపరే స్వభంజూకే,
కుంభే త్రికోణనిజభే రవిజస్య యథారవేస్సింహే. 24

సులభమైనను వ్రాయఁబడును రవికి సింహరాశియందు మొదటి ౨౦ భాగలు త్రికోణసంజ్ఞ. శేషము స్వక్షేత్రము. చంద్రునకు వృషభమందు మొదట ౩ భాగలు ఉచ్చ శేషము త్రికోణము. కుజునకు మేషమందు మొదట ౧౨ భాగలు త్రికోణము. శేషము స్వక్షేత్రము బుధునకు కన్యారాశియందు మొదట ౧౫ భాగలు ఉచ్చసంజ్ఞ. తరువాత ౫ భాగలు త్రికోణము. శేషము స్వక్షేత్రము. గురునకు ధనుస్సుయందు మొదట ౧౦ భాగలు త్రికోణము. శేషము స్వక్షేత్రము. శుక్రునకు తులారాశియందు మొదట ౫ భాగలు త్రికోణము. శేషము స్వక్షేత్రము. శనికి కుంభరాశియందు మొదట ౨౦ భాగలు త్రికోణము. శేషము స్వక్షేత్రము అని తాత్పర్యము.

స్వోచ్చస్థిత శ్శుభఫలం ప్రకరోతి పూర్ణం
నీచర్క్షగ స్తు విఫలం రిపుమందిరేల్పం,
పాదంశుభస్య హితభే స్వగృహే తదర్ధం
పాదత్రయం గగనగఃస్థితవాం స్త్రికోణేః 25

ఉచ్చయందున్నగ్రహము పూర్ణఫలము నిచ్చును. త్రికోణమందున్న త్రిపాద ఫలము నిచ్చును స్వక్షేత్రమందున్న అర్థశుభఫలము నిచ్చును మిత్రాలయమందున్న పాదశుభఫలము నిచ్చును. శత్రుక్షేత్రక్షేత్ర మందున్న స్వల్పశుభఫలము నిచ్చును. నీచ యందుండెనేని శుభము నివ్వఁడని తాత్పర్యము

నీచర్క్షగ స్సకలమేవ కరోతి పాపం
న్యూనంచ కించి దరిభే విఫలం స్వతుంగే,
పాదత్రయం హితగృహే విహగో శుభస్య
స్వక్షేదళంచ చరణం స్థితవాం స్త్రికోణే. 26

నీచయందున్నగ్రహము సంపూర్ణపాపఫలము నిచ్చును. శత్రుక్షేత్రమందున్న స్వల్పశుభమును (అనఁగా. త్రిపాదాధికపాపఫలమును), ఉచ్చయందున్న సంపూర్ణశుభ మును (పాపము లేదనుట), మిత్రక్షేత్రమందున్న త్రిపాదపాపఫలమును, స్వక్షేత్ర మందున్న అర్ధ పాపఫలమును, త్రికోణమందున్న పాదపాపఫలమును ఇచ్చునని తాత్పర్యము.

ఔత్పాతికా స్సవితృలుప్తకరా విరూక్షా
నీచంగతా రిపుగృహాంచ నభశ్చరేంద్రాః,
యుద్ధే జితా శ్శుభఫలాని వినాశయంతి
పాపాని యాని సుతరాం పరివర్ధయంతి. 27

గ్రహములు గ్రహణాద్యుత్పాదయుక్తులైనను, అస్తంగతులైనను, నీచక్షేత్ర శత్రుక్షేత్రములను పొందినను, యుద్ధమందు పరాజితులైనను శుభము నివ్వరు. పాప ఫలముల నిత్తురని తాత్పర్యము.

పైనిజెప్పిన స్థానాదిబలములను ఫలములను జెప్పుచున్నాఁడు —

ఉచ్చబలేన సమేతః పరాం విభూతిం గ్రహః ప్రసాధయతి,
పుంసా మథ సాచివ్యం త్రికోణబలవా న్బలపతిత్వమ్ 28

ఉచ్చబలముతోఁ గూడిన గ్రహము అఖండైశ్వర్యమును, త్రికోణస్థానబలముతోఁ గూడిన గ్రహము, మంత్రిత్వమును, సేనాధీశత్వము నిచ్చునని తాత్పర్యము.

స్వర్క్ష బలేన చ సహితః ప్రముదితధనధాన్యసంపదాక్రాంతం,
మిత్రబలేన చ యుక్తో జనయతి కీర్త్యన్వితం పురుషమ్ 29
తేజస్వినమతిసుభగం సుస్థిరవిభవం నృపాచ్చ లబ్ధధనం,
నిజహోరాబలయుక్తో జనయతి విక్రాంత మతిచింత్యమ్. 30

స్వక్షేత్రబలముతోఁ గూడినగ్రహము, సమృద్ధమైనధనధాన్యసంపదను, మిత్ర క్షేత్రబలయుక్తమయిన గ్రహము, కీర్తిని, తేజస్సును, సౌభాగ్యమును, శాశ్వతవైభవమును, రాజానుగ్రహలబ్ధధనమును, హోరాబలయుక్తగ్రహము, అధికపరాక్రమము నిత్తురని తాత్పర్యము.

స్వద్రేక్కాణబలేనాహీనో గుణభాజనం గ్రహఃకురుతే,
స్వనవాంశకబలయుక్తః కరోతి పురుషం ప్రసిద్ధం చ 31

స్వద్రేక్కాణబలముతోఁ గూడిన గ్రహము జాతకుని; సద్గుణసంపన్నునిగను, స్వనవాంశబలయుక్తగ్రహము, ప్రసిద్ధునిగను జేయునని తాత్పర్యము.

సప్తాంశకబలసహితః సాహసికం విత్తకీర్త్యాఢ్యం
ద్వాదశాంశబలసమేతః కర్మరతః పరోపకారకం చైవ. 32
త్రింశాంశబలేన తథా వికసత్సౌఖ్యం గుణాన్వితం కుర్యాత్,
శుభదర్శనబలసహితః పురుషం కుర్యా ద్ధనాన్వితం ఖ్యాతమ్ 33
సుభగం ప్రధానమఖిలం సురూపదేహం సుసౌఖ్యం చ,

సప్తాంశ బలయుక్తగ్రహము, సాహసము, ధనము, కీర్తిని, ద్వాదశాంశబలయుక్త గ్రహము, పనులయందాసక్తి, పరోపకారచింతను, త్రింశాంశబలయుక్తగ్రహము, సుఖమును, సద్గుణసంపత్తిని గలుగఁజేయును. శుభదృష్టితోఁగూడినగ్రహము, జాతకుని,

ధనవంతుని, కీర్తిమంతుని, ప్రసిద్ధుని, సురూపవంతుని, సౌఖ్యవంతుని, మంత్రినిఁగాఁ జేయునని తాత్పర్యము.

పుంస్త్రీభవనబలేన చ కరోతి జనపూజితం కలాకుశలం 34
పురుషం ప్రసన్నచిత్తం కల్యం పరలోకభీరుం చ,

పురుషరాశియందు బలయుక్తమైనగ్రహము, జనపూజ్యుని, విద్యానిపుణుని, నిర్మలచిత్తునిగను, స్త్రీరాశియందు బలయుక్తమగు గ్రహము, పరలోక భీరువుగను, శుభునిగనుఁ జేయునని తాత్పర్యము.

స్థానబలేన సమేతస్థిరతిసౌఖ్యం సుహృచ్ఛ భాగ్యాఢ్యః. 35
ధీరో నిశ్చలచిత్తః స్వతంత్రకర్తా భవేన్మనుజః,

స్థానబలయుక్తమైన గ్రహము, చిరస్థాయి సౌఖ్యమును, మిత్రక్షేత్రమందున్న గ్రహము, ధైర్యము, స్థిరధనము, స్వతంత్రవృత్తినిఁ గలుగఁజేయును.

ఆశాబలసముపేతో నయతి స్వదిశం నభశ్చరః పురుషం 36
నీత్వా వస్త్రవిభూషణవాహనసౌఖ్యాన్వితం కురుతే,

దిగ్బలముగలగ్రహము తనదశయందు, స్వదిక్కును బొందించి వస్త్రాద్యాభరణములు గలవానిగఁ జేయును.

ఆయనబలసముపేతో దద్యాద్వివిధార్థసంగమం స్వదిశి. 37

ఆయనబలముగల గ్రహము తనదిక్కునందు లాభము గలుగఁజేయును.

క్వచిద్రాజ్యం క్వచిత్పూజ్యం క్వచిద్ద్రవ్యం క్వచిద్యశః,
దదాతి విహగ శ్చిత్రం చేష్టావీర్యసమన్వితః. 38

చేష్టాబలయుక్తగ్రహము, స్వల్పముగ రాజ్యము, పూజ్యతను, ధనమును, కీర్తిని, గలుగఁజేయునని తాత్పర్యము.

వక్రిణస్తు మహావీర్యాశ్శుభా రాజ్యప్రదా గ్రహాః,
పాపా వ్యసనదాః పుంసాం కుర్వంతి చ వృథాటనమ్ 39

బలవంతులై వక్రించిన శుభగ్రహములు అత్యంతశుభము నిచ్చెదరు. పాపగ్రహములు దుఃఖములను గలుగఁజేయుదురని తాత్పర్యము.

స్వస్థశరీరసమాగమసుఖమాహవజయబలేన విదధాతి,
శుభ మఖిలం విహగేంద్రో రాజ్యం చ వినిర్జితారాతిమ్. 40

యుద్ధమున జయమునుఁ బొందినగ్రహములు, శరీరస్వాస్థ్యమును,శత్రువిజయంము, నిష్కంటకరాజ్యమును సకలశుభముల నొసంగుదురని తాత్పర్యము.

రాత్రిదివాబలపూర్ణై ర్భాగజలాభేన శౌర్యపరివృద్ధ్యా,
మలినయతి శత్రుపక్షం భజతి చ లక్ష్మీం నభశ్చరైః పురుషః. 41

జన్మ రాత్రియందాయెనేని రాత్రిబలగ్రహములు, పగటియందైన దివాబల గ్రహములు భూములు గజములు మొదలగువానిని గలుగఁజేయుదురని తాత్పర్యము.

ద్విగుణా ద్విగుణం దద్యుర్వర్షాధిపమాసదివసహోరేశాః,
క్రమపరివృద్ధ్యా సౌఖ్యం స్వదశాసు ధనం చ కీర్తిం చ 42

వర్షమాసదివసహోరాధిపతులు క్రమముగ ఒకరికంటె నొకరు రెండురెట్లు అధిక మైన సౌఖ్యము ధనము కీర్తి మొదలగుఫలముల నిచ్చుచున్నారు. పైని జెప్పిన ఫలము లన్నియుం తమతమదశలయందు సంపూర్ణముగ జరుగునని తాత్పర్యము

పక్షబలాద్రిపునాశం రత్నాంబరహస్తిసంపదం దద్యుః,
స్త్రీకనకభూమిలాభాన్కీర్తిం చ శశాంకకరధవళామ్ 43

పక్షబలముగలగ్రహము శత్రునాశము గజరత్నాదిలాభములను జేయును.

సకలకరభారభరితానిర్మలకిరణజాలభాసురాస్సతతం,
రాజ్యం గ్రహాః ప్రదద్యుస్సౌఖ్యం చ మనోరథాతీతమ్. 44

పూర్ణతేజస్సు గలిగ సూర్యునకు దూరమున నున్నగ్రహము సౌఖ్యము మొద లగువాని నిచ్చును

ఆచారసత్యశుభశౌచయుతాస్సురూపా
స్తేజస్వినః కృతవిదో ద్విజదేవభక్తాః,
స్రగ్వస్త్రగంధజలభూషణసుప్రియాశ్చ
సౌమ్యగ్రహైర్బలయుతైః పురుషా భవంతి 45

శుభగ్రహములు, స్థానాదిబలయుక్తులై యుండిరేని, ఆచారము, సత్యప్రియ త్వము, సురూపము, తేజస్సు, దేవబ్రాహ్మణభక్తిని, పుష్పమాల్య దుకూలాంబర భూష ణాదుల నొసంగుదురని తాత్పర్యము.

లుబ్ధాః కుకర్మనిరతా నిజకార్యనిష్ఠా
స్సాధుద్విషస్సకలహాశ్చ తమోఽభిభూతాః,
క్రూరాస్సదా వధరతా మలినాః కృతఘ్నాః
పాపగ్రహైర్బలయుతైః పిశునాః కురూపాః. 46

పాపగ్రహములు స్థానాదిబలయుక్తులై యుండిరేని లోభ్యము, చెడ్డపనులయం దాసక్తి; స్వకార్యపరత్వము; సత్పురుషులతోడి ద్వేషము; సకలకార్యవినాశనము, ఎల్లప్పుడు వధయందాసక్తి, మాలిన్యము, కృతఘ్నత, కురూపత, పైశున్యము కలుగఁజేయుదురని తాత్పర్యము.

స్వమిత్రక్షేత్రసంస్థానాం గ్రహాణాం బాలసంజ్ఞికా,
స్వత్రికోణగతానాం చ కుమారో నామ సంజ్ఞితః. 47
గ్రహాణాం స్వోచ్చసంస్థానాం యువరాజ ఇతీరితః,
శత్రుక్షేత్రగతానాం చ వృద్ధో నామ తథేరితః. 48
నీచగానాం గ్రహాణాం చ దశామరణసంజ్ఞితా,
తత్తత్ఫలసమాయుక్తా గ్రహాణాంతు దశా భవేత్ 49
బాలైస్సుఖీ సుశీలశ్చ యౌవనై రవనీశ్వరః,
వృద్ధైర్వ్యాధిబుణే వృద్ధి ర్మరణే మరణం వ్యయమ్ 50

మిత్రాలయమందున్న గ్రహదశ బాలసంజ్ఞగలది స్వత్రికోణస్థగ్రహ దశ కుమార సంజ్ఞగలదియు ఉచ్చయందున్న గ్రహదశ యువరాజసంజ్ఞగలదియు శత్రుక్షేత్రమందున్న గ్రహదశ వృద్ధసంజ్ఞగలదియు నీచయందున్న గ్రహదశ మరణసంజ్ఞగలదియు నగును. బాల యనుదశయందు సుఖము మొదలగునవి గలుగును. యౌవ్వన దశయందు రాజ్యాధిపత్యము, వృద్ధదశయందు వ్యాధి, మరణదశయందు మరణము, ద్రవ్యవ్యయము కలుగును.

పుంరాశిగై శ్శుభఖగైర్ధీరా సంగ్రామరక్షిణో బలినః,
నిస్స్నేహాస్సుకఠోరాః క్రూరైః మూర్ఖాశ్చ జాయంతే. 51

శుభగ్రహములు పురుషరాసులయందుండిరేని బుట్టినవారు ధీరులు బలవంతులు నగుదురు. క్రూరగ్రహములు పురుషరాసులయందుండిరేని క్రూరులు మూర్ఖులును అగుదురని తాత్పర్యము.

యువతి భవనస్థితేషు చ మృదవస్సంగ్రామభీరవః పురుషాః,
జలకుసుమవస్త్రనిరతాః సౌమ్యాః కల్యాస్స్వజనహృష్టాః. 52

స్త్రీరాసులయందుఁ బుట్టినపురుషులు; మృదుస్వభావముఁగలవారలు, యుద్ధభీరువులు, దుకూలాంబరపుష్పములయందు ప్రీతిగలవారు, సుకుమారులు స్వజనసంతుష్టులు నగుదురని తాత్పర్యము.

ఇతి పంచమోఽధ్యాయః.

## కారకాదులను దెలుపు ఆరవ యధ్యాయము.

స్వర్క్షత్రికోణతుంగస్థాః యది కేంద్రేషు సంస్థితాః,
అన్యోన్యం కారకాస్తే స్యుః కేంద్రేష్వేవ హారేర్మతమ్. 1

స్వక్షేత్రత్రికోణోచ్చస్థానములను బొంది కేంద్రములయందున్న గ్రహములు పరస్పరము కారకసంజ్ఞకలవారు ఈనియమము కేంద్రములయందే యని వారిమతము.

రవితనయోజ్ఞాకస్థకులీరలగ్నే బృహస్పతిహిమాంశూ,
మేషే కుజో రవియుతః పరస్పరం కారకా ఏతే. 2

కర్కాటము లగ్నమై అందు చంద్రగురువులు తులయందు శని, మేషమందు రవికుజులు పరస్పరము కారకులని తాత్పర్యము.

తుంగసుహృత్స్వగృహాంశే స్థితా గ్రహాః కారకాస్సమాఖ్యాతాః,
మేషూరణే చ రవిరితి విశేషతో వక్తి చాణక్యః. 3

ఉచ్చమిత్రస్వక్షేత్రములను బొందిన గ్రహములు కారకులనియుం దశమమందున్న రవి కారకసంజ్ఞ కలవాఁడని చాణక్యుఁడు చెప్పెను.

లగ్నస్థస్సుఖసంస్థో దశమస్థశ్చాపి కారకాస్సర్వే,
ఏకాదశేఽపి కేచిద్వాంఛంతి న తన్మతం మునీంద్రాణామ్. 4

లగ్నచతుర్థదశమములను బొందిన గ్రహములు కారకసంజ్ఞ కలవారు. ఏకాదశమందున్న గ్రహము కారకుఁడని కొందరిమతము. మునిసమ్మతము గాదు.

నీచకులే సంభూతః కారకవిహాగైః ప్రధానతాం యాతి,
క్షితిపతివంశసముత్థో భవతి నరేంద్రో న సందేహః. 5

జన్మకాలమున గ్రహములన్నియుం కారకులైయున్న శిశువు నీచకులజుఁడైనను మంత్రిగాని తత్తుల్యుఁడుగాని యగును. రాజకులజుఁడాయెనేని రాష్ట్రాధిపతి యగును. సందియములేదు.

కారకవేధో బలవాన్ మూలం యోగేషు కీర్తితో హారిణా,
తస్మాత్ఫలనిర్దేశః కారకభేదాదిభిర్వాచ్యమ్. 6

కారకబలము యోగములకు ప్రధానకారణముగాన కారకభేదాదులను దెలిసుకొని ఫలనిర్దేశము జేయవలయునని ముఖ్యతాత్పర్యము.

ఇతి షష్ఠాధ్యాయః.

---

## కారకవిశేషములను దెలుపు ఏడవ యధ్యాయము

రవిచంద్రభౌమబుధజీవశుక్రసౌరాదినాధిపతయశ్చ,
మాసే చాశ్వయుజాదౌ దినేశ్వరేఽబ్దే దినపతేశ్చ 1

సూర్య, చంద్ర, కుజ, బుధ, గురు, శుక్ర, శనులు వారాధిపతులు. ఆశ్వయుజాదిమాసమునందు దినాధిపతియును, అబ్దాదియందు దినపతియును, మాసాధిప, వర్షాధిపు లగుదురు

అబ్దాధిపాశ్చతుర్థా క్రమేణ షష్ఠస్తు కాలహోరేశాః,
ద్విర్ద్వాదశహోరాస్స్యు ర్దినే త్రింశత్తాంమాసః 2

(మాసాబ్దదినసంఖ్యోక్తం) అనుసౌరసిద్ధాంతప్రశ్నమాధ్యాయ శ్లోకప్రకారము రాబడిన వత్సరాధిపతివల్లనుండి నాల్గవగ్రహము రెండవవత్సరాధిపతి యగును. ఆరవ గ్రహము హోరాధిపతి యగును. (అనఁగా ప్రథమహోరాధిపతి రవి అయినయెడల రెండవహోరాధిపతి శుక్రుడనుట) దినమునకు ఇరువదినాల్గుహోరలు. ముప్పదిదినము లొకమాసము.

మాసా స్త్రింశద్గుణితా గతైర్దినైస్సప్తభాజితా దివసాః,
అబ్దాధిపాత్ప్రగణ్యాగతే దినాద్యః ప్రగణ్యేః 3

చైత్రాదిగతమాసములను 30 చే గుణించి గతదినములు కలిపి 7 చే భాగించగా శేషము అబ్దాధిపతివల్లనుంచి లెక్కపెట్ట గతదినాధిపతి యగును. ఈలాగె యిు సరకాడు.

ఏకత్రింశద్భాగైర్యుక్తా శ్చైత్రాదీనాం గ్రహాదినానాం,
క్రమశో విజ్ఞాతవ్యా శుక్లప్రతిపత్ప్రసంఖ్యాస్స్యుః 4

ముప్పదియొక్క భాగములతోఁ గూడిన; చైత్రాదిమాసముల యొక్కయుం, సూర్యాదిగ్రహములయొక్కయుం సంఖ్య, ఆయామాసంఖ్యలచే భాగహరింపఁబడిన శుక్ల ప్రతిపదాదిసంఖ్యయని క్రమముగఁ దెలియఁదగినవి.

యస్య గ్రహస్య భావో యస్తస్య గ్రహో ప్రశస్యతే తస్మిం,
తస్మింశ్చోపచయస్థే తస్మిన్ లగ్నే గ్రహో చాస్య 5

ఏగ్రహముయొక్క కారకమునకు సంబంధించిన కర్మ, ఆగ్రహదివసమునందు ప్రాశస్త్యము. ఆలగ్నమున కాగ్రహము ఉపచయస్థానమందుండగా మిగుల శుభప్రదముగ నుండునని తాత్పర్యము.

తత్కర్మగ్రహదివసే తదేవ హోరాబ్దమాసకాలేషు,
పాదవివృద్ధ్యా వా స్యాత్తేషాం కాలస్య సంపాకః 6

ఆయా గ్రహకారకత్వవిల కర్మ ఆయా గ్రహదివసము నందుఁ గావింపవలయును. ఆకర్మయే హోరాధిప, అబ్దాధిప, మాసాధిపక లములయందుఁ గావింపఁబడెనేని, పాదాధికవృద్ధితో నాకర్మ ఫలించు నని తాత్పర్యము.

సవ్యాలోర్ణకశైలస్వర్ణశస్త్రవిషవిపానభేషజనృపాప్సు,
మ్లేచ్ఛాబ్ధితారకాం తానకాష్టమంత్రప్రభుస్సూర్యః 7

సవ్యాలము, రోమరాశి, శస్త్రము, పర్వతము, బంగారము, ఆయుధము విషము, అగ్ని, భైషజ్యము, రాచతనము, మ్లేచ్ఛులు, సముద్రపుదరి మంత్రము, లోనగువానికి సూర్యుఁ డధిపతియని తాత్పర్యము.

కవికుసుమభోజ్యమణిరజతశంఖలవణోదకేషు వస్త్రాణాం,
భూషణనారీఘృతకుజస్తైలజలజ నిద్రాప్రభుశ్చంద్రః 8

కవిత్వము, పుష్పములు, భోజ్యపదార్థము, మణులు, వెండి, శంఖము, ఆభరణములు, స్త్రీలు, ద్రవద్రవ్యము, స్నేహపదార్థము, నిద్ర, వీనికి చంద్రుఁ డధిపతి యని తాత్పర్యము.

రక్తోత్పలతామ్రసువర్ణరుధిరపారదమనశ్శిలాద్యానాం,
క్షితినృపతితనయమూర్ఖాపైత్తకచోరప్రభుర్భౌమః. 9

ఎఱ్ఱకలువ, రాగి, బంగారము, రక్తము, పాదరసము, మనశ్శిల (ధాతువు) భూమి, రాజు, మూర్ఖ, పైత్యము, చోరులు వీనికధిపతి కుజుఁడని తాత్పర్యము.

శ్రుతలిఖితశిల్పచైత్యకనైపుణమంత్రిత్వదూతహాస్యానాం,
ఖగయుగ్మఖ్యాతివనస్పతిస్వర్ణమయప్రభుర్బుధః. 10

వినుట, వ్రాయుట, శిల్పము, నిపుణత్వము, మంత్రిత్వము, దౌత్యము, హాస్యము, పక్షిమిథునము, ఖ్యాతి, వనస్పతి, బంగారము వీనికి బుధుఁ డధిపతి.

మాంగల్యధర్మపౌష్టికమహత్వశిక్షానియోగపురరాష్ట్రం,
యానాసనశయనసువర్ణధాన్యపుత్రప్రభుస్సూర్యః. 11

ధర్మము, పుష్టిఫలకమైనకర్మలు, శుభము, మహిమ, శిక్షల విధింపఁజేయుట, పురరాష్ట్రపాలనము, వాహనము, ఆసనము, పర్యంకము, సువర్ణము, ధాన్యము, పుత్రులు, వీనికి గురుఁ డధిపతియని తెలియఁదగినది;

వస్త్రమణిరత్నభూషణవివాహగంధేష్టమాల్యయువతీనాం,
గోమయనిధానవిద్యాధనశుక్తిరజితప్రభుశ్శుక్రః. 12

వస్త్రములు, మణులు, ఆభరణములు, వివాహము, సుగంధద్రవ్యము, పుష్పమాలికలు, యౌవనవతులు, నిధులు, గోధనము, మౌక్తికములు, రజితము వీనికి శుక్రుఁ డధిపతి.

త్రపుసీసకాలలోహకకుధాన్యమృతబంధభృతకానాం,
నీచస్త్రీపణ్యకదాసవృద్ధజనదీక్షాప్రభు స్సౌరిః. 13

ఇనుము, సీసము, తగరము, కుధాన్యములు, మృతులు, చెఱసాల, బంధము, సేవకులు, నీచస్త్రీలు, వేశ్యలు, దాసీజనము, వడ్డీవ్యాపారము, పట్టుదల, వృద్ధులు, వీనికి శని అధిపతియని తెలియఁదగినది.

అర్కః కళింగవిషయే యవనేషు చ చంద్రమాః,
శుక్రస్సమతటే జాతస్సైంధవేషు బృహస్పతిః. 14
మగధేషు బుధో జాతస్సౌరాష్ట్రేషు శనైశ్చరః,
అంగారక స్త్వుజ్జయిన్యాం రాహుః కేతుశ్చ ద్రావిడే. 15

సూర్యుఁడు కళింగదేశాధిపతి. చంద్రుఁడు యవనదేశాధిపతి. శుక్రుఁడు సమతటదేశాధిపతి. శని సౌరాష్ట్రదేశాధిపతి. బుధుఁడు మగధదేశాధిపతి. గురుఁడు సైంధవదేశాధిపతి. కుజుఁడు ఉజ్జయిని ప్రభువు. రాహుకేతువులు ద్రవిడదేశాధిపతులు. ఈప్రకారము తెలియవలయును.

ఇతి సప్తమాధ్యాయః.

---

## ఎనిమిదవ యధ్యాయము.

రాశ్యాదిఫలవిభాగః కస్యవిధేయో వినా సముత్పత్తేః,
ఆధాన మతో వక్ష్యే కారణభూతం సమస్తజంతూనామ్. 1

సమస్తజంతువులకు కారణభూతమైన గర్భాధానకాలము లేకుండా రాశ్యాది ఫలవిచారణ కలుగదు; గాన, అట్టికాలజ్ఞానము జెప్పఁబోవుచున్నాను

అనుపచయరాశిసంస్థే కుముదాకరబాంధవే రుధిరదృష్టే,
ప్రతిమాసం యువతీనాం భవతీహ రజో బ్రువంత్యేకే. 2

యౌవనస్త్రీయొక్క జన్మరాశి మొదలు చంద్రుఁడు అనుపచయములగు ౧, ౨, ౪, ౫, ౭, ౮, ౯, ౧౨ స్థానములందుండి కుజునిచేఁ జూడఁబడెనేని రజోదర్శనము గలుగునని కొందరియభిప్రాయము.

ఇందుర్జలం కుజోఽగ్నిర్జలమసృక్ త్వగ్నిరేవ పిత్తంస్యాత్,
ఏవం రక్తే క్షుభితే పిత్తేన రజః ప్రవర్తతే స్త్రీషు. 3
ఏవం యద్భవతి రజో గర్భస్య నిమిత్తమేవ కథితం తత్,
ఉపచయసంస్థే విపులం ప్రతిమాసం దర్శనం తస్య. 4

చంద్రుఁడు జలము. కుజుఁడు అగ్ని. జలమనఁగా రక్తము. అగ్ని యనఁగా పిత్తము ఈపిత్తముచే రక్తము క్షోభించగా స్త్రీలకు రజఃప్రవృత్తి కలుగును. పూర్వము చెప్పినప్రకార మనఁగా, చంద్రుఁడు అనుపచయరాసులయందుండి కుజునిచేఁ జూడఁబడఁగా గలుగు రజోదర్శనము గర్భధారణకు యుక్తమైనదగును. స్త్రీజన్మరాశికి చంద్రుఁడు ఉపచయస్థానమందుండి కుజునిచేఁ జూడఁబడఁగా ప్రతిమాసము ఆర్తవము కలుగును. ఇట్టిఆర్తవము గర్భధారణకు సమర్థమైనది కాదు.

పూర్వము చెప్పినరీతిని యార్తవమును గర్భధారణకు తగినదానినిగా తెలుసుకొని, తరువాత స్త్రీపురుషసంయోగసంభవాసంభవములను జెప్పుచున్నాఁడు.

ఉపచయభవనే శశభృద్దృష్టో గురుణా సుహృద్భిరథవాసౌ,
పుంసా కరోతి యోగం విశేషతశ్శుక్రసందృష్టః 5
చంద్రే కుజేన దృష్టే పుష్పవతీసహ విటేన సంయోగం,
రాజపురుషేణ రవిణా రవిజే నాప్నోతి భృత్యేన 6

పురుషుని జన్మరాశికి ఉపచయస్థానములందు 3, ౬, ౧౦, ౧౧ చంద్రుఁడుండి గురునిచేగాని మిత్రులచేగాని జూడఁబడెనేని స్త్రీపురుషసంయోగము కలుగును. శుక్రునిచేతను గూడ జూడఁబడెనేని మిక్కిలి ప్రియముగ గలుగును. పూర్వోక్తస్థానములందుండు చంద్రుఁడు. కుజునిచేఁ జూడఁబడెనేని. విటునితోను, సూర్యునిచేఁ జూడఁబడెనేని రాజపురుషునితోను, శనిచే జూడఁబడెనేని భృత్యునితోను సంయోగము కలుగును. (అనఁగా: ఆయా రాజపురుషాదిచేష్టలతో భర్తతోటియె సంయోగము కలుగునని ముఖ్యతాత్పర్యము. అట్లు కానిచో పతివ్రతలు పరపురుషులసంపర్క మెఱుఁగరుగాన ఆయాచేష్టలుగల భర్తతో ననియే తాత్పర్యము.

ఏకైకేన ఫలం స్యాద్దృష్టో నాన్యైః కుజాదిభిః పాపైః,
సర్వైస్స్వగృహం త్యక్త్వా గచ్ఛతి వేశ్యాపదం యువతీ. 7

ఉపచయస్థానమందుండు చంద్రుఁడు పాపగ్రహము లందరిచేతను జూడఁబడె నేని స్త్రీ నిర్లజ్జకలదై భర్తతో విహరించునని ముఖ్యతాత్పర్యము. ఇందుకు ప్రమాణము హోరారత్నమునందు "గచ్ఛతి వేశ్యాపదం యువతీ" యనువాక్యము నిర్లజ్జత్వద్యోతకమని యున్నది.

ద్విపదాదయో విలగ్నాత్సురతం కుర్వంతి సప్తమే యద్వత్,
తద్వత్స్త్రీపురుషాణాం గర్భాధానే సమాదేశ్యమ్. 8

గర్భాధానలగ్నముకు సప్తమరాశి సంజ్ఞగలజంతువు. ఏప్రకారము మిథునకర్మ చేయునో ఆప్రకారము మైథునము కలుగునని తాత్పర్యము.

అస్తే శుభయుతదృష్టే సరోషకలహం భవేద్గ్రామ్యం,
సౌమ్యం సౌమ్యైస్సురతం వాత్స్యాయనసంప్రయోగకాఖ్యాతమ్ 9

ఆధానలగ్నముకు సప్తమస్థానము పాపగ్రహములచే కూడినను జూడఁబడినను మైథునము రోషావిష్టమగును. శుభగ్రహములచేఁ జూడఁబడినను కూడఁబడినను హాసవిలాసాదులు కలది యగునని తాత్పర్యము.

తత్ర శుభాశుభమిశ్రైః కర్మభిరధివాసితా విషయవృత్తిః,
గర్భాధానే నిపతతి సంయోగే శుక్రశోణితయోః. 10

మైథునకాలమున ఇంద్రియవ్యాపారము శుభాశుభకర్మలతో కూడుకొనియుండి శుక్రశోణితములసంయోగమున నుత్పత్తికి కారణమై గర్భమందు పడును. (చింత్యము)

ఉపచయగౌరవిశుక్రౌ బలినౌ పుంసః స్వమంశకం ప్రాప్తౌ,
యువతేర్వా కుజచంద్రౌ యదా తదా గర్భసంభవో భవతి. 11

ఆధానలగ్నమునకు బలవంతులైన రవిశుక్రులు ఉపచయస్థానములయందుండి స్వాంశలను పొందిరేని పురుషజన్మ కలుగును. ఉపచయస్థానములందున్న చంద్రకుజులు బలవంతులై స్వాంశలను పొందిరేని స్త్రీజన్మ కలుగునని తాత్పర్యము.

శుక్రార్కభౌమశశిభిస్స్వాంశోపచయే స్థితైస్సురేడ్యే వా,
ధర్మోదయాత్మజస్థే బలవతి గర్భస్య సంభవో భవతి. 12

ఆధానలగ్నమునకు రవిచంద్రకుజశుక్రులు స్వాంశలను పొందినను లేక బలవంతుఁడై గురువు లగ్న పంచమ నవమములయం దుండెనేని గర్భధారణ కలుగును.

మిథునస్య మనోభావో యాదృఙ్మదలాలసం భవతి,
శ్లేష్మాదిభిస్స్వదోషైస్తత్తుల్యగుణో నిషిక్తస్స్యాత్. 13

సురతకాలమున స్త్రీపురుషులు శ్లేష్మాదిగుణములచే శుక్లశోణితము లేగుణములు కలిగియుండునో కోరికె లెట్లుండునో గర్భస్థశిశువు అట్టిగుణములు కలవాఁడగును.

విషమే విషమాంశగతా హోరాశశిజీవభాస్కరా బలినః,
కుర్వంతి జన్మ పుంసాం సమే సమాంశే చ యువతీనామ్. 14
ఓజర్క్షే గురుసూర్యౌ బలినౌ పుంసః సమే సితేందుకుజాః,
కన్యానాం జన్మకరా గర్భాధానే స్థితా బలినః. 15

లగ్నము రవిచంద్రుఁడు గురువు వీరలు బలవంతులై విషమరాసులగు మేషము, మిథునము, సింహము మొదలగు రాసులయందుండిరేనియు లేక విషమాంశలయందున్నను పురుషజన్మ గలుగును. సమరాశియందుగాని లేక సమాంశలయందుగాని యుండిరేని స్త్రీజన్మ కలుగును. మరియు బలవంతులై రవికుజులు ఓజరాశియందుండిరేని పురుషజన్మ. చంద్రకుజశుక్రులు సమరాశియందుండిరేని స్త్రీజన్మ కలుగును.

మిథునే చాపేఽర్కగురూ బుధదృష్టౌ దారకద్వయం కురుతః,
స్త్రీయుగ్మం కన్యాయాం సితశశిభౌమాఝషే చ బుధదృష్టాః 16

రవిగురువులు ధనుర్మిథునములలో నొకచోట నుండి బుధునిచేఁ జూడఁబడిరేని యమళపురుషులు కలుగుదురు చంద్రకుజశుక్రులు కన్యామీనములలో నొకచోట నుండి బుధునిచేఁ జూడఁబడిరేని యమళస్త్రీలు కలుగుదురు.

లగ్నం ముక్త్వా విషమే శనైశ్చరః పురుషజన్మదో భవతి,
యోగే విహగస్య బలం సంవీక్ష్య వదేన్నరం స్త్రియం వాపి. 17
అన్యోన్యం రవిచంద్రౌ విషమర్క్షగతౌ నిరీక్షేతే,
ఇందుజరవిపుత్రౌవా దృష్టౌ బలినౌ నపుంసకం కురుతః. 18
పశ్యతి వక్రస్సమభే సూర్యం చంద్రోదయౌ చ విషమర్క్షే,
యద్యేవం గర్భస్థః క్లీబో మునిభిస్సమాదిష్టః. 19
ఓజసమరాశిసంస్థౌ జ్ఞేందూ షండం కుజేక్షితౌ కురుతః,
నరభే పిషమనవాంశే హోరేందుబుధాస్సితార్కిదృష్టావా. 20

లగ్నముగాక తక్కిన విషమరాసులయందు శని యుండెనేని పురుషజన్మ కలుగును. యోగములవలన గ్రహబలము ననుసరించి స్త్రీపురుషభేదము తెలియఁదగినది. రవిచంద్రులుగాని, బుధశనులుగాని ఒకరినొకరు విషమరాశియందుండి చూచుకొనిరేని నపుంసకజన్మ కలుగును. సమరాశినిపొందిన రవినిగాని, విషమరాసులనుపొందిన లగ్నచంద్ర

లనుగాని కుజుఁడు జూచెనేని నపుంసకుఁడు గలుగును. మఱియు బుధుఁడు ఓజరాశియం దుండి చంద్రుఁడు సమరాశియందుండియు కుజునిచేఁ జూడఁబడెనేని నపుంసకుఁడు గలుగును.

లగ్నే సమరాశిగతే చంద్రే చ నిరీక్షితే బలాఢ్యుతేన,
గగనసదావక్తవ్యం మిథునం గర్భస్థితం నిత్యమ్ 21
సమరాశౌ శశిసితయోర్విషమే గురువక్రసౌమ్యలగ్నేషు,
ద్విశరీరే వా బలిషు ప్రవదేత్త్రీన్పురుషమత్రైవ. 22

లగ్నము చంద్రుఁడు సమరాశినిపొంది బలవంతుఁడైన గ్రహముచేఁ జూడఁబడెనేని గర్భము యమళలుకలది యని తాత్పర్యము. చంద్రశుక్రులు సమరాశియందును, లగ్నము, కుజుఁడు, బుధుఁడు, గురువు వీరలు బలవంతులై విషమరాశియందుగాని లేక ద్విశరీరరాశియందుగాని యుండిరేని గర్భమందు ఒక స్త్రీ ఒక పురుషుఁడు కలరని తాత్పర్యము.

ద్విశరీరాంశకయుక్తాన్గ్రహాన్విలగ్నంచ పశ్యతింసుతే,
మిథునాంశే కన్యేకా ద్వౌ పురుషౌ త్రితయమేవం స్యాత్ 23
మిథునే ధనురంశగతాన్గ్రహాన్విలగ్నంచ పశ్యతింసుతః,
మిథునాంశస్థశ్చ యదా పురుషత్రితయం తదా గర్భే. 24
కన్యామీనాంశస్థాన్గ్రహాగానుదయంచ యువతిభాగగతః,
పశ్యతి శశిరగుతనయః కన్యాత్రితయం తదాతదాగర్భే. 25
ద్విశరీరాంశకయుక్తాన్గ్రహాన్విలగ్నం చ పశ్యతింసుతః,
కన్యాంశే ద్వే కన్యే పురుషశ్చ నిషిచ్యతే గర్భే. 26

గర్భాధానకాలమున ద్విస్వభావరాశ్యంశలగు మిథునకన్యాధనుర్మీనాంశలను పొందిన గ్రహములను లగ్నమును మిథునాంశను పొందినబుధుఁడు జూచెనేని గర్భము ఒకకన్యక ఇద్దరు పురుషులు కలదియనియు, మిథునాంశనుపొందిన బుధుఁడు మిథున రాశియందుండిన ధనురంశను పొందినగ్రహములను లగ్నమును జూచెనేని గర్భమందు ముగ్గురుపురుషులు కలరనియు, కన్యారాశియందుండిన మీనాంశనుపొందిన గ్రహము లను లగ్నమును కన్యాంశనుపొందిన బుధుఁడు జూచెనేని గర్భమందు ముగ్గురుకన్యకలు కలరనియు, ద్విస్వభావరాశ్యంశనుపొందిన గ్రహములను బుధుఁడు కన్యాంశయందుండి జూచెనేని ఇద్దరుకన్యకలు ఒకపురుషుఁడు కలది యగును.

దివసే మాతాపితరౌ శుక్రరవీ శశిశనీ నిశాయాంచ,
మాతృభగినీ పితృవ్యౌ విపర్యయాత్కీర్తితౌ యవనైః 27
లగ్నాద్విషమర్క్షగతాః పితుఃపితృవ్యస్య ఖేచరశ్శస్తః,
మాతృజననీభగిన్యోః స్సమగృహగోన్యథా ఖేషు 28

సూర్యుఁడు విషమరాసులగు మేషమిథునసింహాదులయందున్నవాఁడై ఆధానము పగటియందు అయిన వానితండ్రికిని, రాత్రియందైన వానిపెత్తండ్రి పినతండ్రులకును శుభకరుండగును శుక్రుఁడు సమరాసులగు వృషభకర్కటాదులయందున్నవాఁడై ఆధానము పగటియందైన వానితల్లికిని, రాత్రియందైన వానిపెత్తల్లి పినతల్లులకును శుభకరుం డగును. శని విషమరాశులగు మేషమిథునాదులయందున్నవాఁడై ఆధానము రాత్రియందైన వానితండ్రికిని, పగటియందైన వానిపెత్తండ్రి పినతండ్రులకును శుభకరుండగును. చంద్రుఁడు సమరాసులగువృషభకర్కటాదులయందున్నవాఁడై ఆధానము రాత్రియందైన వానితల్లికిని, పగటియందైన వాని పెత్తల్లి పినతల్లులకును శుభకరుండగును. ఈ చెప్పినగ్రహములు ఉక్తవిపరీతములుగానున్న పితృమాత్రాదులకు అశుభకరంబు లగును. అది ఎట్లనిన, సమరాశిగతుఁడగు సూర్యుఁడు ఆధానాదులు పగటియందైతే తండ్రికిని, రాత్రియందైతే పితృవ్యునికిని అశుభకరుం డగును. విషమరాశిగతుండగు శుక్రుఁడు పగటియందైతే తల్లికిని, రాత్రియందైతే పెత్తల్లి పినతల్లులకును అశుభకరుండగును. సమరాశిగతుండగు శని రాత్రియందైతే తండ్రికిని, పగలైతే పితృవ్యునికిని అశుభకరుం డగును. విషమరాశిగతుండగు చంద్రుఁడు రాత్రియందైతే తల్లికిని, పగటియందైతే పెత్తల్లి పినతల్లులకును అశుభకరుం డగును.

మాసేష్వాధానాదిషు గర్భస్య యథాక్రమేణ జాయంతే,
సప్తసు కలిలాండకశాఖాస్థిత్వగ్రోమచేతనతాః 29
మాసేష్టమేచ తృష్ణాక్షుధావసనమే తథోద్వేగః,
దశమే త్వథసంపూర్ణః పక్వమివ ఫలంపతతి గర్భః. 30
శుక్రారజీవరవిశశిసౌరిబుధవిలగ్నపోడుపాదిత్యాః,
మాసపతయస్స్యురేతైర్గర్భస్య శుభాశుభం చింత్యమ్. 31

ఆధానమాసము మొదలు మొదటిమాసమున శుక్లశోణితములయొక్క బుద్బుదాకారమును, రెండవమాసమున కఠినమైన మాంసపిండ యగును. మూడవమాసమున అవయవాంకురములును, నాలుగవమాసమున ఎముకలును, ఐదవమాసమున చర్మమును, ఆరవమాసమున రోమావిర్భావమును, ఏడవమాసమున జ్ఞానేంద్రియములును, ఎనిమిదవమాసమ్మున

తృష్ణయుం, తొమ్మిదవమాసమున ఆఁకలియుం, పదవమాసమున చలించుటయుం కలుగును. దశమమాసాంతము కాఁగానే వేగమే పక్వమైనఫలమువలె గర్భస్థశిశువుజనించును. ఈపది మాసంబులకును క్రమంబుగ శుక్రకుజగురురవిచంద్రశనిబుధలగ్నాధిపచంద్రసూర్యులు క్రమముగ మాసాధిపతులు. వీరలవలన గర్భముయొక్క శుభాశుభము లూహించవలెను.

ఉత్పాతక్రూరహతే తస్మాత్స్వస్యాధిపే పతతి గర్భః,
లగ్నగృహంవా హేతుర్యోగేశో గర్భపతనస్య 32
అథవానిషేకకాలే విలగ్నసంస్థౌ యదారుధిరమందౌ,
తద్గ్రహగతేథవేందౌ తదీక్షితేవా పతతిగర్భః 33

పూర్వముచెప్పిన మాసాధిపతులు నిషేకకాలమున యుద్ధమందు పరాజయమును పొందినను రాహుకేతూల్కాదులచే పీడితులైనను (అనఁగా సూర్యచంద్రులు పాపగ్రహయుతులైనను రాహుకేతుగ్రస్తులైనను పీడితులని యర్థము) ఆమాసమున గర్భపతనము కలుగును. ఇదిగాక లగ్నమందు కుజశనులున్నను చంద్రుఁడు లగ్నమందుండి కుజశనులలో నెవరిచేతనైనఁ జూడఁబడెనేని గర్భపతనము కలుగును.

హోరేందుయుతైస్సౌమ్యైస్త్రికోణజాయార్థఖాంబుసంస్థైర్వా,
పాపైస్త్రిషడాయగతైస్సుఖితు గర్భో నిరీక్షితే రవిణా 34

లగ్నమునుగాని లేక చంద్రునిగాని శుభగ్రహములు పొందినను, లగ్నమునకుగాని చంద్రునకుఁగాని ౫-౯-౭-౨-౧౦-౪ స్థానములయందు శుభగ్రహములున్నను, పాపులు ౩-౬-౧౧ స్థానములయందున్నను లగ్నముగాని చంద్రుఁడుగాని రవిచేజూడఁబడెనేని గర్భము పుష్టికలిగియుండును.

క్రూరాంతస్థస్సూర్యశ్చంద్రోవాయుగపదేవమరణాయ,
సౌమ్యైరదృష్టమూర్తిర్యువతినాం గర్భసహితానామ్. 35
ఉదయాస్తగతైః పాపైస్సౌమ్యైరనపేక్షితైశ్చ మరణంస్యాత్,
ఉదయస్థితేర్కజేవా క్షీణేందౌభౌమసందృష్టే. 36
వ్యయగేర్కశశినికుజే పాతాళే లోహితే సగర్భాస్త్రీ,
మ్రియతే తస్మిన్నథవా శుక్రే పాపద్వయాంతస్థే. 37

నిషేకకాలమున సూర్యచంద్రులేకరాశియందుండిగాని, లేక భిన్నరాశియందుండిగాని పాపగ్రహమధ్యస్థులై శుభులచే జూడఁబడకయుండిరేని గర్భిణీస్త్రీ మరణ

మును పొందును. పాపగ్రహములు లగ్నసప్తమములను పొంది శుభులచే జూడఁబడక పోయిరేని గర్భిణీస్త్రీ మరణమును పొందును. క్షీణచంద్రుఁడుగాని శనిగాని లగ్నమును పొంది కుజునిచే జూడఁబడినను గర్భిణి మరణమును పొందును సూర్యుఁడు ఆధానలగ్నమునకు వ్యయమందును చంద్రుఁడు లగ్నమందును చతుర్థమందు కుజుఁడును శుక్రుఁడు పాపమధ్యస్థుఁడై యుండెనేని గర్భిణిస్త్రీ మరణము నొందును

చంద్రచతుర్థైః క్రూరై ర్విలగ్నతోవా విపద్యతే గర్భః,
హోరాద్యానేక్షితిజే మ్రియతే గర్భస్సహజనన్యా 38
హిబుకగతే ధరణిసుతే రిష్ఫగతేర్కేఽశుపాకిరేక్షీణే,
గర్భేణసహమ్రియతే పాపగ్రహదర్శనప్రాప్తే 39
లగ్నేరవిసంయుక్తే క్షీణేందౌవా కుజేథవా మ్రియతే,
వ్యయధనసంస్థైః పాపై స్తథైవసౌమ్యగ్రహాదృష్టైః. 40

చంద్రునకుగాని లగ్నమునకుగాని చతుర్థమందు పాపగ్రహము లుండెనేని గర్భస్రావము కలుగును. సప్తమమున కుజుఁడుండెనేని తల్లితోకూడా గర్భము మరణమును పొందును. చతుర్థమందు కుజుఁడును ద్వాదశస్థానమున రవియునుండి చంద్రుఁడు క్షీణుఁడై ఎచటనున్నను పాపులచే జూడఁబడెనేని గర్భముతోకూడా తల్లి మరణమును పొందును లగ్నమందు రవిగాని క్షీణచంద్రుఁడుగాని కుజుఁడుగాని యుండి పాపులచే జూడఁబడెనేని గర్భిణీస్త్రీ మరణమునొందును. ద్వితీయద్వాదశములను పాపులు పొంది శుభులచే జూడఁబడకపోయిరేని గర్భిణిస్త్రీ మరణమును పొందును.

జామిత్రే రవియుక్తే లగ్నగతేవా కుజేనిషిక్తస్య,
గర్భస్యభవతి మరణం శస్త్రచ్ఛేదై స్సహజనన్యా. 41

రవికుజులు ఒకరొకరు లగ్నసప్తమములను పొందిరేని గర్భిణీస్త్రీ శస్త్రకృతమరణమును పొందును.

బలిభి ర్బుధగురుశుక్రై ర్దృష్టే ర్కేణచ వివర్ధతే గర్భః,
మాసాధిపబలతుల్యై స్సైస్సై ర్భావైస్సంయుజ్యతే భావైః. 42

లగ్నము బలవంతులైన బుధగురుశుక్రరవులలో కొందరిచేతఁ జూడఁబడెనేని గర్భము వృద్ధిపొందును. మాసాధిపతి బలము ననుసరించి ఆయాభావములు కలిగియుండును.

మాసితృతీయేస్త్రీణాం దౌహృదకంజాయతే వశ్యం,
మాసాధిపస్వభావై ర్విలగ్న యోగాధిపస్యాన్వత్ 43

స్త్రీలకు గర్భధారణ మొదలు తృతీయమాసమున పూర్వోక్తమాసాధిపతుల స్వభావము ననుసరించి మాసాధిపబలము ననుసరించియు, గర్భాధానలగ్నగతగ్రహగుణముల ననుసరించియు గర్భదౌహృదము జనించును. అనఁగా గర్భిణిస్త్రీలకు తదనుగుణ్యమైన వస్తువయం దభిలాష కలుగును.

నిషేక కాలే చరరాశిగేర్కే గర్భప్రసూతి ర్దశమేచ మాసే,
ఏకాదశేచ స్థిరరాశిసంస్థే స్యా ద్ద్వాదశే మాస్యుభయాశ్రితేచ
గర్భాధానే చరేరాశౌ దశమాసైః ప్రసూయతే,
స్థిరే త్వైకాదశేమాసే ఉభయే ద్వాదశే భవః 45

నిషేక కాలమున సూర్యుఁడు చరరాశియందున్నను, నిషేకలగ్నము చరరాశియైనను, పదియవమాసమున ప్రసూతియని తెలియఁదగినది, సూర్యుఁడు స్థిరరాశియందున్నను, లగ్నము స్థిరరాశియైనను పదునొకొండవమాసమున ప్రసూతియని తెలియఁదగినది. సూర్యుఁడు ద్విశరీరరాశియందున్నను, లగ్నము ద్విశరీరరాశియైనను పండ్రెండవ మాసమున ప్రసూతియని తెలియఁదగినది.

గర్భప్రసవవిధానం తత్కాలవిలగ్నసర్గతశ్చింత్యం,
ఆధానాజ్జన్మర్క్షం దశమం వాంఛంతి కేచిదాచార్యాః 46
ఆధానోదయశశినోః సప్తమభం బాదరాయణో బ్రూతే,
తస్మిన్నైకాంతోయం సర్వేషాం సమ్మతం వక్ష్యే 47
యస్మి న్ద్వాదశభాగే గర్భాధానే స్థితో నిశానాథః,
తత్తుల్యర్క్షే ప్రసవం గర్భస్య సమాదిశే త్ప్రాజ్ఞః. 48

ప్రసవము నిషేక కాలలగ్న మధ్యర్గములు మొదలగుదానిచే నూహింపవలెను. ఆధానలగ్నమునకు దశమరాశి జన్మరాశి యగునని కొందరు. ఆధానలగ్నమునకుగాని, చంద్రలగ్నమునకుగాని సప్తమస్థానము జన్మలగ్నమని కొందరు ఈప్రకారము చెప్పుటవలన సర్వసమ్మతమైన మార్గమును జెప్పఁబోవుచున్నాను నిషేక కాలమున చంద్రుఁడు తానున్న రాశియం దెన్నవద్వాదశాంశయందుండునో మేషాదిగా అన్నవసంఖ్యగల రాశియందు చంద్రుఁడుండఁగా ప్రసూతి యని తెలియఁదగినది.

లగ్నేశనైశ్చరాంశే శనైశ్చరే ద్యూనగేయది నిషేకః,
వర్షత్రయేణ సూతి ర్ద్వాదశభి స్స్యాచ్ఛశిని చైవమ్. 49

ఏలగ్నమందైనను కన్యాంశలగు మకరకుంభాంశలయందు గర్భాధానమై ఆలగ్నమునకు సప్తమమున శని యుండెనేని మూఁడేండ్లకు ప్రసవము కలుగును. ఏలగ్నమందైనను కర్కాటకనవాంశము లగ్నమై ఆలగ్నమునకు సప్తమమున చంద్రుఁ డుండెనేని పండ్రెండేండ్లకు ప్రసవము కలుగును.

తాత్కాలికదివసనిశాసంజ్ఞః సముదేతి రాశిభాగో యః,
యావానుదయస్తావాన్ వాచ్యో దివసస్య రాత్రేర్వా. 50
మునిభాగే దివసనిశో ర్జన్మని లగ్నం వదేద్వ్యక్త్యా,
ఉదయగతాత్ప్రసవస్యాద్దినపక్షముహూర్తమాససంజ్ఞస్స్యాత్. 51

నిషేకలగ్నము పగటిబలము గలది యయ్యెనేని పగలు జన్మయనియుం, రాత్రిబలముగలది యయ్యెనేని రాత్రిజన్మ యనియుఁ జెప్పవలెను. లగ్నమం దెన్నవభాగ గతించునో ఆదివారాత్రులయందు అన్నిఘడియలకు జననము అని తెలియఁదగినది. పగలుగాని రాత్రిగాని లగ్నమం దెన్నవసప్తమాంశ గతించునో అన్నవరాశి జన్మలగ్నమని తెలియఁదగినది. నిషేకకాలలగ్నగతమువల్లనుంచి ప్రసవకాలిక దివస పక్ష మాస ముహూర్తములను ప్రసవముయొక్క గుణవిశేషమును తెలుసుకోవలయును.

ఇత్యాధానం ప్రథమం ప్రసూతికాలం సునిశ్చితం కృత్వా,
జాతకవిహితం చ విధిం విచింతయేత్తత్ర గణితజ్ఞః 52

గణితశాస్త్రవేత్తయైన దైవజ్ఞుఁడు ప్రథమమున ఆధానకాలమును తరువాత ప్రసూతికాలమును నిశ్చయముగా తెలుసుకొని జాతకశాస్త్రఫలములను జెప్పవలెను.

స్యాతాం యద్యాధానే రవిశశినౌ సింహరాశిగౌ లగ్నే,
దృష్టౌ కుజసౌరిభ్యాం జాత్యంధః సంభవతి తత్ర 53
ఆగ్నేయసౌమ్యదృష్టౌ రవిశశినౌ బుద్బుదే క్షణం కురుతః,
నయనవినాశోఽపి యథాతథాధునా సంప్రవక్ష్యామి 54
వ్యయభవనగతశ్చంద్రో వామం చక్షుర్వినాశయతి హీనః,
సూర్యస్తథైవ చాన్యచ్ఛుభదృష్టౌ యాప్యతాం నయతః. 55

నిషేకలగ్నము సింహమై అందు రవిశశులుండి కుజశనిచేఁ జూడఁబడిరేని జాతకుఁడు జాత్యంధుఁడగును. లగ్నమందు రవిచంద్రులుండి శుభపాపులచే మిశ్రముగాఁ జూడఁబడిరేని బుగ్గకండ్లవాఁడగును. క్షీణచంద్రుఁడు వ్యయమందుండి పాపులచేఁ జూడఁబడెనేని ఎడమకన్ను పోవును. రవి యుండి పాపులచేఁ జూడఁబడెనేని కుడికన్ను పోవును. శుభులు చూచిరేని కాలాంతరమున నేత్రబాధ కలుగును.

క్రూరైర్గ్రహసంధిగతైశ్శశినివృషే భౌమసౌరసందృష్టే,
మూకస్సౌమ్యైర్దృష్టే వాచం కాలాంతరే వదతి. 56
క్రూరేషు రాశిసంధిషు శశీ న సౌమ్యైర్నిరీక్షితే చ జడః,
బుధనవమభాగసంస్థౌ శశిభౌమౌ యది సదంతస్స్యాత్. 57

నిషేకకాలమున చంద్రుఁడు వృషభమందుండి చక్రసంధిరాసులగు కర్కాట వృశ్చికమీనాంత్యనవాంశలయందున్న పాపులచేఁ జూడఁబడెనేని మూఁగవాఁడగును. శుభులు జూచిరేని కాలాంతరమున - అనఁగా బహుకాలమునకు మాటలు వచ్చును. క్రూరులు చక్రసంధులయందుండి చంద్రుఁడు శుభులచేఁ జూడఁబడక యుండెనేని చెవిటివాఁడగును. నిషేకకాలమున చంద్రకుజులు బుధనవాంశను పొందిరేని దంతములు కలిగి జనించును.

సౌమ్యే త్రికోణసంస్థే లగ్నాచ్ఛేషగ్రహైర్బలవిహీనైః,
ద్విగుణాస్యపాదహస్తో యోగేఽస్మిన్నాహితో భవతి గర్భః 58

నిషేకలగ్నమునకు పంచమనవమములయందు శుభగ్రహములుండి పాపగ్రహములు బలవిహీనులై యుండిరేని గర్భస్థుఁడు రెండుముఖములు, నాలుగుపాదములు, నాలుగుహస్తములు కలవాఁడగును.

వామనకో మకరాంత్యే లగ్నే రవిచంద్రసౌరిభిర్దృష్టే,
శశిని విలగ్నే కర్కిణి కుజార్కదృష్టేఽథవా కుబ్జః. 59
మీనోదయే చ దృష్టే కుజార్కిశశిభిః పుమాన్ భవతి పంగుః,
వ్యర్థా భవంతి యోగా సౌమ్యగ్రహావీక్షితాస్సర్వే. 60

లగ్నము మకరాంత్యనవాంశమై రవిచంద్రశనులచేఁ జూడఁబడెనేనియుం, కర్కాటకము లగ్నమై అందుండుచంద్రుఁడు కుజరవులచేఁ జూడఁబడెనేని జాతకుఁడు కుబ్జుఁడగును. అనఁగా పొట్టివాఁడని తాత్పర్యము. మీనము అధానలగ్నమై రవిచంద్రకుజులచేఁ జూడఁబడెనేని జాతకుఁడు పంగు అనఁగా కుంటివాఁడగును. పై చెప్పినయోగములు అన్నియుం బలవంతులైన శుభులచేఁ జూడఁబడెనేని వ్యర్థములు.

క్రూరగ్రహాస్త్రికోణే త్రికోణగేజ్ఞే శుభేషు బలవత్సు,
ద్విశిరోంఘ్రిబాహుయుక్తశ్శేషైరబలైర్భవతి గర్భః. 61

నిషేకలగ్నమునకు పంచమనవమములలో నొకచోట పాపగ్రహములుండి శుభులు బలవంతులై పాపులు బలహీనులై యుండిరేని ఆగర్భస్థశిశువు రెండుశిరస్సులుం, నాలుగుకాళ్లు, నాలుగుచేతులుం కలవాఁడగును.

ఇత్యాధానవిధానం ప్రసూతిసమయేఽపి యోజయేద్యోగ్యం,
ఆధానే యన్నోక్తం ప్రసూతివిహితం తదపి చింత్యమ్. 62

ఆధానమునకు చెప్పిన యోగములలో కొన్ని జననమునకుఁ గూడ గ్రహించవచ్చును. సూతికాధ్యాయమందు చెప్పఁబడినదానిని గూడ విషయానుగుణ్యముగ గ్రహించఁదగినది.

ఇతి అష్టమోఽధ్యాయః.

---

## సూతికాధ్యాయం బను తొమ్మిదవ యధ్యాయము.

ఆధానే హి మయోక్తం ప్రసూతికాలస్య నిర్ణయార్థపరం,
తస్మిన్ సుపరిజ్ఞాతే జన్మాధ్యాయం ప్రవక్ష్యామి. 1

పూర్వముచెప్పిన ఆధానాధ్యాయము ప్రసూతికాలజ్ఞానము నిమిత్తమై చెప్పఁబడినది. ప్రసూతికాలము తెలిసినపిమ్మట జన్మాధ్యాయమును జెప్పుచున్నాఁడు.

శీర్షోదయే విలగ్నే మూర్ధ్నా ప్రసవోఽన్యథోదయే చరణైః,
ఉభయోదయే చ హస్తైశ్శుభదృష్టే శోభనోఽన్యథా కష్టః 2

జన్మలగ్నము శీర్షోదయరాసులగు మిథున సింహ కన్యా తులా వృశ్చికములలో నొకటి యయ్యెనేని మొదట శీర్షోదయమగును పృష్ఠోదయరాసులగు మేష వృషభ కర్కాట ధనుస్సులలో నొకటి లగ్నమైనయెడల పాదోదయమగును. మీనము లగ్నమైనయెడల హస్తోదయమగును. జన్మలగ్నమును శుభులు జూచిరేని సుఖముగ ప్రసూతియగును. పాపులు జూచిరేని కష్టముగ ప్రసూతి యగును.

భవనాంశసదృశదేశే ప్రసవో జ్ఞేయస్సదాత్ర యువతీనాం,
మిశ్రగృహాంశే వర్త్మని స్థిరరాశ్యంశే తథాన్యగృహే. 3
స్వగృహనవాంశే లగ్నే స్వగృహేఽన్యస్మిన్ యది ప్రథమహార్మ్యే,
పితృమాతృగ్రహబలతస్తత్తత్స్వజనగృహేషు బలయోగాత్. 4
ప్రాకారతరునదీషు చ సూతిర్నీచాశ్రితైస్సౌమ్యైః,
నేష్యంతే లగ్నేందూ యద్యేకస్థౌ మహాటవ్యామ్. 5

జన్మకాలలగ్నము నవాంశముయొక్క స్వరూపమైన జంతువు ఏప్రదేశమందు సంచరించునో ఆప్రదేశమందు ప్రసవము చెప్పవలయును. లగ్ననవాంశము ద్విస్వభావరాశినవాంశ మైనయెడల మార్గమందు అనఁగా ఆరాశిసంచారప్రదేశమందున్న

మార్గమందును, లగ్ననవాంశము స్థిరరాశినవాంశమైనయెడల అన్యులగృహమందు ప్రసవమని తెలియఁదగినది. వర్గోత్తమాంశమైన యెడల స్వగృహమందును, తక్కిన నవాంశలయందాయెనేని ప్రథమప్రాకారములో ప్రసవమగును. జన్మకాలలగ్నమునకు పితృమాతృగ్రహముల ననుసరించి వారివారిబంధువుల గృహమందు జననము తెలియఁదగినది. జన్మకాలమున శుభులు నీచను పొందిరేని ప్రాకారములలోను వృక్షమూలములయందును నదీప్రాంతములయందును ప్రసవమని తెలియఁదగినది. చంద్రేతరసర్వగ్రహములు ఒకరాశియందుండి జన్మకాలికలగ్నచంద్రులను జూడకుండిరేని మహారణ్యమందు ప్రసవమని తెలియఁదగినది.

సలిలభలగ్నే చంద్రో జలరాశౌ వీక్షితే తథా పూర్ణః,
ప్రసవం సలిలే వింద్యాద్బంధూదయదశమగశ్చ యదా. 6
సౌమ్యైర్లగ్నే పూర్ణే స్వగృహగతే శశిని సలిలసంయూతే,
పాతాళస్థైశ్చ శుభైర్జలజే లగ్నేఽంబుగే గృహే శశిని 7

లగ్నము జలరాశియై పూర్ణచంద్రుఁడు జలరాశియందుండి చూచెనేని ప్రసవము ఉదకసమీపమందనియు, లగ్నము జలరాశియై లగ్నచతుర్థదశమములయందు చంద్రుఁడుండెనేని జలసమీపమందనియుఁ జెప్పవలెను. లగ్నమందు శుభులుండి పూర్ణచంద్రుఁడు స్వక్షేత్రమగు కర్కటమును పొందెనేని జలసమీపమందు జననమగును. శుభులు చతుర్థమందుండి జలరాశి లగ్నమై చంద్రుఁడు జలరాశియందుండెనేని జలసమీపమందు జననమని తెలియఁదగినది.

వృశ్చికకులీరలగ్నే సౌరే చంద్రేక్షితే త్వవటే,
భవతి ప్రసవః స్త్రీణాం వదంతి యవనాస్సహా మణిత్థైః. 8
రవిజే జలజవిలగ్నే క్రీడోద్యానే బుధేక్షితే ప్రసవః,
రవిణా దేవాగారే తథోషరే చైవ చంద్రేణ. 9

కర్కటకవృశ్చికములలో నొకటి లగ్నమై శనియుండి చంద్రునిచేఁ జూడఁబడెనేని అవటమందు (అనఁగా గోతిలో) ప్రసవమగును. జలరాశి లగ్నమై యందు శనియుండి బుధునిచేఁ జూడఁబడెనేని ఉద్యానమందు ప్రసవమగును. సూర్యునిచేఁ జూడఁబడెనేని దేవాలయమందును, చంద్రునిచేఁ జూడఁబడెనేని చవిటిభూమియందును ప్రసవమని తెలియఁదగినది.

ఆరణ్యాభవనలగ్నే గిరివనదుర్గే తథా రవౌ లగ్నే,
రుధిరేక్షితే శ్మశానే శిల్పకనిలయేషు సౌమ్యేన. 10
సూర్యేక్షితే గోనృపదేవవాసే శుక్రేందుజాభ్యాం రమణీయదేశే,
శుక్రేడ్యదృష్టే ద్విజవహ్నిహోత్రే నరోదయేసంప్రవదంతి సూతిమ్.

జన్మలగ్నము అరణ్యారాశియగు సింహమయి యందు శని యుండెనేని పర్వతములు, వనములు మొదలగు స్థలములయందును అందు సూర్యుఁ డుండి కుజునిచేఁ జూడఁబడెనేని శ్మశానమందును, బుధునిచేఁ జూడఁబడెనేని శిల్పగృహమందును జన్మ కలుగును. నరరాసులగు మిథునకన్యాతులాధన్విపూర్వార్ధ కుంభములలో నొకటి లగ్నమై సూర్యునిచేఁ జూడఁబడెనేని గోశాలలు మొదలగు స్థలములయందును, శుక్రచంద్రులు జూచిరేని మనోహరప్రదేశములయందును, బుధశుక్రులు జూచిరేని బ్రాహ్మణగృహమందును ప్రసవమని తెలియఁదగినది.

స్వోచ్చే దశమే జీవే ద్విత్రిచతుర్భూమికే గృహే ప్రసవః,
మందర్క్షాంశే సౌరే చతుర్థదశమస్థితైస్సౌమ్యైః. 12

జన్మలగ్నమునకు దశమస్థానము కర్కాటకమై అందు పరమోచ్చస్థానమందు గురుఁడుండెనేని మేడలయందు ప్రసవము కలుగును. మకరకుంభములలో వర్గోత్తమాంశ లగ్నమై శుభులు చతుర్థదశమములయందుండిరేని కోటలు మొదలుగాఁగలిగిన ప్రదేశములయందు ప్రసవము కలుగునని తెలియవలెను.

ప్ర్యాద్యా రాశీ మేషాత్పూర్వాదిషు సంస్థితా గృహవిభాగే,
కోణేషు ద్విశరీరాలగ్నం తు భవేద్ధితత్ప్రిముఖైః. 13

మేషవృషభములు పూర్వదిగ్రాసులును, మిథునము ఆగ్నేయదిగ్రాశియు, కర్కాటసింహములు దక్షిణదిగ్రాసులును, కన్య నైరుతిదిగ్రాశియు, తులావృశ్చికములు పశ్చిమదిగ్రాసులును, ధనుస్సు వాయవ్యదిగ్రాశియు, మకరకుంభములు ఉత్తరదిగ్రాసులును, మీనము ఈశాన్యదిగ్రాశియు.

దిగ్భాగం శమండలకేంద్రేషు ఖగేషు తచ్ఛాలా,
అథ మృగిహాయిబలవత్వే గృహం ద్విశాలం త్రిశాలం చ. 14

జన్మలగ్నమువల్లనుంచి ఏకేంద్రము ఏకేంద్రముగ్రహములతో కూడుకొని యుండునో ఆదిశగృహము ప్రసూతిగృహమని తెలియఁదగినది. అన్నికేంద్రముల యందును నుండిరేని బలము ననుసరించి తెలియవలయును. ధనుస్సు కేంద్రమై బల

యుక్తముగ నుండెనేని ప్రసూతిగృహము త్రిశాలయనియును, మకరము కేంద్రమై బలయుక్తయుగ నుండెనేని ద్విశాలయనియును జెప్పవలెను.

చిత్రం నవం భృగుసుతే చ దృఢం గురౌ చ
దగ్ధం కుజే దినకరే పరిపూర్ణకాష్ఠం,
చంద్రే నవంచ బహుశిల్పకృతం బుధే చ
జీర్ణం భవేద్గృహమిహోష్ణకరాత్మజే చ. 15

సూర్యాది సప్తగ్రహములలోను శుక్రుఁడు బలవంతుఁడై యుండెనేని సూతికా గృహము నూతనమైనదియు, బహుచిత్రములు కలదియు, గురుఁడు బలవంతుఁడై యుండెనేని గట్టిదియు, కుజుఁడు బలవంతుఁడై యుండెనేని ఒకప్రదేశము కాలినదియు, సూర్యుఁడు బలవంతుఁడై యుండెనేని కఱ్ఱలు మెండుగాఁగలదియు, చంద్రుఁడు బలవంతుఁడై యుండెనేని నూతనమైనదియు, బుధుఁడు బలవంతుఁడై యుండెనేని బహువిధశిల్పులచే రచించఁబడినదియు, శని బలవంతుఁడై యుండెనేని సూతికాగృహము జీర్ణమైనదియు నని తెలియఁదగినది.

వాసగృహే ద్యూనగతాద్ద్వారో దిక్పాలకాచ్చలోపేతాత్,
భవనగ్రహసంయోగైః ప్రతివేశ్మా చింతనీయాః స్యుః. 16

గృహద్వారనిర్ణయమును జెప్పుచున్నాఁడు:—సప్తమకేంద్రమును బొందిన గ్రహములలో నెవఁడు బలవంతుఁడో ఆగ్రహము ఏదిక్కున కధిపతియో ఆదిక్కున ద్వారమని తెలియఁదగినది. సప్తమకేంద్రమందు గ్రహము లేనియెడల గ్రంథాంతరమందుఁ జెప్పినరీతిని ఏకేంద్రమందుండు గ్రహము బలవంతుఁడో ఆగ్రహము ఏదిగధిపతియో ఆదిశను ద్వారమని తెలియఁదగినది. కేంద్రములయందు జెచ్చట లేనియెడల సప్తగ్రహములలో నెవఁడు బలవంతుఁడో ఆగ్రహము ఏదిగధిపతియో ఆదిశను ద్వారమని తెలియఁదగినది. లగ్నమందు నెన్నిగ్రహములుండునో చుట్టుప్రక్కల నన్నియిం డ్లున్నవని తెలియవలయును.

దేవాలయాంబుపావకకోశవిహారాస్తథోత్కరో భూమేః,
నిద్రాగృహం చ భాస్కరశశికుజగురుభార్గవార్కి బుధయోగాత్.

సూర్యుఁడు అందరిలోను బలవంతుఁడై లగ్నమందుండెనేని దేవాలయమందును, చంద్రుఁడు బలవంతుఁడై లగ్నమందుండెనేని ఉదకసమీపమందును, కుజుఁడు బలవంతుఁడై లగ్నమందుండెనేని వంటశాలయందును, గురుఁడు బలవంతుఁడై లగ్నమందుండెనేని ధనాగారమందును, శుక్రుఁడు బలవంతుఁడై లగ్నమందుండెనేని విహారస్థాన

మందును, శని బలవంతుఁడై లగ్నమందుండెనేని భూమియొక్క వెంటలఁబోయుం స్థలమందునను, బుధుఁడు బలవంతుఁడై లగ్నమందుండెనేని నిద్రాగృహమందునను ప్రసవమని తెలియఁదగినది.

ఖట్వాస్థితిర్భవనవద్యుతవిహగసమాని తత్ర చిహ్నాని,
ఆస్తరణాని చ వింద్యాచ్ఛుభదృష్టికృతాని దైవజ్ఞః 18
ప్రాచ్యాదిగృహద్వితయం భద్వితయం రాశయశ్చ గాత్రాణి,
ఆజానుశిరశ్శయనం గ్రహతుల్యం లక్షణం తత్ర. 19
గ్రహయుక్తం వా నియతం వినతత్వం చ ద్విమూర్తిరాశిషు చ,
షట్త్రినవాంత్యాః పాదాః పర్యంకేంగాని రాశయశ్శేషాః 20

మంచముయొక్క స్థితి గృహమునకుఁ జెప్పినరీతినే తెలుసుకొనవలయును. ౩, ౬, ౯, ౧౨ స్థానములు మంచముయొక్క పాదములు. తక్కినవి మంచముయొక్క అవయవములు. ఈయవయవరాసులయం దున్న గ్రహముల ననుసరించి మంచమందుండు ఆస్తరణాదులను తెలుసుకొనవలయును ఎట్లన. ఏరాశి ప్రసవలగ్నమగునో ఆరాశి దిక్కును మంచముయొక్క శిరోభాగంబుగా నేర్పఱచి ఆలగ్నము మొదలుకొని తృతీయరాశి మంచపూర్వపాదంబులలో దక్షిణపాదంబును, ద్వాదశరాశి వామపాదంబును, మంచపశ్చిమపాదంబులలో షష్ఠరాశి దక్షిణపాదంబును, నవమరాశి వామపాదంబును, లగ్నద్వితీయములు మంచశిరోభాగంబును, చతుర్థపంచమములు మంచదక్షిణభాగంబును, సప్తమాష్టమములు పాదాంతభాగంబును, దశమైకాదశములు, వామాంగంబును ఈప్రకారము మంచమందును పాదములయందును విభజించవలయును. ఇట్లే బృహజ్జాతకమందు భట్టోత్పలుఁడు వ్రాసియున్నాఁడు. ఇందుకు ప్రయోజనం బేమనిన: మంచముయొక్క ఏభాగమందు ద్విస్వభావరాసులుండునో ఆభాగమందు మంచము వంగియుండుననియు, ఏభాగమందు పాపగ్రహము లుంచున్నవో ఆభాగమందు మంచమునకు తత్తుల్యోపఘాతము గలిగియుండునని తెలియుట. అయితే ద్విస్వభావరాసులు శుభగ్రహయుక్తలైగాని శుభగ్రహదృష్టలైగాని యుండెనేని తదుక్త మంచభాగమందు వంగియుండుననియు, పాపగ్రహములు స్వోచ్చత్రికోణస్వక్షేత్రమిత్రక్షేత్రాదిస్థానములయందుండెనేని తత్తుల్యోపఘాతము కలిగియుండుననియుఁ జెప్పవలయును.

నీచస్థే భూశయనం చంద్రేఒప్యథవా సుఖే విలగ్నే వా,
శశిలగ్న వివరయుక్తగ్రహతుల్యా సూతికాః జ్ఞేయాః. 21

అనుదితచక్రార్ధయుతై రంతర్బహిరన్యథా వదంత్యేకే,
లక్షణరూపవిభూషణయోగాస్తాసాం శుభైర్యోగాత్. 22
క్రూరైర్విరూపదేహా లక్షణహీనాస్సురౌద్రమలినాశ్చ,
మిశ్రైర్మధ్యమరూపాబలసహితైస్సర్వమేవమవధార్యమ్ 23

చంద్రుఁడు నీచస్థుఁడై లగ్నమందుగాని లేక చతుర్థమందుగాని యుండెనేని శయనము భూమియందని తెలియఁదగినది. లగ్నచంద్రులమధ్యయం దెన్నిగ్రహము లుండునో అందఱు సూతిక యుపచారములనిమిత్త మున్న ఉపసూతికలని తెలియవలయును. అదృశ్యచక్రార్ధమం దెన్నిగ్రహములుండునో అందరుస్త్రీలు సూతికా గృహములోపల నుందురనియు, దృశ్యచక్రార్ధమం దెన్నిగ్రహము లుండునో అన్ని సంఖ్యగలస్త్రీలు సూతికాగృహబాహ్యప్రదేశమందు నుందురని తెలియవలయును. పై చెప్పిన చక్రార్ధమందు శుభులెందరో అందరు పుణ్యస్త్రీలు. క్రూరులెందరో అందరు విధవస్త్రీలనియును జెప్పవలెను. క్రూరసౌమ్యులు కలిసియుండిరేని మధ్యమరూపము కలవారనియును పైయోగములన్నియుం గ్రహములబలము ననుసరించి చెప్పవలయును.

ద్వాదశభాగచ్ఛన్నే వాసగృహేఽవస్థితే సహస్రాంశౌ,
దీపశ్చరస్థిరాదిషు తథైవ వాచ్యః ప్రసవకాలే. 24

సూతికాగృహము పండ్రెండుభాగములుగా విభజించి మేషము మొదలుగా గణన చేయఁగా సూర్యుఁడున్నరాశి యేదిక్కు కలదో ఆదిశను దీపముండును.

యావల్లగ్నాదుదితం వర్తిర్దగ్ధా తు తావతీ భవతి,
దీపః పూర్ణే పూర్ణశ్శశిని క్షీణే క్షయస్తు తైలస్య. 25

జన్మలగ్న ప్రారంభమం దాయెనేని వత్తి అప్పుడే వేయఁబడినదనియు, లగ్న మధ్యమ మాయెనేని అర్ధము దగ్ధమైనదనియు, లగ్నాంతమాయెనేని వత్తిఅంతయు దగ్ధమైనదనియు, చంద్రుఁడు పూర్ణుఁడుగ నుండెనేని దీపములో తైల మప్పుడే వేయఁబడినదనియు, చంద్రుఁడు క్షీణుఁడుగ నుండెనేని దీపములో తైలము క్షీణించినదనియు తాత్పర్యము అట్లే చంద్రుని ననుసరించి దీపముయొక్క న్యూనాధికతను తెలిసికొనవలయును.

బలవతి సూర్యేదృష్టే బహూనాం ప్రదీపానాం వదేత్కుపుత్రేణ,
అన్యైరపి గతవీర్యై స్సూతౌ జ్యోతిస్తృణైర్భవతి. 26

సూర్యుఁడు బలవంతుఁడై కుజునిచేఁ జూడఁబడెనేని సూతికాగృహమం దనేక దీపములుండును. బలహీనులైన ఇతరగ్రహములచేఁ జూడఁబడెనేని తృణాదులచే ప్రకాశముండునని చెప్పఁదగినది.

సౌరాంశేఽథ జలాంశే చంద్రేఽర్కజసంయుతేథవా హిబుకే,
తద్దృష్టేవా తమస్యాం తమసి ప్రసవం న సందేహః. 27

చంద్రుఁడు శనియంశయందుగాని జలరాశ్యంశయందుగాని యుండి శనిచేఁ జూడఁబడిగాని లేక కూడఁబడిగాని యుండెనేనియు, చంద్రుఁడు చతుర్థమందుండి శనిచేఁ జూడఁబడిగాని కూడఁబడిగాని యుండెనేని అంధకారమందు ప్రసవమని తెలియఁదగినది.

హోరామనీక్షమాణే శశినిపరోక్షస్థితే పితరి జాతః,
మేషూరణాగతేవా చరభే భానౌ విదేశగతే. 28

చంద్రుఁడు బలయుక్తుఁడై లగ్నమును జూడకయుండెనేని తండ్రి గ్రామాంతరమందుండఁగా జననమని తెలియఁదగినది రవి బలవంతుఁడై దశమస్థానమును పొందినను, లేక చరరాశిని పొందినను తండ్రి విదేశమందుండఁగా జననమని తెలియఁదగినది.

ద్యునిశోరర్కసితయోః కుజేన సందృష్టయోః పితాప్యభవత్,
చరరాశౌ పరదేశే యుక్తే క్షితయోస్తు తత్ర మృతః 29

పగలు జననమైనయెడల సూర్యుఁడు, రాత్రి జననమైనయెడల శుక్రుఁడు కుజునిచేఁ జూడఁబడిరేని తండ్రి మరణమును పొందును. చరరాశియందుండఁగా కుజునిచేఁ జూడఁబడిరేని పరదేశమందు తండ్రి మరణమును పొందును.

పంచమనవమద్యూనే పాపై రర్కాత్తు పాపసందృష్టైః,
బద్ధః పితాన్యదేశే రాశివశా త్స్వేథవామార్గే 30

సూర్యునకు ౫-౭-౯ స్థానములందు పాపగ్రహములుండి పాపులచేఁ జూడఁబడిరేని తండ్రి విదేశమందు అన్యులచే నిరోధింపఁబడినవాఁ డగును. చరస్థిరద్విస్వభావ రాసుల ననుసరించి విదేశస్వదేశమార్గములయందని యూహింపఁ దగినది.

జాయాత్రికోణసంస్థైః క్రూరై రానందవర్జితః ప్రసవః,
దశమచతుర్థోపగతైః స్సౌమ్యై స్సంపత్తయో విపులాః. 31

జన్మలగ్నమునకు ౫-౭-౯ స్థానములయందు క్రూరులుండిరేని ప్రసవము సుఖవిహీనమైనదగును ౪-౧౦ స్థానములయందు శుభులుండిరేని ప్రసవము సంపత్తులు కలిగియుండును (అనఁగా సుఖప్రసవము. ఆప్రదేశమందు చిత్రవస్తువు లుండునని తాత్పర్యము )

పశ్యతి న గురుశ్శశినం లగ్నం చ దివాకరం సేందుం,
పాపయుతంవా సూర్యం చంద్రం యది జారజాతస్స్యాత్. 32
గురుశశిరవయో నీచే సూతౌ లగ్నేఽథవార్కసూనుశ్చ,
లగ్నేఽడుపభృగుపుత్రాశ్శుభైరదృష్టా స్తథాన్యజాతశ్చ. 33

లగ్నమునుగాని చంద్రునిగాని గురుఁడు చూడకయుండెనేని అట్టికాలమున జనించినవాఁడు జారజుఁడగును. సూర్యుఁడు చంద్రునితో కలిసియున్నను లేక సూర్యుఁడుగాని చంద్రుఁడుగాని బలముకలిగిన పాపులతో కలిసియుండిరేని జాతకుఁడు జారజాతుఁడని తెలియఁదగినది. లగ్నము నీచయై రవిచంద్రగురులు నీచయందున్నను లేక చంద్రశుక్రులు శుభులచేఁ జూడఁబడకయుండిరేని జారజుఁడని తెలియఁదగినది.

క్లేశో మాతుః క్రూరై ర్బంధ్వస్తగతైశ్శశాంకయుక్తైర్వా,
చంద్రాత్సప్తమరాశౌ పాపామరణాయ వక్రసందృష్టాః. 34
చంద్రాద్దశమే భాను స్మాతుర్మరణం కరోతి పాపయుతః,
శుక్రాత్పంచమనవమే సౌరియుత స్తేనవా దృష్టః 35
చంద్రాత్త్రికోణరాశౌ రవిజో మాతుర్వధం దిశతి రాత్రౌ,
శుక్రాత్తద్దైవ దివసే భౌమః పాపేన సందృష్టః 36

జన్మలగ్నమునకు చతుర్థసప్తమములయందు క్రూరులున్నను చంద్రుఁడు బలవంతులైన పాపులతో కలిసియున్నను ప్రసవమున తల్లి (మరణమును పొందును ) క్లేశమును పొందును. చంద్రునకు సప్తమస్థానమందు పాపులుండి కుజునిచేఁ జూడఁబడిరేని తల్లి మరణమును పొందును. చంద్రునకు దశమస్థానమందు సూర్యుఁడు పాపులతో కలిసియుండెనేని తల్లి మరణమును పొందును. శుక్రునకు పంచమనవమములయందు శనియుండి పాపులచే కూడఁబడినను చూడఁబడినను తల్లి మరణమును పొందును. ప్రసూతి రాత్రియై చంద్రునకు పంచమనవమస్థానములయందు శనియుండి కుజునిచేఁ జూడఁబడెనేనియుం, పగలు ప్రసూతియై శుక్రునకు త్రికోణస్థానములగు పంచమనవమముల యందు కుజుఁడుండి పాపునిచేఁ జూడఁబడెనేనియుం తల్లి మరణమును పొందును.

కుజసౌరయోస్త్రికోణే చంద్రేఽస్తగతే వియుజ్యతే మాత్రా,
దృష్టే సురేంద్రగురుణా సుఖాన్వితో దీర్ఘజీవీ చ. 37

కుజశనులకు త్రికోణస్థానములయందు అస్తంగతుఁడైన చంద్రుఁ డుండెనేని శిశువు తల్లిచే విడువఁబడును. గురునిచేఁ జూడఁబడెనేని సుఖము దీర్ఘాయువు కలవాఁడై యుండును.

మ్రియతే పాపైర్దృష్టే శశిని విలగ్నే కుజేఽస్తగే త్యక్తః,
లగ్నాస్తలాభగతయోర్వసుధాసుతమందయోరేవమ్. 38

చంద్రుఁడు లగ్నమందుండి పాపులచేఁ జూడఁబడి, కుజుఁడు సప్తమమందుండెనేని జాతకుఁడు తల్లిచే విడువఁబడినవాఁడై మరణమును పొందును. రవిచేఁ జూడఁబడిన చంద్రుఁడు లగ్నమందుండి సప్తమైకాదశులయందు కుజశనులుండిరేని తల్లిచే విడువఁబడినవాఁడై మరణమును పొందును.

పశ్యతి సౌమ్యో బలవాన్ యాదృగ్గృహ్ణాతి తాదృశో జాతం,
శుభపాపగ్రహదృష్టే పరైర్గృహీతోఽపి వా మ్రియతే. 39

పూర్వమందుఁ జెప్పఁబడిన తల్లిచే విడువఁబడు యోగములు సంభవించినపుడు చంద్రుఁడు బలవంతులైన శుభులచేఁ జూడఁబడెనేని తల్లిచే విడువఁబడినవాఁడై ఏజాతి గలగ్రహముచే చంద్రుఁడు చూడఁబడెనో ఆజాతివానిచే తల్లిచే విడువఁబడిన యాశిశువు గ్రహింపఁబడును చంద్రునిఁ జూచినగ్రహము శుభుఁ డాయెనేని పరహస్తగతుఁడై ఆశిశువు జీవించును. ఏజాతిపాపగ్రహముచే జూడఁబడునో తల్లిచే విడువఁబడిన యాశిశువు ఆజాతివానిచే గ్రహింపఁబడి మరణమును పొందును. శుభపాపులచే మిశ్రమముగఁ జూడఁబడెనేనియుం మరణమును పొందును.

ఏకాంశస్థితయోర్వా యమారయోస్త్యజ్యతే మాత్రా,
లగ్నాత్సప్తమభవనే భౌమే శనివీక్షితే నియతమ్ 40

పాపులచేఁ జూడఁబడిన చంద్రుఁడు లగ్నమందుండి కుజశను లొకయంశయందుండిరేని జనించిన శిశువు తల్లిచే విడువఁబడును. కుజుఁడు సప్తమమందుండి చూచెనేని నియతముగఁ గలుగును.

యాదృక్పశ్యతి సౌమ్యో తత్తుల్యగుణం సుతస్సమాధత్తే,
పితృజననీసాదృశ్యం రవేశ్శశాంకస్య బలయోగాత్. 41

పూర్వమందుఁ జెప్పఁబడిన మాత్రాత్యక్తయోగములతోఁ గూడినచంద్రుఁడు ఏజాతి కధిపతియైన సౌమ్యగ్రహముచేఁ జూడఁబడునో ఆజాతిగుణములు కలుగును. రవి బలవంతుఁడై యుండెనేని తండ్రిగుణములు, చంద్రుఁడు బలవంతుఁడై యుండెనేని తల్లిగుణములు కలుగునని తెలియఁదగినది.

సింహాజగోభిరుదయే జాతోనాళేన వేష్టితో జంతుః,
లగ్నే కుజేథ సౌరే రాశ్యంశసమానగాత్రేషు. 42

మేషవృషభసింహములలో నొకరాశిలగ్నమై ఆలగ్నమందు శనిగాని కుజుఁడుగాని యుండఁగాఁ బుట్టిన శిశువు, జన్మకాలనవాంశరాశిపూర్వము చెప్పిన కాలపురుషుని యేయవయవమందుండునో ఆయవయవమందు నాళవేష్టన కలిగియుండును.

భౌమశనిద్రేక్కాణే పాపే లగ్నే స్థితే శశియుతేవా,
ద్వ్యేకాదశగైస్సౌమ్యై రభివేష్టితకో భుజంగేన. 43

లగ్నమందు పాపగ్రహములుగాని (క్షీణచంద్రుఁడుగాని) యుండి ద్వితీయ ఏకాదశములయందు శుభులుండి కుజశనిద్రేక్కాణములయ్యెనేని సర్పవేష్టితుఁడై జనించును.

సూర్యశ్చతుష్పదస్థ శ్శేషాః ద్విశరీరసంస్థితా బలినః,
కోశావేష్టితదేహా యమళౌ ఖలు సంప్రజాయేతే. 44

మేషవృషభసింహరాసులు ధనుస్సుయొక్క ఉత్తరార్థము చతుష్పదరాసులు వీటిలో నొకరాశియందు సూర్యుఁ డుండి తక్కినగ్రహములు బలవంతులై ద్విశరీరరాసులగు మిథునకన్యాధనుర్మీనములలో నుండిరేని నాళవేష్టితులైన యమళులు జనింతురు.

లగ్ననవభాగతుల్యా మూర్తిర్బలసంయుతాద్గ్రహాద్వాపి,
నవభాగాద్వర్ణో క్తి శ్శశియోగా త్తత్ర సూతస్య. 45

జన్మకాలమందు లగ్ననవాంశరాశి బలయుక్తమై యుండెనేని తదధిపతి గ్రహ సమానశరీరుండగును. బలహీనుఁడై యుండెనేని సూర్యాదిసప్తగ్రహములలో నేగ్రహము బలముగనుండునో తత్సమానశరీరుం డగుననియు, జన్మకాలమున చంద్రుఁడేనవాంశయందుండునో ఆనవాంశరాశ్యధిపతియైన గ్రహమునకు సమానమైనవర్ణము కలవాఁడని చెప్పవలయును.

బహవో యది బలయుక్తా మిశ్రామూర్తి స్తదా వాచ్యా,
కులజాతిదేశపురుషా న్బుధ్వాఽఽదేయం సమాదిశే త్తద్జ్ఞః. 46

అనేకగ్రహములు బలయుక్తములై యుండెనేని మిశ్రమైన శరీరము కల వాఁడగును.

త్రింశద్భాగే భానుర్గ్రహస్య యస్య స్థితో భవతి,
తత్తుల్యా ప్రకృతిస్స్యాదేవం మునయోఽధ్యవస్యంతి. 47

సూర్యుఁ డేగ్రహముయొక్క త్రింశాంశయందుండునో అట్టిప్రకృతి కల వాఁడగును.

తత్కాలసుహృదరిత్వం బలంచ నీచోచ్చసంభృతం జ్ఞాత్వా,
జ్ఞాత్వా గ్రహస్వభావాన్ స్తైభ్యస్సంచింత్య మన్యదపి. 48

జన్మకాలమందు గ్రహములయొక్క శత్రుమిత్రత్వములవల్లను, తాత్కాలిక శత్రుమిత్రత్వాదులవల్లను, నీచోచ్చాదులవల్లను బలమును అనుసరించి శేషించినవన్నియు నాలోచించవలయును.

క్షీణే శశిని సపాపే మాతా మ్రియతే పితా రవౌ తద్వత్,
బలిభిర్దృష్టే మిశ్రైర్వ్యాధిస్స్యాన్మిశ్రైశ్శుభం భవతి. 49

చంద్రుఁడు క్షీణుఁడై, పాపయుతుఁడై యుండెనేని తల్లి మరణమును పొందును. సూర్యుఁడు బలహీనుఁడై, పాపయుతుఁడై యుండెనేని తండ్రి మరణమును పొందును. శుభులచేతను, పాపులచేతను మిశ్రముగఁ జూడఁబడిరేని వ్యాధిగ్రస్థులగుదురు. శుభులు జూచిరేని శుభము గలుగును.

విపుల విమలమూర్తిస్స్వోచ్చగోవాస్వరాశౌ
గురుసితయుతఇందుర్బోధనేనానుదృష్టః.
అతిశయశుభదాతా పంచమే వాపి మాతుః
పితురపి ఖలు తద్వద్భాస్కరస్సర్వదైవ. 50

పూర్ణచంద్రుఁడు గురుశుక్రులతో కలిసి స్వక్షేత్రమందుగాని ఉచ్చయందుగాని యుండి, బుధునిచే జూడఁబడి జన్మలగ్నమునకు పంచమమందుండెనేని తల్లికి మిక్కిలి శుభము నిచ్చువాఁడగును ఇట్లే సూర్యుఁడు బలవంతుఁడై గురుశుక్రులతో కలిసి స్వక్షేత్రమందుగాని ఉచ్చక్షేత్రమందుగాని యుండి బుధునిచేఁ జూడఁబడి జన్మలగ్నమునకు పంచమస్థానమందుండెనేని తండ్రికి మిక్కిలి శుభములు గలుగఁజేయువాఁడగును.

ఇతి నవమోఽధ్యాయః.

---

## అరిష్టములను దెలుపు పదియవ యధ్యాయము.

ఆయుర్జ్ఞానాభావే సర్వం విఫలం ప్రకీర్తితం యస్మాత్,
తస్మాత్తజ్జ్ఞానార్థేఽరిష్టాధ్యాయం ప్రవక్ష్యామి. 1

ఆయుర్దాయము లేనిది సర్వము విఫలముగాన అందునిమిత్తమై మొదట అరిష్టాధ్యాయమును జెప్పుచున్నాఁడు.

ఓజే స్థితాః పుమాంసశ్శుక్లేఽహని సూరిభిస్సమాఖ్యాతాః,
యుగ్మభవనేషు సర్వే కృష్ణే నిశి యోషితో బలినః. 2

శుక్లపక్షమందు పగలు పురుషగ్రహములు బేసిరాసులయందుండెనేని బలవంతములు. కృష్ణపక్షమందు రాత్రి స్త్రీగ్రహములు సమరాసులయందుండెనేని బలవంతము.

త్రివిధమిహ శాస్త్రకారా నియమమనియమం చ యోగజం ప్రాహుః,
యోగసముత్థం తావ ద్వక్ష్యే పశ్చాత్తు పరిశేషం. 3

నియమములనియు, అనియమములనియు యోగజములనియుం రిష్టలు మూఁడువిధములుగాఁ జెప్పఁబడియున్నవి. అందు మొదట యోగమువల్ల కలుగు రిష్టలను జెప్పుచున్నాఁడు.

బృహస్పతిర్భౌమగృహేఽష్టమస్థస్సూర్యేన్దుభౌమార్కజదృష్టమూర్తిః,
అబ్దైస్త్రిభిర్భార్గవదృష్టిహీనో లోకాంతరం ప్రాపయతి ప్రసూతం.

జన్మలగ్నమునకు అష్టమస్థానము కుజక్షేత్రమై అచట గురుఁడుండి శుక్రునిచేఁ జూడఁబడక సూర్యచంద్రభౌమశనులచేఁ జూడఁబడెనేని జననము మొదలు మూఁడు సంవత్సరములలోఁగా శిశువు మరణమును బొందును.

వక్రీ శనిర్భౌమగృహం ప్రపన్నశ్చంద్రేఽష్టషష్ఠేఽథచతుష్టయే వా,
కుజేన సంప్రాప్తబలేన దృష్టో వర్షద్వయం జీవయతి ప్రజాతం. 5

వక్రముగలిగినశని కుజక్షేత్రమందుండి బలయుక్తుఁడైన కుజునిచేఁ జూడఁబడి చంద్రుఁడు షష్ఠాష్టమములయందుగాని కేంద్రములయందుగాని యుండెనేని జననము మొదలు రెండుసంవత్సరములు శిశువు జీవించును.

భాస్కరహిమకరసహితశ్శనైశ్చరో మృత్యుదః ప్రసవకాలే,
వర్షైర్నవభిర్వ్యాత్తై రిత్యాహ బ్రహ్మశౌండాఖ్యః. 6

రవిచంద్రశనులు కలిసియుండిరేని శిశువు తొమ్మిదిసంవత్సరములు జీవించును.

భౌమదివాకరసౌరా శ్ఛిద్రే జాతస్య భౌమగృహే,
మ్రియతేఽవశ్యం స నరో యమకృతరక్షోఽపి మాసేన. 7

జన్మలగ్నమునకు అష్టమస్థానము కుజక్షేత్రమై రవికుజశను లచట యుండిరేని శిశువు మాసము జీవించును.

ఏకః పాపోఽష్టమగశ్శుక్రగృహే పాపవీక్షితో వర్షాత్,
మారయతి నరం జాతం సుధారసో యేన పీతోఽపి 8

అష్టమస్థానము శుక్రక్షేత్రమై అందొకపాపగ్రహముండి పాపగ్రహముచేఁ జూడఁబడెనేని ఒకసంవత్సరము శిశువు జీవించును.

రవిశశిభవనే శుక్రో ద్వాదశరిపురంధ్రగైశ్శుభైస్సర్వైః,
దృష్టః కరోతి షడ్భిర్వర్షైర్మరణం కిమత్ర చిత్రం హి 9

రవిచంద్రక్షేత్రములలో నొకచోట శుక్రుఁడుండి షష్ఠాష్టద్వాదశములను బొందిన శుభులచేఁ జూడఁబడెనేని ఆరుసంవత్సరములు శిశువు జీవించును.

కర్కటధామని సౌమ్యష్షష్ఠాష్టమసంస్థితో విలగ్నాత్,
చంద్రేణ దృష్టమూర్తిర్వర్షచతుష్కేణ మారయతి. 10

జన్మలగ్నము మొదలు షష్ఠాష్టమస్థానములలో నొకటి కర్కటకమై అందు శుభగ్రహముండి చంద్రునిచేఁ జూడఁబడెనేని శిశువు నాలుగుసంవత్సరములు జీవించును.

తీవ్రఫలరాజయోగా యవనాద్యైర్యే వినిర్మితాస్తేషు,
జాయంతే ఖలకులజా రిష్టం తేషు ప్రసూతానాం. 11

యవనాదులచే ఎట్టిప్రబలరాజయోగములు జెప్పఁబడినవో అట్టియోగముల యందుఁ బుట్టిన హీనవంశజులకు బాలారిష్టము గలుగును.

కేతుర్యస్మిన్నృక్షేఽభ్యుదితస్తస్మిన్ప్రసూయతే యోహి,
మాసద్వయేన మరణం వినిర్దిశేత్తస్య జాతస్య 12

ధూమకేతువు మొదలగునవి ఏనక్షత్రమందు పుట్టునో అట్టినక్షత్రమందు పుట్టిన శిశువు రెండుమాసములు జీవించును.

గగనస్థో దివసకరః పాపైర్బహుభిర్నిరీక్షితస్సద్యః,
మారయతి భౌమధామని శనిశ్చేచ న సంశయో భవతి. 13

సూర్యుఁడు దశమస్థానమందుండి పాపులచేఁ జూడఁబడెనేని శిశువు శీఘ్రముగ మృతిపొందును. కుజశనిక్షేత్రములను పొంది పాపులచేఁ జూడఁబడెనేని నిస్సంశయముగ మృతి కలుగును.

లగ్నే యే ద్రేక్కాణా నిగడాహి విహంగపాశధరసంజ్ఞాః,
మరణాయ సప్తవర్షైః క్రూరయుతా న స్వపతి దృష్టాః 14

జన్మలగ్నమందు నిగడసంజ్ఞయు అహిసంజ్ఞయు విహంగసంజ్ఞయు పాశధర సంజ్ఞయు కలిగిన ద్రేక్కాణములు పాపగ్రహములతోఁ గూడుకొని స్వాధిపతిచేఁ జూడఁబడకయుండెనేని శిశువు ఏడుసంవత్సరములు జీవించును ఇందుఁ జెప్పఁబడిన నిగడాది ద్రేక్కాణములు ముందు జెప్పఁబోవు ద్రేక్కాణాధ్యాయమువలన దెలియఁదగినది.

రాహుశ్చతుష్టయస్థో మరణాయ నిరీక్షితో భవతి పాపైః,
వర్షై ర్వదంతి దశభి ష్షోడశభిః కేచిదాచార్యాః. 15

రాహువు కేంద్రమందుండి పాపులచేఁ జూడఁబడెనేని పదిసంవత్సరములు జీవించును.

పాపాస్త్రికోణ కేంద్రే సౌమ్యాష్షష్ఠాష్టమవ్యయగతాశ్చ,
సూర్యోదయే ప్రసూతస్సద్యః ప్రాణాంస్త్యజతి జంతుః. 16

పాపగ్రహములు కేంద్రకోణములయందును శుభగ్రహములు షష్ఠాష్టమ వ్యయములయందును ఉండఁగా సూర్యోదయకాలమందుఁ బుట్టిన మనుజుఁడు శీఘ్రముగ మృతిపొందును.

అంశాధిపజన్మపతీ లగ్నపతి శ్చాస్తసమయగతా యస్య,
సంవత్సరై స్తు మరణం నిర్వ్యాజం కతిపయై రేవ. 17

లగ్నాధిపతియు నవాంశాధిపతియు చంద్రస్థితిరాశ్యధిపతియు అస్తంగతులై యుండిరేని కొన్నిసంవత్సరములలోఁగా మిష లేకున్నట్టుగా మృతి కలుగును.

రాశిప్రమితై ర్వర్షై స్తారయతి విలగ్నపో రిపుస్థానే,
మాసై ర్ద్రేక్కాణపతి ర్దివసై రంశాధిపో హంతి. 18

లగ్నాధిపతి శత్రుక్షేత్రమందుండెనేని మేషము మొదలు ఎంతసంఖ్య కల స్థానమందుండునో అన్నిసంవత్సరములు శిశువు జీవించును. ద్రేక్కాణాధిపతి శత్రు

క్షేత్రమందుండెనేని మేషము మొదలు ఎంతసంఖ్యకల స్థానమందుండునో అన్నిమాసములు శిశువు జీవించును. నవాంశాధిపతి శత్రుక్షేత్రమందుండెనేని మేషము మొదలు ఎంతసంఖ్యగల స్థానమందుండునో అన్నిరోజులు శిశువు జీవించును.

మారయతి షోడశాహాచ్ఛనైశ్చరః పాపవీక్షితో లగ్నే,
సంయుక్తో మాసేనతు వర్షాచ్ఛుభదృష్టు మారయతి 19

శని పాపులచే జూడఁబడి లగ్నమందుండెనేని శిశువు పదునారురోజులు జీవించును. పాపగ్రహములతోఁగలసియుండెనేని ఒకమాసము జీవించును. పాపులచే జూడఁబడక కూడఁబడక యుండెనేని సంవత్సరము జీవించును.

క్షీణశరీరశ్చంద్రో లగ్నస్థః క్రూరవీక్షితః కురుతే,
స్వర్గగమనం హి పుంసాం కుళీరగోఽజాన్ పరిత్యజ్య. 20

మేషవృషభకర్కటకములు గాక తక్కినరాసులలో నొకటి లగ్నమై క్షీణచంద్రుఁడుండి పాపులచే జూడఁబడెనేని బుట్టిన శిశువు శీఘ్రముగ మృతిపొందును.

వర్షాన్మారయతి శశీ షష్ఠాష్టమరాశిసంస్థితో లగ్నాత్,
సద్యః క్రూరై ర్దృష్ట స్సౌమ్యై రబ్దాష్టకాచ్చైవ 21

జన్మలగ్నమునకు షష్ఠాష్టమములందు చంద్రుఁడుండెనేని ఒకసంవత్సరము జీవించును క్రూరులచే జూడఁబడెనేని శీఘ్రముగ మృతిపొందును. శుభులుజూచిరేని ఎనిమిది సంవత్సరములు జీవించును.

అశుభై శ్శుభైశ్చ దృష్టో వర్షచతుష్కేణ నిర్దిశేదంతం,
అనుపాతః కర్తవ్యః ప్రోక్తా న్న్యూనగ్రహైర్దృష్టః. 22

పూర్వము జెప్పినరీతిని షష్ఠాష్టమములందున్న చంద్రుఁడు 'శుభపాపగ్రహములచే మిశ్రమముగ జూడఁబడెనేని శిశువు నాలుగుసంవత్సరములు జీవించును. శుభపాపగ్రహములయొక్క న్యూనాధికము ననుసరించి అనుపాతప్రకారముగ జీవితమును దెలుసుకొనవలయును.

సౌమ్యాష్షష్ఠాష్టమగాః పాపై ర్వక్రోపసంగతై ర్దృష్టాః,
మాసేన మృత్యుదా స్తే యది నశుభై స్తత్ర సందృష్టాః. 23

శుభగ్రహములు షష్ఠాష్టమములలో నొకచోటనుండి వక్రగతులైన పాపులచే జూడఁబడి శుభులచే జూడఁబడక యుండెనేని ఒకమాసము జీవించును.

లగ్నా ద్ద్వాదశధనగైః క్రూరై ర్మ్రియతేచ రంధ్రరిపుయుక్తైః,
శుభసంపర్కవియుక్తై ర్మాసే షష్ఠేష్టమే వాపి. 24

జన్మలగ్నమునకు ద్వితీయద్వాదశములయందు క్రూరగ్రహములుగాని షష్ఠాష్టమములను పొందిన క్రూరగ్రహములుగాని శుభగ్రహయుక్తులుగాకుండిన ఆరవమాసమందుగాని ఎనిమిదవమాసమందుగాని మృతిపొందును.

లగ్నాధిపజన్మపతీ షష్ఠాష్టమరిఃఫగౌ ప్రసవకాలే,
అస్తమితౌ మరణకరౌ రాశిప్రమితైర్వదేద్వర్షైః 25

లగ్నాధిపతియు, చంద్రస్థితరాశ్యధిపతియు వీరిద్దరు షష్ఠాష్టమద్వాదశములను పొంది అస్తమయమును పొందిరేని మేషాదిగా నెంతసంఖ్యగల రాశియందుండిరో అన్నిసంవత్సరములకు శిశువు మృతిపొందును.

హోరాధిపతిర్ద్యూనే పాపజితో మరణమేవ విదధాతి,
మాసేనజన్మనాథ స్తద్వచ్చంద్రో న యది శుభదృష్టః 26
చంద్రఃకుజరవియుక్త స్స్వసుతస్థానే నచాపి శుభదృష్టః,
మరణం శిశోః ప్రయచ్ఛతి వర్షేనవమే నసందేహః 27

లగ్నాధిపతి సప్తమమందుండి పాపగ్రహములచే జయింపఁబడెనేని ఒకమాసము జీవించును. చంద్రస్థితరాశ్యధిపతిగాని చంద్రుఁడుగాని సప్తమమందుండి పాపగ్రహములచే జయింపఁబడి శుభులచే జూడఁబడక యుండిరేని ఒకమాసము శిశువు జీవించును చంద్రుఁడు రవికుజయుక్తుఁడై ద్వితీయమందుగాని పంచమమందుగాని యుండి శుభులచే జూడఁబడకయుండెనేని తొమ్మిదవసంవత్సరమందు మరణము గలుగును.

హోరేశ్వరస్తు మృత్యౌ పాపైస్సకలైశ్చ దృశ్యతే బలిభిః,
మాసిచతుర్థే మరణం జాతస్య కరోతి మునివాక్యం. 28

లగ్నాధిపతి అష్టమమందుండి బలవంతులైన అన్నిపాపగ్రహములచేతను జూడఁబడియుండెనేని శిశువు నాలుగుమాసములు జీవించును.

జన్మాధిపతి స్సూర్య స్స్వపుత్రసహితోష్టమేభవతి రాశౌ,
వర్షైరాశిప్రమితైర్మరణాయసితేన సందృష్టః 29

చంద్రుఁడున్న రాశ్యధిపతి సూర్యుఁడై శనితో కలసి అష్టమమందుండెనేని శుక్రునిచే జూడఁబడినను మేషముమొదలు సూర్యుఁ డెంతసంఖ్యగల రాశియందుండునో అన్నిసంవత్సరములు శిశువు జీవించును.

వ్యయాష్టషష్ఠోదయగే శశాంకే పాపేనయుక్తే శుభదృష్టిహీనే,
కేంద్రేషు సౌమ్యగ్రహవర్జితేషుప్రాణైర్వియోగంవ్రజతిప్రయాతః.

చంద్రుఁడు పాపయుక్తుఁడై శుభగ్రహములచే జూడఁబడక షష్ఠాష్టద్వాదశములయందుండఁగా కేంద్రములయందు శుభులు లేకుండిరేని శిశువు శీఘ్రముగ మరణమును పొందును.

చక్రస్య పూర్వభాగే పాపా స్సౌమ్యా స్తథేతరేచైవ,
వృశ్చికలగ్నే జాతా గతాయుషో వజ్రముష్టియోగేస్మిన్. 31

వృశ్చికలగ్నమై చక్రముయొక్క పూర్వభాగమందు క్రూరగ్రహములుండి చక్రముయొక్క పశ్చిమభాగమందు శుభులుండిరేని వజ్రముష్టియను యోగము. ఈయోగమునఁ బుట్టిన శిశువు మరణమును పొందును. (చక్రముయొక్క పూర్వాపరభాగము లనఁగా) లగ్నమం దెన్నిభాగలు చెల్లినవో, దశమలగ్నమం దన్నిభాగలు విడిచి చెల్లవలసినవి. ఎన్నిభాగలో అపయం ఏకాదశ ద్వాదశ లగ్న ద్వితీయ తృతీయములు లగ్నమం దెన్నిభాగలు చెల్లినవో చతుర్థమం దన్నిభాగలు కలసి చక్రపూర్వార్థము. చతుర్థలగ్నమందు చెల్లవలసిన భాగలు బంచమ షష్ఠ సప్త మాష్టమ నవములు దశమలగ్నమందు చెల్లియున్నభాగలు కలసి చక్రముయొక్క పశ్చిమార్థమని తెలియఁదగినది.

క్షీణేశశినివిలగ్నే పాపైః కేంద్రేషు మృత్యుసంస్థైర్వా,
భవతి విపత్తి రవశ్యం యవనాధిపతే ర్మతంచైతత్. 32

క్షీణచంద్రుఁడు లగ్నమందుండఁగా పాపగ్రహములు కేంద్రములయందుగాని అష్టమమందుగాని యుండిరేని శీఘ్రముగ మరణము గలుగును

రాశ్యంతగతైః పాపై స్సంధ్యాయాం తుహినగశ్మిహోరాయాం,
మృత్యుః ప్రత్యేకస్థైః కేంద్రేషు శశాంకపాపైశ్చ. 33

పాపగ్రహములు రాశ్యంతములయందుండి సంధ్యాకాలమందు లగ్నార్థమైన చంద్రహోరయందు జననమైన శిశువు మృతిపొందును. క్షీణచంద్రుఁడు రవి కుజ శనులు ప్రత్యేకముగ నాలుగు కేంద్రములయందుండిరేని శిశువు మృతినొందును.

ద్యూనచతురశ్రసంస్థే పాపద్వయమధ్యగే శశినిజాతః,
విలయం ప్రయాతి నియతం దేవైరపి రక్షితో బాలః. 34

చంద్రుఁడు పాపగ్రహమధ్యగతుఁడై ౪-౭-౮ స్థానములయందుండెనేని శిశువు మరణమును పొందును.

పాపద్వయమధ్యగతే హోరాసప్తాష్టమస్థితేచంద్రే,
సౌమ్యై రబలై ర్దృష్టే జాతో మ్రియతేధ్రువం హ్యత్ర. 35

చంద్రుఁడు పాపమధ్యగతుఁడై లగ్నసప్తమాష్టములలోనుండి బలహీనులైన శుభులచే జూడఁబడెనేని శిశువు శీఘ్రముగ మృతినొందును

ద్యూనాష్టమగైః పాపైః క్రూరగ్రహవీక్షితై స్సహ జనన్యా,
మ్రియతే శుభసందృష్టై స్సత్యస్యమతాద్వదేద్వ్యాధిం 36

పాపగ్రహములు సప్తమాష్టములలోనుండి పాపగ్రహములచే జూడఁబడెనేని తల్లి శిశువు మృతినొందుదురు. శుభులచే జూడఁబడెనేని ప్రబలవ్యాధి గలుగును. ఇది సత్యాచార్యమతము.

గ్రహణోపగతేచంద్రే సక్రూరే లగ్నగే కుజేష్టమగే,
మాత్రాసార్ధం మ్రియతే చంద్రవదర్కేచ శస్త్రేణ. 37

రాహుగ్రస్తుఁడైనచంద్రుఁడు పాపగ్రహయుతుఁడై లగ్నమందుండ కుజుఁ డష్టమమందుండఁగా జననమయ్యెనేని తల్లితోఁగూడ శిశువు మృతినొందును. ఇట్లే సూర్యుఁడు రాహుగ్రస్తుఁడై క్రూరయుతుఁడై లగ్నమందుండి కుజుఁ డష్టమమందుండెనేని మాతాశిశువులకు శస్త్రకృతమైన మరణము గలుగును.

క్షీణే శశిని విలగ్నే కంటకనిధనాశ్రితై స్తథాపాపైః,
సౌమ్యాదృష్టే మృత్యు స్సద్యస్సత్యస్యనిర్దేశః. 38

క్షీణచంద్రుఁడు లగ్నమందుండి కేంద్రాష్టమములందు పాపగ్రహములుండి శుభులచే జూడఁబడక యుండెనేని శిశువు శీఘ్రముగ మృతినొందును.

ద్యూనగతేఽర్కేలగ్నే యమేకుజేవా విపర్యయేవాపి,
అన్యతరయుతే వేందా వశుభై ర్దృష్టేఽచిరాన్మృత్యుః. 39

రవి సప్తమమందుండి లగ్నమందు శనిగాని కుజుఁడుగాని యుండి చంద్రుఁడు కుజునితోనైనను శనితోనైనను కలసియుండి పాపగ్రహములచే జూడఁబడి యుండెనేని శిశువు శీఘ్రముగ మృతినొందును. "విపర్యయేవాపి" అనుటవలన సప్తమమందు కుజుఁడుగాని లేక శనిగాని యుండి లగ్నమందు రవియుండఁగా చంద్రుఁడు కుజశనులలో నొకరితో కలసియుండి పాపగ్రహములచే జూడఁబడి యుండెనేని శిశువు శీఘ్రముగ మృతినొందును.

హోరానిధనాస్తగతైః పాపైః క్షీణే వ్యయస్థితే చంద్రః,
జాతస్య భవే న్మరణం సద్యః కేంద్రేషు చేన్న శుభాః. 40

పాపగ్రహములు లగ్నసప్తమాష్టములను పొంది, క్షీణచంద్రుఁడు ద్వాదశమందుండి, కేంద్రములయందు శుభగ్రహములు లేకుండెనేని శిశువు శీఘ్రముగ మృతినొందును.

లగ్నాంత్యనవమనైధనసంయుక్తాశ్చంద్రసూర్యసౌరారాః,
జాతస్యవధంకుర్యు స్సద్యోగురుణా నచేద్దృష్టాః. 41

లగ్న ద్వాదశ నవమ సప్తమములయందుఁ గ్రమముగ చంద్ర సూర్య శని కుజులుండి గురుదృష్టి లేకయుండిరేని శీఘ్రముగ శిశువు మృతినొందును.

లగ్నే చంద్రేఽర్కే వా పాపాబలిన స్త్రికోణనిధనేషు,
సౌమ్యై రదృష్టయుక్తా స్సద్యోమరణాయకీర్తితాయవనైః 42

లగ్నమందు చంద్రుఁడుగాని, సూర్యుఁడుగాని యుండి పాపగ్రహములు బలవంతములై పంచమాష్టమనవమములయందుండి శుభులచే జూడఁబడక కూడఁబడకయుండెనేని శీఘ్రముగ శిశువు మృతిపొందును.

శుక్రో రవిశనిసహితో మారయతి నరం సదా ప్రసవకాలే,
దృష్టోపి దేవగురుణా నవభిర్వర్షై ర్నసందేహః. 43

శుక్రుఁడు రవి శనులతో కలసియుండెనేని గురునిచే జూడఁబడినను శిశువు తొమ్మిదిసంవత్సరములు జీవించును.

యత్రస్థ స్తత్రస్థో రుధిరార్కశనైశ్చరేక్షితశ్చంద్రః,
జననీ మృత్యుం కుర్యా న్నతు సౌమ్యనిరీక్షితస్సద్యః. 44

చంద్రుఁ డేరాశియందైనను ఉండి రవికుజశనులచే జూడఁబడి శుభులచే జూడఁబడక యుండెనేని శీఘ్రముగ తల్లి మృతినొందును.

రుధిరశనైశ్చరదృష్టో దివసకరో దివసజన్మని తు యస్య,
పాపయుతో వా హన్యా త్పితరం నిస్సంశయం జాతః. 45

పగటి జన్మమైః సూర్యుఁడు కుజశనులచే కలసినను జూడఁబడినను శీఘ్రముగ తండ్రి మృతినొందును.

రహితో బుధగురుశుక్రై ర్జన్మని రుధిరాంగసౌరసహితోఽర్కః,
కథయతి పితరమతీతం పితురపిచ శరీరకర్తారమ్. 46

జననకాలమున సూర్యుఁడు శుభసంపర్కము లేనివాఁడై కుజశనులచే జూడఁబడిగాని కలసిగాని యుండెనేని శిశువుయొక్కతండ్రి పితామహుఁడు మృతి నొందుదురు.

పాపగ్రహమధ్యగతో దివసకరో దివసజన్మనినరస్య,
పాపయుతో వా హన్యా త్పితరం నిస్సంశయం జాతమ్. 47

పగటిజన్మముకలిగి సూర్యుఁడు పాపమధ్యస్థుఁడైనను, లేక పాపయుతుఁడైనను శిశువుయొక్కతండ్రి మృతినొందును

సూర్యాదష్టమరాశౌ యది యుక్తౌ సౌరలోహితౌ ప్రసవే,
సౌమ్యాదృష్టౌ నిధనం కుర్యాతాం సద్యఏవ పితుః. 48

తా ప్రసవకాలమున సూర్యున కష్టమరాశియందు కుజశనులు కలసియుండి శుభులచే జూడఁబడక యుండిరేని తండ్రి శీఘ్రముగ మృతినొందును.

పాపగ్రహసంయు క్త శ్చరరాశిగతో దివాకరః ప్రసవే,
విషశస్త్రజలాన్మృత్యుం కథయ త్యల్పాయుషం పితరం. 49

తా. రవి పాపగ్రహముతోకలసి చరరాశియందుండెనేని స్వల్పాయుస్సు గల తండ్రి విషశస్త్రాదులవలన శీఘ్రముగ మృతినొందును.

చంద్రా దష్టమరాశౌ నవమేవా సప్తమేపివా పాపాః,
సర్వేతత్రాన్యతమే హన్యు ర్జాతం సహ జనన్యా. 50

పాపగ్రహములు చంద్రునకు సప్తమమందుగాని అష్టమమందుగాని నవమమందుగాని యుండెనేని మాతాశిశువులకు మరణము గలుగును.

చరరాశిగతే సూర్యే దినజన్మని వీక్షితే కుపుత్రేణ,
కథయతి విదేశయాతం జాతస్య శరీరకర్తారం. 51

పగటియందు జన్మముకలిగి జన్మకాలమున సూర్యుఁడు చరరాశియందుండి కుజునిచే జూడఁబడెనేని తండ్రి విదేశమందుండఁగా జన్మము కలుగును.

చరరాశిగతం సౌరం యద్యర్కో రాత్రిజన్మనీక్షేత,
అత్రాపి విదేశస్థం కథయతి పితరం ప్రసూతస్య. 52

రాత్రియందు జన్మముకలిగి శని చరరాశి యందుండి రవిచే జూడఁబడెనేని తండ్రి విదేశమందుండఁగా జన్మము కలుగునని తెలియఁదగినది.

రుధిరసహితస్తు సౌర శ్చరభవనే రాత్రిజన్మని చరస్య,
కథయతి పితరమతీతం పరదేశే నాత్రసందేహః. 53

రాత్రియందు జన్మలగ్నము చరరాశియై కుజశనులు కలసి చరరాశియందుండిరేని తండ్రి విదేశమందు మృతినొందును

యత్రస్థ స్తత్రస్థ స్స్వపుత్రరుధిరాంగసంగతస్సూర్యః,
ప్రాగ్జన్మనో నివృత్తం కథయతి పితరం ప్రసూతస్య 54

ఏరాశియందైనను జన్మకాలమున రవికుజశనులు కలసియుండిరేని జన్మమునకు పూర్వమే (అనఁగా గర్భస్థుఁడై యుండఁగనే) తండ్రి మరణమును పొందును.

జన్మాష్టసప్తషష్ఠ ద్వాదశసంస్థేషు పాపేషు,
మాతాసుతేన సార్ధం మ్రియతే నాస్త్యత్ర సందేహః 55

జన్మలగ్నషష్ఠసప్తమాష్టమములయందు పాపగ్రహములందరునుండిరేని శిశువుతోఁగూడ తల్లి మృతినొందును.

జీవతి మాతామ్రియతే సూను ష్షష్ఠాష్టమేషు పాపేషు,
జన్మాష్టసప్తమేషుచ జీవతి సూను ర్మ్రియేత తన్మాతా. 56

పాపగ్రహములన్నియుఁ షష్ఠాష్టమములయందుండెనేని తల్లి జీవించి శిశువు మరణము నొందును. లగ్నసప్తమాష్టమములందు పాపగ్రహములన్నియుఁ నుండెనేని శిశువు జీవించి తల్లి మరణము నొందును.

వక్రోవా సౌరోవా ద్వాదశసంస్థో నయనహంతా,
దక్షిణనయనం సౌరో వామమథాంగారకోహన్యాత్. 57

కుజుఁడు ద్వాదశమందుండెనేని కుడినేత్రమును, శనియుండెనేని ఎడమ నేత్రమును హరించును.

యుగపచ్చంద్రాదిత్యౌ ద్వాదశభే విక్షితౌ గ్రహౌ స్యాతాం,
కురుతః ప్రసూతమంధం పాపష్షష్ఠేధవానిధనే. 58

రవిచంద్రులు ద్వాదశరాశియం దొకభాగయందుండిరేని పాపగ్రహము షష్ఠమందుగాని అష్టమమందుగాని వుండినా శిశువు అంధుఁడగును.

అథవాప్యన్యతరయుతే ద్వాదశభే జాయమానస్య,
అత్రాపి హారే న్నయనం దక్షిణ మర్కశ్శశీసవ్యం. 59

సూర్యుఁడు ద్వాదశమందుండెనేని కుడినేత్రమును చంద్రుఁడుండెనేని ఎడమ నేత్రమును హరించును.

స్వర్భానునోపసృష్టౌ యది హోరాదినకరశ్చజామిత్రే,
జాత స్తత్రమనుష్యో నిస్సందిగ్ధం భవ త్యంధః. 60

రాహువు లగ్నమందుండి సూర్యుఁడు సప్తమమందుండెనేని శిశువు గ్రుడ్డివాఁడగును.

ధనరాశౌ ద్వాదశభే చంద్రసూర్యౌ శ్చ విస్థితో యత్ర,
తత్రాపి భవత్యంధో యద్యష్టమషష్ఠయోః పాపౌ 61

ద్వితీయమందు చంద్రుఁడు ద్వాదశమందు సూర్యుఁడు షష్ఠాష్టమములయందు పాపగ్రహములు యుండెనేని శిశువు అంధుఁడగును.

రజనికర షష్ఠగతో నిధనే సూర్యోరవేస్సుతస్తు శుభే,
వక్రః కుటుంబరాశౌ వత్రాప్యంధో భవే జ్జాతః. 62

చంద్రుఁడు ఆరవస్థానమునందును, ఎనిమిదవస్థానమందు రవియుం, శని తొమ్మిదవస్థానమందును, కుజుఁడు రెండవస్థానమందునను ఉండిరేని శిశువు గ్రుడ్డివాఁడగును.

రుధిరాంగసౌరయుక్త శ్చంద్రో నిధనేథవాపి షష్ఠేవా,
పిత్తశ్లేష్మవికారై ర్దృష్టిం హన్యా దశుభయుక్తః 63

చంద్రుఁడు కుజశనులతో కలసి షష్ఠాష్టమములలో నొకచోటనుండి శుభులతో కూడకయుండెనేని పైత్యాదిగుణములచే నేత్రావరోధము గలుగును.

దక్షిణమష్టమసంస్థ స్సవ్యంతు హరే త్సమాత్రిత్షష్ఠం,
సౌమ్యై ర్నవీక్షితతను స్సదోన్యనయనం హరే ద్ధరే త్పశ్చాత్. 64

చంద్రుఁడు పాపయుక్తుఁడై ఎనిమిదింటయుండెనేని కుడికన్నును, ఆరింటనుండెనేని ఎడమకన్నును హరించును. శుభులు జూచిరేని కాలాంతరమున హరించును.

దినకరసుతేన సహితో నిధనే చాంత్యే సమాత్రితశ్చంద్రః,
వాతశ్లేష్మవికారై ర్దృష్టిం హన్యా దశుభదృష్టః. 65

చంద్రుఁడు శనితోకలసి శుభులచే జూడఁబడక అష్టమమందుగాని ద్వాదశమందుగాని యుండెనేని వాతశ్లేష్మాదిగుణములచే గ్రుడ్డివాఁడగును.

నిధనే దక్షిణనయనం త్యాగే సవ్యం హరేత్తు నియమేన,
సౌమ్యైస్తు దృశ్యమానో నహరే దథవాహరేత్పశ్చాత్. 66

చంద్రుఁడు శనితో నష్టమమందుండెనేని కుడికన్నును హరించును. ద్వాదశమందుండెనేని ఎడమకన్నును హరించును. శుభులు జూచిరేని కాలాంతరమున నేత్రావరోధము కలుగును.

ఏతేనైవతు విధినా సౌరారదివాకరాశ్రితశ్చంద్రః,
కుర్యాద్దృష్టివికారం నానారోగైర్వ్యధంజంతోః. 67

పూర్వోక్తప్రకారముగ చంద్రుఁడు రవికుజశనులతో కలసి షష్ఠాష్టద్వాదశములలో నొకచోటనుండిరేని అనేకవికారములచే దృష్టివికారము గలుగును.

ఏకాదశే తృతీయే హోరాయాం పాపసంయుతే శశిని,
కర్ణవికలో నరస్స్యా త్పాపగ్రహవీక్షితస్సద్యః 68

చంద్రుఁడు పాపగ్రహయుతుఁడై లగ్నతృతీయైకాదశములలో నొకచోట యుండెనేని కర్ణవైకల్యము గలుగును. పాపగ్రహములు జూచిరేని శీఘ్రముగ గలుగును.

నవమే పంచమరాశౌ పాపగ్రహవీక్షితౌ గ్రహౌస్యాతాం,
శ్రోత్రోపఘాత మతులం కుర్యాతాం జాతమాత్రస్య 69
నవమే దక్షిణకర్ణం వామం వై పంచమేగ్రహోహన్యాత్,
అత్రైవ సౌమ్యభేవా శుభదృష్టేవా శుభంవాచ్యం. 70

జన్మలగ్నమునకు నవమస్థానమందు గ్రహముండి పాపగ్రహముచే జూడఁబడెనేని సవ్యకర్ణమును హరించును. పంచమమందు గ్రహముండి పాపగ్రహములచే జూడఁబడెనేని వామకర్ణమును హరించును. శుభక్షేత్రమైనను శుభులచే జూడఁబడినను అటుల గలుగదు.

రాశౌ హోరాంతరంప్రాప్య యోయస్మిన్ వ్యాధిమాప్నుయాత్,
తచ్చాస్యహోరాప్రసవే చంద్రస్థానంచ యద్భవేత్ 71

జననకాలమున లగ్నముగాని చంద్రస్థితరాశిగాని ఏగ్రహాధిపరాశియగునో ఆగ్రహమునకు సంబంధించిన కర్ణవ్యాధి గలుగునని భావము.

సవ్యాపసవ్యభాగే యోగమథైవం గ్రహాస్తు సంప్రాప్తాః,
కుర్యుర్వ్రణాంచ చిహ్నం వ్యంగభయం పాపవీక్షితా స్సౌమ్యాః.

పూర్వోక్తప్రకారముగా యోగకర్తలైన శుభగ్రహములు శిశువుయొక్క వామదక్షిణభాగములయందు నాలుగవఅధ్యాయములో ఐదవశ్లోకములో జెప్పినరీతిని ఏప్రదేశమందుండురో ఆదేశమందు నుచ్చుయుండును. పాపగ్రహముల చేజూడఁబడిరేని ఆభాగమందు అంగభయమును-అనఁగా వ్రణాదులను గలుగఁజేయుదురు.

విదిత్వాత్రితయం హ్యేత త్కృత్స్నస్యతు విశేషతః,
శుభాశుభౌతు విజ్ఞేయౌ గ్రహాసంయోగకారణౌ. 73

పూర్వముజెప్పిన యోగములను దెలుసుకొని శుభాశుభములను దెలుసుకొనవలయును.

చంద్రాదిత్యౌ తృతీయస్థౌ మీనక్షేత్రంచ యస్యతు,
వ్యాధిం తత్రవిజానీయా త్త్రిరాత్రం తస్యజీవనం. 74

మీనము లగ్నమై రవిచంద్రులు వృషభమందుండిరేని వ్యాధిగలిగి శిశువు మూఁడురోజులు జీవించును.

అత స్తృతీయే నక్షత్రే సమస్తే వ్యస్తగేపివా,
రవౌ రాత్రిం పరాంజీవే చ్చంద్రే దశమమాశ్రితే. 75

జన్మనక్షత్రమునకు పూర్వాపరములయందైన మూఁడవనక్షత్రమును సూర్యుఁడుండి చంద్రుఁడు దశమస్థానమందుండెనేని శిశువు ఒకరోజు జీవించును

సహితౌ చంద్రజామిత్రే యస్యాంగారకభాస్కరౌ,
జాతస్య తస్యహి తదా భవే త్సప్తాహజీవితం 76

చంద్రునకు సప్తమరాశియందు రవికుజులు కలసియుండిరేని శిశువు ఏడురోజులు జీవించును.

చతురశ్రస్థితాః పాపాః వామదక్షిణగా యదా,
తదా యో వ్యాధి మాప్నోతి దశరాత్రం సజీవతి. 77

చతుర్థాష్టమములందు పాపగ్రహములుండఁగా వ్యాధిగలిగెనేని పదిరోజులలో శిశువు మృతినొందును.

త్రికోణే దక్షిణే సూర్య శ్చంద్రో వామే యదాభవేత్,
య స్తదాలభతే వ్యాధిం ద్వాదశాహాం సజీవతి. 78

నాల్గవయధ్యాయమందు మూర్ధాలోచన యను ఏడవశ్లోకమువలన జెప్పిన రీతిని దక్షిణభాగమందైన త్రికోణరాశియందు సూర్యుఁడును, వామభాగమందైన

త్రికోణరాశియందు చంద్రుఁడును యుండఁగా వ్యధిగల శిశువు పంద్రెండురోజులు జీవించును.

త్రికోణస్థే యదాచంద్ర శ్చతురశ్రేథ భాస్కరః,
తదా దుర్వ్యాధినా పుత్ర స్త్రిరాత్రం నాతివర్తతే 79

త్రికోణస్థానమందు చంద్రుఁడు చతుర్థాష్టమములయందు సూర్యుఁడు యుండె నేని శిశువు దుష్టవ్యాధిచే మూఁడురోజులు జీవించును.

యదాహోరాచతుర్థస్థ శ్చంద్రష్షష్ఠస్థితో యది,
అష్టాదశాహంచ నర స్తదా వ్యాధిసమన్వితః. 80

చతుర్థస్థానమందు చంద్రుఁడు, ఆరింట రవియుం నుండిరేని శిశువు వ్యాధిగలవాఁడై పదునెనిమిదిరోజులు జీవించును.

రవిర్యదా చంద్రమస స్త్రికోణస్థానమాశ్రితః,
వింశతిం దివసాన్ జీవే త్తదా వ్యాధిభయార్దితః. 81

చంద్రునకు త్రికోణస్థానమందు రవియుండఁగా వ్యాధిగల శిశువు ఇరువది రోజులు జీవించును.

హోరాష్టమస్థిత స్సూర్య స్సౌంభౌమనిరీక్షితః,
యఃపుమా న్ప్రాప్నుయా ద్వ్యాధిం నసజీవే ద్విపద్యతే 82

లగ్నమునకు అష్టమస్థానమందు సూర్యుఁడుండి కుజశనులచే జూడఁబడుచుండఁగా వ్యాధిగల మనుజుఁడు జీవించఁడు.

హోరాయాం కంటకే భౌమో భవే ద్యస్య ప్రజాయతః,
నచ కేంద్రగతో జీవో జాయతే మృతఏవసః. 83

కేంద్రములయందు కుజుఁడుండి గురుఁడు లేకుండెనేని మృతశిశువు జనించును.

అథ హోరాగతస్సూర్యో నచకేంద్రే బృహస్పతిః,
నిధనేవాపరఃకశ్చి జ్జాతమాత్రో వినశ్యతి. 84

లగ్నమందు సూర్యుఁడుండి కేంద్రములయందు బృహస్పతి లేకుండి అష్టమమందు గ్రహముండెనేని శిశువు శీఘ్రముగ మృతినొందును.

హోరాయాం కంటకే చంద్రో నచ కేంద్రే బృహస్పతిః,
నిధనేవాపరఃకశ్చి జ్జాతమాత్రో వినశ్యతి. 85

కేంద్రములయందు చంద్రుడుండి బృహస్పతి లేకుండి అష్టమస్థానము గ్రహ సహితమై యుండెనేని శిశువు శీఘ్రముగ మృతినొందును.

ద్రేక్కాణజామిత్రగతో యస్యస్యా ద్దారుణగ్రహాః,
హోరాగత శ్శశాంకశ్చ సద్యో హరతి జీవితం. 86

క్రూరగ్రహములు లగ్నమందే ద్రేక్కాణము భుక్తమగునో సప్తమరాశియందా ద్రేక్కాణమందుండి లగ్నమందు చంద్రుడుండెనేని శిశువు శీఘ్రముగ మృతినొందును.

గ్రహాస్సమేయు ర్బహవో నిధనే యస్య జన్మని,
మాసంవా సప్తరాత్రంవా తస్యాయు స్సముదాహృతం. 87

అష్టమస్థానమం దనేకగ్రహము లుండిరేని శిశువు ఏడురోజులుగాని, లేక ఒక మాసముగాని జీవించును.

శనైశ్చరశ్చ హోరాయాం నిధనేవా మహీసుతః,
నచ దేవగురుః కేంద్రే మృతగర్భః ప్రసూయతే. 88

లగ్నమందు శనియుం అష్టమమందు కుజుడును యుండి కేంద్రములయందు గురుడు లేకుండెనేని మృతప్రసవము గలుగును.

యఃప్రాగ్విలగ్నే ద్రేక్కాణ స్తత్సమానో యదా గ్రహాః,
భవే త్త్రికోణగాః పాపా స్తత్సమాసఫలోభవేత్. 89
సౌరేవ్యాధి మవాప్నోతి మరణం ధరణీసుతే,
సూర్యస్యా ద్వ్యాధివైకల్యం మరణం నాత్రసంశయః. 90

లగ్నప్రథమద్రేక్కాణమందుగాని త్రికోణస్థానములయందుగాని శనియుండెనేని వ్యాధి గలుగును. రవికుజులుండిరేని మరణము గలుగును.

అథ హోరాగతో భౌమః కేంద్రస్థశ్చ భృగోస్సుతః,
సవై మరణ మాప్నోతి హోరాయాం పునరాగతే. 91

లగ్నమందు కుజుడు, తదితరకేంద్రములయందు శుక్రుడు యుండెనేని శిశువు మరణమునొందును.

గురు స్త్రికోణే హోరాయాం హోరేశశ్చ మహీసుతః,
తస్యాన్యతరకేంద్రస్థ స్సద్యోజీవితనాశనః. 92

త్రికోణస్థానములయందు గురువు లగ్నాధిపతి లగ్నమందు యుండినను కుజుఁడు త్రికోణములయందుగాని కేంద్రములయందుగాని యుండెనేని శిశువు శీఘ్రముగ మృతినొందును.

నవైధనే గ్రహః కశ్చి త్పాపో హోరాగతోఽథవా,
కేంద్రేవాన్యతమే జీవో జీవ త్యష్టోత్తరంశతం 93

అష్టమమందు గ్రహము లేకుండి, లగ్నమందు పాపగ్రహము లేకుండి, కేంద్రములయందు గురుఁడుండెనేని నూటయెనిమిదిసంవత్సరములు జీవించును.

న కేంద్రే కశ్చిదాగ్నే యోన త్రికోణే నవైధనే,
గురుశుక్రౌచ కేంద్రస్థౌ జీవ త్యష్టోత్తరంశతం 94

కోణములయందుగాని కేంద్రములయందుగాని అష్టమమందుగాని పాపగ్రహములు లేకుండి గురుశుక్రులు కేంద్రములయందుండిరేని నూటయెనిమిదిసంవత్సరములు జీవించును.

యది హోరాగత శ్శుక్రః కేంద్రేవాన్యతమే గురుః,
నైధనేనచ పాపస్స్యా త్సవింశం జీవితేశతం. 95

లగ్నమందు శుక్రుఁడు కేంద్రములయందు బృహస్పతి యుండి అష్టమమందు పాపగ్రహములు లేకుండిరేని నూటయిరువదిసంవత్సరములు జీవించును.

రాశౌ కర్కటహోరాయాం గురుశుక్రౌసమన్వితౌ,
గురుశ్చంద్రయుతోవాపి నిధనేనచ కశ్చన. 96
నచ కేంద్రగతః పాపో నత్రికోణే నిజాయతే,
తస్యాయు రమితప్రఖ్యం నిశ్చయేనతు కీర్త్యతే 97

లగ్నము కర్కటకమై గురుశుక్రులుండినను లేక గురుచంద్రులుండినను, అష్టమస్థానము గ్రహరహితమై కేంద్రకోణములయందు పాపగ్రహములు లేకుండిరేని దేవతలతో సమానమైన (అనఁగా అసంఖ్యాకమైన) ఆయుర్దాయము గలవాఁడగును.

నిధనాస్తస్యయులగ్నత్రికోణగాః క్షీణచంద్రసంయుక్తాః,
పాపాబలిన శ్శుభదైః పదృశ్యమానా గతాయుషః ప్రాయః. 98

క్షీణచంద్రుఁడు పాపగ్రహములు కలిసి లగ్నత్రికోణసప్తమాష్టమద్వాదశములందుండి శుభగ్రహములచే జూడఁబడక యుండఁగా శిశువు మరణమునొందును.

యోగే బలినః స్థానం స్వంవా లగ్నం గతేపివా చంద్రే,
బలవతి పాపైర్దృష్టే వర్షాంతే మృత్యుకాలస్స్యాత్. 99

అరిష్టయోగకర్తృగ్రహములలో బలయుక్తగ్రహము జన్మకాలమందే రాశి యందుండునో ఆరాశిని చంద్రుఁడు బలయుక్తుఁడై పాపయుతుఁడై సంవత్సరములోఁగా నెపుడు పొందునో అపుడుగాని చంద్రుఁడు పాపయుతుఁడై బలవంతుఁడై ఒకసంవత్సరములోఁగా జన్మకాలమందు తానున్నరాశినిగాని లేక జన్మలగ్నమునుగాని నెపుడు పొందునో అపుడు శిశువు మృతినొందును

రవిచంద్రభౌమగురుభిః కుజగురుసౌరేందుభి స్తథైకస్థైః,
రవిశనిభౌమశశాంకై ర్మరణం ఖలు పంచభిర్వర్షైః. 100

రవిచంద్రకుజగురులు కలసియున్నను చంద్రకుజగురుశనులు కలసియున్నను రవిచంద్రకుజశనులు కలసియున్నను ఐదుసంవత్సరములు శిశువు జీవించును.

రవిణాయుక్త శ్శశిజః సౌమ్యై ర్దృష్టో వినాశయతి సూనుం,
ఏకాదశభి ర్వర్షై ర్దేవాంకేపి స్థితంజాతం 101

బుధుఁడు రవియుక్తుఁడాయె నేని శుభులచే జూడఁబడనను శిశువు పదునొకొండు సంవత్సరములు జీవించును.

లగ్నే రవి మంద కుజా శ్శుక్రగృహే సప్తమే శశీక్షీణః,
దృష్టో నదేవగురుణా సప్తభి రబ్దై ర్వినాశయతి. 102

లగ్నమందు రవికుజశనులు, సప్తమస్థానము వృషభతులలలో నొకటియై అందు క్షీణచంద్రుఁడుండి గురుదృష్టి లేకయుండెనేని ఏడుసంవత్సరములు శిశువు జీవించును.

కేంద్రే రవిముషితతనుః క్షితిసుతమందావలోకితో౽థయుతః,
వర్ష చతుష్కేచంద్రో మారయతి సమత్రగణితేన 103

క్షీణచంద్రుఁడు కేంద్రమందుండి కుజశనులతో కలసినను జూడఁబడినను శిశువు నాల్గుసంవత్సరములు జీవించును. గణితమువలన వచ్చునట్టి ఆయుర్దాయమువలన ప్రయోజనము లేదనిభావము.

లగ్నాధిపతే శ్చంద్రో మరణపదస్థో౽తికృష్ణశాంగయుతః,
క్రూరై స్సకలై ర్దృష్టో సశుభై స్సంవ త్సరైస్త్రిభిస్తు మారయతి. 104

లగ్నాధిపస్థితస్థానమువల్లనుంచి క్షీణచంద్రుఁ డష్టమస్థానముండి శుభులచే జూడఁబడక పాపగ్రహములచే జూడఁబడియుండెనేని శిశువు మూఁడుసంవత్సరములు జీవించును.

లగ్నాధిపతిః పాప శ్శశినో౽ంశే రిఃఫగో౽యదిన చంద్రాత్,
క్రూరై ర్విలోక్యమానో మారయతి శిశుం నవభిరబ్దైః 105

లగ్నాధిపతి పాపగ్రహమై చంద్రునకు ద్వాదశరాశియందైన చంద్రాంశయం దుండెనేని శిశువు తొమ్మిదిసంవత్సరములు జీవించును.

దర్శనభాగే సౌమ్యాః క్రూరాశ్చాప్యదృశ్యకే ప్రసవకాలే,
రాహు ర్లగ్నోపగతో యమక్షయం నయతి పంచభిర్వర్షైః. 106

దృశ్యచక్రార్ధమందు శుభగ్రహములు అదృశ్యచక్రార్ధమందు పాపగ్రహములు లగ్నమందు రాహువు యుండెనేని శిశువు ఐదుసంవత్సరములు జీవించును. (దృశ్యచక్రార్ధ మనఁగా లగ్నమం దెన్నిభాగ లుదయించినవో అవియు, ద్వాదశైకాదశదశమనవమాష్టమరాసులు సప్తమరాశియందు లగ్నమం దెన్నిభాగ లుదయించవలెనో అన్ని భాగలు కలసి దృశ్యచక్రార్ధ మనఁబడును. లగ్నమం దుదయించవలసినభాగలు ద్వితీయ తృతీయచతుర్థపంచమషష్ఠరాసులు సప్తమరాశియం దుదయించవలసినభాగలు కలసి అదృశ్యచక్రార్ధ మనియుఁ జెప్పఁబడును.

రాహు స్సప్తమభవనే శశిసూర్యనిరీక్షితో నశుభదృష్టః,
దశభి ర్ద్వాభ్యాం సహితై రబ్దై ర్జాతం వినాశయతి 107

రాహువు సప్తమమందుండి శుభగ్రహములచే జూడఁబడక సూర్యచంద్రులచే జూడఁబడెనేని శిశువు పండ్రెండుసంవత్సరములు జీవించును.

ఘటసింహవృశ్చికోదయకృతస్థితి ర్జీవితం హరతి రాహుః,
పాపై ర్నిరీక్ష్యమాణ స్సప్తమితై ర్నిశ్చితం వర్షైః 108

సింహవృశ్చికకుంభములలో నొకటి లగ్నమై రాహువుయుండి పాపులచే జూడఁబడెనేని శిశువు ఏడుసంవత్సరములు జీవించును.

కేతో రుదయం పూర్వం పశ్చా దుల్కానిపవననిర్ఘాతాః,
రౌద్రే సార్పముహూర్తే ప్రాణై స్సంత్యజ్యతే జంతుః. 109

ధూమకేతువు, నక్షత్రపతనము, పిడుగుపడుట, ప్రచండవాయువు విసరుట మొదలగునవి గలుగుచుండ రౌద్రసార్పముహూర్తములందు జనించిన శిశువు శీఘ్రముగ మృతినొందును. (రౌద్రసార్పముహూర్తము లనఁగా సూర్యోదయాది నాల్గు ఘడియల పరిమితిగలవి.)

క్షీణం యదాశశాంకం పశ్యే ద్రాహు స్సమాగతం పాపైః,
మారయతి తదాదివసై ర్నిర్వ్యాజం కతిపయై రేవ 110

పాపగ్రహయుతుఁడై క్షీణచంద్రుఁడు రాహువుచే జూడఁబడెనేని శిశువు మృతినొందును.

కుంభే దిశతి శశాంకో భాగేమృత్యుం తథైకవింశాఖ్యే,
సింహేచ పంచమేంశే వృషేచ నవమే తథైవోక్తః. 111

లగ్నము ముప్పదిభాగలుజేయ నందొకటి భాగ యనఁబడును. కుంభరాశియం దిరువదియవ భాగయందును, సింహరాశియం దైదవ భాగయందును వృషభరాశియందు తొమ్మిదవభాగయందును చంద్రుఁడుండెనేని శిశువు మృతినొందును.

అలిని త్రివింశయుక్తే మేషేచ తదాష్టమే దిశతి మృత్యుం,
కర్కటకే ద్వావింశే తులినిచతుర్థే మృగేవింశే. 112

వృశ్చికరాశియం దిరువదిమూఁడవభాగయందును, మేషరాశియం దెనిమిదవభాగ యందును, కర్కటరాశియం దిరువదిరెండవభాగయందును, తులారాశియందు నాల్గవ భాగయందును చంద్రుఁడుండెనేని శిశువు మృతినొందును.

కన్యాయాం ప్రథమేంశే ధనుర్ధరేష్టాదశేఝషేదశమే,
మిథునేచ ద్వావింశే శశీప్రసూతస్య మరణకరః. 113

కన్యయందు మొదటిభాగయందును, ధనుస్సుయందు పదునెనిమిదవభాగయం దును, మీనమందు పదియవభాగయందును, మిథునమం దిరువదిరెండవభాగయందును చంద్రుఁడుండెనేని శిశువు మృతినొందును.

యేశూక్తా శ్శశినోంశాజన్మనివర్గైర్గతైస్తు తాంపశ్యేః,
మరణంహి జన్మభాజా మప్యంతకబద్ధరశ్మీణాం. 114

పూర్వముజెప్పినప్రకార మేరాశియందైనను ఉక్తభాగయం దుండెనేని ఆభాగ మెంతసంఖ్యగలదో అన్నిసంవత్సరములు జీవించును.

ఏవం సర్వప్రయత్నేన జాయమానస్య దేహినః,
హోరాస్థానాని కేంద్రాణి చింతనీయాని తద్యథా. 115
చింతయే జ్జాయమానస్య స్థానరాశిషు నిత్యశః,
బృహస్పతి ర్నృణాంజీవ స్తస్యనిత్యం బృహస్పతేః. 116

పంచదశషట్సమేత శ్చత్వారింశ త్తదైకవింశచ్చ,
త్రింశచ్చత్వారింశత్షష్టిస్త్రింశత్క్రమాయుహోరాయాః. 117
ప్రోక్తా సహజే తుర్యే పంచమకే సప్తమేచ నవమేచ,
దశమే చైకాదశకే గృహేషు జీవస్థితా వర్షాః. 118

మనుష్యులకు ఆయుర్దాయము నిచ్చుగ్రహములలో గురుఁడు ప్రధానుఁడుగాన గురుస్థితిని దెలుసుకొని ఆయుర్నిర్ణయమును జేయవలయును. బృహస్పతి జన్మలగ్నమునకు తృతీయమందుండెనేని ఇరువదియొక్క సంవత్సర మాయుర్దాయము నిచ్చువాఁడగును. ఇట్లే చతుర్థ పంచమ సప్తమ నవమ దశమ ఏకాదశములయందున్నవాఁడై క్రమముగ 40, 21, 30, 40, 60, 30 సంవత్సరము లాయుర్దాయము నిచ్చువాఁడగును.

ఇతి దశమోఽధ్యాయః

---

## చంద్రారిష్టభంగములను దెలుపు పదునొకండవ యధ్యాయము.

సంభూతారిష్టాఖ్యా భంగ స్తేషాం యథా భవేద్యోగైః,
తానాగమతో వక్ష్యే ప్రధానభూతా యత స్తేఽత్ర. 1

పూర్వము జెప్పిన అరిష్టములకు హోరాశాస్త్రమందుఁ జెప్పినరీతిని అరిష్టభంగయోగములను జెప్పుచున్నాను.

ఉడుపతికృతరిష్టానాం భంగస్తావన్నిరూప్యతే పూర్వమ్,
సమ్యక్శేషాణామపి యథామతం బ్రహ్మపూర్వాణామ్. 2

మొదట చంద్రారిష్టములకు భంగమును జెప్పి తరువాత హోరాశాస్త్రజ్ఞులమతానుసారము తక్కిన అరిష్టభంగములను జెప్పుచున్నాను.

సర్వై ర్గగనభ్రమణై ర్దృష్టశ్చంద్రో వినాశయతి రిష్టం,
ఆపూర్యమాణమూర్తి ర్యథాన్నృప స్సనయవిద్వేష్టౄన్ 3

పూర్ణచంద్రుఁడు గ్రహములన్నిటిచేతను జూడఁబడెనేని రిష్టలను హరించును

చంద్రస్సంపూర్ణతను శ్శుక్రేణ నిరీక్షిత స్సుహృద్భాగే,
రిష్టహరాణాం శ్రేష్ఠో వాతహరాణాం యథావస్తిః. 4

పూర్ణచంద్రుఁడు మిత్రనవాంశయందున్న శుక్రునిచేఁ జూడఁబడెనేని రిష్టభంగమును జేయును.

పరమోచ్చే శశిరతను ర్భృగుతనయనిరీక్షితో హరతి రిష్టం,
సమ్యగ్విరేకవమనం కఫవిత్తానాం యథాదోషమ్ 5

పరమోచ్చయందున్న చంద్రుఁడు శుక్రునిచేఁ జూడఁబడెనేని రిష్టలను హరించును.

చంద్రశ్శుభవర్గస్థః క్షీణోఽపి శుభేక్షితో హరతి రిష్టం,
ఫలమివ మహాతిసారం జాతీఫలవల్కలక్వథితమ్ 6

క్షీణచంద్రుఁడైనను శుభవర్గమందుండి శుభులచేఁ జూడఁబడెనేని రిష్టలను హరించును.

సప్తాష్టమషష్ఠస్థాశ్శశినస్సౌమ్యా హరంత్యరిష్టఫలం,
పాపైరమిశ్రచారాః కళ్యాణఘృతం యథోన్మాదమ్ 7

చంద్రునకు షష్ఠసప్తమాష్టమములయందు పాపులతో కలియక శుభులుండిరేని రిష్టలను హరించును.

యుక్తశ్శుభఫలదాయిభి రిందుస్సౌమ్యైర్నిహంత్యరిష్టాని,
తేషామేవ త్ర్యంశే లవణస్రుతిపూరవచ్ఛ్రవణరోగమ్. 8

చంద్రుఁడు ఉచ్చమిత్రస్వక్షేత్రములయందుండి శుభఫలదాయకులైన శుభగ్రహములచేఁ జూడఁబడ్డెనేని అరిష్టములను హరించును. చంద్రుఁడు శుభద్రేక్కాణములయందుండి శుభులచేఁ జూడఁబడెనేనియుం రిష్టలను హరించును.

ఆపూర్యమాణమూర్తిర్ద్వాదశభాగే శుభస్య యది చంద్రః,
రిష్టం నయతి వినాశం తక్రాభ్యాసో యథాగుదజమ్ 9

పూర్ణచంద్రుఁడు శుభద్వాదశాంశయందుండెనేని రిష్టలను హరించును.

సౌమ్యక్షేత్రే చంద్రో హోరాపతినా విలోకితో హంతి,
రిష్టం న వీక్షితోఽన్యైః కులాంగనా కులమివాన్యగతా. 10

చంద్రుఁడు శుభక్షేత్రమందుండి లగ్నాధిపతిచేఁ జూడఁబడి అన్యులచేఁ జూడఁబడకయుండెనేని రిష్టలను హరించును.

క్రూరభవనే శశాంకో భవనేశనిరీక్షిత స్తదనువర్గే,
రక్షతి శిశుం ప్రజాతం కృపణ ఇవ ధనం ప్రయత్నేన. 11

క్రూరక్షేత్రమందైనను క్రూరషడ్వర్గమందైనను చంద్రుఁడుండి లగ్నాధిపతిచేఁ జూడఁబడ్డెనేని రిష్టను హరించును.

జన్మాధిపతిర్బలవాన్సుహృద్భిరభివీక్షిత శ్శుభై ర్భంగం,
రిష్టస్య కరోతి సదా భీరురివ ప్రాప్తసంగ్రామః. 12

జన్మకాలచంద్రాక్రాంతరాశ్యధిపతి బలవంతుఁడై మిత్రులచేతను శుభులచేతను జూడఁబడెనేని రిష్టను హరించును.

జన్మాధిపతిర్లగ్నే దృష్టస్సర్వై ర్వినాశయతి రిష్టం,
ఘృష్టోషణవిదలాభ్యాం ప్రత్యేకకృతాంజనం యథాశుక్లమ్. 13

జన్మకాలిక చంద్రాక్రాంతరాశ్యధిపతి లగ్నమందుండి గ్రహములందఱిచేతను జూడఁబడెనేని రిష్టను హరించును.

స్వోచ్చస్థస్స్వగృహేఽథవాపి సుహృదాం వర్గేఽపి సౌమ్యేఽథవా
సంపూర్ణశ్శుభవీక్షిత శ్శశధరో వర్గే స్వకీయేఽథవా,
శత్రూణామవలోకనేన పతితః పాపైరయుక్తేక్షితో
రిష్టం హంతి సుదుస్తరం దినపతిః ప్రాలేయరాశిం యథా. 14

పూర్ణచంద్రుఁడు ఉచ్చస్వక్షేత్రములయందుగాని శుభమిత్రషడ్వర్గమందు గాని లేక స్వవర్గమందుగాని యుండి శుభులచేఁ జూడఁబడి శత్రువులచేతను పాపగ్రహములచేతను జూడఁబడక కలయక యుండెనేని రిష్టలను హరించును.

శశినోఽంత్యే బుధసితయోరాయే క్రూరేషు వాక్పతౌ గగనే,
దురితం చాతుర్థికమివ నశ్యతి మునికుసుమరసనస్యైః 15

చంద్రునకు ద్వాదశమందు బుధశుక్రులు, ఏకాదశమందు క్రూరగ్రహములు, దశమమందు బృహస్పతి యుండెనేని రిష్టలను హరించును.

లగ్నేశ్వరస్య చంద్రష్షట్త్రిదశాయహిబుకేషు శుభదృష్టః,
శమయతి సమస్తరిష్టా న్యనుయాతే నృపతిరోధ ఇవ. 16

లగ్నాధిపతికి ౩-౪-౬-౧౦-౧౧ స్థానములయందు చంద్రుఁడు శుభదృష్టి గలిగియుండెనేని రిష్టలను హరించును

ఏకో జన్మాధిపతిః పరిపూర్ణబలశ్శుభైర్దృష్టః,
హంతి నిశాకరరిష్టం వ్యాళ ఇవ మృగాన్వనే మత్తః. 17

జన్మకాలచంద్రాక్రాంతరాశ్యధిపతి పూర్ణబలుఁడై శుభులచేఁ జూడఁబడెనేని రిష్టలను హరించును.

ఇతి ఏకాదశోఽధ్యాయః.

## అరిష్టభంగములనుదెలుపు పండ్రెండవ యధ్యాయము.

సర్వాణి మా నతిబలస్స్ఫురదంశుజాలో
లగ్నస్థితః ప్రశమయే త్సురరాజమంత్రీ,
ఏకో బహూని దురితాని సుదుస్తరాణి
భక్త్యా ప్రయుక్త ఇవ చక్రధరే ప్రణామః. 1

ప్రకాశమానాంశుజాలుండగు బృహస్పతి మిక్కిలి బలవంతుండై లగ్నమం దుండెనేని సకలారిష్టములను హరించును.

సౌమ్యగ్రహై రతిబలై ర్విబలైశ్చ పాపై
ర్లగ్నంచ సౌమ్యభవనం శుభదృష్టియుక్తం,
సర్వాపదా విరహితో భవతి ప్రసూతః
పూజాకరః ఖలు యథా దురితైర్గ్రహాణామ్. 2

శుభగ్రహములు బలవంతులై పాపగ్రహములు దుర్బలులై యుండి లగ్నము శుభక్షేత్రమై శుభదృష్టి గలిగియుండెనేని రిష్టభంగము గలుగును.

పాపా యది శుభవర్గే సౌమ్యైర్దృష్టాశ్శుభాంశవర్గస్థైః,
నిఘ్నంతి తదారిష్టం పతిం విరక్తా యథా యువతిః. 3

పాపగ్రహములు శుభషడ్వర్గములయందున్నవై శుభవర్గస్థములగు శుభగ్రహములచేతఁ జూడఁబడెనేని సర్వారిష్టములను గొట్టివేయును.

రాహుస్త్రిషష్ఠలాభే లగ్నాత్సౌమ్యైర్నిరీక్షితస్సద్యః,
నాశయతి సర్వదురితం మారుత ఇవ తూలసంఘాతమ్. 4

రాహువు లగ్నమునకు 3-౬-౧౧-స్థానములయందుండి శుభగ్రహములచేఁ జూడఁబడెనేని రిష్టభంగము గలుగును.

శీర్షోదయేషు రాశిషు సర్వై ర్వర్గగనాధివాసిభిస్స్యాతాం,
ప్రకృతిస్థం చారిష్టం విక్రియతే ఘృతమివాగ్నిస్థం. 5

జన్మకాలమున శీర్షోదయరాశులగు మేషవృషభకర్కటధనుర్మకరము లయిందగ్రహములన్నియు నుండెనేని రిష్టభంగము గలుగును.

తత్కాలే యది విజయీ శుభగ్రహశ్శుభనిరీక్షితస్సద్యం,
నాశయతి సర్వరిష్టం మారుత ఇవ పాదపాన్ప్రబలః. 6

జన్మకాలమందే దైన నొకశుభగ్రహము యుద్ధమునందు జయమునుబొంది శుభగ్రహములచే జూడఁబడుచుండెనేని సర్వరిష్టములను హరించును.

పరివిష్టో గగనచరః క్రూరైశ్చ విలోకితో హరతి రిష్టం,
స్థానం సన్నిహితానాం కృతం యథాభాస్కరగ్రహణే 7

పరివేష్టనగల గ్రహము క్రూరులచే జూడఁబడెనేని రిష్టభంగము గలుగును.

స్నిగ్ధమృదుపవనభాజో జలదాశ్చ తథైవ ఖేచరాశ్శస్తాః,
స్వస్థాః క్షణాచ్చ రిష్టం శమయంతి రజోయథాంబుధారౌఘః 8

రిష్టభంగకులైనగ్రహములు స్వక్షేత్రములయందు బలయుక్తులై యుండిరేని రిష్టభంగము గలుగును (చింత్యము).

ఉదయే చాగస్త్యమునేః సప్తర్షీణాం మరీచిపుత్రాణాం,
సర్వారిష్టం శమయతి తమ ఇవ సూర్యోదయే జగతః 9

అగస్త్యునియొక్క సప్తమహర్షులయొక్క నిత్యోదయము గలుగుచుండఁగా జననమాయెనేని రిష్టభంగము గలుగును.

అజవృషకర్కివిలగ్నే రక్షతి రాహుస్సమస్తపీడాభ్యః,
పృథ్వీపతిః ప్రసన్నః కృతాపరాధం యథా పురుషం 10

మేషవృషభకర్కాటములు లగ్నమై అందు రాహువుండెనేని రిష్టభంగము కలుగును.

యత్నేన భంగమపరే సరోజజన్మాతివిస్మయం కురుతే,
తజ్జ్ఞః కిష్టమనిష్టం సమతిటదేశే యథా సరటః. 11

తాత్పర్య మాలోచింపఁదగినది.

బహవో యది శుభఫలదాః ఖేటాస్తత్రాపి శీర్యతేరిష్టం,
సూర్యాత్త్రికోణ ఇందౌ యథైవ యాత్రా నరేంద్రస్య. 12

ఉచ్చమిత్రస్వక్షేత్రాదులయందుండి శుభఫలముల నిచ్చుగ్రహము లనేకము లుండెనేని రిష్టభంగము కలుగును.

గురుశుక్రౌచ కేంద్రస్థౌ జీవేద్వర్షశతం నరః,
గ్రహానిష్టం హీన స్త్యాశు చంద్రానిష్టం తథైవచ. 13

గురుశుక్రులు కేంద్రములయందుండిరేని గ్రహముల అరిష్టమును చంద్రారిష్టమును నశింపఁజేయును.

బంధ్వాస్పదోదయకళత్రగతౌకులీరే
గీర్వాణనాథసచివస్సకలశ్చ చంద్రః,
జూకేకవీందుతనయౌ నపరేచ లాభే
దుశ్చిక్యశత్రుభవనే ష్వమితం తదాయుః 14

కేంద్రములలో నొకటి కర్కాటకమై అందు, చంద్రగురువు లుండ తుల యందు బుధశుక్రులుండి పాపగ్రహములు తృతీయషష్ఠలాభములయం దుండ నేని బుట్టిన శిశువు అమితాయుర్దాయము గలవాఁడగును.

ఏతే సర్వే భంగా మయా నిరుక్తాః పురాతనాస్సిద్ధాం,
యైర్జ్ఞాతై ర్దైవవిదో నరేంద్రవాల్లభ్యమాయాంతి 15

పురాతనసిద్ధములైన రిష్టభంగయోగములు చెప్పఁబడినవి

ఇతి ద్వాదశోఽధ్యాయః.

---

## చంద్రయోగములను దెలుపు పదుమూఁడవయధ్యాయము.

సునఫాఽనఫాదురుధురా భవంతి యోగాః క్రమేణ రవిరహితైః,
విత్తాంత్యోభయసంస్థైః కైరవవనబాంధవాద్విహగైః 1

సూర్యవ్యతిరిక్తగ్రహములు చంద్రునికి ద్వాదశమందుండెనేని అనఫాయోగమనియు, చంద్రునికి ద్వితీయమందుండెనేని సునఫాయోగమనియు, ద్వితీయద్వాదశములయందు అనఁగా చంద్రునికి ఉభయపార్శ్వములయందుండిరేని దురుధురాయోగమనియుఁ జెప్పఁబడును. రవి ద్వితీయద్వాదశములయందున్నయెడల ఈయోగకర్తలలో గణింపఁబడఁడుగాని ఈయోగములకు భంగములేదని తెలియఁదగినది.

ఏతేన యదాయోగాః కేంద్రగ్రహవర్జితశ్శశాంకశ్చ,
కేమద్రుమోఽతికష్టశ్శశిని సమస్తగ్రహాదృష్టే. 2

చంద్రునకు ద్వితీయద్వాదశములయందును జన్మలగ్నాత్కేంద్రములయందును కుజాదిగ్రహములు లేక చంద్రుఁడు సూర్యాదిగ్రహములచే కలయక చూడఁబడక యుండెనేని కేమద్రుమయోగమని చెప్పఁబడును. ఈకేమద్రుమయోగము దుఃఖకరమైనది.

సునఫాఽనఫాస్సరూపాత్రింశద్యోగా(౩౧)త్రిసంగుణాషష్టిః(౧౮౦),
సంఖ్యాధురుధురాణాం ప్రస్తారవిధౌ సమాఖ్యాతాః. 3

ప్రస్తారవిధిచేతను సునఫానఫాయోగములు ముప్పదియొక్క తెఱంగు ధురుధురా యోగము నూటయెనుబది తెఱంగులు. ప్రస్తారవిధి యనఁగా చంద్రునకు ద్వితీయ మందు కుజుఁడుండెనేని ౧ బుధుఁడు ౨ గురువు 3 శుక్రుఁడు ౪ శని ౫ ఏకవికల్పయోగములు ౫. కుజబుధులు కుజగురులు కుజశుక్రులు కుజశనులు బుధగురులు బుధశుక్రులు బుధశనులు గురుశుక్రులు గురుశనులు శుక్రశనులు చంద్రునకు ద్వితీయమందుండిరేని ద్వివికల్పయోగములు ౧౦. కుజబుధగురులు కుజబుధశుక్రులు కుజబుధశనులు కుజగురుశుక్రులు కుజగురుశనులు కుజశుక్రశనులు బుధగురుశుక్రులు బుధగురుశనులు బుధశుక్రశనులు గురుశుక్రశనులు వీరు చంద్రునకు ద్వితీయమందుండిరేని త్రివికల్పయోగములు ౧౦ యగును. భౌమబుధగురుశుక్రులు భౌమబుధగురుశనులు బుధగురుశుక్రశనులు భౌమబుధశుక్రశనులు భౌమగురుశుక్రశనులు వీరు చంద్రునకు ద్వితీయమందుండిరేని చతుర్వికల్పయోగములు ౫ యగును కుజబుధగురుశుక్రశనులు వీరు చంద్రునకు ద్వితీయమం దుండిరేని పంచవికల్పయోగము ౧. ఇట్లు ముప్పదియొక్కరీతి సునఫాయోగముల యుత్పత్తియని తెలియఁదగినది. ఈప్రకారమే చంద్రునకు ద్వాదశమందుండిరేని అనఫాయోగముల భేదములను తెలియఁదగినది దురుధురాయోగభేదములున్ను ఇట్లే యుభయపార్శ్వములయందును నూటయెనుబది తెఱంగులని తెలియఁదగినది.

శ్రీమాన్ స్వబాహువిభవో బహుధర్మశీలః
శాస్త్రార్థవిద్బహుయశాః స్వగుణాభిరామః,
శాంతస్సుఖీ క్షితిపతి స్సచివోఽథవాస్యా
త్స్యాతః పుమా న్విపులధీ స్సునఫాభిధానే 4

సునఫాయోగమందుఁ బుట్టినవాఁడు ఐశ్వర్యము స్వార్జితధనము ధర్మము విద్య యశస్సు శాంతము సుఖము యోగ్యమైనబుద్ధి మొదలగు గుణములు కలవాఁడై రాజైనను లేక మంత్రిగాని యగును (అనఁగా తత్తుల్యమైన ఐశ్వర్యము కలవాఁడనుట.)

వాగ్మీ ప్రభు ర్విగతరోగవపు స్సుశీలో
భోక్తాన్నపానకుసుమాంబరభామినీనాం,
ఖ్యాతస్సమాహితగుణ స్సుఖిత స్తుచిత్తో
యోగే నిశాకరకృతే త్వనఫే సువేషః. 5

అనఫాయోగమందుఁ బుట్టినవాఁడు వివేచనగలిగి మాటలాడువాఁడు, ప్రభుసమానుఁడు, ధనము యోగ్యమైనగుణములు గలవాఁడు, స్వచ్ఛందవనితాదుల ననుభవించువాఁడు, ప్రసిద్ధుఁడు, సుఖము స్వస్థచిత్తము మొదలయినవి కలవాఁడగును.

వాగ్బుద్ధివిక్రమగుణైః ప్రథితః పృథివ్యామ్
స్వాతంత్ర్యసౌఖ్యధనవాహనభోగభోగీ,
దాతా కుటుంబధనపోషణలబ్ధఖేదః
సద్వృత్తవా న్దురుధురాప్రభవో ధురిష్ఠః. 6

దురుధురాయోగమందుఁ బుట్టినవాఁడు వాగ్బుద్ధిపరాక్రమములచే ప్రసిద్ధుఁడు, స్వతంత్రుఁడు, ధనికుఁడు, కూడబెట్టక అనుభవించువాఁడు, దాత, జనపోషకుఁడు, అగ్రేసరుఁడు నగును.

కాంతాన్నపానగృహవస్త్రసుహృద్విహీనః
దారిద్ర్యదుఃఖగదదైన్యమలైరుపేతః,
ప్రేష్యః ఖలస్సకలలోకవిరుద్ధవృత్తిః
కేమద్రుమే భవతి పార్థివవంశజోఽపి 7

భార్యయు అన్నము గృహము వస్త్రము మొదలయినవి లేనివాఁడు, దారిద్ర్యముచే మిక్కిలి పీడపెట్టఁబడువాఁడు, భృత్యుఁడు, దుర్మార్గుఁడు, సర్వజనవిరోధియు నగును రాజవంశజుఁడైనను ఇట్టిగుణములు గలవాఁడగును.

కేంద్రాదిస్థై ర్గ్రహై ర్యోగాః కీర్తితా యేఽనఫాదయః,
తాన్ప్రధానా న్సమానానాన్స్వాం శ్చంద్రయూపాన్విచింతయేత్. 8

కేంద్రములఁ బొందిన గ్రహములవలన యేఅనఫాదియోగములు శాస్త్రకర్తలచే చెప్పఁబడినవో అందు ప్రధానమైన యోగముల నాలోచింపఁదగినది.

భౌమాదీనాం బలం దేశం జాతస్యచ కులం బుధః,
విజ్ఞాయ ప్రవదేత్సమ్యక్సునఫాదికృతం ఫలమ్ 9

కుజాదిగ్రహములయొక్క బలమును దేశమును జాతకునియొక్క కులము మొదలగువానిని కనుఁగొని దైవజ్ఞుఁడు ఫలములను జెప్పవలయును అట్లుగానిచో ఃఫలము లగును.

విక్రమవిత్తప్రాయో నిష్ఠురవచన శ్చమూపతిశ్చండః,
హింస్రోదంభవిరోధీ సునఫాయాం భౌమసంయోగే. 10

సునఫాయోగమందు అనఁగా చంద్రునకు ద్వితీయమందు కుజుఁడుండఁగా నేని పుట్టినవాఁడు పరాక్రమము ధనము కఠినవాక్కు సేనాధిపత్యము హింసదంభము విరోధము మొదలయినవి కలవాఁడగును.

శ్రుతిశాస్త్రగేయకుశలో ధర్మపరః కావ్యకృన్మనస్వీచ,
సర్వహితో రుచిరతనుః సునఫాయాం సోమజే భవతి. 11

సునఫాయోగమందు బుధుఁడుండెనేని వేదశాస్త్రజ్ఞుఁడు ధార్మికుఁడు కవిత్వము దెలిసినవాఁడు మానవంతుఁడు సర్వజనప్రియుఁడు సుందరశరీరము మొదలగు నవి కలవాఁడగును.

విద్యాచార్యం ఖ్యాతం నృపతిం నృపతిప్రియం వాపి,
సుకుటుంబధనసమృద్ధం సునఫాయాం సురగురుః కురుతే. 12

సునఫాయోగమందు గురువుండెనేని బుట్టినశిశువు సర్వశాస్త్రములు దెలిసిన వాఁడు, ప్రఖ్యాతిగలవాఁడు, కుటుంబము ధనము మిక్కిలికలవాఁడై రాజైనను లేక రాజప్రియుఁడైనను అగును.

స్త్రీక్షేత్రవిత్తవిభవ శ్చతుష్పదాఢ్యస్సువిక్రమో భవతి,
నృపసత్కృత స్సుధీరో దక్ష శ్శుక్రేణ సునఫాయామ్. 13

సునఫాయోగమందు శుక్రుఁడుండఁగాఁ బుట్టినవాఁడు స్త్రీ క్షేత్రము ధనము పశువులు మొదలుగాఁగల ఐశ్వర్యముగలవాఁడు, పరాక్రమము రాజసన్మానము మొద లగునవి కలవాఁడగును.

నిపుణమతిర్గ్రామపురై ర్నిత్యం సంపూజితో ధనసమృద్ధః,
సునఫాయాం రవిపుత్రే క్రియాసు గుప్తో భవేద్ధీరః. 14

ఇతి సునఫాప్రకారః.

సునఫాయోగమందు శనియుండఁగాఁ బుట్టినవాఁడు మంచిబుద్ధిగలవాఁడు, పుర జనులచేఁ బూజింపఁబడువాఁడు, ధనము ధైర్యము గోప్యమైన కార్యారంభములు మొదలయినవి కలవాఁడగును.

ఇది సునఫాప్రకారము.

చోరస్వామీ ధృష్టస్స్వవశో మానీ రణోత్కటః క్రోధీ,
శ్రేష్ఠశ్లాఘ్య స్సుతనుః కుజేఽనఫాయాం సులాభశ్చ. 15

కుజుఁడు అనఫాయోగమందు అనఁగా చన్ద్రగ్రహమున [illegible] స్థానమందు ఉండఁగా బుట్టినవాఁడు చోరాధిపతి, మాన్యుఁడు, రణమం[illegible] క్రోధము మొదలగు గుణములుకలవాఁడై కొనియాడఁదగినవాఁడగును.

గంధర్వాలేఖ్యపటుః కవిః ప్రవక్తా నృపాత్తసత్కారః,
రుచిరతను స్త్వనఫాయాం ప్రసిద్ధకర్మా బుధేన భవేత్ 16

అనఫాయోగమందు బుధుఁడుండఁగాఁ బుట్టినవాఁడు చిత్రలేఖనమందు సమర్థుఁడు, కవిత్వము తెలిసినవాఁడు, మధురమైనవాక్కులు కలవాఁడును, రాజానుగ్రహము వల్ల గలిగిన ఐశ్వర్యముగలవాఁడు, సుందరశరీరముగలవాఁడగును

గాంభీర్యసత్త్వమేధాస్థానరతో బుద్ధిమాన్ నృపాత్తయశాః,
అనఫాయాం త్రిదశగురౌ సంజాత స్సత్కవి ర్భవతి. 17

అనఫాయోగమందు గురువుండెనేని గాంభీర్యము సత్త్వము మేధాబుద్ధి రాజపూజ్యత మొదలగు ప్రసిద్ధగుణములు కలవాఁడగును.

యువతీనామతిసుభగః ప్రణయీ క్షితిపస్య భోగవాన్ ఖ్యాతః,
కాంతః కనకసమృద్ధ స్త్వనఫాయాం భార్గవే భవతి 18

అనఫాయోగమందు శుక్రుఁడుండెనేని స్త్రీల కత్యంతప్రియుఁడు, రాజప్రియుఁడు, భోగము ఖ్యాతి సౌందర్యము మొదలగు గుణములు కలవాఁడై మిక్కిలి ధనవంతుఁడగును

విస్తీర్ణభుజో నేతా గృహీతవాక్యశ్చతుష్పదసమృద్ధః,
దుర్వనితాయాం భక్తో గుణసహిత శ్శార్కిపుత్రేణ. 19

ఇ త్యనఫాప్రకారః.

అనఫాయోగమందు శనియుండెనేని పొడవైన భుజములుగలవాఁడు, అధిపతి, పరేంగితజ్ఞానము గలవాఁడు, పశుసమృద్ధి గలవాఁడు, దుష్టస్త్రీలయం దాసక్తిగలవాఁడు, మంచిగుణములు గలవాఁడగును.

ఇది అనఫాప్రకారము

అనృతికో బహువిత్తో నిపుణోఽతిశఠోఽధికో లుబ్ధః,
వృద్ధాసతీప్రసక్తః కులాగ్రణీ శ్శశిని భౌమబుధమధ్యే. 20

అనేకప్రకారములుగ దురుధురాయోగమందుఁ బుట్టినవానిస్వభావమును జెప్పుచున్నాఁడు:—చంద్రుఁడు కుజబుధులకు మధ్యనుండెనేని బుట్టినవాఁడు అనృతమందాసక్తిగలవాఁడు, మిక్కిలి ధనవంతుఁడు, నిపుణుఁడు, కపటముగలవాఁడు, లుబ్ధుఁడు, వృద్ధస్త్రీరతుఁడు, కులశ్రేష్ఠుఁడు నగును.

ఖ్యాతః కర్మసు విభవీ బహుజనవైరస్త్వమర్షణో హృష్టః,
కులరక్షీ కుజగుర్వో స్సంగ్రహశీల శ్శశిని మధ్యే 21

చంద్రుఁడు కుజగురువులకు మధ్యనుండెనేని బుట్టినవాఁడు దయగలవాఁడు, కులరక్షణయందు సమర్థుఁడు, సంగ్రహమం దాసక్తిగలవాఁడు అగును.

ఉత్తమరామస్సుభగో వివాదశీలశ్శుచిశ్చ వేదదక్షః,
వ్యాయామీ రణశూర స్సితారయోర్మధ్యగే చంద్రే. 22

చంద్రుఁడు శుక్రకుజులకు మధ్యనుండెనేని సౌందర్యముగలవాఁడు, కలహప్రియుఁడు, శుచిగలవాఁడు, రణప్రియుఁడు, సమర్థత మొదలయినగుణములు గలవాఁడగును.

కుత్సితయోషిద్రమణో బహుసంచయకారకో వ్యసనతప్తః,
క్రోధీ పిశునో రిపుమాన్ యమారయో స్స్యాద్ధురుధురాయామ్

చంద్రుఁడు శనికుజులమధ్యనుండెనేని బుట్టినవాఁడు కుత్సితభార్యగలవాఁడు, ఆర్జనయం దాసక్తిగలవాఁడు, వ్యసనముచే తపించువాఁడు, క్రోధముగలవాఁడు, లుబ్ధత్వము శత్రువులు గలవాఁడగును

ధర్మపర శ్శాస్త్రజ్ఞో వాచాల స్సత్కవి ర్ధనోపేతః,
త్యాగయుతో విఖ్యాతో బుధగురుమధ్య స్థితే చంద్రే. 24

చంద్రుఁడు బుధగురువులమధ్య నుండెనేని బుట్టినవాఁడు కవిత్వము ధనము ఖ్యాతి త్యాగము మొదలయినవి కలవాఁడగును.

ప్రియవాక్సుభగః కాంతః ప్రవృత్తగేయాదిషు ప్రియో భవతి,
సేవ్య శ్శూరో మంత్రీ బుధసితయో ర్దురుధురాయోగే. 25

చంద్రుఁడు బుధశుక్రులమధ్యనుండుండెనేని బుట్టినవాఁడు ప్రియమైన మాటలాడువాఁడు, సౌందర్యముగలవాఁడు, నృత్తగీతాదులయం దాసక్తిగలవాఁడు, సేవకులుకలవాఁడు, శూరుఁడు నగును.

దేశాద్దేశం గచ్ఛతి విత్తపరో నాతివిద్యయా సహితః,
చంద్రేఽన్యేషాం పూజ్యస్స్వజనవిరోధీజ్ఞమందయోర్మధ్యే. 26

చంద్రుఁడు బుధశనులమధ్య నుండెనేని స్వల్పమైన విద్యగలవాఁడు, ధనమం దాసక్తిగలవాఁడు, దేశాటనము జేయువాఁడు, స్వజనవిరోధి, అన్యులచే మిక్కిలి పూజింపఁబడువాఁడు నగును.

ధృతిమేధా శౌర్యయుతో నీతిజ్ఞః కనకరత్నపరిపూర్ణః,
ఖ్యాతో నృపకృత్యకరో గురుసితయో ర్దురధురాయోగే. 27

చంద్రుఁడు గురుశుక్రులమధ్యనుండెనేని బుట్టినవాఁడు ధైర్యము మేధ శౌర్యము నీతి ఖ్యాతి రాజకార్యాసక్తి మొదలయినవికలవాఁడై బంగారము రత్నములు మొదలయినవానిచే పరిపూర్ణుఁడగును.

సుఖనయవిజ్ఞానయుతః ప్రియవాగ్విద్వాన్ ధురంధరోనాఢ్యః,
శాంతో ధనీ సురూప శ్చంద్రే గురుభానుజాంతస్థే. 28

చంద్రుఁడు గురుశనులమధ్య నుండెనేని బుట్టినమనుజుఁడు సుఖము నీతి జ్ఞానము ప్రియవాక్కులు విద్య మొదలయినవి కలవాఁడగును.

వృద్ధచరితం కులాగ్ర్యం నిపుణం స్త్రీవల్లభం ధనసమృద్ధం,
నృపసత్కృతం బహుధనం కురుతే చంద్రస్సితాసితయోః. 29

ఇది దురుధురాప్రకరణమ్.

చంద్రుఁడు శుక్రశనులమధ్య నుండెనేని బుట్టినవాఁడు కులశ్రేష్ఠుఁడు నిపుణుఁడు స్త్రీలోలుఁడు ధనము రాజసన్మానము మొదలయినవి కలవాఁడగును.

ఇది దురుధురాప్రకరణము.

సూర్యాత్కేంద్రాదిగతో నిశాకరస్స్వల్పమధ్యభూయిష్ఠాన్,
కుర్యాత్క్రమేణ ధనధీ నైపుణవిజ్ఞానవినయాంశ్చ. 30

సూర్యునకు కేంద్రములయందు చంద్రుఁడుండెనేని ధనము బుద్ధి మొదలగునవి స్వల్పముగ గలవాఁడగును. సూర్యునకు పణపరరాసులయందు చంద్రుఁడుండెనేని పైనజెప్పిన ధనము బుద్ధి మొదలగునవి మధ్యమముగ నుండును. సూర్యునకు ఆపోక్లిమ రాసులయందు చంద్రుఁడుండెనేని ధనము బుద్ధి నిపుణత జ్ఞానము మొదలయినవి విశేషముగ నుండును.

ఔత్పాతికః కృశతను ర్నిశిచాప్యదృశ్యో
దృశ్యోదివా శిశిరగు ర్భయశోకదస్స్యాత్,
ఏవం స్థిత స్సమఫలం పృథివీపతిత్వం
యాతోన్యథా ప్రకురుతే పరిపూర్ణమూర్తిః. 31

క్షీణుఁడై పరివేషాద్యుత్పాతములతో కూడిన చంద్రుఁడు అదృశ్యచక్రార్థమందుండఁగా రాత్రి జన్మకలవాఁడు; పూర్వోక్తప్రకారము క్షీణచంద్రుఁడు దృశ్యచ

క్రార్థమందుండఁగా పగలు జన్మకలవాఁడు భయము శోకము మొదలయినవి కలవాఁడగును. విపరీతముగ నుండెనేని రాజ్యాధిపత్యము మొదలగునవి కలుగును. అనఁగా చంద్రుఁడు దృశ్యచక్రార్థమందుండఁగా రాత్రి జన్మ, అదృశ్యచక్రార్థమందుండఁగా పగలు జన్మ కలిగెనేని రాజ్యాధిపత్యము మొదలగునవి కలుగునని తెలియఁదగినది.

లగ్నాదుపచయసంస్థైశ్శుభై స్సమస్తైర్మహాధనో ద్వాభ్యాం,
మధ్యం చైకేనాథ మమేవం చంద్రాదపి తదూనః. 32

లగ్నమువల్లనుంచి ఉపచయములగు తృతీయషష్ఠదశమైకాదశములయందు బుధగురుశుక్రులు ముగ్గురు ఉండిరేని జాతకుఁడు అధికధనవంతుఁడగును. చంద్రునకు ఉపచయములయందు బుధగురుశుక్రులు ముగ్గురు ఉండిరేని జాతకుఁడు ధనవంతుఁడగును. లగ్నమువల్లనుంచి ఉపచయములయందు ఇద్దరు శుభులుండిరేని సామాన్యధనికుఁడగును. చంద్రునకు ఉపచయములయం దిద్దరు శుభులుండిరేని స్వల్పధనవంతుఁడగును. లగ్నమువల్లనుంచి ఉపచయములయందు ఒకశుభగ్రహముండెనేని స్వల్పధనికుఁడగును చంద్రునకు ఉపచయమం దొకశుభగ్రహముండెనేని అతిస్వల్పమైనధనము గలవాఁడగును.

అధియోగాదయోఽన్యేఽపి మయాత్రైవ న కీర్తితాః,
నృపయోగా యత స్తే హి వక్ష్యే తత్రైవ తా నహమ్. 33

ఇతరములైన అధియోగాదులు రాజయోగములగుటవలన రాజయోగాధ్యాయమందుఁ జెప్పఁబడినవి. అందుచే ఈస్థలమందు నాచేఁ జెప్పఁబడలేదు.

ఇతి త్రయోదశోఽధ్యాయః.

---

## వేశివాశ్యుభయచరులను దెలుపు పదునాల్గవ యధ్యాయము.

సూర్యాద్వ్యయగై ర్వాశిర్ద్వితీయగైశ్చంద్రవర్జితై ర్వేశిః,
ఉభయస్థితై ర్గ్రహేంద్రై రుభయచరీ నామతః ప్రోక్తా. 1

సూర్యునకు ద్వాదశమందు చంద్రాతిరిక్తగ్రహములుండెనేని వాశియనియు, ద్వితీయమందు చంద్రాతిరిక్తగ్రహములుండెనేని వేశియనియు, ద్వితీయద్వాదశములయందు అనఁగా సూర్యునకు ఉభయపార్శ్వములయందును చంద్రాతిరిక్తగ్రహములుండెనేని ఉభయచరియనియుఁ బేరుబొందును.

మందదృశం స్థిరవచనం పరిభూతపరిశ్రమం నతోర్ధ్వతనుం,
కథయతి యవనాధిపతి ర్వేశిసముత్థం తథాపురుషమ్. 2

వేశియోగమందు (అనఁగా సూర్యునకు ద్వితీయమందు చంద్రాతిరిక్తగ్రహ ముండెనేని) బుట్టినవాఁడు మందదృష్టిగలవాఁడు, స్థిరవాక్కుగలవాఁడు, తిరస్కరింపఁబడిన వ్యాపారముగలవాఁడు వంగినశరీరము మొదలయినవి కలవాఁడని యవనాచార్యులచే చెప్పఁబడినది.

వసుసంచయవిత్తసుహృత్సాన్యద్వేశౌ సురగురౌ భవతి జాత.,
భీరుః కార్యోద్విగ్నో లఘుచేష్టో భృగుసుతే పరాధీనః 3

వేశిస్థానమందు అనఁగా సూర్యునకు ద్వితీయరాశియందు గురువుండెనేని బుట్టినవాఁడు ధనార్జనయం దాసక్తి గలవాఁడు, స్నేహితులు కలవాఁడు అగును. శుక్రుఁడుండెనేని భయము అల్పారంభము మొదలయినవి కలుగును.

పరికర్మకో దరిద్రో మృదుర్వినీతో బుధే సలజ్జశ్చ,
మార్గలఘుః క్షితిపుత్రే పరోపకారీ నరో వేశౌ. 4

బుధుఁడుండెనేని పనులుచేయువాఁడు, దరిద్రుఁడు, లజ్జ మొదలయినవి కలవాఁడగును. కుజుఁడుండెనేని సూక్ష్మమార్గము తెలిసినవాఁడు, పరోపకారి యగును.

పరదారరత శ్ఛండో వృద్ధాకార శ్శఠో ఘృణీ,
భవే న్మనుష్య స్సధనో యాతే వేశిం శనైశ్చరే. 5

ఇతి వేశిప్రకరణమ్.

వేశిస్థానమందు శని యుండెనేని బుట్టినవాఁడు పరదారాసక్తుఁడు, పరాక్రమము కలవాఁడు, పాలిపోయిన శరీరముకలవాఁడు, కపటము గలవాఁడు, దయగలవాఁడు, ధనవంతుఁడు అగును.

ఇది వేశిప్రకరణము.

ఉత్సృష్టవచాస్స్మృతిమానుద్యోగయుతో నిరీక్షితే తిర్యక్,
పూర్వశరీరే పృథులో నృపతిసమ స్సాత్త్వికో వాశౌ. 6

వాశిస్థానమందు అనఁగా సూర్యునకు ద్వాదశస్థానమందు చంద్రాతిరిక్తగ్రహములుండఁగాఁ బుట్టినవాఁడు విరివిగ మాటలాడువాఁడు, జ్ఞాపకశక్తిగలవాఁడు, ఉద్యోగముగలవాఁడు, కీగంట ప్రసారముగలవాఁడు, విపులమైన పూర్వకాయము గలవాఁడు, రాజతుల్యుఁడు, సాత్త్వికుఁడు అగును.

ధృతిసత్వబుద్ధియుక్తో భవతి గురౌ వేశికే వచనసారః,
శూరః ఖ్యాతో గుణవాన్ యశస్కరో భార్గవే పురుషః. 7

వాశిస్థానమందు గురువుండఁగాఁ బుట్టినవాఁడు ధైర్యము, బుద్ధి, నిపుణ వాక్కులు మొదలయినవి కలవాఁడగును. శుక్రుఁడుండనేని శూరుఁడు, గుణవంతుఁడు, యశస్సు మొదలయినవి కలవాఁడగును.

ప్రియభాషీ రుచిరతనుర్వాశ్యాం స్యాద్బోధనే పరాజ్ఞాకృత్,
సంగ్రామే విఖ్యాతో భూమిసుతే నాన్యవాక్యశ్చ. 8

వాశిస్థానమందు బుధుఁడుండెనేని ప్రియభాషి సౌందర్యముగలవాఁడు అగును కుజుఁడుండెనేని యుద్ధమందు ఖ్యాతిగలవాఁడు, అయుక్తముగ మాటలాడువాఁడు అగును.

వణిక్కులస్వభావస్స్యాత్పరద్రవ్యాపహారకః,
గురుద్వేషీ సునిస్త్రింశో గతే వాశిం శనైశ్చరే. 9

వాశిస్థానమందు శని యుండెనేని వైశ్యస్వభావముగలవాఁడు, పరద్రవ్యాపహారి, గురుద్వేషి, వాడిగల పెద్దకత్తిగలవాఁడగును.

సన్నిరీక్ష్య రవేర్వీర్యం గ్రహాణాం చాపి తత్వతః,
రాశ్యంశసంగమాత్సర్వం ఫలం బ్రూయాద్విచక్షణః. 10

సూర్యునిబలమును చంద్రాతిరిక్తగ్రహములబలమును ఆలోచించి రాశ్యంశసంచారము ననుసరించి ఫలములను దైవజ్ఞులు జెప్పఁదగినది.

సర్వంసహ స్సుభద్ర స్సమకాయ స్సుస్థిరో విపులసత్వః,
నాత్యుచ్చః పరిపూర్ణో విద్యాయుక్తో భవేదుభయచర్యామ్. 11

ఉభయచరియందు (అనఁగా సూర్యునకు ఉభయపార్శ్వములయందు అనఁగా ద్వితీయద్వాదశములయందు) చంద్రాతిరిక్తగ్రహములుండిరేని జాతకుఁడు విశేషభూమి గలవాఁడు, మంగళప్రదుఁడు, సమమైన శరీరముగలవాఁడు, స్థిరుఁడు, సత్వగుణప్రధానుఁడు విద్యమొదలగునవి కలవాఁడగును.

సుభగో బహుభృత్యధనో బంధూనామాశ్రయో నృపతితుల్యః,
నిత్యోత్సాహీ హృష్టో భుంక్తే భోగానుభయచర్యామ్ 12

ఉభయచరియోగమందుఁ బుట్టినవాఁడు సౌందర్యముగలవాఁడు, విస్తారముగ భృత్యులు ధనము గలవాఁడు, బంధుపోషకుఁడు, రాజపూజ్యతగలవాఁడు, ఎల్లప్పుడు ఉత్సాహముగలవాఁడు, భోగములను అనుభవించువాఁడు అగును.

ఇతి చతుర్దశోఽధ్యాయః.

---

ద్విగ్రహయోగములను దెలుపు పదునైదవయధ్యాయము.

యవనాచార్యైర్వృద్ధై ర్ద్విగ్రహయోగేషు యత్ఫలం ప్రోక్తం,
తదహ మపహాయ మత్సరమధునా వక్ష్యే విశేషేణ. 1

ప్రాచీనులైన యవనాచార్యులచే యే ద్విగ్రహయోగములు జెప్పఁబడినవో మాత్సర్యమును వదలి ఆయోగములనే విస్తరించి చెప్పుచున్నాను.

యువతీనాం వశగస్స్యాదవినీతః కూటవిత్పృథులవిత్తః,
ఆసవవిక్రయకుశలో రవ్యుడుపత్యోః క్రియానిపుణః 2

ప్రసవకాలమున రవిచంద్రులు కలసియుండిరేని స్త్రీవశవర్తి, నీతిలేనివాఁడు, కపటమెఱిఁగినవాఁడు, ధనికుఁడు, కార్యములయందు నిపుణత మొదలగు గుణములు గలవాఁడగును

ఓజస్వీ సాహసికో మూర్ఖో బలసత్వసంయుతోఽనృతవాక్,
పాపమతి ర్వధనిరతో రవికుజయో స్స్యా త్ప్రచండశ్చ. 3

రవికుజులు కలసియుండిరేని సాహసము మూర్ఖత బలము సత్వము అనృతము పాపబుద్ధి కోపము మొదలయినవి కలవాఁడై వధయం దత్యాసక్తి గలవాఁడగును.

సేవాకృదస్థిరధనో రవిజ్ఞయోః ప్రియవచాయశోర్థస్స్యాత్,
ఆర్యః క్షితిపతిదయిత స్సతాం చ బలరూపవిత్తవిద్యావాన్. 4

రవిబుధులు కలసియుండిరేని సేవయు అస్థిరమైనధనము ప్రియవచనములు గలవాఁడు, యశస్సే ధనముగాఁగలవాఁడు, పూజ్యుఁడు రాజప్రియుఁడు, సత్పురుషులలో శ్రేష్ఠుఁడు, బలము రూపము ద్రవ్యము మొదలగునవి కలవాఁడగును.

బహుధర్మో నృపసచివః సుబుద్ధిమాన్మిత్రసంశ్రయార్థాప్తః,
సూర్యే బృహస్పతియుతే భవే దుపాధ్యాయసంజ్ఞశ్చ. 5

రవిగురువులు కలసియుండిరేని ధార్మికుఁడు, రాజమంత్రి, బుద్ధిమంతుఁడు, మిత్రులవలన రాఁబడిన ధనముగలవాఁడు, ఉపాధ్యాయుఁడు అగును.

శస్త్రప్రహరణవిద్యాశక్తియుతో నేత్రదుర్బలశ్చరమే,
రంగజ్ఞో రవిసితయో స్స్త్రీసంగాల్లబ్ధబంధుధనః 6

రవిశుక్రులు కలసియుండిరేని శస్త్రవిద్య మొదలుగాఁగల విద్యలయందు నిపుణుఁడు, వార్ధకమందు దృష్టిబలము లేనివాఁడు, నాట్యక్రియలను దెలిసినవాఁడు, వివాహానంతరము ధనము బంధువులుగలవాఁడు అగును.

ధాతుజ్ఞో ధర్మమయస్స్వధర్మనిరతః ప్రణష్టసుతదారః,
నిజవంశగుణై శ్శుద్ధ శ్శనిరవ్యో రల్పశీలశ్చ. 7

రవిశనులు కలసియుండిరేని భార్య పుత్రులు మొదలుగాఁగలవారివలన ఖేదము గలవాఁడు, స్వధర్మమం దాసక్తి మొదలైనగుణములు కలవాఁడగును.

శూరో రణప్రతాపీ మల్లోఽస్రృగ్వేదనార్తదేహశ్చ,
మృచ్చర్మధాతుశిల్పీ కూటజ్ఞశ్చంద్రకుజయోగే. 8

జననకాలమున చంద్రకుజులు కలసియుండిరేని శూరుఁడు, రణమందు ప్రతాపము గలవాఁడు, బాహుయుద్ధము సేయువాఁడు, రక్తవేదనవలన కలుగు వ్యాధిచే పీడితుఁడు, మత్తుఁడు, ధర్మము మొదలగువానిచే చిత్తరువులు సేయువాఁడు, కపటము గలవాఁడు అగును.

కావ్యకథాస్వతినిపుణస్సధనస్త్రీసమ్మతస్సురూపశ్చ,
స్మితవదనశ్శశిబుధయోర్ధర్మరుచిస్స్యాద్విశిష్టగుణః 9

చంద్రబుధులు కలసియుండిరేని జాతకుఁడు కావ్యకథలయందు నిపుణుఁడు, ధనికుఁడు, స్త్రీజితుఁడు, సౌందర్యముగలవాఁడు, చిరునగవుతోఁ గూడిన ముఖముగల వాఁడు, ధర్మమం దాసక్తి మొదలగుగుణములు గలవాఁడగును.

దృఢసౌహృదో వినీతిస్స్వబంధుసమ్మానకృద్ధనేశశ్చ,
గుర్విందోశ్శుభశీలస్సురద్విజేభ్యో రతో భవేత్పురుషః. 10

గురుచంద్రులు కలసియుండిరేని స్థిరమైన స్నేహితులు గలవాఁడు, నీతిగల వాఁడు, ధనికుఁడు, బంధువులను సత్కరించువాఁడు, దేవబ్రాహ్మణభక్తి మొదలయినవి గలవాఁడగును.

స్రగ్ధౌతాంబరయుక్తః క్రియావిధిజ్ఞః కులప్రియోఽత్యలసః,
క్రయవిక్రయేషు కుశల శ్శశిభార్గవయో స్సదా యోగే. 11

చంద్రశుక్రులు కలసియుండిరేని బుట్టినవాఁడు పుష్పమాలికలు ధౌతాంబరములు మొదలగు పరిమళద్రవ్యముల ననుభవించువాఁడు, కార్యవిధులను దెలిసినవాఁడు, వంశమందుఁ శ్రేష్ఠుఁడు, మిక్కిలి అలసుఁడు, క్రయవిక్రయములందు నేర్పరి అగును.

జీర్ణవధూజనరమణో గజాశ్వసంపాదకో నిగమశీలః,
వశ్యో విధనః పురుషః పరాజితస్స్యాచ్ఛశాంకశనియోగే 12

చంద్రశనులు కలసియుండిరేని జాతకుఁడు వృద్ధాంగనాప్రియుఁడు, గజములు అశ్వములు మొదలగునవి కలవాఁడు, వేదమందు దాసక్తిగలవాఁడు, జనవశ్యుఁడు, ధనహీనుఁడు, పరాజితుఁడు అగును.

స్త్రీదుర్భగోఽల్పవిత్తస్సువర్ణలోహప్రకారకస్తస్యపతిః,
దుష్టస్త్రీవిధవానాం కుజబుధయోరౌషధక్రియానిపుణః 13

జననకాలమున కుజబుధులు కలసియుండిరేని బుట్టినవాఁడు దుష్టస్త్రీగలవాఁడు, స్వల్పధనికుఁడు, సువర్ణాదులను సేయువాఁడు, దుష్టలైన విధవాంగనలకు ప్రియుఁడు, ఔషధములు జేయుటయందు నేర్పరి అగు.

శిల్పశ్రుతిశాస్త్రజ్ఞో మేధావీ వాగ్విశారదో మతిమాన్,
అస్త్రప్రియప్రధానస్సురగురుకుజయోస్సమాగతయోః. 14

కుజగురువులు కలసియుండిరేని శిల్పమును వేదశాస్త్రములను దెలిసినవాఁడు, ధారణగల బుద్ధిగలవాఁడు, నేర్పుగ మాటలాడువాఁడు బుద్ధిమంతుఁడు, అస్త్రవేత్తలలో శ్రేష్ఠుఁడు అగును

పూజ్యోగణప్రధానో గణితజ్ఞోఽన్యాంగనాసక్తః,
ద్యూతానృతశాఠ్యరతో విటశ్చ సితరుధిరసంయోగే. 15

కుజశుక్రులు కలిసియుండిరేని పుట్టినవాఁడు పూజ్యుఁడు, సేనానాయకుఁడు, గణితజ్ఞుఁడు, పరస్త్రీసంసక్తుఁడు, కోపముగలవాఁడు, ద్యూతము అనృతము దెలిసిన వాఁడు అగును.

ధాత్వింద్రజాలకుశలః ప్రపంచకస్తేయకర్మకుశలశ్చ,
కుజసౌరయో ర్విధర్మ శ్శస్త్రవిషఘ్నః కలిరుచిస్స్యాత్. 16

కుజశనులు కలసియుండిరేని గైరికాదిధాతువులచే ఇంద్రజాలములయందు కుశలుఁడు, విస్తరించువాఁడు, దొంగతనమందు నేర్పరి, ధర్మశూన్యుఁడు, శస్త్రవిషాదులచే మరణము నొందువాఁడు, అనృతమందు దాసక్తిగలవాఁడు అగును

నృత్తవిధేర్విజ్ఞాతా ప్రాజ్ఞోఽపి చ గేయశాస్త్రవిన్మనుజః,
బుధగురుయోగేమతిమాన్ సౌఖ్యయుతో జాయతేఽవశ్యం. 17

గురుబుధులు కలసియుండిరేని నాట్యవిద్య నెఱిఁగినవాఁడు, ప్రాజ్ఞుఁడు, సంగీత శాస్త్రమును దెలిసినవాఁడు, బుద్ధిమంతుఁడు, సౌఖ్యము మొదలగు ఉత్తమగుణములు కలవాఁడగును.

అతిశయధనో నయజ్ఞో బహుశిల్పీ వేదవిత్సువాక్యస్స్యాత్,
గీతజ్ఞో హాస్యరతి ర్బుధసితయో ర్గంధమాల్యరుచిః. 18

బుధశుక్రులు కలసియుండిరేని గొప్పధనికుఁడు, నీతితెలిసినవాఁడు, శిల్పము తెలిసినవాఁడు, వేదములను తెలిసినవాఁడు, నేర్పుగ మాటలాడువాఁడు, గానము హాస్యము మొదలయినవి తెలిసినవాఁడు, స్వచ్ఛందనాదుల ననుభవించువాఁడు అగును.

ఋణవాన్ దంభః ప్రాయః ప్రపంచక స్సత్కవి ర్గమనశీలః,
నిపుణ శ్శోభనవాక్యో బుధశనియోగే పుమాన్ భవతి. 19

బుధశనులు కలసియుండిరేని ఋణముగలవాఁడు, దంభముగలవాఁడు, ఆహారము లేక తిరుగువాఁడు, విస్తరించువాఁడు, శాస్త్రజ్ఞానము గలవాఁడు తిరుగుట స్వభావముగాఁ గలవాఁడు, నేర్పరితనము మొదలుగాఁగలవి కలవాఁడగును

జీవతి విద్యావాదై ర్విశిష్టధర్మస్థితో ప్రమాణయుతః,
జీవసిత యో ర్మనుష్యో విశిష్టదారో భవే న్మతిమాన్. 20

గురుశుక్రులు కలసియుండఁగా పుట్టినవాఁడు విద్యచే జీవించువాఁడు, ధార్మికుఁడు, ప్రామాణికుఁడు, ఉత్కృష్టమైన దారకలవాఁడు, బుద్ధిమంతుఁడు ఈమొదలగు అత్యుత్తమగుణములు కలవాఁడగును.

శూరో విత్తసమృద్ధో నగరాధిపతి ర్యశస్వీ చ,
శనిజీవయోః ప్రధాన శ్శ్రేణిసభాగ్రామసంఘానామ్. 21

గురుశనులు కలసియుండఁగా బుట్టినవాఁడు శూరుఁడు, ధనికుఁడు, నగరాధిపతి, యశస్సుకలవాఁడు, సభమొదలుగాఁగల ప్రదేశములయందు ప్రధానుఁడు అగును.

దారువిదారణదక్షః క్షురచిత్రాశ్మాదికర్మశిల్పీ చ,
మల్లో౽టనః పశుపతిశ్శనిసితయోగే పుమాన్ భవతి. 22

జననకాలమున ఎచటనైనను శుక్రశనులు కలసియుండఁగాఁ బుట్టినవాఁడు చెట్లు గొట్టుటయందు సమర్థుఁడు, చిత్రమైన రాతిపనియందు సమర్థుఁడు, (రాతివిగ్రహములు మొదలుగాఁగలవి సేయువాఁడనుట) బాహుయుద్ధము సేయువాఁడు, పశువులు కలవాఁడు అగును

ఉక్తం ఫలం గగనగా యద్యన్యోన్యస్వగణస్థితాః,
అధమాదివికల్పేన కుర్వంతి వికృతిం తథా. 23

పూర్వముజెప్పిన యోగకర్తలగు గ్రహములు పరస్పరవద్వర్గములయందుండెనేని సంపూర్ణఫలము గలుగును. అట్లు గానిచో సామాన్యఫలము గలుగును (ఆలోచించదగినది.)

ఇతి పంచదశో౽ధ్యాయః.

## త్రిగ్రహయోగములను దెలుపు పదునాఱవ యధ్యాయము.

నిర్లజ్జః పాపరతో యంత్రజ్ఞ శ్శత్రుదారణే శూరః,
అశ్మక్రియాసు కుశల స్సహస్థితై స్సూర్యశశిభౌమైః. 1

జననకాలమున ఏరాశియందైనను రవిచంద్రకుజులు కలసియుండఁగాఁ బుట్టిన వాఁడు సిగ్గులేనివాఁడు, పాపపుపనులయం దాసక్తిగలవాఁడు, నానావిధయంత్రములను జేయువాఁడు, శత్రుశిక్షణయందు సమర్థుఁడు, పాషాణకర్మలను జేయువాఁడు అగును.

తేజస్వీ నిపుణమతి శ్శాస్త్రకలాగోష్ఠిపానరతః,
నృపకృత్యకరో ధీరో రవిశశిశశిజై స్సహైకస్థైః. 2

జననకాలమున (అనువాక్యము ఈ అధ్యాయమందంతటను గ్రహింపఁదగినది) రవిచంద్రబుధులు కలిసియుండిరేని బలముగలవాఁడు, నిపుణుఁడు, విద్యలయందాసక్తి గలవాఁడు, రాజకార్యనిర్వాహకుఁడు, ధైర్యముగలవాఁడు అగును.

క్రుద్ధో మాయానిపుణస్సేవాకుశలో విదేశగమనరతః,
మేధావీ చపలమతి స్సహస్థితై రర్కశశిజీవైః. 3

రవిగురుచంద్రులు కలసియుండిరేని కోపముగలవాఁడు, మాయగలవాఁడు, సేవయందు నేర్పుగలవాఁడు, దేశాటనము జేయువాఁడు, ధారణగలబుద్ధిగలవాఁడు, చపలుఁడు అగును.

పరధనహరణే నిపుణః పరదారరతశ్చ శాస్త్రనిపుణశ్చ,
రవిచంద్రదైత్యపూజ్యై రేకస్థై ర్జాయతే మనుజః. 4

రవిచంద్రశుక్రులు కలసియుండిరేని శాస్త్రములను దెలిసినవాఁడు, పరదారధనాదులయం దాసక్తిగలవాఁడు అగును.

కామవివాదే కుశలో మూర్ఖః పరతంత్రగో దరిద్రశ్చ,
సూర్యనిశాకరరవిజై రేకస్థై ర్జాయతె మనుజః. 5

రవిచంద్రశనులు కలసియుండిరేని కామశాస్త్రమందు నేర్పుగలవాఁడు మూర్ఖుఁడు, పరాధీనుఁడు, దరిద్రుఁడు అగును.

భవతి ఖ్యాతో మల్లస్సాహసికో నిష్ఠురో విగతలజ్జః,
ధనసుతకళత్రరహిత స్సహస్థితై రర్కకుజసౌమ్యైః 6

రవికుజబుధులు కలసియుండఁగాఁ బుట్టినవాఁడు, ఖ్యాతిగలవాఁడు, బాహుయుద్ధము సేయువాఁడు, సాహసము గలవాఁడు, కఠినవాక్కులు కలవాఁడు, లజ్జలేనివాఁడు, ధనము పుత్రులు కళత్రము మొదలైనవి లేనివాఁడగును.

వచసి నిపుణో మహార్ఘః క్షితిపతిమంత్రీచ భూపతిర్వాపి,
సత్యవచనః ప్రచండ స్సహస్థితై ర్భౌమగురుసూర్యైః. 7

రవికుజగురువులు కలసియుండిరేని నేర్పుగ మాటలాడువాఁడు, గొప్పధనికుఁడు, సత్యముసే బలుకువాఁడు, రాజతుల్యుఁడు అగును.

నయనాతురః కులీన స్సుభగో వాక్శల్యసంయుతో మనుజః,
భృగుభౌమదివసనాథైస్సహస్థితై స్స్యా ద్విభవయుక్తః. 8

రవికుజశుక్రులు కలసియుండిరేని నేత్రరోగి, సత్కులప్రసూతుఁడు, సౌందర్యము ఐశ్వర్యము గలవాఁడగును.

వికలాంగో ధనరహితో నిత్యం రోగాన్వితో మనుజః,
స్వజనరహితోఽతిమూర్ఖః క్షితిజార్కజభానుభిస్సహితైః. 9

రవికుజశనులు కలసియుండిరేని అంగవైకల్యము గలవాఁడు, ధనహీనుఁడు, ఎల్లప్పుడు వ్యాధిపీడితుఁడు, మూర్ఖుఁడు, స్వజనము లేనివాఁడు అగును.

నేత్రాతురోఽతిధనవా న్మూర్ఖశ్శాస్త్రాదిశిల్పకావ్యరతః,
వాచస్పతిబుధసూర్యై రేకగతైర్లిపికరః పురుషః. 10

గురుబుధసూర్యులు కలసియుండఁగాఁ బుట్టినవాఁడు నేత్రరోగి,గొప్పధనికుఁడు మూర్ఖుఁడు, శాస్త్రాదుల నెఱింగినవాఁడు, నేర్పుగ వ్రాయువాఁడు అగును.

అతితప్తో వాచాటో భ్రమణరుచిః ప్రోషితో గురుభిః,
స్త్రీహేతో స్సంతప్త శ్శశిసుతరవిభార్గవై స్సహితైః. 11

రవిబుధశుక్రులు కలసియుండఁగాఁ బుట్టినవాఁడు మిక్కిలి తపించువాఁడు, అధికసంభాషణ చేయువాఁడు, తిరుగుటయందు వాసక్తిగలవాఁడు, గురువులతో కలసి పరవాసము జేయువాఁడు, స్త్రీమూలకమైన సంతాపము గలవాఁడు అగును.

భ్రష్టాచారో ద్వేష్య స్సర్వజితో బంధుభిః పరిత్యక్తః,
సౌరాదిత్యేందుసుతై రేకస్థై ర్జాయతే పురుషః. 12

రవిబుధశనులు కలిసియుండఁగాఁ బుట్టినవాఁడు ఆచారహీనుఁడు, ద్వేషించఁదగినవాఁడు, సర్వులచే జయించఁబడినవాఁడు, బంధువులచే విడువఁబడినవాఁడు అగును.

దుర్బలచక్షు శ్శూరః ప్రాజ్ఞో నిస్స్వశ్చ భూపతే స్సచివః,
పరకార్యరతో నిత్యం భార్గవగురుభాస్కరై స్సహితైః. 13

రవిగురుశుక్రులు కలిసియుండిరేని నేత్రరోగము గలవాఁడు, శూరుఁడు, ప్రాజ్ఞుఁడు, దరిద్రుఁడు, రాజమంత్రి, పరకార్యమం దాసక్తిగలవాఁడు అగును.

అసదృశకాయః పూజ్యస్స్వజనద్వేష్యస్సుదారసుతమిత్రః,
నృపతేరిష్టో విగతభయో జీవార్కజదినకరై స్సహితః 14

రవిగురుశనులు కలిసియుండిరేని పూజ్యుఁడు, స్వజనవిరోధి, యోగ్యమైన దార పుత్రాదులు కలవాఁడు, రాజప్రియుఁడు, భయరహితుఁడు అగును.

శత్రుభయార్తోఽస్నేహో మానకలా కావ్యవర్జితో మనుజః,
కుత్సితచరితః కుష్ఠీ సితార్కిరవిసంయుతై ర్భవతి. 15

రవిశుక్రశనులు కలిసియుండిరేని శత్రుభయము గలవాఁడు, గౌరవము మొదలైనవి లేనివాఁడు, కుటిలచరిత్రము గలవాఁడు, కుష్ఠురోగి యగును.

పాపకరా జాయంతే నీచాచారా స్సుహృత్స్వజనహీనాః,
ఆజీవినశ్చ పురుషా శ్శశాంకబుధభూమిజై స్సహితైః. 16

జననకాలమున చంద్రకుజబుధులు కలిసియుండఁగాఁ బుట్టినవాఁడు అమరకాంతము పాపకర్మరతుఁడు, నీచాచారము గలవాఁడు, స్వజనులుగాని స్నేహితులుగాని లేనివాఁడు అగును.

వినతాంగ స్త్రీలోలశ్చోరః కాంతశ్చ సమ్మతస్త్రీణాం,
భౌమశశాంకసురేజ్యై ర్రేకస్థై శ్చండరోషశ్చ. 17

చంద్రకుజగురువులు కలిసియుండిరేని వంగినశరీరము గలవాఁడు, స్త్రీలోలుఁడు, చోరుఁడు, సౌందర్యము గలవాఁడు, స్త్రీజితుఁడు, కోపముగలవాఁడు అగును.

దుశ్శీలాయాః పుత్రః పతిశ్చ తస్యాః స్సదైవ నిర్దిష్టః,
కుజభృగుశశిభి స్సహితై ర్భ్రమణరుచి శ్శీతభీతశ్చ. 18

చంద్రకుజశుక్రులు కలిసియుండిరేని దుష్టస్వభావముగల తల్లి దుష్టస్వభావము గల భార్యయు గలవాఁడు, తిరుగుటయం దాసక్తిగలవాఁడు, శీతభీతిగలవాఁడు అగును.

బాల్యే మృతజననీకః క్షుద్రో విషమశ్చ లోకవిద్విష్టః,
జాయేత నరో యోగే భూసుతశశిభాస్కరసుతానామ్. 19

చంద్రకుజశనులు కలిసియుండఁగాఁ బుట్టినవాఁడు బాల్యమందే చనిపోయిన తల్లిగలవాఁడు, క్షుద్రుఁడు, విషమస్వభావము గలవాఁడు, జనద్వేషి యగును

ధనవా న్కులోఢ్యో వాగ్మీ తేజస్వీ ఖ్యాతిమా న్విపులకీర్తిః,
బహుపుత్రభ్రాతృయుతో బుధేందుసురపూజితై ర్యుక్తైః 20

చంద్రబుధగురువులు కలిసియుండిరేని ధనికుఁడు, మంగళప్రదుఁడు, వక్త, బలము ఖ్యాతి కీర్తి మొదలైనవి కలవాఁడగును

విద్యాసంస్కృతమతిరపి నీచాచారః పుమా న్భవే జ్జాతః,
సౌమ్యో ధనప్రలుబ్ధో బుధభార్గవచంద్రసంయోగే 21

చంద్రబుధశుక్రులు కలిసియుండిరేని జాతకుఁడు శాస్త్రజ్ఞానము కలవాఁడైనను నీచాచారమం దాసక్తిగలవాఁడును లుబ్ధుఁడు నగును.

అస్వస్థో వికలాంగః ప్రాజ్ఞో వాగ్మీ సుపూజితః క్షితిపః,
భవతి నర స్సంయోగే సౌరేందుశశాంకపుత్రాణామ్ 22

చంద్రబుధశనులు కలిసియుండిరేని అస్వస్థుఁడు, వికలాంగుఁడు అనఁగా అంగహీనుఁడు, ప్రాజ్ఞుఁడు, వక్త, పూజితుఁడు, భూమిని పరిపాలించువాఁడు అగును.

సాధ్వీతనయః ప్రాజ్ఞః కలాస్వభిజ్ఞో బహుశ్రుతస్సాధుః,
భార్గవగురుశశియోగే జాత స్సుభగో భవే త్పురుషః 23

చంద్రగురుశుక్రులు కలిసియుండిరేని జాతకుఁడు పతివ్రతాపుత్రుఁడు, ప్రాజ్ఞుఁడు, విద్యలు మొదలైన సద్గోష్ఠి తెలిసినవాఁడగును.

శాస్త్రార్థతత్త్వబుద్ధిర్వృద్ధస్త్రీసంగతో విగతరోగః,
శశివాచస్పతిసౌరై రేకస్థై ర్గ్రామబృందపతిః. 24

చంద్రగురుశనులు కలిసియుండిరేని శాస్త్రార్థముల నెఱింగినవాఁడు, వృద్ధాంగనలయం దాసక్తిగలవాఁడు, నిరోగి, గ్రామాధిపతి యగును.

లిపికరపుస్తకవాచకపురోధసాం భవతి జన్మసుకృతై శ్చ,
దైవవిదాం పురుషాణాం శశిభార్గవసౌరసంయోగే. 25

చంద్రశుక్రశనులు కలిసియుండఁగాఁ బుట్టినవాఁడు పుస్తకములను వ్రాయువాఁడు, పురోహితులు దైవజ్ఞులు మొదలుగాఁగలవారివంశమందు జనించినవాఁడు అగును.

సుకవిః క్షోణీనాథస్సద్యువతిపతిః పరార్థ ఉద్యుక్తః,
గాంధర్వవేదకుశలస్స్యాద్బుధగురుభూసుతైస్సహితైః 26

కుజబుధగురువులు కలిసియుండిరేని విద్వాంసుఁడు, దేశాధిపతి, అనుకూలమైన భార్యకలవాఁడు, పరమార్థచింతగలవాఁడు, సంగీతమందు నేర్పుగలవాఁడు అగును.

అకులీనో వికలాంగశ్చపలో దుష్టశ్చ జాయతే మనుజః,
ముఖరో నిత్యోత్సాహీ కుజబుధభృగునందనైస్సహితైః. 27

కుజబుధశుక్రులు కలిసియుండిరేని అన్యకులమందుఁ బుట్టినవాఁడు, అంగహీనుఁడు, చపలుఁడు, దుష్టుఁడు ఉత్సాహము మొదలైనవి కలవాఁడు, అప్రియముగఁ బలుకువాఁడు అగును.

ప్రేష్యశ్శ్యామలనేత్రః ప్రవాసశీలో భవేద్వదనరోగీ,
రమతే ప్రహాసనశీలైర్బుధార్కిరుధిరైస్సహైకస్థైః. 28

కుజబుధశనులు కలిసియుండిరేని ప్రేష్యుఁడు (అనఁగా. బంటు), శ్యామలవర్ణము గలనేత్రములు కలవాఁడు, ప్రవాసము నాసక్తిగలవాఁడు, ముఖమందు వ్యాధిగల వాఁడు, పహాసస్వభావము గలవాఁడు అగును.

నృపతీష్టస్సత్సుతవాన్విలాసినీభ్యస్సదాప్తబహుసౌఖ్యః,
సకలజనానందకరో భార్గవగురుభూమిజైస్సహితైః 29

కుజగురుశుక్రులు కలిసియుండిరేని రాజప్రియుఁడు యోగ్యమైనపుత్రులు కలవాఁడు, స్త్రీసౌఖ్యముగలవాఁడు, సర్వజనప్రియుఁడు అగును.

నృపసంమతః క్షతాంగో నీచాచారో విగర్హితో మిత్రైః,
భవతి నరో విగతఘృణస్సురేజ్యకుజసౌరిసంయోగే. 30

కుజగురుశనులు కలిసియుండిరేని రాజప్రియుఁడు, అంగహీనుఁడు, ఆచార హీనుఁడు, మిత్రులతో విరోధము గలవాఁడు, దయలేనివాఁడు అగును.

చారిత్రవిహీనాయాః పుత్రో భర్తా భవేత్సుఖవిహీనః,
నిత్యం ప్రవాసశీలస్సంయుక్తైస్సౌరికుజశుక్రైః. 31

కుజశుక్రశనులు కలిసియుండిరేని దుశ్చరిత్రగల తల్లి భార్యగలవాఁడు, సుఖ హీనుఁడు, ఎల్లప్పుడు ప్రవాసమందుండువాఁడు అగును.

సుతనుః క్షపితారిగణో నృపతిస్సుభగస్తథా పృథులకీర్తిః,
బుధగురుశుక్రైస్సహితైర్భవతి నరస్సత్యవచనశ్చ. 32

బుధగురుశుక్రులు కలిసియుండఁగాఁ బుట్టినవాఁడు శత్రుహీనుఁడు, ప్రభువు, సౌందర్యముగలవాఁడు, గొప్పకీర్తిగలవాఁడు, నిజముసే బలుకువాఁడు నగును.

స్థానధనైశ్వర్యయుతం ప్రాజ్ఞం బహుభోగినం స్వదారరతం,
ధృతిసౌఖ్యయుతం సుభగం జనయంతి బుధార్కజీవాఖ్యాః. 33

బుధగురుశనులు కలిసియుండిరేని స్థానాద్యైశ్వర్యము గలవాఁడు, ప్రాజ్ఞుఁడు, భోగి, స్వభార్యయందు ప్రేమగలవాఁడు, ధైర్యము సౌఖ్యము మొదలయినవి కల వాఁడగును.

ముఖరో ధూర్తోఽనృతవా క్పరయువతిరతో భవే ద్విషమశీలః,
బుధశుక్రసూర్యతనయైః కలాస్వభిజ్ఞ స్స్వదేశరతః. 34

బుధశుక్రశనులు కలిసియుండిరేని జాతకుఁడు అప్రియముగఁ బలుకువాఁడు. కోపము గలవాఁడు, అబద్ధమాడువాఁడు, పరస్త్రీరతుఁడు, విషమస్వభావము గలవాఁడు, విద్యలెఱిఁగినవాఁడు, స్వదేశమందుండువాఁడు అగును.

న్యూనే కులేఽపి జాతో భవతి నరో భూపతిర్విపులకీర్తిః,
గురుభార్గవదినకరజై రేకస్థై శ్శీలసంపన్నః. 35

గురుశుక్రశనులు కలిసియుండునపుడు హీనకులమందుఁ బుట్టినవాఁడైనను భూమిని పాలించుప్రభువును, సత్స్వభావము మొదలయినవి గలవాఁడు నగును.

పాపైర్యుక్తే చంద్రే మాతురభావః ప్రకీర్తితః ప్రాయః,
సూర్యే పితు స్తథాన్యైశ్శుభం వదే న్మిశ్రితై ర్మిశ్రమ్. 36

చంద్రుఁడు పాపగ్రహములతో కలిసియుండెనేని తల్లిలేనివాఁ డగును. సూర్యుఁడు పాపగ్రహములతో కలిసియుండెనేని తండ్రిలేనివాఁ డగును. శుభులతో కలిసియుండెనేని శుభముకలుగును, శుభపాపగ్రహములతో కలిసియుండెనేని బలము ననుసరించి తెలియఁదగినది.

ప్రాయశ్శుభాస్సమేతా ధనభూమియశోఽన్వితం నృపతిచేష్టం,
ఉత్పాదయంతి మనుజం భూమండలమండనం శ్రేష్ఠమ్ 37

తఱుచుగా శుభగ్రహములు కలిసియుండెనేని ధనము భూమి ఐశ్వర్యము మొదలగునవి కలవాఁడై రాజతుల్యుఁడగును.

పాపాస్త్రయోఽపి మిళితా కుర్వంతి నరం సుదుర్భగం లోకే,
దారిద్ర్యదుఃఖతప్తం గర్హితరూపం వినయహీనమ్. 38

రవికుజశనులు ముగ్గురు కలిసియుండిరేని భార్యానురాగము మొదలైనవి లేనివాఁడై దారిద్ర్యదుఃఖముచే మిక్కిలి తపించినవాఁడై లోకనిందితుఁ డగును.

ఇతి షోడశోఽధ్యాయః.

---

## చతుర్గ్రహయోగములను దెలుపు పదునేడవ యధ్యాయము.

లిపికరతస్కరముఖరో రోగీ మాయాప్రపంచకుశలశ్చ,
బుధరవిభౌమశశాంకై రేకర్క్షగతైః పుమాన్ భవతి 1

రవిచంద్రకుజబుధులు కలిసియుండఁగాఁ బుట్టినవాఁడు, వ్రాయుటయందు దొంగతనమందు నేర్పుగలవాఁడు, అప్రియముగఁ బలుకువాఁడు, రోగి, మాయచేయుటయందు నేర్పుగలవాఁడగును.

ధనవా న్వనితాఽనింద్య స్తేజస్వీ నీతిమాన్విగతశోకః,
కర్మసమర్థో నిపుణ శ్శశికుజగురుభాస్కరై స్సహితైః. 2

రవిచంద్రకుజగురువులు కలిసియుండిరేని ధనికుఁడు, స్త్రీప్రియుఁడు, తేజస్సు, నీతి మొదలయినవి గలవాఁడు, కర్మాసక్తిగలవాఁడు, నిపుణుఁడు అగును.

ఆరోగ్యచితవాగ్వృత్తిస్సుఖభాజ్నిపుణోఽర్థసంగ్రహణశీలః,
విద్యాసుతదారయుత శ్శశికుజభృగుభాస్కరై స్సహితైః 3

రవిచంద్రకుజశుక్రులు కలిసియుండఁగాఁ బుట్టినవాఁడు నేర్పుగ మాటలాడువాఁడు, సుఖము ధనసంగ్రహము విద్య మొదలయినవి గలవాఁడగును.

విషమశరీరో హ్రస్వో ధనరహితో యాచితాశనో మూర్ఖః,
గమ్య స్సర్వస్య తథా రవిశశికుజసౌరిసంయోగే. 4

రవిచంద్రకుజశనులు కలిసియుండిరేని వైషమ్యశరీరము గలవాఁడు, పొట్టివాఁడు, నిర్ధనుఁడు, అన్నార్థి, మూర్ఖుఁడు అగును.

సౌవర్ణికః ప్లుతాక్షః శ్శిల్పకరో వా మహాధనో దీర్ఘః,
జాతస్స్యాన్నిరుజతను శ్శశిజ్ఞగురుభాస్కరై స్సహితైః. 5

రవిచంద్రబుధగురువులు కలిసియుండఁగాఁ బుట్టినవాఁడు ఎఱ్ఱనిశరీరకాంతిగలవాఁడు, విశాలనేత్రములు గలవాఁడు, శిల్పికరుఁడు ధనము ధైర్యము మొదలయినవి గలవాఁడు అగును.

వికల స్సుభగో వాగ్మీ ప్రాప్తో నృపసమ్మతో మనుజః,
జాతస్స్యాదేకస్థై రవిశశిబుధభార్గవై స్సహితైః. 6

రవిచంద్రబుధశుక్రులు కలిసియుండిరేని ప్రియముగఁ బలుకువాఁడు, పొట్టి వాఁడు, రాజప్రియుఁడు అగును.

మాతృపితృవిప్రయుక్తో ధనసౌఖ్యవివర్జితో భ్రమణశీలః,
భిక్షాశనోఽప్యనృతవాగ్రవీందుసౌమ్యార్కిభి ర్నియతమ్. 7

రవిచంద్రబుధశనులు కలిసియుండిరేని తల్లిదండ్రులచే విడువఁబడినవాఁడు, ధనము సౌఖ్యము మొదలయినవి లేనివాఁడు, తిరుగుటయందు దాసక్తిగలవాఁడు, భిక్షాశనుఁడు అబద్ధమాడువాఁ డగును

సలిలమృగారణ్యానాం స్వామీ స్యాత్సౌఖ్యభాగ్యవతి పూజ్యః,
శుక్రార్కగురుశశాంకై రేకర్షగతైః పుమా న్నిపుణః 8

రవిచంద్రగురుశుక్రులు కలిసియుండిరేని ఉదకములు మృగములు అరణ్యములు మొదలగువాని కధిపతి, సౌఖ్యము పూజ్యత మొదలయినవిగలవాఁ డగును.

తామసనేత్ర స్త్రీష్టో బహుసుతపిత్తో వరాంగనాసుభగః,
సూర్యేజ్యచంద్రసౌరై రేకస్థై ర్జాయతే పురుషః 9

రవిచంద్రగురుశనులు కలిసియుండిరేని కోపదృష్టిగలవాఁడు, ధనికుఁడు, పుత్రులు కలవాఁడు, స్త్రీప్రియుఁడు అగును.

వనితాసదృశాచారః పురస్సరోఽత్యంతదుర్బలశరీరః,
భీరు స్సర్వత్ర భవే దర్కేందుసితాసితై స్సహితైః. 10

రవిచంద్రశుక్రశనులు కలిసియుండిరేని స్త్రీలతో సమానమైన ఆచారముగలవాఁడు, దుర్బలశరీరము గలవాఁడు, భయశీలుఁడు అగును.

శూరోథ సూత్రకార శ్చక్రధరో వా విపన్నదారధనః,
దుఃఖార్ణవోటనపర స్సుసంగతై రర్కజీవబుధభౌమైః. 11

రవికుజబుధగురుపులు కలిసియుండఁగాఁ బుట్టినవాఁడు శూరుఁడు, ధనహీనుఁడు, దుఃఖములు మొదలైనవి గలవాఁడగును.

పరదారరత శ్చోరో విషమాంగో దుర్జనో విగతసత్వః,
భవతి ప్రసవే పురుషో రవిసితభౌమేందుజై స్సహితైః. 12

రవికుజబుధశుక్రులు కలిసియుండిరేని పరస్త్రీప్రియుండు, చోరుండు, దుర్జనుండు, సత్యహీనుండు అగును.

యోద్ధా ప్రాజ్ఞ స్త్రీఘ్నో నీచాచారః కవిప్రధానశ్చ,
మంత్రీ చ భూపతిర్వా బుధార్కకుజసౌరిసంయోగే. 13

రవికుజబుధశనులు కలిసియుండిరేని యుద్ధముసేయువాండు, నీచాచారముగలవాండు, విద్వాంసుండు, రాజతుల్యుండు అగును.

సుభగః పూజ్యో లోకే ధనవాన్ నృపసమ్మతో భువి ఖ్యాతః,
రవిభౌమజీవశుక్రై రేకస్థైర్నితిమాన్పురుషః 14

రవికుజగురుశుక్రులు కలిసియుండిరేని పూజ్యుండు, ధనికుండు, రాజప్రియుండు, ఖ్యాతిమొదలైనవి గలవాండగును.

సోన్మాదో గణమాన్య స్సిద్ధార్థో బంధుమిత్రసంప్రయుక్తః,
భానుకుజజీవసౌరై స్సంయుక్తైర్వా నృపాభిమతః. 15

రవికుజగురుశనులు కలిసియుండిరేని ఉన్మాదముగలవాండు, మాన్యుండు, బంధుమిత్రాదులు కలవాండు, రాజప్రియుండు అగును.

వికలో నీచాచారో విషమాక్షో బంధువిద్విష్టః,
సూర్యకుజశుక్రసౌరైః పరాభవం సర్వతో యాతి. 16

రవికుజశుక్రశనులు కలిసియుండిరేని నీచాచారముగలవాండు, నేత్రవైకల్యము బంధుద్వేషము మొదలైనవిగలవాండై అంతట పరాభవమును పొందును.

ధనవా న్సుఖప్రధాన స్సిద్ధార్థో బంధుమాన్ స్త్రీకృష్టశ్చ,
భానుబుధజీవశుక్రై ర్భవతి పుమా నేకరాశిగతైః 17

రవిబుధగురుశుక్రులు కలిసియుండిరేని ధనికుండు, సుఖము, బంధువులు మొదలయినవి గలవాండు అగును.

క్లీబాచారో మానీ కలహరుచి స్సహజవాఙ్నిరుత్సాహః,
అర్కార్కిబుధసురేజ్యై రేకస్థై ర్జాయతే పురుషః. 18

రవిబుధగురుశనులు కలిసియుండిరేని మానవంతుండు, కలహప్రియుండు, ఉత్సాహహీనుండు అగును.

ముఖరస్సుభగః ప్రాజ్ఞో మృదుసౌఖ్యస్సత్యశౌచసంపన్నః,
ధీరో మిత్రసహాయో రవిబుధసితసౌరిసంయోగే. 19

రవిబుధశుక్రశనులు కలిసియుండిరేని అప్రియముగఁ బలుకువాఁడు, సుందరుఁడు, ప్రాజ్ఞుఁడు, మృదుత్వము మొదలైనవి కలవాఁడగును.

లుబ్ధః కవిః ప్రధానః కారుకనాథోఽధిపశ్చ నీచానామ్,
ఆదిత్యార్కిసితార్యై రాజ్ఞాం జాతో భవే దిష్టః. 20

రవిగురుశుక్రశనులు కలిసియుండిరేని లుబ్ధుఁడు, కవి, శ్రేష్ఠుఁడు, నీచాధిపతి, రాజప్రియుఁడు అగును

శాస్త్రకుశలో నరేంద్రస్సుమహామంత్రోథవా మహాబుద్ధిః,
శశికుజసోమజజీవై రేకస్థై ర్యైః పుమాన్ జాతః. 21

చంద్రకుజబుధగురువులు కలిసియుండిరేని శాస్త్రముల నెఱింగినవాఁడు, రాజు, ఆలోచనయందు నేర్పుగలవాఁడు, బుద్ధిమంతుఁడు అగును.

కలహరుచి ర్నిద్రాలు ర్నీచస్స్యాద్వర్ధకిపతి స్సుభగః,
బంధుద్వేష్టా న సుఖీ శశికుజబుధభార్గవై స్సహితైః 22

చంద్రకుజబుధశుక్రులు కలిసియుండఁగాఁ బుట్టినవాఁడు కలహప్రియుఁడు, నిద్రాస్వభావము నీచము బంధుద్వేషము మొదలగుగుణములు గలవాఁడగును.

శూరో విమాతృపితృకో దుష్కులజో బహుకలత్రమిత్రసుతః,
భవతి సుకర్మాభిరత శ్శశికుజబుధసౌరిసంయోగే. 23

చంద్రకుజబుధశనులు కలిసియుండిరేని శూరుఁడు, తల్లిదండ్రులులేనివాఁడు, దుష్కులజుఁడు, అనేకభార్యలు పుత్రులు కలవాఁడు అగును.

వికలాంగ స్సుకళత్ర స్సకలసహోఽతీవ మానసంయుక్తః,
ప్రాజ్ఞో బహుమిత్ర సుఖ శ్శశికుజగురుభార్గవై స్సహితైః. 24

చంద్రకుజగురుశుక్రులు కలిసియుండఁగాఁ బుట్టినవాఁడు అంగహీనుఁడు, సత్కళత్రము గలవాఁడు, మాన్యుఁడు, ప్రాజ్ఞుఁడు, మిత్రులతో సౌఖ్యముఁగ నుండువాఁడు అగును.

బధిరో ధనవా న్శూర స్సోన్మాదో వాక్పటుః స్థిరప్రకృతిః,
మలిమా నుదారచిత్తో భౌమేందుశనైశ్చరసురేజ్యైః. 25

చంద్రకుజగురుశనులు కలిసియుండఁగాఁ బుట్టినవాఁడు చెవిటివాఁడు, ధనికుఁడు శూరుఁడు, ఉన్మాదముగలవాఁడు, వాక్పటుత్వముగలవాఁడు, బుద్ధిమంతుఁడు, ఉదారచిత్తముగలవాఁడు అగును

కులటాపతిః ప్రగల్భ స్సర్వాక్షో నిత్యమేవ సోద్వేగః,
జాతః పురుషోఽవశ్యం కుజేందుయమభార్గవై ర్భవతి 26

చంద్రకుజశుక్రశనులు కలిసియుండిరేని రంకులాడికి భర్త, ప్రగల్భములు బలుకు వాఁడు, సర్వనేత్రములవలె నేత్రములుగలవాఁడు, కార్యతొందరగలవాఁడు అగును.

విద్వాన్విమాతృపితృకస్సద్రూపో ధనయుతోఽతిసుభగశ్చ,
భవతి నరో విగతారి ర్బుధగురుశశిభార్గవైస్సహితైః 27

చంద్రబుధగురుశుక్రులు కలిసియుండఁగాఁ బుట్టినవాఁడు విద్వాంసుఁడు, తల్లి దండ్రులు లేనివాఁడు, సౌందర్యము గలవాఁడు, ధనికుఁడు, శత్రువులు లేనివాఁడు అగును.

కృతధర్మకీర్తి రగ్ర్య స్తేజస్వీ బంధువల్లభో మతిమాన్,
నృపసచివః ప్రవరకవి శ్శశిబుధజీవార్కిభిస్సహితైః. 28

చంద్రబుధగురుశనులు కలిసియుండఁగాఁ బుట్టినవాఁడు ధర్మము కీర్తి మొదలయి నవి గలవాఁడు, రాజమంత్రి యగును.

పరదారగమనశీలో విశీలభార్యో విపన్నబంధుశ్చ,
ప్రాజ్ఞో లోకద్వేష్టా స్యా దిందుబుధార్కిభృగుపుత్రైః. 29

చంద్రబుధశుక్రశనులు కలిసియుండఁగాఁ బుట్టినవాఁడు, పరస్త్రీప్రియుఁడు, దుష్టస్వభావముగల భార్యగలవాఁడు, బంధువులు లేనివాఁడు, ప్రాజ్ఞుఁడు, జనద్వేషి యగును.

మాత్రా రహితస్సుభగ స్త్వగ్దోషి దుఃఖితో భ్రమణశీలః,
బహుభాషీ సత్యరత శ్శశిగురుభృగుసౌరిభిస్సహితైః. 30

చంద్రగురుశుక్రశనులు కలిసియుండఁగాఁ బుట్టినవాఁడు తల్లిలేనివాఁడు, సౌంద ర్యముగలవాఁడు, చర్మరోగము మొదలయినవి గలవాఁడగును.

స్త్రీకలహారుచి ర్ధనభా క్పూజ్యో లోకే చ శీలసంపన్నః,
భవతి పుమా న్నిరుజతను ర్బుధారగురుభార్గవైస్సహితైః. 31

కుజబుధగురుశుక్రులు కలిసియుండఁగాఁ బుట్టినవాఁడు స్త్రీకలహమం దాసక్తిగల వాఁడు, ధనికుఁడు, పూజ్యుఁడు, సత్స్వభావము గలవాఁడు అగును.

శూరో విద్వా న్వాగ్మీ ధనరహిత స్సత్యశౌచసంపన్నః,
వాదీ ద్వంద్వసహిష్ణుర్మతిమాన్సహితై ర్బుధారగురుసౌరైః. 32

కుజబుధగురులనులు కలిసియుండిరేని శూరుఁడు, విద్వాంసుఁడు, వక్త, నిర్ధనుఁడు, సత్యము మొదలగు గుణములు గలవాఁడగును

స్యాన్మల్లః పరపుష్టః కఠినాంగో యుద్ధదుర్మదః క్రూరః,
రమతే చ సారమేయైర్బుధారయమభార్గవైస్సహితైః 33

కుజబుధశుక్రులనులు కలిసియుండిరేని మల్లయుద్ధము సేయువాఁడు, కఠినమైన శరీరము మొదలైనవి గలవాఁడగును

తేజస్వీ విత్తయుత స్త్రీలోల స్సాహసప్రియశ్చపలః,
భౌమగురుశుక్రసౌరై రేకస్థై ర్జాయతే పురుషః 34

కుజగురుశుక్రశనులు కలిసియుండిరేని తేజస్సు మొదలుగాఁగల గుణములు గలవాఁడగును.

మేధావీ శాస్త్రరతో రామాసక్తో విధేయభృత్యశ్చ,
బుధజీవశుక్రసౌరై రేకస్థైస్త్రీవ్రసంయోగే 35

బుధగురుశుక్రశనులు కలిసియుండఁగాఁ బుట్టినవాఁడు ధారణబుద్ధిగలవాఁడు, కర్మాసక్తిగలవాఁడు, స్త్రీలోలుఁడు, విధేయులగు భృత్యులు అగును.

ఇతి సప్తదశోఽధ్యాయః

---

## పంచగ్రహయోగములను దెలుపు పదునెనిమిదవ యధ్యాయము

దుఃఖీ బహుప్రపంచో జాయావిరహేణ తాపితశరీరః,
భవతి పుమా నేకస్థై రవీందుకుజజీవచంద్రసుతైః. 1

జన్మకాలమున రవిచంద్రకుజబుధగురువులు కలిసియుండఁగాఁ బుట్టినవాఁడు గొప్పదుఃఖముగలవాఁడు, భార్యావిరహముచే మిక్కిలి తపించువాఁడు అగును.

పరకర్మరతో నిత్యం బంధుసుహృద్భిః కృతో విగతసత్వః,
క్లీబై ర్యాతి చ సఖ్యం రవీందుకుజశుక్రసౌమ్యైశ్చ 2

రవిచంద్రకుజబుధశుక్రులు కలిసియుండిరేని పరకార్యాసక్తిగలవాఁడు, బంధువిరోధము మొదలైనవి గలవాఁడు అగును.

అల్పాయు ర్బంధనభా గ్దీనో భవతీహ సర్వసుఖహీనః,
అకళత్రోఽసుతవిత్త స్సూరిదివాకరబుధేందుకుజైః. 3

రవిచంద్రకుజబుధశనులు కలిసియుండఁగాఁ బుట్టినవాఁడు అల్పాయుస్సు గలవాఁడు, దీనుఁడు, సుఖము మొదలైనవి లేనివాఁడగును.

జాత్యంధో బహుదుఃఖీ మాతృపితృభ్యాం సదైవ సంత్యక్తః,
భవతి నరో గేయరుచిః కుజేందుగురుభార్గవార్కైశ్చ 4

రవిచంద్రకుజగురుశుక్రులు కలిసియుండఁగాఁ బుట్టినవాఁడు పుట్టంధుఁడు, అనేక దుఃఖములు గలవాఁడు, తల్లిదండ్రులచే విడువఁబడినవాఁడు, గానమందాసక్తిగలవాఁడగును.

యుద్ధకుశల స్సమర్థః పరవిత్తహరః పరోపతాపీ చ,
పిశున శ్చలశ్చ పురుష శ్శనిశశికుజజీవదివసేశైః 5

రవిచంద్రకుజగురుశనులు కలిసియుండఁగాఁ బుట్టినమనుజుఁడు యుద్ధమందు నేర్పుగలవాఁడు, పరధనహారి మొదలైనగుణములు గలవాఁడగును.

మానార్థవిభవహీనో మలినాచారః పరాంగనాతిరతః,
పంచభి రేకస్థైస్స్యా ద్దినేశశశిశుక్రశనిభౌమైః. 6

రవిచంద్రకుజశుక్రశనులు కలిసియుండఁగాఁ బుట్టినవాఁడు మానము ద్రవ్యము ఐశ్వర్యము మొదలైనవి లేనివాఁడు, ఆచారహీనుఁడు, పరస్త్రీప్రియుఁడు అగును.

యంత్రజ్ఞో బహువిభవో నృపసచివో దండనాయకోవా స్యాత్.
ఖ్యాత శ్శుభకీర్తియుతో బుధేందురవిజీవశుక్రైశ్చ. 7

రవిచంద్రబుధగురుశుక్రులు కలిసియుండిరేని యంత్రాదుల నెఱింగినవాఁడు, గొప్పఐశ్వర్యము గలవాఁడు, ఖ్యాతి మొదలైనగుణములు గలవాఁడగును.

భీరుః ప్రియసంత్యక్త స్సోన్మాదో వంచనాసు నిపుణశ్చ,
ఉగ్రః పరాన్నభోజీ బుధేందుగురుసూర్యరవిపుత్రైః. 8

రవిచంద్రబుధగురుశనులు కలిసియుండిరేని భయస్వభావము గలవాఁడు, స్నేహితులచే విడువఁబడినవాఁడు, ఉన్మాదముగలవాఁడు, వంచన సేయువాఁడు, పరాన్నము నే భుజించువాఁడు అగును

దీర్ఘో రోమశగాత్రో మరణోత్సాహీ సుఖార్థసుతహీనః,
స్యాత్పంచభి రేకస్థై రవిచంద్రబుధార్కిభృగుపుత్రైః.

రవిచంద్రబుధశుక్రశనులు కలిసియుండఁగాఁ బుట్టినవాఁడు పొడవైనవాఁడు, మరణమందాసక్తిగలవాఁడు, సుఖము మొదలైనవి లేనివాఁడగును.

వాగ్మీంద్రజాలనిరత శ్చలచిత్త స్స్త్రీషు వల్లభో మతిమాన్,
బహుశత్రు ర్విగతభయో రవీందుగురుశుక్రభానుసుతైః. 10

రవిచంద్రగురుశుక్రశనులు కలిసియుండఁగాఁ బుట్టినవాఁడు నేర్పుగ మాటలాడువాఁడు, ఇంద్రజాలాదివిద్యల నెఱింగినవాఁడు, చలచిత్తుఁడు స్త్రీప్రియుఁడు, శత్రువులు గలవాఁడు, భయహీనుఁడు నగును.

కామీ బహుతురగనర స్స్వీకృతసేనాపతి ర్విగతశోకః,
రాజప్రియోఽతిసుభగో బుధారవిజీవశుక్రైస్స్యాత్. 11

రవికుజబుధగురుశుక్రులు కలిసియుండఁగాఁ బుట్టినవాఁడు కాముకుఁడు, అనేకసేనగలవాఁడు, దుఃఖహీనుఁడు, రాజమాన్యుఁడు, మిక్కిలి సౌందర్యము గలవాఁడు అగును.

నిత్యోద్విగ్నో రోగీ భిక్షాం భుంక్తే గృహాద్గృహం గత్వా,
జీర్ణమలీమసవాసా రవికుజబుధజీవరవిపుత్రైః. 12

రవికుజబుధగురుశనులు కలిసియుండఁగాఁ బుట్టినవాఁడు భయస్వభావము గలవాఁడు, రోగి, భిక్షాన్నమును భుజించువాఁడు, జీర్ణమైన మలినమైన వస్త్రములను ధరించువాఁడు అగును.

వధబంధనరోగార్తో విద్వాన్ లోకే సుపూజితో భవతి,
నిస్స్వో వికలశరీరః కుజశశిబుధశుక్రమందైస్స్యాత్. 13

చంద్రకుజబుధశుక్రశనులు కలిసియుండఁగాఁ బుట్టినవాఁడు బంధనము మొదలైనవానిచే పీడింపఁబడువాఁడు, విద్వాంసుఁడు, పూజ్యుఁడు, దరిద్రుఁడు, అవయవహీనుఁడు అగును.

వ్యాధిభి రరిభి ర్గ్రస్త స్థానభ్రష్టోఽతిదుఃఖసంతప్తః,
భ్రమతి క్షుభితః పురుషః కుజార్కిరవిశుక్రశశితనయైః. 14

రవికుజబుధశుక్రశనులు కలిసియుండిరేని వ్యాధులచేతను శత్రువులచేతను పీడింపఁబడువాఁడు, స్థానభ్రష్టుఁ, దుఃఖముచే తపించువాఁడు, క్షోభగలవాఁడై తిరుగుచుండును.

ప్రేష్యో మూర్ఖః క్లీబో మలినాచారోఽతిదుర్భగో వికలః,
భవతి నరో ధనరహిత శ్శశికుజగురుశుక్రరవితనయైః. 15

చంద్రకుజగురుశుక్రశనులు కలిసియుండఁగాఁ బుట్టినవాఁడు బంటుతనము సేయు వాఁడు, మూర్ఖుఁడు, నపుంసకుఁడు, ధనహీనుఁడు అగును.

జలయంత్రదాతుపారదరసాయనే ష్వతిపటుఃపుమా న్భవతి,
ఏభిః ప్రసిద్ధకర్తా క్షితిసుతరవిజీవసితసౌరైః 16

రవికుజగురుశుక్రశనులు కలిసియుండఁగాఁ బుట్టినవాఁడు రసాయనవస్తువులు మొదలుగాఁగలవానియందు మిక్కిలి సమర్థుఁడగును.

బహుశాస్త్రజ్ఞానపటు ర్మిత్రహితస్సంమతో గురూణాం చ,
ధర్మపరః కారుణిక స్సూర్యాసితశుక్రబుధజీవైః. 17

రవిబుధగురుశుక్రశనులు కలిసియుండిరేని శాస్త్రముల నెఱింగినవాఁడు, ధర్మపరుఁడు, దయగలవాఁడు అగును.

సాధుః కల్యశరీరో విద్యాధనసత్యసౌఖ్యసంపన్నః,
బంధుహితో బహుమిత్రో బుధేందుకుజజీవభృగుపుత్రైః 18

చంద్రకుజబుధగురుశుక్రులు కలిసియుండగాఁ బుట్టినవాఁడు సాధువు నిరోగి, విద్య ధనము మొదలైనవి గలవాఁడగును.

తిమిరామయీ దరిద్రః పరాన్నమభియాచతే సదాదీనః,
మలినయతి బంధువర్గం కుజార్కిబుధజీవహిమకిరణైః. 19

చంద్రకుజబుధగురుశనులు కలిసియుండఁగాఁ బుట్టినవాఁడు గొప్పరోగముగలవాఁడు, దరిద్రుఁడు, అన్నార్థి, బంధువర్గమం దపకీర్తి దెచ్చువాఁడగును.

బహుశత్రుమిత్రపక్షః పరార్థహితకృ ద్విషమశీలః,
ఏకస్థై రతిమానీ బుధేందుకుజశుక్రరవిపుత్రైః 20

చంద్రకుజబుధశుక్రశనులు కలిసియుండిరేని అనేకశత్రుమిత్రులు కలవాఁడు, పరకార్యప్రియుఁడు, విషమస్వభావము గలవాఁడు, మాన్యుఁడు అగును.

నృపమంత్రీ నృపతిసమో గణనాథస్సర్వలోకపూజ్యశ్చ,
ఏకస్థై ర్భవతి నర శ్చంద్రేందుజజీవశనిశుక్రైః. 21

చంద్రబుధగురుశుక్రశనులు కలిసియుండఁగాఁ బుట్టినవాఁడు రాజమంత్రి సేనాధిపతి, పూజ్యుఁడు అగును.

సుమనస్కస్సోన్మాదో రాజ్ఞా మతివల్లభో విగతశోకః,
నిద్రాతురో దరిద్రః కుజగురుబుధశుక్రరవిపుత్రైః 22

జననకాలమున కుజబుధగురుశుక్రశనులు కలిసియుండఁగాఁ బుట్టినమనుజుఁడు మంచిమనస్సు గలవాఁడు, ఉత్సాదము గలవాఁడు, రాజప్రియుఁడు, శోకహీనుఁడు, నిద్రాస్వభావము గలవాఁడు, దరిద్రుఁడు అగును.

ఇతి అష్టాదశోఽధ్యాయః.

---

షడ్గ్రహయోగములను దెలుపు పందొమ్మిదవ యధ్యాయము.

విద్యాధనధర్మరతః క్షామో బహుభాషకో విక్షిప్తమతిః,
ఏకభవనోపయాతైర్బుధేందురవ్యారగురుశుక్రైః. 1

జననకాలమున రవిచంద్రకుజబుధగురుశుక్రులు కలిసియుండఁగాఁ బుట్టినవాఁడు విద్య ధనము ధర్మము ఓర్మి మొదలయినవి గలవాఁడగును.

దాతా పరకార్యకరశ్చలస్వభావో విశుద్ధసత్వశ్చ,
రమతే విజనోద్దేశే రవీందువక్రజ్ఞగురురవిజైః 2

రవిచంద్రకుజబుధగురుశనులు కలిసియుండఁగాఁ బుట్టినవాఁడు దాతయు, పరోపకారి, చంచలస్వభావము మొదలైనవి గలవాఁడగును.

చోరః పరదారరతః కుష్ఠీ స్వజనైర్నిరాకృతో మూర్ఖః,
స్థానభ్రష్టో విసుతో బుధేందురవ్యారశనిశుక్రైః 3

రవిచంద్రకుజబుధశుక్రశనులు కలిసియుండఁగాఁ బుట్టినవాఁడు చోరుఁడు, పరస్త్రీప్రియుఁడు, కుష్ఠరోగము గలవాఁడు. స్వజనవిరోధి, మూర్ఖుఁడు, స్థానభ్రష్టు, సుతహీనుఁడు అగును.

నీచః పరకర్మరతః క్షయరోగీ శ్వాసకాసపరిభూతః,
నింద్యస్సాన్యద్బంధూనాం సితేందురవ్యారగురురవిజైః. 4

రవిచంద్రకుజబుధగురుశనులు కలిసియుండఁగాఁ బుట్టినవాఁడు నీచుఁడు, పరకార్యరతుఁడు, క్షయవ్యాధి మొదలైనవి గలవాఁడు అగును.

మంత్రీ నృపస్య సుభగః క్షాంతియుతో భవతి శోకపరితప్తః,
అకళత్రో ధనరహితో రవీందుబుధజీవసితసౌరైః. 5

రవిచంద్రబుధగురుశుక్రశనులు కలిసియుండఁగాఁ బుట్టినవాఁడు రాజప్రియుఁడు, ఓర్మిగలవాఁడు, శోకముచే తపించువాఁడు, కళత్రహీనుఁడు అగును.

తీర్థేషు సదారమతే పుత్రై ర్నిత్యం ధనేన రహితశ్చ,
వనపర్వతోపసేవీ బుధారరవిజీవశనిశుక్రైః 6

రవికుజబుధగురుశుక్రశనులు కలిసియుండిన యాత్రలు సేయువాఁడు, పుత్రులు ధనము మొదలైనవి గలవాఁడగును.

నిత్యం శుచిః ప్రతాపీ బహుయువతిరతో నృపప్రియో మంత్రీ,
ధనసుతసౌభాగ్యయుతః కుజార్కిసితచంద్రబుధజీవైః 7

చంద్రకుజబుధగురుశుక్రశనులు కలిసియుండఁగాఁ బుట్టినవాఁడు, ఎల్లపుడు శుచిత్వము గలవాఁడు, పరాక్రమము గలవాఁడు, అనేకస్త్రీలయం దాసక్తిగలవాఁడు, రాజప్రియుఁడు, ధనము పుత్రులు మొదలైనవి గలవాఁడగును.

ప్రాయో దరిద్ర దుఃఖీ మూర్ఖః షట్పంచసంయుతై ర్విహగైః,
అన్యోన్యదర్శనాదపి ఫలమేతత్కాండదళాః ప్రాహుః. 8

తఱుచుగా ఐదుగ్రహములుగాని ఆఱుగ్రహములుగాని కలిసియుండినను, పరస్పరము జూచుచుండినను దరిద్రుఁడు, దుఃఖముగలవాఁడు, మూర్ఖుఁడు అగును.

ఇతి ఏకోనవింశోఽధ్యాయః.

---

## ప్రవ్రజ్యాయోగములను దెలుపు ఇరువదవ యధ్యాయము.

యోగావిధ క్తాశ్చతురాదిసంస్థై ర్వ్యాసాద్గ్రహైః కైరపి తాపసానాం,
జన్మాది తేషామపరై ర్మునీంద్రై ర్విస్తం వేదితం తత్కథయామ్యశేషాత్

కొందఱుమునులచేత నాలుగుమొదలైన గ్రహములచేత తాపసులయొక్క జన్మమొదలుగాఁగల యోగములు చెప్పఁబడెను. వానిని విస్తరించి చెప్పఁబోవుచున్నాను.

సూర్యేందుశుక్రార్యమహీసుతేషు
సూర్యేందుసోమాత్మజభూమిజేషు,
ఏకస్థితేషు ప్రభవే త్తపస్వీ
భాన్వారమందజ్ఞసితేషు చైవ. 2

జన్మకాలమున ఏరాశియందైనను రవిచంద్రకుజగురుశుక్రులు రవిచంద్రకుజబుధులు రవికుజబుధశుక్రశనులు కలిసియుండఁగాఁ బుట్టినవాఁడు సన్యాసి యగును.

కుజేందుసూర్యజ్ఞపురోహితైశ్చ తీక్ష్ణాంశుచంద్రార్కిశశాంకజైశ్చ,
సూర్యేందుభూపుత్రశనైశ్చరైస్స్యా దేకర్క్షగైః ప్రవ్రజితో మనుష్యః.

రవిచంద్రకుజబుధగురువులు రవిచంద్రబుధశనులు రవిచంద్రకుజశనులు కలసి యుండిరేని సన్యాసియగును.

ఆదిత్యగుర్వార్కిశశాంకపుత్రాభౌమార్క చంద్రాత్మజసూరయశ్చ,
ఏకర్క్ష సంస్థాస్తపసి స్థితానాం కుర్వంతి జన్మప్రసవే గ్రహేంద్రాః. 4

కుజబుధగురుశనులు రవికుజబుధశనులు కలిసియుండఁగా సన్యాసి యగును.

సితార్కభౌమార్కసుతామహాబలా
సురేజ్యభూపుత్రకసౌరసూరయః,
కుజేందువాగీశశనైశ్చరా ఇమే
సమంగతావై జనయంతి తాపసమ్. 5

రవికుజశుక్రశనులు రవికుజగురుశనులు చంద్రకుజగురుశనులు కలిసియుండిరేని సన్యాసి యగును.

కుజార్కిసోమాత్మజ దేవవందితైః
కుజార్కిచంద్రాత్మజసూర్యభార్గవైః,
రవీందుభౌమాసితదానవప్రియై
ర్భవంతి సూతావ్రతసంయుతానరాః. 6

కుజబుధగురుశనులు రవికుజబుధశుక్రశనులు రవిచంద్రకుజశుక్రశనులు కలిసి యుండిరేని సన్యాసి యగును.

సితారసూర్యాత్మజజీవభాస్కరైః
కుజేందుదేవేడ్యబుధార్కనందనైః,
సితేందుపుత్రార్కిశశాంకభూమిజై
ర్భవేత్తపస్వీ వనపర్వతాశ్రయః. 7

రవికుజగురుశుక్రశనులు రవికుజబుధగురుశనులు చంద్రకుజబుధశుక్రశనులు కలిసియుండిరేని సన్యాసి యగును.

చంద్రేందుపుత్రారసురేడ్యభాస్కరై
శ్శశాంకసూర్యేందుజశుక్రభూమిజైః,
స్థితై రమీభి స్సహితై ర్నృసంభవాః
భవంతి వంధ్యామునయోఽత్రదూషకాః. 8

రవిచంద్రకుజబుధగురువులు రవిచంద్రకుజబుధశుక్రులు కలిసియుండఁగాఁ బుట్టినవాఁడు నిష్ఫలతపస్వి యగును.

రవీందుభౌమేందుజజీవభార్గవై
శ్శశాంకభౌమార్కిబుధేడ్యభాస్కరైః,
కుజేందుసూర్యార్కిసితేందుసంభవై
ర్భవే దమీభి స్సహితై స్తరో వ్రతీ. 9

రవిచంద్రకుజబుధగురుశుక్రులు రవిచంద్రకుజబుధగురుశనులు రవిచంద్రకుజబుధశుక్రశనులు కలిసియుండఁగా సన్యాసి యగును.

సితేందుజీవార్కజసూర్యలోహితై
స్సితార్కభౌమార్కిశశాంకసోమజైః,
ఏకత్రయాతై ర్గగనేచరై స్సదా
భవంతి జాతా మునయో యశస్వినః. 10

రవిచంద్రకుజగురుశుక్రశనులు రవిచంద్రకుజబుధశుక్రశనులు కలిసియుండిరేని మును లగుదురు.

కుజజ్ఞవాగీశసితార్కిభాస్కరై
స్సితార్కిజీవేందుజచంద్రభూమిజైః,
బలప్రధానై స్సహితై ర్వ్యహంగమై
ర్వ్రజే త్ప్రజాతః పురుష స్తపస్వితామ్. 11

రవికుజబుధగురుశుక్రశనులు చంద్రకుజబుధగురుశుక్రశనులు బలవంతులై కలిసియుండిరేని సన్యాసి యగును.

రవీందువాగీశశనైశ్చరైశ్చ శనైశ్చరేంద్వర్కసితై రవశ్యం,
రవీందుపుత్రక్షితిజేంద్రపూజ్యై స్తపస్వినస్స్యుః ఫలమూలభక్షణాః. 12

రవిచంద్రగురుశనులు రవిచంద్రశుక్రశనులు రవికుజబుధగురువులు కూడియుండఁగా ఫలభక్షకులగు మును లగుదురు.

వక్రార్కసోమాత్మజదానవేడ్యా భౌమేందువాగీశశశాంకపుత్రాః,
ఏకర్క్షగా జన్మని యస్య జంతో ర్భవే ద్వ్రతీ వల్కలచీరధారీ. 13

రవికుజబుధశుక్రులు చంద్రకుజబుధగురువులు కలిసియుండఁగా నారచీరలను ధరించిన సన్యాసి యగును.

శశీందుపుత్రక్షితిజార్కపుత్రా బుధక్షమాపుత్రసురేడ్యసౌరాః,
ఏకర్క్షగా జన్మని యస్య సూతౌ కుర్వంతి తం తాపసమేవ శాంతమ్.

జన్మకాలమున చంద్రకుజబుధశనులు కుజబుధగురుశనులు కలిసియుండిరేని సన్న్యాసి శాంతుఁ డగును.

చంద్రార్కభార్గవశశాంకసుతాబలస్థా
భౌమేందుపుత్రసితభాస్కరనందనాశ్చ,
మందేందువాక్పతిసితానియతం యతీనాం
కుర్వంతి జన్మఫలపాకకృతాశనానాం 15

రవిచంద్రబుధశుక్రులు కుజబుధశుక్రశనులు చంద్రగురుశుక్రశనులు కలిసియుండిన ఫలభక్షకులగు యతు లగుదురు

రవికుజశశిశుక్రై శ్చంద్రభౌమజ్ఞసూర్యై
ర్గురుసితరవిమందై శ్శుక్రజీవేందువక్రైః,
కుజబుధసితచంద్రై రేభిరేకర్క్షయాతై
ర్భవతి గిరివనౌకా స్తాపస స్సర్వవంద్యః 16

జన్మకాలమున ఆయా గ్రహములు కలిసియుండెనేని వనగిరినివాసముగల తాపసశ్రేష్ఠుఁ డగును.

సితశశికుజగురుమందై శ్చంద్రేందుజభౌమదేవగురుశుక్రైః,
రవిశశికుజబుధజీవై ర్భవతి యతి ర్దుఃఖితో దీనః 17

చంద్రకుజగురుశుక్రశనులు చంద్రకుజబుధగురుశుక్రులు రవిచంద్రకుజబుధగురువులు కలిసియుండిన యతి దుఃఖవంతుఁ డగును

కుజార్కిదేవేడ్యసితేందుపుత్రై శ్శనీనసోమాత్మజచంద్రభౌమైః,
సమంగతై స్స్వైస్స్వబలై ర్యథోక్తై ర్జటాధరావల్కలధారిణశ్చ 18

కుజ శని గురు శుక్ర బుధులు, శని సూర్య బుధ చంద్ర కుజులు యథోక్త బలవంతులై కలిసియుండిరేని జడలును, నారచీరలు ధరించిన యతి యగును.

భాన్విందుజేందుకుజజీవసురారిపూజ్యై
స్సూర్యేందుభౌమగురుశుక్రశనైశ్చరైశ్చ,
ప్రాప్నోత్యవశ్య మిహ తాపసరూపమేభి
రేకర్క్షగై ర్గగనవాసిభి రేవ జాతః. 19

సూర్య బుధ చంద్ర కుజ గురు శుక్రులును, సూర్య చంద్ర కుజ గురు శుక్ర శనులును కలిసియుండిరేని యతి యగును.

ప్రవ్రజ్యేశే దినకరగతే భుక్తిమంతోఽతిశక్తాః
ప్రవ్రజ్యాయాః స్సుబలసహితై స్థైర్య మాహు ర్గ్రహేంద్రైః,
సంపూర్ణానాం వశమనుగతైః ప్రచ్యుతై స్తైర్భవంత్యే
వీర్యోపేతై ర్భవతి బహుభి స్సద్బలస్యానుపూర్వ్యాత్ 20

ప్రవ్రజ్యాయోగకర్తయగు గ్రహ మస్తంగతుఁ డయ్యెనేని అసన్యాసి భోజనప్రియుండును, బలిష్ఠుఁడును అగును. ప్రవ్రజ్యాయోగకర్తలగు గ్రహములు బలవంతు లగుదురేని సన్యాసము స్థిరమగును. ప్రవ్రజ్యాయోగకర్తలగు గ్రహములు బలహీనులయ్యెనేని సన్యాసము భంగముకలది యగును.

ప్రవ్రజ్యాయాః స్స్వామినః రవిముషితతను ర్నిరీక్షితోవాఽన్యైః,
యాచితదీక్షోభవతిచ యవనాధిపతే ర్యథావాక్యమ్. 21

ప్రవ్రజ్యాయోగాధిపతి అస్తంగతుఁడైనను అన్యులచే జూడఁబడినను సన్యసింపవలెనను కోరికగలవాఁ డగును.

శశీ దృగాణే రవిజస్య సంస్థితః కుజార్కదృష్టఃప్రకరోతి తాపసం,
కుజాంశకేవా రవిజేనదృష్టో నవాంశతుల్యం కథయంతి తం పునః.

చంద్రుఁడు శనిదృగాణమందుండి రవికుజులచే జూడఁబడెనేని తాపసి యగును. చంద్రుఁడు కుజనవాంశమందుండి శనిచే జూడఁబడెనేని నవాంశాధిపతి తుల్యసన్యాసి యగును.

జన్మాధిప స్సూర్యసుతేనదృష్ట శ్శేషై రదృష్టః పురుషస్య సూతౌ,
ఆత్మీయదీక్షాంకురుతేహ్యవశ్యంపూర్వోక్తమత్రాపి విచారణీయమ్.

జన్మాధిపతి యనఁగా జన్మకాలమున చంద్రస్థితరాశ్యధిపతి శనిచే జూడఁబడి ఇతరులచే జూడఁబడకయుండఁగాఁ బుట్టినవాఁడు సన్యాసి యగును.

జన్మపతి ర్వికలాంగః పశ్యతి సౌరిం చతుష్టయే ప్రబలం,
యస్య సభాగ్యవిహీనః ప్రవ్రజ్యాం ప్రాప్నుయా త్పురుషః. 24

జన్మాధిపతి దుర్బలుఁడై కేంద్రములయందున్న శనిని జూచెనేని జాతకుఁడు దరిద్రుఁడైన సన్యాసి యగును.

గురుహిమగురవీణా మేకవోదయస్థో
గగనతలగతోవా రిఃఫగ శ్చాల్పమూర్తిః,
అవికలబలభాజా సూర్యపుత్రేణ దృష్టో
జనయతి ఖలు జాతం తాపసం దుఃఖభాజమ్. 25

రవిచంద్రగురువులలో నొకఁడు ఉదయించినవాఁడై దశమమందున్నను లేక బాలుఁడై ద్వాదశమందుండి బలముగల శనిచేఁ జూడఁబడెనేని యతి దుఃఖవంతుఁ డగును.

కుముదవనసుబంధుం సౌమ్యభాగే బలస్థం
వియతి గమనశీలాన్ సోచ్ఛభస్థాంశ్చ శేషాన్,
యది దినకరపుత్రః పశ్యతి ప్రాప్తవీర్యో
భవతి భువననాథో దీక్షిత శ్చ స్వతంత్రః 26

శుభగ్రహనవాంశయందున్న చంద్రుని అచ్చయందున్న తక్కినగ్రహములను శని బలయుక్తుఁడై చూచెనేని పుట్టినవాఁడు రాజాధిరాజై సన్యసించును.

అతిశయబలయుక్త శ్శీతగు శ్శుక్లపక్షే
బలవిరహితరిక్తం ప్రేక్షతే లగ్ననాథం,
యది భవతి తపస్వీ దుఃఖిత శ్శోకతప్తో
ధనజనపరిహీనః కృచ్ఛ్రలబ్ధాన్నపానః 27

బలవంతుఁడైన శుక్లపక్షచంద్రుఁడు బలహీనుఁడైన లగ్నాధిపతిని జూడఁగాఁ బుట్టినవాఁడు దుఃఖము దరిద్రముగల యతి యగును.

సౌరిశ్శుభభాగస్థః పశ్యతి చంద్రం గ్రహాం స్తథైవాన్యాన్,
కుంభాంశేషు ప్రాప్తా జ్జనయతి దీక్షాన్వితం పురుషమ్. 28

శని శుభనవాంశయందుండి కుంభాంశయందున్న చంద్రాన్యగ్రహములనుజూడఁగాఁ బుట్టినవాఁడు యతి యగును.

ఏకర్క్షగతై స్సర్వై ర్వీక్షన్నాధిపతిర్నిరీక్షితో యస్య,
దీక్షా తస్యావశ్యం భవతీతి పురాతనైః కథితమ్. 29

జన్మకాలికచంద్రస్థలగ్నాధిపతి ఒకరాశిని బొందిన సర్వగ్రహములచేతను జూచునపుడు బుట్టినవాఁడు సన్న్యాసి యగును.

అగ్నీనాం పరిచారకా గిరినదీ తీరాశ్రమే తాపసా
స్సూర్యారాధనతత్పరా గణపతేర్భక్తా ఉమాయాశ్చ యే,
గాయత్రీం జపతాం వనే నియమినాం గంగాభిషేకార్థినాం
కౌమారవ్రత మిచ్ఛతా మధపతి స్తేషాం సదా భాస్కరః. 30

తాపసులయొక్క భేదమును, తదధిపతులను జెప్పుచున్నాఁడు. అగ్న్యారాధకులు, పర్వతనదీప్రాంతములయందు తపస్సు చేయువారలు, సూర్యోపాసకులు, గణపత్యుపాసకులు, శాక్తేయులు, గాయత్ర్యుపాసకులు, వనవాసులు, గంగాభిషేకము చేయ నభిలషించువారలు, కౌమారవ్రతావలంబులు వీరలకు రవి అధిపతి.

వృద్ధశ్రావకభస్మధూళితవలాశ్శైవ్యవ్రతే యే స్థితాః
బాహ్యాః తాతకితాంగతాః భగవతీభక్తాశ్చ నిస్సంగినః,
సిద్ధాంతే ఖలు సోమనామ్ని నిరతా కాపాలికా నిష్ఠురా
స్తేషాం నాయకతాంగతశ్శశధరః ఖట్వాంగపాణిద్యుతిః. 31

వృద్ధశ్రావకులు, భస్మధూళితాంగులు, శైవవ్రతనిరతులు, వేదబాహ్యులు, దేవీ భక్తులు, సర్వసంగపరిత్యాగులు, సోమసిద్ధాంతనిరతులు, కాపాలికులు లోనగు భేదములు గల తాపసులకు చంద్రుఁ డధిపతియగును.

ఉపాసకాబుద్ధసమాశ్రయంగతాఃశిఖాంగతాఃపాండరభిక్షవశ్చయే,
సువాససోరక్తపటాజితేంద్రియాఃప్రభుస్సదైషాం క్షితిజః ప్రకీర్తితః

బౌద్ధమతాదులను పొందిన తాపసులకు కుజుఁ డధిపతి యగును

ఆజీవినాం కుహకినాం సమయాధికా యే
యే దీక్షితా స్తనుభృతః ఖలు గారడే చ,
తంత్రే మయూరపిశితాశనయోశ్చ యుక్తా
స్తేషాం శశాంకతనయోఽధిపతి ర్నిరుక్తః. 33

జీవితనిరపేక్షులు, వంచకులు, సమయాచారతత్పరులు, గారుడతంత్రమందు దక్షగలవారు, మయూర పిశితాశనములయందు నిరతులు, వీరలకు బుధుఁ డధిపతి యగును.

ఏకం త్రీ నథవా వహంతి మునయో దండాన్ కషాయాంబరా
వానప్రస్థ ముపాగతాః ఫలపయోభక్షాశ్చ యే భిక్షవః,
గార్హస్థ్యేన తు సంస్థితా నియమినస్సద్బ్రహ్మచర్యంగతా
స్తేషాం దండపతి స్సురేంద్రసచివ స్తీర్థేషు యే స్నాతకాః. 34

ఏకదండ త్రిదండసన్న్యాసులు, కాషాయాంబరధరులు, వానప్రస్థాశ్రమస్థులు, పాలను పండ్లను భక్షించుభిక్షువులు, గృహస్థాశ్రమమున నియతవ్రతులు, నైష్ఠిక బ్రహ్మచారులు, పుణ్యతీర్థములయందు స్నానమాచరించువ్రతపరులు వీరలకు బృహస్పతి అధిపతి యగును.

పాశుపతయజ్ఞదీక్షావ్రతేషు యే నిత్యమేవ సంయుక్తాః,
వైష్ణవచరకాణా మపి తేషాం నేతా ప్రకీర్తిత శ్శుక్రః. 35

పాశుపతయజ్ఞదీక్షావ్రతములయం దాసక్తులగుయతులకును వైష్ణవచరకులకును శుక్రుఁ డధిపతి యగును.

పాషండవ్రతనిరతా దిగంబరా భిక్షవో యే చ,
తేషామధిపతిరార్కి శ్శాక్యవకతరుమూలినశ్చ దుస్తపసః. 36

పాషండాదివ్రతనిరతులైనవారికిని, దిగంబరభిక్షువులకును, ఆర్హత, జైనమతావలంబులగుయతులకును, దుష్కరతపస్సు నొనరించువారలకును శని అధిపతి యగును.

ప్రకథితమునియోగే రాజయోగో యది స్యా
దశుభఫలవిపాకం సర్వ ముత్సార్య పశ్చాత్,
జనయతి పృథివీశం దీక్షితం సాధుశీలం
ప్రణత నృపశిరోమణ్యుజ్జ్వలత్పాదయుగ్మమ్ 37

ప్రవ్రజ్యాయోగంబును రాజయోగంబును గూడియుండఁగాఁ బుట్టినవాఁడు ప్రవ్రజ్యాయోగమందుఁ జెప్పఁబడిన అశుభమంతయుం నశించి సమస్తదేశాధీశులయొక్క శిరోరత్నములచే ప్రకాశించు పాదయుగ్మము గలవాఁ డగును. ఈయోగములు బలాబలము ననుసరించి ఆలోచించవలెను.

ఇతి వింశోఽధ్యాయః.

---

## నాభసయోగములను దెలుపు ఇరువదొకటవ యధ్యాయము.

యవనాద్యైర్విస్తరతః కథితా యోగాస్తు నాభసానామ్నా,
అష్టాదశశతగుణితా స్తేషాం ద్వాత్రింశదిహ వక్ష్యే. 1

యవనాదులు ౧౮౦౦ నాభసయోగములను జెప్పిరి. ఆయోగములలో ముప్పదిరెండుమాత్రము జెప్పఁబోవుచున్నాను.

నౌచ్ఛత్రకూటకార్ముకశృంగాటకవజ్రదామనీపాశాః,
వీణాసరోజముసలా వాపీహలశరసముద్రచక్రాణి. 2
మాలాసర్పార్ధేందూ యవకేదారౌ గదావిహగయూపాః,
యుగశకటశూలదండా రజ్జు శ్శక్తిస్తథానలో గోళః. 3

నౌకా, ఛత్ర, కూట, కార్ముక, శృంగాటక, వజ్ర, దామపాశ, వీణ, పద్మ, ముసల, వాపీ, హాల, శర, సముద్ర, చక్ర, మాల, సర్ప, అర్ధేందు, యవ, కేదార, గద, విహాగ, యూప, యుగ, శకట, శూల, దండ, రజ్జు, శక్తి, నల, గోళములను నామములుగల 32 యోగములు చెప్పఁబడినవి.

సచరాచరస్య జగతో యోగైరేభిః ప్రకీర్త్యతే ప్రసవః,
ఆశ్రయజాతాన్ప్రాహుర్మాణింథాః ముసలరజ్జునలయోగాన్. 4

జగత్తునం దుత్పన్నమైన సమస్తజంతుజాలమునకు ఈయోగములలో నొక యోగము తప్పక కలుగును. ముసలరజ్జునలయోగములు ఆశ్రయయోగములని మాణింథాదులు చెప్పిరి.

గోళయుగశూలపాశా వీణాకేదారదామనీసంజ్ఞాః,
సప్తైతే సంఖ్యాఖ్యాః పూర్వాచార్యైస్సముద్దిష్టాః. 5

గోళ, యుగ, శూల, పాశ, వీణ, కేదార, దామని సంజ్ఞలుగల యీయేడును సంఖ్యాయోగము లనఁబడును.

ద్వేచార్ధయోగసంజ్ఞే భుజంగమాలే పరాశరేణోక్తే,
ఆకృతిజాతా వింశతి రపరైః కథితాశ్చ సావిత్రే. 6

భుజంగమాలాయోగములు రెండును దళయోగములు ఆకృతియోగములు ౨౦ అని కొందఱు చెప్పిరి.

ఆశ్రయయోగే జాతా అమిశ్రితే సౌఖ్యలాభగుణయుక్తాః,
అన్యోన్యమిశ్రితాశ్చే ద్విగతఫలా స్స్యుస్తదా యోగాః 7

ఆశ్రయయోగములు సంకరములు లేకయుండఁగా ఆయోగములయందుఁ బుట్టినవాఁడు సౌఖ్యము లాభము గలవాఁడగును. మిశ్రమముగా నుండెనేని ఫలశూన్యముగ నుండును.

నందంతి స్వైర్భాగ్యైర్నృపలబ్ధధనా నృపప్రియాః ఖ్యాతాః,
ప్రాయేణ సౌఖ్యయుక్తా శ్చాకృతియోగేషు యే జాతాః. 8

ఆశ్రయయోగములందుఁ బుట్టువారు తమభాగ్యముచే సంతసించువారును నృపలబ్ధ ధనము మొదలయినవి గలవా రగుదురు.

పరభాగ్యలబ్ధసౌఖ్యా ధనభాగ్యైరేవ జీవితాస్తేషాం,
సంఖ్యాయోగే జాతా యే పురుషాస్సర్వతో వికలాః. 9

సంఖ్యాయోగమందుఁ బుట్టినవాఁడు పరధనమును పొంది సౌఖ్యమును పొందు వాఁడగును.

క్వచిత్స్వభాగ్యైః క్వచిదేవ మేవం క్వచిత్పరాద్భ్యాపతితఃఫలంచ,
క్వచిత్సుఖం దుఃఖమతీవ కష్టం సమూర్ధయోగే పురుషే లభేత. 10

దళయోగమందుఁ బుట్టినవాఁడు సుఖదుఃఖములు సమముగ గలవాఁడగును.

హోరాదికంటకేభ్యస్సప్తర్క్షగతైః క్రమేణ యోగాస్స్యుః,
నౌచ్ఛత్రకూటకార్ముకనిర్దేశాః పూర్వయవనేంద్రైః. 11

లగ్నకేంద్రము మొదలు ఏడురాసులయందును గ్రహము లవిచ్ఛిన్నంబులై యుండెనేని నౌకాయోగమనియు, చతుర్థకేంద్రము మొదలవిచ్ఛిన్నంబులై యుండెనేని ఛత్రయోగమనియు, సప్తమకేంద్రము మొదలవిచ్ఛిన్నంబులై యుండెనేని కూటయోగమనియు, దశమకేంద్రము మొదలవిచ్ఛిన్నంబులై యుండెనేని కార్ముకయోగమనియుఁ దెలియవలయును.

లగ్నాదికంటకేభ్యశ్చతుర్గృహస్థితైర్గ్రహైర్యోగాః,
యూపశరశక్తిదండా స్సత్యాచార్యప్రియా నిత్యమ్. 12

లగ్నకేంద్రము మొదలు నాలుగురాసులయందు రవ్యాదిగ్రహంబు లవిచ్ఛిన్నంబులై యుండెనేని యూపయోగమనియు, ఇట్లే చతుర్థకేంద్రము మొదలు ఉండెనేని శరయోగమనియు, సప్తమకేంద్రము మొదలు ఉండెనేని శక్తియోగమనియు, దశమకేంద్రము మొదలు ఉండెనేని దండయోగమనియు నెఱుంగునది.

సప్తర్క్షగైర్గ్రహైరేభిః కేంద్రా దన్యత్ర కీర్తితోఽర్ధశశీ,
కేంద్రప్రత్యాసన్నై ర్భవనద్వయగై ర్గదా నామ. 13

పణపరస్థానము మొదలుగాఁగాని ఆపోక్లిమస్థానము మొదలుగాఁగాని ఏడురాసులయందు గ్రహము లవిచ్ఛిన్నంబులై యుండెనేని అర్ధచంద్రయోగమనియు, గ్రహము లన్నియు సమీపమందున్న రెండుకేంద్రములను పొందెనేని గదాయోగము (అనఁగా: లగ్నచతుర్థకేంద్రములయందును చతుర్థసప్తమకేంద్రములయందును సప్తమదశమకేంద్రములయందును దశమలగ్నకేంద్రములయందును సర్వగ్రహంబులుండుట గదాయోగమని తాత్పర్యము).

లగ్నాస్తమగతైస్సౌమ్యైః పాపైస్సుఖకర్మగైర్భవతి వజ్రం,
విపరీతై ర్యవయోగో మిశ్రైః పద్మం బహిస్థితై ర్వాపీ. 14

లగ్నసప్తమకేంద్రములయందు శుభగ్రహములుండి చతుర్థదశమకేంద్రములయందు మాత్రము పాపగ్రహము లుండెనేని వజ్రయోగమనియు, లగ్నసప్తమకేంద్రములయందు పాపగ్రహములుండి చతుర్థదశమకేంద్రములయందుమాత్రము శుభగ్రహములుండెనేని యవయోగమనియుం, నాలుగుకేంద్రములయందును మిశ్రముగ నుండెనేని (అనఁగా శుభులుండవలసిన లగ్నసప్తమములలో నొకస్థానమందు శుభగ్రహములు నొకస్థానమందు పాపగ్రహములు, అశుభులుండవలసిన చతుర్థదశమములలో నొకస్థానమందు శుభగ్రహములు నొకస్థానమందు పాపగ్రహము లుండెనేని) పద్మకయోగమనియుం (కేంద్రాదన్యత్ర గ్రహములు లేకుండవలయుననుట), ఈపద్మకయోగమునకు చెప్పఁబడిన గ్రహస్థితి పణపరరాసులయందుగాని ఆపోక్లిమరాసులయందుగాని యుండెనేని వాపీయోగమనియు నెఱుంగునది. (వజ్రయవయోగములు పూర్వశాస్త్రానుసారము చెప్పఁబడినవి. సూర్యునకు చతుర్థరాశియందు బుధశుక్రులుండరు గాన ఈయోగము లసంభవములని వరాహమిహిరులువారు బృహజ్జాతకమునందుఁ జెప్పిరి)

హోరాస్తగతైః శకటం చతుర్థదశమాశ్రితైర్విహగః,
ఉదయాన్యగైస్త్రికోణై ర్హల ఇతి శృంగాటకం సలగ్నైతత్. 15

సర్వగ్రహములు లగ్నసప్తమములయందుండెనేని శకటయోగమనియుం, చతుర్థదశమములయందుండెనేని విహగయోగమనియుం, సకలగ్రహంబులు లగ్నత్రికోణము గాక తక్కిన త్రికోణములయందు యథాసంభవములుగా నున్న హలయోగమనియుం (అనఁగా: ద్వితీయషష్ఠదశమములు తృతీయసప్తమైకాదశములు చతుర్థాష్టమద్వాదశములు పరస్పరత్రికోణములు), లగ్నపంచమనవమములయందుండెనేని శృంగాటకయోగమనియుఁ దెలియవలయును.

రాశ్యంతరితై ర్లగ్నా త్షడ్భవనగతై ర్భవేచ్చక్రం,
అర్థాత్తదైవ యాతై శ్చక్రాకారో భవే జ్జలధిః 16

గ్రహములన్నియుం లగ్నము మొదలు రాశ్యంతరగతులాయెనేని ఆఱురాసుల లోపల (అనఁగా: లగ్నతృతీయ పంచమ సప్తమ నవమ ఏకాదశములను పొందెనేని) చక్రయోగమనియుం, ద్వితీయ మొదలీప్రకారమే (అనఁగా: ద్వితీయ చతుర్థ షష్ఠ అష్టమ దశమ ద్వాదశములను) పొందియుండెనేని సముద్రయోగమనియుఁ దెలియఁదగినది.

ఇత్యాకృతిజా ఏతే వింశతిసంఖ్యా మయా సముద్దిష్టాః,
ఆశ్రయజాతా' న్వక్ష్యే యథామతం వృద్ధగార్గ్యస్య 17

ఈ ప్రకారము ఇరువది ఆకృతియోగములు జెప్పఁబడినవి ఇఁక సాశ్రయ యోగములను గార్గిమతానుసారము చెప్పుచున్నాను.

ఉభయస్థిరచరసంస్థైస్సర్వైర్నలముసలరజ్జవః క్రమశః,
కేంద్రేషు సౌమ్యపాపైః స్త్వాలాసర్పశ్చ దళయోగౌ 18

సర్వగ్రహంబులు ద్విస్వభావరాసులయందుండెనేని నలయోగమనియుం స్థిరరాసులయందుండెనేని ముసలయోగమనియుం, చరరాసులయందుండెనేని రజ్జుయోగమనియుం, మూఁడుకేంద్రములయందు చంద్రవ్యతిరిక్తశుభగ్రహములుండి పాపగ్రహములు లేకుండెనేని దళాఖ్యంబగు మాలాయోగమనియుం, మూఁడుకేంద్రములయందు పాపగ్రహములగు రవికుజశనులుండిరేని దళాఖ్యంబగు సర్పయోగమనియు నెఱుంగునది. ఇట్లు మూఁడు కేంద్రములు గ్రహించుటకు చంద్రవ్యతిరిక్తశుభగ్రహములు గ్రహించుటకు గార్గివచనము. శ్లో. "త్రికేంద్రగైర్వ్యమారాద్యైః స్సర్పో దుఃఖితజన్మదః, భోగిజన్మప్రదా మాలా తద్వజ్జీవసితేందుజైః"

ఏకభవనాదిసంస్థైస్సంఖ్యాఖ్యాస్సప్తధా క్రమం యోగాః,
గోళయుగశూలసంజ్ఞాః కేదారః పాశదామవీణాః. 19

సూర్యాదిసప్తగ్రహములు ద్వాదశరాసులలో నెచ్చటనైనను ఒకరాశియందుండెనేని గోళయోగమనియుం, రెండురాసులయందుండెనేని యుగయోగమనియుం, మూఁడు రాసులయందుండెనేని శూలయోగమనియుం, నాలుగురాసులయందుండెనేని కేదారయోగమనియుం, ఐదురాసులయందుండెనేని పాశయోగమనియుం, ఆరురాసులయందుండెనేని దామనీయోగమనియుం, ఏడురాసులయందుండెనేని వీణాయోగమనియుం దెలియవలయును

ఏతేషాం ఫలయోగం కథయామి యథాక్రమం మునిభిరుక్తం,
సర్వదశాస్వపి ఫలదాస్సకలా ఏతే బుధైశ్చింత్యాః. 20

ఈయోగములు సర్వదశలయందు జరుగునుగాన ఫలమును విస్తరించి చెప్పుచున్నాను.

సలిలోపజీవవిభవా బహ్వో యాఃఖ్యాతకీర్తయో దృష్టాః,
కృపణా బలినో లుబ్ధా నౌసంభూతాశ్చలాః పురుషాః. 21

నౌకాయోగమందుఁ బుట్టినవాఁడు, ఉదకములచే సంపాదింపఁబడిన విభవము గలవాఁడు, ఎక్కువలాభముచేఁ బ్రఖ్యాతిఁజెందినవాఁడు, కృపణస్వభావుఁడు లుబ్ధుఁడుగా నుండును.

ఆనృతికకితవబంధనపాలానిష్కించనాశ్శఠాః క్రూరాః,
కూటసముత్థా నిత్యం భవంతి గిరిదుర్గవాసినో మనుజాః. 22

కూటయోగమందుఁ బుట్టినవాఁడు, అబద్ధము, జూదము, చెఱసాలను గాపాడుట, వంచనము. క్రూరత్వము, దారిద్ర్యము లోనగుగుణములుగలవాఁడై గిరిదుర్గముల యందు నివసించును.

స్వజనాశ్రయోజయావాన్దాతా నృపవల్లభః ప్రకృష్టమతిః,
ప్రథమేఽంత్యేవయసి నరస్సుఖభాగ్యయుతస్సితాతపత్రస్స్యాత్ 23

ఛత్రయోగమందుఁ బుట్టినవాఁడు, స్వజనాశ్రయుఁడు, దాత, రాజప్రియుఁడు, బుద్ధిమంతుఁడు, బాల్యమందు వార్ధకమునందు సుఖభాగ్యయుక్తుఁడు అఖండైశ్వర్యవంతుఁడు నగును.

ఆనృతికగుప్తిపాలాశ్చోరాః కితవాశ్చ కాననే నిరతాః,
కార్ముకయోగే జాతా భాగ్యవిహీనా వయోమధ్యే. 24

కార్ముకయోగమందుఁ బుట్టినవారు, అసత్యమాడువారును, రహస్యముగసంచరించువారును, దొంగలు, జూదరులు, అరణ్యమందు సంచరించువారు, మధ్యవయస్సునందు దరిద్రులు నగుదురు.

సుభగాస్సేనాపతయః కాంతశరీరా నృపప్రియా బలినః,
మణికనకభూషణయుతా భవంతి యోగేఽర్ధచంద్రాఖ్యే. 25

అర్ధచంద్రయోగమందుఁ బుట్టినవాఁడు, సేనాధిపతి, సౌందర్యవంతుఁడు, రాజునకిష్టుఁడు, బలవంతుఁడు, మణిసువర్ణాభరణవంతుఁడు నగును.

ఆద్యంతవయసి సుఖితాశ్శూరాస్సుభగా విరోగదేహాశ్చ,
భాగ్యవిహీనా వజ్రే జాతా స్స్వజనై ర్విరుద్ధాశ్చ. 26

వజ్రయోగమునందుఁ బుట్టినవాఁడు, బాల్యమందు వార్ధకమునందు, సుఖము శౌర్యము, ఆరోగ్యము, చక్కఁదనము, భాగ్యహాని, స్వజనవిరోధముఁ గలవాఁడగును.

వ్రతనియమమంగళపరాః వయసో మధ్యే సుఖార్థసంయుక్తాః,
దాతారః స్థిరవిత్తా యవయోగభవా స్సదా పురుషాః. 27

యవయోగమందుఁ బుట్టినవాఁడు, వ్రతనియమశుభకార్యములం దాసక్తుఁడును యౌవనమందు సుఖధనయుక్తుఁడును, దాతృత్వము, స్థిరమైనధనముగలవాఁడు నగును.

స్ఫీతయశసో గుణాఢ్యాస్స్థిరాయుషో విపులకీర్తయః కాంతాః,
శుభయశసః పృథివీశాః కమలభవా మానవా నిత్యమ్ 28

కమలయోగమందుఁ బుట్టినవాఁడు, గొప్పకీర్తి, సద్గుణసంపత్తి, చిరాయువు, భూస్వామిత్వము, సౌందర్యము గలవాఁడగును.

నిధికరణే నిపుణధియస్స్థిరార్థసుఖసంయుతాస్సురూపాశ్చ,
నయనసుఖసంప్రహృష్టా వాపీయోగే నరా జాతాః. 29

వాపీయోగమందుఁ బుట్టినవాఁడు, ధననిక్షేపణాదులయందు సమర్థుఁడును, స్థిరమైనధనసౌఖ్యములు, సురూపము, నేత్రసౌఖ్యము గలవాఁడు నగును

రోగార్తాః కుకళత్రా మూర్ఖాశ్శకటానుజీవినో నిస్స్వాః,
స్వజనైర్మిత్రైర్హీనా శ్శకటే జాతా భవంతి నరాః. 30

శకటయోగమందుఁ బుట్టినవాఁడు, రోగపీడితుఁడును, మూర్ఖుఁడును, దుష్టభార్యావంతుఁడును, బండివలన జీవించువాఁడును, మిత్రబంధుజనహీనుఁడును, దరిద్రుఁడు నగును.

భ్రమణరుచయో నికృష్టా దూతాస్సురతానుజీవినో ధృష్టాః,
కలహప్రియాశ్చ నిత్యం విహగే యోగే సదా జాతాః. 31

విహగయోగమందుఁ బుట్టినవాఁడు తిరుగుటయందాసక్తి, దౌత్యము, కలహప్రియత్వము, నీచజీవనము, పొగరుబోతుతనము, నీచస్వభావము గలవాఁడునగును.

సతతం మానార్థపరా యజ్వానశ్శాస్త్రయోగకుశలాశ్చ,
ధనకనకరత్నసంపత్సంయుక్తా మానవా గదాయాంతు. 32

గదాయోగమందుఁ బుట్టినవాఁడు, అభిమానవంతుఁడును, యజ్ఞము చేయువాఁడును, శాస్త్రమునందు, యోగమునందు కుశలుఁడును, ధనకనకరత్న సంపదలుగలవాఁడు నగును

ప్రియకలహసమరసాహససుఖినో నృపతేః ప్రియాస్సుభగకాంతాః,
ఆఢ్యా యువతిద్వేష్యాశ్శృంగాటకసంభవా మనుజాః. 33

శృంగాటకయోగమందుఁ బుట్టినవాఁడు, కలహమునందు ప్రియుఁడును, యుద్ధమునందు తెగువతనముగలవాఁడును, సుఖియును, రాజునకిష్టుఁడును, సౌందర్యవంతుఁడును, స్త్రీలచే ద్వేషింపఁబడువాఁడును సంపన్నుఁడు నగును.

బహ్వాశినో దరిద్రాః కృషీవలా దుఃఖితాశ్చ సోద్వేగాః,
బంధుసుహృత్సంత్యక్తాః ప్రేష్యా హలసంజ్ఞితే పురుషాః. 34

హలయోగమందుఁ బుట్టినవాఁడు, తిండిపోతు, దరిద్రుఁడు, వ్యవసాయముచే జీవించువాఁడు, మిత్రబంధురహితుఁడు, దుఃఖితుఁడు, (త్వరపడు) భయయుక్తుఁడు నగును.

ప్రణతాశేషనరాధిపకిరీటరత్నప్రభాచ్ఛురితపాదః,
భవతి నరేంద్రో మనుజశ్చక్రే యో జాయతే యోగే. 35

చక్రయోగమందుఁ బుట్టినవాఁడు రాజాధిరాజు అగును.

బహుధనరత్నాః క్షితిపా యోగార్థయుతా జనప్రియాశ్చాపి,
ఉదధిసముత్థాః పురుషా స్థిరచిత్తా స్సత్త్వవంతశ్చ. 36

సముద్రయోగమందుఁ బుట్టినవాఁడు, సముద్రమునందుఁ బుట్టినరత్నములు, మణులు వివిధపదార్థములు గలవాఁడును, యోగవంతుఁడును, జనులకిష్టుఁడును, భూపతిత్వము గలవాఁడు నగును.

ఆత్మనిరతో నిరత స్త్యాగయుతో విత్తసౌఖ్యసంపన్నః,
వ్రతనియమసత్యనిరతో యూపే జాతో విశిష్టశ్చ. 37

యూపయోగమందుఁ బుట్టినవాఁడు ఆత్మరక్షణ, త్యాగము, ధనము, సౌఖ్యము వ్రతనియమము, సత్యమునం దాసక్తి మొదలగుగుణములు గలవాఁడగును.

ఇషుకరణ దస్యుబంధన మృగయాదన సేవనేతిసోన్మాదాః,
హింస్రాః కుశిల్పనిరతా శ్శరయోగే సంప్రసూతాస్స్యుః. 38

శరయోగమునం దుత్పన్నమైనవాఁడు ఆయుధములను జేయుంట, దొంగలఁ బంధించుట, వేటాడుట, ఉన్మత్తత, క్రూరత్వము, కుచ్ఛితశిల్పమునం దాసక్తి లోనగ గుణములు కలవాఁడగును.

ధనరహిత వికలదుఃఖిత నీచాలసపేలవాయుషః పురుషాః,
సంగ్రామయుద్ధనిపుణా శ్శక్త్యాం జాతా స్థిరా స్సుభగాః. 3

శక్తియోగమందుఁ బుట్టినవాఁడు ధనహీనత, వికలత్వము, దుఃఖము, ఆలస్యము అల్పాయుష్యము, సౌందర్యము, యుద్ధనైపుణ్యము గలవాఁడగును.

హతపుత్రదారనిస్స్వాస్సర్వజనైర్న్యక్కృతాస్స్వజనబాహ్యాః,
దుఃఖితనీచాః ప్రేష్యా దండప్రభవా నరాస్సతతమ్. 4

దండయోగమందుఁ బుట్టినవాఁడు, హతదారాపుత్రులు, దారిద్ర్యము, సర్వజన ద్వేషము, బంధువిరోధము, దుఃఖము, సేవ్యము, నీచత్వము మొదలగుగుణములు గలవాఁడగును.

నిత్యం సుఖప్రధానా వాహనవస్త్రార్థభోగసంపన్నాః,
కాంతాస్సుబహుస్త్రీకా మాలాయాం సంప్రసూతాస్స్యుః. 41

మాలాయోగమందుఁ బుట్టినవాఁడు సౌఖ్యము, వాహనము, వస్త్రాభరణములు, బహుస్త్రీలతో విహరించువాఁడు, భోగవంతుఁడు, రూపవంతుఁడు నగును

విషమాః క్రూరా నిస్స్వాః నిత్యం దుఃఖార్దితాస్సుదీనాశ్చ,
పరభుక్తాః పానరతా స్సర్పే జాతా భవంతి నరాః. 42

సర్పయోగమునఁ బుట్టినవాఁడు, విషమస్వభావము, క్రౌర్యము, దారిద్ర్యము, ఎల్లప్పుడు దుఃఖపీడితుఁడు, దైన్యము, పరులసొత్తు ననుభవించుట, పానమం దాసక్తి లోనగుగుణములు గలవాఁడగును.

అటనప్రియాస్సురూపాః పరదేశేష్వర్థభాగినో మనుజాః,
క్రూరాః ఖలస్వభావా రజ్జుప్రభవా స్సదా కథితాః. 43

రజ్జుయోగమునఁ బుట్టినవాఁడు, తిరుగుటయం దాసక్తి, సౌందర్యము, పరదేశమున ద్రవ్యసంపాదనము, దుష్టస్వభావము, క్రూరత్వము గలవాఁడు నగును.

మానధనజ్ఞానయుతాః కర్మోద్యుక్తా నృపప్రియాః ఖ్యాతాః,
స్థిరచిత్తా ముసలోత్థా భవంతి శూరా స్సదా పురుషాః. 44

ముసలయోగమందుఁ బుట్టినవాఁడు, అభిమానము, ధనము, జ్ఞానము, కర్మలయం దాసక్తి, రాజప్రియత్వము, చిత్తస్థైర్యము, శౌర్యము గలవాఁడుగా నుండును

ఊనాతిరిక్తదేహో ధనసంచయభాగినోఽతినిపుణాశ్చ,
బంధుహితాశ్చ సురూపా నలయోగే సంప్రసూయంతే 45

నలయోగమందుఁ బుట్టినవాఁడు, సమానదేహము, ధనమును గూడఁబెట్టుట, అతినైపుణ్యము, బంధుహితత్వము లోనగుగుణములు గలవాఁడగును.

దారిద్ర్యాలస్యయుతా విద్యాజ్ఞామానవర్జితా మలినాః,
నిత్యం దుఃఖితదీనా గోళే యోగే భవంతి నరాః. 46

గోళయోగమందుఁ బుట్టినవాఁడు, దారిద్ర్యము, సోమరితనము, (విద్య, అభిమానము, అధికారము లేనివాఁడు,) దుఃఖము, దైన్యము కలవాఁడగును.

పాషండభాగినో వా ధనరహితా వా బహిష్కృతా లోకే,
సుతమానధర్మరహితా యుగయోగే మానవా జాతాః. 47

యుగయోగమందుఁ బుట్టినవాఁడు, పాషండగుణయుక్తుఁడు, ధనరహితుఁడు, పుత్రులు, గౌరవము, ధర్మము లేనివాఁడు, బహిష్కరింపఁబడినవాఁడు నగును.

తీక్ష్ణాలసధనరహితా హింస్రాస్సుబహిష్కృతా మహాశూరాః,
సంగ్రామలబ్ధశబ్దా శ్శూలే రౌద్రాః ప్రజాయంతే. 48

శూలయోగమందుఁ బుట్టినవాఁడు, తైక్ష్ణ్యము, అలస్వతము, ధనము లేకుండుట, హింసించుస్వభావము! శౌర్యము, బహిష్కరణము, యుద్ధమునందు కీర్తి, రౌద్రస్వభావముఁ గలవాఁడు నగును.

సుబహూనాముపయోజ్యాః కృషీవలాస్సత్యవాదినస్సుఖితాః,
కేదారే సంభూతా శ్చలస్వభావా ధనై ర్యుక్తాః. 49

కేదారయోగమందుఁ బుట్టినవాఁడు, అనేకుల కుపకరించువాఁడు, వ్యవసాయము సేయువాఁడు, సత్యవాది, సుఖి, చంచలస్వభావుఁడు, ధనవంతుఁడు నగును.

పాశే బంధనభాజః కార్యోద్యుక్తాః ప్రపంచకారాశ్చ,
బహుభాషిణో విశీలా బహుభృత్యాస్సంప్రసూతాస్స్యుః. 50

పాశయోగమందుఁ బుట్టినవాఁడు, బంధనమును బొందువాఁడు, కార్యాసక్తుఁడు, బహుభాషియు, బహుభృత్యవంతుఁడు, శీలరహితుఁడు నగును.

దామిన్యా ముపకారీ పశుగణయుక్తో ధనేశ్వరో మూఢః,
బహుసుతరత్నసమృద్ధో ధీరో విద్వాన్ ప్రజాతస్స్యాత్ 51

దామినీయోగమందుఁ బుట్టినవాఁడు, ఉపకారి, పశుసమృద్ధిగలవాఁడు, ధనాధిపుఁడు, మూఢుఁడు, బహురత్నసుతసమృద్ధిగలవాఁడు, ధీరుఁడు, విద్వాంసుఁడు నగును.

మిత్రాన్వితాస్సువచసశ్శాస్త్రపరా గేయవాద్యనిరతాశ్చ,
సుఖభాజో బహుభృత్యా వీణాయాం కీర్తితా మనుజాః. 52

వీణాయోగమందుఁ బుట్టినవాఁడు, మిత్రులు, సువాక్కులు, గేయమునందు, వాద్యమునందు నాసక్తి, సుఖభోగము, బహుభృత్యులుఁగలవాఁ డగును.

ఇతి ఏకవింశోఽధ్యాయః.

## రవిచారమునుదెలుపు ఇరువదిరెండవ యధ్యాయము.

సర్వస్య సర్వకాలం గ్రహరాశిసముద్భవం ఫలం యస్మాత్,
కథయామ్యతః ప్రయత్నాచ్ఛేషాచార్యాన్సమాశ్రిత్య. 1

గర్గాదిమతానుసారముగా సర్వకాలములయందు సర్వమునకు జరుగు గ్రహరాశి సముద్భవమైనఫలమును జెప్పుచున్నాను.

శాస్త్రార్థకృతికలాభిః ఖ్యాతో యుద్ధప్రియః ప్రచండశ్చ,
ఉద్యుక్తో భ్రమణరుచిర్ధృధాస్థిబంధః క్రియే శ్రేష్ఠః 2

సూర్యుఁడు జననకాలమున మేషమునందుండఁగాఁ బుట్టినవాఁడు, శాస్త్రములను జదువువాఁడును, కళలయందుఁ బ్రఖ్యాతుఁడును, యుద్ధప్రియుఁడును, సాహసవంతుఁడును, ఉత్సాహవంతుఁడును, తిరుగుటయం దిచ్ఛగలవాఁడును, శ్రేష్ఠుఁడునుగా నుండును.

సాహసకర్మాభిరతః పిత్తాసృగ్వ్యాధికాంతిసత్వయుతః,
సూర్యే భవతి నరేంద్రస్స్వతుంగరాశౌ నరో జాతః. 3

సూర్యుఁడు ఉచ్చయందుండఁగాఁ బుట్టినవాఁడు, సాహసకార్యములయం దాసక్తుఁడును, పైత్యరోగవంతుఁడును, కాంతిమంతుఁడును, బలవంతుఁడు నగును.

దానరతో బహుభృత్యో లలితో యువతిప్రియో మృదుశరీరః,
కుజభవనగతే సూర్యే చంద్రేణ నిరీక్షితే భవతి. 4

సూర్యుఁడు కుజక్షేత్రమందుండి చంద్రునిచేఁ జూడఁబడఁగాఁ బుట్టినవాఁడు, దానమం దాసక్తుఁడును, బహుసేవకులు గలవాఁడును, స్త్రీలకిష్టుఁడును, మృదుశరీరవంతుఁడును, సుకుమారవంతుఁడు నగును.

సంగ్రామోత్కటవీర్యః క్రూరస్సంరక్తనేత్రకరచరణః,
భౌమగృహే కుజదృష్టే భానౌ తేజో బలోపేతః. 5

సూర్యుఁడు కుజక్షేత్రమందుండి, కుజునిచేఁ జూడఁబడుచుండఁగాఁ బుట్టినవాఁడు, యుద్ధమునం దాసక్తిఁగలవాఁడును, ఎఱ్ఱని నేత్రములు, హస్తములు, పాదములు గలవాఁడును, క్రూరుఁడును, తేజస్సు, బలముగలవాఁడు నగును.

ప్రేష్యః పరకర్మరతో మందధనస్సత్వహీనబహుదుఃఖః,
భానౌ బుధసందృష్టే కుజభవనే మలినకాయశ్చ. 6

సూర్యుఁడు అంగారకగృహమందుండి బుధుని చేఁ జూడఁబడుచుండఁగా పుట్టిన వాఁడు సేవకుఁడు, ఇతరులపనులయం దాసక్తిగలవాఁడు, స్వల్పధనుఁడు, బలములేని వాఁడు, అనేక దుఃఖములు కలవాఁడు, అపరిశుభ్రమైన శరీరముకలవాఁడు అగును.

భూరిద్రవిణో దాతా నృపమంత్రీ దండనాయకోవాఽపి,
తరణౌ సురగురుదృష్టే కుజభవనే జాయతే శ్రేష్ఠః 7

సూర్యుఁడు అంగారకగృహమందుండి గురునిచేఁ జూడఁబడుచుండఁగా పుట్టిన వాఁడు చాలాధనముకలవాఁడు, దానశీలుఁడు, రాజమంత్రియో, సేనాపతియోగాని, మిక్కిలిశ్రేష్ఠుఁడును అగును.

కుత్సితరామాభర్తా బహుశత్రుః క్షీణబాంధవో దీనః,
భౌమగృహే సితదృష్టే దివాకరే జాయతే కుష్ఠీ. 8

సూర్యుఁడు అంగారకగృహమందుండి శుక్రునిచేఁ జూడఁబడుచుండఁగా పుట్టిన వాఁడు, చెడ్డనడతగలస్త్రీలకు భర్తగను, అనేకశత్రువులు గలవాఁడును, బంధువులులేని వాఁడును, దీనుఁడును, కుష్ఠురోగము కలవాఁడును అగును.

దుఃఖపరిప్లుతదేహః కార్యోన్మాదీ భవేద్విమూఢమతిః,
భౌమర్క్షే దివసకరే రవితనయనిరీక్షితే మూర్ఖః. 9

సూర్యుఁ డంగారకగృహమందుండి శనిచేఁ జూడఁబడుచుండఁగా పుట్టినవాఁడు, అనేకదుఃఖములు పొందువాఁడును, పనులయందు పట్టుదలగలవాఁడును, మూఢబుద్ధిగల వాఁడును, మూర్ఖుఁడును అగును.

వదనాక్షిరోగతప్తః క్లేశసహిష్ణుర్న చాపి బహుశత్రుః,
భక్తో వ్యవహారరతో రతిమాన్వంధ్యాంగనాద్వేషీ. 10
భోజనమాల్యాచ్ఛాదనగంధయుతో గేయవాద్యనృత్తజ్ఞః,
దివసకరే వృషసంస్థే భవతి పుమాన్ సలిలభీరుశ్చ. 11

సూర్యుఁడు వృషభమందు (అనఁగా శుక్రస్థానమందు) ఉండఁగా కలిగినవాఁడు ముఖరోగము, నేత్రరోగముకలవాఁడు, కష్టములనోర్చువాఁడు, అట్టె శత్రువులులేని వాఁడు, భక్తుఁడు, వ్యవహారములయం దాసక్తిగలవాఁడు, రతియందు సమర్థుఁడు, వంధ్యాస్త్రీలను ద్వేషించువాఁడు, భోజనము, పుష్పమాలికలు, వస్త్రములు పరిమళద్రవ్యములు కలవాఁడు, గానము, వాద్యము, నాట్యము తెలిసినవాఁడు, జలమునిన భయముకల వాఁడును అగును.

వేశ్యారతిర్మృదువచాః బహుయువతి సమాశ్రయో భవతి,
దిననాథే సితభవనే దృష్టే శశినా సలిలజీవీ 12

రవి శుక్రక్షేత్రమందుండి చంద్రునిచేఁ జూడఁబడుచుండఁగా పుట్టినవాఁడు వేశ్యలయం దాసక్తి మృదువులగుమాటలు, అనేకమందిస్త్రీలచే ఆశ్రయింపఁబడుట కలవాఁడగును.

శూర స్సంగ్రామరుచి స్తేజస్వీ సాహసా ప్తధనకీర్తిః,
దిననాథే సితభవనే కుజసందృష్టే పుమా న్వికలః 13

రవి శుక్రక్షేత్రస్థుఁడై కుజునిచేఁ జూడఁబడుచుండఁగా కలిగినవాఁడు, శూరుఁడు, యుద్ధములయం దభిరుచికలవాఁడు, తేజోవంతుఁడు, సాహసమువలన పొందఁబడిన ధనము ప్రతిష్ఠగలవాఁడు, వికలమైనవాఁడు అగును.

లిపిలేఖ్యకావ్యపుస్తకగేయాదివిధావతీవ నిపుణమతిః,
దిననాథే సితభవనే బుధసందృష్టే భవేత్సుతనుః. 14

రవి శుక్రక్షేత్రమందుండి బుధునిచేఁ జూడఁబడుచుండఁగా కలిగినవాఁడు, వ్రాయుట, చిత్తరువుల వ్రాయుట, కావ్యములను నిర్మించుట, పాడుట మొదలగుపనుల యందు మిక్కిలి చుఱుకైనబుద్ధికలవాఁడు, చక్కని శరీరముకలవాఁడు అగును.

బహుశత్రుమిత్రపక్షో నృపసచివ శ్చారులోచనః కాంతః,
దిననాథే సితభవనే గురుణా దృష్టే సుతోషితో నృపతిః. 15

రవి శుక్రక్షేత్రమందుండి గురునిచేఁ జూడఁబడుచుండఁగా కలిగినవాఁడు, అనేకమంది శత్రువులు, మిత్రులు గలవాఁడు, రాజమంత్రి, మంచినేత్రములుకలవాఁడు, అందమైనవాఁడు, రాజు, మిక్కిలి సంతోషముకలవాఁడు అగును.

నృపతిర్నృపమంత్రీ వా స్త్రీధనబహుయోగసంయుతో మతిమాన్,
దిననాథే సితభవనే సితసందృష్టే భవే ద్భీరుః. 16

రవి శుక్రక్షేత్రమందుండి శుక్రునిచేఁ జూడఁబడఁగా కలిగినవాఁడు, రాజో, రాజమంత్రియోగాని, అనేకమందిస్త్రీలు, ధనముకలవాఁడు, బుద్ధిమంతుఁడు, భయశీలుఁడు అగును.

నీచోఽలసో దరిద్రో వృద్ధస్త్రీసంగతో విషయశీలః,
దిననాథే సితభవనే శనిదృష్టే వ్యాధిసంతప్తః. 17

రవి శుక్రక్షేత్రమందుండి శనిచేఁ జూడఁబడఁగా పుట్టినవాఁడు, నీచుఁడు, సోమరి, దరిద్రుఁడు. వృద్ధస్త్రీసాంగత్యము కలవాఁడు, విషయములం దాసక్తిగలవాఁడు, వ్యాధులచే బాధింపఁబడువాఁడు అగును

మేధావీ వాఙ్మధురో వాత్సల్యగుణైర్యుతశ్శ్రితాచారః,
విజ్ఞానశాస్త్రకుశలో బహువిత్త ఉదారచేష్టశ్చ 18
నిపుణో జ్యోతిషవేత్తా మధ్యమరూపో ద్విమాతృకస్సుభగః,
మిథునస్థే దినభర్తరి జాతః పురుషో వినీతస్స్యాత్ 19

సూర్యుఁడు మిథునమందు (బుధక్షేత్రము) ఉండఁగా కలిగినవాఁడు మంచి జ్ఞాపకశక్తిగలవాఁడు, తియ్యనిమాటలుగలవాఁడు, దయాదులుకలవాఁడు, మంచి యాచారము కలవాఁడు, పదార్థవిజ్ఞానశాస్త్రమున సమర్థుఁడు, ధనవంతుఁడు, ఉదారములగు పనులు చేయువాఁడు, నేర్పరి, జ్యోతిశ్శాస్త్రము నెఱింగినవాఁడు, ఒకమోస్తరైన అందముకల వాఁడు, ఇద్దరు తల్లులుకలవాఁడు, సుభగుఁడు, వినయవంతుఁడు అగును

రిపుబాంధవకృతపీడా విదేశగమనార్దితో బహువిలాపీ,
బుధభవనే దినభర్తరి దృష్టే చంద్రేణ పురుష స్స్యాత్. 20

రవి బుధక్షేత్రమున చంద్రునిచేఁ జూడఁబడఁగా కలిగినవాఁడు, శత్రువులచేత, బంధువులచేతను చేయఁబడిన బాధలచే పీడితుఁడు, విదేశములకు పోవుటచే బాధితుఁడు, అనేకదుఃఖములు కలవాఁడు అగును.

రిపుభయకలహసమేతో రణాపవాదాది దుఃఖితో దీనః,
బుధరాశౌ దినభర్తరి కుజేక్షితే భవతి సవ్రీడః. 21

సూర్యుఁడు బుధస్థానమందుండి అంగారకునిచేఁ జూడఁబడఁగా కల్గినవాఁడు శత్రుభయము, శత్రువులతో పోరాటము, యుద్ధము నింద మొదలగువానిచే దుఃఖము, దైన్యము, లజ్జ కలవాఁడగును.

భూపతిచరితః ఖ్యాతో బాంధవసహితోఽరిభిశ్చ సంత్యక్తః,
బుధరాశౌ దినభర్తరి బుధదృష్టేఽక్ష్యామయయుతస్స్యాత్ 22

సూర్యుఁడు బుధస్థానమున బుధునుచేఁ జూడఁబడెనేని రాజువంటి నడవడిగలవాఁడు, బంధువులు కలవాఁడు, శత్రువులు లేనివాఁడు, నేత్రరోగము కలవాఁడు అగును.

బహుశాస్త్రదారితముఖో రాజ్ఞాం దూతో విదేశగశ్చండః,
బుధరాశౌ దినభర్తరి గురుణా దృష్టస్సదోన్మాదః. 23

సూర్యుఁడు బుధస్థానమున గురునిచేఁ జూడఁబడఁగా కల్గినవాఁడు అనేకశాస్త్రముల నెఱిఁగినవాఁడు, రాజుల వద్ద దూత, విదేశములకేగువాఁడు, తీక్ష్ణమైన స్వభావము కలవాఁడు, ఎప్పుడూ ఉన్మాదము కలవాఁడు అగును.

ధనదారపుత్రసుఖితో మందస్నేహస్త్వనామయస్సుఖితః,
బుధరాశౌ దినభర్తరి సితసందృష్టే భవేచ్చపలః. 24

రవి బుధస్థానమున శుక్రునిచేఁ జూడఁబడుచుండఁగా పుట్టిన ధనము, భార్య, పుత్త్రులు అనువీరిచే సౌఖ్యము కలవాఁడు, కొంచెముపాటి ప్రేమకలవాఁడు, నీరోగి, సౌఖ్యవంతుఁడు, చంచలమైన బుద్ధికలవాఁడు అగును.

బహుభృత్యోద్విగ్నమనా బహుబంధువిపోషణే సదానిరతః,
బుధరాశౌ దినభర్తరి సౌరేణ నిరీక్షితే కితవః. 25

రవి బుధస్థానమున శనిచే చూడఁబడుచుండగా కలిగిన అనేక సేవకులచే వ్యాకులత పొందువాఁడు, ఎల్లపుడు బంధువుల పోషించువాఁడు, జూదగాఁడు అగును.

కర్మసు చపలః ఖ్యాతో గుణైర్నృపాణాం స్వపక్షవిద్వేషీ.
స్త్రీదుర్భగస్సురూపః కఫపిత్తార్తశ్శ్రమాభిసంతప్తః. 26
మద్యరుచిస్సమధర్మా మానీ పరవాక్యదేశదిగ్వేత్తా,
సూర్యే కుళీరసంస్థే బహుస్థితిః పితృగణద్వేష్టా. 27

రవి కర్కాటకము (చంద్రస్థానము) నందుండఁగా జన్మించినవాఁడు పనులయందు పట్టుదల లేనివాఁడు, రాజగుణములు గలవాఁడు, స్వపక్షీయులను ద్వేషించువాఁడు, స్త్రీలకు నచ్చనివాఁడు,మంచిరూపముకలవాఁడు, కఫము పైత్యము వీనిచే బాధనొందెడివాఁడు, ఎక్కువశ్రమపడెడువాఁడు, మద్యమం దాసక్తి గలవాఁడు, అందరియందు ఒక్కే ప్రతిపత్తిగలవాఁడు,మానవంతుఁడు,మంచిమాటలు,దేశముల దిక్కులజ్ఞానము కలవాఁడు, మంచిస్థితిగలవాఁడు, పితృగణమును ద్వేషించువాఁడు అగును.

రాజా రాజసమోవా జలపణ్యాధనస్థిరః క్రూరః,
కర్కాటకే తీవ్రకరే దృష్టే శశినా భవేత్పురుషః. 28

రవి కర్కాటకమునందుండి చంద్రునిచేఁ జూడఁబడఁగా జన్మించిన రాజో, రాజతుల్యుఁడో గాని, నీటివ్యాపారముచే స్థిరమగు ధనము గలవాఁడు, క్రూరుఁడు అగును.

శోషభగంధరరోగైస్సంతప్తో బంధుభిస్సహా విరక్తః,
కర్కాటకే దిననాథే భౌమేన నిరీక్షితే పిశునః. 29

రవి కర్కాటకముననుండి చంద్రునిచే జూడఁబడఁగా జన్మించిన శోష,భగంధర రోగములచే బాధనొందెడువాఁడు, బంధువులచే వదలిపెట్టఁబడినవాఁడు, లోభియు నగును.

విద్యామానయశోభిః ఖ్యాతో నృపవల్లభో భవేన్నిపుణః,
సూర్యే కుళీరరాశౌ బుధేన దృష్టే విగతశత్రుః. 30

సూర్యుఁడు చంద్రస్థానమునుండి బుధునిచే జూడఁబడఁగా జననమందినయతఁడు చదువు అభిమానము కీర్తి వీనిచే ప్రసిద్ధుఁడు, రాజులప్రేమకలవాఁడు, నేర్పరి, శత్రువులులేనివాఁడు అగును.

శ్రేష్ఠో రాజ్ఞో మంత్రీ సేనానాథోఽథ సంప్రసిద్ధశ్చ,
సూర్యే శశిభవనస్థే గురుణా దృష్టే బలాభ్యధికః 31

సూర్యుఁడు చంద్రక్షేత్రమున నుండి బృహస్పతిచే చూడఁబడినప్పుడు కల్గినవాఁడు శ్రేష్ఠుఁడు. రాజమంత్రి సేనాపతి ప్రసిద్ధికలవాఁడు చాలాబలముకలవాఁడు అగును.

స్త్రీసేవీ యువతిధనః పరకార్యకరో రణే ప్రచండశ్చ,
కర్కటసంస్థే సూర్యే శుక్రేణ నిరీక్షితే ప్రియాలాపః 32

రవి కర్కాటకముననుండి శుక్రునిచే నిరీక్షితుఁడైనప్పుడు జన్మించిన స్త్రీలచే సేవింపఁబడువాఁడు, స్త్రీధనము కలవాఁడు, పరకార్యముల నెఱవేర్చువాఁడు, యుద్ధమున నతిశూరుఁడు, ప్రియమగుమాటలు కలవాఁడు అగును.

కఫమారుతరోగార్తః పరస్వహారీ విలోమ మతిచేష్టః,
కర్కటసంస్థే భానౌ స్వపుత్రదృష్టే పుమాన్ పిశునః. 33

రవి కర్కాటకముననుండి శనిచేజూడఁబడఁగా జన్మించినవాఁడు కఫవాతరోగములచే బాధితుఁడు, ఇతరులసొత్తుహరించువాఁడు, తక్కువబుద్ధి, తక్కువపనులుచేయువాఁడు, లోభియు నగును.

రిపుహంతా క్రోధపరో విశిష్టచేష్టో వనాద్రిదుర్గచరః,
ఉత్సాహీ సచ్ఛూరస్తేజస్వీ మానభక్షణో రౌద్రః 34
గంభీరస్థిరసత్వో బధిరః క్షితిపాలకో ధనసమృద్ధః,
సింహస్థే దివసకరే ఖ్యాతః పురుషో భవేజ్జాతః. 35

సూర్యుఁడు సింహమున (సూర్యస్థానము) నుండఁగా పుట్టినవాఁడు, శత్రువుల నాశము చేయువాఁడు, క్రోధముకలవాఁడు, విలక్షణమైనపనులుచేయువాఁడు, అడవుల

కొండల దుర్గముల చరించువాఁడు, ఉత్సాహవంతుఁడు, మంచిశూరుఁడు, తేజశ్శాలి, అభిమానవంతుఁడు, రౌద్రముకలవాఁడు, గాంభీర్యవంతుఁడు, నిలకడయైనబుద్ధికలవాఁడు, చెవిటివాఁడు, భూమినిపాలించువాఁడు, ధనసమృద్ధికలవాఁడు, ప్రసిద్ధికలవాఁడు అగును.

మేధావీ సుకళత్రః కఫార్దితో భూపవల్లభో మనుజః,
ఆదిత్యే సింహస్థే చంద్రేణ నిరీక్షితే భవతి. 36

రవి సింహముననుండి చంద్రునిచేఁ జూడఁబడఁగా కలిగినవాఁడు, మేధావంతుఁడు, మంచిభార్యకలవాఁడు, కఫరోగి, రాజులప్రేమకు పాత్రుఁడు అగును.

పరదారరతశ్శూరస్సాహసకారీ కృతోద్యమో రౌద్రః,
దివసకరే సింహస్థే కుజేన దృష్టే ప్రధానశ్చ. 37

రవి సింహమందుండి అంగారకునిచేఁ జూడఁబడఁగా కల్గినవాఁడు, పరభార్యాసక్తుఁడు, శూరుఁడు, సాహసముతో పనులుచేయువాఁడు, పట్టుదల గలవాఁడు, రౌద్రవంతుఁడు, ప్రధానుఁడు అగును.

విద్వాన్ లిపిలేఖ్యకరః కితవాసేవీ పరిభ్రమతి హీనః,
సింహస్థే దివసకరే బుధేన దృష్టేన బహుసత్వః. 38

రవి స్వక్షేత్రముననుండి బుధునిచేఁ జూడబఁబడగా జననమైన విద్వాంసుఁడు, వ్రాయుంట, చిత్రలేఖనముకలవాఁడు, జూదమాడువాఁడు, హీనుఁడు, బహుబలవంతుఁడు నగును.

దేవారామతటాకాన్ కరోతి సత్వాధికో విజనశీలః,
సింహే సహస్రరశ్మౌ సురగురుదృష్టే మహాబుద్ధిః. 39

రవి సింహమందుండి బృహస్పతిచేఁ జూడఁబడఁగా కలిగిన దేవాలయముల వనముల తటాకముల ప్రతిష్ఠించువాఁడు, అధికమగు జ్ఞానముకలవాఁడు, ఏకాంతముననుండువాఁడు, బుద్ధిమంతుఁడు నగును.

దుర్నామకుష్ఠరోగైరభిభూతో నిర్దయో విగతలజ్జః,
సింహే తిమిరవినాశే శుక్రేణ నిరీక్షితే జాతః. 40

రవి సింహమున నుండి శుక్రునిచేఁ జూడఁబడఁగా జన్మించినవాఁడు దుర్నామ-కుష్ఠరోగములచే బాధింపఁబడువాఁడు, దయలేనివాఁడు, సిగ్గులేనివాఁడు నగును.

కార్యవినాశనదక్షష్షండో జాతః పరోపతాపకరః,
సింహస్థే దివసకరే స్వపుత్రదృష్టే పుమాన్ భవతి. 41

రవి సింహమున నుండి శనిచేఁ జూడఁబడఁగా జననమందినపురుషుఁడు ఇతరుల పనుల చెడఁగొట్టువాఁడు, నపుంసకుఁడు, ఇతరులకు బాధకల్గించువాఁడు నగును.

స్త్రీతుల్యతనుర్హ్రీమాన్ లిపివేత్తా దుర్బలశ్చ వల్గుకథః,
మేధావీ బహుసత్వో విద్వాన్ శుశ్రూషకస్సురగురూణాం. 42
సంవాహనాదికర్మసు దక్షః శ్రుతిగేయవాద్యపరితుష్టః,
కన్యాయాం దివసకరే జాతో మృదు దీనవాక్యశ్చ 43

రవి కన్య (బుధస్థానము) యందుండఁగా జన్మించినవాఁడు స్త్రీలశరీరమువంటి మృదువైనశరీరముకలవాఁడు, లజ్జకలవాఁడు, వ్రాయుట తెలిసినవాఁడు, దుర్బలుఁడు, మనోహరమగు నడవడికలవాఁడు, మేధావంతుఁడు, మిక్కిలిజ్ఞానముకలవాఁడు, విద్వాంసుఁడు, దేవతలను గురువులను సేవించువాఁడు, ఒడలుపట్టుట మొదలగువానియందు నేర్పరి, శ్రుతిగేయము వాద్యము వీనియం దాసక్తిగలవాఁడు, మృదువులు దీనములు ఐనమాటలు గలవాఁడు నగును.

సంగక్షయవ్యయార్తో విదేశమార్గాదిలంపటోద్విష్టః,
నీచోపహతప్రీతి ర్హిరణ్యలోహాదిపణ్యాజీవీ చ. 44
ద్వేష్యః పరకర్మరతః పరదారరతిః పుమాన్మలినః,
సూర్యే తులాధరస్థే నృపపరిభూతః ప్రగల్భశ్చ 45

సూర్యుఁడు తుల (శుక్రస్థానము) యందుండఁగా జననంబైన కలిసియుండుట లేకపోవుటచేత ధనవ్యయముచేత బాధింపఁబడినవాఁడు, విదేశమార్గములం దాసక్తుఁడు, ద్వేషింపఁబడినవాఁడు, నీచులచే నశింపఁజేయఁబడినప్రీతిగలవాఁడు, బంగారు మొదలగు లోహవ్యాపారముచే జీవించువాఁడు, ఇతరులపనులయం దాసక్తిగలవాఁడు, పరభార్యాసక్తుఁడు, నీచుఁడు, రాజావమానము పొందువాఁడు, ప్రగల్భవంతుఁడు నగును.

అనివారితరణవేగశ్చ్యుతిధర్మరతో నసత్యవాఙ్మూర్ఖః,
ప్రవినష్టదుష్టయువతిః క్రూరః కుస్త్రీవిధేయశ్చ. 46
క్రోధపరోఽసద్వృత్తో లోభిష్ఠః కలహావల్లభోఽనృతవాక్,
శస్త్రాగ్నివిషగ్రస్తః పితుర్జనన్యాశ్చ దుర్భగః కీటే. 47

సూర్యుఁడు వృశ్చికము (కుజస్థానము) నందుండఁగా జన్మించిన యుద్ధమున అడ్డులేని పరాక్రమము, వేదమార్గములయాసక్తి, అబద్ధపుమాటలు, మూర్ఖత, దుష్టస్త్రీలను నశింపఁజేయుట, క్రూరత, చెడ్డస్త్రీలయందాసక్తి, ఎక్కువకోపము, చెడ్డనడవడి, లోభము కలహములం దాసక్తి, బాణములు, అగ్ని, విషము వీనిచే బాధింపఁబడుట, తలిదండ్రులకు శత్రు వగుట కలవాఁడగును.

ద్రవ్యాన్వితో నృపేష్టో జాతః ప్రాజ్ఞ స్సురద్విజానురతః,
శస్త్రాస్త్రహస్తిశిక్షానిపుణో వ్యవహారయోగ్యశ్చ. 48
పూజ్యస్సతాం ప్రశాంతో ధనవాన్విస్తీర్ణపీనచారుతనుః,
బంధూనాం హితకారీ సత్వయుతః కార్ముకే సూర్యే 49

సూర్యుఁడు ధనుస్సు (బృహస్పతిక్షేత్రము) నందుండఁగా పుట్టినవాఁడు ధనవంతుఁడు, రాజునకిష్టమైనవాఁడు, ప్రాజ్ఞుఁడు. దేవబ్రాహ్మణభక్తిగలవాఁడు, శస్త్రాస్త్రముల హస్తిశిక్షయందు నేర్పుగలవాఁడు, వ్యవహారయోగ్యుఁడు, సత్పురుషులచేఁ బూజితుఁడు, శాంతుఁడు, విశాలమైన బలిసినదేహముకలవాఁడు, బంధువులకు మేలుచేయువాఁడు, బుద్ధిమంతుఁడు నగును.

వాగ్బుద్ధివిభవపుత్త్రైస్సమన్వితో నృపసమో విగతశోకః,
వాక్పతిరాశౌ తపనే దృష్టే చంద్రేణ కుశరీరః. 50

సూర్యుఁడు బృహస్పతిస్థానమందుండి చంద్రునిచేఁ జూడఁబడుచుండగాఁ గలిగిన మాటలనేర్పు, బుద్ధిసంపద, పుత్త్రులుకలవాఁడు, రాజతుల్యుఁడు, దుఃఖములేనివాఁడు, చెడ్డశరీరముకలవాఁడు నగును

సంగ్రామే లబ్ధయశాస్స్ఫుటవచనో విత్తసౌఖ్యసంపన్నః,
సూర్యే వాక్పతిరాశౌ భౌమేన నిరీక్షితే చండః. 51

రవి బృహస్పతిక్షేత్రమున నుండి కుజునిచేఁ జూడఁబడినప్పుడు కలిగిన యుద్ధమందు కీర్తిపొందినవాఁడు, స్ఫుటమైన మాటలుగలవాఁడు, ధనము సౌఖ్యముగలవాఁడు, తీక్ష్ణమైనవాఁడు నగును.

మధురవచనో లిపిజ్ఞః కావ్యకలాగోష్ఠియానధాతుజ్ఞః,
గురుభే సవితరి దృష్టే బుధేన జనసమ్మతో భవతి. 52

రవి గురుక్షేత్రమున నుండి బుధునిచేఁ జూడఁబడుచుండగా పుట్టినవాఁడు వ్రాయుట తెలిసినవాఁడు, మంచిమాటలుగలవాఁడు, కావ్యగోష్ఠుల కళాగోష్ఠులనేర్పరి, ప్రయాణముధాతుగమనము తెలిసినవాఁడు అగును.

విచరతి నరేంద్రభవనే నృపతిర్వా వారణాశ్వధనయుక్తః,
సురగురుగృహే వివస్వతి గురుణా దృష్టే సదావిద్వాన్. 53

రవి గురుక్షేత్రమందుండి గురునిచేఁ జూడఁబడినపుడు జననంబైన రాజగృహముల సంచరించువాఁడో రాజో ఏనుగులు గుఱ్ఱములు ధనము కలవాఁడు విద్వాంసుఁడు నగును.

దివ్యస్త్రీభోగయుతస్సుగంధమాల్యాదిభిస్సహితః,
సురగురుభవనే భానౌ శుక్రేణ నిరీక్షితే శాంతః 54

రవి గురుక్షేత్రమందుండి శుక్రునిచేఁ జూడఁబడుచుండగాఁ బుట్టినవాఁడు దివ్యస్త్రీసంభోగముకలవాఁడు పరిమళయుక్తమాల్యాదులు కలవాఁడు శాంతుఁడు నగును.

అశుచిః పరాన్నకాంక్షీ నీచానురతశ్చతుష్పదక్రీడః,
దేవేజ్యగృహే సూర్యే మందేన నిరీక్షితే భవతి 55

రవి గురుక్షేత్రమున శనిచేఁ జూడఁబడుచుండగా జన్మించిన అపరిశుభ్రమైన వాఁడు, పరులయన్నముకోరువాఁడు, నీచులననుసరించువాఁడు, పశువులతోక్రీడించు వాఁడు నగును.

లుబ్ధః కుస్త్రీసక్తః కుకర్మసంవర్ధితస్సతృష్ణశ్చ,
బహుకార్యరతో భీరుర్విహీనబంధుశ్చలప్రకృతిః 56
అటనప్రియోఽల్పసత్వస్స్వపక్షవిక్షోభనాశితసమస్తః,
మకరస్థే దివసకరే జాతో బహుభక్షకః పురుషః 57

రవి మకరమందుండగా కలిగిన లుబ్ధుఁడు, చెడ్డస్త్రీలయం దాసక్తిగలవాఁడు, చెడ్డపనుల నభివృద్ధిచేయువాఁడు, ఆశకలవాఁడు, అనేక కార్యములయం దాసక్తిగల వాఁడు, భయశీలుఁడు, బంధువులులేనివాఁడు, చంచలస్వభావముగలవాఁడు, తిరుగుట యందు కోరికగలవాఁడు, కొలదిపాటిబలముకలవాఁడు, తనపక్షమందలి కలకచేత నంతయూ, నాశముచేయువాఁడు, బహుభోజియు నగును.

మాయాపటుశ్చలమతి స్త్రీసంగాన్నష్టధనసౌఖ్యః,
మందగృహే తీవ్రకరే చంద్రేన నిరీక్షితే భవతి. 53

రవి శనిస్థానమున నుండి చంద్రునిచేఁ జూడఁబడగా జన్మించిన మాయల సమర్థుఁడు చంచలబుద్ధిగలవాఁడు, స్త్రీసాంగత్యమువలన నశించిన ధనసౌఖ్యములుకల వాఁడు నగును.

వ్యాధిభిరరిభిర్గ్రస్తః పరకలహాచ్ఛస్త్రవిక్షతశరీరః,
మందగృహే తిమిరరిపౌ భౌమేన నిరీక్షితే భవతి. 59

రవి శనిస్థానముననుండి కుజునిచేఁ జూడఁబడగా కలిగిన రోగములచేత శత్రువుల చేత పీడింపఁబడువాఁడు, ఇతరులకలహమువలన ఆయుధము గాయముల పొందినవాఁడు నగును.

శూరష్షండప్రకృతిః పరస్వహారీ నసారసర్వాంగః,
నలినీదయితే శనిభే బుధేన సంవీక్షితే భవతి 60

రవి శనిక్షేత్రమున బుధునిచేఁ జూడఁబడగాఁ బుట్టిన శూరుఁడు, నపుంసకుఁడు, పరధనముల నపహరించువాఁడు, బలములేని సర్వావయవములు కలవాఁడు నగును

శోభనకర్మా మతిమాన్సర్వేషామాశ్రయో విపులకీర్తిః,
కోణగృహే దినభర్తరి గురుణా దృష్టే మనస్వీ చ 61

రవి శనిక్షేత్రమందుండి గురునిచేఁ జూడఁబడుచుండగా జన్మించినవాఁడు శుభ కర్మలచేయువాఁడు, బుద్ధిమంతుఁడు, అందరిచే నాశ్రయింపఁదగినవాఁడు, కీర్తిమంతుఁడు మానవంతుఁడు నగును.

శంఖప్రవాళమణిభిర్జీవతి వేశ్యాంగనాధనసమృద్ధః,
కోణభవనే దినేశే భృగుణా దృష్టే సుఖీ జాతః. 62

రవి శనిక్షేత్రమున శుక్రునిచేఁ జూడఁబడగా కలిగిన శంఖములు పవడములు రత్నములు వీనిచే జీవించువాఁడు వేశ్యాంగనలు ధనముకలవాఁడు సుఖవంతుఁడు నగును.

ధ్వంసయతి శత్రుపక్షం నరేంద్రసన్మానవర్ధితాశ్వాసః,
భానౌ శనైశ్చరగృహే శనిదృష్టే సూయతే యోఽసౌ 63

రవి శనిక్షేత్రమున నుండి శనిచేఁ జూడఁబడెనేని యపు డుత్పన్నమైనవాఁడు శత్రువినాశకరుఁడు, రాజసన్మానము కలవాఁడు నగును.

హృద్రోగీ బహుసత్త్వస్సతాం విగర్హ్యోఽతిరోషశ్చ,
పరదారాణాం సుభగః కర్మస్వతి నిశ్చితో భవతి 64
దుఃఖప్రాయోఽల్పధనశ్శఠశ్చలితసౌహృదో మలినమూర్తిః,
కుంభధరేఽర్కే జాతః పిశునస్స్యాద్దుష్ప్రలాపశ్చ. 65

సూర్యుఁడు కుంభమందుండగాఁ బుట్టినవాఁడు గుండెరోగముగలవాఁడు, బలవంతుఁడు, సత్పురుషులచే నిందింపఁబడువాఁడు, మిక్కిలిరోషముగలవాఁడు, ఇతరుల భార్యల కాశఁబుట్టించువాఁడు, పనులయందు నిశ్చయజ్ఞానముగలవాఁడు, దుఃఖవంతుఁడు, స్వల్పధనుఁడు, శఠుఁడు, నిలకడలేని స్నేహముకలవాఁడు, నల్లని దేహము కలవాఁడు, లోభి, నోటికివచ్చినట్లు ప్రేలువాఁడును నగును.

సుహృదాం సంగ్రహశీలస్త్రీప్రీత్యా లబ్ధసౌఖ్యసంభారః,
ప్రాజ్ఞో బహుశత్రుఘ్నః తోయోదయో భవతి ధనకీర్త్యా 66

సత్సుతభృత్యాప్తయశా జలపణ్యాధనస్సువాగనృతవాదీ,
ఊర్జితగుహ్యారుగార్తో బహుఃసహాజో మీనసంస్థేఽర్కే. 67

సూర్యుఁడు మీనమందుండఁగా జన్మనందినవాఁడు స్నేహితుల నేర్పరుచుకొను స్వభావముకలవాఁడు, స్త్రీప్రీతిచే పొందఁబడిన సౌఖ్యముకలవాఁడు, ప్రాజ్ఞుఁడు, అనేక శత్రువుల నాశము చేసినవాఁడు, ధనమువలన ప్రతిష్ఠలేనివాఁడు, మంచిపుత్త్రులు సేవకులు వీరిచే కీర్తినిపొందువాఁడును, నీటిమీఁద వ్యాపారముచే ధనమునుపొందువాఁడు, ప్రియ మగుమాటలచెప్పువాఁడు, అనృతవాది, తెచ్చుకొనిన సుఖరోగములచే బాధితుఁడు మిక్కిలి జనసమాజములు కలవాఁడు నగును.

ఇతి ద్వావింశోఽధ్యాయః.

---

## చంద్రచారమును దెలుపు ఇరువదిమూఁడవ యధ్యాయము.

సౌవర్ణాంగస్స్థిరస్వస్సుహజవిరహితస్సాహసీ మానభద్రః
కామార్తః క్షామజానుః కునఖతనుకచశ్చంచలోమానవిత్తః,
పద్మాభైః పాణిపాదైర్వితతసుతజనో వర్తులాకారనేత్ర
స్సస్నేహస్తోయభీరుర్వ్రణవికృతశిరాస్త్రీజితో మేష ఇందౌ. 1

జననకాలమున చంద్రుఁడు మేషమందున్న బంగారువన్నెఁబోలిన మంచిదేహము కలవాఁడు స్థిరమైనధనము కలవాఁడు సోదరులులేనివాఁడు సాహసవంతుఁడు మానవంతుఁడు కామముచే పీడింపఁబడినవాఁడు సన్నని పిక్కలుగలవాఁడు పిప్పిగోళ్లు ఓన్న చంకలు గలవాఁడు చంచలమైనవాఁడు పద్మములవలె నెఱ్ఱని పాదములు హస్తములు గల పుత్త్రులు గలవాఁడు గుండ్రని నేత్రములు కలవాఁడు ప్రీతిగలవాఁడు నీటిభయము గల వాఁడు వ్రణములచే వికారమైనదేహము కలవాఁడు స్త్రీలచే జయింపఁబడువాఁడు నగును.

అత్యుగ్రతరో నృపతిః ప్రణతానాం మార్దవం భజతి జాతః,
ధీరస్సంగ్రామరుచీ రవిణా దృష్టే శశిని మేషే. 2

చంద్రుఁడు మేషమందుండి రవిచేఁ జూడఁబడఁగా కల్గినవాఁడు మిక్కిలి ఉగ్రమైనస్వభావము కలవాఁడు రాజు వంగినవారియెడ దయగలవాఁడు ధీరుఁడు యుద్ధమందాసక్తిగలవాఁడు నగును.

దంతార్తిరోగతప్తశ్శిఖివాతాదిక్షతశరీరః,
మాండలికస్స్యాన్మేషే కుజదృష్టే శశిని భూతార్తః. 3

చంద్రుఁడు మేషమందుండి కుజునిచేఁ జూడఁబడుచుండఁగా జననంబైనవాఁడు దంతరోగము, నేత్రరోగముగలవాఁడు, అగ్న్యుపద్రవముచేత వాయూపద్రవముచేతను గాయముల నొందినదేహము కలవాఁడు, మండలాధిపతి, భూతములచే పీడింపఁబడువాఁడు నగును.

నానావిద్యాచార్య స్సద్వాక్య స్స్యా న్మనోభీష్టః,
బుధదృష్టే మేషస్థే నిశాకరే సత్కవి ర్విపులకీర్తిః 4

జననకాలమున చంద్రుఁడు మేషమున నుండి బుధునిచేఁ జూడఁబడెనేని అనేక విద్యలయం దాచార్యుఁడు, మంచిమాటలుగలవాఁడు, గొప్పకోరికలు గలవాఁడు, మంచి కవి, విశాలమైన కీర్తిగలవాఁడు నగును.

బహుభృత్యధనసమృద్ధో నృపతేస్సచివశ్చమూపతిర్వాఽపి,
మేషగృహే హిమరశ్మౌ దృష్టే గురుణా పుమాన్ జాతః. 5

చంద్రుఁడు మేషమందుండి గురునిచేఁ జూడఁబడఁగా జననంబైన అనేకసేవకులు ధనసమృద్ధిగలవాఁడు, రాజమంత్రియో సేనాపతియోగాని యగును

సుభగస్సుతధనయుక్తో వరయువతివిభూషణోఽల్పభోక్తా చ,
మేషే శిశిరమయూఖే భృగుతనయనిరీక్షితే భవతి 6

చంద్రుఁడు మేషమందుండి శుక్రునిచేఁ జూడఁబడఁగాఁ బుట్టిన అందకాఁడు, పుత్రధనము కలవాఁడు, మంచిస్త్రీలు మంచిఅలంకరణములు గలవాఁడు, స్వల్పభోజియు నగును.

విద్విష్టో బహుదుఃఖో దారిద్ర్యతనుర్మలీమసోఽనృతవాక్,
మేషే శిశిరమయూఖే రవితనయనిరీక్షితే భవతి. 7

చంద్రుఁడు మేషమున నుండి శనిచేఁ జూడఁబడెనేని ద్వేషింపఁబడినవాఁడు, అనేకదుఃఖములు కలవాఁడు, దారిద్ర్యముచేఁ గృశించినవాఁడు, మలినుఁడు, అబద్ధముల పల్కువాఁడు నగును.

వ్యూఢోరస్కోఽతిదాతా ఘనకుటిలకచః కాముకః కీర్తిశాలీ
కాంతః కన్యాప్రజావాన్ వృషసమనయనో హంసలీలాప్రచారః,
మధ్యాంతే భోగభాగీ పృథుకటిచరణస్కంధజాన్వాస్యజంఘ
స్సాంకః పార్శ్వాస్యపృష్ఠే కకుది శుభగతిః క్షాంతియుక్తో గవీందౌ.

జననకాలమున చంద్రుఁడు వృషభమందుండెనేని వెడల్పైన ఱొమ్ముగలవాఁడు, మిక్కిలి దానశీలుఁడు, దట్టములై వంకరగల వెండ్రుకలు గలవాఁడు, కాముకుఁడు,

కీర్తిశాలి, అందకాఁడు, స్త్రీసంతతిగలవాఁడు, వృషభనేత్రములవంటి నేత్రములు గల వాఁడు, హంసవలె విలాసముగా నడచువాఁడు, మధ్యకాలమున అంత్యకాలమున భోగ ముల ననుభవించువాఁడు విశాలములగు కటిప్రదేశము పాదములు మూపు మోఁకాళ్లు ముఖము పిక్కలు గలవాఁడు, పార్శ్వముల వీపున మూపున పుట్టుమచ్చలు గలవాఁడు, ఓర్పుగలవాఁడు నగును.

కర్షకమతికర్మకరం ద్విపదచతుష్పదైస్సమృద్ధం చ,
ప్రాయోగికం ప్రకురుతే వృషభే రవివీక్షితశ్చంద్రః. 9

చంద్రుఁడు వృషభమున నుండి రవిచేఁ జూడఁబడెనేని వ్యవసాయము చేయుం వాఁడు, మిక్కిలి పనిచేయుంవాఁడు, పశుమనుష్యసమృద్ధిగలవాఁడు, ప్రయోగవిజ్ఞాతయుం నగును

అతికామం కుజదృష్టో యువతికృతే నష్టసారమిత్రజనం,
హృదయహరం నారీణాం మాతుర్నశుభం శశీవృషే కురుతే. 10

చంద్రుఁడు వృషభమున కుజునిచేఁ జూడఁబడినపుడు కలిగిన మిక్కిలి కాము కుఁడు, స్త్రీకొఱకై నశించిన బలవన్మిత్రులు కలవాఁడు, స్త్రీమనోహరుఁడు, తల్లి కశుభము చేయుంవాఁడు కాగలఁడు

ప్రాజ్ఞం వాక్యవిధిజ్ఞం ప్రముదితమిష్టం సమస్తభూతానాం,
జనయతి బుధేన దృష్టశ్శశీ వృషేఽనుపమగుణైర్యుక్తమ్ 11

చంద్రుఁడు వృషభమున నుండి బుధునిచేఁ జూడఁబడగాఁ బుట్టినవాఁడు ప్రాజ్ఞుఁడు, మాట్లాడనేర్చినవాఁడు, సంతోషముకలవాఁడు, సమస్తభూతములకు నిష్టుఁడు, సాటిలేనిగుణములు కలవాఁడు నగును.

స్థిరపుత్రదారసుహృదం మాతాపితృభక్తిమంతమతినిపుణం,
ధార్మిక మతివిఖ్యాతం గవిగురుదృష్టశ్శశీ కురుతే. 12

వృషభమున చంద్రుఁడుండి గురునిచే చూడఁబడుచుండగా కలిగిన చాలకాల ముండుపుత్రులు భార్య స్నేహితులు గలవాఁడు, తల్లితండ్రులయెడ భక్తికలవాఁడు, మిక్కిలి నేర్పరి, ధర్మపరుఁడు, మిక్కిలి ప్రసిద్ధిగలవాఁడు నగును.

భూషణయానగృహాణాం శయనాసనగంధవస్త్రమాల్యానాం,
భాగిన ముపభోక్తారం సితేక్షితో యది శశీ కురుతే. 13

వృషభమున నున్న చంద్రుఁడు శుక్రునిచే జూడఁబడగా కలిగినవాఁడు అలంకారములు వాహనములు గృహములు మంచిమంచిఆసనములు శయనములు గంధము వస్త్రములు మాలికలు అను వీనినార్జించువాఁడు, ననుభవించువాఁడు నగును.

ధనహీనమనిష్టకరం వృషభే ద్వేష్యం సదా చ యువతీనాం,
సుతమిత్రబంధుసహితం రవిసుతదృష్టశ్శశీ కురుతే 14

చంద్రుఁడు వృషభముననుండి శనిచే జూడఁబడగాఁ బుట్టిన దరిద్రుఁడు, అనిష్టములగు పనులఁజేయువాఁడు, ఎల్లపుడు స్త్రీల కయిష్టుఁడు, బంధుమిత్రపుత్త్రాదులతోఁ గూడినవాఁడు నగును.

పూర్వార్ధే సంభూతో జననీమృత్యుం కరోతి నచిరేణ,
పశ్చాదర్ధే వృషభే పితుర్వియోగం శశీ కురుతే. 15

జననకాలమున చంద్రుఁడు వృషభపూర్వార్ధమందుండిన తల్లి శీఘ్రముగ మృతినొందును. ఉత్తరార్ధమందుండెనేని శీఘ్రముగ తండ్రి మృతినొందును అనఁగా కృత్తికానక్షత్ర ౨-౩-౪ చరణములు రోహిణిప్రథమచరణము ద్వితీయచరణములో సగము కలసి పూర్వార్ధము. శేషము ఉత్తరార్ధము.

ఉన్నాసశ్శ్యామచక్షుస్సురతవిధికలాకావ్యకృద్భోగభాగీ
హస్తే మత్స్యాధిపాంకో విషయసుఖరతో బుద్బుదాక్షుస్సిరాలః,
కాంతస్సౌభాగ్యహాస్యప్రియవచనయుతస్త్రీజితో వ్యాయతాంగో
యాతి క్లీబైశ్చ సఖ్యం శశిని మిథునగే మాతృయుగ్మప్రపుష్టః. 16

చంద్రుఁడు మిథునమున నుండగా కలిగినవాఁడు ఎత్తైనముక్కు నల్లనినేత్రములు కలవాఁడు, సురతవిధి కళలను కావ్యములను రచించువాఁడు, భోగవంతుఁడు, హస్తమున మత్స్యరేఖ గలవాఁడు, విషయసుఖములం దాసక్తిగలవాఁడు, బుడఁగలవంటి కండ్లు గలవాఁడు, నరములు వంటినిండా కన్పించువాఁడు, అందకాఁడు, శోభనములై హాస్యప్రాయములై ప్రియములైన మాటలనాడువాఁడు, స్త్రీజితుఁడు, విశాలావయవములు కలవాఁడు, నపుంసకులతోఁ జెలిమిచేయువాఁడు, ఇద్దరుతల్లులచేఁ బోషింపఁబడువాఁడు నగును.

ప్రజ్ఞాధనం ప్రకాశం మిథునే రూపాన్వితం సుధర్మిష్ఠం,
అతిదుఃఖిత మల్పార్థం కరోతి సూర్యేక్షితశ్చంద్రః. 17

మిథునమున నున్నచంద్రుఁడు రవిచే జూడఁబడగా సంభవించినప్రజ్ఞావంతుఁడు, ప్రసిద్ధుఁడు, రూపవంతుఁడు, మిక్కిలి ధర్మపరుఁడు, మిక్కిలి దుఃఖవంతుఁడు, స్వల్పధనుఁడు నగును.

అతిశూర మతిప్రాజ్ఞం సుఖవాహనవిభవరూపసంపన్నం,
కురుతే మిథునే చంద్రో వక్రేణ నిరీక్షితోఽవశ్యమ్ 18

మిథునచంద్రుఁడు కుజునిచేఁ జూడఁబడఁగా కలిగిన మిక్కిలి శూరుఁడు, ప్రాజ్ఞుఁడు, సుఖము వాహనములు విభవము మంచిరూపుగలవాఁడు నగును.

అర్థోత్పాదనకుశలం కురుతే హ్యపరాజితం సుధీరం చ,
పార్థివ మఖండితాజ్ఞం మిథునే బుధవీక్షితశ్చంద్రః 19

చంద్రుఁడు మిథునముననుండి బుధునిచేఁ జూడఁబడఁగా కలిగిన ద్రవ్యార్జనమున నేర్పరి, జయింప వీలుకానివాఁడు, ధైర్యవంతుఁడు, రాజు, తిరుగులేని ఆజ్ఞకలవాఁడు నగును

విద్యాశాస్త్రాచార్యం విఖ్యాతం సత్యవాచ మతిరూపం,
మాన్యం వాగ్మిన మిందుః కరోతి గురువీక్షితో మిథునే 20

చంద్రుఁడు మిథునమున నుండి గురునిచేఁ జూడఁబడినపుడు జననంబైన విద్యలను శాస్త్రములను బోధించువాఁడు, ప్రసిద్ధుఁడు, సత్యవాది. రూపవంతుఁడు, పూజనీయుఁడు, వక్తయుం నగును

వరయువతిమాల్యవస్త్రైర్వరవాహనయానభూషణైర్మణిభిః,
క్రీడాం కురుతే పురుషో భృగుదృష్టే శశిని మిథునస్థే. 21

చంద్రుఁడు మిథునమున నుండి శుక్రునిచేఁ జూడఁబడినపుడు కలిగిన అందకత్తెలగు స్త్రీలు మాలికలు వస్త్రములు వాహనములు భూషణములు రత్నములు అనువీనిచే క్రీడించువాఁడగును.

కురుతే బాంధవరహితం యువతిసుఖవిభూతివర్జితం చాపి,
అధనం లోకద్వేష్యం జితుభే శనినేక్షితశ్చంద్రః 22

మిథునమున నున్నశశి శనిచేఁ జూడఁబడగా కలిగిన బంధువులులేనివాఁడు, స్త్రీ సుఖము సంపద ధనములేనివాఁడు, లోకద్వేష్యుఁడు నగును.

యుక్తస్సౌభాగ్యయోగైర్గృహసుహృదటనజ్యోతిషజ్ఞానశీలైః
కామాసక్తః కృతజ్ఞః క్షితిపతిసచివస్సత్ప్రమాణః ప్రవాసీ,
సోన్మాదః కేశకల్పో జనకుసుమరుచిర్హానివృద్ధ్యానుయాతః
ప్రాసాదోద్యానవాపీప్రియకరణరతః పీనకంఠః కుళీరే. 23

కర్కాటకమున చంద్రుఁడుండగా జన్మించిన సౌభాగ్యము గృహములు స్నేహితులు తిరుగుట జ్యోతిశ్శాస్త్రజ్ఞానము గలవాఁడు, అతికాముకుఁడు, కృతజ్ఞుఁడు, రాజమంత్రి, ప్రామాణికుఁడు, ఇతరదేశముల వసించువాఁడు, పిచ్చివాఁడు, కేశతుల్యుఁడు, జనులయందు పుష్పములయందు నాదరముగలవాఁడు, హానివృద్ధులుగలవాఁడు మేడల నుద్యానవనముల వసించువాఁడు, మేలుచేయువాఁడు, లావైన మెడగలవాఁడు నగును.

నరపతిపురుష మధన్యం ధనరహితం క్లేశకారకం వాఽపి,
కురుతే స్వగృహే చంద్రో రవిదృష్టో దుర్గపాలం చ 24

చంద్రుఁడు కర్కాటకమున నుండి రవిచేఁ జూడఁబడగా కలిగిన రాజసేవకుఁడు, అధన్యుఁడు, ధనహీనుఁడు, కష్టపెట్టువాఁడు, దుర్గరక్షకుఁడు నగును

శూరం వికలశరీరం మాతురనర్థావహం ప్రియం దక్షం,
క్షితితనయవీక్షితతనుర్జనయతి చంద్రో నరం స్వగృహే. 25

కర్కాటకమున నున్నచంద్రుఁడు కుజునిచే చూడఁబడగా గలిగినవాఁడు శూరుఁడు, వికలాంగుఁడు, తల్లి కపకారముచేయువాఁడు, ప్రియుఁడు, సమర్థుఁడు కాఁగలఁడు.

అవికలమతిం నయజ్ఞం జనయతి బుధవీక్షితశ్శశీ స్వగృహే,
ధనదారపుత్రవంతం నృపసచివం సౌఖ్యవంతం చ. 26

చంద్రుఁడు కర్కాటకమునుండి బుధునిచేఁ జూడఁబడెనేని నిలకడలేని బుద్ధికలవాఁడు, యజ్ఞములుచేయనివాఁడు, ధనము భార్యాపుత్త్రులు గలవాఁడు, రాజమంత్రి, సౌఖ్యవంతుఁడు నగును.

నృపతిం నృపగుణయుక్తం జనయతి చంద్రస్సురేజ్యసందృష్టః,
స్వగృహే సుఖితసుభార్యం నయవినయపరాక్రమాక్రాంతమ్. 27

చంద్రుఁడు కర్కాటకమున నుండి గురునిచేఁ జూడఁబడినపుడు గలిగిన రాజు రాజగుణములు గలవాఁడు, స్వగృహమున భార్యాపుత్రులతో సుఖమున నుండువాఁడు, నీతి వినయము పరాక్రమముగలవాఁడు నగును.

ధనకనకవస్త్రయోషిద్రత్నానాం భాజనం శశీ కురుతే,
కర్కాటకే సితదృష్టో వేశ్యాజననాయకం కాంతమ్. 28

చంద్రుఁడు కర్కాటకమున నుండి శుక్రునిచేఁ జూడఁబడెనేని ధనము సువర్ణము వస్త్రములు స్త్రీలు రత్నములు అనుభవించి పొందువాఁడు, వేశ్యాజనమున కధిపతి, అందకాఁడు నగును.

అటనమసుఖం దరిద్రం మాతురనిష్టం ప్రియాన్నృతం పాపం,
శనినా దృష్ట స్స్వగృహే కరోతి చంద్రో నరం నీచం. 29

చంద్రుఁడు కర్కాటకమున నుండగా శనిచేఁ జూడఁబడినపుడు కలిగిన తిరుగుట, సుఖములేకపోవుట, తల్లి కప్రియము బంధువులయెడ నబద్ధము చెప్పుట, పాపకర్మలచేయుంట నీచకర్మలచేయుంట గలవాఁ డగును.

స్థూలాస్థిర్మందరోమా పృథువదనగళో హ్రస్వపింగాక్షియుగ్మః
స్త్రీద్వేషీ క్షుత్పిపాసాజఠరదరుజా పీడితో మాంసభక్షః,
దాతా తీక్ష్ణో హ్యపుత్రో విపిననగరతిర్మాతృవశ్యస్సువక్షాః
విక్రాంతః కార్యలాపీ శశభృతి రవిభే సర్వగంభీరదృష్టః. 30

చంద్రుఁడు సింహమున నుండఁగా కలిగిన ఎముకపుష్టిగలవాఁడు, పచ్చని వెంట్రుకలుగలవాఁడు, వెడల్పైన ముఖము లావైన మెడ చిన్నచిన్న పచ్చనికండ్లుగలవాఁడు, స్త్రీలను ద్వేషించువాఁడు, ఆఁకలి దప్పి అజీర్ణము దంతరోగము వీనిచే బాధింపఁబడువాఁడు, మాంసమును భుజించువాఁడు, దానశీలుఁడు, కఠినమైనవాఁడు, సంతతిలేనివాఁడు అడవుల కొండల వసించువాఁడు, తల్లి కధీనుఁడు, వెడల్పైన ఱొమ్ముకలవాఁడు, విక్రాంతుఁడు, కార్యాసక్తుఁడు, అందరిచే గాంభీర్యముగా చూడఁబడువాఁడు నగును.

నృపతేసపత్నం కురుతే ప్రోత్కృష్టగుణం మహాస్పదం వీరం,
రవిణా దృష్టస్సింహే పాపరతం విశ్రుతం చంద్రః. 31

చంద్రుఁడు సింహమున నుండి రవిచేఁ జూడఁబడిన రాజశత్రువు, గుణవంతుఁడు, మంచిప్రాపుగలవాఁడు, వీరుఁడు, పాపరతుఁడు, ప్రసిద్ధుఁడు నగును.

సేనాపతిం ప్రచండం వరయువతిసుతార్థవాహనోపేతం,
జనయత్యుత్తమపురుషం కుజేక్షితశ్చంద్రమా స్సింహే. 32

చంద్రుఁడు సింహమున నుండి కుజునిచేఁ జూడఁబడగా కలిగిన సేనాపతి, అతికోపముగలవాఁడు, దాసదాసీలు పుత్త్రులు ధనము వాహనములు గలవాఁడు ఉత్తమపురుషుఁడు నగును.

స్త్రీసత్వం స్త్రీలలితం స్త్రీవశ్యం యువతిసేవకం సింహే,
కురుతే బుధేన దృష్టో ధనసుఖయోగాన్వితం చంద్రః. 33

చంద్రుఁడు సింహమున నుండి బుధునిచేఁ జూడఁబడగాఁ బుట్టిన స్త్రీబుద్ధిగల వాఁడు, స్త్రీవలె మృదువైనవాఁడు, స్త్రీలకువశుఁడు, స్త్రీసేవకుఁడు, ధనము సుఖముకల వాఁడు నగును.

అభిజాతం కులపుత్రం బహుశ్రుతం గుణసమృద్ధం చ,
కురుతే నరేంద్రతుల్యం గురుదృష్టశ్చంద్రమాస్సింహే. 34

చంద్రుఁడు సింహమునసుండి గురునిచేఁ జూడఁబడగా కలిగిన మంచివంశమందుఁ బుట్టువాఁడు, చక్కఁగాఁ చదువుకొన్న వాఁడు, గుణవంతుఁడు, రాజతుల్యుఁడు నగును

ప్రమదావిభవైర్యుక్తం రోగిణామపి యువతిసేవకం కురుతే,
సురతవిధిజ్ఞం ప్రాజ్ఞం శశీ హరౌ శుక్రసందృష్టః. 35

చంద్రుఁడు సింహమునసుండగా శుక్రుఁడు చూచెనేని జాతకుఁడు స్త్రీలు ధనము కలవాఁడు, రోగి, స్త్రీసేవకుఁడు, సురతకళానిపుణుఁడు, ప్రాజ్ఞుఁడు నగును.

కర్షకమధనం కురుతేఽనృతవాచం దుర్గపాలకం సింహే,
రవిజేన తదా దృష్టో యువతిసుఖైర్హీనమల్పకం చ శశీ. 36

చంద్రుఁడు సింహరాశియందుండి శనిచేఁ జూడఁబడెనేని వ్యవసాయదారుఁడు, ధనహీనుఁడు, అబద్ధములాడువాఁడు, దుర్గరక్షకుఁడు, స్త్రీసుఖహీనుఁడు, కడుపల్పుఁడు నగును.

స్త్రీలోలో లంబబాహుర్లలితతనుముఖశ్చారుదంతాక్షికర్ణో
విద్వానాచార్యధర్మాప్రియవచనయుతస్సత్యశౌచప్రధానః,
ధీరస్సత్వానుకంపీ పరవిషయరతః క్షాంతిసౌభాగ్యభాగీ
ప్రాయః కన్యాప్రసూతిర్బహుసుతరహితః కన్యకాయాం శశాంకే.

చంద్రుఁడు కన్యయందుండగా కలిగిన స్త్రీలోలుఁడు,పొడవగు చేతులుగలవాఁడు, అందమైనముఖము శరీరముగలవాఁడు అందములగు దంతములు నేత్రములుఁ కర్ణములు గలవాఁడు, విద్వాంసుఁడు, గురుభక్తిగలవాఁడు, మంచిమాటలు గలవాఁడు, సత్యము శౌచము గలవాఁడు,ధీరుఁడు, భూతదయగలవాఁడు, ఇతరపనులయం దాసక్తిగలవాఁడు, ఓర్పు సౌభాగ్యము గలవాఁడు, తరచు స్త్రీసంతానము గలవాఁడు, అనేకపుత్త్రులులేని వాఁడు నగును.

నృపకోశకరం ఖ్యాతం గృహీతవాక్యం విశిష్టకర్మాణాం,
కన్యాయాం రవిదృష్టో భార్యాహీనం శశీ కురుతే. 38

చంద్రుఁడు కన్యయందుండి రవిచేఁ జూడఁబడినపుడు గలిగిన రాజుటొక్కఁడనము నకు ధనముఁకూర్చువాఁడు, ప్రసిద్ధుఁడు, పెద్దలమాటవినువాఁడు, భార్యలేనివాఁడు నగును.

శిల్పాచార్యం ఖ్యాతం ధనవంతం శిక్షితం సుధీరం చ,
కన్యాయాం కుజదృష్టో మాతురనిష్టం శశీ కురుతే. 39

చంద్రుఁడు కన్యయందుండి కుజునిచేఁ జూడఁబడెనేని శిల్పాచార్యుఁడు, ప్రసిద్ధుఁడు, ధనవంతుఁడు, శిక్షితుఁడు, ధీరుఁడు, తల్లికి చేటుచేయువాఁడు నగును

జ్యోతిష కావ్యవిధిజ్ఞం వివాదకలహేషు విజయినం సుతరాం,
సాతిశయం కన్యాయాం జనయతి నిపుణం బుధేక్షితశ్చంద్రః. 40

చంద్రుఁడు కన్యయందుండఁగా బుధుఁడు చూచెనేని జ్యోతిషము కావ్యములు నెఱిఁగినవాఁడు, వాదముల కలహముల గెల్చువాఁడు, అతిశయవంతుఁడు, నిపుణుఁడు నగును.

బంధుజనాఢ్యం సుఖినం నృపకృత్యకరం గృహీతవాక్యం చ,
కన్యాయాం గురుదృష్టో జనయతి విభవాన్వితం చంద్రః. 41

చంద్రుఁడు కన్యయందుండి బృహస్పతిచేఁ జూడఁబడెనేని ఎక్కువబంధువులు కలవాఁడు, సుఖవంతుఁడు, రాజకృత్యముల నెఱవేర్చువాఁడు, విభవవంతుఁడు నగును

కన్యాయాం బహుదారం వివిధాలంకారభోగినమథాఢ్యం,
సతతమిహోర్జితముదితం కురుతే భృగుణా నిరీక్షితశ్చంద్రః 42

చంద్రుఁడు కన్యయందుండి శుక్రునిచేఁ జూడఁబడినపుడు గలిగిన అనేక భార్యలుగలవాఁడు, అనేకాలంకారనులు గలవాఁడు, ధనవంతుఁడు, ఎల్లపుడు నార్జించువాఁడు, అభివృద్ధిగలవాఁడు నగును.

అదృఢస్మృతిం దరిద్రం సుఖరహితమమాతృకం యువతివశ్యం,
కన్యాయాం యమదృష్టస్త్రీభోగ్యధనం శశీ కురుతే. 43

కన్యయందుఁ చంద్రుఁడుండఁగా శని చూచెనేని జ్ఞాపకశక్తిలేనివాఁడు, దరిద్రుఁడు, సౌఖ్యహీనుఁడు, తల్లిలేనివాఁడు, స్త్రీవశ్యుఁడు, స్త్రీలచే ననుభవింపఁబడు ధనముగలవాఁడు నగును

ఉన్నాసోవ్యాయతాక్షః కృశవదనతనుర్భూరిదారో వృషాఢ్యో
గోభూభృత్యశ్చైచసారో వృషసమవృషణో విక్రమజ్ఞః క్రియేశః,
భక్తో దేవద్విజానాం బహువిభయుతస్త్రీస్రజితో హీనదేహో
ధాన్యాదానైకబుద్ధి స్తులిని శశధరే బంధువర్గోపకారీ. 44

చంద్రుఁడు తులయందుండగాఁ బుట్టిన ఎత్తైనముక్కు వెడల్పైననేత్రములు చిక్కనముఖము శరీరము అనేకమందిభార్యలు కలవాఁడు, వృషభముల నెక్కువగా కలవాఁడు, గోభూములవలన పరిశుద్ధినొందువాఁడు, వృషభవృషణములవంటి వృషణములు కలవాఁడు, విక్రమవంతుఁడు, కార్యశూరుఁడు, దేవబ్రాహ్మణభక్తుఁడు, అనేకవిభవములు గలవాఁడు, స్త్రీలచే జయింపఁబడువాఁడు, సన్నని శరీరముగలవాఁడు, ధాన్యములపండించుటయందు దాసక్తిగలవాఁడు, బంధువులకు సాయము చేయువాఁడు నగును.

అధనం వ్యాధితమటనం పరిభూతం భోగవిప్రయుక్తం చ,
అసుతమసారం జూకే జనయతి రవివీక్షిత శ్చంద్రః. 45

చంద్రుఁడు తులయందుండి రవిచేఁజూడఁబడినపుడు గలిగిన ధనహీనుఁడు, వ్యాధియుక్తుఁడు, దేశద్రిమ్మరి, అవమానము నొందువాఁడు, భోగహీనుఁడు, పుత్రహీనుఁడు, దుర్బలుఁడు నగును.

తీక్ష్ణం చోరం క్షుద్రం పరయోషిద్గంధమాల్యసంయుక్తం,
మతిమన్నయనాతురగం జనయతి వక్రేక్షితశ్చంద్రః. 46

చంద్రుఁడు తులయందుండి కుజునిచేఁ జూడఁబడెనేని కఱకుగలవాఁడు, చోరుఁడు, నీచుఁడు, పరభార్యాసక్తుఁడు, గంధమాల్యములుగలవాఁడు, బుద్ధిమంతుఁడు, నేత్రరోగముకలవాఁడు నగును.

దృష్టో బుధేన చంద్రః కలావిదగ్ధం ప్రభూతధనధాన్యం,
శుభవాక్యం విద్వాంసం దేశఖ్యాతం తులాధరే కురుతే 47

చంద్రుఁడు తులయందుండి బుధునిచేఁ జూడఁబడగా కలిగిన సర్వకళానిపుణుఁడు, ఎక్కువధనధాన్యములుకలవాఁడు, మంచిమాటలుగలవాఁడు, విద్వాంసుఁడు, దేశప్రసిద్ధుఁడు నగును.

జీవేక్షితస్తులాయాం జనయతి సర్వత్ర పూజితం హిమగుః,
క్రయవిక్రయేషు కుశలం రత్నాదిషు భాండజాతేషు 48

చంద్రుఁడు తులయందుండి గురునిచేఁ జూడఁబడగాఁ గలిగిన అంతట పూజింపఁబడువాఁడు, క్రయవిక్రయముల నేర్పరి, రత్నపరీక్షయం దారితేరినవాఁడు నగును.

లలితమరోగం సుభగం సముపచితాంగం ధనాన్వితం ప్రాజ్ఞం,
వివిధోపాయవిధిజ్ఞం కురుతే భృగువీక్షితశ్శశీ తులకే. 49

చంద్రుఁడు తులయందుండగా శుక్రునిచేఁ జూడఁబడగాఁ గలిగిన అందకాఁడు, నీరోగి, మెత్తనివాఁడు, ధనవంతుఁడు, ప్రాజ్ఞుఁడు, అనేకఉపాయముల నెఱిఁగినవాఁడు నగును.

కురుతే శశీ ధనాఢ్యం ప్రియవాక్యం వాహనైర్యుతం జూకే,
విషయరతిం సుఖరహితం భాస్కరి దృష్టో యుతం మాతుః. 50

చంద్రుఁడు తులయందుండఁగా శనిచేఁ జూడఁబడగా ధనవంతుఁడు, ప్రియమైన మాటలుగలవాఁడు, వాహనములుకలవాఁడు, విషయరతుఁడు, సుఖహీనుఁడు నగును.

లుబ్ధో వృత్తోరుజంఘః కఠినతరతనుర్నాస్తికః క్రూరచేష్ట
శ్చోరో బాల్యే రుగార్తో హృతచిబుకనఖశ్చారునేత్రస్సమృద్ధః,
కర్మోద్యుక్తః ప్రదక్షః పరయువతిరతో బంధుహీనః ప్రమత్త
శ్చండో రాజ్ఞా హృతస్వః పృథుజఠరశిరాః కీటభే శీతరశ్మౌ. 51

చంద్రుఁడు వృశ్చికమున నున్నపుడు కలిగినవాఁడు లుబ్ధుఁడు, గుండ్రనితొడలు పిక్కలు, కఠినమైనదేహముకలవాఁడు, నాస్తికుఁడు, క్రూరకర్మలచేయువాఁడు, దొంగ, బాల్యమున రోగపీడితుఁడు, గడ్డము గోళ్లులేనివాఁడు, మంచినేత్రములుకలవాఁడు, సమృద్ధిమంతుఁడు, పనులయం దాసక్తుఁడు, సమర్థుఁడు, పరస్త్రీసక్తుఁడు, బంధుహీనుఁడు, మత్తుఁడు, కోపముగలవాఁడు, రాజుచే నపహరింపఁబడిన ధనముకలవాఁడు, పెద్దకడుపు తలగలవాఁడు నగును.

కురుతే లోకద్వేష్యం బుధమటనం విత్తవంతం చ,
దినకరదృష్టోఽలిగత శ్చంద్ర స్సుఖవర్జితం పురుషమ్ 52

వృశ్చికమున చంద్రుఁడుండి రవిచేఁ జూడఁబడెనేని లోకముచే ద్వేషింపఁబడు వాఁడు, పండితుఁడు, దేశద్రిమ్మరి, ధనవంతుఁడు, సుఖహీనుఁడు నగును.

అనుపమధైర్యం కురుతే నృపతిసమం వృశ్చికే విభూతియుతం.
శూరమజయ్యం సమరే ప్రభక్షణం భూమిజేన సందృష్టః. 53

వృశ్చికమున చంద్రుఁడుండి కుజునిచేఁజూడఁబడెనేని సాటిలేనిధైర్యవంతుఁడు, రాజతుల్యుఁడు, విభవవంతుఁడు, శూరుఁడు, జయశీలుఁడు, యుద్ధమున శత్రువినాశకరుఁడు నగును.

అచతురమమృష్టవాక్యం యమలాపత్యం చ యుక్తివంతం చ,
జనయతి బుధేన దృష్టః కూటకరం వృశ్చికే చ గీతజ్ఞః. 54

చంద్రుఁడు వృశ్చికమున నుండి బుధునిచేఁ జూడఁబడెనేని నేర్పులేనివాఁడు, ఆలోచనలేనిమాటలుగలవాఁడు, కవలపిల్లలుకలవాఁడు, యుక్తిగలవాఁడు, కూటసాక్షియు నగును.

కర్మాసక్తం కురుతే లోకద్వేష్యం చ విత్తవంతం చ,
గురుణా దృష్టోఽలిగతో నిశాకరో రూపవంతం చ. 55

చంద్రుఁడు వృశ్చికమున నుండి గురునిచేఁ జూడఁబడినపుడు గలిగిన కర్మాసక్తుఁడు లోకముచే నిందింపఁబడువాఁడు, ధనవంతుఁడు, రూపవంతుఁడు నగును.

అతిమదమతీవ సుభగం ధనవాహనభోగలలితమిహ కీటే,
యువతివినాశితసారం జనయతి భృగువీక్షితశ్చంద్రః. 56

చంద్రుఁడు వృశ్చికమున నుండఁగా శుక్రుఁడు చూచెనేని మిక్కిలి మదము కలవాఁడు, అందకాఁడు, ధనము వాహనములు సౌఖ్యము గలవాఁడు, స్త్రీచే నశింపఁ జేయఁబడిన బలముకలవాఁడు నగును.

నీచాపత్యం కృపణం వ్యాధితమధనం చ సత్యహీనం చ,
జనయత్యంతకదృష్టో నరమధనం చంద్రమాః కీటే. 57

చంద్రుఁడు వృశ్చికమున నుండి శనిచేఁ జూడఁబడినపుడు కలిగిన నీచమైన సంతతిగలవాఁడు, లోభి రోగి దరిద్రుఁడు, అసత్యవాదియు నగును.

కుబ్జాంగో వృత్తనేత్రః పృథుహృదయకటిః పీనబాహుః ప్రవక్తా
దీర్ఘాంసో దీర్ఘకంఠో జలతటవసతిశ్శిల్పవిద్గూఢగుహ్యః,
శూరో దృష్టాస్థిసారో వితతబహుబలస్థూలకంఠోష్ఠఘోణో
బంధుస్నేహీ కృతజ్ఞో ధనుషి శశధరే సంహితాంఘ్రిః ప్రగల్భః 58

చంద్రుఁడు ధనుస్సున నుండగాఁ బుట్టినవాఁడు, పొట్టిఅవయువములుకలవాఁడు, గుండ్రని నేత్రములు విశాలమైనఱొమ్ము కటిప్రదేశము గలవాఁడు, బలిసిన బాహువులు గలవాఁడు, మంచివక్త, పెద్దభుజములు పొడవైనకంఠముగలవాఁడు, నీటిరెయొడ్డుననివసించువాఁడు, శిల్పశాస్త్రవేత్త, గూఢమైన గుహ్యదేశముగలవాఁడు, శూరుఁడు, ఎముకపుష్టి కలవాఁడు, ఎక్కువబలము పెద్దమెడ పెదవులు ముక్కులుగలవాఁడు, బంధుప్రేమ, కృతజ్ఞత, ఇరుకైన పాదములుగలవాఁడు నగును.

నృపతి మథాఢ్యం కురుతే శూరం విఖ్యాతపౌరుషం చాపే,
భాస్కరదృష్టశ్చంద్రస్త్వనుపమసుఖవాహనోపేతమ్ 59

చంద్రుఁడు ధనుస్సునందుండెఁగా రవి చూచెనేని జాతకుఁడు రాజు ధనవంతుఁడు శూరుఁడు పౌరుషవంతుఁడు తులలేని వాహనసంపత్తిగలవాఁడు నగును.

సేనాపతిం సమృద్ధం సుభగం ప్రఖ్యాతపౌరుషం పురుషం,
జనయత్యనుపమభృత్యం క్షితిసుతదృష్టశ్శశీ ధనుషి. 60

చంద్రుఁడు ధనుస్సునందుండి కుజునిచేఁ జూడఁబడెనేని సేనాపతి, ధనవంతుఁడు అందకాఁడు, పౌరుషవంతుఁడు, అనేక సేవకులగలవాఁడు నగును.

బహుభృత్యం త్వక్సారం జ్యోతిషశిల్పక్రియాదినిపుణం చ,
బుధదృష్టో హిమరశ్మి ర్నగ్నాచార్యం హయే కురుతే. 61

చంద్రుఁడు ధనుస్సునందుండి బుధునిచేఁ జూడఁబడెనేని అనేకభృత్యులు, శరీర బలము జ్యోతిషము శిల్పము వీనియందు నైపుణ్యము, నగ్నాచార్యుఁడు నగును.

అనుపమదేహం కురుతే పృథ్వీపాలస్య మంత్రిణం చాపే,
త్రిదశగురుదృష్టమూర్తి ర్ధనధర్మసుఖాన్వితం చంద్రః. 62

చంద్రుఁడు ధనుస్సునందుండి గురునిచేఁ జూడఁబడెనేని జాతకుఁడు సౌందర్య వంతుఁడు, రాజమంత్రి, ధనము ధర్మము సుఖము గలవాఁడగును.

సుఖినమతీవ హి లలితం సుభగం పుత్రార్థకామవంతంచ,
చాపే సుమిత్రభార్యం భార్గవదృష్టః కరోతీందుః 63

చంద్రుఁడు ధనుస్సునసుండి శుక్రునిచేఁ జూడఁబడెనేని సుఖవంతుఁడు, మిక్కిలి లలితుఁడు, రూపవంతుఁడు, సుతులు ధనము కామము గలవాఁడు, మంచిస్నేహితులు, భార్యగలవాఁడు నగును.

ప్రియవాదినం సువాక్యం బహుశ్రుతం సత్యవాదినం సౌమ్యం,
అభిజాతం నృపపురుషం జనయతి సౌరేక్షితశ్శశీ ధనుషి. 64

చంద్రుఁడు ధనుస్సున నుండి శనిచేఁ జూడఁబడెనేని ప్రియువాది, మంచిమాటలు గలవాఁడు, విద్వాంసుఁడు, సత్యవాది, సౌమ్యుఁడు, మంచివంశస్థుఁడు, రాజపురుషుఁడు నగును.

గీతజ్ఞశ్శీతభీరుః పృథులతరశిరాస్సత్యధర్మోపసేవీ
ప్రాంశుఃఖ్యాతోఽల్పరోషో మనసి భయయుతో నిర్ఘృణా స్త్యక్తలజ్జః,
చార్వక్షః క్షామదేహో గురుయువతిరతస్సత్కవిర్వృత్తజంఘో
మందోత్సాహోఽతిలుబ్ధశ్శశిని మకరగే దీర్ఘకంఠోఽతికర్ణః. 65

చంద్రుఁడు మకరమందుండఁగాఁ బుట్టినవాఁడు సంగీతజ్ఞుఁడు, చలివలన భయపడు వాఁడు, పెద్దతలకలవాఁడు, సత్యమును ధర్మమును ననుష్ఠించువాఁడు, పొడవైనవాఁడు ప్రసిద్ధుఁడు, రోషములేనివాఁడు, భయశీలుఁడు, దయలేనివాఁడు, లజ్జలేనివాఁడు, మంచికండ్లు చిక్కిన దేహముగలవాఁడు, కనకన్ను 'పెద్దస్త్రీలను' కామించువాఁడు,

సత్కవి, సుందరనిపీకలుకలవాఁడు, ఉత్సాహములేనివాఁడు, అతిలోభి, పొడుగైనమెడ కర్ణములుగలవాఁడు నగును.

అధనం దుఃఖితమటనం పరకర్మరతం మలీమసం కురుతే,
మకరే కువలయనాథ శ్శిల్పమతిం వీక్షితో రవిణా. 66

చంద్రుఁడు మకరమున నుండి రవిచేఁ జూడఁబడగా, గలిగినవాఁడు నిర్ధనుఁడు, దుఃఖవంతుఁడు, ఇతరులపనులను శ్రద్ధగాఁ జేయువాఁడు, మలినుఁడు, శిల్పవేదియు నగును.

అతివిభవమత్యుదారం సుభగం ధనసంయుతం మృగే పురుషం,
వాహనయుతం ప్రచండం కరోతి వక్రేక్షితశ్చంద్రః 67

చంద్రుఁడు మకరమున నుండఁగా కుజుఁడు చూచెనేని మిక్కిలి విభవవంతుఁడు, ఉదారుఁడు, సౌందర్యవంతుఁడు, ధనవంతుఁడు, వాహనములు కలవాఁడు, ప్రచండుఁడు నగును

మూర్ఖం ప్రవాసశీలం గతయువతిం చంచలం మృగే తీక్ష్ణం,
జనయతి బుధేన దృష్ట స్సుఖరహితం నిర్ధనం పురుషమ్ 68

చంద్రుఁడు మకరమున నుండఁగా బుధుఁడు చూచెనేని మూర్ఖుఁడు, విదేశముల నుండువాఁడు, భార్యలేనివాఁడు, చపలుఁడు, సుఖములేనివాఁడు, ధనహీనుఁడు నగును.

భూపతిమనుపమవీర్యం నృపతిగుణై స్సంయుతం మృగే జాతం,
బహుదారపుత్రమిత్రం జనయతి గురువీక్షిత శ్చంద్రః. 69

చంద్రుఁడు మకరమందుండఁగా బృహస్పతి చూచెనేని రాజు, సాటిలేని పరాక్రమము, రాజగుణములు, అనేకమందిభార్యలు, మిత్త్రులు పుత్త్రులు కలవాఁడు నగును.

వరయువతిధనవిభూషణవాహనమాలాన్వితం నరం మకరే,
సోపక్రోశ మపుత్రం జనయతి భృగువీక్షిత శ్చంద్రః. 70

చంద్రుఁడు మకరమున నుండి శుక్రునిచేఁ జూడఁబడినపుడు కల్గినవాఁడు మంచి స్త్రీలు ధనము సొమ్ములు వాహనములు పూలదండలు, కోపముగలవాఁడు, పుత్త్రులు లేనివాఁడు నగును.

అలసం మలినం సధనం మదనార్తం పారదారిక మసత్యం,
దివసకరపుత్రదృష్టః కరోతి చంద్రో నరం మక 71

చంద్రుఁడు మకరమున నుండి శనిచేఁ జూడఁబడెనేని సోమరి, నీచుఁడు, ధనవంతుఁడు, కాముకుఁడు, పరదారాసక్తుఁడు, అసత్యవాదియుం నగును.

ఉద్ఘోణో రూక్షదేహః పృథుకరచరణో మద్యపానప్రసక్త
స్సద్భిర్ద్వేష్యో ధర్మహీనః పరసుతజనకస్థూస్సలమూర్ధా కునేత్రః,
శాఠ్యాలస్యాభిభూతో విపులముఖకటిశ్శిల్పవిద్యాసమేతో
దుశ్శీలో దుఃఖతప్తో ఘటభముపగతే రాత్రినాథే దరిద్రః 72

చంద్రుఁడు కుంభమందుండగాఁ కలిగినవాఁడు ఎత్తైనముక్కు, ఉష్ణదేహము, పొడవైన కాలుచేతులు కలవాఁడు, మద్యపాయి, సత్పురుషులచే ద్వేషింపఁబడువాఁడు, ధర్మహీనుఁడు, జారుఁడు, పెద్దతలకాయ చిన్నకండ్లు కలవాఁడు, పొగరుబోతుతనము సోమరితనముగలవాఁడు, పెద్దముఖము, కటిప్రదేశము గలవాఁడు, శిల్పశాస్త్రవేత్త, చెడ్డనడతగలవాఁడు, దుఃఖవంతుఁడు, దరిద్రుఁడు నగును.

అతిమలినమతిచ శూరం నృపరూపం ధార్మికం కృషీరం చ,
కురుతే దినకరదృష్టో ఘటధరసంస్థః క్షపానాథః 73

చంద్రుఁడు కుంభమున నుండి రవిచేఁ జూడఁబడెనేని నీచుఁడు, శూరుఁడు, రాజతుల్యుఁడు, ధార్మికుఁడు, వ్యవసాయము చేయువాఁడు నగును.

కుంభేఽతిసత్యవాక్యం మాతృగురుధనైర్వియుక్తమలసం చ,
విషమం పరకార్యరతం కరోతి భౌమేక్షితశ్చంద్రః. 74

చంద్రుఁడు కుంభమందుండి కుజునిచేఁ జూడఁబడినపుడు గలిగిన సత్యవంతుఁడు, తల్లి గురువు ధనములేనివాఁడు, సోమరి, పెడవాఁడు, ఇతరకార్యాసక్తుఁడు నగును.

శయనోపచారకుశలం గీతవిధిజ్ఞం ప్రియం చ యువతీనాం,
తనువిభవసుఖం పురుషం కరోతి బుధవీక్షితశ్శశీ కుంభే 75

చంద్రుఁడు కుంభమున నుండి బుధునిచేఁ జూడఁబడెనేని శయనోపచారముల నేర్పరి, సంగీతజ్ఞుఁడు, స్త్రీలకు ప్రియుఁడు, స్వల్పవిభవము సుఖముగలవాఁడు నగును.

గ్రామక్షేత్రతరూణాం వరభవనానాం వరాంగనానాం చ,
కురుతే భోగిన మార్యం సాధుం గురువీక్షిత శ్శశీ కుంభే. 76

చంద్రుఁడు కుంభమున నుండి గురునిచేఁ జూడఁబడెనేని జాతకుఁడు గ్రామములు క్షేత్రములు వృక్షములు శ్రేష్ఠములగుభవనములు అందకత్తెలగు స్త్రీలుగలవాఁడు, సత్పురుషుఁడు నగును.

నీచమపుత్రమమిత్రం కాతర మాచార్యనిందితం పాపం,
కురుతే శశీ కుయువతిం సితేక్షితో ఘటధరేఽల్పసుఖమ్ 77

చంద్రుఁడు కుంభమందుండగా శుక్రునిచేఁ జూడఁబడెనేని జాతకుఁడు నీచుఁడు, పుత్త్రులు మిత్త్రులులేనివాఁడు, భయశీలుఁడు, గురునిందితుఁడు, పాపుఁడు, సుఖములేని వాఁడు నగును.

నఖరోమధరం మలినం పరదారరతం శతం విధర్మాణాం,
స్థావరభాగిన మాఢ్యం శశీ ఘటే సౌరసందృష్టః 78

చంద్రుఁడు కుంభమునందుండి శనిచేఁ జూడఁబడెనేని నఖములు రోమములు దట్టముగాఁగలవాఁడు, మలినుఁడు, పరభార్యాసక్తుఁడు, ధర్మహీనుల దండించువాఁడు, స్థిరవస్తుసముదాయము గలవాఁడు, ధనవంతుఁడు నగును.

శిల్పోత్పన్నాధికారోఽహితజయనిపుణశ్శాస్త్రవిచ్చారుదేహో
గేయజ్ఞో ధర్మనిష్ఠో బహుయువతిరతస్సౌఖ్యభాగ్భూపసేవీ,
ఈషత్కోపో మహాత్మా సుఖనిధిధనభాక్ స్త్రీజితస్సత్త్వభావో
యానాసక్త స్సముద్రే తిమియుగలగతే శీతగౌ దానశీలః 79

చంద్రుఁడు మీనమందుండగా కలిగినవాఁడు శిల్పశాస్త్రవేత్త, శత్రుజయమున నిపుణుఁడు, శాస్త్రవేది, సౌందర్యవంతుఁడు, గానవేది, ధర్మాత్ముఁడు, అనేకస్త్రీలయం దాసక్తిగలవాఁడు, సౌఖ్యవంతుఁడు, రాజుల సేవించువాఁడు. కొంచెము కోపముగల వాఁడు, గొప్పవాఁడును, అనాయాసముగా నిధులవలన ధనమును పొందువాఁడు, స్త్రీస్వాధీనుఁడు, సత్త్వశాలి, జలప్రయాణపరాయణుఁడు, దానశీలుఁడు నగును.

తీవ్రమదనం ప్రకాశం సుఖినం సేనాపతిం ధనసమృద్ధం,
జనయతి దినకరదృష్ట స్సుముదితభార్యం శశీ మీనే 80

చంద్రుఁడు మీనమందుండగా రవిచేఁ జూడఁబడెనేని అతికాముకుఁడు, ప్రసిద్ధుఁడు, సుఖవంతుఁడు, సేనాపతి, ధనవంతుఁడు, సంతోషించినభార్యకలవాఁడు నగును.

పరిభూతం సుఖరహితం కులటాపుత్రం చ పాపనిరతం చ,
జనయతి నక్షత్రపతిః క్షితిసుతదృష్టో ఝషే శూరమ్. 81

చంద్రుఁడు మీనమున నుండగా అంగారకుఁడు చూచినపుడు కలిగినవాఁడు అవమానము పొందినవాఁడు, సుఖములేనివాఁడు, జారిణీపుత్త్రుఁడు, పాపకార్యములఁ జేయువాఁడు, శూరుఁడు నగును.

జనయతి బుధేన దృష్టో మీనస్థశ్చంద్రమాః పురుషం,
భూపతి మతీవ సుఖినం వరయువతిసమావృతం వశ్యమ్. 82

మీనమందున్న చంద్రుఁడు బుధునిచే జూడఁబడెనేని జాతకుఁడు రాజు, మిక్కిలి సుఖవంతుఁడు, సుందరీసమేతుఁడు, వశ్యుఁడు నగును

గురుదృష్టో మీనస్థో లలితం చంద్రోఽగ్రమాండలికం,
అత్యాఢ్యం సుకుమారం బహుభిస్త్రీభిర్వృతం జనయేత్. 83

చంద్రుఁడు మీనమున నుండి గురునిచే జూడఁబడినపుడు కలిగిన మండలాధిపతి, మిక్కిలి ధనవంతుఁడు, సుకుమారుఁడు, అనేకస్త్రీయుతుఁడు నగును.

కురుతే శశీ సుశీలం రతిమంతం నృత్యవాద్యగేయరతం,
శుక్రేక్షితో ఝషస్థో హృదయహరం కామినీనాం చ. 84

చంద్రుఁడు మీనముననుండి శుక్రునిచే జూడఁబడెనేని మంచిశీలముగలవాఁడు, రతియందు సమర్థుఁడు, నాట్యము వాద్యము పాట వీనియందు నేర్పరి, స్త్రీమనోహరుఁడు నగును.

వికలమహితం జనన్యాః కామార్తం పుత్రదారమతిహీనం,
కురుతే రవిసుతదృష్టో నీచవిరూపాంగనాసక్తమ్. 85

చంద్రుఁడు మీనమున నుండి శనిచే జూడఁబడెనేని వికలుఁడు, తల్లికి చెఱుపు చేయువాఁడు, కామార్తుఁడు, భార్యాపుత్రులు గలవాఁడు, మిక్కిలి హీనుఁడు, నీచ చరితలు నందములేనివారునగు స్త్రీల కామించువాఁడు నగును.

రాశిపతౌ బలయుక్తే రాశౌ చ బలాన్వితే తథా చంద్రే,
రాశిఫలం స్యాత్సకలం నీచోచ్చవిధినా చ సంచింత్యమ్. 86

పూర్వము జెప్పినఫలము రాశ్యధిపతి, రాశి, చంద్రుఁడు బలవంతములై యుండెనేని సంపూర్ణముగాఁ జెప్పఁదగినది. అట్లుగాక నీచాదులను బొందెనేని నిష్ఫలమని తెలియఁదగినది. మిశ్రముగ నుండెనేని మిశ్రమఫల మాలోచింపఁ దగినది.

ఇతి త్రయోవింశోఽధ్యాయః.

---

## అంశయందున్న చంద్రచారఫలమును దెలుపు
## ఇరువదినాలవ యధ్యాయము.

భౌమేంఽశే కుజదృష్టో నికర్తనశ్చంద్రమాః ప్రచండశ్చ,
జనయతి మాయాబహుళం ప్రపంచకం సూర్యజేన కిలపురుషమ్ 1

పూర్ణచంద్రుఁడు కుజాంశయందుండి కుజునిచేఁ జూడఁబడఁగాఁ బుట్టినవాఁడు కపటముగలవాఁడు, శనిచేఁ జూడఁబడెనేని వైపరీత్యము గలవాఁడు అగును.

సూర్యేణ చోరఘాతక మథవా ప్యారక్షకం శూరం,
జీవేన మనుజనాథం ఖ్యాతం విద్వత్సమారాధ్యమ్. 2

సూర్యునిచేఁ జూడఁబడెనేని చోరులను శిక్షించువాఁడు, లేక రక్షించువాఁడు, శూరుఁడు అగును. గురునిచేఁ జూడఁబడెనేని విద్వన్మాన్యుఁడగును.

శుక్రేణ నృపతి సచివం ధనాన్వితం స్త్రీవిలేపనానురతం,
శీఘ్రం వదంతి చపలం సౌమ్యేన నిరీక్షితే చంద్రే. 3

శుక్రునిచేఁ జూడఁబడెనేని రాజమంత్రి, ధనికుఁడు, స్త్రీలోలుఁడు అగును. బుధునిచేఁ జూడఁబడెనేని చపలుఁడగును.

సితభాగే సితదృష్టే యోషిద్వస్త్రాన్నపానధనసౌఖ్యం,
జనయతి బుధేన చంద్రో వాద్యజ్ఞం నృత్తగేయపరమ్. 4

చంద్రుఁడు శుక్రనవాంశయందుండి శుక్రునిచేఁ జూడఁబడెనేని స్త్రీసౌఖ్యము వస్త్రసౌఖ్యము భోజనసౌఖ్యము ధనసమృద్ధము గలవాఁడగును. బుధునిచేఁ జూడఁబడెనేని గానశాస్త్రజ్ఞుఁ డగును.

గురుణా కవిప్రదానం నయశాస్త్రవిశారదం నృపసచివం,
పరదారదర్శనపరం కామినమారేణ బహుభృత్యమ్. 5

గురునిచేఁ జూడఁబడెనేని కవిశ్రేష్ఠుఁడు, నీతిశాస్త్రజ్ఞుఁడు, రాజమంత్రి యగును. కుజునిచేఁ జూడఁబడెనేని పరదారాసక్తి గలవాఁడు, కాముకుఁడు, అనేకభృత్యులు గలవాఁడు అగును.

సూర్యేణ మహాశమూర్ఖం ప్రియంవదం సతతమన్నపానరుచిమ్,
సౌరేణ వర్ధకీనాం గుణైశ్చ సదృశం దిశతి చంద్రః. 6

సూర్యునిచేఁ జూడఁబడఁగాఁ బుట్టినవాఁడు మూర్ఖుఁడును, ప్రియమును బలుకు వాఁడును అగును. శనిచేఁ జూడఁబడెనేని వడ్లవానిగుణములవంటి గుణములు గలవాఁడగును

బుధభాగే బుధదృష్టశ్శిల్పాచార్యం కవిం శశీ జనయేత్,
శుక్రేక్షితో విశాలం గేయజ్ఞం వచనసారాఢ్యమ్ 7

చంద్రుఁడు బుధనవాంశయందుండి బుధునిచే జూడఁబడఁగాఁ బుట్టినవాఁడు శిల్పశ్రేష్ఠుఁడు, కవిత్వము దెలిసినవాఁడు అగును. శుక్రునిచేఁ జూడఁబడెనేని గొప్ప మనుష్యుఁడు, గానము వచనసారము దెలిసినవాఁ డగును.

నృపమంత్రిణం గుణాఢ్యం గురుణా దృష్టః ప్రతిష్ఠితం కాంతమ్,
భౌమేక్షితేఽతిచోరం వివాదకుశలం నరం రౌద్రమ్. 8

గురునిచేఁ జూడఁబడెనేని మంత్రి సద్గుణములు సౌందర్యము గలవాఁడగును కుజునిచేఁ జూడఁబడెనేని చోరుఁడు వివాదముసేయువాఁడు కోపముగలవాఁడు అగును.

శాస్త్రార్థకావ్యబుద్ధిం ప్రాజ్ఞం శిల్పిన మవేక్షితశ్శనినా,
రంగచరం విఖ్యాతం జనయతి సూర్యేక్షిత శ్చంద్రః 9

శనిచేఁ జూడఁబడెనేని శాస్త్రజ్ఞుఁడు శిల్పజ్ఞుఁడు అగును. సూర్యునిచే జూడఁబడెనేని తగరముతినువాఁడు, ఖ్యాతిగలవాఁడు అగును.

స్వాంశే దినకరదృష్టశ్శశీ కృశతను మవిక్షతశరీరం,
పరధనరక్షణనిపుణం లుబ్ధం నితరాం కుజేనాపి 10

చంద్రుఁడు స్వాంశయందుండి రవిచేఁ జూడఁబడఁగాఁ బుట్టినవాఁడు కృశించి నట్టియుఁ గొట్టఁబడినట్టియుఁ శరీరముగలవాఁడగును కుజునిచేఁ జూడఁబడెనేని పరద్రవ్యరక్షకుఁడు, లుబ్ధుఁడు అగును.

సౌరేణాకృత్యకరం వధబంధవివాదసంతప్తమ్,
శుక్రేణ స్త్రీద్వేష్యం జనయే దథవా నపుంసకాకారమ్. 11

శనిచేఁ జూడఁబడెనేని అకృత్యములను సేయువాఁడు,బంధువివాదముచే తపించు వాఁడు, శుక్రునిచేఁ జూడఁబడెనేని స్త్రీద్వేషి లేక నపుంసకుఁడు అగును.

నృపమంత్రిణం నృపం వా జనయతి గురుణావలోకితశ్చంద్రః,
సౌమ్యేనాధర్మకరం నిద్రాబహుళం చ సతత మధ్వరతమ్. 12

గురునిచేఁ జూడఁబడెనేని రాజమంత్రిగాని లేక రాజు అగును. బుధునిచేఁ జూడఁబడెనేని అధర్మము నిద్రాబహుళము, తిరుగుటయం దాసక్తిగలవాఁడు అగును.

రవిభాగే రవిదృష్టే సురోషణస్సముపలబ్ధకీర్తిధనః,
పాపో నిర్దయ ఇందో సౌరేణ ప్రాణినాం హంతా 13

చంద్రుఁడు రవినవాంశయందుండి రవిచేఁ జూడఁబడఁగాఁ బుట్టినవాఁడు రోషము కీర్తిగలవాఁడు, శనిచేఁ జూడఁబడెనేని పాపుఁడు, నిర్దయగలవాఁడు, ప్రాణులను హింసించువాఁడు అగును.

భౌమేన సువర్ణధనం ఖ్యాతం నృపసత్కృతం ప్రచండతరం,
గురుణా దృష్టో జనయతి చమూపతిం వా నరేంద్రం వా. 14

కుజునిచేఁ జూడఁబడెనేని సువర్ణము ఖ్యాతి మొదలైనవి గలవాఁడగును. గురునిచేఁ జూడఁబడెనేని సేనాపతి లేక రాజు అగును.

శుక్రేణ దృష్టమూర్తిస్సుతార్థినం మృతసుతం వాఽపి,
సౌమ్యేన దైవచింతక మితిహాసరతం చ నిధిభాజమ్. 15

శుక్రునిచేఁ జూడఁబడెనేని సుతులను గోరువాఁడు, లేక మృతసుతులు గలవాఁడు అగును. బుధునిచేఁ జూడఁబడెనేని ఆస్తికబుద్ధిగలవాఁడు, కథలయం దాసక్తి గలవాఁడగును

గురుభాగే గురుదృష్టో విశదం నృపవల్లభం విపులకీర్తిం,
జనయతి శశీ సితేన స్త్రీణాం భోగై స్సుసంయుక్తమ్. 16

చంద్రుఁడు గురునవాంశయందుండి గురునిచేఁ జూడఁబడెనేని రాజప్రియుఁడు, గొప్పకీర్తిగలవాఁడు అగును. శుక్రునిచేఁ జూడఁబడెనేని స్త్రీభోగమం దాసక్తిగలవాఁడు అగును.

బుధదృష్టో హాస్యకరం నృపప్రియం నాయకం వరూధిన్యాః,
అస్త్రాచార్యం కురుతే కుజేక్షిత స్సర్వతః ఖ్యాతమ్ 17

బుధునిచేఁ జూడఁబడెనేని హాస్యమును సేయువాఁడు రాజప్రియుఁడు, సేనానాయకుఁడు అగును కుజునిచేఁ జూడఁబడెనేని అస్త్రవిద్యయందు నేర్పుగలవాఁడు, ఖ్యాతిగలవాఁడు అగును.

దోషైర్వివిధైః ఖ్యాతం దినకరదృష్టో నరం ప్రమాణస్థం,
సౌరేణ వృద్ధశీలం బలిభిశ్చ నిరాకృతం నీచమ్. 18

రవిచేఁ జూడఁబడెనేని అనేకదోషములచే ఖ్యాతినొందినవాఁడును, శనిచేఁ జూడఁబడెనేని అలసుఁడు, ధనికులచే నిరాకరింపఁబడినవాఁడు, నీచుఁడు అగును.

సౌరాంశే శనిదృష్టః కృపణం రోగాన్వితం మృతసుతం వా,
సూర్యేణాల్పాపత్యం వ్యాధిగ్రస్తం విరూపతనుమ్ 19

చంద్రుఁడు శనినవాంశయందుండి శనిచేఁ జూడఁబడెనేని లుబ్ధుఁడు, రోగము గలవాఁడు, మృతసుతులు గలవాఁడు అగును రవిచేఁ జూడఁబడెనేని స్వల్పసంతాము గలవాఁడు, వ్యాధిగలవాఁడు, అంగహీనమైన శరీరము గలవాఁడగును.

భౌమేన నరపతిసమం స్వాఢ్యం స్త్రీదుర్భగం సుఖైర్యుక్తం,
శుక్రేణ విషమశీలం యువతిభి రవధీరితం ధీరమ్. 20

కుజునిచేఁ జూడఁబడెనేని రాజతుల్యుఁడు, ధనికుఁడు, సుఖముగలవాఁడు అగును. శుక్రునిచేఁ జూడఁబడెనేని విషమస్వభావముగలవాఁడు అగును.

సౌమ్యేన పాపనిరతం కుత్సితచరితం శశీ సదాదృష్టః,
గురుణా స్వకర్మనిరతం కురుతే పురుషం న చోదాత్తమ్. 21

బుధునిచేఁ జూడఁబడెనేని పాపకర్మయం దాసక్తిగలవాఁడు, ఆచారహీనుఁడు అగును. గురునిచేఁ జూడఁబడెనేని స్వకర్మాసక్తిగలవాఁడు అగును.

వర్గోత్తమే స్వకీయే పరకీయనవాంశకే చ దృష్టిఫలం,
పుష్టం మధ్యం స్వల్పఁ విపరీతం స్యా దనిష్టఫలమ్. 22

చంద్రుఁడు వర్గోత్తమనవాంశయందుండెనేని గ్రహదృష్టిజనకమైన శుభఫలము సంపూర్ణముగ గలుగును. స్వనవాంశయందుండెనేని మధ్యమముగ నుండును పరనవాంశయందుండెనేని శుభఫలము కొంచెముగ నుండును. పరనవాంశ యందున్న చంద్రునికి చెప్పిన అనిష్టఫలము విశేషముగ నుండును. స్వనవాంశయందున్న చంద్రునికి చెప్పిన అనిష్టఫలము మధ్యమముగ జరుగును. వర్గోత్తమాంశయందున్న చంద్రునికి చెప్పిన అనిష్టఫలము స్వల్పముగ జరుగును.

రాశిఫలం యద్దృష్టం పూర్వైః కథితం గ్రహైశ్చశాంకస్య,
తస్యనిరోధో దృష్టో యద్యంశపతి ర్బలీ భవతి. 23

ఏనవాంశఫలము, రాశిఫలము పూర్వము చెప్పఁబడినవో, ఆఫలములు ఏ నవాంశయందు చంద్రుఁడుండునో ఏరాశియందు చంద్రుఁడుండునో ఆనవాంశాధిపతి, రాశ్యధిపతి బలవంతులై యుండిరేని ఆరాశియందున్న, నవాంశయందున్న చంద్రుని

అంశపతే శ్చంద్రస్య చ ఫలం వినిశ్చిత్య దర్శనకృతాని,
కథితాని యవనవృద్ధాః ఫలాని సమ్య గ్వ్యవస్యంతి 24

చంద్రుఁడున్న నవాంశాధిపతియొక్కయు, చంద్రునియొక్కయు, రవ్యాది దృష్టికృతమైన ఫలమును యవనమతానుసారముగ నిశ్చయించి నాచేఁ జెప్పఁబడినవి.

ఇతి చతుర్వింశోఽధ్యాయః.

---

కుజ చారమును దెలుపు ఇరువదిరైదవ యధ్యాయము.

తేజస్వీ సత్యయుత శ్శూరః క్షితిపోఽథవా రణశ్లాఘు,
సాహసకర్మాభిరత శ్చమూపురగ్రామబృందపతిః. 1
రాభసికో దానరతః ప్రభూతగోఽజావిధాన్యకరః,
భౌమే క్రియే ప్రచండో బహుయువతిరతో భవేత్పురుషః 2

జననకాలమున కుజుఁడు మేషమున నుండఁగా కలిగినవాఁడు తేజోవంతుఁడు, సత్యవాది, శూరుఁడు,రాజు లేక యుద్ధమందు ప్రసిద్ధుఁడు,సాహసకర్మలఁజేయువాఁడు, సేనలకు పట్టణములకు గ్రామసమూహములకు నధిపతి, త్వరపడెడు స్వభావముగలవాఁడు, దానశీలుఁడు, ఎక్కువ ఆవులు మేకలు గొఱ్ఱెలు కలవాఁడు, ధాన్యవంతుఁడు, ప్రచండుఁడు, అనేకస్త్రీలను రమించువాఁడు అగును.

సాధ్వీవ్రతభంగకరః ప్రభాషణో మందధనపుత్రః,
ద్వేష్యో బహుభరణపరో విస్రంభస్థితివిహీనశ్చ. 3
ప్రోద్ధతవేషక్రీడో బహుదుష్టవచాః కుజే వృషభసంస్థే,
సంగీతరతః పాపో బంధువిరుద్ధః కులోత్సాదీ 4

కుజుఁడు వృషభమున నుండెనేని పతివ్రతల భంగముచేయువాఁడు, మిక్కిలి మాటలాడువాఁడు, ధనము పుత్రులు లేనివాఁడు, ద్వేషింపఁబడువాఁడు, అనేకమందిని పోషించువాఁడు, నమ్మకమైన ఉనికిలేనివాఁడు, గొప్పవగువేషము క్రీడలుగలవాఁడు, దుర్భాషలాడువాఁడు, సంగీతమందు దాసక్తిగలవాఁడు, పాపుఁడు, బంధువిరోధి, కులమునకు చెఱుపుచేయువాఁడు నగును.

కాంతః క్లేశసహిష్ణు ర్బహుశ్రుతః కావ్యవిధినిపుణః,
నానాశిల్పకలాసు చ నిపుణో బహుశో విదేశగమనరతః. 5
ధర్మపరో నిపుణమతి ర్హితానుకూలస్సుతేషు సుహృదాం చ,
మిథునస్థే క్షితిపుత్రే భవతి ప్రచురక్రియాసు రతిః. 6

మిథునమున నంగారకుఁ డుండఁగాఁ గలిగిన అందకాఁడు, కష్టములసహించు వాఁడు, పండితుఁడు, కావ్యరచనానిపుణుఁడు, అనేకశిల్పవిద్యలయం దారితేరినవాఁడు, విదేశగమనాసక్తుఁడు, ధార్మికుఁడు, బుద్ధికుశలముకలవాఁడు, స్నేహితులకు పుత్త్రులకు ననుకూలుఁడు, అనేకకర్మలం దాసక్తుఁడు నగును

పరగృహనివాసశీలో వైకల్యరుగర్దితః కృషిధనశ్చ,
బాల్యేచ రాజభోజనవస్త్రైపుష్టః పరగృహాన్నాశీ 7
సవిలాసయతో ధనవాన్ పునఃపునర్వృద్ధివేదనార్తశ్చ,
కర్కటకే క్షితితనయే భవతి మృదు స్సర్వతో దీనః. 8

కర్కటకమున కుజుఁ డుండఁగాఁ బుట్టినవాఁడు పరగృహములనుండువాఁడు, పిచ్చివాఁడు, వ్యవసాయము చేయువాఁడు, బాల్యమున రాజభోజన రాజవస్త్రములఁ గోరువాఁడు, ఇతరులనింటభుజించువాఁడు, విలాసవంతుఁడు, ధనవంతుఁడు, మాటిమాటికి వృద్ధివేదనచే బాధపడువాఁడు, మృదువైనవాఁడు, దీనుఁడు నగును.

అసహః ప్రచండశూరః పరస్వసంతానసంగ్రహణశీలః,
అటవీనివాసగోకులమాంసరుచిస్స్యాన్మృతప్రథమదారః 9
వ్యాళమృగోరగహంతా నపుత్రవాన్ ధర్మఫలహీనః,
భౌమే హరౌ సుపత్వః క్రియోద్యతస్స్యాద్వపుష్మాంశ్చ 10

కుజుఁడు సింహమున నుండగా కలిగిన అసహనశీలుఁడు, శూరుఁడు, ఇతరుల ధనము సంతానము నపహరించువాఁడు, అరణ్యములనివసించుట గోమాంసభోజనము కోరువాఁడు, మొదటిభార్య మృతినొందువాఁడు, సర్పముల మృగముల హింసించువాఁడు, పుత్రహీనుఁడు, ధర్మఫలము లేనివాఁడు, బలవంతుఁడు, పనులపట్టుదలగలవాఁడు, లావైన వాఁడు నగును.

పూజ్య స్సతాం మతిధనో రతగీతధనో మృదుప్రియాభాషీ,
వివిధవ్యయోఽల్పశౌర్యో విద్వాన్ భవతి ప్రణీతపార్శ్వశ్చ. 11
అపి తేభ్యోఽర్జనభీరుర్వేదస్మృతిధర్మవాన్ సుబహుశిల్పః,
కన్యాయాం భూతనయే స్నానవిలేపనరతః కాంతః. 12

కన్యయం దంగారకుఁ డుండగాఁ బుట్టినవాఁడు సత్పురుషులచేఁ బూజింపఁబడు వాఁడు, ధనవంతుఁడు, సురతగానములచే ధనము నార్జించువాఁడు, మృదువుగను ప్రియముగను సంభాషించువాఁడు, అనేకవిధముల వ్యయము చేయువాఁడు, శౌర్యహీనుఁడు, విద్వాంసుఁడు, ఎల్లవారు తనకు నొదిగియుండ చరించువాఁడు, శత్రుభయముచే సంపా

డింప భయపడువాఁడు, శ్రుతిస్మృతివిహితమగుమార్గమున చరించువాఁడు, శిల్పి, స్నానము మైపూత వీనియందు దాసక్తిగలవాఁడు నగును.

అధ్వనిరత స్సుపుణ్యః ప్రసక్తవాక్యోఽవికత్థన స్సుభగః,
హీనాంగ స్స్వల్పజన స్సంగ్రామేప్సుః పరోపభోగీ చ 13
యోషిద్గురుమిత్రాణాం మనోరమో నష్టపూర్వదారశ్చ,
శౌండకవేశ్యానికటే సంప్రాప్తధనక్షయ స్తులిని భౌమే 14

కుజుఁడు తులయందుండఁగా కలిగినవాఁడు యాత్రలఁజేయువాఁడు, పుణ్యాత్ముఁడు, నచ్చఁగలమాటలుగలవాఁడు, ఆత్మశ్లాఘచేసుకొననివాఁడు, సుందరుఁడు, అంగవికలుఁడు, అల్పపరిజనముగలవాఁడు, యుద్ధమునుకోరువాఁడు, ఇతరధనము ననుభవించువాఁడు, స్త్రీలకు మిత్రులకు గురువులకు ననుకూలుఁడు, మొదటిభార్య నశించినవాఁడు, మద్యశాలల వేశ్యాగృహముల ధననాశము చేసుకొనువాఁడు నగును.

వ్యాపారశ్రుతిసత్వశ్చోరసమూహాధిపః క్రియానిపుణః,
యుద్ధోత్సుకోఽతిపాపో బహ్వపరాధీ చ వైరకృతః 15
ద్రోహవధాహితబుద్ధిః ప్రసూచకో భూమిపుత్రయువతీశః,
వృశ్చికగే భూపుత్రే విషాగ్నిశస్త్రవ్రణై స్తప్తః. 16

వృశ్చికమున నంగారకుఁ డుండఁగా కల్గినవాఁడు వ్యాపారము వేదము బలము గాఁగలవాఁడు, చోరాధిపతి కార్యదక్షుఁడు యుద్ధాసక్తిగలవాఁడు, మిక్కిలి పాపుఁడు, అనేకాపరాధములనొనర్చువాఁడు, శత్రువులకు నపకృతిఁజేయువాఁడు, ద్రోహము చేయుట చంపుట చాడీలఁజెప్పుటయం దభిరుచిగలవాఁడు, భార్యాపుత్త్రులు భూములు గలవాఁడు, విషము అగ్ని ఆయుధములు వీనిచే బాధనొందువాఁడు నగును.

బహుభిః క్షతైః కృశాంగో నిష్ఠురవాక్యశ్శఠః పరాధీనః,
రథగజపదాతియోధీ రథేన శరధారకోఽథ పరసైన్యే. 17
విపులశ్రమైశ్చ సుఖతః పరస్పరం క్రోధనష్టసుఖవిత్తః,
కార్ముకసంస్థే వక్రే గురుష్వసక్తః పుమాన్ భవతి. 18

అంగారకుఁడు ధనుస్సున నుండఁగాఁ బుట్టినవాఁడు అనేకగాయములచేఁ జిక్కిన దేహముగలవాఁడు, కఠినవాక్యములుగలవాఁడు, శఠుఁడు, ఇతరుల కధీనుఁడు, రథములు ఏనుఁగులు కాల్బలము రథములు ధనుర్బాణములు వీనిచే శత్రువుల నెదుర్చువాఁడు, అనేకకష్టములవలన సుఖముల ననుభవించుటవలన క్రోధమువలన నశించిన ధనసుఖముల వాఁడు, గురువులయెడ విధేయతలేనివాఁడు నగును.

ధనాఢ్యో విత్తాహర్తా సుఖభోగసమన్వితో భవతి సుస్థః,
శ్రేష్ఠమతిః ప్రఖ్యాత స్సేనానాథో నరేంద్రో వా. 19
సద్యః ప్రతిరణవిజయీ స్వబంధువిషయస్థితస్స్వతంత్రశ్చ,
ఆరక్షక స్సుశీలః కుజే స్వతుంగే బహూపచారరతః. 20

కుజుఁడు మకరమున నుండగాఁ గలిగిన ధన్యుఁడు ధనహరణము చేయువాఁడు, సుఖించువాఁడు. నిలుకడ, మంచిబుద్ధిగలవాఁడు, ప్రసిద్ధుఁడు, సేనాపతియో లేక రాజో యుద్ధమున జయించువాఁడు, తనబంధువులున్నచోట నుండువాఁడు, స్వతంత్రుఁడు, రక్షించువాఁడు, మంచినడతగలవాఁడు, అనేకోపచారములచే నుపచరింపఁబడువాఁడు నగును

ప్రశ్రయశౌచవిహీనో వృద్ధాకార స్సుదుర్గతి ర్మరణే,
మాత్సర్యాసూయానృతవాగ్దోషై రపహృతార్థ శ్చ. 21
రోమశగాత్రో వికృతో ద్యూతాద్యాహృతధనః కువేషధరః,
దుఃఖసమాహృతవృత్తిః పానరుచి ర్దుర్భగః కుజే కుంభే 22

కుంభమున కుజుఁ డుండగాఁ గల్గినవాఁడు వినయము, పరిశుభ్రతలేనివాఁడు, ముసలివానివలె నుండువాఁడు, మరణకాలమున కష్టములనొందువాఁడు, మాత్సర్యము అసూయ అబద్ధముపల్కుట మాటతప్పుట మున్నగువానిచే ధనము నష్టమైనవాఁడు, వంటినిండా రోమములుగలవాఁడు, వికృతుఁడు, జూదము మున్నగువానిచేఁ గోలుపోయినధనముగలవాఁడు, నీచవేషములధరించువాఁడు, దుఃఖముగా జీవించువాఁడు, పానశీలుఁడు, అందములేనివాఁడు నగును.

రోగార్తో మందసుతః ప్రవాసశీలస్స్వబంధుపరిభూతః,
మాయావంచనదోషై ర్హృతసర్వస్వో విషాదీ చ. 23
జిహ్మోఽతితీక్ష్ణశోకో గురుద్విజావజ్ఞక స్సదాహీనః,
ఈప్సితవేత్తా జ్ఞాతా స్తుతిప్రియోంత్యే కుజే ఖ్యాతః 24

కుజుఁడు మీనమందుండఁగా కలిగినవాఁడు రోగపీడితుఁడు, అల్పసుతులుగలవాఁడు, ఇతరత్రవాసము చేయువాఁడు, బంధువులచే నవమానమందువాఁడు, కపటము చేత మోసము చేత కలధనమంతయుం పోఁగొట్టుకొనువాఁడు, దుఃఖవంతుఁడు, కపటి, గురువుల బ్రాహ్మణుల నవమానము చేయువాఁడు, హీనుఁడు, కోరికఁ దెలియువాఁడు, చక్కఁగా గుర్తెఱిఁగినవాఁడు, స్తుతిప్రియుఁడు నగును.

## స్వక్షేత్రగత కుజునియొక్క దృష్టిఫలము.

ధనదారపుత్రవంతం నృపసచివం దండనాయకం ఖ్యాతం,
నృపతి ముదారం కురుతే దినేశ్వరనిరీక్షితః కుజస్వర్క్షే. 25

జననకాలమున కుజుఁడు స్వక్షేత్రమున (మేషము-వృశ్చికము) నుండి రవిచేఁ జూడఁబడెనేని ధనము భార్యాపుత్రులుగలవాఁడు, రాజమంత్రి సేనాపతి ప్రసిద్ధుఁడు రాజు ఉదారుఁడు నగును

మాతృరహితం క్షతాంగం స్వజనద్వేష్యం చ మిత్రరహితం చ,
స్వగృహేఽస్ర క్శశిదృష్ట స్సేర్ష్యం కన్యాప్రియం కురుతే 26

కుజుఁడు స్వక్షేత్రమున నుండి చంద్రునిచేఁ జూడఁబడెనేని తల్లిలేనివాఁడు, గాయములుగల శరీరముగలవాఁడు, బంధుజనద్వేష్యుఁడు, స్నేహితులుఁలేనివాఁడు, ఈర్ష్యగలవాఁడు, కన్యాప్రియుఁడు నగును.

పరధనహరణే నిపుణం చానృతకం కామదేవభక్తం చ,
కురుతే స్వభేజ్ఞదృష్టో ద్వేష్యం వేశ్యాపతిం భౌమః 27

కుజుఁడు స్వక్షేత్రమున నుండి బుధునిచేఁ జూడఁబడెనేని ఇతరులసొత్తు నపహరించువాఁడు, అబద్ధములాడువాఁడు, కాముకుఁడు, ద్వేషయుక్తుఁడు, వేశ్యలభర్త యగును.

ప్రాజ్ఞం మధురం సుభగం మాతృపితృవల్లభం ధనసమృద్ధం,
అనుపమమీశ్వరమాఢ్యం త్రిదశగురునిరీక్షితోఽవనేః పుత్రః 28

కుజుఁడు స్వక్షేత్రమున గురునిచేః జూడఁబడెనేని ప్రాజ్ఞుఁడు, మధురముగా మాటలాడువాఁడు, సొగసుగాఁడు, తల్లిదండ్రుల కనురక్తుఁడు, ధనసమృద్ధిగలవాఁడు, ప్రభువు నగును.

స్వగృహేఽసృక్సితదృష్టస్త్రీహేతోర్బంధభాగినం కురుతే,
అసకృత్సకృచ్ఛ విభవం స్త్రీహేతో రార్జితం చాపి. 29

కుజుఁడు స్వక్షేత్రమందుండి శుక్రునిచేఁ జూడఁబడెనేని స్త్రీమూలముగ బంధనము గలవాఁడు, స్వల్పవిభవము గలవాఁడు, స్త్రీమూలముగ ధనమార్జించువాఁడు నగును.

చోరవిఘాతే శూరం నిర్వీర్యం స్వజనపరిహీనం,
అన్యస్త్రీభర్తారం జనయతి సౌరేక్షితస్స్వభే భౌమః. 30

కుజుఁడు స్వక్షేత్రమందుండి శనిచేఁ జూడఁబడెనేని చోరులను శిక్షించువాఁడు, వీర్యరహితుఁడు, బంధువులులేనివాఁడు, అన్యస్త్రీలకు భర్త అగును.

## శుక్రక్షేత్రగత కుజునియొక్క దృష్టిఫలము.

వనపర్వతేషు రమతే రామాద్విష్టో భవేద్బహువిపక్షః,
సితభే రవిణా దృష్టే ప్రచండకోపః కుజే ధీరః 31

కుజుఁడు శుక్రస్థానము (వృషభము-తుల) న నుండి రవిచేఁ జూడఁబడెనేని వనములు పర్వతములు చరించువాఁడు, స్త్రీద్వేష్యుఁడు, అనేకశత్రువులుగలవాఁడు, మిక్కిలి కోపముగలవాఁడు నగును

మాతురపథ్యో విషమో బహుయువతీనాం పతిః ప్రియ స్తాసాం,
శుక్రగృహే శశిదృష్టే రణభీరు ర్జాయతే భౌమే. 32

కుజుఁడు శుక్రక్షేత్రమున నుండి శశిచేఁ జూడఁబడెనేని తల్లికి చెఱుపుచేయువాఁడు, మెడతనముగలవాఁడు, అనేకస్త్రీలకు భర్త, వారలప్రేమకు పాత్రుఁడు, రణభీరువు నగును.

కలహప్రియో మృదువచా మృదుకాయో మందపుత్రధనః,
సితభే భవతి చ భౌమే బుధదృష్టే శాస్త్రవిత్పురుషః. 33

అంగారకుఁడు శుక్రస్థానమున నుండఁగా బుధుఁడు చూచిన కలహశీలుఁడు, మృదువులగు మాటలాడువాఁడు, మెత్తనిశరీరముగలవాఁడు,ధనము పుత్త్రులులేనివాఁడు, శాస్త్రజ్ఞానముకలవాఁడు నగును.

వాదితగీతవిధిజ్ఞః సౌభాగ్యయుతస్స్వబంధుదయితశ్చ,
శుక్రభవనే క్షితిసుతే దృష్టే గురుణా భవే త్సీఫతః 34

అంగారకుఁడు శుక్రస్థానమున నుండి బృహస్పతిచేఁ జూడఁబడెనేని వాద్యము గానము తెలిసినవాఁడు, సౌభాగ్యవంతుఁడు, బంధుప్రియుఁడు, బలిసినవాఁడు నగును.

నృపమంత్రీ నృపదయిత స్సేనానాథః ప్రసిద్ధనామా చ,
శుక్రగృహే భవతి కుజే శుక్రేణ నిరీక్షితే సుఖితః 35

అంగారకుఁడు శుక్రక్షేత్రమున నుండి శుక్రునిచేఁ జూడఁబడెనేని రాజమంత్రి, రాజప్రియుఁడు, సేనాపతి, ప్రసిద్ధుఁడు, సుఖవంతుఁడు నగును.

సుఖభాక్ ఖ్యాతో ధనవాన్మిత్రస్వజనైర్వృతః కుజే విద్వాన్,
శ్రేణిపురగ్రామాణా మధిప స్సితభే చ శనిదృష్టే. 36

కుజుఁడు శుక్రక్షేత్రమున నుండి శనిచేఁ జూడఁబడెనేని సుఖవంతుఁడు, ప్రసిద్ధుఁడు, మిత్త్రులు, బంధువులుగలవాఁడు, విద్వాంసుఁడు, అనేకపట్టణములకు గ్రామములకు నధిపతియు నగును.

బుధక్షేత్రమందున్న కుజునియొక్క దృష్టిఫలము

విద్యాధనశౌర్యయుతం గిరివనదుర్గప్రియం మహాసత్వం,
బుధభవనే రక్తాంగో జనయతి దృష్టస్సదా రవిణా. 37

కుజుఁడు బుధక్షేత్రము (మిథునము - కన్య)నుండి రవిచేఁ జూడఁబడెనేని విద్య ధనము శౌర్యముకలవాఁడు, కొండలు అరణ్యములు దుర్గములు అన్న ప్రియమైనవాఁడు, బలవంతుఁడు, ఎఱ్ఱనిశరీరముగలవాఁడు నగును.

కన్యాపురరక్షకరం యువతిపతిం సద్వినీత మతిసుభగం,
జ్ఞగృహే నృపగృహపాలం జనయతి చంద్రేక్షితో భౌమః. 38

కుజుఁడు బుధక్షేత్రమునుండి శశిచేఁ జూడఁబడెనేని కన్యాంతఃపురపాలకుఁడు, యువతియగుభార్యగలవాఁడు, వినయవంతుఁడు, సౌందర్యవంతుఁడు, ద్వారపాలకుఁడు నగును.

లిపిగణితకావ్యకుశలం బహుభాషిణ మనృతమధురవాక్యం చ,
దూతం బహుదుఃఖసహం జనయతి వక్రో బుధేక్షితో జ్ఞర్క్షే 39

బుధస్థానమున కుజుఁడుండగా బుధుఁడు చూచెనేని లేఖనము గణితము కవిత్వము నెఱిఁగినవాఁడు, వదరుబోతు, మధురముగా నబద్ధములఁబలుకువాఁడు,దూత, అనేకదుఃఖములసహించువాఁడు నగును.

రాజపురుషం ప్రకాశం దౌత్యేన విదేశగం నరం కురుతే,
సర్వక్రియాసు కుశలం బుధరాశౌ నాయకం చ గురుదృష్టః. 40

బుధస్థానమున నంగారకుఁ డుండి గురునిచేఁ జూడఁబడెనేని రాజపురుషుఁడు, ప్రసిద్ధుఁడు, సేవకత్వమున విదేశములకేఁగినవాఁడు, అన్నిపనులనేర్పరి, నాయకుఁడు నగును.

శుక్రేణ దృశ్యమాన స్త్రీనృకృత్యకరం సమృద్ధసుభగం చ,
బుధభవనే రక్తాంగః కురుతే వస్త్రాన్నభోక్తారం 41

బుధక్షేత్రమున నంగారకుఁ డుండగా శుక్రుఁడు చూచెనేని ఆడపనులుచేయువాఁడు, మంచిసౌందర్యవంతుఁడు, ఎఱ్ఱనిశరీరముగలవాఁడు, మంచివస్త్రములు భోజనము గలవాఁడగును.

ఆకరగిరిదుర్గరతం కర్షక మతిదుఃఖభాగినం కురుతే,
అతిశూరమతిచ మలినం యమేక్షితో బుధగృహే విభవహీనం. 42

జననకాలమున కుజుఁడు బుధక్షేత్రమునసుండి శనిచేఁ జూడఁబడెనేని నిధులు దుర్గములు వీనియందుండువాఁడు, వ్యవసాయము చేయువాఁడు, మిక్కిలి దుఃఖవంతుఁడు, కూరుఁడు, నీచుఁడునగును.

చంద్రక్షేత్రమందున్న కుజుని దృష్టిఫలము.

పిత్తరుగర్దితదేహ స్తేజస్వీ దండనాయకో ధీరః,
చంద్రగృహస్థే భౌమే దినకరదృష్టే భవేత్పురుషః 43

కుజుఁడు చంద్రక్షేత్రమున నుండి రవిచేఁ జూడఁబడుచుండగా జన్మించినవాఁడు పైత్యరోగి, తేజోవంతుఁడు, దండనాయకుఁడు, ధైర్యవంతుఁడు నగును

బహుభిర్వ్యాధిభిరార్తో నీచాచారో విరూపదేహశ్చ,
శశిరాశౌ భూతనయే శశినా దృష్టే సశోకశ్చ. 44

కుజుఁడు చంద్రక్షేత్రమున చంద్రునిచేఁ జూడఁబడగాఁ గల్గినవాఁడు అనేక వ్యాధులచే బాధితుఁడు, తక్కువయాచారములుగలవాఁడు, వికారమైనశరీరముగల వాఁడు, శోకవంతుఁడు నగును.

మలినః పాపాచారః క్షుద్రకుటుంబో బహిష్కృతః స్వజనైః,
కర్కటకే బుధదృష్టే క్షితితనయే భవతి నిర్లజ్జః. 45

చంద్రక్షేత్రమున నున్నకుజుఁడు బుధునిచేఁ జూడఁబడెనేని మలినుఁడు, దురాచారపరాయణుఁడు, నీచకుటుంబముగలవాఁడు, బంధుజనబహిష్కృతుఁడు, లజ్జలేని వాఁడు అగును.

విఖ్యాతో నృపమంత్రీ విద్వాం స్త్యాగాన్వితో భవేద్ధన్యః,
గురుదృష్టే శశిభవనే భోగై శ్చ వివర్జితో వక్రే. 46

చంద్రక్షేత్రమున నున్నకుజుఁడు బృహస్పతిచేఁ జూడఁబడెనేని జాతకుఁడు, ప్రసిద్ధుఁడు, రాజమంత్రి, విద్వాంసుఁడు, త్యాగి, ధన్యుఁడు, భోగహీనుఁడు నగును.

స్త్రీసంగాన్నష్టధనం పరిభూతస్త్రీకృతై స్తథా దోషైః,
కర్కటకే క్షితిపుత్రే సితదృష్టే స్యా ద్విపన్నధనః. 47

చంద్రక్షేత్రమున నున్నకుజుఁడు జననకాలమున శుక్రునిచేఁ జూడఁబడెనేని స్త్రీసాంగత్యమువలన ధనము ను పోఁగొట్టుకొనువాఁడు, స్త్రీవలనవైన అపరాధములచే నవమానములపొందువాఁడు, దరిద్రుఁడు నగును.

జలసంయానో విధనః క్షితిపాలసమానలలితచేష్టశ్చ,
శశిగృహసంస్థే భౌమే యమేక్షితే స్యాత్సదాకాంతః 48

కుజుఁడు చంద్రక్షేత్రమున నుండి శనిచేఁ జూడఁబడగాఁ బుట్టినవాఁడు నీటిమీద ప్రయాణముచేయువాఁడు, దరిద్రుఁడు, రాజులవలె సుకుమారములగు పనులఁజేయు వాఁడు ఎల్లపుడు అందమైనవాఁడును నగును

## రవిక్షేత్రమందున్న కుజుని దృష్టిఫలము.

ప్రణతానాం హితకారి మిత్రైస్స్వజనైశ్చ సంయుతశ్చండః,
గోకులవనాద్రిచారీ సింహే భౌమే తరణి దృష్టే. 49

కుజుఁడు రవిక్షేత్రమగు సింహమునుండి రవిచేఁ జూడఁబడెనేని తన్నాశ్రయించినవారికి మేలుచేయువాఁడు, బంధువులు మిత్రులుగలవాఁడు, మిక్కిలి కోపముగల వాఁడు, పశువులమందలలో నరణ్యములలో పర్వతములలోను చరించువాఁడు నగును.

మాతుర్నశుభో మతిమాన్ కఠినశరీరో విపులకీర్తిః,
కేసరిభవనే భౌమే శశినా దృష్టేఽంగనాప్తార్థః. 50

కుజుఁడు రవిక్షేత్రమునుండి శశిచేఁ జూడఁబడెనేని తల్లి కపాయమును గలుగఁ జేయువాఁడు, బుద్ధిమంతుఁడు, కఠినదేహముగలవాఁడు, మిక్కిలి కీర్తిగలవాఁడు, స్త్రీ వలన పొందఁబడిన ధనముగలవాఁడును నగును.

బహుశిల్పజ్ఞో లుబ్ధః కావ్యకలాలంపటో విషమశీలః,
పంచముఖభవనే భౌమే బుధేన దృష్టేఽతినిపుణశ్చ. 51

కుజుఁడు ఐదవదగు రవిక్షేత్రమున నుండి బుధునిచేఁ జూడఁబడెనేని శిల్పశాస్త్రమును బాగా నెఱిఁగినవాఁడు, లోభి, కావ్యముల చతుష్షష్టికళల అసక్తిగలవాఁడు, వక్రమగు నడవడిగలవాఁడు, మిక్కిలి నిపుణుఁడు నగును

భూపతిసమీపవర్తీ విద్యాచార్యో విశుద్ధబుద్ధిశ్చ,
అవనిసుతే సింహస్థే గురుణా దృష్టే చమూనాథః. 52

అంగారకుఁడు రవినివాసమగు సింహమునుండి బృహస్పతిచేఁ జూడఁబడెనేని రాజుగారిసమీపముననుండువాఁడు, విద్యలబోధించు నుపాధ్యాయుఁడు, నిర్మలమగుబుద్ధి గలవాఁడు సేనాపతియు నగును.

వివిధస్త్రీభోగయుతస్త్రీసుభగో నిద్యయావనో హృష్టః,
లేయగృహే రక్తాంగే సితేన దృష్టే భవే జ్ఞాతః. 53

కుజుఁడు సింహమున నుండి శుక్రునిచేఁ జూడఁబడెనేని పలువిధములగుస్త్రీలతో సంభోగించువాఁడు, స్త్రీలమాపుల కందకాఁడు, తఱఁగనియౌవనముగలవాఁడు, సంతోషవంతుఁడు నగును.

వృద్ధాకారో నిస్వః పరవేశ్మభ్రమణశీలవాన్ దుఃఖీ,
దినకరరాశౌ రుధిరే దినకరతనయేన సందృష్టే 54

కుజుఁడు సింహమున నుండి శనిచేఁ జూడఁబడెనేని పడుచుతనముననే ముసలివాని వలె నుండువాఁడు, దరిద్రుఁడు, పొరుగిండ్లతిరుగువాఁడు, దుఃఖవంతుఁడు నగును.

గురుక్షేత్రమందున్న కుజదృష్టిఫలము.

లోకనమస్యం సుభగం వనగిరిదుర్గేషు లబ్ధగృహవాసం,
సురగురుభవనే భౌమః కరోతి రవిణేక్షితః క్రూరమ్. 55

కుజుఁడు గురుక్షేత్రమున నుండి రవిచేఁ జూడఁబడెనేని లోకమందంతట పూజింపఁబడువాఁడు, సౌందర్యవంతుఁడు, అరణ్యముల పర్వతముల దుర్గముల నివసించు వాఁడు, క్రూరుఁడు నగును.

వికలం కలహప్రాయం ప్రాజ్ఞం రుధిరః కరోతి శశిదృష్టః,
విద్వాంసం గురుభవనే నృపతివిరుద్ధం సదాపురుషమ్. 56

కుజుఁడు గురుస్థానమందుండ శశిచేఁ జూడఁబడెనేని వికలుఁడు, పోట్లాడువాఁడు, ప్రాజ్ఞుఁడు, విద్వాంసుఁడు, రాజునకు విరోధియు నగును.

మేధావినం సునిపుణం శిల్పాచార్యం బుధేన సందృష్టః,
గురుభవనే క్షితితనయః కరోతి విద్వాంస మత్యంతమ్. 57

గురుక్షేత్రమున నున్నకుజుని బుధుఁడు చూచుచుండఁగా జననంబైన మేధావంతుఁడు, నిపుణుఁడు, శిల్పశాస్త్రవేత్త, పెద్దవిద్వాంసుఁడు నగును.

అకలత్రం సుఖరహితం రిపుభిర్ధృష్యం చ విత్తవంతం చ,
గురుభవనే గురుదృష్టో వ్యాయామపరం కుజః కురుతే. 58

గురుక్షేత్రమున నున్నకుజుని గురుఁడు చూచెనేని భార్యలేనివాఁడు, సుఖము లేనివాఁడు, శత్రువులచే నోంప శక్యముకానివాఁడు, ధనవంతుఁడు, వ్యాయామము చేయుట నలవాటుగలవాఁడు నగును.

కన్యానా మతిదయితం చిత్రాలంకారభాగిన ముదారం,
విషయపరమధికసుభగం గురుభే కావ్యేక్షితః కుజః కురుతే. 59

కుజుఁడు గురుక్షేత్రమున నుండఁగా శుక్రుఁడు చూచెనేని కన్యకలకు మిక్కిలి ప్రియమునుగల్గించువాఁడు, చిత్రములగు అలంకారములుగలవాఁడు, ఉదారుఁడు, విషయశీలుఁడు, మిక్కిలి అందగాఁడు నగును.

గురుభేఽస్పృశ్యనిదృష్టః కుశరీర ముదార మాహవే పాపం,
అటనం సుఖలవరహితం పరధర్మరతం కుజః కురుతే. 60

కుజుఁడు గురుక్షేత్రమున నుండి శనిచేఁ జూడఁబడెనేని చెడ్డదేహముగలవాఁడు, ఉదారుఁడు, యుద్ధమున పనికిరానివాఁడు, దేశద్రిమ్మరి, కొంచెమైనను సుఖములేని వాఁడు, ఇతరులయాచారముల నాదరించువాఁడు నగును.

శనిక్షేత్రస్థిత కుజదృష్టిఫలము

అతికృష్ణతనుం శూరం యోషి దపత్యార్థవి స్తరైర్యుక్తం,
సూర్యేక్షితోఽతితీక్ష్ణస్సౌరగృహే భూమిజః కురుతే 61

కుజుఁడు శనిక్షేత్రమున నుండి రవిచేఁ జూడఁబడెనేని మిక్కిలి నల్లనిశరీరముగల వాఁడు, శూరుఁడు, స్త్రీ సంతానము, చాలాధనము గలవాఁడు, మిక్కిలి తీక్ష్ణమైన వాఁడు నగును

చపలమహితం జనన్యా యమభేఽలంకారభాగిన ముదారం,
అస్థిరసౌహృద మాఢ్యం జనయతి చంద్రేక్షితో వక్రః 62

శనిక్షేత్రమున కుజుఁ డుండి చంద్రునిచే చూడఁబడెనేని చపలుఁడు, తల్లి కప కారముగల్గించువాఁడు, భూషణముల ధరించువాఁడు, ఉదారుఁడు, నిలకడలేని స్నేహము గలవాఁడు, సంపన్నుఁడు నగును.

అతిమధురగమనమధనం రవితనయగృహేన నిర్వృతమసత్త్వం,
కాపటిక మధర్మపరం జనయతి బుధవీక్షితో భౌమః 63

అంగారకుఁడు శనిక్షేత్రమందుండి బుధునిచేఁ జూడఁబడెనేని అందముగా నడచు వాఁడు, దరిద్రుఁడు. సృష్టిగలవాఁడు, బలహీనుఁడు. కపటముఁజేయువాఁడు, అధర్మము నాచరించువాఁడు నగును

అవిరూపం మందగృహే నృపతిగుణసమన్వితం స్థిరారంభం,
దీర్ఘాయుషం కుమాజో గురుసందృష్టః కరోతి బంధ్వాప్తమ్ 64

కుజుఁడు శనిక్షేత్రమున నుండి గురునిచేఁ జూడఁబడెనేని, జాతకుఁడు అందవంతుఁడు, రాజగుణములుగలవాఁడు, ఆలోచించి విఘ్నములులేకుండునట్లుగా పనుల నారంభించువాఁడు, దీర్ఘాయుష్మంతుఁడు, బంధువుల కాప్తుఁడు నగును.

వివిధోపభోగమాఢ్యం శనిభే స్త్రీపోషణానురతమేవ,
శుక్రేణ దృశ్యమానో జనయతి కలహప్రియం వక్రః. 65

కుజుఁడు శనిక్షేత్రమున నుండి శుక్రునిచేఁ జూడఁబడెనేని అనేకభోగముల ననుభవించువాఁడు, సంపన్నుఁడు, స్త్రీలను పోషించువాఁడు, కలహించుస్వభావముగలవాఁడు నగును.

నృపతి మతివిత్తవంతం యువతిద్వేష్యం బహుప్రజం ప్రాజ్ఞం,
సుఖరహితం రణశౌండం కరోతి శనిభే శనీక్షితో భౌమః 66

కుజుఁడు శనిక్షేత్రమున నుండి శనిచేఁ జూడఁబడెనేని జాతకుఁడు రాజు, మిక్కిలి ధనవంతుఁడు, స్త్రీలచే ద్వేషింపఁబడువాఁడు, అనేకమంది బిడ్డలుఁగలవాఁడు, ప్రాజ్ఞుఁడు, సుఖములేనివాఁడు, యుద్ధమున వీరుఁడు కాఁగలఁడు

ఇతి పంచవింశోఽధ్యాయః

---

## బుధచారమును దెలుపు ఇరువదియాఱవ యధ్యాయము.

ప్రియవిగ్రహాస్తు వేత్తాచార్యో విటధూర్తచేష్టకృశగాత్రః,
సంగీతనృత్తనిరతో నసత్యవచనో రతిప్రియో లిపివిత్ 1
కూటకరో బహ్వాశీ బహుశ్రమోత్పన్ననష్టధనః,
బహ్వృణబంధనభాగీ చలస్థిరస్సాన్యత్క్రియే బుధే కితవః 2

జననకాలమున బుధుఁడు మేషమున నుండెనేని సౌందర్యవంతుఁడు,విద్వాంసుఁడు, అతి జారత్వముచేఁ గృశించిన దేహముగలవాఁడు, పాడుట- నాట్యమాడుట వీనియందు ఆసక్తిగలవాఁడు, అబద్ధములాడువాఁడు, సంభోగప్రియుఁడు, లేఖనము తెలిసినవాఁడు, అబద్ధపుసాక్ష్యములఁ బలుక్కువాఁడు, అధికముగా భుజించువాఁడు, అనేకకష్టములవలన ధనమును పోఁగొట్టుకొనువాఁడును, అనేకఋణములు బంధనములు పొందువాఁడు,నిలకడలేని నివాసముగలవాఁడు, జూదగాఁడు నగును

దక్షః ప్రగల్భదాతా ఖ్యాతో విజ్ఞాతవేదశాస్త్రార్థః,
వ్యాయామాంబరభూషణమాల్యాభిరతః స్థిరప్రకృతిః 3
స్ఫీతధనస్త్రీసహితః ప్రియవల్గుకథోగృహీతవాక్యశ్చ,
గాంధర్వహాస్యశీలో రతిలోలో వై బుధే వృషభే

బుధుఁడు వృషభమున నుండఁగాఁ బుట్టినవాఁడు సమర్థుఁడు, మిక్కిలి దాత, ప్రసిద్ధుఁడు, వేదశాస్త్రముల యర్థమును చక్కఁగా నెఱిఁగినవాఁడు వ్యాయామము వస్త్రములు భూషణములు పుష్పమాలికలు వీనియందు ఆసక్తిగలవాఁడు, చలింపనిస్వభావము

గలవాఁడు, అధికమగుధనము, అధికముగా స్త్రీలుకలవాఁడు, ప్రియమైన వినుట కింపైన చారిత్రముగలవాఁడు, మాటతోసివేయనివాఁడు, గాంధర్వము హాస్యముగల వాఁడు, రతియం దాసక్తిగలవాఁడు నగును.

శుభవేషః ప్రియభాషీ ప్రఖ్యాతధనో వికత్థనో మానీ,
ప్రోజ్ఝితసుఖోఽల్పరతిర్ద్విస్త్రీపుత్రో వివాదరతః 5
శ్రుతికల్పకలాభిజ్ఞః కవిస్స్వతంత్రః ప్రియః ప్రదానరతః,
కర్మరతబహుసుతమిత్రో నరమిథునస్థే బుధే భవతి. 6

బుధుఁడు మిథునమం దుండఁగాఁ బుట్టిన మంగళకరమగువేషముగలవాఁడు, ప్రియముగా మాట్లాడువాఁడు, ధనవంతుఁడని ప్రసిద్ధిగలవాఁడు, ఆత్మస్తుతిఁజేసుకొను వాఁడు, అభిమానవంతుఁడు. సుఖములవర్జించువాఁడు, అల్పరతిగలవాఁడు, ఇద్దరుస్త్రీలకు ఒకఁడే పుత్త్రుఁడుగ నగువాఁడు, వివాదముల నాసక్తిగలవాఁడు, వేదము వేదాంగమగు కల్పము నెఱిఁగినవాఁడు, కవి, స్వతంత్రుఁడు, అందఱకు నిష్టుఁడు దానశీలుఁడు, కర్మలనాచరించుటయందు శ్రద్ధగలపుత్త్రులు, మిత్త్రులు అనేకముగాఁ గలవాఁడు నగును.

ప్రాజ్ఞో విదేశనిరతస్త్రీస్వరతిగేయాదిసక్తవిత్తశ్చ,
చపలో బహుప్రలాపీ స్వబంధువిద్వేషవాదరతః. 7
స్త్రీవైరాన్నష్టధనః కుత్సితశీలో బహుక్రియాభిరతః,
సుకవిః కర్కటసంస్థే స్వవంశకీర్త్యా ప్రసిద్ధశ్చ 8

బుధుఁడు కర్కటకమున నుండగా జన్మించినవాఁడు ప్రాజ్ఞుఁడు, విదేశముల నుండు వాఁడు, స్త్రీరతి గానము వీనియందు వెచ్చించుధనముగలవాఁడు, చపలుఁడు, ఎక్కువగా మాటలాడువాఁడు, తనబంధువులతో ద్వేషము వివాదముగలవాఁడు, స్త్రీకలహము వలన నష్టమైన ధనముగలవాఁడు, కుత్సితుఁడు, అనేకకార్యములం దాసక్తిగలవాఁడు, మంచికవి, తనవంశప్రతిష్ఠచేఁ బ్రసిద్ధుఁడు నగును.

జ్ఞానకలాపరిహీనో లోకఖ్యాతో నసత్యవాక్యశ్చ,
అల్పస్మృతిశ్చ ధనవాన్సత్వవిహీనస్సహజహంతా. 9
స్త్రీదుర్భగస్స్వతంత్రో జఘన్యకర్మా బుధే భవతి పురుషః,
ప్రేష్యోఽప్రజస్తు సింహే స్వకులవిరుద్ధో జనాభిరామశ్చ. 10

బుధుఁడు సింహమున నుండగా జన్మించినవాఁడు జ్ఞానములేనివాఁడు, ప్రసిద్ధుఁడు, అసత్యవాది, జ్ఞాపకశక్తిలేనివాఁడు, ధనవంతుఁడు, దుర్బలుఁడు, తోఁబుట్టువులబాధించు వాఁడు, స్త్రీల కయిష్టుఁడు, స్వతంత్రుఁడు, నీచములగుపనులను జేయువాఁడు, దూత, సంతతిలేనివాఁడు, తనవంశమునకు విరోధి, ప్రజలకందరకు నిష్టమైనవాఁడు నగును

ధర్మప్రియోఽతివాగ్మీ చతురస్సాన్యల్లేఖ్యకావ్యజ్ఞః,
విజ్ఞానశిల్పనిరతో మధురస్త్రీష్వల్పవీర్యశ్చ 11
జ్యేష్ఠః పూజ్యస్సుహృదాం నానావినయోపచారదారరతః,
ఖ్యాతో గుణైరుదారః కన్యాయాం సోమజే బలవాన్. 12

కన్యయందు బుధుఁడుండగా జననంబైన ధర్మమం దాసక్తిగలవాఁడు, మిక్కిలి సంభాషించువాఁడు, నేర్పరి, చిత్రకర్మ కావ్యరచన తెలిసినవాఁడు, విజ్ఞానము శిల్పము నెఱిఁగినవాఁడు, అందకత్తెలం దాసక్తి, అల్పవీర్యముగలవాఁడు, పెద్దమనిషి, స్నేహితు లందరిచేతను పూజింపఁబడువాఁడు, అనేకవిధములగు వినయముతోఁ గూడిన ఉపచారములుచేయు భార్యకలవాఁడు, ప్రసిద్ధుఁడు, ఉదారుఁడు, బలవంతుఁడు నగును.

శిల్పవివాదాభిరతో వాక్చతురోర్థార్థమీప్సితవ్యయకృత్,
నానాదిక్పణ్యరతి ర్విప్రాతిథిదేవగురుభక్తః. 13
కృతకోపచారకుశల స్సుసమ్మతో దేవభక్తశ్చ,
సప్తమభవనే శశిజే శఠశ్చలక్షిప్రకోపపరితోషః. 14

బుధుఁడు తులయందుండగాఁ గలిగిన శిల్పశాస్త్రము వాదము తెలిసినవాఁడు, మాట్లాడుటయందు నైపుణ్యముగలవాఁడు, ద్రవ్యముకొఱకు ఇష్టమైనదానినెల్ల వ్యయపఱచువాఁడు, అన్నివైపుల వాణిజ్యముచేయువాఁడు, అతిథులు బ్రాహ్మణులు దేవతలు గురువులు వీరియందు భక్తిగలవాఁడు, కపటోపచారములనుచేయ సమర్థుఁడు, నలుగురికి ఇష్టమైనవాఁడు, శఠుఁడు, చంచలుఁడు, స్వల్పకాలముననే నశించుకోపము సంతోషము గలవాఁడగును.

శ్రమశోకానర్థపరస్స ద్వేష్యోఽత్యంతధర్మలజ్జశ్చ,
మూర్ఖో నసాధుశీలో లుబ్ధో దుష్టాంగనారమణః. 15
పారుష్యదండనిరతశ్చలకృద్విద్విష్టకర్మసు నిరుద్ధః,
ఋణవాన్నీచానురుచిః పరవస్త్వాదానవాన్కీటే 16

వృశ్చికమున బుధుఁడుండఁగాఁ గలిగినకష్టములు దుఃఖములు ననుభవించువాఁడు, సత్పురుషులచే ద్వేషింపఁబడువాఁడు, మిక్కిలి ధర్మము సిగ్గుకలవాఁడు, మూర్ఖుఁడు, అసత్పురుషుఁడు, లోభి జారస్త్రీలవాంఛించువాఁడు, కఠినముగా దండించువాఁడు, చంచలముగా పనుల నొనర్చువాఁడు, తనకిష్టములేని పనులచేయుటయందు నిర్బంధముగా నిరోధింపఁబడువాఁడు, ఋణవంతుఁడు, నీచపుకర్మల నాచరించువాఁడు, ఇతరులసొత్తు నపహరించువాఁడు నగును.

విఖ్యాతోదారగుణశ్శాస్త్రశ్రుతిశౌర్యశీలసమధిగతః,
మంత్రీ పురోహితోవా కులప్రధానో మహావిభవః. 17
యజ్ఞాధ్యాపననిరతో మేధావీ వాక్పటుర్వ్రతీ దాతా,
లిపిలేఖ్యాదాననిరతః కార్ముకసంస్థే బుధే జాతః. 18

ధనుస్సునందు బుధుఁ డుండగాఁ గలిగిన ప్రసిద్ధుఁడు, ఉదారగుణముగలవాఁడు, వేదము శాస్త్రము శౌర్యము మంచినడవడి గలవాఁడు, రాజమంత్రియో పురోహితుఁడో గానివంశములో ముఖ్యుఁడు, గొప్పఐశ్వర్యముగలవాఁడు, యజ్ఞములనుచేయుట వేదములను చదివించుట అనువానియం దాసక్తిగలవాఁడు, మేధావంతుఁడు, మాట్లాడనేర్పరి, వ్రతమునుపాలించువాఁడు, దాత, వ్రాయుట చిత్రలేఖనము నెఱిఁగినవాఁడు నగును

నీచో మూర్ఖష్షండః పరకర్మకరః కులాదిగుణహీనః,
నానాదుఃఖపరీతస్స్వప్నవిహారాదిశీలశ్చ 19
పిశున స్త్వసత్యచేష్టో బంధువిముక్తోత్యసంస్థితాత్మా చ,
మలినోభయసంచలితో దిష్టో మకరే బుధే పురుషః 20

బుధుఁడు మకరమున నుండగాఁ గలిగిన నీచుఁడు, మూర్ఖుఁడు, నపుంసకుఁడు, ఇతరులపనులను చేయువాఁడు, కులము శీలము మున్నగుగుణములుకలవాఁడు, అనేక దుఃఖములుకలవాఁడు, కలవరించుట స్వేచ్ఛగా విహరించుట గలవాఁడు, చాడీలను జెప్పువాఁడు, అబద్ధపుపనులను చేయువాఁడు, బంధువులచే వదలిపెట్టఁబడినవాఁడు, నిలకడ లేనివాఁడు, మలినుఁడు, భయముచే చంచలమగువాఁడు కాఁగలఁడు.

వాగ్బుద్ధికర్మనిరతః ప్రకీర్ణధర్మార్థవర్గవిహితార్థః,
పరపరిభూతో నశుచి శ్శీలవిహీన స్తథాఽజ్ఞశ్చ. 21
అతిదుష్టదారశత్రుర్భోగై స్త్యక్తో ఘటే వివాగ్భవతి,
అతిదుర్భగోఽతిభీరుః క్లీబో మలినోఽవిధేయశ్చ. 22

బుధుఁడు కుంభమున నుండఁగా గలిగిన వాక్కర్మలగు సంగీతము శాస్త్రార్థము మున్నగువానియందు బుద్ధికర్మలగు కవిత్వము అవధానములు మున్నగువానియందును నాసక్తిగలవాఁడు, ప్రకీర్ణధర్మములు గలవాఁడు, అర్థముతక్క మిగిలిన పురుషార్థముల సంపాదించువాఁడు, శత్రువులచే నవమానమును పొందువాఁడు, అపరిశుద్ధుఁడు, మంచి నడవడిలేనివాఁడు, అజ్ఞుఁడు, మిక్కిలి దుష్టురాలగుభార్యకలవాఁడు, భోగవిహీనుఁడు, నలుగురిలో వ్యర్థముగా వివాదము చేయువాఁడు, కడుకురూపి, మిక్కిలి భయశీలుఁడు, నపుంసకుఁడు, మలినుఁడు, వినయము లేనివాఁడు నగును.

ఆచారశౌచనిరతో దేశాంతరగోఽప్రజో దరిద్రశ్చ,
శుభయువతిః కృతిసాధుస్నతాం చ సుభగో విధర్మరతః. 23
సూచ్యాదికర్మకుశలో విజ్ఞానశ్రుత్యతికలావియుక్తశ్చ,
పరధనసంచయదక్షో మీనే శశిజేఽధనః ప్రకీర్ణశ్చ. 24

బుధుఁడు మీనమున నుండఁగాఁ బుట్టినవాఁడు ఆచారము పరిశుభ్రత మొదలగు వానియం దాసక్తిగలవాఁడు, విదేశముల నుండువాఁడు, సంతానములేనివాఁడు, దరిద్రుఁడు, మంగళకరియగు భార్యగలవాఁడు, మంచికృత్యముల నొనర్చువాఁడు, సత్పురుషులమనములకు నిష్టుఁడు, ఇతరధర్మములం దాసక్తుఁడు, కుట్టుట మొదలగునవి నెఱిఁగినవాఁడు, ప్రసిద్ధుఁడు, వేదము చతుష్షష్టికళలు అనువీని నెఱుఁగనివాఁడు, ఇతరుల ధనము నపహరించుటలో సమర్థుఁడు, ప్రకీర్ణమగువర్తనముగలవాఁడు నగును.

కుజక్షేత్రమందు బుధదృష్టిఫలము.

సత్యవచనం సుఖాఢ్యం భూపతిసత్కారసత్కృతం మనుజం,
కురుతే బుధోఽర్కదృష్టో బంధుజనే సుక్షమం కుజభే. 25

బుధుఁడు కుజక్షేత్రమున నుండి సూర్యునిచేఁ జూడఁబడఁగాఁ గలిగిన సత్యవాది సుఖవంతుఁడు, రాజగౌరవమునందువాఁడు, బంధువులలో నోర్పుగలవాఁడు నగును.

రజనీకరేణ దృష్టో యువతిజనమనోహరం క్షితిజరాశౌ,
అతిసేవక మతిమలినం చంద్రసుతో హీనశీలం చ. 26

బుధుఁడు కుజక్షేత్రమున చంద్రునిచేఁ జూడఁబడెనేని స్త్రీమనోహరుఁడు, మిక్కిలి సేవకుఁడు, మలినుఁడు, చెడ్డనడవడిగలవాఁడు నగును.?

అనృతప్రియం సువాక్యం కలహసమేతం చ పండితం కుజభే,
జనయతి కుజేన దృష్టః ప్రచురధనం క్షితిపవల్లభం శూరమ్. 27

బుధుఁడు కుజక్షేత్రమున నుండి కుజునిచేఁ జూడఁబడెనేని అబద్ధములాడువాఁడు, మంచిమాటలాడువాఁడు, కలహములనాడువాఁడు, పండితుఁడు, ధనవంతుఁడు, రాజుల వాత్సల్యముగలవాఁడు నగును.

సుఖినం కుజభే శశిజస్స్నిగ్ధాంగం రోమశం సుకేశం చ,
జీవేక్షితోఽతిధనినం జనయ త్యజ్ఞాపకం పాపమ్. 28

కుజక్షేత్రమున నున్నబుధుఁడు గురునిచేఁ జూడఁబడెనేని సుఖవంతుఁడు, మంచి యవయవములుగలవాఁడు, దేహమునిండా రోమములుగలవాఁడు, మంచివెంట్రుకలు గలవాఁడు, మిక్కిలి ధనవంతుఁడు, జ్ఞాపకశక్తిలేనివాఁడు, పాపుఁడు నగును.

నృపకృత్యకరం సుభగం గణనపరపురోగమం చతురవాక్యం,
ప్రత్యయినం సితదృష్టః కుజభే స్త్రీసంయుతం శశిజః. 29

కుజక్షేత్రమున నున్నబుధుఁడు శుక్రునిచేఁ జూడఁబడెనేని రాజకృత్యముల నొనర్చువాఁడు, అందకాఁడు, గణితశాస్త్రజ్ఞులలో మొదటివాఁడు, చతురములగు వాక్యములఁ బల్కువాఁడు, నమ్మకముగలవాఁడు, స్త్రీలతోఁ గూడియుండువాఁడు నగును

రుధిరగృహే శనిదృష్టో హిమకిరణసుతోఽతిదుఃఖితం జనయేత్,
ఉగ్రం హింసాభిరతం కులజనహీనం నరం నిత్యమ్. 30

కుజక్షేత్రమున నున్నబుధుఁడు శనిచేఁ జూడఁబడెనేని మిక్కిలి దుఃఖవంతుఁడు, కోపముగలవాఁడు, హింసలనొనర్చువాఁడు, బంధువులులేనివాఁడు నగును.

శుక్రక్షేత్రమందున్న బుధదృష్టిఫలము.

దారిద్ర్యదుఃఖతప్తం వ్యాధితదేహం పరోపచారరతం,
దినకరదృష్టస్సౌమ్యః కురుతే జనధిక్కృతం సితభే. 31

శుక్రక్షేత్రమున నున్నబుధుఁడు సూర్యునిచేఁ జూడఁబడెనేని దరిద్రముచే దుఃఖితుఁడు, వ్యాధులచే బాధింపఁబడువాఁడు, ఇతరుల కుపచారము నొనర్చువాఁడు, జనులచే ధిక్కరింపఁబడువాఁడు నగును.

ప్రత్యయితం ధనవంతం దృఢభక్తిమరోగిణం దృఢకుటుంబం,
ఖ్యాతం నరేంద్రసచివం జ్ఞశ్చంద్రనిరీక్షిత స్సితభే. 32

శుక్రక్షేత్రమున నున్నబుధుఁడు చంద్రునిచేఁ జూడఁబడెనేని నమ్మకముగలవాఁడు, ధనవంతుఁడు, మిక్కిలి భక్తిగలవాఁడు, రోగహీనుఁడు, గొప్పకుటుంబము గలవాఁడు, ప్రసిద్ధుఁడు, రాజమంత్రియు నగును.

వ్యాధిభిరరిభిర్గ్రస్తం క్లిష్టం భూపావమానసంతప్తం,
జనయతి విదసృగ్దృష్టో బహిష్కృతం సర్వవిషయేభ్యః. 33

శుక్రక్షేత్రమున నున్నబుధుఁడు కుజునిచేఁ జూడఁబడెనేని వ్యాధులచేతను శత్రువులచేతను బాధింపఁబడువాఁడు, కష్టములుగలవాఁడు, రాజావమానముచే పీడితుఁడు, అన్నిదేశములనుండి బహిష్కరింపఁబడువాఁడు నగును.

ప్రాజ్ఞం గృహీతవాక్యం దేశపురశ్రేణినాయకం ఖ్యాతం,
త్రిదశగురుదృష్టమూర్తి ర్జనయతి సౌమ్య స్సితగృహస్థః. 34

బుధుఁడు శుక్రక్షేత్రమున నుండి గురునిచేఁ జూడఁబడెనేని ప్రాజ్ఞుఁడు, అందరి మాటల నంగీకరించువాఁడు దేశములకు పట్టణములకు వీధులకు నధిపతి ప్రసిద్ధుఁడు నగును

సుభగం లలితం సుఖినః వస్త్రాలంకారభోగినం సితభే,
హృదయహారం కన్యానాం కురుతే శుక్రేక్షితస్సౌమ్యః. 35

శుక్రక్షేత్రమున నుండి బుధుఁడు శుక్రునిచేఁ జూడఁబడెనేని అందకాఁడు, మృదువైనవాఁడు, సుఖవంతుఁడు, మంచివస్త్రములు భూషణములు ధరించువాఁడు, కన్యలహృదయమును హరించువాఁడు నగును

శుక్రగృహేఽర్క జదృష్టస్సుఖరహితం బంధుశోకసంక్లిష్టం,
వ్యాధితమనర్థబహుళం సౌమ్యః కురుతే నరం మలినమ్ 36

బుధుఁడు శుక్రక్షేత్రమున నుండి శనిచేఁ జూడఁబడెనేని సుఖములేనివాఁడు, బంధుదుఃఖములచే బాధనొందువాఁడు, వ్యాధులుగలవాఁడు, మిక్కిలి యనర్థముల పొందువాఁడు, మలినుఁడు నగును.

స్వక్షేత్రమందున్న బుధదృష్టిఫలము.

అవితథకథనం మధురం నృపవల్లభ మీశ్వరం లలితచేష్టం,
దయితం కరోతి లోకే రవిణా దృష్టో బుధ స్స్వగృహే 37

బుధుఁడు స్వక్షేత్రమున నుండి సూర్యునిచేఁ జూడఁబడెనేని వ్యర్థముకానిమాటల నాడువాఁడు, మధురమైనవాఁడు, రాజులకు ప్రియమైనవాఁడు, పాలించువాఁడు, లలితములగుచేష్టల నొనర్చువాఁడు, లోకమున నందఱకు హితుఁడును నగును.

సుమధురమతివాచాటం కలహరతం శాస్త్రవత్సలం సుదృఢం,
జనయతి శశినా దృష్టో బుధ శ్శుభం సర్వకార్యేషు. 38

బుధుఁడు స్వక్షేత్రమున నుండి చంద్రునిచేఁ జూడఁబడెనేని మధురమైనవాఁడు, మిక్కిలి మాట్లాడువాఁడు, కలహపరాయణుఁడు, శాస్త్రముల నాసక్తిగలవాఁడు, దృఢమైనవాఁడు, అన్ని కార్యముల శుభమునుబొందువాఁడు నగును.

విక్షతగాత్రం మలినం ప్రతిభాయుక్తం నరేంద్రభృత్యం చ,
వల్లభ మతివ కురుతే స్వగృహే రుధిరేణ సందృష్టః. 39

బుధుఁడు స్వక్షేత్రమున నుండి కుజునిచేఁ జూడఁబడెనేని గాయములంతగిలిన శరీరముగలవాఁడు, మలినుఁడు, ప్రతిభావంతుఁడు, రాజసేవకుఁడు, తనగృహమున నందరకు నతిప్రియుఁడు నగును.

పార్థివమంత్రిణమగ్ర్యం ప్రతిరూపముదారవిభవపరివారం,
యూపధ్వజేన దృష్టో జనయతి శూరం స్వభే సౌమ్యః 40

స్వక్షేత్రమున బుధుఁడు గురునిచేఁ జూడఁబడెనేని రాజమంత్రి, మొదట పూజింపఁబడువాఁడు, నలుగురిలో సమానమైనవాఁడు, గొప్పవైభవము పరివారము గలవాఁడు, శూరుఁడు నగును

ప్రాజ్ఞం నరేంద్రభృత్యం దూతంవా సంధిపాలకం శశిజః,
స్వగృహే సితేనదృష్టో జనయతి నీచాంగనాసక్తమ్ 41

స్వక్షేత్రమున బుధుఁడు శుక్రునిచేఁ జూడఁబడెనేని ప్రాజ్ఞుఁడు, రాజసేవకుఁడు గనో రాజదూతగనో నగువాఁడు, రాయబారి, దుష్టస్త్రీలయిందాసక్తిగలవాఁడు నగును

సతతోద్ధితం వినీతం సఫలారంభం పరిచ్ఛదసమృద్ధం,
సౌమ్యస్స్వగృహే దృష్టో రవిజేన నరం సదా కురుతే 42

స్వక్షేత్రమున బుధుఁడు శనిచేఁ జూడఁబడెనేని ఎల్లపుడు ఉన్నతస్థానమున నుండువాఁడు, వినయవంతుఁడు, వ్యర్థముకానిపనుల మొదలిడువాఁడు, వస్త్రములు కొదువలేకుండా కలిగియుండువాఁడు నగును.

కర్కటమందున్న బుధదృష్టిఫలము.

రజకం మాలాకారం గ్రహవాస్తుజ్ఞం తథా చ మణికారం,
జనయతి రవిణా దృష్టో బుధో గృహం శశినగోశ్చ గతః 43

బుధుఁడు జననకాలమున చంద్రక్షేత్రమగు కర్కటము నుండి సూర్యునిచేఁ జూడఁబడెనేని రజకుఁడు, పుష్పమాలికల నిర్మించువాఁడు, గ్రహములు వాస్తుశాస్త్రము నెఱిఁగినవాఁడు, రత్నపరీక్షకుఁడు నగును

యువతివినాశితసారం యువతినిమిత్తం చ దుఃఖితశరీరం,
కర్కటకే శశిదృష్టో జనయతి సుఖవర్జితం సౌమ్యః. 44

కర్కటకమున నున్న బుధుఁడు చంద్రునిచేఁ జూడఁబడెనేని స్త్రీలచే నష్టమొందింపఁబడిన బలముగలవాఁడు, స్త్రీలకొఱకై దుఃఖములనందిన శరీరముకలవాఁడు, సుఖములు లేనివాఁడు నగును.

స్వల్పశ్రుతమతిముఖరం ప్రియానృతం కూటకారిణం చోరం,
వక్రేక్షిత శ్శశిగృహే కురుతే సౌమ్యః ప్రజాపాలమ్ 45

బుధుఁడు కర్కాటకమున నుండి కుజునిచేఁ జూడఁబడెనేని కొంచెముగాఁ జదువు కొనువాఁడు, అతిగా మాట్లాడువాఁడు, ఇతరుల ప్రియముకొఱకు అబద్ధములఁ బల్కువాఁడు, కూటసాక్ష్యములఁ బల్కువాఁడు, చోరుఁడు, ప్రజాపాలకుఁడు నగును.

మేధావినమతిదయితం భాగ్యయుతం వల్లభం నరేంద్రాణాం,
గురుణా దృష్టశ్శశిభే విద్యానాం పారగం బుధః కురుతే 46

బుధుఁడు కర్కాటకమున నుండి గురునిచేఁ జూడఁబడుచుండఁగాఁ గలిగినవాఁడు మేధావంతుఁడు, మిక్కిలి ప్రియుఁడు, భాగ్యవంతుఁడు, రాజుల కిష్టుఁడు, విద్యల బాగుగా నభ్యసించినవాఁడు నగును.

కందర్పసదృశరూపం ప్రియంవదం గీతవాదనవిధిజ్ఞం,
సుభగం శశిభే లలితం కురుతే శుక్రేక్షితస్సౌమ్యః 47

బుధుఁడు కర్కాటకముననుండి శుక్రునిచేఁ జూడఁబడెనేని మన్మథునివంటి ఆకృతి గలవాఁడు, ప్రియముగా మాట్లాడువాఁడు, గానము వాద్యము నెఱిఁగినవాఁడు, సౌందర్యవంతుఁడు, మృదువైనవాఁడు నగును.

దంభరుచిం పాపరతం బంధనభాజం గుణైర్వియుక్తం జ్ఞః,
ద్వేష్యం సహజాచార్యైః కురుతే సౌరేక్షితశ్శశిభే. 48

కర్కాటకమున నున్న బుధుఁడు శనిచేఁ జూడఁబడెనేని అతిశయోక్తులఁ జెప్పు స్వభావముగలవాఁడు, పాపకార్యముల నాచరించువాఁడు, బంధనములపొందువాఁడు, గుణహీనుఁడు, తమ్ములతో గురువులతో ద్వేషముగలవాఁడు నగును.

సింహమందున్న బుధదృష్టిఫలము.

సేవ్యం దినకరదృష్టో ధనగుణవృద్ధం నరం బుధః కురుతే,
హింస్రం క్షుద్రం సింహే చంచలభాగ్యం విగతలజ్జమ్. 49

బుధుఁడు సింహమున నుండి సూర్యునిచేఁ జూడఁబడుచుండఁగాఁ గలిగినవాఁడు ఇతరులచే సేవింపఁదగినవాఁడు, ధనము మంచిగుణములు గలవాఁడు, హింసించువాఁడు, నీచుఁడు, స్థిరములేని సంపదగలవాఁడు, లజ్జలేనివాఁడు నగును.

రూపాన్వితమతిచతురం కావ్యకలాగేయనృత్తరతిమినభే,
ధనినం సుశీలవేషం కురుతే చంద్రేక్షితస్సౌమ్యః. 50

బుధుఁడు సింహమున నుండి చంద్రునిచేఁ జూడఁబడెనేని రూపవంతుఁడు, మిక్కిలినేర్పరి, కావ్యములు వ్రాయుటయందును, సంగీతమునందును, నాట్యమునందును ప్రియముగలవాఁడును, ధనవంతుఁడును మంచియాచారము

జ్ఞో నీచం రవిభవనే దుఃఖార్తం విక్షతాంగసమరూపం,
అచతుర లీలాకాంతం నపుంసకం భౌమసందృష్టః. 51

బుధుఁడు సింహామున నుండి అంగారకుని చేఁ జూడఁబడెనేని నీచుఁడు, దుఃఖపరిపీడితుఁడు, గాయములు గలశరీరముగలవాఁడు, నేర్పు విలాసములు అందములేనివాఁడు, నపుంసకుఁడు నగును.

సుకుమార మతిప్రాజ్ఞం రవిభే వాగీశ్వరం త్వతిఖ్యాతం,
పరిచారవాహనయుతం కురుతే గురువీక్షితస్సౌమ్యః. 52

బుధుఁడు సింహామున నుండి గురునిచేఁ జూడఁబడుచుండగాఁ బుట్టిన సుకుమారి, మిక్కిలి ప్రాజ్ఞుఁడు, మాటలనేర్పుగలవాఁడు, గొప్పఖ్యాతిగలవాఁడు, సేవకులు వాహనములుగలవాఁడు నగును.

అతిశయరూపం లలితం ప్రియంవదం వాహనాఢ్యమతిధీరం,
జనయతి సితేన దృష్టో మంత్రిణ మథ పార్థివం సింహే 53

బుధుఁడు సింహామున నుండి శుక్రునిచేఁ జూడఁబడెనేని మిక్కిలి రూపస్విమృదువైనవాఁడు, ప్రియముగా మాట్లాడువాఁడు, వాహనములుగలవాఁడు, మిక్కిలి ధైర్యము గలవాఁడు, రాజో రాజమంత్రియో యగును.

వ్యాయతగాత్రం రూక్షం సువిరూపం స్వేదనోగ్రగంధం చ,
అతిదుఃఖితం రవిగృహే జనయతి సుఖవర్జితం రవిజదృష్టః 54

సింహామున నున్నబుధుఁడు శనిచేఁ జూడఁబడెనేని విశాలమగు దేహముగలవాఁడు, ఉష్ణప్రకృతిగలవాఁడు, కురూపి, స్వేదజలముల దుర్గంధముగలవాఁడు, మిక్కిలి దుఃఖము గలవాఁడు, సుఖములేనివాఁడు నగును.

గురుక్షేత్రమందున్న గురుదృష్టిఫలము.

శూరం ప్రమేహపీడితమశ్మర్యోపహతమాతురం శాంతం,
జనయతి రవిణా దృష్టో జీవగృహే చంద్రజః పురుషమ్. 55

బుధుఁడు గురుక్షేత్రము (ధనుస్సు-మీనము)న నుండి సూర్యునిచేఁ జూడఁబడిన శూరుఁడు, ప్రమేహము అశ్మరి మున్నగువ్యాధులుగలవాఁడు, దుఃఖితుఁడు, శాంతుఁడు నగును.

లేఖకమతిసుకుమారం ప్రత్యయితం సంమతం గురుగృహస్థః,
సుఖభాగిన మర్థ్యాఢ్యం కురుతే చంద్రేక్షితస్సౌమ్యః. 56

బుధుఁడు గురుక్షేత్రమున నుండి చంద్రునిచేఁ జూడఁబడెనేని వ్రాతగాఁడు, మిక్కిలి సుకుమారి, నలుగురిలో నమ్మకము అభిమానముగలవాఁడు, గొప్పకుటుంబము గలవాఁడు, సుఖవంతుఁడు, సంపన్నుఁడు నగును.

శ్రేణీభృతినగరాణాం చోరాణాం విపినవాసినాం చాపి,
కురుతే లిపికర మధిపం సౌమ్యో గురుమందిరే రుధిరదృష్టః. 57

బుధుఁడు గురుక్షేత్రమున నుండి కుజునిచేఁ జూడఁబడెనేని వీథులకు పట్టణములకు దొంగలకు అరణ్యమునవసించుబోయలు కిరాతులు మున్నగువారలకు నధిపతి, వ్రాతకాఁడు నగును

స్మృతిమతికులసంపన్నం గురుభేఽ ప్రతిరూపమార్యవిజ్ఞానం,
నృపమంత్రకోశపాలం లిపికరమిహ వీక్షితో గురుణా 58

బుధుఁడు గురుక్షేత్రమున గురునిచేఁ జూడఁబడెనేని జ్ఞాపకశక్తి, నిశితమైనబుద్ధి, ఉన్నతమగువంశముగలవాఁడు, సాటిలేనిసౌందర్యముకలవాఁడు, పెద్దలు సంపాదించిన విజ్ఞానము నార్జించువాఁడు, రాజమంత్రి, ధనాగారముల రక్షించువాఁడు, వ్రాతకాఁడు నగును.

కన్యాకుమారకాణాం లేఖ్యాచార్యం ధనాన్వితం కురుతే,
గురుభే భృగుసుతదృష్టస్సుకుమారం శౌర్యసంయుతం శశిజః. 59

బుధుఁడు గురుక్షేత్రమున నుండగా శుక్రునిచేఁ జూడఁబడెనేని కన్యకలకు పిల్లవాండ్లకు వ్రాయుంట మున్నగునవి నేర్పువాఁడు, ధనవంతుఁడు, సుకుమారి, శౌర్యముగలవాఁడు నగును

దుర్గారణ్యాభిరతం బహ్వాశనం దుష్టశీల మతిమలినం,
కురుతే రవిసుతదృష్టో బుధో నరం సర్వకార్యవిభ్రష్టమ్ 60

బుధుఁడు గురుక్షేత్రమున నుండఁగా శని చూచెనేని దుర్గములు అరణ్యములు వీనియందుండ నభిలాషగలవాఁడు, ఎక్కువగా భుజించువాఁడు, దుష్టశీలుఁడు, మిక్కిలి నీచుఁడు, తనకార్యములనుండి తొలఁగువాఁడు నగును.

శనిక్షేత్రమందున్న బుధదృష్టిఫలము.

మల్లమతిసారయుక్తం బహుభక్షం నిష్ఠురం ప్రియాలాపం,
జనయతి రవిణా దృష్టస్సౌరగృహే బోధనః ఖ్యాతమ్. 61

బుధుఁడు శనిక్షేత్రమున (మకరము-కుంభము) నుండి సూర్యునిచేఁ జూడఁబడెనేని మల్లుఁడు, అతిసారరోగముగలవాఁడు, ఎక్కువగా భుజించువాఁడు, కఠినమైన వాఁడు, ప్రియముగా మాట్లాడువాఁడు, ప్రసిద్ధుఁడు నగును.

జలజీవినం సమృద్ధం పుష్పసురాకందవణిజం వా,
భీరుస్వరూప మచరం శనిభే చంద్రేక్షితః కురుతే. 62

బుధుఁడు శనిస్థానమున నుండి చంద్రునిచేఁ జూడఁబడెనేని నీటివలన జీవించువాఁడు, సంపన్నుఁడు, పుష్పములు మద్యము దుంపలు మున్నగువానిచే వ్యాపారము చేయువాఁడు, భయశీలుఁడు, నడుపశక్తిలేనివాఁడు నగును.

వాక్చపలమతిసుసౌమ్యం వ్రీడాలసమంథరం సుఖాధారం,
కురుతే భూసుతదృష్టో రవితనయగృహే బుధః పురుషమ్ 63

బుధుఁడు శనిస్థానమున నుండఁగా కుజుఁడు చూచెనేని తొందరపడి మాట్లాడువాఁడు, సౌమ్యుఁడు, సిగ్గు సోమరితనముగలవాఁడు, సుఖవంతుఁడు నగును.

బహుధనధాన్యసమృద్ధం గ్రామపురశ్రేణిపూజితం సుఖినం,
కురుతే గురుణా దృష్టస్సౌరగృహే బోధనః ఖ్యాతమ్. 64

బుధుఁడు శనిక్షేత్రముననుండి గురునిచేఁ జూడఁబడుచుండఁగాఁ గలిగిన ధనధాన్యములు విరివిగాకలవాఁడు, పట్టణముల గ్రామముల పూజింపఁబడువాఁడు, సుఖవంతుఁడు, ప్రసిద్ధుఁడు నగును.

నీచాపతిం విరూపం బుద్ధివిహీనం చ కామవశ్యం చ,
అతిసుతజననం కురుతే భార్గవదృష్టో బుధశ్శనిభే. 65

బుధుఁడు శనిక్షేత్రమందుండఁగా శుక్రుఁడు చూచెనేని దుష్టస్త్రీభర్త, కురూపి, బుద్ధిలేనివాఁడు, అతికాముకుఁడు, మిక్కిలి సంతానముగలవాఁడు నగును.

పాపకరం సుదరిద్రం కర్మకరం చాతిదుఃఖితం దీనం,
కురుతే శనినా దృష్టస్సౌరగృహే బోధనః పురుషమ్. 66

బుధుఁడు శనిస్థానముననుండి శనిచేఁ జూడఁబడెనేని పాపపుపనులఁ జేయువాఁడు, దరిద్రుఁడు, కూలిజేయువాఁడు, దుఃఖవంతుఁడు. దీనుఁడు నగును.

ఇతి షడ్వింశోఽధ్యాయః.

## గురుచారమును దెలుపు ఇరువదియేడవ యధ్యాయము.

వాదిగుణై స్సంపన్నః ప్రయత్నరత్నాభరణసంసర్గః,
సత్వాత్మజార్థబలయుక్ప్రగల్భవిఖ్యాతకర్తా చ. 1
ఓజస్వీ బహుశత్రుర్బహువ్యయార్థః క్షతాంకితశరీరః,
చండోగ్రదండనాథో జీవే క్రియగే భవేత్పురుషః. 2

గురుఁడు మేషమందుండఁగా జన్మించినవాఁడు వాదించుస్వభావముగలవాఁడు, ప్రయత్నపూర్వకముగా రత్నాభరణములను ధరించువాఁడు, దేహబలము ధనబలము పుత్రబలము గలవాఁడు, ప్రగల్భము ప్రఖ్యాతిగలపనులను జేయువాఁడు, తేజోవంతుఁడు, అనేకశత్రువులుగలవాఁడు, అనేకవిధముల వ్యయము చేయువాఁడు, గాయములు తగిలిన శరీరముగలవాఁడు, తీక్ష్ణమైన దండనాయకుఁడు నగును.

పీనో విశాలదేహస్సురద్విజగవాంచ భక్తిమాన్ కాంతః,
సుభగస్స్వదారనిరతస్సువేషకృషిగోధనాఢ్యశ్చ. 3
సద్వస్త్రభూషణయుతో విశిష్టవాఙ్మతిగుణో నయజ్ఞశ్చ,
వృషభే గురౌ వినీతో భిషక్ప్రియోగాప్తకౌశలకః. 4

గురుఁడు వృషభమున నుండఁగా జన్మించిన బలిసినవాఁడు, విశాలమైనశరీరము గలవాఁడు, దేవబ్రాహ్మణులయందు గోవులయందు భక్తిగలవాఁడు, సౌందర్యవంతుఁడు, ఏకపత్నీవ్రతుఁడు, మంచివేషము వ్యవసాయము గోవులు పుష్కలముగాఁగలవాఁడు, మంచిభూషణములుగలవాఁడు, మంచివాక్కు బుద్ధి గుణములుగలవాఁడు, యజ్ఞములు చేయునివాఁడు, వినయవంతుఁడు, చదువకనే ఊరకమందులిచ్చుటవలన వైద్యమున నేర్పుసంపాదించిన వైద్యుఁడును నగును.

ఆహితధనస్సుమేధాః విజ్ఞానవిశారదస్సునయనశ్చ,
వాగ్మీ దాక్షిణ్యయుతో నిపుణస్సాత్వధర్మశీలశ్చ. 5
మాన్యో గురుబంధూనాం మండనమాంగల్యలబ్ధవరశబ్దః,
మిథునస్థే దేవగురౌ క్రియారతి స్సత్కవిశ్చైవ. 6

బృహస్పతి మిథునమున నుండఁగాఁ గల్గిన ధనవంతుఁడు, మేధావంతుఁడు, మంచి విజ్ఞానముగలవాఁడు, మంచినేత్రములు అనర్గళమైనవాగ్ధోరణి దయ నేర్పు న్యాయమైన నడవడిగలవాఁడు, గురువులను బంధువులను గౌరవించఁదగినవాఁడు, భూషణముల ధరించుటచేతను మంగళప్రదములగు కార్యముల నాచరించుటచేతను శ్రేష్ఠుఁడని పేరు వడసినవాఁడు, పనులయం దాసక్తిగలవాఁడు, మంచికవీశ్వరుఁడు నగును.

విద్వాన్ సురూపదేహః ప్రాజ్ఞః ప్రియధర్మసత్త్వభావశ్చ,
సుమహాద్బలో యశస్వీ ప్రభూతధాన్యాకరధనేశః. 7
సత్యసమాధిసుయుక్తస్థిరాత్మజో లోకసత్కృతః ఖ్యాతః,
నృపతిర్జీవే శశిభే విశిష్టకర్మా సుహృజ్జనానురతః. 8

గురువు కర్కాటకమున నుండఁగా జన్మించినవాఁడు విద్వాంసుఁడు అందమైన దేహముగలవాఁడు, ప్రాజ్ఞుఁడు. ధర్మమునయాసక్తి మనోబలముగలవాఁడు, గొప్పబలము గలవాఁడు, కీర్తిమంతుఁడు, ఎక్కువగా ధాన్యపుపాతరలు ధనముగలవాఁడు, సత్యము పల్కుటయందు పట్టుదలగలవాఁడు, చిరాయుష్మంతులగు పుత్త్రులుగలవాఁడు, లోకమున గౌరవము ప్రతిష్ఠగలవాఁడు, రాజలోకమున లెక్కకువచ్చుపనుల నొనర్చువాఁడు, స్నేహితులయందనురక్తిగలవాఁడు నగును

దృఢవైరసత్త్వధీరస్సుబహుస్నేహస్సుహృజ్జనే విద్వాన్,
ఆఢ్యశ్శిష్టాభిజనో నృపో నృపతిపౌరుషస్సభాలక్ష్యః. 9
త్రిదశగురౌ సింహస్థే సమస్తరోషోద్ధృతారిపక్షశ్చ,
సుదృఢవ్యస్తశరీరో గిరిదుర్గవనాలయే జాతః 10

గురువు సింహమున నుండఁగాఁ గల్గిన బలవత్తరమగు విరోధము బలము ధైర్యము గలవాఁడు, గొప్పస్నేహస్వభావముగలవాఁడు, విద్వాంసుఁడు, సంపన్నుఁడు, శిష్టులయెడ నాదరముగలవాఁడు, రాజు రాజపౌరుషముగలవాఁడు, సభాగౌరవముగలవాఁడు, రోషముచేత శత్రువులనందరను నశింపఁజేయువాఁడు, బలము విశాలముగల శరీరముగల వాఁడు, అరణ్యముల దుర్గముల పర్వతముల వసించువాఁడు నగును.

మేధావీ ధర్మపరః క్రియాపటుర్ధర్మవాన్యువతిరాశౌ,
ప్రియగంధపుష్పవస్త్రః కృత్యేషు వినిశ్చితార్థశ్చ. 11
శాస్త్రార్థశిల్పకార్యైర్ధనవాన్దాతా విశుద్ధశీలశ్చ,
స్యాద్దేవగురౌ నిపుణశ్చిత్రాక్షరవిద్ధనసమృద్ధశ్చ. 12

గురువు కన్యయందుండఁగా జన్మించిన మేధావంతుఁడు, ధర్మాత్ముఁడు, కార్యముల సమర్థుఁడు, గంధము వస్త్రములు పుష్పములు వీనియం దాసక్తిగలవాఁడు, ఈపని యిటుల చేయవలయునని ముందుగనే నిశ్చయించుకొనువాఁడు, శాస్త్రార్థము శిల్పము అనువీనిచే ధనము నార్జించువాఁడును, దాత, పరిశుద్ధమైన నడవడిగలవాఁడు, నేర్పరి, చిత్రములగు యక్షరముల వ్రాయఁగలవాఁడు, ధనవంతుఁడు నగును.

మేధావీ బహుపుత్రో విదేశచర్యాగతః ప్రభూతధనః,
భాషాప్రియో వినీతో నటనర్తకసంగృహీతధనః. 13
కాంతశ్శ్రుతాభినిరతో మహత్తరస్సార్థవాహవణిజాం హి,
వణిజేంద్రమంత్రిణిగతే సురాతిథిజ్యారతః ప్రాజ్ఞః 14

తులయందు గురువుండఁగా జన్మించిన మేధావంతుఁడు, అనేకపుత్రులుఁగలవాఁడు, ఇతరదేశములసంచరించువాఁడు, ధనవంతుఁడు, భాషయందాసక్తిగలవాఁడు, వినయవంతుఁడు, నటులచేత నర్తకులచేత గ్రహింపఁబడినధనముగలవాఁడు, సౌందర్యవంతుఁడు, వేదములయందాసక్తిగలవాఁడు. వర్తకులలో గొప్పవాఁడు, మద్యము అతిథిపూజ యాగాదులనొనర్చుట అనువానియందాసక్తిగలవాఁడు నగును.

బహుశాస్త్రాణాం కుశలో నృపతిర్బహుభాష్యకారకో నిపుణః,
దేవాలయపురకర్తా పద్బహుదారోఽల్పపుత్రశ్చ 15
వ్యాధ్యార్తశ్శ్రమబహులః ప్రసక్తదోషో గురౌ భవత్యలిని,
దంభేన ధర్మనిరతో జుగుప్సితాచారనిరతశ్చ 16

గురువు వృశ్చికమున నుండఁగాఁ గలిగిన అనేకశాస్త్రములలో నేర్పుగలవాఁడు, రాజు అనేకభాష్యములనేర్పఱచువాఁడు, నేర్పరి, దేవాలయములను పట్టణములను నిర్మించువాఁడు, అనేకమందిభార్యలుఁ కొలదిపాటి సంతానముగలవాఁడు, రోగములచే బాధనొందువాఁడు, అనేకకష్టముల ననుభవించువాఁడు, దోషయుక్తుఁడు, లోకప్రకటనకొఱకై ధర్మము నాచరించువాఁడు, సత్పురుషులెల్లరు నిందించునపనుల నొనర్చువాఁడు నగును.

ఆచార్యో వ్రతదీక్షా యజ్ఞాదీనాం స్థిరార్థశ్చ,
దాతా సుహృత్స్వపక్షః ప్రియోపకారశ్శ్రుతాభిరతః. 17
మాండలికో మంత్రీ వా ధనుర్ధరస్థే భవేత్సదాజీవే,
నానాదేశనివాసీ వివిక్తతీర్థాయతనబంధుః. 18

గురువు ధనుస్సునందుండఁగాఁ గలిగినవాఁడు వ్రతములందు దీక్ష లిప్పించుట యందు యజ్ఞము మున్నగువానియందు ఆచార్యుఁడు, స్థిరమగుసంపదగలవాఁడు, దాత స్నేహితులెల్లరు తనపక్షమందుఁగలవాఁడు, ఉపకారమొనర్చువాఁడు, పండితుఁడు, మండలాధిపతిగాని మంత్రిగాని అనేకదేశముల నివసించువాఁడు, వేర్వేరుపుణ్యస్థలముల గృహములు బంధువులు గలవాఁడు నగును.

లఘువీర్యో మకరస్థే బహుశ్రమక్లేశభారకో జీవే,
నానా[illegible]రో మూర్ఖో దురంతనిస్స్వః పరప్రేష్యః. 19

మాంగల్యదయాశౌచస్వబంధువాత్సల్యధర్మపరిహీనః,
దుర్బలదేహో భీరుః ప్రవాసశీలో విషాదీ చ 20

గురువు మకరమందుండఁగా జన్మించినవాఁడు స్వల్పబలుఁడు, అనేకకష్టముల ననుభవించువాఁడు, అనాచారముల వర్తించువాఁడు, మూర్ఖుఁడు, దుండగములచే ధననాశము చేసుకొనువాఁడు, ఇతరులకడ్డ సేవకుఁడు, శుభము దయ పరిశుభ్రత బంధుప్రేమ ధర్మములేనివాఁడు, భయశీలుఁడు, ఇతరదేశముల తిరుగువాఁడు, దుఃఖవంతుఁడు నగును.

పిశునో నసాధుశీలః కుశిల్పతోయాశ్రమేషు కర్మరతః,
ముఖ్యో గణస్య సుతరాం నీచాభిరతో నృశంసశ్చ 21
లుబ్ధో వ్యాధిగ్రస్తస్స్వవాక్యదోషేణ నాశితార్థశ్చ,
ప్రజ్ఞాదిగుణైర్హీనో ఘటే గురౌ స్యాద్గురుస్త్రీగః. 22

కుంభమున గురువుండఁగాఁ బుట్టినవాఁడు లోభి, అసద్వర్తనముగలవాఁడు, స్వల్పమైన శిల్పశాస్త్రజ్ఞానము గలవాఁడు, బావిపనులను చేయువాఁడు, ఒకగుంపునకు అధిపతి, మిక్కిలి నీచకర్మల నాచరించువాఁడు, దుర్మార్గుఁడు, వ్యాధులచే బాధింపఁబడు శరీరము గలవాఁడు, తనమాటతప్పుట కారణముగా ద్రవ్యనాశనము పొందినవాఁడు, ప్రజ్ఞ మొదలగుగుణములు గలవాఁడు. గురుతల్పము నొందువాఁడు నగును.

వేదార్థశాస్త్రవేత్తా సుహృదాం పూజ్యస్సతాం చ నృపనేతా,
శ్లాఘ్యస్సధనోఽధృష్యోఽహ్యహీనదర్పస్థిరారంభః 23
రాజ్ఞస్సునీతిశిక్షా వ్యవహారరణప్రయోగవేత్తా చ,
ఖ్యాతః ప్రశాంతచేష్టో స్థిరసత్త్వయుతశ్చ మీనగే జీవే. 24

మీనమున గురుఁడుండఁగాఁ గలిగిన జాతకుఁడు వేదార్థము శాస్త్రములు నెఱిఁగిన వాఁడు, స్నేహితులలోను సత్పురుషులలోను పూజనందువాఁడు, రాజుల కధిపతి. శ్లాఘ్యమైనగుణములుగలవాఁడు, ధనవంతుఁడు, ఇతరులవలన భయము నొందనివాఁడు, లోటులేనిగర్వము నిలకడగల కార్యారంభములుగలవాఁడు, రాజనీతి రాజశిక్ష రాజవ్యవహారములు యుద్ధమునేర్పు నెఱిఁగినవాఁడు, ప్రసిద్ధుఁడు, అందోళనములేక పనులను చక్కపరచుకొనువాఁడు, బలవంతుఁడు నగును.

## కుజక్షేత్రమందున్న గురుదృష్టిఫలము.

ధర్మిష్ఠమనృతభీరుం విఖ్యాతసుతం మహాభాగ్యం.
భౌమగృహే రవిదృష్టో హ్యతిరోమచితం గురుః కురుతే. 25

కుజక్షేత్రమున (మేషము-వృశ్చికము) గురువుండి సూర్యునిచేఁ జూడఁబడు చుండగా జన్మించిన ధర్మాత్ముఁడు అసత్యమన్న భయపడువాఁడు, ప్రసిద్ధులగుపుత్త్రులు గలవాఁడు, మహాభాగ్యవంతుఁడు, మిక్కిలి రోమములుగల శరీరముగలవాఁడు నగును.

ఇతిహాసకావ్యకుశలం బహురత్నం స్త్రీషు భాజనం కురుతే,
కుజగేహే శశిదృష్ట స్త్రిదశగురుః పార్థివం ప్రాజ్ఞమ్. 26

గురువు కుజక్షేత్రమున నుండఁగా చంద్రుఁడు చూచెనేని ఇతిహాసములు కావ్యములు నిర్మించుటయందు నేర్పరి, అనేకరత్నములు గలవాఁడు, స్త్రీలకు ప్రియుఁడు, రాజు, ప్రాజ్ఞుఁడు నగును.

నృపపురుషశూరముగ్రం నయవినయసమన్వితం చ విధనం చ,
అవిధేయభృత్యదారం జనయతి వక్రేక్షితో జీవః. 27

గురువు కుజస్థానమున నుండి అంగారకునిచేఁ జూడఁబడెనేని రాజపురుషులలో శూరుఁడు, కోపస్వభావముగలవాఁడు, నీతి వినయముగలవాఁడు, ధనహీనుఁడు, తనకు విధేయులుకాని భార్యభృత్యులుగలవాఁడు నగును.

అనృతం వంచనపాపం పరవివరాన్వేషణేషు నిపుణం చ,
సేవావినయకృతజ్ఞం కాపటికం సౌమ్యసందృష్టః 28

గురువు కుజక్షేత్రమున నుండి బుధునిచేఁ జూడఁబడెనేని జాతకుఁడు అసత్యవాది, మోసముచేయువాఁడు, ఇతరులతప్పుల వెతకుటయం దారితేరినవాఁడు, సేవ వినయము కృతజ్ఞతగలవాఁడు, కపటముగలవాఁడు నగును.

గృహశయనవసనగంధై ర్మాల్యాలంకారయువతిభిర్విభవైః,
సముచిత మతీవ భీరుం కురుతే శుక్రేక్షితో జీవః 29

జననకాలమున గురువు కుజస్థానమున నుండి శుక్రునిచేఁ జూడఁబడెనేని మంచి గృహములు, శయనము, వస్త్రములు, గంధాదిపరిమళద్రవ్యములు, పుష్పమాలికలు, భూషణములు, అందకత్తెలగుస్త్రీలు, గొప్పవైభవముగలవాఁడు, మిక్కిలి భయవంతుఁడు నగును.

మలినం లుబ్ధం తీక్ష్ణం సాహసికం సంమతం చ సిద్ధం చ,
అస్థిరమిత్రాపత్యం త్రిదశగురుస్సౌరసందృష్టః. 30

జననకాలమున గురువుకుజక్షేత్రమున నుండి శనిచేఁ జూడఁబడెనేని మలినుఁడు, లోభి, కఱుకుగలవాఁడు, సాహసవంతుఁడు, అందరకు నిష్టుఁడు, నిలకడలేని సంతానము, స్నేహముగలవాఁడు నగును.

శుక్రక్షేత్రమందున్న గురుదృష్టిఫలము.

ద్విపదచతుష్పదభాగినమత్యటనం వ్యాయతాంగమిహ పురుషం,
ప్రాజ్ఞం నరేంద్రసచివం కరోతి సూర్యేక్షితో జీవః 31

గురువు శుక్రస్థానము (వృషభము-తుల)న నుండి సూర్యునిచేఁ జూడఁబడుచుండగా జన్మించినవాఁడు సేవకులు, పశువులుగలవాఁడు, మిక్కిలి తిరుగువాఁడు, విశాలమగు దేహముగలవాఁడు, ప్రాజ్ఞుఁడు, రాజమంత్రియుం నగును

అతిధనమతీవ మధురం జననీదయితం ప్రియంచ యువతీనాం,
అత్యుపభోగం కురుతే చంద్రేణ నిరీక్షితో జీవః. 32

శుక్రస్థానమున గురువుండి చంద్రునిచేఁ జూడఁబడెనేని మిక్కిలి ధనవంతుఁడు, అందరకు నమితప్రియుఁడు, మాతృప్రియుఁడు, స్త్రీలకు నిష్టుఁడు, మిక్కిలి భోగవంతుఁడు నగును.

దయితం బాలస్త్రీణాం ప్రాజ్ఞం శూరం చ ధనసమృద్ధం చ,
సుఖినం నరేంద్రపురుషం భృగుభే జీవో రుధిరదృష్టః 33

గురువు శుక్రక్షేత్రమున నుండి కుజునిచేఁ జూడఁబడెనేని తరుణులగుస్త్రీలకు నిష్టుఁడు, ప్రాజ్ఞుఁడు, శూరుఁడు, ధనసమృద్ధిగలవాఁడు, సుఖవంతుఁడు, రాజపురుషుఁడు నగును.

ప్రాజ్ఞం చతురం మధురం సుధనం విభవాన్వితం గుణసమృద్ధం,
సురుచిరశీలం కాంతం జనయతి బుధవీక్షితో జీవః 34

బృహస్పతి శుక్రస్థానమున నుండి బుధునిచేఁ జూడఁబడెనేని ప్రాజ్ఞుఁడు, నేర్పరి, ప్రియమైనవాఁడు, ధనవంతుఁడు, విభవములు విస్తారముగాఁగలవాఁడు, గుణవంతుఁడు, మిక్కిలి కొనియాడఁదగిన నడవడిగలవాఁడు, సౌందర్యవంతుఁడు నగును.

అతిలలితమతిం ధనినం వరభూషణధారిణం మృజాశీలం,
వరశయనం వరవసనం భృగుభే భృగువీక్షితో జీవః 35

బృహస్పతి శుక్రక్షేత్రమున నుండి శుక్రునిచేతఁ జూడఁబడెనేని జాతకుఁడు మిక్కిలి లలితమైనబుద్ధిగలవాఁడు, ధనవంతుఁడు, శ్రేష్ఠములగు భూషణములను ధరించువాఁడు, సహనశక్తిగలవాఁడు, మంచిశయనములు వస్త్రములు గలవాఁడు నగును.

ప్రాజ్ఞం బహుధనధాన్యం మహత్తరం గ్రామనగరపురుషాణాం,
మలిన మరూప మఖార్యం కురుతే సౌరేక్షితో జీవః. 36

బృహస్పతి శుక్ర క్షేత్రమున నుండఁగా శని చూచెనేని ప్రాజ్ఞుఁడు, మిక్కిలి ధన ధాన్యములుగలవాఁడు, గ్రామవాసులు పట్టణవాసులు నగు పురుషులలో గొప్పవాఁడు, మలినుఁడు, సౌందర్యములేనివాఁడు, భార్యాహీనుఁడు నగును.

### బుధక్షేత్రమందున్న గురుదృష్టిఫలము.

ఆర్యం గ్రామశ్రేష్ఠం కుటుంబినం దారపుత్రధనయుక్తం,
బుధభే దినకరదృష్ట స్త్రిదశగురు ర్మానవం కురుతే 37

బృహస్పతి బుధక్షేత్రము (మిథునము-కన్య)న నుండి సూర్యునిచేఁ జూడఁబడెనేని జాతకుఁడు పూజ్యుఁడు, గ్రామములో పలుకుబడిగలవాఁడు, గొప్పకుటుంబముగల వాఁడు, భార్య పుత్త్రులు ధనము గలవాఁడు నగును.

చంద్రేక్షితస్తు కురుతే వసుమంతం మాతృవల్లభం ధన్యం,
సుఖయుపతిపుత్రవంతం సురగురురతిరూపమనుపమం బుధభే. 38

బుధస్థానమున గురువుండి చంద్రునిచేఁ జూడఁబడెనేని బంగారము విస్తారముగాఁ గలవాఁడు, మాతృప్రియుఁడు, ధన్యుఁడు, సౌఖ్యమును పెంపొందించు భార్య పుత్త్రులు గలవాఁడు, మిక్కిలి రూపసి, సాటి లేనివాఁడు నగును.

శాశ్వతసులబ్ధవిషయం చిత్రితగాత్రం ధనాన్వితం కురుతే,
ధరణీసుతేక్షితదేహ స్త్రిదశగురుస్సమ్మతం లోకే. 39

గురువు బుధస్థానమున నుండి అంగారకునిచేఁ జూడఁబడెనేని స్థిరములైనవి సులభముగా లభించినవియు నగు విషయములు గలవాఁడు, శరీరమంతటను పచ్చబొట్టు పొడిపించు కొనువాఁడు, ధనవంతుఁడు, లోకమునకు నిష్టుఁడు నగును.

కురుతే జ్యోతిషకుశలం బహుసుతదారం చ సూత్రకారంచ,
అతిశయవిరూపవాక్యం బుధభే సౌమ్యేక్షితో జీవః 40

గురువు బుధస్థానమందుండి బుధునిచేఁ జూడఁబడెనేని జ్యోతిషశాస్త్రమునఁ బ్రావీణ్యము గలవాఁడు, అనేకమంది భార్యలు పుత్త్రులు గలవాఁడు, నూలు నుత్పత్తిఁ జేయువాఁడు, ఎంతమాత్రము పొసఁగకుండా మాట్లాడువాఁడు నగును.

దేవప్రాసాదానాం కృత్యకరం వేశదారభోక్తారం,
హృదయహరం నారీణాం కురుతే శుక్రేక్షితో జీవః 41

గురువు బుధక్షేత్రమున నుండి శుక్రునిచేతఁ జూడఁబడెనేని దేవాలయములందు సేవఁ జేయువాఁడు, ఇరుగుపొరుగు స్త్రీలతో భోగించువాఁడు, స్త్రీలహృదయముల నాకర్షించువాఁడు నగును.

శ్రేణీగణరాష్ట్రాణాం పురోగమం గ్రామపత్తనానాం చ,
జనయతి శనినా దృష్టస్సుతనుం జీవో నరం బుధభే. 42

గురువు బుధక్షేత్రమున నుండి శనిచేఁ జూడఁబడెనేని పేటలు రాష్ట్రము గ్రామము పట్టణము అనువీటికి పురోహితుఁడు, సుందరమైన దేహము గలవాఁడు నగును.

కర్కాటకమందున్న గురుదృష్టిఫలము,

రవిదృష్టశ్శశిభవనే విఖ్యాతం హ్యగ్రగం సమూహానాం,
సుఖధనదారవిహీనం పశ్చాదాఢ్యం గురుః కురుతే. 43

గురువు చంద్రస్థానము (కర్కాటకము)న నుండి సూర్యునిచేఁ జూడఁబడెనేని జాతకుఁడు ప్రసిద్ధుఁడు సమూహములలో మొదటివాఁడు. సౌఖ్యము భార్య ధనము లేనివాఁడు, అంత్యకాలమున సంపన్నుఁడు నగును.

అత్యర్థం ద్యుతిమంతం నృపతిం బహుకోశవాహనసమృద్ధం,
ఉత్తమయువతీపుత్రం జనయే చ్ఛశిభే గురు ర్హిమగుదృష్టః. 44

గురువు చంద్రస్థానమున నుండి చంద్రునిచేఁ జూడఁబడెనేని మిక్కిలి కాంతి గలవాఁడు, రాజు, ఎక్కువ ధనాగారములు వాహనములుకలవాఁడు, శ్రేష్ఠమైనభార్య, ఉత్తములగుపుత్త్రులు గలవాఁడు నగును.

కౌమారదార మాఢ్యం హేమాలంకారభాగినం ప్రాజ్ఞం,
శూరం సవ్రణగాత్రం రుధిరాంగనిరీక్షితో గురుః కురుతే 45

చంద్రస్థానమున గురువుండి కుజునిచేఁ జూడఁబడెనేని జాతకుఁడు బాల్యముననే భార్యనుపొందువాఁడు, సంపన్నుఁడు, బంగారుభూషణములచే భూషించుకొనువాఁడు, శూరుఁడు, శరీరమంతటను గాయములు గలవాఁడు నగును.

బాంధవమాత్రనిమిత్తం ధనినం కలహాన్వితం విగతపాపం,
జనయతి బుధేన దృష్టః ప్రత్యయినం మంత్రిణాం జీవః. 46

బృహస్పతి చంద్రస్థానమున నుండి బుధునిచేఁ జూడఁబడెనేని బంధువులకొఱకై ఉపయోగపడుధనముగలవాఁడు, కలహశీలుఁడు, పాపములులేనివాఁడు, మంత్రుల నమ్మకమును సంపాదించువాఁడును నగును.

బహుదారం బహువిభవం నానాలంకారభాగినం సుఖినం,
భృగుతనయదృష్టమూర్తిస్సుభగం పురుషం గురుః కురుతే 47

బృహస్పతి చంద్రక్షేత్రమున నుండి శుక్రునిచే జూడఁబడెనేని అనేకమంది భార్యలుగలవాఁడు, విస్తారముగా విభవములుగలవాఁడు, వివిధములగు భూషణములు గలవాఁడు సౌఖ్యవంతుఁడు, సౌందర్యవంతుఁడు నగును.

సౌరేణ దృష్టమూర్తిర్మహత్తరం గ్రామసైన్యనగరాణాం,
వాచాటం బహువిభవం వార్ధక్యే భోగభాగినం జీవః. ౪౮

చంద్రక్షేత్రమున బృహస్పతి యుండి శనిచే జూడఁబడెనేని గ్రామములలో పట్టణములలో సైన్యములోను గొప్పవాఁడు, మిక్కిలి మాట్లాడువాఁడు, అనేకవైభవములుగలవాఁడు, వార్ధక్యమున భోగముల ననుభవించువాఁడు నగును.

సింహమందున్న గురుదృష్టిఫలము.

సింహే దయితం ఖ్యాతం సతాం చ నృపతిం మహాధనసమృద్ధం,
జనయతి దినకరదృష్ట స్త్రిదశగురు ర్నరమతి సుశీలమ్. 49

బృహస్పతి సింహరాశియందుండి సూర్యునిచే జూడఁబడెనేని ప్రసిద్ధుఁడు, సత్పురుషుల కనుకూలుఁడు, రాజు, గొప్పధనసమృద్ధిగలవాఁడు, మిక్కిలి నిర్మలమైన [illegible] నడవడిగలవాఁడు నగును.

అతిసుభగ మధికమలినం స్త్రీభాగ్యైరుపచితార్థమత్యాఢ్యం,
లేయేచంద్రసుదృష్టో జితేంద్రియం జనయతి సురేజ్యః. 50

జననకాలమున సింహరాశియందు బృహస్పతి యుండి చంద్రునిచే జూడఁబడెనేని మిక్కిలి సౌందర్యవంతుఁడు, మిక్కిలి మలినుఁడు, స్త్రీసంబంధము లగుసంపదలచే కూడిన ధనసమృద్ధిగలవాఁడు, జితేంద్రియుఁడు నగును.

సత్యం సతాం గురూణాం విశిష్టకర్మాణ ముగ్ర మతినిపుణం,
శుద్ధం శూరం క్రూరం గురురిహ భౌమేక్షితస్సింహే 51

సింహరాశియందు బృహస్పతి యుండగా అంగారకుఁడు చూచెనేని సత్యవాది, గురువులలో సత్పురుషులలో ఎన్నికగలపనుల నొనర్చువాఁడు, ఉగ్రుఁడు, మిక్కిలి నేర్పరి, పరిశుద్ధమైనవాఁడు, శూరుఁడు, క్రూరుఁడు నగును.

గృహవాస్తుజ్ఞానరతం విజ్ఞానగుణాన్వితం రుచిరవాక్యం,
సింహే మంత్రిణ మగ్ర్యం బుధేక్షితో విశ్రుతం జీవః. 52

బృహస్పతి సింహరాశియందుండి బుధునిచే జూడఁబడెనేని గృహవాస్తుశాస్త్ర [illegible] తెలిసినవాఁడు, విజ్ఞానము మంచిగుణములు గలవాఁడు, లోకప్రియ [illegible]వాఁడు, మంత్రి, [illegible], ప్రసిద్ధుఁడు నగును.

దయితం స్త్రీణాం సుభగం భూపతిసత్కారసత్కృతం పురుషం,
సితదృష్టస్సురపూజ్యో జనయతి సింహే మహాసత్వమ్. 53

బృహస్పతి సింహరాశియందుండి శుక్రునిచేఁ జూడఁబడెనేని స్త్రీలకు ప్రియుఁడు, రాజసత్కారములచే గౌరవింపఁబడువాఁడు, దేవతలచేత పూజలనందువాఁడు, గొప్ప బలవంతుఁడు నగును.

బహుకథనమధురవచనం సుఖరహితం చిత్రభాగినం తీక్ష్ణం,
అమరస్త్రీతుల్యసుఖం సింహగురుః సౌరసందృష్టః 54

బృహస్పతి సింహరాశియందుండి శనిచేఁ జూడఁబడెనేని విస్తారముగాను రమ్యముగాను మాట్లాడువాఁడు, సుఖములేనివాఁడు తీక్ష్ణమైనవాఁడు, పచ్చశరీరము గలవాఁడు, దేవలోకస్త్రీలతో సరిపోల్పఁదగినస్త్రీలతో సౌఖ్యముల నందువాఁడు నగును.

స్వక్షేత్రమందున్న గురుదృష్టిఫలము.

నృపతివిరుద్ధం జనయతి విబుధగురుస్సంస్థితస్స్వగృహే,
రవిదృష్టః పరితప్తం ధనబంధుజనేన పరియుక్తమ్. 55

బృహస్పతి స్వక్షేత్రము (ధనుస్సు-మీనము) న నుండి సూర్యునిచేఁ జూడఁబడెనేని రాజవిరోధి, దుఃఖములచే పీడింపఁబడువాఁడు, ధనము బంధువులుఁగలవాఁడు నగును.

నానావిధసౌఖ్యయుతం స్వగృహే చంద్రేక్షితో జీవః,
అతిసుభగం యువతీనాం మానధనైశ్వర్యగర్వితం కురుతే 56

బృహస్పతి స్వక్షేత్రమున నుండి చంద్రునిచేఁ జూడఁబడెనేని అనేకవిధములగు సౌఖ్యముల ననుభవించువాఁడు, మిక్కిలి అందకాఁడు, అభిమానము ధనము ఐశ్వర్యము అనువీనిచే గర్వించినవాఁడు నగును.

సంగ్రామే వికృతాంగం క్రూరం వధకం పరోపకారపరం,
జనయతి కుజేన దృష్టో దేవగురు ర్నష్టపరివారమ్. 57

స్వక్షేత్రమున నున్నబృహస్పతి కుజునిచేఁ జూడఁబడెనేని యుద్ధసమయమున వికలములయిన అవయవములుఁగలవాఁడు, క్రూరుఁడు, ఘాతకుఁడు, పరోపకారపరుఁడు, నశించినసేవకులు గలవాఁడు నగును.

మంత్రిణమథ నృపతిం వా సుతధనసౌభాగ్యసౌఖ్యసంపన్నం,
స్వగృహే బుధేన దృష్టస్సకలానందం గురుః కురుతే. 58

గురువు స్వక్షేత్రమున నుండి బుధునిచే జూడఁబడెనేని రాజుగనో రాజమంత్రి గనోగాని, సుతులు ధనము సౌఖ్యము సమృద్ధిగాఁగలవాఁడు, సర్వజనులకు ఆనందము కల్గించువాఁడు నగును.

సుఖినం ధనినం ప్రాజ్ఞం వ్యపగతదోషం చిరాయుషం సుభగం,
స్వగృహే సితేన దృష్టో లక్ష్మీపరివేష్టితం గురుః పురుషమ్. 59

స్వక్షేత్రమున గురువుండి శుక్రునిచే జూడఁబడెనేని జాతకుఁడు సౌఖ్యవంతుఁడు, ధనవంతుఁడు, ప్రాజ్ఞుఁడు, దోషములేమియుం లేనివాఁడు, చిరాయుష్మంతుఁడు, సౌందర్యవంతుఁడు, లక్ష్మీవిలాసములచే నొప్పారువాఁడు నగును.

మలినమతీవ చ సుభగం గ్రామపురశ్రేణిధిక్కృతం దీనం,
స్వగృహగురుశ్శశిదృష్టో జనయతి సుఖభోగధర్మపరిహీనమ్. 60

స్వక్షేత్రమున గురువుండి శనిచే జూడఁబడెనేని మలినుఁడు, మిక్కిలి సౌందర్యవంతుఁడు, గ్రామముల పట్టణముల వీథుల తిరస్కరింపఁబడువాఁడు సౌఖ్యము భోగము ధర్మము లేనివాఁడు నగును.

శనిక్షేత్రమందున్న గురుదృష్టిఫలము.

ప్రాజ్ఞం పృథివీపాలం సౌరగృహే భానునా చ సందృష్టః,
ప్రకృతిసమృద్ధం జనయతి బహుభోగసమన్వితం సువిక్రాంతమ్. 61

గురువు శనిక్షేత్రము (మకరము-కుంభము) నందుండి సూర్యునిచే జూడఁబడెనేని ప్రాజ్ఞుఁడు రాజు మంత్రి దూత సైన్యము మొదలుగాఁగల ఏడువిధములగు ప్రకృతి బలముగలవాఁడు, అనేకభోగముల ననుభవించువాఁడు, మిక్కిలి పరాక్రమవంతుఁడు నగును.

పితృమాతృభక్తమార్యం కులోద్భవం ప్రాజ్ఞ మాఢ్య మాదేయం,
చంద్రేక్షితస్తు జీవ స్సుశీల మతిధార్మికం శనిభే 62

బృహస్పతి శనిస్థానమున నుండి చంద్రునిచే జూడఁబడెనేని తలిదండ్రులయెడ భక్తిగలవాఁడు, పూజ్యుఁడు, మంచివంశమున జన్మించువాఁడు, ప్రాజ్ఞుఁడు, సంపన్నుఁడు, అందరిచే "ఇతను కావలయును"నని అనుపించుకొనువాఁడు,మంచినడవడిగలవాఁడు నగును.

శూరం నరేంద్రయోధం గర్వితమోజస్వినం సువేషం చ,
విఖ్యాత మార్యమాన్యం శనిభే వక్రేక్షితో జీవః. 63

బృహస్పతి శనిస్థానమున నుండి అంగారకునిచేఁ జూడఁబడెనేని శూరుఁడు, రాజసైన్యమునవీరుఁడు, గర్వవంతుఁడు, తేజస్సుగలవాఁడు, మంచివేషముగలవాఁడు, ప్రసిద్ధుఁడు, సత్పురుషులచే సత్కరింపఁబడువాఁడు నగును.

కామమతిం గణముఖ్యం మానవమథ సార్థవాహమాఢ్యం వా,
ఖ్యాత మతిమిత్రవంతం బుధసందృష్టో గురు శ్శనిభే 64

బృహస్పతి శనిస్థానమున నుండి బుధునిచేఁ జూడఁబడెనేని స్వేచ్ఛానుసారమైన బుద్ధిగలవాఁడు, ఒకగుంపున కధిపతి, వర్తకుఁడు, సంపన్నుఁడు, ప్రసిద్ధుఁడు, అనేక స్నేహితులు గలవాఁడు నగును.

భోజ్యాన్న పానవిభవం వరగృహశయనాసనో త్తమస్త్రీకం,
ఆభరణవసనవంతం శనిభే శుక్రేక్షితో జీవః 65

బృహస్పతి శనిస్థానమున నుండి శుక్రునిచేఁ జూడఁబడెనేని మృష్టాన్నము చక్కనిపానీయములు పుష్కలముగాఁగలవాఁడు, శ్రేష్ఠములగుగృహములు శయనములు ఆసనములు ఉత్తమురాండ్రగుస్త్రీలుం గలవాఁడు, ఆభరణములు వస్త్రములుంగలవాఁడు నగును.

అనుపమవిద్యావృత్తం మహత్తరం దేశపార్థివం శనిభే,
ద్విపదచతుష్పద మాఢ్యం భోగిన మథ సౌరవీక్షితో జీవః 66

బృహస్పతి శనిక్షేత్రమున నుండి శనిచేఁ జూడఁబడెనేని సాటిలేనిపాండిత్యము గలవాఁడు, గొప్పవాఁడు, ఒకదేశమునకు రాజు, సేవకులు పశువులు సమృద్ధిగాఁగల వాఁడు, సంపన్నుఁడు, భోగవంతుఁడు నగును.

ఇతి సప్తవింశోఽధ్యాయః

---

## శుక్రచారమును దెలుపు ఇరువదియెనిమిదవ యధ్యాయము.

నైశాంధో బహుదోషో విరోధశీలః పరాంగనాచోరః,
వేశ్యావనాద్రిచారీ స్త్రీహేతో ర్బంధనం ప్రాప్తః. 1
క్షుద్రః కఠోరచోర శ్చమూపురశ్రేణిబృందనాథశ్చ,
మేషే స్యాద్భృగుతనయే నోవిశ్వాసీ ప్రగల్భ శ్చ 2

శుక్రుఁడు మేషమున నుండగా జననమైన రేజీఁకటిగలవాఁడు, అనేకదోషములుగలవాఁడు, కలహించుస్వభావముగలవాఁడు, ఇతరులభార్యల నపహరించువాఁడు,

వేశ్యలతో అరణ్యముల పర్వతముల సంచరించువాఁడు, స్త్రీవలన నిర్బంధమును బొందువాఁడు, నీచుఁడు, గజదొంగ, సేనాపతి, నగరాధిపతి, వీథీసమూహములకధిపతి, నమ్మకములేనివాఁడు, ప్రగల్భములాడువాఁడు నగును.

బహుయువతిరత్నసహితః కృషీవలో గంధమాల్యవస్త్రయుతః,
గోకులజీవీ దాతా స్వబంధుభర్తా సుమూర్తిశ్చ. 3
ఆఢ్యస్త్వనేకవిద్యో బహుప్రదస్సత్త్వహితకారీ,
వృషభే గుణైః ప్రధానః పరోపకారీ సితే భవతి జాతః 4

శుక్రుఁడు వృషభమున నుండఁగా జన్మించిన అనేకమంది స్త్రీలు రత్నములు గలవాఁడు, వ్యవసాయమొనర్చువాఁడు, మంచిసుగంధములు పుష్పమాలికలు విలువగల వస్త్రములు గలవాఁడు, గోసమూహముచే జీవించువాఁడు, దాత, తనచుట్టములపోషించువాఁడు, సౌందర్యముకలదేహముకలవాఁడు, సంపన్నుఁడు, అనేకవిద్యలయం దారితేరినవాఁడు, బహుప్రదుఁడు, పశువులకు మేలుచేయువాఁడు, గుణవంతుఁడు, పరోపకారియు నగును.

విజ్ఞానకలాశాస్త్రః ప్రథితస్సతతం సుమూర్తిగః కామీ,
ఆలేఖ్యలేఖ్యనిరతః కావ్యకరస్స్యాత్ప్రియస్సాధుః 5
ధృతగీతనృత్తవిభవస్సుహృజ్జనాఢ్యస్సురద్విజానురతః,
సంరూఢస్నేహో వై మిథునస్థే భార్గవే భవతి. 6

శుక్రుఁడు మిథునమున నుండఁగాఁ బుట్టినవాఁడు విజ్ఞానము చతుష్షష్టికళల నెఱింగినవాఁడు, ప్రఖ్యాతిగలవాఁడు, ఎల్లపుడు సౌందర్యవంతుఁడు, కాముకుఁడు, చిత్తరువులను ఇతరవ్రాతలను వ్రాయ నాసక్తిగలవాఁడు, కావ్యములను రచింప నేర్పుగలవాఁడు, ప్రియుఁడు, సత్పురుషుఁడు, గానము నాట్యము నెఱిఁగినవాఁడు, స్నేహితులు పుష్కలముగాఁగలవాఁడు, దేవబ్రాహ్మణభక్తిగలవాఁడు, స్నేహముగలవాఁడు నగును.

రతిధర్మరతః ప్రాజ్ఞో బలీమృదుర్గుణవతాం ప్రధానశ్చ,
ఆకాంక్షితైస్సుఖార్థైర్యుక్తః ప్రియదర్శనస్సునీతిశ్చ. 7

యోషిత్పానప్రభవైర్వ్యాధిభిరధికం ప్రపీడితో మనుజః,
శుక్రే కర్కటసంస్థే స్వవంశభవదోషసంతప్తః. 8

శుక్రుఁడు కర్కటకమున నుండఁగా గల్గినరతిధర్మముల నెఱింగినవాఁడు, ప్రాజ్ఞుఁడు, బలవంతుఁడు, మృదువైనవాఁడు, గుణవంతులలో మొదటివాఁడు, కోరినసుఖములబడయు

వాఁడు, అందగాఁడు, నీతిగలవాఁడు, స్త్రీలవలన మద్యపానమువలన సంభవించినవ్యాధు లచే బాధలనొందువాఁడు, తనవంశమునకు కలిగిన కళంకముచే మిగుల విచారమునొందు వాఁడు నగును.

యువతిజనోపాసనయా లబ్ధసుఖద్రవిణసంప్రమోదశ్చ,
లఘుసత్వప్రియబంధు ర్విచిత్రసౌఖ్య శ్చ దుఃఖి చ. 9
ఉపకారీ చ పరేషాం గురుద్విజాచార్యసంమతో నిరతః,
సింహస్థే భృగుతనయే బహుచింతాస్వనభియోగస్స్యాత్ 10

శుక్రుఁడు సింహరాశియందుండఁగా జన్మించినవాఁడు స్త్రీల నాశ్రయించుట వలనపొందిన ధనముగలవాఁడు, కొంచెముపాటి బలము గలవాఁడు, బంధుప్రీతిగల వాఁడు, విచిత్రమైన సౌఖ్యముగలవాఁడు, దుఃఖవంతుఁడు, ఇతరుల కుపకారమొనర్చు వాఁడు, తలిదండ్రులకు బ్రాహ్మణులకు గురువులకు ఇష్టుఁడు, అనేకచింతలయందు సంబంధములేనివాఁడు నగును.

లఘుచింతో మృదునిపుణః పరోపసేవీ కలావిధిజ్ఞశ్చ,
స్త్రీసంభాషణమధురః ప్రణయనగణనార్థకృతయత్నః 11
నారీషు దుష్టరతిషు ప్రణయీ దీనో నసౌఖ్యభోగయుతః,
కన్యాయాం భృగుతనయే తీర్థసభామండితో జాతః 12

కన్యయందు శుక్రుఁ డుండఁగాఁ బుట్టినవాఁడు కొంచెము ఆలోచనగలవాఁడు, మృదువగువాఁడు, నేర్పరి, ఇతరుల సేవించువాఁడు, కళల నెఱిఁగినవాఁడు, స్త్రీలతో మాట్లాడుటయం దారితేరినవాఁడు, తనప్రేమ నెన్నికకు తెచ్చుటకై అనేకప్రయత్న ములు చేయువాఁడు, జారిణులగుస్త్రీలయం దాసక్తిగలవాఁడు, దీనుఁడు, సౌఖ్యము భోగము లేనివాఁడు, తీర్థములయందు సభలయందు ఖండింపఁబడువాఁడు నగును.

శ్రమలబ్ధవిత్తశూరో విచిత్రమాల్యాంబరో విదేశరతః,
నైపుణరక్షణకుశలః కర్మసు చపల స్సుదుష్కరేషు తథా 13
ఆఢ్యో రుచిరసుపుణ్యో ద్విజదేవార్చనవిలబ్ధకీర్తిశ్చ,
శుక్రే తులా ధరగతే భవతి పుమా న్పండిత స్సుభగః 14

తులయందు శుక్రుఁ డుండగా జన్మించినవాఁడు అనేకకష్టములవలన ధనమును నార్జించువాఁడు, విచిత్రములగు పుష్పమాలికలు వస్త్రములు, ధరించువాఁడు, పరదేశ ముల నుండువాఁడు, నేర్పరి, రక్షించుటయందు ప్రజ్ఞకలవాఁడు, మిక్కిలి కష్టనుఁలైన పనులయందు మెలఁగువాఁడు, సంపన్నుఁడు, పుణ్యవంతుఁడు, దేవబ్రాహ్మణులను సేవిం చుటవలన కీర్తినిపొందినవాఁడు, పండితుఁడు, సౌందర్యవంతుఁడు నగును.

విద్వేషరతిన్నృశంసో విముక్తధర్మా వికత్థనోఽతిశఠః,
సహజవికారో ధన్యో విపన్నశత్రు స్తథా పాపః. 15
ఆర్యః కులటాద్వేషీ వధనిపుణో బహ్వృణో దరిద్రశ్చ,
అలిని సితే భవతి పుమాన్ గర్హితశీలస్సుగర్హ్యగదః 16

శుక్రుఁడు వృశ్చికమందుండఁగాఁ గలిగినవాఁడు, ద్వేషముగలవాఁడు, కృతఘ్నుఁడు, ధర్మమును వదలినవాఁడు, ఆత్మశ్లాఘ నొనర్చుకొనువాఁడు, మిక్కిలి శఠుఁడు, స్వాభావికములగు అనేకవికారములు గలవాఁడు, శత్రువులందరు నశించినట్టి వాఁడు, పాపుఁడు, పెద్దమనిషి, జారిణులను ద్వేషించువాఁడు, చంపుటయందు నిపుణుఁడు, అనేకఋణములుగలవాఁడు, దరిద్రుఁడు, నిందించఁదగిన నడవడిగలవాఁడు, చూచినంతనే అసహ్యమునుగల్గించు రోగములుగలవాఁడు నగును

సద్ధర్మకర్మధనజైః ఫలైరుపేతో జగత్ప్రియః కాంతః,
ఆర్యః కులబ్ధశబ్దో విద్వాన్ గోమా నలంకరిష్ణుశ్చ. 17
సద్విత్తదారసుభగో నరేంద్రమంత్రీ సుచతురోఽపి,
పీనోచ్ఛ్రితనుః పూజ్యస్సతాం సమూహస్య ధనుషి కవౌ. 18

శుక్రుఁడు ధనుస్సునందుండఁగాఁ బుట్టినవాఁడు మంచిధర్మము సత్కర్మలు ధనము వీనివలనకలిగిన ఫలముల ననుభవించువాఁడు, ప్రపంచమునకంతకు నిష్టుఁడు, సౌందర్యవంతుఁడు, పూజ్యుఁడు, ప్రపంచమున పేరెన్నికగలవాఁడు, విద్వాంసుఁడు, గోవులు విశేషముగాఁగలవాఁడు, అలంకారములు గలవాఁడు, పుష్కలమగుధనము మంచి నడవడిగల భార్యయుం గలవాఁడు, రాజమంత్రి, మంచిచతురుఁడు, లావైన పొడవైన దేహముగలవాఁడు, సత్పురుషులగోష్ఠిలో గౌరవము నందువాఁడు నగును.

వ్యయభయపరిసంతప్తో దుర్బలదేహో జరాంగనాసక్తః,
హృద్రోగీ ధనలుబ్ధో లోభాన్నృతవంచనో నిపుణః. 19
క్లీబో విపన్నచేష్టః పరార్థచేష్టస్సుదుఃఖితో మూఢః,
మకరే దానవపుజ్యే క్లేశసహో జాయతే పురుషః. 20

శుక్రుఁడు మకరమున నుండఁగా జననమందినవాఁడు, ధనవ్యయమువలన భయము వలన పీడింపఁబడువాఁడు, దుర్బలదేహముకలవాఁడు, వృద్ధస్త్రీలయం దాసక్తిగలవాఁడు, హృదయరోగములుగలవాఁడు, లోభి, అసత్యము మోసముగలవాఁడు, నేర్పరి, నపుంసకుఁడు, ఆపదలను తెచ్చుపనుల నొనర్చువాఁడు, ఇతరులకొఱకు పనులనొనర్చువాఁడు, దుఃఖవంతుఁడు, మూర్ఖుఁడు, కష్టములనహించువాఁడును నగును.

ఉద్వేగరోగతప్తః కర్మసు విఫలేషు సర్వదాభిరతః,
పరయువతిగో విధర్మా గురుభిః పుత్రైశ్చ కృతవైరః. 21
స్నానోపభోగభూషణవస్త్రాదినిరాకృతో మలినః,
కుంభధరే భృగుపుత్రే భవతి పుమాన్నాత్ర సందేహః 22

శుక్రుఁడు కుంభరాశియందుండఁగాఁ గల్గినవాఁడు తీవ్రవేగముగలవ్యాధులచే బాధింపఁబడువాఁడు, వ్యర్థములైనపనులయం దాసక్తిగలవాఁడు, ఇతరస్త్రీలనుపొందువాఁడు, ధర్మహీనుఁడు, తలిదండ్రులతో తనపుత్రులతో పోరాడువాఁడు, స్నానము సౌఖ్యము భూషణములు మంచివస్త్రములు లేనివాఁడు, మలినుఁడు నగును.

దాక్షిణ్యదానగుణవా న్మహాధనోఽధఃకృతారిపక్షశ్చ,
లోకే ఖ్యాతశ్శ్రేష్ఠో విశిష్టచేష్టో నృపతిదయితః. 23
వాగ్బుద్ధియుతోదారస్సుజనపరిలబ్ధవిభవమానశ్చ,
స్వాదేయవచా మీనే వంశధరో జ్ఞానవాన్ శుక్రే 24

జననకాలమున శుక్రుఁడు మీనమున నుండునేని దయ దానముగలవాఁడు, గొప్ప ధనవంతుఁడు, శత్రువు ధిక్కరించి ఓడించినవాఁడు, లోకమున ప్రసిద్ధుఁడు, శ్రేష్ఠుఁడు, సత్కార్యముల నొనర్చువాఁడు, రాజప్రీతిగలవాఁడు, మంచివాక్కు, నిశితమగు, బుద్ధిగలవాఁడు, ఉదారమైన స్వభావముగలవాఁడు, సత్పురుషులచే పొందఁబడిన వైభవము సన్మానముగలవాఁడు, పలాపురిచే తనమాట నంగీకరించునట్లుచేయువాఁడు, జ్ఞానవంతుఁడు నగును.

కుజక్షేత్రమునందున్న శుక్రదృష్టిఫలము.

స్త్రీహేతోర్దుఃఖార్తం యువతినిమిత్తాద్వినష్టధనసౌఖ్యం,
కుజభవనే రవిదృష్టో జనయతి శుక్రో నృపం ప్రాజ్ఞమ్. 25

జననకాలమున శుక్రుఁడు కుజక్షేత్రము (మేషము-వృశ్చికము) న నుండి సూర్యునిచేఁ జూడఁబడగాఁ బుట్టినవాఁడు స్త్రీవలన దుఃఖములపొందువాఁడు, స్త్రీవలన ధనము సౌఖ్యము నశించినవాఁడు, రాజు, ప్రాజ్ఞుఁడు నగును.

ఉద్బంధనమతిచపలం కామాతురమధమయువతిభర్తారం,
జనయతి భృగో రిపత్యం రజనీకరవీక్షితం కుజభే 26

శుక్రుఁడు కుజక్షేత్రముననుండి చంద్రునిచేఁ జూడఁబడెనేని జాతకుఁడు గొప్ప బంధము పొందువాఁడు, మిక్కిలి చపలమైనస్వభావము గలవాఁడు, కామాతురుఁడు, తక్కువజాతిస్త్రీలతో భోగించువాఁడు నగును.

ధనసౌఖ్యమానరహితం పరకర్మకరం మలినచేష్టం,
జనయతి రుధిరక్షేత్రే రుధిరేణ నిరీక్షితశ్శుక్రః. 27

శుక్రుఁడు కుజక్షేత్రమున నుండి కుజునిచేఁ జూడఁబడెనేని ధనము సౌఖ్యము గౌరవము లేనివాఁడు, ఇతరులపనుల నొనర్చువాఁడు, నీచకృత్యముల నొనర్చువాఁడు నగును.

మూర్ఖం ధృష్టమనార్యం స్వబంధుపరివాదకం వినయహీనం,
చోరం క్షుద్రం క్రూరం బుధదృష్టో భార్గవః కురుతే. 28

కుజక్షేత్రమున శుక్రుఁ డుండఁగా బుధుఁడు చూచెనేని జాతకుఁడు మూర్ఖుఁడు, పోకిరి, నీచుఁడు, తనబంధువులతో పోరాడువాఁడు, వినయములేనివాఁడు, దొంగ, క్షుద్రుఁడు, క్రూరుఁడు నగును.

సునయనముదారదానం సుశరీరం వ్యాయతం బహుసుతం చ,
త్రిదశగురుదృష్టమూర్తి ర్జనయతి రుధిరాలయే శుక్రః. 29

శుక్రుఁడు కుజక్షేత్రమున నుండి గురునిచేఁ జూడఁబడెనేని మంచినేత్రములుగల వాఁడు, విరివిగా దానముచేయువాఁడు, మంచిశరీరముగలవాఁడు, పొడవైనవాఁడు, అనేకమంచిపుత్త్రులుగలవాఁడు నగును

అతిమలిన మలస మటన స్వభిమతజనసేవకం కురుతే,
భృగుతనయో రుధిరగృహే దినకరపుత్రేణ వీక్షితశ్చోరమ్. 30

శుక్రుఁడు కుజక్షేత్రమున నుండి శనిచేఁ జూడఁబడెనేని . మిక్కిలి నీచుఁడు, సోమరి, దేశద్రిమ్మరి, బంధువులను సేవించువాఁడు, దొంగయును నగును.

స్వక్షేత్రమందున్న శుక్రదృష్టిఫలము.

దినకరదృష్టశ్శుక్రో వరజాయాభోగినం ధనసమృద్ధం,
జనయత్యుత్తమపురుషం స్త్రీహేతోర్నిర్జితం స్వగృహే. 31

శుక్రుఁడు స్వక్షేత్రము (వృషభము-తుల)న నుండి సూర్యునిచేఁ జూడఁబడెనేని ఉత్తమురాలగుస్త్రీతో సౌఖ్యముల ననుభవించువాఁడు, ధనసమృద్ధిగలవాఁడు, ఉత్తముఁడు, స్త్రీవలన ఓడిపోయినవాఁడును నగును.

పరమకులీనాపుత్రం సుఖధనదానైస్సుఖైరుపేతం చ,
అతిశౌర్యమతిం కాంతం స్వగృహే చంద్రేక్షితశ్శుక్రః. 32

శుక్రుఁడు స్వక్షేత్రగతుఁడై చంద్రునిచే జూడఁబడెనేని జాతకుఁడు మిక్కిలి ఉత్తమవంశురాలిగర్భమున జనించువాఁడు, సౌఖ్యము ధనము దానము గలవాఁడు, మిక్కిలి పూజింపఁదగినబుద్ధిగలవాఁడు, అందమగువాఁడు నగును.

దుశ్శీలాభర్తారం ప్రమదాహేతోశ్చ నష్టగృహదారం,
జనయతి భృగునందకరో మదనవశం వక్రసందృష్టః. 33

శుక్రుఁడు స్వక్షేత్రమున నుండి కుజునిచే జూడఁబడెనేని చెడ్డవర్తనముగలభార్య గలవాఁడు, స్త్రీవల్ల నష్టమైనగృహము భార్యగలవాఁడు, కాముకుఁడు నగును.

కాంతం మధురం సుభగం సుఖధృతిమతిసంయుతం విపులసత్వం,
జనయతి బుధేన దృష్టస్సర్వగుణసమన్వితం ఖ్యాతమ్. 34

శుక్రుఁడు స్వక్షేత్రమున నుండి బుధునిచే జూడఁబడెనేని అందమైనవాఁడు, మధురమైనవాఁడు, అందకాఁడు, సుఖము ధైర్యము బుద్ధిగలవాఁడు, ఎక్కువబలము గలవాఁడు, సర్వగుణములు గలవాఁడు, ప్రసిద్ధుఁడు నగును.

ప్రమదాపుత్రగృహాణాం భాగినమథ యానవాహనానాం చ,
స్వర్క్షే గురుసందృష్టః కురుతే భృగురిష్టచేష్టానాం. 35

శుక్రుఁడు స్వక్షేత్రమున నుండి గురునిచే జూడఁబడెనేని జాతకుఁడు భార్య పుత్త్రులు గృహములు గలవాఁడు, వాహనములు బండ్లుగలవాఁడు, ఇష్టమగుపనుల నొనర్చువాఁడు నగును.

స్వల్పసుఖం స్వల్పధనం దుశ్శీలం వర్ధకిపతిం చైవ,
సౌరేక్షితస్తు జనయేద్వ్యాధితదేహం నరం శుక్రః. 36

శుక్రుఁడు స్వక్షేత్రమున నుండఁగా శని చూచెనేని స్వల్పసౌఖ్యము స్వల్పధనము గలవాఁడు, చెడ్డనడవడిగలవాఁడు, వ్యభిచారిణియగు భార్యగలవాఁడు, వ్యాధులచే బాధింపఁబడుశరీరముగలవాఁడు నగును.

బుధక్షేత్రమందున్న శుక్రదృష్టిఫలము.

నృపజననీపత్నీనాం కృత్యకరం పండితం ధనినం,
దినకరదృష్టశ్శుక్రో జనయతి సుఖభాగినం బుధభే. 37

శుక్రుఁడు బుధక్షేత్రము (మిథునము-కన్య) న నుండి సూర్యునిచే జూడఁబడు చుండఁగా జన్మించినవాఁడు రాజమాతలయొద్ద రాజపత్నులయొద్ద సేవనొనర్చువాఁడు, పండితుఁడు, ధనవంతుఁడు, సుఖమునుపొందువాఁడు నగును.

కృష్ణనయనం సుకేశం శయనాసనయానభాగినం కాంతం,
సుకుమారమిందుదృష్టో జనయతి శుక్రో నరం సుభగమ్. 38

శుక్రుఁడు బుధక్షేత్రమున నుండి చంద్రునిచేఁ జూడఁబడెనేని నల్లనికండ్లుగల వాఁడు, మంచివెండ్రుకలుగలవాఁడు, శయనములు ఆసనములు వాహనములుగలవాఁడు, సుకుమారుఁడు, సౌందర్యవంతుఁడు నగును.

కామపరమతిచ సుభగం యువతికృతే చార్థనాశనం కురుతే,
వక్రేక్షిత స్తు శుక్రో బుధభవన ముపాశ్రితః ప్రసవే. 39

ప్రసూతిసమయమున శుక్రుఁడు బుధస్థానమున నుండి కుజునిచేఁ జూడఁబడెనేని జాతకుఁడు కాముకుఁడు, మిక్కిలి సొగసైనవాఁడు, స్త్రీకొఱకు ధనము నశింపఁజేసుకొను వాఁడును నగును.

ప్రాజ్ఞం మధురం ధనినం వాహనపరివారభాగినం సుభగం,
గణపతి మర్థేశంవా బుధదృష్టో భార్గవో బుధభే. 40

శుక్రుఁడు బుధస్థానమున నుండి బుధునిచేఁ జూడఁబడెనేని బాగా తెలిసినవాఁడు, మధురమైనవాఁడు, ధనవంతుఁడు, వాహనము పరివారముగలవాఁడు, సౌందర్యవంతుఁడు, సమూహమున కధిపతియుఁ నగును.

బుధభవనగత శ్శుక్ర స్త్రిదశగురునిరీక్షితః కురుతే,
అతిసుఖ మతీవ దీనం ప్రతిరూపకరం జ్ఞమాచార్యం 41

బుధస్థానమున శుక్రుఁడుండి గురునిచేఁ జూడఁబడెనేని మిక్కిలి సుఖవంతుఁడు, మిక్కిలి దీనుఁడు, చిత్రములనువ్రాయువాఁడు, తెలిసినవాఁడు, ఉపాధ్యాయుఁడు నగును.

దినకరసుతేన దృష్టో బుధభవనగతోఽతిదుఃఖినం శుక్రః,
జనయతి ఖలు పరిభూతం చపలం ద్వేష్యం చ మూర్ఖం చ. 42

శుక్రుఁడు బుధుని స్థానమున నుండి శనిచేఁ జూడఁబడెనేని మిక్కిలి దుఃఖము లనుభవించువాఁడు, ఇతరులచే నవమానింపఁబడువాఁడు, చపలుఁడు, ఇతరులచే ద్వేషింపఁ బడువాఁడు, మూర్ఖుఁడు నగును.

చంద్రక్షేత్రమందున్న శుక్రదృష్టిఫలము.

కర్మపరాం శుద్ధాంగీం నృపతిసుతాం రోషణాం ధనోపేతాం,
భార్యాం దదాతి శుక్ర శ్చంద్రగృహే భానుసందృష్టః. 43

చంద్రక్షేత్రము (కర్కాటకము)న శుక్రుఁడుండి సూర్యునిచేఁ జూడఁబడెనేని జాతకుఁడు పనిపాటలయందు దెక్కువశ్రద్ధగలదియు, లోటులేనిఅవయవములుకలదియు, రాణిమాతయు, రోషముగలదియు, ధనవంతురాలును అగుభార్యగలవాఁ డగును

మాతృసపత్నీజననం కన్యాపూర్వప్రజం బహుసుతం చ,
సుఖినం సుభగం లలితం కురుతే చంద్రేక్షితశ్శుక్రః. 44

శుక్రుఁడు చంద్రస్థానమున నుండి చంద్రునిచేఁ జూడఁబడెనేని సవితితల్లిగలవాఁడు, మొదట స్త్రీసంతానము బహుపుత్రులుగలవాఁడు, సుఖవంతుఁడు, సౌందర్యవంతుఁడు, మృదువైనవాఁడు నగును

సుకలావిదమత్యాఢ్యం స్త్రీహేతోర్దుఃఖితం సుభగం,
భౌమేక్షితస్తు జనయే ద్వృద్ధికరం బంధువర్గస్య 45

చంద్రస్థానమున నున్నశుక్రుఁడు అంగారకునిచేఁ జూడఁబడెనేని జాతకుఁడు అరువదినాల్గుకళల నెఱిఁగినవాఁడు మిక్కిలి సంపన్నుఁడు, స్త్రీవలన దుఃఖములనొందువాఁడు, సౌందర్యవంతుఁడు, బంధువులకు మేలుచేయువాఁడును అగును.

పండితభార్యాపతికం బంధునిమిత్తం చ దుఃఖితం నిత్యం,
అతిసుఖధనినం ప్రాజ్ఞం కరోతి శశిభే బుధేక్షితశ్శుక్రః. 46

శుక్రుఁడు చంద్రక్షేత్రమున నుండి బుధునిచేఁ జూడఁబడుచుండఁగాఁ బుట్టినడు విద్వాంసురాలగుభార్యగలవాఁడు, ఎల్లపుడు బంధువులవలన దుఃఖించువాఁడు, మిక్కిలి సులభముగా ధనము నార్జించువాఁడు, ప్రాజ్ఞుఁడు నగును.

భృత్యైరర్థైశ్చ పుత్రైర్వాహనభోగైశ్చ బాంధవైర్మిత్రైః,
కురుతే నరమిహ యుక్తం నరపతిదయితం చ గురుదృష్టః 47

శుక్రుఁడు చంద్రస్థానమున నుండఁగా గురువు చూచెనేని జాతకుఁడు సేవకులు పుష్కలముగా ధనము పుత్రులు వాహనములు అపరిమితభోగములు బంధువులు స్నేహితులు గలవాఁడు, రాజున కమితప్రేమపాత్రుఁడు నగును.

స్త్రీనిర్జితం దరిద్రం పతిత మరూపం తథైవ చపలం చ,
జనయతి సుఖైర్విహీనం శశిభే శనివీక్షితశ్శుక్రః. 48

జననకాలమున శుక్రుఁడు చంద్రక్షేత్రమున నుండి శనిచేఁ జూడఁబడెనేని స్త్రీవలన ఓడిపోవువాఁడు, దరిద్రుఁడు, పతితుఁడు, రూపహీనుఁడు, చపలుఁడు, సుఖములేనివాఁడు అగును.

రవిక్షేత్రమందున్న శుక్రదృష్టిఫలము.

సేర్ష్యం కన్యాదయితం కామార్తం యువతికారణం ధనినం,
భాగిన మథ కరభాణాం జనయతి సింహే రవీక్షితశ్శుక్రః. 49

శుక్రుఁడు రవిక్షేత్రమున నుండి రవిచేఁ జూడఁబడెనేని అసూయగలవాఁడు, కన్యలతో భోగించువాఁడు, కామముచే ఎక్కువగా బాధింపఁబడువాఁడు, స్త్రీవలన ధనము పొందువాఁడు, ఒంటెల విశేషముగాఁ గలవాఁడు నగును.

మాతృసపత్నీజననం యువతికృతే దుఃఖితం విభవవంతం,
సింహేనానామతికం కరోతి చంద్రేక్షితశ్శుక్రః. 50

రవిక్షేత్రము (సింహము)న శుక్రుఁడుండి చంద్రునిచేఁ జూడఁబడెనేని చవితితల్లి గలవాఁడు, స్త్రీవలన కష్టములనొందువాఁడు, విభవములుగలవాఁడు, నిలకడలేనిబుద్ధిగలవాఁడు నగును.

నృపపురుషం విఖ్యాతం యువతికృతే వల్లభం ధనసమృద్ధం,
సుభగం పరదారరతం సింహే వక్రేక్షితశ్శుక్రః. 51

శుక్రుఁడు రవిక్షేత్రమున నుండి కుజునిచేఁ జూడఁబడెనేని రాజపురుషుఁడు, ప్రఖ్యాతిగలవాఁడు, స్త్రీకొఱకై సొగసుఁజేసుకొనువాఁడు, సంపన్నుఁడు, సౌందర్యవంతుఁడు, పరభార్యాసక్తుఁడు నగును.

సంగ్రహనిరతం లుబ్ధం స్త్రీలోలం పారదారికం శూరం,
శఠ మానృతికం ధనినం సింహే బుధవీక్షిత శ్శుక్రః. 52

శుక్రుఁడు రవిస్థానమున నుండి బుధునిచేఁ జూడఁబడెనేని జాతకుఁడు ఎల్లపుడు కూడబెట్టుస్వభావముగలవాఁడు, లోభి, స్త్రీలోలుఁడు, పరభార్యాసక్తుఁడు, శూరుఁడు, పోకిరి, అసత్యముపల్కువాఁడు, ధనవంతుఁడు నగును.

వాహనధనభృత్యయుతం బహుదారపరిగ్రహం రవిక్షేత్రే,
కురుతే నరేంద్రమంత్రిణ మింద్రగురునిరీక్షితశ్శుక్రః. 53

రవిస్థానమున శుక్రుఁడుండి గురునిచేఁ జూడఁబడఁగాఁ బుట్టినవాఁడు వాహనములు పుష్కలముగా ధనము సేవకులు గలవాఁడు, అనేకమందిభార్యలను పెండ్లాడినవాఁడు, రాజమంత్రియుం నగును.

నృపతిం నృపతిప్రతిమం విఖ్యాతం కోశవాహనసమృద్ధం,
రండాపతిం సురూపం దుఃఖయుతం సౌరసందృష్టః. 54

శుక్రుఁడు రవిస్థానమున నుండి శనిచేఁ జూడఁబడెనేని జాతకుఁడు రాజుగాగాని లేక రాజసమానుఁడుగాగాని, ప్రసిద్ధుఁడు, ధనము వాహనములు సమృద్ధిగాఁగలవాఁడు, జారిణియగుస్త్రీకి భర్త, సౌందర్యవంతుఁడు, అనేకదుఃఖములు గలవాఁడును అగును.

## గురుక్షేత్రమందున్న శుక్రదృష్టిఫలము.

అతిరౌద్రమతిచ శూరం గురుభే ప్రాజ్ఞంచ ధనినమతిదయితం,
రవిణా దృష్టో జనయతి విదేశగమనం నరం శుక్రః 55

శుక్రుఁడు గురుక్షేత్రము (ధనుస్సు-మీనము) న నుండి సూర్యునిచేఁ జూడఁబడెనేని జాతకుఁడు మిక్కిలి కోపముగలవాఁడు, శౌర్యవంతుఁడు, ప్రాజ్ఞుఁడు, ధనవంతుఁడు, మిక్కిలి ప్రేమగలవాఁడు, పరదేశముల సంచరించువాఁడు నగును.

ఖ్యాతం నరేంద్రపురుషం భోగైరశనైస్సమన్వితం విపులైః,
కురుతే హ్యనుపమసారం గురుభే చంద్రేక్షితశ్శుక్రః. 56

గురుక్షేత్రమున శుక్రుఁడుండి చంద్రునిచేఁ జూడఁబడెనేని ప్రసిద్ధిగలవాఁడు, రాజపురుషుఁడు, పుష్కలములగుభోగములు భోజనము లోటులేనిజీవనముగలవాఁడు, సాటిలేనిబలవంతుఁడు నగును.

అధికద్వేష్యం స్త్రీణాం విచిత్రసుఖదుఃఖమర్థవంతం చ,
కురుతే గోధన మగ్ర్యం గురుభే భౌమేక్షితశ్శుక్రః 57

గురుక్షేత్రమున శుక్రుఁడుండి అంగారకునిచేఁ జూడఁబడెనేని స్త్రీలచే మిక్కిలి అసహ్యముగా చూడఁబడువాఁడు, విచిత్రములగు సుఖదుఃఖములుగలవాఁడు, ధనముగలవాఁడు, గొప్పగోవులసముదాయము గలవాఁడు నగును.

ఆభరణభూషణానాం భాగినమపి చాన్నపానానాం,
బుధదృష్టోభృగుతనయః కురుతే గురుభేఽర్థవాహనసమృద్ధమ్ 58

గురుక్షేత్రమున శుక్రుఁడుండి బుధునిచేఁ జూడఁబడెనేని ఆభరణములు విశేషముగాఁగలవాఁడు, అన్నపానములకు లోటులేనివాఁడు, ధనము వాహనములు పుష్కలముగాఁగలవాఁడు నగును.

గజతురగగోధనాఢ్యః బహుపుత్రకళత్ర మతిసుఖినం,
గురుణాదృష్టో గురుభే జనయతి శుక్రో మహావిభవమ్

గురుక్షేత్రమున నున్నశుక్రుడు గురునిచేఁ జూడఁబడెనేని జాతకుఁడు ఏనుగులు గుఱ్ఱములు గోవులు ధనము విరివిగాఁగలవాఁడు, అనేకమందిపుత్రులు భార్యలుగలవాఁడు, మిక్కిలి సౌఖ్యవంతుఁడు, మహావైభవములుగలవాఁడు నగును.

నిత్యం చ ధనప్రాయం సుఖినం భోగాన్వితం ధనసమృద్ధం,
గురుభవనే శనిదృష్టః కురుతే శుక్రో నరం సుభగమ్. 60

శుక్రుఁడు గురుక్షేత్రమున నుండి శనిచేఁ జూడఁబడెనేని ఎల్లపుడు ధనముగలవాఁడు, సుఖముగలవాఁడు, భోగి, సౌందర్యవంతుఁడును అగును

శనిక్షేత్రమందున్న శుక్రదృష్టిఫలము.

స్తిమితం వృషభం స్త్రీణాం మహాధనం సత్యసౌఖ్యసంపన్నం,
సౌరగృహే రవిదృష్టః కురుతే శుక్రో నరం శూరమ్ 61

జననకాలమున శుక్రుఁడు శనిక్షేత్రము (మకరము-కుంభము)ననుండి సూర్యునిచేఁ జూడఁబడెనేని జాతకుఁడు నెమ్మదిగలవాఁడు, స్త్రీల నెల్లపుడు రతుల సంతృప్తిపరచఁగలవాఁడు, గొప్పధనవంతుఁడు, సత్యము సౌఖ్యముగలవాఁడు, శౌర్యవంతుఁడు నగును.

ఓజస్వినమతిశూరం స్వాఢ్యం వపుషాన్వితం సుభగం,
కురుతే శశినా దృష్టో రవిజగృహే భార్గవః కాంతమ్, 62

శనిక్షేత్రమున శుక్రుఁడుండి చంద్రునిచేఁ జూడఁబడెనేని తేజస్సుగలవాఁడు, మిక్కిలి శూరుఁడు, సంపన్నుఁడు, దేహదార్ఢ్యముగలవాఁడు, సౌందర్యవంతుఁడు నగును.

జాయావినాశకారణమనర్థబహుళం చ రోగిణం శుక్రః,
కురుతే శ్రమాభితప్తం పశ్చాత్సుఖినం చ కుజదృష్టః 63

శనిస్థానమున నున్నశుక్రుఁడు అంగారకునిచేఁ జూడఁబడెనేని జాతకుఁడు భార్యనాశనమునకు హేతువగువాఁడు, అనేకకష్టములుగలవాఁడు, రోగి, మొట్టమొదట అనేకకష్టముల ననుభవించి అవసానకాలమున సౌఖ్యముగానుండువాఁడును అగును.

ప్రాజ్ఞం ధనచయనిరతం నిధానరుచి మతిశయేన విద్వాంసం,
జనయతి బుధేన దృష్టో భృగుతనయస్సత్యసౌఖ్యసంపన్నమ్. 64

శుక్రుఁడు శనిస్థానమున నుండి బుధునిచేఁ జూడఁబడెనేని ప్రాజ్ఞుఁడు, ధనమును కూడఁబెట్టుటయందు బొక్కసముల చేకూర్చుటయందు గాఢమగు ఆదరముగలవాఁడు, గొప్పవిద్వాంసుఁడు, సత్యము సౌఖ్యము సంపత్తుగలవాఁడు అగును.

ప్రియవస్త్రమాల్యగంధం సుకుమారం గీతవాదితవిధిజ్ఞం,
జనయతి గురుణా దృష్టో భృగుపుత్రస్సత్కళత్రయుతమ్. 65

శనిస్థానమున శుక్రుఁడుండి గురునిచేఁ జూడఁబడెనేని వస్త్రములయందు పుష్పమాలికలయందు సుగంధాదిపరిమళద్రవ్యములయందు మంచిప్రేమగలవాఁడు, సుకుమారి, గానము చేయుట మృదంగాదులు వీణె మొదలగుజంత్రములవాయించునేర్పుగలవాఁడు, మంచిభార్యగలవాఁడు అగును.

సౌరగృహే శనిదృష్టశ్శుక్రో నరవాహనార్థభోగయుతం,
మలినం శ్యామశరీరం సుకుచిరగాత్రం మహాదేహమ్. 66

శనిస్థానమున నున్నశుక్రుఁడు శనిచేఁ జూడఁబడెనేని సేవకులు వాహనములు ధనముగలవాఁడు, నీచుఁడు, నల్లనిశరీరముగలవాఁడు, పొడవైన లోటులేనిదేహముగలవాఁడు అగును.

ఇత్యష్టావింశోఽధ్యాయః.

---

శనిచారమును దెలుపు ఇరువదితొమ్మిదవ యధ్యాయము.

వ్యసనపరిశ్రమతప్తః ప్రచండశీలస్స్వబంధుపక్షశ్చ,
నిష్ఠురఘుష్టాతివచా విగర్హితో నిర్ధనః కువేషశ్చ 1
మేషేఽర్కజో సువేషో జఘన్యకర్తా చ లబ్ధదోషోఽపి,
ప్రియవైరో నైష్కృతికో నృశంసకోఽసూయకః పాపః. 2

ప్రసవసమయమున శని మేషరాశియందున్న దుఃఖములచేత అనేకశరీరపరిశ్రమలచేత బాధలనొందువాఁడు, కఠినమైనస్వభావముగలవాఁడు, తనబంధుపక్షమున నుండువాఁడు, కఠినముగను అనవసరముగను సంభాషించువాఁడు, అందరిచే నిందింపఁబడువాఁడు, ధనహీనుఁడు, చెడ్డవేషములవేయువాఁడు, ఒకప్పుడు మంచివేషములను ధరించువాఁడు, నీచకృత్యముల నొనర్చువాఁడు, దోషములను అనేకములను చేసినవాఁడు, ఇష్టులతో కలహించువాఁడు, క్షమింపరానివాఁడు, ఘాతకుఁడు, అసూయగలవాఁడు, మిక్కిలి పాపుఁడు నగును.

అర్థవిహీనః ప్రేష్యో నయుక్తవాక్యో నసత్యకర్తా చ,
వృద్ధస్త్రీహృదయహరః కుసుహృత్ స్త్రీవ్యసనసంసక్తః. 3
సౌరే వృషభం యాతే భవతి చ జాతః పరాంగనాప్రేష్యః,
నైకృతికస్సుఘటదృష్టో బహుక్రియాసంగతో మూఢః. 4

శని వృషభమున నుండఁగా జననంబైన ధనములేనివాఁడు, సేవకుఁడు, మాటచెల్లు బడిలేనివాఁడు, నిజమైన పనులనుచేయనివాఁడు, వృద్ధస్త్రీలతో భోగించువాఁడు, దుర్మిత్రుఁడు, ఎల్లపుడు స్త్రీవ్యసనముగలవాఁడు, ఇతరస్త్రీలకు దౌత్యమునడుపువాఁడు, పాపాత్ముఁడు, పెద్దపొడవైన దేహముగలవాఁడు, అనేక కార్యముల నాసక్తిగలవాఁడు, మూర్ఖుఁడు నగును.

బహ్వృణబంధనతప్తశ్శ్రమాన్వితో డాంబికోఽనుమంత్రీచ,
శాఠ్యగుణైస్సంత్యక్తస్సదైవ గుహ్యాశ్చ కామశీలశ్చ. 5
ఛలకృచ్చ మనుష్యదృష్టః క్రియాతిశాయీ శఠః కులీనశ్చ,
బంధనవిహారసక్తో బాహ్యక్రీడానుగో మిథునే. 6

శని మిథునమున నుండఁగాఁ బుట్టినవాఁడు అనేకఋణములు బంధనములుఁగలిగి వానిచే మిగుల బాధింపఁబడువాఁడు, అనేకకష్టములుఁగలవాఁడు, డాంబికుఁడు, దేనినైనను ఒప్పుకొనువాఁడు, దుర్గుణములులేనివాఁడు, ఎల్లప్పుడు బహిరంగముగా నుండక ఒదిగిఒదిగి ఉండువాఁడు, కాముకుఁడు, మోసగాఁడు, కోపముగలవాఁడు, అనేక కార్యముల నారంభించువాఁడు, ఉత్తమవంశస్థుఁడు, కారాగృహములచరించుటకు కోరుకొనువాఁడు, బాహ్యక్రీడల (సురత) అసక్తిగలవాఁడుకాఁగలఁడు.

సుభగాన్వితో దరిద్రో బాల్యే రోగాతిపీడితః ప్రాజ్ఞః,
జననీరహితోఽతిమృదుర్విశిష్టనిరతస్సదాతురశ్చాపి. 7
పరబాధకో విశిష్టో బంధువిరుద్ధో విలోమశీలశ్చ,
మధ్యే భూపతితుల్యః పరిభోగవివర్ధితశ్శశిభే. 8

శని కర్కటకమున నుండఁగా జన్మించినవాఁడు సౌందర్యవంతుఁడు, దరిద్రుఁడు, పసితనముననే అనేకవ్యాధులచే బాధలనొందువాఁడు, ప్రాజ్ఞుఁడు, తల్లిలేనివాఁడు, మిక్కిలి మృదువైనవాఁడు, విశిష్టకర్మల నాచరించువాఁడు, ఎల్లప్పుడు కష్టపడువాఁడు, ఇతరులను బాధించువాఁడు, బంధువులతో వైరముచేయువాఁడు, తలక్రిందైన స్వభావము గలవాఁడు, జీవితమధ్యసమయమున రాజసమానుఁడు, అనేకభోగములుగలవాఁడు అగును.

లిపిపాఠ్యపరోఽభిజ్ఞో విగర్హితో విగతశీలశ్చ,
స్త్రీవియుతో భృతజీవీ స్వపక్షరహితో ముదాహీనః. 9
నీచక్రియాసు నిరతో వివృద్ధరోషో మనోరథైర్భ్రాంతః
భారోద్వహశ్రమదుఃఖైః ప్రకీర్ణదేహో యమే సింహే. 10

శని సింహమున నున్నపుడు జన్మించినవాఁడు వ్రాయుట చదువుట లెస్సగా నేర్చినవాఁడు, బాగుగా అన్నివిషయములను తెలిసినవాఁడు, అందరిచే నిందింపఁబడువాఁడు, మంచినడవడిలేనివాఁడు, భార్యావియోగము నందువాఁడు, కూలివలన జీవించువాఁడు, "తనవారు"అనువారు లేనివాఁడు, సంతోషహీనుఁడు, దుష్కార్యముల నొనరించువాఁడు, అధికరోషముగలవాఁడు, అనేకకోర్కెలతో ఎల్లప్పుడు నిలకడలేనివాఁడు, బరువు మోయుట చేత దూరము నడచుటచేత జీర్ణమగు దేహముగలవాఁడు నగును.

షండాకారోఽతిశఠః పరాన్నవేశ్యారతోఽల్పమంత్రశ్చ,
శిల్పకథాస్వనభిజ్ఞో నికృత్యచేష్టో లసత్సుతార్థశ్చ. 11
అధనః పరోపకారి కన్యాజనదూషకః క్రియాసు రతః,
కన్యాయాం రవితనయే హ్యాపేక్ష్యకారి పుమాన్ జాతః. 12

ప్రసవసమయమున శని కన్యారాశియందుండెనేని నపుంసకునివంటివాఁడు, మిక్కిలి దుర్మార్గుఁడు, పరాన్నము వేశ్యలు అనువీనియందు ఆసక్తిగలవాఁడు, ఆలోచనలేనివాఁడు, శిల్పశాస్త్రమున నేర్పులేనివాఁడు, నీచకృత్యముల చేయువాఁడు, యోగ్యులగుపుత్త్రులు వారిధనముగలవాఁడు, దరిద్రుఁడు, ఇతరుల కుపకారమొనర్చువాఁడు, వివాహము కానిపడుచులను భంగపఱచువాఁడు, కార్యముల నారంభించి కొనవఱకు పట్టుదలతో చేయువాఁడు, ఉపేక్షగలవాఁడు అగును.

అర్థపరశ్చారుపచా నరో విదేశాటనాప్తమానధనః,
నృపతిస్సుబోధనో వా స్వపక్షగుప్తస్థిరార్థస్స్యాత్. 13
బృందసభానాం జ్యేష్ఠో వయఃప్రకర్షాత్కృతాస్పదస్సాధుః,
కులటానటీవిటస్త్రీరమణో రవిజే తులాయాం తే. 14

జననకాలమున శని తులయందుండెనేని ధనమందు ఆశగలవాఁడు, అందముగా మాట్లాడఁగలవాఁడు, విదేశముల సంచారము చేయుటచే ధనము గౌరవము నార్జించువాఁడు, రాజుగాని మంచివక్తగాని, తనపక్షమున రహస్యముగా ధనము చేకూర్చువాఁడు, జనసమూహములలోను రాజసభలలోను గౌరవను నొందువాఁడు, వయస్సున పెద్దయగునప్పుడు పదిమందికి చేరవీలైనవాఁడు, సత్పురుషుఁడు, జాఁణస్త్రీలను వేషముల ధరించుస్త్రీలను విటులభార్యలను రమించువాఁడు అగును.

ద్వేషపరో విషమోవా విషశస్త్రఘ్నః ప్రచండకోపశ్చ,
లుబ్ధో ధృష్టోఽర్థయుతః పరస్వహరణే సమర్థశ్చ. 15
బాహ్యో మంగళవాద్యైర్న ప్రశంసకర్తా హ్యనేకదుఃఖస్స్యాత్,
అష్టమరాశౌ రవిజే క్షయవ్యయవ్యాధిభిస్తప్తః. 16

ప్రసవసమయమున శని వృశ్చికరాశియందుండెనేని ద్వేషముగలవాఁడు, సరియైననడవడిలేనివాఁడు, విషశస్త్రములచేత ఘాతుకకార్యముల నొనర్చువాఁడు, తీవ్రమైన కోపముగలవాఁడు, లోభి, గర్విష్ఠుఁడు, ధనవంతుఁడు, ఇతరులసొత్తు నపహరించువాఁడు, మంగళవాద్యములన్న సహించనివాఁడు, ఘోరకృత్యముల నాచరించువాఁడు, అనేక దుఃఖములుఁగలవాఁడు, క్షయవ్యాధి, ద్రవ్యవ్యయము, ఇతరవ్యాధులుఁగలవాఁడు అగును.

వ్యవహారబోధ్యశిక్షా శ్రుతార్థవిద్యాభిధానుకూలమతిః,
పుత్రగుణైర్విఖ్యాతస్స్వధర్మవృత్తైశ్చ శీలైశ్చ. 17
అంత్యే వయసి చ లక్ష్మీం భునక్తి పరమాం ప్రలబ్ధమానస్తు,
అల్పవచా బహుసంజ్ఞో మృదుర్యమే కార్ముకస్థే స్యాత్. 18

శని ధనుస్సునందుండగా జన్మించినవాఁడు వ్యవహారము ఇతరులకుబోధించుట, శాస్త్రములు అర్థశాస్త్రము మున్నగువానియందు నేర్పుగలవాఁడు, పుత్త్రులమంచిగుణములవలన ప్రఖ్యాతినొందువాఁడు, తనజాతికి విహితములగుధర్మములు నడవడికగలవాఁడు, చిట్టచివఱ గొప్పయైశ్వర్యముల ననుభవించువాఁడు, సంతోషముగలవాఁడు, మితముగా సంభాషించువాఁడు, అనేకపేర్లుగలవాఁడు, మృదువైనవాఁడు అగును.

పరయోషిత్క్షేత్రాణాం ప్రభుశ్శ్రితిగుణైర్యుతశ్చ బహుశిల్పః,
శ్రేష్ఠశ్చ వంశజాతైః పూజ్యః పరబృందసత్కృతః ఖ్యాతః. 19
స్నానవిభూషణనిరతః క్రియాకలాజ్ఞః ప్రవాసశీలశ్చ,
కోణే మృగభే జాతః ప్రజాతశౌర్యోపచారస్స్యాత్. 20

శని మకరమున నుండఁగా జననంబైన ఇతరులభార్యలను ఇతరులభూములను పొందువాఁడు, రాజగుణములు పండితగుణములుఁగలవాఁడు, శిల్పశాస్త్రజ్ఞుఁడు, తనజాతివారిలో శ్రేష్ఠుఁడు, పూజించఁదగినవాఁడు, ఇతరులచేత సత్కరింపఁబడువాఁడు, స్నానమొనర్చుట ఆభరణములధరించుట నియమముగా నొనర్చువాఁడు, పనుల నతి సులభముగా నొనర్చువాఁడు, ఇతరదేశముల నుండువాఁడు, శౌర్యవంతుఁడు అగును.

బహ్వాన్నృతస్సుమహాన్ స్యాన్మద్యస్త్రీవ్యసనసంప్రసక్తశ్చ,
ధూర్తకవంచనకుశలః కుసౌహృదో హ్యాలద్పృథశ్చండః. 21
జ్ఞానకథాస్మృతిబాహ్యః పరాంగనార్థస్సుకర్కశాభాషీ,
రవితనయే కుంభస్థే బహుక్రియారంభకృతయత్నః. 22

శని కుంభరాశియందుండఁగా జననంబైన ఎల్లపుడు అబద్ధములాడువాఁడు, గొప్పవాఁడు, మద్యము స్త్రీలు ఆనువీనియం దాసక్తిగలవాఁడు, దుర్మార్గుఁడు, మోసగాఁడు, చెడ్డస్నేహితుఁడు, మిక్కిలి పట్టుదల కోపముగలవాఁడు, జ్ఞానము స్మృతిలేనివాఁడు, ఇతరస్త్రీలు వారిధనముగలవాఁడు, మిక్కిలి కఠినముగా మాట్లాడువాఁడు, అనేకకార్యముల నారంభించి ముగించువాఁడు నగును.

ప్రియయజ్ఞశిల్పవిద్యస్స్వబంధుసుహృదాం ప్రధానశ్శాంతశ్చ,
సంవర్ధితార్థసునయో రత్నపరీక్షాసు కృతయత్నః 23
ధర్మవ్యవహారరతో వినీతశీలో గుణైస్సమాయుక్తః,
మీనే భాస్కరతనయే పశ్చాద్భావాస్పదం పురుషః 24

శని మీనమున నుండఁగా జన్మించినవాఁడు యజ్ఞాదిసత్కర్మలయెడ, శిల్పశాస్త్రమున ప్రేమగలవాఁడు, తనబంధువులలో స్నేహితులలో ముఖ్యమైనవాఁడు, శాంతుఁడు, ద్రవ్యమును నీతిని అభివృద్ధిచేయువాఁడు, రత్నపరీక్షయం దాసక్తిగలవాఁడు, ధర్మము వ్యవహారములయం దాసక్తిగలవాఁడు, వినయవంతుఁడు, గుణవంతుఁడు, పశ్చాత్తాపము గలవాఁడు నగును.

కుజక్షేత్రమందున్న శనిదృష్టిఫలము.

కర్షణనిరతమథాఢ్యం గోమహిషాజావిసంయుతం ధన్యం,
సూర్యేణ దృశ్యమానో జనయతి కర్మోద్యతం సౌరిః. 25

జననకాలమున శని కుజక్షేత్రమున (మేషము - వృశ్చికము)నుండి సూర్యునిచేఁ జూడఁబడెనేని వ్యవసాయమున నాదరముగలవాఁడు, సంపన్నుఁడు, ఆవులు గేదెలు మేకలు గొఱ్ఱెలుగలవాఁడు, కర్మిష్ఠియు నగును.

చపలం నీచప్రకృతిం నీచవిరూపాంగనాసు సంసక్తం,
శనిరిందుదృష్టమూర్తిస్సుఖధనరహితం నరం కురుతే. 26

శని కుజక్షేత్రమున నుండి చంద్రునిచేఁ జూడఁబడెనేని చపలుఁడు, నీచమైన స్వభావముగలవాఁడు, నీచురాండ్రు అందములేనివారు నగుస్త్రీలయం దాసక్తిగలవాఁడు, సౌఖ్యము ధనములేనివాఁడు అగును.

ప్రాణివధపరం క్షుద్రం కురుతే చోరాధిపం సువిఖ్యాతం,
ప్రియయువతిమాంసపానం సౌరో వక్రేక్షితః కుజభే. 27

శని కుజక్షేత్రమున నుండఁగా కుజునిచేఁ జూడఁబడెనేని ప్రాణివధ చేయువాఁడు క్షుద్రుఁడు, దొంగల కధిపతి, ప్రఖ్యాతిగలవాఁడు, స్త్రీలు మాంసము మద్యము అన వీనియం దాసక్తిగలవాఁడు నగును.

ఆనృతికమధర్మపరం బహ్వాశినం తస్కరం ప్రకాశం చ,
కాజే శనిర్జ్ఞదృష్టస్సుఖవిభవవినాకృతం పురుషమ్. 28

కుజక్షేత్రమున శని యుండి బుధునిచేఁ జూడఁబడెనేని అసత్యముపల్కువాఁడు, అధర్మము నొనర్చువాఁడు, అమితముగా భుజించువాఁడు, దొంగ ప్రసిద్ధుఁడు, సౌఖ్యము వైభవము లేనివాఁడు నగును.

సుఖధనసౌభాగ్యయుతం నృపమంత్రిణమగ్రగం చ సచివానాం,
గురుదృష్టో రవితనయః కుజగేహే మానవం కురుతే. 29

కుజక్షేత్రమున శని యుండి గురునిచేఁ జూడఁబడెనేని సౌఖ్యము ధనము సౌభాగ్యముగలవాఁడు, రాజమంత్రి, మంత్రులలో మొదటివాఁడు నగును.

అతిచపల మతివిరూఢం పరాంగనాపణ్యయువతిసంసక్తం,
కుజభవనే భృగుదృష్టో జనయతి రవిజో వివర్జితం భోగైః. 30

జన్మకాలమున శని కుజక్షేత్రమున నుండి శుక్రునిచేఁ జూడఁబడెనేని మిక్కిలి చంచలమైన స్వభావముగలవాఁడు, మిక్కిలి ఖ్యాతిగలవాఁడు, పరస్త్రీలతో వేశ్యలతోను సంచరించువాఁడు, భోగహీనుఁడు అగును.

శుక్రక్షేత్రమందున్న శనిదృష్టిఫలము.

స్ఫుటవాక్యం విగతధనం విద్వాంసం పరగృహేషు భోక్తారం,
రవిణా దృష్టస్సౌరి స్సితభే పరివేలవం పురుషమ్. 31

శని శుక్రక్షేత్రము (వృషభము - తుల)న నుండి సూర్యునిచేఁ జూడఁబడుచుండగాఁ బుట్టినవాఁడు స్పష్టమైన ఉచ్చారణముగలవాఁడు, ధనములేనివాఁడు, విద్వాంసుఁడు, ఇతరగృహముల భుజించువాఁడు, మిక్కిలి చులకనగా చూడఁబడువాఁడును అగును.

యువతిజనజనితసారం నృపమంత్రిపురస్కృతం యువతికాంతం,
శశినా దృష్టస్సౌరిః కురుతే సితభే కుటుంబపరివారమ్. 32

శని శుక్రస్థానమున నుండి చంద్రునిచేఁ జూడఁబడెనేని స్త్రీలవలన ధనము పొందు వాఁడు, రాజులచే మంత్రులచేత గౌరవింపఁబడువాఁడు, స్త్రీలకు మనోహరుఁడు, కుటుంబపరివారసమేతుఁడు నగును.

సంగ్రామకథాభిజ్ఞం సంగ్రామపలాయినం సుబహువాక్యం,
భృగుభే కుజసందృష్టో జనధనపరివేష్టితం సౌరిః 33

శని శుక్రస్థానముననుండి అంగారకునిచేఁ జూడఁబడెనేని యుద్ధవిషయము నెఱిం గినవాఁడు, యుద్ధమున వెన్నిచ్చి పరుగెత్తువాఁడు, మిక్కిలి మాట్లాడువాఁడు, సేవ కులు ధనముగలవాఁడు నగును.

నిత్యం విహాసనశీలం క్లీబతరం యువతిసేవకం నీచం,
బుధదృష్టో రవితనయశ్శుక్రగృహే మానవం కురుతే 34

శని శుక్రస్థానమున నుండి బుధునిచేఁ జూడఁబడుచుండఁగా జన్మించిన ఎల్ల పుడు వెకిలినవ్వు నవ్వువాఁడు, నపుంసకుఁడు, స్త్రీల కుపచారములొనర్చువాఁడు, నీచుఁడు నగును

పరవిషయదుఃఖసుఖినం పరకార్యకరం ప్రియం చ లోకస్య,
కురుతే గురుణా దృష్టో దాతారం సోద్యమం సౌరిః. 35

శుక్రక్షేత్రమున శని యుండి గురునిచేఁ జూడఁబడెనేని జాతకుఁడు ఇతరుల కొఱకై దుఃఖముల ననుభవించువాఁడు, అందువలననే సంతోషించువాఁడు, ఇతరులపను లను నెరవేర్చువాఁడు, లోకమునకంతకు ఇష్టుఁడు, దానశీలుఁడు, ఏదే నొకఉద్యమము నారంభించువాఁడు నగును

మద్యస్త్రీకృతసౌఖ్యం రత్నానాం భాజనం మహాసత్వం,
శుక్రగృహే సితదృష్టో జనయతి సౌరో నృపతిదయితమ్. 36

శుక్రస్థానమున నున్నశని శుక్రునిచేఁ జూడఁబడెనేని మద్యము స్త్రీ అనువీని వలన సౌఖ్యము నొందువాఁడు, రత్నముల నార్జించువాఁడు, గొప్పబలవంతుఁడు, రాజు లకు ప్రేమపాత్రుఁడు అగును

బుధక్షేత్రమందున్న శనిదృష్టిఫలము.

సుఖరహితమథాత్యంతం ధనరహితం ధార్మికం జితక్రోధం,
క్లేశసహిష్ణుం ధీరం బుధభే రవిపీడితసౌరిః. 37

శని బుధస్థానమున (మిథునము-కన్య)నుండి సూర్యునిచే జూడఁబడెనేని సుఖము ధనములేనివాఁడు, ధర్మపరుఁడు, క్రోధములేనివాఁడు, కష్టములసహించువాఁడు, ధైర్యవంతుఁడు అగును.

నృపతుల్యం స్నిగ్ధతనుం నారీభ్యః ప్రాప్తవిభవసత్కారం,
స్త్రీణాం వా కృత్యకరం సౌరశ్చంద్రేక్షితో బుధభే. 38

శని బుధస్థానమున నుండి చంద్రునిచే జూడఁబడుచుండఁగాఁ బుట్టినవాఁడు రాజుతో సమానుఁడు, నున్నని శరీరముగలవాఁడు, స్త్రీలవలన విశేషవిభవములను గౌరవములను పొందువాఁడుగాగాని స్త్రీలకు సేవచేయుఁవాఁడుగాగాని అగును.

విఖ్యాతమల్లమోహితమతిభారవహం తథావికృతగాత్రం,
రుధిరాంగవీక్షితతను ర్జనయతి సౌరో నరం బుధభే. 39

శని బుధస్థానమున నుండి అంగారకునిచే జూడఁబడెనేని జాతకుఁడు, పేరుపడసినమల్లులలో గొప్పవాఁడు, మిక్కిలి బరువు మోయువాఁడు, వికారమైన దేహముగలవాఁడు నగును.

ధనినం నియుద్ధకుశలం నృత్తాచార్యం చ గీతకుశలం చ,
శిల్పక మతీవ నిపుణం బుధభే బుధవీక్షితస్సౌరిః. 40

శని బుధస్థానమున నుండి బుధునిచే జూడఁబడెనేని ధనవంతుఁడు, యుద్ధము దారితేరినవాఁడు, నాట్యోపాధ్యాయుఁడు, గానమున నేర్పరి, శిల్పశాస్త్రము నెఱింగినవాఁడు, నిపుణుఁడు నగును.

ప్రాత్యయికం రాజకులే సర్వగుణసమన్వితం సతామిష్టం,
గుణగుహ్యాధనం కురుతే గురుణా దృష్టశ్శనైశ్చరీ. 41

శని బుధస్థానమున నుండి గురువుచే జూడఁబడెనేని రాజగృహమున నమ్మకము గలవాఁడు, సర్వసద్గుణములుగలవాఁడు, సత్పురుషులకందరకు ఇష్టుఁడు, గుణవంతుఁడు నగును.

స్త్రీమండలేషు కుశలం యోగాచార్యమథ యోగినం వాఽపి,
శుక్రేక్షితోఽర్కపుత్రస్త్రీణా మిష్టం నరం బుధభే 42

శని బుధస్థానముననుండి శుక్రునిచే జూడఁబడెనేని స్త్రీసమూహములో నేర్పరి, యోగశాస్త్రము బోధించువాఁడుగనో లేక యోగియో, స్త్రీలకు ఇష్టుఁడు నగును.

కర్కాటకమందున్న శనిదృష్టిఫలము.

పిత్రారహితం బాల్యే దినపతిదృష్టశ్శనైశ్చరశ్శశిభే,
ధనసుఖదారవిహీనం కదశనతుష్టం నరం పాపమ్. 43

శని చంద్రస్థానము (కర్కాటకము) న నుండి సూర్యునిచేఁ జూడఁబడెనేని జాతకుఁడు బాల్యముననే తండ్రిలేనివాఁడు, ధనము భార్య సౌఖ్యములేనివాఁడు, అపరిశుభ్రమగు ఆహారముచేతనే తృప్తినొందువాఁడు, పాపాత్ముఁడు నగును.

జన్మని మాతురనిష్టం ధనవంతం సహజపీడితం చైవ,
శశిదృష్టశ్శశిభవనే దినకరపుత్రో నరం కురుతే. 44

చంద్రస్థానమున శని యుండి చంద్రునిచేఁ జూడఁబడుచుండఁగా జననంబైన పుట్టువుతోడనే తల్లికి చేటుచేయువాఁడు, ధనవంతుఁడు, సామాన్యముగా బాధలనొందువాఁడు నగును.

నృపతిసమర్పితవిభవం వికలాంగం కనకరత్నపరివారం,
కుజదృష్టశ్శశిభవనే కుబంధుపత్నీరతం సౌరిః 45

శని చంద్రస్థానమున నుండి అంగారకునిచేఁ జూడఁబడెనేని రాజదత్తములైన యైశ్వర్యములుగలవాఁడు, అంగహీనుఁడు, సువర్ణము రత్నములు పరివారముగలవాఁడు, చెడ్డదియగుభార్య చెడ్డవారగు భార్యసంబంధులగు బంధువులతో కూడియుండువాఁడు నగును.

నిష్ఠురమతిప్రవాచం శమితారాతిం చ దాంభికం చాపి,
జనయత్యుత్తమచేష్టం బుధదృష్టో భాస్కరశ్శశిభే 46

శని చంద్రస్థానమున నుండి బుధునిచేఁ జూడఁబడెనేని కఠినమైనవాఁడు, మిక్కిలి వదరుబోతు, శత్రువుల నాశముజేయువాఁడు, డంబముపలుక్కువాఁడు, ఉత్తమకార్యముల నొనర్చువాఁడు నగును.

క్షేత్రగృహాణాం సుహృదాం పుత్రాణాం భాగినం నరం కురుతే,
ధనరత్నదారవంతం శశిభే గురువీక్షిత స్సౌరః. 47

శని చంద్రస్థానమున నుండి గురునిచేఁ జూడఁబడెనేని జాతకుఁడు భూములు ఇండ్లు స్నేహితులు పుత్త్రులు ధనము రత్నములు భార్య గలవాఁడగును.

ఆయతకులజాతానాం రూపవిలాసైస్సుఖైశ్చ రహితానాం,
కురుతే జన్మ నరాణాం భృగుపుత్రైః కర్కటే సౌరిః.

శని చంద్రక్షేత్రమున నుండి శుక్రునిచేఁ జూడఁబడెనేని మానవుని విశాలవంశమున బుట్టువానిగను, రూపవిలాసములు సుఖము లేనివానిగను జేయును.

సింహమందున్న శనిదృష్టిఫలము.

సుఖధనహీనమనార్యం ప్రియాన్వృతం పానసక్తకుతనుంచ,
భృతకం దుఃఖిన మేకం సింహే సూర్యేక్షిత స్సౌరః 49

శని రవిక్షేత్రమగు సింహమున నుండి రవిచేఁ జూడఁబడెనేని సౌఖ్యము ధనము లేనివాఁడు, అనార్యుఁడు, అబద్ధములాడువాఁడు, మద్యపాయి, చెడ్డశరీరముగలవాఁడు, సేవకుఁడు, దుఃఖవంతుఁడు, ఒంటివాఁడు నగును.

నానారత్నధనానాం యువతీనాం భాజనం విపులకీర్తిం,
శశిరగుద్దృష్టస్సింహే సౌరో నృపవల్లభం పురుషమ్ 50

శని రవిస్థానమున నుండి చంద్రునిచేఁ జూడఁబడెనేని అనేకరత్నములు ధనము రూపవంతులగు స్త్రీలుఁగలవాఁడు, కీర్తిమంతుఁడు, రాజుల కిష్టమైనవాఁడు అగును.

ప్రతిదినమటనమధన్యం చోరం గిరిదుర్గవాసినం క్షుద్రం,
భార్యాపుత్రవిహీనం సింహే సౌరో రుధిరదృష్టః. 51

రవిస్థానమున నున్నశని కుజునిచేఁ జూడఁబడెనేని జాతకుఁడు ఎల్లపుడు తిరుగువాఁడు, అధన్యుఁడు, చోరుఁడు, పర్వతముల దుర్గములవసించువాఁడు, నీచుఁడు, భార్యాపుత్రులు లేనివాఁడు నగును.

నైష్కృతికమలసమధనం స్త్రీకర్మకరం మలీమసం దీనం,
జనయతి బుధేన దృష్టో దినకరభవనాశ్రితస్సౌరః. 52

శని రవిస్థానమున నుండి బుధునిచేఁ జూడఁబడెనేని దుర్మార్గుఁడు సోమరి, ధనహీనుఁడు, ఆడంగిపనులను జేయువాఁడు, నీచాతినీచుఁడు, దీనుఁడు నగును.

గ్రామపురశ్రేణీనాం పురోగమాఢ్యం చ పుత్రవంతం చ,
గురుదృష్టః ప్రాత్యయికం సింహే సౌరస్సుశీలం చ. 53

శని రవిస్థానమున నుండి గురునిచేఁ జూడఁబడెనేని గ్రామనగరములలో గౌరవమునందువాఁడు సంపన్నుఁడు, పుత్రవంతుఁడు, నమ్మకముగలవాఁడు, మంచినడవడికలవాఁడును అగును.

యువతిద్వేష్యం కాంతం మంథరసుఖభాగినం ధనసమృద్ధం,
శుక్రేక్షితస్తు కురుతే భానుగృహే రవిసుతస్స్వాంతమ్. 54

రవిస్థానమున శని యుండి శుక్రునిచే జూడఁబడెనేని జాతకుఁడు స్త్రీలచే ద్వేషింపఁబడువాఁడు, అందమైనవాఁడు, స్వల్పసౌఖ్యముల నొందువాఁడు, ధనసంపన్నుఁడు నగును.

## గురుక్షేత్రమందున్న శనిదృష్టిఫలము.

పరపుత్రాణాం పితరం గురుభే సౌరేక్షితశ్శుక్రః,
తేభ్యో ధనం చ లభతే నామఖ్యాతిం చ పూజాం చ. 55

శని గురుక్షేత్రమున (ధనుస్సు-మీనము)నుండి సూర్యునిచేఁ జూడఁబడెనేని ఇతరులబిడ్డలకు తండ్రి, వారివలన ధనము పేరుప్రఖ్యాతి గౌరవమునొందువాఁడు నగును.

మాతృరహితం సుశీలం నామద్వయసంయుతం రవేస్తనయః,
కురుతే శశినా దృష్టో భార్యాసుతవిత్తసంపన్నమ్. 56

శని గురుక్షేత్రమున నుండి చంద్రునిచేఁ జూడఁబడెనేని జాతకుఁడు తల్లిలేనివాఁడు, మంచినడవడిగలవాఁడు, రెండుపేర్లుగలవాఁడు, భార్య బిడ్డల ద్రవ్యముగలవాఁడు నగును.

వాతవ్యాధిగృహీతం లోకద్వేష్యం చ పాపశీలం చ,
క్షుద్రం నిందితశీలం గురుభే భౌమేక్షిత స్సౌరః. 57

శని గురుస్థానమున నుండి అంగారకునిచేఁ జూడఁబడెనేని వాతరోగముగలవాఁడు, లోకమున నందరిచేతను ద్వేషింపఁబడువాఁడు, పాపాత్ముఁడు, నీచుఁడు, చెడ్డనడవడి గలవాఁడు నగును.

జనయతి గురుభవనస్థో నృపతిసమం సౌఖ్యవంతమాచార్యం,
మాన్యం ధనినం సౌమ్యం సుభగం సౌమ్యేక్షితస్సౌరం. 58

శని గురుక్షేత్రమున నుండి బుధునిచేఁ జూడఁబడెనేని రాజుతో సమానుఁడు, సౌఖ్యవంతుఁడు, ఉపాధ్యాయుఁడు, పూజింపఁబడువాఁడు, ధనవంతుఁడు, నెమ్మదియైనవాఁడు, సౌందర్యవంతుఁడును నగును.

నృపతిం నృపతుల్యం వా మంత్రిణ మథ నాయకం చ సేనాయాః,
జనయతి గురుణా దృష్టస్సర్వాపద్వర్జితం సౌరః. 59

శని గురుస్థానమున నుండి గురువుచేఁ జూడఁబడెనేని జాతకుఁడు రాజుగనో రాజమంత్రిగనో రాజతుల్యుఁడుగనో, సేనాధిపతి, అనేకకష్టములను దాఁటినవాఁడు నగును.

కురుతే ద్విమాతృపితృకం లిపినా ద్రిషు జీవినం వివిధశీలం,
జనయతి సితేన దృష్టో రవితనయః కర్మసంపన్నమ్. 60

శని గురుస్థానమున నుండి శుక్రునిచేఁ జూడఁబడెనేని ఇద్దరుతల్లులుగలవాఁడు, వ్రాతమూలమున కొండలలోజీవించువాఁడు, నియతిలేని నడవడికలవాఁడు కర్మలయం దాసక్తిగలవాఁడు నగును

స్వగృహే శనిదృష్టిః.

రోగిణమరూపభార్యం పరాన్నభోగినమతీవ దుఃఖసహం,
అటనరతం భారసహం సౌరస్సూర్యేక్షితస్స్వగృహే. 61

శని స్వస్థానము (మకరము-కుంభము) న నుండి సూర్యునిచేఁ జూడఁబడెనేని రోగి రూపవంతురాలుకాని భార్యకలవాఁడు, ఇతరులఅన్నమును భుజించువాఁడు, అనేకదుఃఖములసహించువాఁడు, తిరుగుస్వభావముగలవాఁడు, బరువుమోయఁగలవాఁడు నగును.

చపలమసత్యం పాపం మాతురనిష్టం ప్రియానృతం స్వాఢ్యం,
ఉత్పన్నాటనదుఃఖం స్వగృహే చంద్రేక్షిత స్సౌరః. 62

స్వస్థానమున శనియుండి చంద్రునిచేఁ జూడఁబడెనేని జాతకుఁడు చంచలమైన స్వభావముగలవాఁడు, అసత్యవాది, పాపాత్ముఁడు, తల్లి కనిష్టముచేయువాఁడు, సంపన్నుఁడు, దేశాటనమువలన దుఃఖమునొందువాఁడు నగును.

అతిశూరం విక్రాంతం విఖ్యాతగుణం మహాజనపురోగం,
తీక్ష్ణం సాహసనిరతం స్వగృహే వక్రేక్షిత స్సౌరః. 63

శని స్వక్షేత్రమున నుండి అంగారకునిచేఁ జూడఁబడెనేని మిక్కిలి శౌర్యవంతుఁడు, పరాక్రమశాలి, ప్రఖ్యాతిఁగన్న గుణములుగలవాఁడు, మహాజనులలో మొదటివాఁడు, తీక్ష్ణమైనవాఁడు, సాహసవంతుఁడు నగును.

భారసహం తామసికం శోభన మటనజ్ఞమల్పవిత్తం చ,
ధన్యం జనయతి శనిభే బుధేన సంవీక్షిత స్సౌరః. 64

స్వక్షేత్రమున నున్నశని బుధునిచేఁ జూడఁబడెనేని కష్టములనోర్చువాఁడు, తామసగుణముగలవాఁడు, శుభమైనవాఁడు, దేశములఁ దిరుగ నేర్చినవాఁడు, స్వల్పధనము గలవాఁడు, ధన్యుఁడు నగును.

సముదితగుణం నరేంద్రం నృపవంశకరం చిరాయుషమరోగం,
త్రిదశగురుదృష్టమూర్తి ర్జనయతి సౌరస్స్వగృహసంస్థః. 65

స్వస్థానమున శని యుండి గురునిచేఁ జూడఁబడెనేని గుణవంతుఁడు, రాజు, రాజవంశమును నిలుపఁజేయువాఁడు, చిరాయుష్మంతుఁడు, ఆరోగ్యవంతుఁడును నగును.

ధనినం పరదారరతం సుభగం సుఖినం చ విత్తవంతం చ,
ఉత్పన్నపానభక్ష్యం స్వగృహే శుక్రేక్షితస్సౌరః 66

శని స్వక్షేత్రమున నుండి శుక్రునిచేఁ జూడఁబడెనేని జాతకుఁడు ధనవంతుఁడు, ఇతరజాయాసక్తుఁడు, సౌందర్యవంతుఁడు, సుఖవంతుఁడు, పదువను తినునుగలవాఁడు నగును.

ఇతి ఏకోనత్రింశోఽధ్యాయః

---

## భావఫలములను దెలుపు ముప్పదవ యధ్యాయము

మూర్త్యాదయః పదార్థా జాయంతే యేన సర్వజంతూనాం,
తస్మా దధునా వక్ష్యే భావాధ్యాయం విశేషేణ 1

ఏహేతువుచేత సర్వజంతువులకు, శరీరము మొదలుగాఁగల అవయవములు పుట్టుచున్నవో అట్టిహేతువులు కలిగిన భావాధ్యాయమును జెప్పఁబోవుచున్నాను

లగ్నేఽర్కేఽల్పకచః క్రియాలసమతిః క్రోధీ ప్రచండోన్నతో
మానీ లోచనరూక్షకర్కశతనుశ్శూరోఽక్షమో నిర్ఘృణః,
స్ఫోటాక్షశ్శశిభే క్రియే సతిమిరస్సింహే నిశాంధః పుమాన్
దారిద్ర్యోపహతో వినష్టతనయో జాత స్తులాయాం నరః. 2

సూర్యుఁడు లగ్నమందుండఁగాఁ బుట్టినవాఁడు స్వల్పమైన జుట్టుగలవాఁడు, కార్యములయం దలసమతిగలవాఁడు, క్రోధము గలవాఁడు, గొప్పఉన్నతముగల వాఁడు, మానుష్యుఁడు, కోపముచే ఎఱ్ఱనైన నేత్రములు గలవాఁడు, నిర్దయగలవాఁడగును. లగ్నము మేషము, లేక కర్కాటకమై అందు రవియుండెనేని మచ్చలుగల నేత్రములుఁ గలవాఁడు, చీఁకటిగమ్మైడు నేత్రములు గలవాఁడు, సింహమైనచో రేజీఁకటిగలవాఁడు, తులారాశి లగ్నమై అందు రవియుండెనేని దరిద్రుఁడు, అపుత్రవంతుఁడు అగును

ద్విపదచతుష్పదభాగీ ముఖరోగీ నష్టవిభవసౌఖ్యశ్చ,
నృపచోరముషితసారః కుటుంబగే స్యా ద్రవౌ పురుషః. 3

ద్వితీయమందు రవియుండఁగాఁ బుట్టినవాఁడు, భృత్యులు పశువులు మొదలైనవి గలవాఁడు, ముఖరోగము గలవాఁడు, ఐశ్వర్యము సౌఖ్యము లేనివాఁడు, రాజులచేతను చోరులచేతను అపహరింపఁబడిన సారము గలవాఁడు, అగును.

విక్రాంతో బలయుక్తో వినష్టసహజ స్తృతీయగే సూర్యే,
లోకే మతోఽభిరామః ప్రాజ్ఞో జితదుష్టపక్షశ్చ 4

తృతీయమందు రవియుండఁగాఁ బుట్టినవాఁడు, పరాక్రమము బలము మొదలైనవి గలవాఁడు, సోదరహీనుఁడు, సర్వజనప్రియుఁడు, శత్రువులను జయించువాఁడు అగును.

వాహనబంధువిహీనః పీడితహృదయశ్చతుర్థకే సూర్యే,
పితృగృహధననాశకరో భవతి నరః కునృపసేవీ చ 5

చతుర్థమందు సూర్యుఁడుండెనేని వాహనములు బంధువులు లేనివాఁడు, వ్యాధిపీడితుఁడు, తండ్రిసంబంధమైన గృహమును ధనమును నశింపఁజేయువాఁడు, కుత్సితరాజసేవ సేయువాఁడు అగును.

సుఖసుతవిత్తవిహీనః కర్షణగిరిదుర్గసేవకశ్చపలః,
మేధావీ ధనరహితస్స్వల్పాయుః పంచమే తపనే. 6

పంచమమందు సూర్యుఁడుండెనేని సుఖము పుత్రులు ధనము లేనివాఁడు, వ్యవసాయము సేయువాఁడు, గిరిదుర్గములయందుండువాఁడు, చపలుఁడు, ధారణసమర్థమైనబుద్ధి స్వల్పాయువు గలవాఁడగును.

ప్రబలమదనోదరాగ్నిర్బలవాన్ షష్ఠం సమాశ్రితే భానౌ,
శ్రీమాన్విఖ్యాతగుణో నృపతిర్వా దండనేతా వా. 7

షష్ఠమమందు సూర్యుఁడుండెనేని ప్రబలమదనాగ్నిచే తపించువాఁడు, బలవంతుఁడు, సంపత్తు, ఖ్యాతి మొదలైనవి గలవాఁడగును.

నిశ్శ్రీకః పరిభూతః కుశరీరో వ్యాధితః పుమాన్ద్యూనే,
నృపబంధనసంతప్తోఽమార్గరతో యువతివిద్వేషీ. 8

సప్తమమందు సూర్యుఁడుండెనేని సంపత్తులేనివాఁడు, తిరస్కరింపఁబడువాఁడు, వ్యాధియుక్తుఁడు, రాజులచేతను బంధువులచేతను తపించువాఁడు, స్త్రీద్వేషము గలవాఁడు అగును.

వికలనయనోఽష్టమస్థే ధనసుఖహీనోఽల్పజీవితః పురుషః,
భవతి సహస్రమయూఖే స్వాభిమతజనవిరహసంతప్తః. 9

అష్టమమందు రవియుండెనేని నేత్రహీనుఁడు, ధనము సుఖము మొదలైనవి లేనివాఁడు, సంతాపము గలవాఁడు అగును.

ధనపుత్రమిత్రభాగీ ద్విజదైవతపూజనేఽతిరక్తశ్చ,
పితృయోషిద్విద్వేషీ నవమే తపనే సుతప్తస్స్యాత్. 10

నవమమందు రవియుండెనేని ధనము పుత్రులు మిత్రులు గలవాఁడు, దేవ బ్రాహ్మణభక్తి గలవాఁడు, తండ్రియందు స్త్రీలయందు ద్వేషము గలవాఁడు, మిక్కిలి తపించువాఁడు అగును.

అతిమతిరతివిభవబలో ధనవాహనబంధుపుత్రవాన్ సూర్యే,
సిద్ధారంభశ్శూరో దశమేఽధృష్యః ప్రశస్యశ్చ. 11

దశమమందు రవియుండెనేని గొప్పబుద్ధి ఐశ్వర్యము ధనము వాహనము బంధువులు పుత్రులు గలవాఁడగును.

సంచయనిరతో బలవాన్ద్వేష్యః ప్రేష్యో విధేయభృత్యశ్చ,
ఏకాదశే విధేయః ప్రియరహిత స్సిద్ధకర్తా చ. 12

ఏకాదశమందు రవియుండెనేని ఆర్జనయం దాసక్తిగలవాఁడు, బలవంతుఁడు ద్వేషముగలవాఁడు, విధేయుఁడు అగును

వికలశరీరః కాణః పతితో వంధ్యాపతిః పితురమిత్రః,
ద్వాదశసంస్థే సూర్యే బలరహితో జాయతే క్షుద్రః. 13

ద్వాదశమందు సూర్యుఁడుండెనేని అంగహీనమైన శరీరము గలవాఁడు, ఒక నేత్రము లేనివాఁడు, జాతిభ్రష్టుఁడు, తండ్రితో ద్వేషించువాఁడు, బలహీనుఁడు, క్షుద్రుఁడు అగును.

చంద్రుఁడు:—

దాక్షిణ్యరూపధనభోగగుణైః ప్రధాన
శ్చంద్రే కుళీరవృషభాజగతే విలగ్నే,
ఉన్మత్తనీచబధిరో వికలశ్చ మూక
శ్శేషే, నరో భవతి కృష్ణతనుర్విశేషాత్. 14

మేషవృషభకర్కాటకములలో నొకటి లగ్నమై చంద్రుఁ డుండెనేని దాక్షిణ్యాదిగుణములు గలవాఁడగును. శేషించిన మిథున సింహ కన్యా తులా వృశ్చిక ధనుర్మకర కుంభ మీనములలో నొకటి లగ్నమై అందు చంద్రుఁడుండెనేని ఉన్మత్తాదిగుణయుక్తుఁడగును.

అలలితసుఖమిత్రయుతో ధనైశ్చ చంద్రే ద్వితీయరాశిగతే,
సంపూర్ణేఽతిధనేశో భవతి నరోఽల్పప్రలాపకరః. 15

చంద్రుఁడు సంపూర్ణుఁడై ద్వితీయమందుండెనేని సుఖహీనుఁడు, మిత్రులు లేనివాఁడు, ధనికుఁడు, స్వల్పముగ మాటలాడువాఁడు అగును

భ్రాతృజనాశ్రయణీయో ముదాన్వితస్సహజగే బలిని,
చంద్రే భవతిచ శూరో విద్యావస్త్రాన్నసంగ్రహణశీలః. 16

పూర్ణచంద్రుఁడు తృతీయమందుండెనేని సోదరులచే పోషింపఁబడువాఁడు, ఎల్లప్పుడు సంతోషము గలవాఁడు, శూరుఁడు, విద్వాంసుఁడు అగును.

బంధుపరిచ్ఛదవాహనసహితో దాతా చతుర్థగే చంద్రే,
జలసంచారానురతస్సుఖాసుఖోత్కర్ష పరిముక్తః 17

చంద్రుఁడు చతుర్థస్థానమున నుండెనేని బంధువులు సేవకులు వాహనములు గలవాఁడు, దానశీలుఁడు, జలమందు సంచరించువారి ననుసరించువాఁడు, సుఖముగాని గొప్పదుఃఖములుగాని లేనివాఁడు నగును.

చంద్రే భవతి నశూరో విద్యావస్త్రాన్నసంగ్రహణశీలః,
బహుతనయసౌమ్యమిత్రో మేధావీ పంచమే తీక్ష్ణః 18

చంద్రుఁడు పంచమమందుండెనేని అశూరుఁడు, విద్య వస్త్రములు భక్షణపదార్థములు సంగ్రహించుటయందు స్వభావముగలవాఁడు, అనేకపుత్రులు మిత్రులు గలవాఁడు, ధారణసమర్థమైన బుద్ధిగలవాఁడు అగును.

ప్రచురామిత్రస్తీవ్రో మృదుకాయాగ్నిర్మదాలసశ్చంద్రే,
షష్ఠే నరఉదరభవైః రోగైస్సంపీడితో భవతి. 19

చంద్రుఁడు షష్ఠమున నుండెనేని ఎక్కువగా శత్రువులుగలవాఁడు, తీవ్రమైనవాఁడు, మృదువైన జఠరాగ్నిగలవాఁడు, మదముగలవాఁడు, ఉదరసంబంధములైన రోగములచే బాధలనొందువాఁడు నగును.

సౌమ్యోఽధృష్యస్సుఖితస్సుశరీరః కామసంయుతో ద్యూనే,
దైన్యారుగర్దితదేహః కృష్ణే సంజాయతే శశిని. 20

పూర్ణచంద్రుఁడు సప్తమస్థానమున నుండెనేని సౌమ్యుఁడు, బెదరింపవీలులేనివాఁడు, సౌఖ్యవంతుఁడు, మంచిశరీరముగలవాఁడు, కాముకుఁడు అగును. క్షీణచంద్రుఁడు సప్తమమున నున్న దైన్యము రోగములచే బాధింపఁబడుశరీరముగలవాఁడు నగును.

అతిమతిరతి తేజస్వీ వ్యాధివిబంధక్షపితదేహః,
నిధనస్థే రజనికరే స్వల్పాయు ర్భవతి సంక్షీణే. 21

పూర్ణచంద్రుఁడు అష్టమమున నున్న మిక్కిలి బుద్ధి, గొప్ప తేజస్సుగలవాఁడు, వ్యాధులచేతను బంధనములచేతను కృశించినశరీరము గలవాఁడగును. క్షీణచంద్రుఁడు అష్టమమున నున్న అల్పాయుష్మంతుఁ డగును.

దైవతపితృకార్యపరస్సుఖధనమతిపుత్రసంపన్నః,
యువతిజననయనకాంతో నవమే శశిని ప్రియతమోద్యోగః. 22

నవమమున పూర్ణచంద్రుఁడున్న దేవకార్యములు పితృకార్యములు నొనర్చువాఁడు, సౌఖ్యము ధనము మంచిబుద్ధి పుత్త్రులుగలవాఁడు, స్త్రీలనేత్రముల కందముగా నుండువాఁడు, తనకు మిక్కిలి ప్రియమైన వ్యాపారముగలవాఁడును అగును.

అవిషాదీ కర్మపరస్సిద్ధారంభశ్చ ధనసమృద్ధశ్చ,
శుచిరథబలోఽథ దశమే శూరో దాతా భవేచ్ఛశిని. 23

చంద్రుఁడు దశమమున నున్న దుఃఖములేనివాఁడు, కర్మపరుఁడు, మొదలుపెట్టిన పనిని పూర్తిజేయువాఁడు, ధనసంపన్నుఁడు, పరిశుభ్రమైనవాఁడు, బలవంతుఁడు, శౌర్యవంతుఁడు, దానశీలుఁడు నగును.

ధనవాన్బహుసుతభాగీ బహ్వాయుస్స్వేష్టభృత్యవర్గశ్చ,
ఇందౌ భవే న్మనస్వీ తీక్ష్ణశ్శూరః ప్రకాశశ్చ 24

చంద్రుఁ డేకాదశమమున నున్న ధనవంతుఁడు, అనేకమందిబిడ్డలుగలవాఁడు, పూర్ణాయుర్దాయముగలవాఁడు, ప్రేమపాత్త్రులగు సేవకులుగలవాఁడు, మానవంతుఁడు, కఠినమైనస్వభావముగలవాఁడు, శౌర్యవంతుఁడు, ప్రసిద్ధినిపొందినవాఁడు నగును.

ద్వేష్యః పతితః క్షుద్రో నయనరుగార్దితోఽలసో భవేద్వికలః,
చంద్రే తథాన్యజాతో ద్వాదశగే నిత్యపరిభూతః. 25

చంద్రుఁడు వ్యయమందుండెనేని ద్వేషము గలవాఁడు, కులభ్రష్టు, క్షుద్రుఁడు, నేత్రరోగముచే పీడితుఁడు, అలసుఁడు, అన్యజాతియం దుత్పన్నుఁ డైనవాఁడు అగును.

కుజుఁడు:—

క్రూరస్సాహసనిరత స్స్తబ్ధోఽల్పాయుస్స్వమానశౌర్యయుతః,
క్షతగాత్రః కుశరీరో వక్రే లగ్నాశ్రితే చపలః. 26

కుజుఁడు లగ్నమున నున్న క్రూరుఁడు, సాహసవంతుఁడు, మాంద్యముగా నుండు వాఁడు, అల్పాయువుగలవాఁడు, అభిమానము శౌర్యముగలవాఁడు, గాయపడిన శరీరము గలవాఁడు, చెడ్డదేహముగలవాఁడు, చపలమైన స్వభావముగలవాఁడును అగును.

అధనః కదశనతుష్టః పురుషో వికృతాననో ధనస్థానే,
కుజనాశ్రయశ్చ రుధిరే భవతి నరో విద్యయారహితః 27

అంగారకుఁడు లగ్నమునుండి ద్వితీయముననున్న ధనములేనివాఁడు, అపరిశుభ్రమైన అన్నముచే తృప్తినొందువాఁడు, వికారమైన ఆననముగలవాఁడు, దుర్జనుల నాశ్రయించువాఁడు, విద్యలేనివాఁడును అగును.

శూరో భవత్యధృష్యో భ్రాతృవియుక్తో ముదాన్వితః పురుషః,
భూపుత్రే సహజస్థే సమస్తగుణభాజనం ఖ్యాతః. 28

అంగారకుఁడు తృతీయమున నున్న శౌర్యవంతుఁడు, బెదరింపవీలులేనివాఁడు, సోదరులనుండి విడిపడినవాఁడు, సంతోషవంతుఁడు, సమస్తగుణములకు నిలయమైన వాఁడు అగును.

బంధుపరిచ్ఛదరహితో భవతి చతుర్థేఽథ వాహనవిహీనః,
అతిదుఃఖైస్సంతప్తః పరగృహవాసీ కుజే పురుషః. 29

అంగారకుఁడు చతుర్థముననున్న బంధువులు సేవకులులేనివాఁడు, వాహనములు లేనివాఁడు, మిక్కిలి దుఃఖములుగలవాఁడు, ఇతరులగృహముల నివసించువాఁడు అగును.

సౌఖ్యార్థపుత్రమిత్రశ్చలమతిరపి పంచమే కుజే భవతి,
పిశునోఽనర్థప్రాయః ఖలశ్చ వికలో నరో నీచః. 30

కుజుఁడు పంచమమున నుండెనేని సౌఖ్యులగుపుత్త్రులు స్నేహితులు ధనముగల వాఁడు, చంచలమైనబుద్ధిగలవాఁడు, లోభి, అపకారముచేయువాఁడు, దుర్జనుఁడు, వికలుఁడు, నీచుఁడు నగును.

ప్రబలమదనోదరాగ్నిస్సుశరీరో వ్యాయతో బలీ షష్ఠే,
రుధిరే సంభవతి నరస్స్వబంధువిజయీ ప్రధానశ్చ. 31

అంగారకుఁడు షష్ఠమముననున్న గొప్పజఠరాగ్ని, మిక్కిలి కామముగలవాఁడు, మంచిశరీరముగలవాఁడు, ఎత్తైనదేహముగలవాఁడు, బలవంతుఁడు, తనబంధువులను జయించినవాఁడు, బంధువులందరిలో ముఖ్యుఁడు నగును.

మృతదారో రోగార్తోఽమార్గగతో భవతి దుఃఖితః పాపః,
శ్రీరహిత స్సంతప్త శ్శుష్కతను ర్భవతి సప్తమే భౌమే. 32

అంగారకుఁడు సప్తమమునయున్న మరణించినభార్యగలవాఁడు, రోగములచే బాధ నొందువాఁడు, చెడ్డమార్గమున నడచువాఁడు, దుఃఖవంతుఁడు, పాపాత్ముఁడు, ధనములేని వాఁడు, కష్టములనొందువాఁడు, కృశించినశరీరముగలవాఁడు నగును.

వ్యాధిప్రాయోఽల్పాయుః కుశరీరో నీచకర్మకర్తా చ,
నిధనస్థే క్షితితనయే భవతి పుమాన్ శోకసంతప్తః 33

అష్టమమున అంగారకుఁడున్న ఎల్లపుడు వ్యాధులుగలవాఁడు, అల్పాయుష్కుఁడు, చెడ్డశరీరముగలవాఁడు, నీచమైనపనులను చేయువాఁడు, శోకములచేత బాధింపఁబడువాఁడు నగును.

అకుశలకర్మా ద్వేష్యః ప్రాణివధపరో భవే న్నవమసంస్థే,
ధర్మరహితోఽతిపాపో నరేంద్రకృతగౌరవో రుధిరే. 34

కుజుఁడు నవమమున నున్న అశుభమైనపనుల నొనర్చువాఁడు, ద్వేషింపఁదగిన వాఁడు, ప్రాణులను హింసించువాఁడు, ధర్మములేనివాఁడు, మిక్కిలి పాపాత్ముఁడు, రాజగౌరవము గలవాఁడును అగును.

కర్మోద్యుక్తో దశమే శూరోఽధృష్యః ప్రధానజనసేవీ,
సుతసౌఖ్యయుతో రుధిరే ప్రతాపబహుళః పుమాన్ భవతి. 35

అంగారకుఁడు దశమమున నుండెనేని కర్మలయం దాసక్తిగలవాఁడు, శూరుఁడు, బెదరింపవీలులేనివాఁడు, ముఖ్యులగువారందరిచే సేవింపఁబడువాఁడు, పుత్రసౌఖ్యము నొందువాఁడు, ప్రతాపవంతుఁడు నగును.

ఏకాదశగే ధనవాన్ప్రియసుఖభాగీ తథా భవే ద్భూరః,
ధనధాన్యసుతై స్సహితః క్షితితనయే విగతశోకశ్చ. 36

అంగారకుఁడు ఏకాదశమముననున్న ధనవంతుఁడు, ప్రియము సౌఖ్యముగల వాఁడు, శూరుఁడు, ధనధాన్యములు పుత్త్రులుగలవాఁడు అగును.

నయనవికారీ పతితో జాయాఘ్నస్సూచకశ్చ రౌద్రశ్చ,
ద్వాదశగే పరిభూతో బంధనభాగ్భవతి భూపుత్రే. 37

అంగారకుఁడు ద్వాదశమున నుండెనేని నేత్రరోగముగలవాఁడు, పతితుఁడు, భార్యను జంపువాఁడు, చాడీలను చెప్పువాఁడు, రౌద్రముగలవాఁడు, అవమానము నొందువాఁడు, బంధనము నొందువాఁడు నగును.

బుధుఁడు:—

అనుపహతదేహబుద్ధి ర్దేశకలాజ్ఞానకావ్యగణితజ్ఞః,
అతిమధురచతురవాక్యో దీర్ఘాయుస్స్యాద్బుధే లగ్నే. 38

బుధుఁడు లగ్నమందున్న లోటులేనిశరీరము, బుద్ధిగలవాఁడు, దేశములు చతుః షష్టికళలు కావ్యరచన గణితము నెఱిఁగినవాఁడు, మిక్కిలి మధురముగను నేర్పుగను మాట్లాడువాఁడు, దీర్ఘాయుష్మంతుఁడు నగును.

బుధోఽప్యపార్జితవిభవో ధనభవనగతేఽన్నపానభోగీచ,
శోభనవాక్య స్సునయ శ్శశితనయే మానవో భవతి 39

బుధుఁడు ద్వితీయమున నుండెనేని బుద్ధివలన సంపాదించినవిభవముగలవాఁడు, అన్నపానములకు లోటులేనివాఁడు, శుభప్రదములగుమాటలపలుకువాఁడు, మంచినేత్రములుఁగలవాఁడును నగును.

శ్రమనిరతః పరిదీన స్తృతీయరాశౌ బుధే భవతి జాతః,
నిపుణస్సహజసమేతో మాయాబహులో నరశ్చలితః 40

బుధుఁడు తృతీయమందుండెనేని శ్రమగలవాఁడు, దీనుఁడు, నిపుణుఁడు, సోదరులు గలవాఁడు, కపటము చాపల్యము గలవాఁడగును.

పండితమాహుస్సుభగో వాహనయుక్తో బుధే హిబుకసంస్థే,
సుపరిచ్ఛద స్సుబంధు ర్భవతి నరః పండితో నిత్యం. 41

బుధుఁడు చతుర్థమున నుండెనేని పండితుఁడు, సౌందర్యవంతుఁడు, వాహనములు గలవాఁడు, మంచిసేవకులు, బంధువులుగలవాఁడును అగును

మంత్రాభిచారకుశలో బహుతనయః పంచమే సౌమ్యే,
విద్యాసుఖప్రభావై స్సమన్వితో హర్షసంయుక్తః. 42

పంచమమున బుధుఁడున్న మంత్రశాస్త్రము అభిచారవిధానము నెఱిఁగినవాఁడు, అనేకమందిపుత్త్రులుగలవాఁడు, విద్య సుఖము ప్రభావము సంతోషముగలవాఁడు అగును.

వాదవివాదే కలహే నిత్యజితో వ్యాధితో బుధే షష్ఠే,
అలసో వినష్టకోపో నిష్ఠురవాక్యోఽతిపరిభూతః 43

బుధుఁడు షష్ఠమమున నుండెనేని వాగ్వాదములయందు కలహములయందు ఎల్లపుడు నోడిపోవువాఁడు, వ్యాధులుగలవాఁడు, సోమరి, కోపములేనివాఁడు, నిష్ఠురము లగు వాక్యములనాడువాఁడు, మిక్కిలి అవమానమునొందువాఁడును నగును.

ప్రాజ్ఞాం సుచారువేషాం నాతికవీనాంచ కలహాశీలాంచ,
భార్యా మనేకవిత్తాం ద్యూనే లభతే మహత్త్వాం చ 44

బుధుఁడు సప్తమమందుండెనేని ప్రాజ్ఞురాలైనట్టియు సౌందర్యవేషము గలిగి నట్టియు హీనకులమందు బుట్టినట్టియు కలహప్రియురాలయినట్టియు ద్రవ్యవంతురాలై నట్టి భార్యను మహత్త్వమును బొందినవాఁడగును

విఖ్యాతనామసారశ్చిరజీవీ కులధరో నిధనసంస్థే,
శశితనయే భవతి నరో నృపతిసమో దండనాయకో వాఽపి 45

బుధుఁడు అష్టమమున నుండెనేని పేరుజెందినవాఁడు, బలవంతుఁడు, చాలా కాలము జీవించువాఁడు, వంశమునిల్పువాఁడు, రాజసమానుఁడో సేనాపతియో యగును.

నవమగతే భవతి పుమానతిధనవిద్యాయుతశ్శుభాచారః,
వాగీశ్వరోఽతినిపుణో ధర్మిష్ఠ స్సోమపుత్రే హి. 46

బుధుఁడు నవమమున నుండెనేని మిక్కిలి ధనము చదువు గలవాఁడు, శుభము లగు ఆచారముగలవాఁడు, వాగ్ధాటిగలవాఁడు, మిక్కిలి నేర్పరి, ధర్మాత్ముఁడును అగును.

ప్రవరమతికర్మచేష్టస్సఫలారంభో విశారదో దశమే,
ధీరస్సత్యసమేతో వివిధాలంకారసత్వభాక్సౌమ్యే. 47

దశమమున బుధుఁడుండెనేని నిశితమగుబుద్ధిగలవాఁడు, కొనసాగుప్రయత్నములు గలవాఁడు, నేర్పరి, ధైర్యము సత్యముగలవాఁడు, అనేకవిధములగు అలంకారములు బలముగలవాఁడును అగును.

ధనవాన్విధేయభృత్యః ప్రాజ్ఞస్సౌఖ్యాన్వితో విపులభోగీ,
ఏకాదశే బుధేస్యాద్బహ్వాయుః ఖ్యాతిమాన్ పురుషః. 48

ఏకాదశస్థానమున బుధుఁడుండెనేని ధనము వినయవంతులగు సేవకులుగలవాఁడు, ప్రాజ్ఞుఁడు, సౌఖ్యములుగలవాఁడు, విపులములగు భోగములుగలవాఁడు, గొప్పఆయుర్దాయముగలవాఁడు, ప్రఖ్యాతిగలవాఁడు అగును.

సుగృహీతవాక్యమలసం పరిభూతం వాగ్మినం తథాప్రాజ్ఞం,
వ్యయగః కరోతి సౌమ్యః పురుషం దీనం నృశంసం చ. 49

బుధుఁడు వ్యయమందుండఁగాఁ బుట్టినవాఁడు అలసుఁడు, వాగ్ధోరణిగలవాఁడు, తిరస్కరింపఁబడువాఁడు, దీనుఁడు, ఘాతుకుఁడు అగును.

బృహస్పతిః——

హోరాసంస్థే జీవే సుశరీరః ప్రాణవా న్సుదీర్ఘాయుః,

సుసమీక్షితకార్యకరః ప్రాజ్ఞో ధీర స్తథార్యశ్చ. 50

బృహస్పతి లగ్నమందుండఁగాఁ బుట్టినవాఁడు, ఆరోగ్యమైన శరీరముగలవాఁడు, దీర్ఘాయువు గలవాఁడు, కార్యాలోచనతత్పరుఁడు, ధైర్యము గలవాఁడు, పూజ్యుఁడు అగును.

ధనవాన్ భోజనసారో వాగ్మీ సువపుస్సువాక్సువక్త్రశ్చ,
కల్యాణవపు స్త్యాగీ సుముఖో జీవో భవే ద్ధనగే. 51

గురువు ద్వితీయమందుండెనేని ధనికుఁడు, భోజనప్రియుఁడు, నేర్పుగ మాటలాడువాఁడు, యోగ్యమైన శరీరము వాక్కు ముఖము మొదలైనవి గలవాఁడగును.

అతిపరిభూతః కృపణస్సదాజితో మానవో భవతి జీవే,
మందాగ్నిస్స్త్రీవిజితో దుశ్చిక్యే పాపకర్మా చ. 52

గురువు తృతీయమున నుండెనేని మిక్కిలి అవమానము నొందువాఁడు, లోభి, ఎల్లపుడు ఓడిపోవువాఁడు, జీర్ణశక్తి తక్కువగాఁగలవాఁడు, స్త్రీలచే జయింపఁబడువాఁడు నగును.

స్వజనపరిచ్ఛదవాహనసుఖమతిభోగార్థసంయుతో భవతి,
శ్రేష్ఠశ్శత్రువిషాదీ చతుర్థసంస్థే సదా జీవే 53

బృహస్పతి చతుర్థమున నుండెనేని బంధువులు సేవకులు వాహనములు సౌఖ్యము మంచిబుద్ధి భోగము ధనము గలవాఁడు, శ్రేష్ఠుఁడు, శత్రువులవలన విషాదమునొందువాఁడు నగును.

సుఖసుతమిత్రసమృద్ధః ప్రాజ్ఞో ధృతిమాం స్తథావిభవసారః,
పంచమభవనే జీవే సర్వత్ర సుఖీ భవతి జాతః. 54

గురువు పంచమనుందుండెనేని అనేకవిధమైన సుఖము అనేకపుత్రులు మిత్రులు గలవాఁడు, ప్రాజ్ఞుఁడు, ధైర్యము వైభవము గలవాఁడగును.

సన్నోదరాగ్నిపుం స్త్వః పరిభూతో దుర్బలోఽలసష్షష్ఠే,
స్త్రీవిజితో రిపుహంతా జీవే పురుషోఽతివిఖ్యాతః. 55

గురువు షష్ఠమమందుండెనేని యోగ్యమైన జఠరాగ్ని, పుంసత్వముగలవాఁడు, తిరస్కరింపఁబడువాఁడు, దుర్బలుఁడు, స్త్రీలవలన జయింపఁబడువాఁడు, శత్రునాశమొనర్చువాఁడు, ఖ్యాతి గలవాఁడగును.

సుభగస్సురుచిరుదారః పితురధికస్స ప్తమే భవతి జాతః,
వక్తా కవిః ప్రధానః ప్రాజ్ఞో జీవే సువిఖ్యాతః. 56

సప్తమమున గురుఁడుండెనేని సౌందర్యవంతుఁడు, మంచికాంతి, ఔదార్యముగలవాఁడు, తండ్రికన్న గొప్పవాఁడు, వక్త, కవి, ప్రఖ్యాతిగలవాఁడును అగును.

పరిభూతో దీర్ఘాయుర్భృతకో దాసోఽథవా నిధనసంస్థే,
స్వజనప్రేష్యో దీనో మలినస్త్రీభోగవాన్ జీవే 57

గురువు అష్టమమందుండెనేని తిరస్కరింపఁబడువాఁడు, దీర్ఘాయువు గలవాఁడు, దాసుఁడు లేక స్వజనభృత్యుఁడు, దీనుఁడు, నీచస్త్రీభోగము గలవాఁడు అగును.

దైవతపితృకార్యరతో విద్వాన్ సుభగో భవేత్తథా నవమే,
నృపమంత్రీ నేతా వా జీవే జాతః ప్రధానశ్చ 58

గురువు నవమమందుండెనేని దైవపితృకార్యములయం దాసక్తిగలవాఁడు, విద్వాంసుఁడు, సౌందర్యము గలవాఁడు, రాజమంత్రి, లేక నాయకుఁడు, ప్రధానుఁడు అగును.

సిద్ధారంభో మాన్యస్సర్వోపాయః కుశలసమృద్ధశ్చ,
దశమస్థే త్రిదశగురౌ సుఖధనజనవాహనయశోభాక్. 59

గురువు దశమమున నుండెనేని కొనసాగుపనుల నారంభించువాఁడు, మాన్యుఁడు, అనేకఉపాయములుగలవాఁడు, కుశలసమృద్ధిగలవాఁడు, సౌఖ్యము ధనము సేవకులు వాహనములు గలవాఁడు, కీర్తిమంతుఁడు అగును.

అపరిమితాయద్వారో బహువాహనభృత్యసంయుతస్సాధుః,
ఏకాదశగే జీవే న చాతివిద్యో న చాతిసుతః 60

గురువు ఏకాదశమందుండెనేని అపరిమితధనాగమము గలవాఁడు, అనేకవాహనములు భృత్యులు గలవాఁడు, సాధువు స్వల్పవిద్య గలవాఁడు, స్వల్పసుతులుగలవాఁడు అగును.

అలసో లోకద్వేష్యో హ్యాపగతదార్ద్దైవపక్షభగ్నో వా,
పరితస్సేవానిరతో ద్వాదశసంస్థే గురౌ భవతి. 61

జననకాలమున గురువు ద్వాదశమందుండెనేని అలసుఁడు, జనద్వేషి, వాగ్ధాటిలేనివాఁడు, దైవసహాయము లేనివాఁడు, సేవయం దాసక్తి మొదలైనవి గలవాఁడగును

సునయనవదనశరీరం సుఖినం దీర్ఘాయుషం తథాభీరుం,
యువతిజననయనకాంతం జనయతి హోరాగతశ్శుక్రః. 62

జననకాలమున శుక్రుఁడు లగ్నమున నుండెనేని మంచినేత్రములు ముఖము దేహము గలవాఁడు, సౌఖ్యవంతుఁడు, దీర్ఘాయుష్మంతుఁడు, భయశీలుఁడు, స్త్రీలనేత్రములకు అందముగా నుండువాఁడు నగును.

ప్రచురాన్నపానవిభవం శ్రేష్ఠవిలాసం తథా సువాక్యంచ,
కురుతే ద్వితీయరాశౌ బహుధనసహితం సితః పురుషం. 63

శుక్రుఁడు ద్వితీయమందుండెనేని ప్రసిద్ధమైన అన్నపానవిభవము గలవాఁడు, మంచివిలాసములు మంచిమాటలుగలవాఁడు, ధనికుఁడు అగును.

సుఖధనసహితం శుక్రో దుశ్చిక్యే స్త్రీజితం తథా కృపణం,
జనయతి మందోత్సాహం సౌభాగ్యపరచ్ఛదాతీతం. 64

శుక్రుఁడు తృతీయమందుండెనేని సుఖము ధనము గలవాఁడు, స్త్రీజితుఁడు, లుబ్ధుఁడు, స్వల్పఉత్సాహము గలవాఁడు, అందము సేవకులు అవసరములేనివాఁడు అగును.

బంధుసుహృత్సుఖసహితం కాంతం వాహనపరిచ్ఛదసమృద్ధం,
లలితమదీనం సుభగం జనయతి హిబుకే నరం శుక్రః 65

శుక్రుఁడు చతుర్థమందుండెనేని బంధువులు స్నేహితులు సుఖముగలవాఁడు, సౌందర్యము గలవాఁడు, వాహనములు గలవాఁడు, మృదువైనవాఁడు, సౌందర్యవంతుఁడు నగును.

సుఖసుతమిత్రోపచితం రతిపర మతిధన మఖండితం శుక్రః,
కురుతే పంచమరాశౌ మంత్రిణ మథ దండనేతారం. 66

పంచమమున శుక్రుఁడున్న సౌఖ్యము పుత్రులు స్నేహితులుగలవాఁడు, కాముకుఁడు, ధనవంతుఁడు, మంత్రి, సేనాపతియుఁ నగును.

అధికమనిష్టం స్త్రీణాం ప్రచురామిత్రం నిరాకృతం విభవైః,
విక్లవమతీవ నీచం కురుతే షష్ఠే భృగోస్తనయః 67

శుక్రుఁడు షష్ఠమమందుండెనేని స్త్రీలకు అత్యంతాయిష్టుఁడు, అనేకశత్రువులు గలవాఁడు, ఐశ్వర్యహీనుఁడు, శ్రమ నీచముగలవాఁ డగును.

అతిరూపదారసౌఖ్యం బహువిభవం కలహవర్జితం పురుషం,
జనయతి సప్తమధామని సౌభాగ్యసమన్వితం శుక్రః. 68

శుక్రుఁడు సప్తమమందుండెనేని సౌందర్యవతియగుభార్య గొప్పఐశ్వర్యము మొదలైన సుగుణయుక్తుఁడు కలహములేనివాఁడు అగును.

దీర్ఘాయురనుపమసుఖశ్శుక్రే నిధనాశ్రితే ధనసమృద్ధః,
భవతి పుమాన్ నృపతిసమః క్షణేక్షణే లబ్ధపరితోషః. 69

శుక్రుఁ డష్టమమందుండెనేని దీర్ఘాయువు గొప్పసుఖము ధనము గలవాఁడై రాజతుల్యుఁడు ఎల్లప్పుడు సంతసించువాఁడు అగును.

సమమూాయతతనువిత్తో దారయువతిసుఖసుహృజ్జనోపేతః,
భృగుతనయే నవమస్థే సురాతిథిగురుప్రసక్తస్స్యాత్. 70

శుక్రుఁడు నవమమందుండెనేని గొప్పశరీరము ధనము గలవాఁడు, భార్యా సుఖము స్నేహితులు గలవాఁడు, దేవతలను అతిథులను గురువుల నారాధించువాఁడు అగును.

ఉత్థానవివాదజితస్సుఖరతభావార్థకీర్తయో యస్య,
దశమస్థే భృగుతనయే భవతి పుమాన్ బహుమతిః ఖ్యాతః. 71

శుక్రుఁడు దశమమున నుండెనేని వాదమున నోడువాఁడు, సౌఖ్యము కామము ధనము కీర్తిగలవాఁడు, ప్రసిద్ధిగలవాఁడు అగును.

ప్రతిరూపదాసభృత్యం బహ్వాయం సర్వశోకసంత్యక్తం,
జనయతి భవభవనగతో భృగుతనయస్సర్వదా పురుషం. 72

శుక్రుఁడు ఏకాదశమందుండెనేని దాసభృత్యులయం దనురాగము గలవాఁడు, ప్రబల ఆదాయము గలవాఁడు, శోకహీనుఁడు, ఈశ్వరాలయమున నుండువాఁడు అగును.

అలసం సుఖినం స్థూలం పతితం మృష్టాశినం భృగోస్తనయః,
శయనోపచారకుశలం ద్వాదశగం స్త్రీజితం జనయేత్ 73

శుక్రుఁడు ద్వాదశమున నుండెనేని సోమరి, సౌఖ్యవంతుఁడు, లావైనవాఁడు, పతితుఁడు, మృష్టాన్నమును భుజించువాఁడు, శయనోపచారమున నేర్పుగలవాఁడు, స్త్రీలచే జయింపఁబడువాఁడు నగును.

స్వోచ్చస్వకీయభవనే క్షితిపాలతుల్యో
లగ్నేఽర్కజే భవతి దేశపురాధినాథః,
శేషేషు దుఃఖగదపీడిత ఏవ బాల్యే
దారిద్ర్యకర్మవశగో మలినోఽలసశ్చ. 74

శని తనస్థానము తనస్థానముకన్న నుచ్చస్థానము లగ్నమై అందుండెనేని రాజతుల్యుఁడు, కేశపురములకేలికయుఁ నగును. ఇతరలగ్నములనున్న చిన్నతనముననే దుఃఖములు వ్యాధులు మొదలగువానిచే బాధింపఁబడువాఁడు, దరిద్రుఁడు, నీచుఁడును అగును.

వికృతవదనోఽర్థభోక్తా జనరహితో న్యాయకృత్కుటుంబగతే,
పశ్చాత్పరదేశగతో జనవాహనభోగవాన్ సౌరే. 75

శని ద్వితీయమందుండఁగాఁ బుట్టినవాఁడు వికారమైన ముఖము గలవాఁడు, జనములేనివాఁడు, న్యాయముగలవాఁడు, ధనము ననుభవించువాఁడు, తరువాత పరదేశమునుపొంది భృత్యులను వాహనముల ననుభవించువాఁడు అగును.

మలినస్సంస్కృతదేహో నీచోఽలసపరిజితో భవతి సౌరే,
శూరో దానానురతో దుశ్చిక్యగతే విపులబుద్ధిః. 76

శని తృతీయమున నుండెనేని అపరిశుభ్రమైనవాఁడు, ఎల్లపుడు అందమైనశరీరము గలవాఁడు, సోమరి, శౌర్యవంతుఁడు, దానముచేయువాఁడు, విపులమగు బుద్ధిగలవాఁడు అగును.

పీడితహృదయో హిబుకే నిర్బాంధవవాహనార్థమతిసౌఖ్యః,
బాల్యే వ్యాధితదేహో నఖరోమధరో భవేత్సౌరే. 77

శని చతుర్థమందుండఁగాఁ బుట్టినవాఁడు వ్యాధిగలవాఁడు, బంధువులు వాహనములు ధనము బుద్ధి సౌఖ్యము లేనివాఁడు, నఖరోమములు గలవాఁడు అగును.

సుఖసుతమిత్రవిహీనం మతిరహితమచేతసం త్రికోణస్థః,
సోన్మాదం రవితనయః కరోతి పురుషం సదా దీనం. 78

శని పంచమమందుండెనేని సుఖము పుత్రులు మిత్రులు లేనివాఁడు, బుద్ధిహీనుఁడు, ఉన్మాదము గలవాఁడు దీనుఁడు అగును.

ప్రబలమదనం సుదేహం శూరం బహ్వాశినం విషమశీలం,
బహురిపుపక్షక్షపితం రిపుభవనగతోఽర్కజః కురుతే 79

శని షష్ఠమున నుండెనేని ప్రబలమైన కామముగలవాఁడు, మంచిశరీరముగలవాఁడు, శౌర్యవంతుఁడు, జాస్తిగా భుజించువాఁడు, సరిలేని నడవడిగలవాఁడు, అనేకశత్రువులచేత ఓడిపోయినవాఁడు అగును.

సతతమనారోగ్యతనుం మృతదారం ధనవివర్జితం జనయేత్,
ద్యూనేఽర్కజః కువేషం పాపం బహునీచకర్మాణం. 80

సప్తమమున శని యుండెనేని ఎల్లపుడు అనారోగ్యముకల దేహముగలవాఁడు, భార్యచనిపోయినవాఁడు, ధనములేనివాఁడు, డాంబికపువేషముగలవాఁడు, మిక్కిలి నీచకర్మల నొనర్చువాఁడు అగును

కుష్ఠభగంధరరోగై రభితప్తం హ్రస్వజీవినం నిధనే,
సర్వారంభవిహీనం జనయతి రవిజస్సదా పురుషం 81

శని అష్టమమందుండెనేని కుష్ఠరోగము మొదలైనవానిచే పీడితుఁడు, స్వల్పాయువు గలవాఁడు, కార్యారంభవిహీనుఁడు అగును.

ధర్మరహితోఽల్పధనికస్సహజసుతవివర్జితో నవమసంస్థే,
రవిజే సౌఖ్యవిహీనః పరోపతాపీ చ జాయతే మనుజః 82

శని నవమమందుండెనేని అధర్ముఁడు, స్వల్పధనము సోదరపుత్రులతో విడువఁబడినవాఁడు, సౌఖ్యము లేనివాఁడు, పరాపకారి యగును.

ధనవాన్ ప్రాజ్ఞశ్శూరో మంత్రీ వా దండనాయకో వాఽపి,
దశమస్థే రవితనయే బృందపురగ్రామనేతా చ 83

శని దశమమున నుండెనేని ధనవంతుఁడు, ప్రాజ్ఞుఁడు, శౌర్యవంతుఁడు, మంత్రియో సేనాపతియోగాని జనసముదాయమునకు పట్టణములకు గ్రామములకు నాయకుఁడు అగును.

బహ్వాయుస్థిరవిభవశ్శూరశ్శిల్పాశ్రయో విగతరోగః,
ఆయస్థే భానుసుతే ధనజనసంపద్యుతో భవతి. 84

శని ఏకాదశమందుండెనేని పూర్ణాయువు స్థిరమైన ఐశ్వర్యము గలవాఁడు, శౌర్యము శిల్పశాస్త్రము ఆరోగ్యము ధనజనసంపత్తు మొదలైనవి గలవాఁడగును.

వికలః పతితో ముఖరో విషమాక్షో నిర్ఘృణో విగతలజ్జః,
వ్యయభవనగతే సౌరే బహువ్యయస్స్యాత్సుపరిభూతః. 85

శని వ్యయమందుండెనేని వికలస్వభావము గలవాఁడు, కులభ్రష్టుఁ, నేత్రవైకల్యము గలవాఁడు, దయాహీనుఁడు, లజ్జలేనివాఁడు, మిక్కిలి వ్యయము గలవాఁడు అగును.

పాపా నిఘ్నంతి మూర్త్యాదీన్భావాన్ పుష్ణంతి శోభనాః,
విపరీతం రిపూరంధ్రవ్యయేషు సదసత్ఫలం. 86

తన్వాదిభావములయందు పాపగ్రహములుండెనేని ఆభావములను నశింపఁజేయును. శుభగ్రహము లుండెనేని అభావములను వృద్ధిజేయును. షష్ఠాఽష్టమవ్యయభావములయందు పాపగ్రహము లుండెనేని భావములను వృద్ధిజేయును. శుభులుండెనేని నశింపఁజేయును.

యోగాయేబలయోగాస్సౌమ్యసుహృద్రిపునిరీక్షణాచ్చైవ,
ఉచ్చాదిభవనసంస్థైర్గ్రహైశ్చ ఫల మన్యథా భవతి. 87

పూర్వము జెప్పఁబడిన యోగములు శుభ మిత్ర శత్రువుల ననుసరించియు ఉచ్చనీచాదుల ననుసరించియు ఫలముయొక్క వ్యత్యయమును ఊహించదగినది.

ఇతి త్రింశోఽధ్యాయః.

---

ద్వ్యంతరయోగములను దెలుపు ముప్పదియొకటవ యధ్యాయము.

హోరాచతుర్థసప్తమదశమేషు యథాద్వయోర్ద్వయోర్గ్రహయోః,
భవతి ఫలసంప్రయోగో జాతస్య తథాయ ముపదేశః. 1

జననకాలమున లగ్నాదికేంద్రములయందు రెండుగ్రహములు కలసియుండఁగాఁ గలుగుఫలమును జెప్పుచున్నాను.

మాతృపితృదుఃఖతప్తస్సూర్యేందోర్వారుదయసంస్థయోర్మనుజః,
మానసుతవిభవహీనః పరిభూతో జాయతే దుఃఖీ 2

జననకాలమున రవిచంద్రులు కలసి లగ్నకేంద్రమందుండిరేని బుట్టినవాఁడు తల్లిదండ్రులదుఃఖముచే తపించువాఁడు, అభిమానము పుత్రులు ఐశ్వర్యము లేనివాఁడై అతిదుఃఖవంతుఁడగును.

బాంధవసుతసుఖహీనో దారిద్ర్యయుతో మహాజడప్రకృతిః,
చంద్రే రసాతలస్థే భాస్కరసహితే పుమాన్ జాతః. 3

రవిచంద్రులు చతుర్థకేంద్రమందుండిరేని బాంధవులు పుత్రులు సుఖము లేనివాఁడు, దరిద్రుఁడు, జడస్వభావము గలవాఁడు అగును.

మిత్రైస్సుతైశ్చ హీనః పరిభూతో యువతిభిస్సదా పురుషః,
చంద్రే సప్తమభవనే దినకరసహితే భవేద్దీనః. 4

రవిచంద్రులు సప్తమమందుండిరేని మిత్రులు సుతులు లేనివాఁడు, స్త్రీలచే తిరస్కరింపఁబడువాఁడు, హీనుఁడు అగును

సుశరీరం బలనాథం రాజసికం నిర్దయం విషమశీలం,
సూర్యేందూ గగనస్థే కురుతః క్షపితారిపక్షం చ 5

రవిచంద్రులు దశమకేంద్రమందుండిరేని యోగ్యమైనశరీరము రాజసము నిర్దయ విషమస్వభావము గలవాఁడు, శత్రువులను నశింపఁజేయువాఁడు అగును

రవిభౌమయోర్విలగ్నే పిత్తప్రకృతిర్మహాహవే శూరః,
క్రోధీ విక్షతగాత్రః క్రూరశ్చ శఠః కరోరసాన్యత్ 6

జననకాలమున రవికుజులు కలసి లగ్నకేంద్రమందుండిరేని పైత్యస్వభావము శౌర్యము క్రోధము మొదలైనవి గలవాఁ డగును

బంధుజనమిత్రహీనస్సమస్తసుఖవర్జితః క్షుభితః,
కుజసూర్యయోశ్చతుర్థే భవతి పుమాన్ సర్వతో ద్వేష్యః 7

రవికుజులు చతుర్థమందుండిరేని బంధుమిత్రాదులచే విడువఁబడినవాఁడు, సుఖము లేనివాఁడు, ద్వేషించుస్వభావము గలవాఁడు అగును.

స్త్రీవిరహాదుఃఖఖిన్నః స్త్రీహేతోః పరిభవం సదాప్రాప్తః,
రవిరుధిరయో ర్ద్యూనస్థయో ర్విదేశగమనే రతో భవతి 8

రవికుజులు సప్తమమందుండిరేని స్త్రీవియోగదుఃఖితచిత్తుఁడు, స్త్రీమూలముగ పరాభవమును బొందువాఁడు, విదేశవాసమందాసక్తిగలవాఁ డగును

విఫలారంభో భృతకో నిత్యోద్విగ్నః ప్రధాననృపసేవీ,
భూతనయదివాకరయోః కర్మణి గతయో ర్భవే ద్వికలః. 9

రవికుజులు దశమమున నుండిరేని విఫలములగు కార్యారంభములుగలవాఁడు, సేవకుఁడు, ఎల్లపుడు ఉద్వేగము నొందువాఁడు, ప్రధానుఁడగురాజును సేవించువాఁడు, వికలుఁడు అగును.

ప్రాజ్ఞో బహుప్రలాపీ కఠినాంగశ్శౌర్యవల్లభో మతిమాన్,
లగ్నే బుధదినకరయో ర్దీర్ఘాయు స్సంభవే త్పురుషః. 10

రవిబుధులు లగ్నమందుండిరేని ప్రాజ్ఞుఁడు, మిక్కిలి ప్రలాపించువాఁడు, కఠినమైన శరీరము శౌర్యము దీర్ఘాయువు గలవాఁడు అగును.

నృపతిసమో విఖ్యాతో గృహీతకావ్యః కుబేరసమవిభవః,
రవిశశితనయా హిబుకే స్థూలతను ర్వక్రనాసశ్చ. 1

రవిబుధులు చతుర్థమున నుండిరేని రాజసమానుఁడు, ప్రసిద్ధినొందినవాఁడ కావ్యములనాదరించువాఁడు, కుబేరునితో సమానమైన వైభవముగలవాఁడు, లావైన శరీరము వంకరముక్కుగలవాఁడు అగును.

వధబంధనకృన్మృత్యుర్గృహీతవాక్యో నచాతిధనలుబ్ధః,
స్త్రీరతిహీన శ్చోరో ద్యూనే బుధసూర్యయోర్భవతి 1:

రవిబుధులు సప్తమమున నుండురేని జాతకుఁడు వధబంధనము చేయువాఁడు మాటనాదరించువాఁడు, అంతలోభికానివాఁడు, స్త్రీసౌఖ్యములేనివాఁడు, దొంగయు నగును.

త్రిషు లోకేషు ఖ్యాతో గజాశ్వనాథో భవేన్మహీపాలః,
దినకరబుధయో ర్దశమే ననీచరాశిస్థయో రేవ 1:

రవిబుధులు దశమమందుండిరేని ముల్లోకములయందు ఖ్యాతిగలవాఁడు, గ ములకు అశ్వములకు అధిపతియు, భూమిని పాలించువాఁడు అగును. రవిబుధులలో నొకరు నీచయందుండిరేని ఈఫలములు జరగవు.

జీవార్కయోర్గుణయుతో మంత్రీబలనాయకోఽథవా సాధుః,
లగ్నస్థయోః ప్రసూతో విద్యాధనభోగవాన్ ఖ్యాతః 1·

రవిగురులు లగ్నమందుండిరేని గుణయుక్తుఁడు, మంత్రి, బలాధిపతి, విద ధనము భోగము గలవాఁడగును.

శ్రుతినీతికావ్యనిరతం భవ్యం జనసంపదం ప్రియాలాపం,
హిబుకే సురేజ్యసూర్యౌ నిభృతాచారం నరం కురుతః. 1

రవిగురులు చతుర్థమందుండిరేని వేదశాస్త్రములను జదివినవాఁడు, క్షేమముగ జనసంపత్తు రహస్యములగు నాచారములు గలవాఁడగును.

జీవార్కయోర్ద్యువత్యాం మదనవశాత్ స్త్రీజితః పితృద్వేషీ
కనకమణిరజితమౌక్తికసమన్విత శ్శుభశరీరస్స్యాత్ 1

రవిగురులు కలసి సప్తమమందుండిరేని రతిచే స్త్రీలను జయించువాఁడు, తండ్రిత ద్వేషించువాఁడు, బంగారము మణులు మొదలైనవి గలవాఁడు అగును.

కీర్తిసుఖమానవిభవైస్సమన్వితః పార్థివో భవేన్నభసి,
రవిదేవపురోహితయోర్నింద్యేఽపి కులే నరో జాతః. 17

రవిగురులు దశమమందుండిరేని కీర్తి సుఖము మొదలైనవి గలవాఁడు, నింద్యమైన కులమందు పుట్టినను ప్రభువగును.

ప్రియకలహస్త్వవినీతో మలినాచారస్సుదుఃఖితో నీచః,
లగ్నే రవిభృగుసుతయో రత్యర్థకలత్రసంపరిత్యక్తః. 18

రవిశుక్రులు లగ్నమున నుండిరేని కలహించుటయం దాసక్తిగలవాఁడు, వినయము లేనివాఁడు, నీచుఁడు, మిక్కిలి దుఃఖవంతుఁడు, భార్యచే మాటిమాటికి వదిలిపెట్టఁబడువాఁడును అగును

ఆదిత్యే హిబుకస్థే భార్గవసహితే భవేన్నరో జాతః,
పరభృత్యశ్శోకార్తో లోకద్వేష్యో దరిద్రశ్చ 19

రవిశుక్రులు చతుర్థమందుండిరేని అన్యులకు భృత్యుఁడు, శోకపీడితుఁడు, జనద్వేషి, దరిద్రుఁడు అగును.

స్త్రీభిస్సంపరిభూతో ద్రవిణవిహీనో బృహత్తనుర్ద్వేష్యః,
శైలవనేషు చ విచరతి రవిసితయోస్సప్తమస్థానే 20

రవిశుక్రులు సప్తమమందుండిరేని స్త్రీలచే తిరస్కరింపఁబడువాఁడు, ద్రవ్యహీనుఁడు, గొప్పశరీరము గలవాఁడు, పర్వతాదులయందుఁ దిరుగువాఁడు అగును.

కర్మణి దినకరసితయో ర్వ్యవహారరతో నరేంద్రసచివస్స్యాత్,
శాస్త్రకలానిపుణమతి ర్ధనవాహనసౌఖ్యసంపన్నః 21

రవిశుక్రులు దశమమందుండిరేని వ్యవహారమం దాసక్తిగలవాఁడు, ప్రభుమంత్రి, శాస్త్రజ్ఞుడు, ధనము వాహనములు గలవాఁడగును.

నిందితజననీపుత్రః కుత్సితవృత్తిస్సదామలినబుద్ధిః,
లగ్నే సూర్యార్కజయోః పాపాచారో భవేత్పురుషః. 22

రవిశనులు లగ్నమందుండిరేని నిందితురాలైన తల్లిగలవాఁడు, కుత్సితవ్యాపారము మొదలైనవి గలవాఁడగును

సౌరిశ్చతుర్థరాశౌ భాస్కరసహితే పుమాన్భవతి నీచః,
దారిద్ర్యవిహితమూర్తి స్స్వబంధుభి శ్చాపి పరిభూతః. 23

రవిశనులు చతుర్థమందుండిరేని నీచుఁడు, దరిద్రుఁడు, బంధువులచే తిరస్కరింపఁబడువాఁడు అగును.

భాన్వర్కజయోర్మదనే మందాలసదుర్భగాశ్చ జాయంతే,
యువతిధనైస్సంత్యక్తా మృగయాభిరతా మహామూర్ఖాః. 24

రవిశనులు సప్తమమందుండిరేని మాంద్యాదిగుణయుక్తుఁడు, స్త్రీలకు అప్రియుఁడు, వేఁటాడుటయం దాసక్తి గలవాఁడు, మహామూర్ఖుఁడు అగును.

భానుస్స్వపుత్రసహితో గగనే భృతకం విదేశగం జనయేత్,
నృపతేః క్వచి దాప్తధనై శ్చోరై ర్ముషితం సదాశ్వధనం. 25

రవిశనులు దశమమందుండిరేని వేతనముచే జీవించువాఁడు, విదేశమందుండు వాఁడు, చోరులచే దొంగిలింపఁబడువాఁడు, అనేకాశ్వములు గలవాఁడగును.

రక్తాగ్నిపిత్తదోషై రభిభూతో జాయతే నరో రాజా,
క్షోణీసుతహిమకిరయో ర్లగ్నే తీక్ష్ణస్వభావ శ్చ 26

చంద్రకుజులు లగ్నకేంద్రమందుండిరేని రక్తాదిదోషములచే తిరస్కరింపఁబడు వాఁడు, ప్రభువు, కార్యములయందు త్వరితస్వభావము గలవాఁడగును.

సక్లేశో నిర్ద్రవ్య స్సుఖసుతధనబంధుహీనశ్చ,
పాతాళే కుజశశినో ర్వికలశ్చ భవే త్తథాజాతః 27

చంద్రకుజులు చతుర్థమందుండిరేని క్లేశముగలవాఁడు, ధనము బంధువులు పుత్రులులేనివాఁడు, వికలమైనస్వభావము గలవాఁడు అగును.

క్షుద్రః పరధనలుబ్ధో బహుప్రలాపో నసత్యవచనశ్చ,
ఈర్ష్యాయుక్తో మనుజః కుజశశినో స్సప్తమస్థానే. 28

చంద్రకుజులు సప్తమమందుండిరేని క్షుద్రుఁడు, పరధనలోభి, అసత్యవాది, ఈర్ష్యగలవాఁడు అగును.

తురగగజపత్తిసంపత్సమాకులం తుహినగుర్నరం కురుతే,
రుధిరేణ సమాయాతో గగనతలే విక్రమై ర్యుక్తం 29

చంద్రకుజులు దశమమందుండిరేని గుఱ్ఱములు గజములు మొదలైనవి గలవాఁడు, పరాక్రమము గలవాఁడు అగును.

సుఖబుద్ధిసత్వయుక్త స్సుభగః కాంతో విలగ్నగే శశిని,
బుధసహితే భవతి నరో వాచాల శ్చాతినిపుణ శ్చ. 30

చంద్రబుధులు లగ్నకేంద్రమందుండిరేని సౌఖ్యము నిశితమైనబుద్ధి బలముగలవాఁడు, సౌందర్యవంతుఁడు, వాచాలుఁడు, మిక్కిలి నేర్పఱియు నగును.

బంధుసుహృత్తనయసుఖప్రతాపకనకాశ్వరత్నసంయుక్తం,
బాంధవరాశౌ విందు ర్జనయతి బుధసంయుతస్సుభగం. 31

చంద్రబుధులు చతుర్థమున నుండిరేని బంధువులు, స్నేహితులు, పుత్త్రులు, సౌఖ్యము, ప్రతాపము, సువర్ణము, అశ్వములు, రత్నములు, సౌందర్యము గలవాఁడు అగును.

ద్యూనే బుధసంయుక్తో జనయతి చంద్రః ప్రతాపినం పురుషం,
నృపసంమతం నృపంవా విఖ్యాతం సత్కవిం లలితం 32

చంద్రబుధులు సప్తమమందుండిరేని ప్రతాపముగలవాఁడు, రాజప్రియుఁడు, లేక రాజు, ఖ్యాతిగలవాఁడు, మంచికవి, మృదువైనవాఁడు అగును.

దశమే బుధహిమకరయో ర్మానీ ధనవా నతిఖ్యాతః,
నృపసచివో వయసోఽంతే దుఃఖీ స్యా ద్బంధుపరిహీనః. 33

చంద్రబుధులు దశమకేంద్రమున నుండిరేని మానవంతుఁడు, ధనవంతుఁడు, మిక్కిలి ప్రఖ్యాతిగలవాఁడు, రాజమంత్రి, చివఱకాలమున దుఃఖములనొందువాఁడు, బంధువులులేనివాఁడు అగును.

లగ్నే సురేజ్యశశినోః క్షితిపః పృథుపీనవక్షాస్స్యాత్,
బహుతనయమిత్రభార్యః సుశరీరో బంధుభి ర్జుష్టః 34

చంద్రగురువులు లగ్నమున నుండిరేని జాతకుఁడు భూమి నేలువాఁడు, విశాలమైనది బలిసినదియు నగు వక్షఃస్థలముగలవాఁడు, అనేకమంది పుత్త్రులు మిత్రులు భార్యలు గలవాఁడు, మంచిదేహము గలవాఁడు, బంధుప్రియుఁడు అగును.

మంత్రీ రాజప్రతిమస్సుఖబంధుసమన్వితో మహావిభవః,
బహుశాస్త్రాక్షతబుద్ధి ర్హిబుకే స్యా జ్జీవశశినోశ్చ 35

చతుర్థమున చంద్రగురువులుండిరేని మంత్రి రాజసమానుఁడు, సౌఖ్యము బంధువులుగలవాఁడు, గొప్పవైభవముగలవాఁడు, అనేకశాస్త్రముల నభ్యసించి వానిసహాయమున మొక్కవోనిబుద్ధిగలవాఁడు అగును.

జాయాభవనే కురుతస్సుప్రాజ్ఞం పార్థివం కలాకుశలం,
వాణిజకం జీవేందూ నృపవల్లభ మర్థవ త్సిఖ్యతం. 36

చంద్రగురులు సప్తమమందుండిరేని ప్రాజ్ఞుఁడు, రాజు, శాస్త్రజ్ఞుఁడు, వ్యాపారము సేయుంవాఁడు, రాజప్రియుఁడు, ధనవంతుఁడు అగును.

కర్మణి సురేజ్యశశినో ర్విద్యానానార్థమానకీర్తియుతః,
సౌమ్యః ప్రలంబబాహు స్సర్వనమస్యో నరో భవతి. 37

చంద్రగురువులు దశమమున నుండిరేని విద్య ద్రవ్యము అభిమానము కీర్తి సౌమ్యత పొడవైన బాహువులు గలవాఁడు, అందరిచేత నమస్కరింపఁబడువాఁడు అగును.

వేశ్యాస్త్రీకృతసౌఖ్యః కాంతతనుస్సంమతో గురూణాం చ,
మాల్యాంబరగంధయుతో లగ్నే శశిశుక్రయో ర్భవతి. 38

చంద్రశుక్రులు లగ్నమందుండిరేని వేశ్యలతోఁ బొందిన సౌఖ్యముగలవాఁడు, సౌందర్యమైన శరీరము, గురుసమ్మతుఁడు, మాలికాదులయం దాసక్తిగలవాఁడు అగును.

పాతాళే శశిశుక్రౌ స్త్రీజనసుఖభాగినం నరం కురుతః,
జలసంయానాప్తధనం జనప్రియం భోగసంపన్నం 39

చంద్రశుక్రులు చతుర్థమందుండిరేని స్త్రీసుఖము గలవాఁడు, జలప్రయాణముచే ధనమును సంపాదించువాఁడు, జనప్రియుఁడు, భోగముగలవాఁడు అగును.

జామిత్రే సితశశినోర్బహుయువతిరతో న చాతిధనపుత్రః,
స్త్రీజననో మేధావీ భూపతిచరితో భవే త్పురుషః. 40

చంద్రశుక్రులు జామిత్రస్థానము (సప్తమస్థానము)న నుండిరేని అనేకస్త్రీలతో రమించువాఁడు, స్వల్పపుత్త్రులు, స్వల్పధనముగలవాఁడు, స్త్రీసంతతిగలవాఁడు, మేధావంతుఁడు, రాజువంటి నడవడిగలవాఁడు అగును.

మానాజ్ఞావిభవయుతః కర్మణి శుక్రే శశాంకయుతే,
రాజ్ఞో మంత్రీ ఖ్యాతః క్షమాన్వితస్స్యాద్బహుజనశ్చ. 41

చంద్రశుక్రులు దశమమందుండిరేని గొప్ప ఐశ్వర్యముగలవాఁడు, రాజప్రధాని, ఖ్యాతి క్షమ గలవాఁడు, అనేకసేవకులు గలవాఁడు అగును.

దాసాః ఖలాస్సురౌద్రా భవంతి లుబ్ధాశ్చ మానవాహీనాః,
భాస్కరసుతహిమకరయో ర్లగ్నే నిద్రాలసాః పాపాః. 42

చంద్రశనులు లగ్నమున నున్న సేవకుఁడు, దుర్మార్గుఁడు, కోపముగలవాఁడు, లోభి, అభిమానము లేనివాఁడు, నిద్ర, సోమరితనముగలవాఁడు, పాపాత్ముఁడు నగును.

జలముక్తామణిపోతైర్జీవంతి నరా స్తథా ఖననవృత్త్యా,
హిబుకే శశిరవిసుతయోశ్శ్రేష్ఠా జనసంమతా జాతా. 43

చంద్రశనులు చతుర్థమందుండిరేని జలము ముత్యములు మణులు ఓడలు మొదలైనవానిచే జీవించువాఁడు, ఖననవ్యాపారముచేసైనను జీవించువాఁడు, జనప్రియుఁడు అగును.

నగరగ్రామపురాణాం మహత్తరా రాజపూజితాః పురుషాః,
జాయంతేఽర్కజశశినోర్జాయాభవనే యువతి హీనాః. 44

చంద్రశనులు సప్తమమునందుండిరేని నగరాధిపతియు, రాజపూజితుఁడు, భార్య లేనివాఁడు అగును.

ప్రచురతురంగమబలిలారాతిః ఖ్యాతః కుయోషితః పుత్రః,
భవతి నరాణా మధిప శ్శశిశనియోగే ఖమధ్యగతే. 45

చంద్రశనులు దశమమందుండిరేని ప్రసిద్ధమైన గుఱ్ఱపుసేనచే శత్రువులను నశింపఁజేయువాఁడు, ఖ్యాతిగలవాఁడు, కుత్సితురాలగు తల్లిగలవాఁడు, నరాధిపతి అగును.

సౌమ్యగ్రహసంయుక్తః ప్రాయేణ శుభావహో భగణనాథః,
భౌమార్కియుతో దృష్టో దశమేచ చమూపతిం కుర్యాత్ 46

చంద్రుఁడు దశమకేంద్రమున శుభయుక్తుఁడై యుండెనేని తఱుచుగా శుభమును బొందువాఁడగును. రవిశనులతో కలసి దశమమందుండెనేని సేనాధిపతియగును. రవిశనులచేఁ జూడఁబడినను సేనాధిపతి యగునఁట.

హింస్రోఽగ్నికర్మకుశలో ధాతోర్వాదే కృతశ్రమోదూతః,
భౌమబుధయోర్విలగ్నే గుప్త్యధికారీ భవేత్పురుషః. 47

కుజబుధులు కలసి లగ్నకేంద్రమందుండిరేని హింససేయువాఁడు, అగ్నిప్రధాన కర్మలయందు నేర్పుగలవాఁడు, ధాతువాద్యమందు నేర్పుగలవాఁడు, కారాగృహాధికారి యగును.

బాంధవరహితస్సహితో మిత్రైశ్చ ధనాన్నభోగవాహనవాన్,
హిబుకే బుధభూసుతయోః స్వజనేషు నిరాకృతో జాతః. 48

చతుర్థమున కుజబుధులున్న జాతకుఁడు బంధువులులేనివాఁడు, స్నేహితులు గలవాఁడు, ధనము అన్నము భోగము వాహనములుగలవాఁడు, బంధువులచే నిరాకరింపఁబడువాఁడు అగును.

భ్రమతి చ దేశాద్దేశం కర్మకరో నీచపరిభూతః,
భౌమేందుజయోర్ద్యూనే సువివాదకరో మృతప్రథమదారః. 49

కుజబుధులు సప్తమమందుండిరేని దేశము దిరుగువాఁడు, కార్మికుఁడు, నీచులచే తిరస్కరింపఁబడువాఁడు, న్యాయవాది, ప్రథమభార్య లేనివాఁడు అగును.

సేనాధిపతి శ్శూర శ్శఠస్వభావో భవే దతిక్రూరః,
బుధకుజయో రాకాశే రాజ్ఞోఽభిమతో నరో ధీరః 50

కుజబుధులు దశమకేంద్రస్థానముల నుండిరేని సేనాపతి, శూరుఁడు, శఠుఁడు, మిక్కిలి క్రూరుఁడు, రాజునకు మిక్కిలి ఇష్టుఁడు, ధైర్యవంతుఁడు అగును

మంత్రీ గణప్రధానో ధర్మక్షేత్రే ప్రలబ్ధపరికీర్తిః,
జీవకుజయోర్విలగ్నే నిత్యోత్సాహీ భవేత్పురుషః 51

కుజగురులు లగ్నమందుండిరేని మంత్రి, సభాధిపతి, న్యాయస్థానమున ఖ్యాతిగలవాఁడు నిత్యోత్సాహము గలవాఁడగును.

బంధుసుహృత్సంపన్నస్థిరచిత్తస్సౌఖ్యభాగ్భవేద్ధిబుకే,
భౌమామరపూజితయో ర్నృపసేవీ దేవగురుభక్తః. 52

కుజగురులు చతుర్థమున నుండిన బంధువులు, స్నేహితులు, నిలకడగలమనస్సు గలవాఁడు, సౌఖ్యవంతుఁడు, రాజసేవకుఁడు, దేవతలయందు గురువులయందు భక్తిగల వాఁడు అగును.

గిరిదుర్గతోయకాననవిచరణశీల స్సుబాంధవ శ్శూరః,
కుజజీవయో ర్ద్యువత్యాం జాయాహీనః పుమాన్ భవతి 53

కుజగురులు సప్తమమందుండిరేని పర్వతములు దుర్గములు ఉదకప్రాంతములు అడవులు వీనియందుఁ దిరుగువాఁడు, యోగ్యమైన బంధువులుగలవాఁడు, శూరుఁడు, భార్యలేనివాఁడు అగును.

త్రిదశగురుభూమిసుతయో ర్నాకాశే పార్థివో విపులకీర్తిః,
బహుధనజనపరివారః కర్మసు నిపుణో భవే త్పురుషః. 54

కుజగురులు దశమమందుండిరేని ప్రభువు గొప్పకీర్తి ధనము చాలాధనము అనేక సేవకులు పనులనేర్పు గలవాఁడు అగును.

శుక్రకుజయో ర్విలగ్నే వేశ్యానిరతః కుశీలకర్తా చ,
స్త్రీహేతో ర్నష్టధనో నతు చిరజీవీ భవే త్పురుషః. 55

కుజశుక్రులు లగ్నమందుండిరేని వేశ్యాలయం దాసక్తిగలవాఁడు, దుష్టకర్మా సక్తిగలవాఁడు, స్త్రీమూలమున ధనహీనుఁడు, అల్పకాలము జీవించువాఁడు అగును.

బంధుసుతమిత్రహీనో మానసపీడాభిరర్దితః పురుషః,
భౌమసితయోశ్చతుర్థే నానాదుఃఖైర్భవేత్తప్తః. 56

కుజశుక్రులు చతుర్థమందుండిరేని బంధువులు పుత్రులు మిత్రులు లేని వాఁడు, మనస్సుచే పీడింపఁబడువాఁడు, అనేకదుఃఖములచే తపించువాఁడు అగును

స్త్రీలోలుపః కుచరితస్త్రీస్నేహాత్తోః ప్రాప్తవాన్మహాదుఃఖం,
భౌమసితయోస్సప్తమ్యాం హీనాచారో భవేత్పురుషః 57

కుజశుక్రులు సప్తమమందుండిరేని స్త్రీలోలుఁడు, దుష్టచరిత్రగలవాఁడు, స్త్రీమూలమున గొప్పదుఃఖమును బొందువాఁడు, ఆచారహీనుఁడు అగును.

అస్త్రాచార్యో మతిమా న్విద్యాధనవస్త్రమాల్యవా న్భవతి,
ఖ్యాతో నరేంద్రసచివ స్సితకుజయో ర్వ్యోమ్ని సంస్థితయోః. 58

కుజశుక్రులు దశమమందుండిరేని అస్త్రవిద్యయందు నేర్పుగలవాఁడు, బుద్ధి మంతుఁడు, విద్య ధనము వస్త్రమాల్యములు ఖ్యాతి మొదలైనవి గలవాఁడై ప్రభుమంత్రి యగును.

సంగ్రామలబ్ధవిజయో జననీద్వేష్యో భవేత్పురుషః,
భౌమార్కజయోర్లగ్నే హ్రస్వాయుః క్షీణభాగ్యశ్చ 59

కుజశనులు కలసి లగ్నమందుండిరేని యుద్ధమందు జయమును పొందువాఁడు, తల్లితో విరోధించువాఁడు, అల్పాయుంవు గలవాఁడు, భాగ్యహీనుఁడు అగును.

పానాన్నసౌఖ్యరహితస్స్వజనైస్త్యక్తో భవతి జాతః,
భౌమార్కజయో ర్హిబుకే మిత్రైశ్చ వివర్జితః పాపః. 60

కుజశనులు చతుర్థమందుండిరేని సర్వవిధసౌఖ్యము లేనివాఁడు, స్వజనులచేతను మిత్రులచేతను విడువఁబడువాఁడు, పాపుఁడు అగును.

జాయాసుఖసుతహీనో దైన్యపరో వ్యాధితో వ్యసనశీలః,
భౌమార్కజయో రస్తే జనపరిభూతో భవేత్కృపణః. 61

కుజశనులు సప్తమమునను్న జాతకుఁడు భార్యవలన సౌఖ్యము, పుత్త్రులులేని వాఁడు, దైన్యముగలవాఁడు, వ్యాధులు వ్యసనములుగలవాఁడు, జనులచే నవమానము నొందువాఁడు, లోభియు నగును.

రాజ్ఞః సంప్రాప్తధనో మహాపరాధాచ్చ దండితస్తేన,
భౌమార్కజయోర్దశమే నసత్యవచనో నరో భవతి. 62

కుజశనులు దశమమందుండిరేని రాజానుగ్రహముచే ధనికుఁడు, గొప్పఅపరాధముచేసి రాజదండనపొందువాఁడు, అసత్యము బలుకువాఁడు అగును.

శుభమూర్తిశ్శుభశీలో విద్వాన్నృపసత్కృతో విషయనాథః,
బుధజీవయో ర్విలగ్నే వాహనసుఖభోగవా న్భవతి. 63.

బుధగురులు లగ్నకేంద్రమున నుండిరేని శుభప్రదమైన స్వరూపము, శుభమైన నడవడి గలవాఁడు, విద్వాంసుఁడు, రాజగౌరవమునందువాఁడు, దేశాధిపతి, వాహనముల సౌఖ్యము భోగములు గలవాఁడు అగును.

బంధుసుహృత్సుఖరహితః స్త్రీధనసౌభాగ్యసంపన్నః,
బుధజీవయోశ్చతుర్థే నిపుణో బహుసంమతో భవతి 64

బుధగురులు చతుర్థమందుండిరేని బంధువులు స్నేహితులు సౌఖ్యములేనివాఁడు, స్త్రీధనము సౌభాగ్యము సంపదగలవాఁడు, బహుజనసంమతి గలవాఁడగును.

సుకలత్రో హతశత్రుర్బహుజనమిత్రార్థసత్వసంపన్నః,
బుధజీవయోర్ద్యూనే స్త్ర్యాదతిత్య పితృపక్షమధికస్స్యాత్. 65

బుధగురులు సప్తమమున నున్న మంచిభార్యగలవాఁడు, శత్రునాశన మొనర్చువాఁడు, అనేకమంది సేవకులు మిత్రులు ధనము బలముగలవాఁడు, స్త్రీబంధువులకన్న పితృపక్షము జాస్తిగాఁగలవాఁడును అగును.

బోధనగుర్వోర్దశమే నరేంద్రమంత్రీ నృపోఽథవా భవతి,
మానాజ్ఞాఖ్యాతియుత శ్శ్రీతార్థపరో వినీతశ్చ 66

బుధగురువులు దశమకేంద్రమున నున్న జాతకుఁడు రాజమంత్రిగాగాని రాజుగాని అభిమానము శాసనము ప్రఖ్యాతిగలవాఁడు, మాటనాలించువాఁడు, ధనవంతుఁడు, వినయవంతుఁడు అగును.

బుధశుక్రయోర్విలగ్నే సుశరీరః పండితస్సతాం సుభగః,
నృపపూజితోఽతిధన్యో ద్విజసురభక్తో భవే త్ఖ్యాతః. 67

బుధశుక్రులు కలిసి లగ్నకేంద్రమందుండిరేని సుశరీరము గలవాఁడు, సత్పురుషులలో శ్రేష్ఠుఁడు, సౌందర్యము గలవాఁడు, రాజపూజితుఁడు, దేవబ్రాహ్మణభక్తి మొదలైనవి గలవాఁడై ఖ్యాతిగలవాఁడగును.

బుధశుక్రౌ హిబుకస్థౌ పుత్రసుహృత్బంధుసంయుతం సుభగం,
మంత్రిణ మథవా నృపతిం కురుతః కల్యాణసంపన్నం 68

బుధశుక్రులు చతుర్థమున నుండిరేని పుత్త్రులు స్నేహితులు బంధువులు గలవాఁడు, సౌందర్యవంతుఁడు, మంత్రి లేకరాజు శుభాచారములు గలవాఁడు అగును

బుధశుక్రయోర్ద్యూతస్థయోః సద్భూషాయువతిపరివేష్టితః పురుషః,
భోగధనైశ్వర్యయుతో భవతి సుఖీ సంమతో రాజ్ఞాం 69

బుధశుక్రులు సప్తమమందుండిరేని అనేకభార్యలతో కలిసియుండువాఁడు, భోగము ధనము మొదలైనవి గలవాఁడై సుఖవంతుఁడు, రాజలక్ష్యుఁడు అగును.

బోధనసితయోః కర్మణి నీతిజ్ఞో భవతి భూపతిస్సాధుః,
నీచాశ్రయో న చాఢ్యస్సఫలారంభస్సమర్థశ్చ 70

బుధశుక్రులు దశమమున నుండిరేని నీతిశాస్త్రమును తెలిసినవాఁడు, రాజు, సత్పురుషుఁడు, నీచుల నాశ్రయించువాఁడు, ధనములేనివాఁడు, కొనసాగుప్రయత్నములు గలవాఁడు, సమర్థుఁడు అగును.

మలినశరీరః పాపీ విద్యాధనవాహనైః పరిత్యక్తః,
సౌమ్యార్కజయోర్లగ్నే హ్రస్వాయుః క్షీణభాగ్యశ్చ. 71

బుధశనులు కలిసి లగ్నకేంద్రమందుండిరేని మాలిన్యశరీరము గలవాఁడు, పాపి, విద్య ధనము వాహనములు లేనివాఁడు, అల్పాయువు అభాగ్యము గలవాఁడగును.

పానాన్నబంధురహితస్స్వజనేషు తిరస్కృతో భవతి మూఢః,
సౌమ్యార్కజయో ర్హిబుకే మిత్రైశ్చ వివర్జితః పాపః. 72

బుధశనులు కలిసి చతుర్థమందుండిరేని పానార్హవస్తువులు భక్షణపదార్థములు బంధువులు లేనివాఁడు, స్వజనులచేత తిరస్కరింపఁబడువాఁడు, మూఢుఁడు, స్నేహితులచే వదలిపెట్టఁబడువాఁడు, పాపియగును.

ఈశ్వరభృతకో మూర్ఖః పరోపకారీ న సాధురతిమలినః,
సౌమ్యార్కజయోరస్తే న సత్యవచనో నరో భవతి. 73

బుధశనులు సప్తమమందుండిరేని మూర్ఖుఁడు, పరోపకారి, అసాధువు, మిక్కిలి మలినముగ నుండువాఁడు, అబద్ధము పల్కువాఁడు అగును.

ప్రశమితసమస్తశత్రుస్స్వజనసుహృద్వాహనార్థసంపన్నః,
సౌమ్యార్కజయోర్దశమే ద్విజగురుసురపూజితో భవతి. 74

బుధశనులు దశమమందుండిరేని శత్రుహీనుఁడు, స్వజనులు స్నేహితులు వాహనములు ధనము గలవాఁడు, బ్రాహ్మణులచేత గురువులచేత దేవతలచేత పూజింపఁబడువాఁడు అగును.

జీవసితయోర్విలగ్నే గురూపదేశో భవేత్ప్రమానాథః,
బ్రాహ్మణకులసంభూతోఽప్యనుకూలో భవతి నృపతుల్యః 75

గురుశుక్రులు కలిసి లగ్నకేంద్రమంకుండిరేని గురుభక్తి గలవాఁడు, కీర్తిగలవాఁడు, బ్రాహ్మణుఁడు, రాజతుల్యుఁడు అగును.

ప్రశమితసమస్తశత్రుస్స్వజనసుహృద్వాహనార్థసంపన్నః,
జీవసితయోశ్చతుర్థే ద్విజగురుసురపూజితో భవతి 76

గురుశుక్రులు కలిసి చతుర్థమందుండిరేని శత్రుహీనుఁడు, స్వజనులు మిత్రులు వాహనములు ధనము గలవాఁడు, దేవబ్రాహ్మణభక్తి గలవాఁడగును.

సుస్త్రీరత్నార్థయుతస్త్రీజననో లబ్ధసౌఖ్యకీర్తిశ్చ,
గురుశుక్రయోర్యువత్యాం వరవాహనభోగవాన్భవతి 77

గురుశుక్రులు సప్తమమందుండిరేని స్త్రీమూలముగ ధనార్జనగలవాఁడు, స్త్రీసంతానము గలవాఁడు, సౌఖ్యము కీర్తిశ్రేష్ఠమైన వాహనములు మొదలైనవి గలవాఁడగును.

గగనస్థౌ గురుశుక్రౌ మానాజ్ఞావిభవవిస్తరైస్సహితం,
జనయేతాం పృథివీశం బహుభృత్యధనం సుశీలం చ. 78

గురుశుక్రులు దశమమున నున్న జాతకుఁడు అభిమానము, శాసించుశక్తి, ఐశ్వర్యముగలవాఁడు, అనేకమంది సేవకులు, ధనము గలవాఁడు, భూమి కధిపతియు నగును.

లగ్నే జీవార్కజయోర్మదాలసా నిష్ఠురాస్సమభిజాతాః,
విద్వాంసో ధనసారాః కించిత్సుఖితా భవంతి ఖలాః. 79

గురుశనులు కలిసి లగ్నకేంద్రమందుండిన మదముచే అలసుఁడు, పరుషవాక్యములు బలుకువాఁడు, విద్వాంసుఁడు, ధనికుఁడు, స్వల్పసుఖము గలవాఁడు, దుర్మార్గుఁడును అగును.

నృపసచివో నిరుజతనుర్జయోదయీ బాంధవైస్సుహృద్భిశ్చ,
పాతాళేఽర్కజగుర్వోః ప్రీతిధన సౌఖ్యవాన్భవతి. 80

గురుశనులు కలిసి చతుర్థమందుండిన రాజమంత్రి, రోగహీనుఁడు, జయము గలవాఁడు, బంధువులయొక్క స్నేహితులయొక్కయుం దయగలవాఁడు, ప్రీతియే ధనముగాఁగలవాఁడు, సౌఖ్యవంతుఁడు అగును

స్త్రీవైరాన్నష్టధనశ్శూరో వ్యసనీ శఠో న శుభమూర్తిః,
ద్యూనే సురేజ్యయమయోః పితృధనలుబ్ధశ్చ జాయతే మూర్ఖః 81

గురుశనులు సప్తమమందుండిన స్త్రీవిరోధముచే ధనహీనుఁడు, శూరుఁడు, దుఃఖము గలవాఁడు, మూర్ఖుఁడు, పితృధనముచే లోభియగును.

దశమే భాస్కరజీవౌ నరేంద్రదయితం చ భూపతిం కురుతః,
అల్పాపత్యం నచలం గోకులబహువాహనార్థం చ. 82

గురుశుక్రులు దశమకేంద్రమందుండిన రాజప్రియుఁడు, రాజు, స్వల్పసంతతి గలవాఁడు, చలనహీనుఁడు, గోబృందము వాహనములు ధనము గలవాఁడగును.

రమతే సర్వవధూభిః కాంతశరీరస్సుఖార్థభోగయుతః,
లగ్నే భృగుసుతయమయోర్నృపభృత్యశ్శోకసంతప్తః 83

లగ్నకేంద్రమందు శుక్రశనులుండిన అనేకస్త్రీలతో రమించువాఁడు, సౌందర్యము గలవాఁడు, సుఖము ధనము భోగము భృత్యులు గలవాఁడు, దుఃఖముచే తపించువాఁడు అగును.

మిత్రేభ్యో ధనలాభం బంధుభ్యస్సత్క్రియాస్సమాప్నోతి,
శనిశుక్రయోశ్చతుర్థే నృపతేశ్చ తథాప్తతాం యాతి. 84

శుక్రశనులు చతుర్థమందుండిన మిత్రులవలన ధనలాభము, బంధువులవలన సత్కారము గలవాఁడు, రాజప్రీతి గలవాఁడు అగును.

స్త్రీరత్నాని సుఖాని చ ధనాని కీర్తిం చ భూతిమఖిలాం చ,
మందసితయోర్ద్యూనే ప్రాప్నోతి పుమాన్విషయలాభమ్. 85

శుక్రశనులు సప్తమమందుండిన శ్రేష్ఠమైన స్త్రీలను సుఖమును ధనమును కీర్తిని దేశలాభమును బొందువాఁడగును.

సర్వద్వంద్వవిముక్తో లోకే ఖ్యాతో విశిష్టకర్తా చ,
మేషూరణే సితార్కిర్నృపతేర్మంత్రీ భవేదధికః. 86

శుక్రశనులు దశమమందుండిన శీతోష్ణసుఖదుఃఖాదులను విడిచినవాఁడు, లోకమందు ఖ్యాతిగలవాఁడు, కార్మికుఁడు, రాజమంత్రి, అధికుఁడు అగును.

ఏవం త్రిభిశ్చతుర్భిఃపంచభి రథ సప్తభిశ్చ షడ్భిర్వా,
వక్తవ్యం కేంద్రస్థైర్గ్రహయోగఫలం విచింత్య ధియా. 87

ఈప్రకారమే కేంద్రములయందు మూడుగ్రహములు నాల్గుగ్రహములు ఐదు గ్రహములు ఆఱుగ్రహములు ఏడుగ్రహములు కలిసియుండఁగాఁ గలుగు ఫలమును బుద్ధిచేత నాలోచించి చెప్పఁదగినది.

ఇతి కల్యాణవర్మవిరచితాయాం సారావల్యాం ద్వ్యంతరయోగోనామ ఏకత్రింశోఽధ్యాయః.

ద్వ్యంతరయోగము లనఁగా లగ్నకేంద్రమునకు చతుర్థకేంద్రమునకు మధ్య యందు రెండురాసు లుండుటవలన అనఁగా ప్రథమగ్రహయుంతరాశి అయినతరువాత రెండురాసులు విడిచి మూఁడవరాశియందు గ్రహయుంతఫలముం జెప్పుటవలన ద్వ్యంతర యోగాధ్యాయమని తెలియవలయును.

---

భాగ్యచింతను దెలుపు ముప్పదిరెండవ యధ్యాయము.

సర్వముపహాయ చింత్యం భాగ్యర్క్షం ప్రాణినాం విశేషేణ,
భాగ్యం వినా న జంతు ర్వ్యస్తాత్తద్యత్నతో వక్ష్యే. 1

ఏహేతువుచేత భాగ్యము లేకుండా సర్వజంతువులకు సమస్తము లేదో ఆహే తువువలన ముఖ్యముగా భాగ్యరాశి నాలోచింపఁదగినదని తెలియవలయు.

లగ్నాన్నిశాకరాద్వా యన్నవమం తద్గృహం భవేద్భాగ్యం,
అనయోర్యో బలయుక్తో భాగ్యగృహం చింతయేదస్మాత్. 2

లగ్నమువల్లనుంచి లేక చంద్రునివల్లనుంచి ఏనవమస్థానము బలయుక్తముగ నుండునో ఆస్థానము ననుసరించి ఫలముల నాలోచించఁదగినదని యెఱుంగవలయు.

భాగ్యర్క్షపతిః కస్మిన్నేకో భాగ్యర్క్షమాశ్రితో విహగః,
బలవాన్మందబలో వా తస్యాధిపతేస్తు కారకో జ్ఞేయః. 3

భాగ్యస్థానాధిపతి ఏరాశియందున్నను బలవంతుఁడైనను లేక బలహీనుఁడైనను, భాగ్యాధిపతియే కారకుఁడని తెలియఁదగినది. భాగ్యరాశియందున్న అన్యగ్రహము కారకుఁడు గాఁడనుట.

స్వస్వామిదృష్టయుక్తం స్వదేశఫలదాయకం మునిభిరుక్తం,
అన్యేన సహితదృష్టం పరదేశఫలప్రదం భవతి భాగ్యమ్. 4

భాగ్యాధిపతిచేఁ జూడఁబడియుఁ గూడియుఁ భాగ్యస్థానమందుండెనేని స్వదేశమందు భాగ్యప్రాప్తి గలుగును. అన్యులచేఁ జూడఁబడియుఁ గూడియుఁ నుండెనేని పరదేశమందు భాగ్యప్రాప్తి గలుగును.

దుశ్చిక్యగతో భాగ్యం పంచమభవనస్థితో గ్రహః పశ్యేత్,
హోరాగతశ్చ బలవా న్యేషాంతే మానవా శ్శ్రేష్ఠాః. 5

గ్రహము బలవంతుఁడై లగ్నమువల్లనుంచి తృతీయమందుండి సప్తమదృష్టిచే భాగ్యమును జూచినను పంచమమందుండి పంచమదృష్టిచే భాగ్యమును జూచినను లగ్నమందుండి నవమదృష్టిచే భాగ్యమును జూచినను బుట్టినవారు శ్రేష్ఠులగుదురు.

దేవగురౌ భాగ్యస్థే మంత్రీ రవివీక్షితే నృపతితుల్యః,
భోగీ కాంత శ్శశినా కాంచనభాగ్భవతి భౌమేన 6

బృహస్పతి భాగ్యమందుండెనేని మంత్రియగును. రవి జూచెనేని రాజతుల్యుఁడగును చంద్రుఁడు జూచెనేని భోగము సౌందర్యము కుజుఁడు చూచెనేని బంగారము గలవాఁడగును.

సౌమ్యేన ధనీ జ్ఞేయస్సితేన గోవాహనార్థసంయుక్తః,
సౌరేణ స్థావరభాగ్దృష్టే ఖరమహిషసంయుక్తః 7

బుధుఁడు జూచెనేని ధనికుఁడగును. శుక్రునిచేఁ జూడఁబడెనేని గోవులు వాహనములు ధనము మొదలైనవి గలవాఁడగును. శని జూచెనేని స్థిరద్రవ్యము గలవాఁడు, కంచరగాడిదెలు గేదెలు గలవాఁడగును

ఐశ్వర్యరత్నకాంచనసాహసభాగుత్తమశ్చ వీర్యేణ,
రవిరుధిరాభ్యాం దృష్టే వాహనపరివారవా న్పురుషః. 8

భాగ్యస్థానమందున్న బృహస్పతి రవికుజులచేఁ జూడఁబడెనేని అష్టైశ్వర్యములు, రత్నములు, సువర్ణము, సాహసము, మంచిపరాక్రమము, వాహనములు, సేవకులు గలవాఁడగును.

చంద్రార్కాభ్యాం దృష్టే సుసమృద్ధో వల్లభః పితృజనన్యోః,
ఖ్యాతో నరేంద్రతుల్యో బహుదారసమన్వితః పురుషః. 9

భాగ్యమందున్న బృహస్పతి రవిచంద్రులచేఁ జూడఁబడెనేని ధనధాన్యాది సమృద్ధిగలవాఁడు, తల్లిదండ్రులకు ప్రియుఁడు, రాజతుల్యుఁడు, అనేకభార్యలతోఁ గూడియుండువాఁడు అగును.

లలితః కాంతస్సుభగో వరయువతివిభూషణార్థసంపన్నః,
బుధసూర్యాభ్యాం దృష్టే కావ్యకలాపండితః ప్రాజ్ఞః

రవిబుధులచేఁ జూడఁబడెనేని సౌందర్యము గలవాఁడు, మనోహరమైనవాఁడు, శ్రేష్ఠమైనభార్య ఆభరణములు ధనము గలవాఁడు, పండితుఁడు, ప్రాజ్ఞుఁడు, అగును.

ఉత్సవసమాజశీలో గోమహిషాజవరవారణోపేతః,
రవిసితదృష్టే జీవే భాగ్యస్థే స్యాద్వినీతశ్చ 11

రవిశుక్రులచేఁ జూడఁబడెనేని ఉత్సవాదులయం దాసక్తిగలవాఁడు, గోవులు మహిషములు మేఁకలు శ్రేష్ఠమైన ఏనుఁగులు గలవాఁడు, గొప్ప వినయము గలవాఁడు అగును.

అర్కార్కిభ్యాం దృష్టే దేశపురశ్రేణినాయకః ఖ్యాతః,
ప్రాజ్ఞో గుణవాన్నధనో నిధినాథస్సంగ్రహణశీలః. 12

రవిశనులచేఁ జూడఁబడెనేని దేశము పురము మొదలైనవాని కధిపతి, ఖ్యాతి గలవాఁడు, ప్రాజ్ఞుఁడు, గుణవంతుఁడు, ధనము నిధులుగూడఁబెట్టుశక్తిగలవాఁడగును.

సేనాచార్యస్సీస్థితో మంత్రీ వా జాయతే గురౌ భాగ్యే,
దృష్టే కుజచంద్రాభ్యాం నానావిధసౌఖ్యభాజనం సుభగః. 13

చంద్రకుజులచేఁ జూడఁబడెనేని సేనాధిపతి, అనేకసౌఖ్యములను పొందువాఁడు, మనోహరుఁడు అగును.

ఉత్తమగృహశయనానాం భోగీ తేజోఽన్వితః క్షమాప్రతిమః,
చంద్రబుధాభ్యాం దృష్టే జాతః పురుషోఽతిమతియుక్తః. 14

చంద్రబుధులచేఁ జూడఁబడెనేని ఉత్తమమైనగృహములోను ఉత్తమశయనములయందు భోగించువాఁడు, తేజస్సుగలవాఁడు, ఓర్పుగలవాఁడు, ఉత్తమబుద్ధిగలవాఁడు అగును.

ఆఢ్యః కర్మోద్యుక్తః శూరః పరదారవాన్సుతవిహీనః,
ఇందుసితాభ్యాం దృష్టే భాగ్యగృహే స్యాద్గురౌ జాతః. 15

చంద్రశుక్రులచేఁ జూడఁబడెనేని ధనికుఁడు,సత్కర్మాసక్తిగలవాఁడు,శూరుఁడు, పరదారాసక్తి గలవాఁడు, పుత్రులు లేనివాఁడు అగును.

మదబహులస్థిరజీవీ పరదేశరతో వివాదశీలః స్యాత్,
అనృతవచనో గుణో న శ్శశియమదృష్టే గురౌ భాగ్యే. 16

చంద్రశనులు జూచిరేని ప్రబలమదము గలవాడు, పూర్ణాయువు గలవాఁడు, పరదేశమందుండువాఁడు, వివాదముసేయువాఁడు అబద్ధమాడువాఁడు, గుణహీనుఁడు అగును.

సుప్రాజ్ఞోఽతిసుశీలస్సుగుణో విద్వాన్సుహితవాక్యశ్చ,
సురుచిరవేషో జీవే కుజబుధదృష్టే భవేద్భాగ్యే 17

భాగ్యస్థానమున నున్నబృహస్పతి అంగారకబుధులచేఁ జూడఁబడెనేని ప్రాజ్ఞుఁడు, మంచినడవడిగలవాఁడు, గుణవంతుఁడు, విద్వాంసుఁడు, మాటనాలించువాఁడు, అందమైనవేషముగలవాఁడు అగును.

ధనవాన్విద్యాయుక్తో విదేశగస్సాత్త్వికోఽతినిపుణశ్చ,
క్షితితనయభార్గవాభ్యాం దృష్టే క్రూరో నరో జాతః 18

భాగ్యస్థానమున నున్నబృహస్పతి కుజశుక్రులచేఁ జూడఁబడెనేని విద్యావంతుఁడు, విదేశములకేగువాఁడు, సత్వగుణముగలవాఁడు, మిక్కిలి నేర్పరి, క్రూరుఁడు అగును

నీచః పిశునో ద్వేష్యో విదేశగశ్చలజనైస్సమాయుక్తః,
భౌమార్కిభ్యాం దృష్టే భాగ్యగృహే సురగురౌ జాతః 19

కుజశనులచేఁ జూడఁబడెనేని నీచుఁడు,బలసినవాఁడు, ద్వేషించఁదగినవాఁడు, విదేశమందుండువాఁడు, దుర్మార్గసహవాసము గలవాఁడు అగును.

శిల్పజ్ఞోఽతిసుశీలో విద్వాన్సుభగో గృహీతవాక్యశ్చ,
సురుచిరవేషో జీవే బుధసితదృష్టే భవేద్భాగ్యే 20

బుధశుక్రులు జూచెనేని బుట్టినవాఁడు శిల్పశాస్త్రము నెఱింగినవాఁడు, యోగ్యస్వభావయుక్తుఁడు, విద్వాంసుఁడు, సౌందర్యవంతుఁడు, మాటపాటించువాఁడు అగును.

సుభగో విద్వాన్వక్తా లలితశ్శూరస్సుఖీ వినీతశ్చ,
జీవే భాగ్యోపగతే బుధార్కిదృష్టే పుమాన్ భవతి. 21

బుధశుక్రులు జూచిరేని సౌందర్యము గలవాఁడు విద్వాంసుఁడు, వక్తృత్వము గలవాఁడు, శౌర్యవంతుఁడు, వినయవంతుఁడు అగును.

దేవగురౌ భాగ్యస్థే కావ్యార్కిజవీక్షితే పుమాన్ భవతి,
రాజేశ్వరరాష్ట్రిణాం పురోగమో ధనసమృద్ధశ్చ. 22

శుక్రశనులచేఁ జూడఁబడెనేని రాజశ్రేష్ఠుఁడు, అధికధనము గలవాఁడు,రాజులలో రాష్ట్రములో మొదటివాఁడు అగును.

రాశ్యధిపేన చ దృష్టే జీవే భాగ్యాశ్రితే నృణాం జ్ఞేయం,
ఏభిః కథితై ర్దృష్టే ఫలమిద మన్యై రసందృష్టే 23

జననకాలమున బృహస్పతి భాగ్యస్థానమునందుండి భాగ్యాధిపతిచేతను ఈ పూర్వమందుఁ జెప్పఁబడిన యోగగ్రహములచేతను మాత్రము జూడఁబడెనేని ఈఫలములు జరుగును ఇతరులచేఁ జూడఁబడెనేని యీఫలములు జరుగవు.

ఉత్తమరూపో గుణవా న్తేజస్వీ పార్థివో మహావిభవః,
దేవగురౌ భాగ్యస్థే సర్వగ్రహవీక్షితే భవతి. 24

బృహస్పతి భాగ్యమందుండి సర్వగ్రహములచేతఁ జూడఁబడెనేని శ్రేష్ఠమైన రూపము గుణములు తేజస్సుగలవాఁడు, రాజు,గొప్పఐశ్వర్యము గలవాఁడు అగును.

భాగ్యే శుభగగనసదో బలినో రాజ్యప్రదా స్తు విజ్ఞేయాః,
స్థావరధనధాన్యకరా ధర్మాయు ర్వర్ధనాశ్చైవ. 25

భాగ్యస్థానమందు బలవంతులై శుభగ్రహములుండెనేని రాజ్యముగలవారు, స్థిరమైన ధనము ధాన్యము ధర్మము ఆయుస్సు గలవా రగుదురు.

నీచారిరాశిసంస్థాః పాపా భాగ్యేన సౌమ్యసందృష్టాః,
దుర్బలమధనం కుర్యుర్విగతఖ్యాతిం నరం మలినమ్. 26

పాపగ్రహములు నీచశత్రుస్థానములయందుండి భాగ్యమును బొంది శుభగ్రహములచేఁ జూడఁబడక యుండిరేని దుర్బలుఁడు, నిర్ధనుఁడు, ఖ్యాతిహీనుఁడు, మాలిన్యము గలవాఁడు అగును.

స్వేస్వే భవనే పుంసాం క్రూరా భాగ్యర్క్షసంస్థితా యే స్యుః,
జ్ఞేయా స్త ఉత్తమశుభా బహుతరగుణసంయుతాశ్శుభైర్దృష్టాః.

భాగ్యాధిపతి పాపుఁడైనను భాగ్యస్థానమందుండెనేని శుభగుణయుక్తుఁ డగును. శుభగ్రహములచేఁ జూడఁబడెనేని విశేషగుణయుక్తుఁడగును.

పూర్ణేందుయుతే భాగ్యే వక్రార్కిబుధాః ప్రధానవీర్యాశ్చ,
వ్యస్తావాఽథ సమస్తాః ప్రధాననృపసంభవో జ్ఞేయః. 28

పూర్ణచంద్రుఁడు భాగ్యస్థానమందుండి బలవంతులైన కుజబుధశనులు కలిసియున్నను లేక వ్యస్తముగ నున్నను ప్రధానరాజవంశమందుఁ బుట్టినవాఁడగును. (కుజబుధశనులు బలవంతులై యుండుటయే ప్రధానమని తాత్పర్యము).

సకలగగనగేహా స్స్వోచ్చగా భాగ్యరాశౌ
ధనకనకసమృద్ధం శ్రేష్ఠ ముత్పాదయంతి,
అథ శుభవిహగేంద్రై స్తత్రదృష్టే నరేంద్రం
వినిహతరిపుపక్షం దివ్యకాంతిం సుకీర్తిమ్ 29

సర్వగ్రహములు ఉచ్చలనుపొంది భాగ్యస్థానమందుండఁగాఁ (అనఁగా భాగ్యస్థాన మేగ్రహమునకు ఉచ్చస్థానమో ఆగ్రహము భాగ్యస్థానమందుండుట యని తాత్పర్యము) బుట్టినవాఁడు శ్రేష్ఠుఁడు, ధనాదులు గలవాఁ డగును శుభగ్రహములు జూచెనేని నరేంద్రుఁడు, శత్రుహీనుఁడు, ప్రబలకీర్తి కాంతి గలవాఁడగును.

సూర్య శ్చంద్రసహాయో భాగ్యే స్వల్పాయుషం నరం కురుతే,
నయనవ్యాధిత మాఢ్యం సుభగం కలహప్రియంచాపి. 30

రవిచంద్రులు భాగ్యస్థానమున నుండిరేని అల్పాయుస్సు, నేత్రవ్యాధి, సంపద సౌందర్యము, పోట్లాటలయం దాసక్తిగలవాఁడు అగును.

భాను ర్వక్రసమేతో నానాదుఃఖాన్వితం నరం కురుతే,
కలహప్రియం ప్రచండం శూరం నృపవల్లభం నిపుణమ్. 31

రవికుజులు కలసి భాగ్యస్థానమందుండిరేని అనేకదుఃఖములు గలవాఁడు, కలహముల నిష్టముగలవాఁడు, తీక్ష్ణమైనవాఁడు, శౌర్యవంతుఁడు, రాజప్రియుఁడు, నిపుణుఁడు అగును.

రవిసహిత శ్శశితనయో నిపుణం దుఃఖాన్వితం బహువిపక్షం,
జనయతి భాగ్యే పురుషం నానారోగైః పరిగృహీతమ్ 32

రవిబుధులు కలసి భాగ్యమందుండిన నిపుణుఁడు, దుఃఖముగలవాఁడు, అనేకమందిశత్రువులు, అనేకరోగములు గలవాఁడు అగును.

సురగురుసహిత స్సూర్యో భాగ్యే కుర్యా ద్ధనాన్వితం పురుషం,
పితరంచ ధనసమృద్ధం దీర్ఘాయుష మార్య మతిశూరమ్. 33

రవిగురులు కలసి భాగ్యమందుండిన ధనికుఁడు, ధనముగల తండ్రిగలవాఁడు, దీర్ఘాయుస్సు పూజ్యత శౌర్యము గలవాఁ డగును.

శుక్రసహాయ స్సూర్యో వ్యాధితదేహం నరంకురుతే,
ప్రియగంధమాల్యభూషణవస్త్రాలంకారసంయుతం భాగ్యే 34

రవిశుక్రులు భాగ్యమందుండిన వ్యాధిగలవాఁడు, గంధమాల్యాదులయం దాసక్తి మొదలైనవి గలవాఁ డగును.

సూర్య స్సౌరసహాయో ధనినం నేత్రాతురం కలహనిష్ఠం,
వ్యాధితపితరం కురుతే భాగ్యే స్వల్పాయుషం పురుషమ్.

రవిశనులు కలసి భాగ్యస్థానమందుండిన ధనికుఁడు, నేత్రవ్యాధిగలవాఁడు, కలహమం దాసక్తి గలవాఁడు, దీర్ఘవ్యాధిగల తండ్రిగలవాఁడు, అల్పాయుస్సు పొందినవి గలవాఁ డగును

చంద్రో రుధిరసహాయో భాగ్యం సముపేత్య మాతరం హన్యాత్,
కుర్యాచ్చ వికలగాత్రం సవ్రణదేహం సమృద్ధంచ. 36

చంద్రకుజులు కలసి భాగ్యమందుండిన భాగ్యమునుపొంది తల్లిని చంపువాఁడు, అంగహీనుఁడు, వ్రణయుక్తమైన దేహముగలవాఁడు, సర్వవిషయములచే సమృద్ధిగనుండువాఁడు అగును.

చంద్ర స్సౌమ్యసమేత శ్శాస్త్రజ్ఞం పండితం వికలదేహం,
జనయ త్యుత్తమపురుషం బహువాచం విశ్రుతంచైవ. 37

జననకాలమున చంద్రబుధులు కలసిభాగ్యమందుండిన శాస్త్రజ్ఞుఁడు, వేదాంతజ్ఞానముగలవాఁడు, అంగహీనుఁడు, ఉత్తమజాతియం దుత్పన్నుఁమైనవాఁడు, విస్తరించి మాటలాడువాఁడు, ప్రసిద్ధిగలవాఁడు అగును. (భాగ్యమందుండిన బుట్టినవాఁడు అను వాక్యములు ఈయోగములయందంతట తెలియఁదగినది )

సురగురుసహితే చంద్రే భాగ్యే ప్రవరః ప్రసూయతే పురుషః,
సౌభాగ్యధనసమృద్ధ స్సర్వత్ర సుఖాన్వితో ధీరః 38

చంద్రగురువులు కలసి భాగ్యమందుండిన శ్రేష్ఠుఁడు, ధనము సుఖము ధైర్యము అన్నిచోట్ల సౌఖ్యము గలవాఁ డగును.

చంద్రో భార్గవసహితో భాగ్యగృహే వ్యాధితం నరం కురుతే,
కులటాపతిం సమృద్ధం మాతృసపత్నీప్రదం సచివవశ్యమ్ 39

చంద్రశుక్రులు భాగ్యమందుండిన వ్యాధియుక్తుఁడు, రంకురాలైన భార్యగలవాఁడు, సంపన్నుఁడు, సవతితల్లి గలవాఁడు, మంత్రివశీకారము గలవాఁడు అగును.

రవిసుతసహిత శ్చంద్రో నవమేరాశౌ వికృష్టకర్మాణం,
జనయతి మనుజం పాపం మాతాచ కులచ్యుతాభవతి. 40

చంద్రశనులు నవమమందుండెనేని చెడ్డపనులఁజేయువాఁడు, పాపుఁడు, కులత్యాగమైనతల్లి గలవాఁడు అగును.

రుధిర స్సోమజసహితో భాగ్యర్క్షే జనయతి ప్రధానంచ,
నిత్యోద్విగ్నం సుభగం భోగయుతం శాస్త్రకుశలంచ. 41

కుజబుధులు కలసి నవమమందుండిన ముఖ్యమైనవాఁడు, ఎల్లప్పుడు ఉద్వేగము గలవాఁడు, సౌందర్యము భోగము గలవాఁడు, శాస్త్రములయందు నేర్పుగలవాఁడు అగును.

భౌమ స్సురగురుయుక్తో భాగ్యే ధనధాన్యభాగినం పురుషం,
పూజ్యం వ్యాధితదేహం క్లిష్టం వ్రణాదీక్షితం ప్రసవే. 42

అంగారకుఁడు బృహస్పతిసహితుఁడై భాగ్యస్థానముననున్న ధనధాన్యములుగలవాఁడు, పూజింపఁదగినవాఁడు, వ్యాధులుగలవాఁడు, అనేకకష్టములనొందువాఁడు, వ్రణములు యెల్లప్పుడు దేహమునఁగలవాఁడు అగును.

భార్గవసహితః క్షితిజః పరదేశరతం వివాదినం క్రూరం,
స్త్రీద్వేషిణం కృతఘ్నం జనయతి మిథ్యాప్రధానంచ 43

కుజశుక్రులు కలసి భాగ్యమందుండిన పరదేశమందుండువాఁడు, వివాదముసేయువాఁడు, క్రూరుఁడు, స్త్రీద్వేషి, చేసినమేలు మరచి అపకారము సేయువాఁడు, అబద్ధమాడువాఁడు అగును.

పాపం మలినాచారం పరదారరతం వినష్టధనసౌఖ్యం,
కుజరవిజౌ భాగ్యగృహే స్వజనవిహీనం నరం కురుతే 44

అంగారకశనులు భాగ్యముననున్న పాపుఁడు, నీచాచారములుగలవాఁడు, ఇతరభార్యాసక్తుఁడు, ధనము సౌఖ్యములేనివాఁడు, బంధువులులేనివాఁడు అగును.

సౌమ్య స్సురగురుసహిత శ్శాస్త్రజ్ఞం పండితం ధనసమృద్ధం,
ప్రియవాదినం కలాజ్ఞం ప్రభవిష్ణుమహాత్తరం భాగ్యే. 45

బుధగురులు కలసి భాగ్యమందుండిన శాస్త్రములు మొదలైనవి దెలిసినవాఁడు, ధనికుఁడు, ప్రియముగ బలుకువాఁడు అగును.

భృగుసుతసహిత స్సౌమ్యః ఖ్యాతం చ సుపండితం ధీరం,
సుభగం వచనసమృద్ధం జనయతి నిచప్రియం భాగ్యే. 46

బుధశుక్రులు భాగ్యమందుండిన ఖ్యాతి పాండిత్యము ధైర్యము సౌందర్యము వాక్చాటి గలవాఁడు, నీచులకు ఇష్టుఁడు అగును.

సూర్యజసహితస్సౌమ్యో వ్యాధితమాఢ్యం ప్రియాన్వితంనిపుణం,
జనయతి భాగ్యే పురుషం సద్వేష్యం బహుకథం చైవ.

బుధశనులు కలసి భాగ్యమందుండిన వ్యాధిగలవాఁడు, ధనికుఁడు, ప్రియుఁడు. నిపుణుఁడు, ద్వేషముగలవాఁడు అగును.

శుక్ర స్సురగురుసహితో భాగ్యగృహస్థో నరాధికం కురుతే,
చిరజీవినం సువాక్యం నానావిధసౌఖ్యసంపన్నమ్. 48

గురుశుక్రులు భాగ్యమందుండిన నరశ్రేష్ఠుఁడు, పూర్ణాయుస్సు గలవాఁడు, యోగ్యమైన వాక్కులు అనేకవిధములుగ సౌఖ్యములు గలవాఁడగును.

జీవ స్సౌరసహాయో భాగ్యే ధనరత్నభాగినం కురుతే,
పూజ్యం వ్యాధితదేహం స్వజనవిహీనం సదాపురుషమ్. 49

గురుశనులు భాగ్యస్థానమందుండిరేని ధనము రత్నములు మొదలైనవి గలవాఁడు, పూజ్యుఁడు, వ్యాధియుక్తమైన దేహముగలవాఁడు, స్వజనులచే విడువఁబడువాఁడు అగును.

సౌరసహాయః శుక్రో వ్యాధితదేహం నరం కురుతే,
బహుపుత్రం నృపతీష్టం యశస్వినం శీలసంపన్నమ్. 50

శుక్రశనులు కలసి భాగ్యస్థానమందుండిరేని వ్యాధియుక్తుఁడు, అనేకపుత్రులు గలవాఁడు, రాజప్రియుఁడు, యశస్సు సత్స్వభావము గలవాఁడు అగును.

ఏవం స్థానవిశేషై ర్దృష్టివిశేషై శ్చ నిపుణ మధిగమ్య,
బ్రూయా త్ఫలనిర్దేశం శాస్త్రా దనురూపతః ప్రాజ్ఞః. 51

ఈప్రకారము స్థానవిశేషముచేతను దృష్టివిశేషముచేతను నైపుణ్యమున దెలుసుకొని ప్రాజ్ఞుఁడైన జ్యోతిష్కుఁడు శాస్త్రము ననుసరించి ఫలనిర్దేశము జేయఁదగినది.

సవ్రణగాత్రం రూక్షం మృతపితరం మాతృవర్జితం కుర్యుః,
బాల్యే క్షుద్రం ద్వేష్యం హింస్రం శశిరుధిరభానవో భాగ్యే. 52

జననకాలమున రవిచంద్రకుజులు కలసి భాగ్యమందుండిరేని గాయములుగల శరీరముగలవాఁడు, తండ్రిలేనివాఁడు, తల్లిచే విడువఁబడువాఁడు, బాల్యమందు నీచుఁడు, ద్వేషింపఁబడువాఁడు, హింససేయువాఁ డగును.

రవిచంద్రబుధాభాగ్యే క్లీబాచారం సుదుఃఖితం కుర్యుః,
సర్వజనానాం ద్వేష్యం విక్రాంతం సత్యవచనంచ. 53

భాగ్యస్థానమున రవిచంద్రబుధులున్న నపుంసకుఁడు, దుఃఖవంతుఁడు, అందరు కులచే ద్వేషింపఁబడువాఁడు, పరాక్రమవంతుఁడు, సత్యవాక్కుగలవాఁడు అగును.

చంద్రదివాకరగురవో నవమేపురుషస్య సంభవేయస్య,
సభవత్యుత్తమపురుషో వాహనధనసౌఖ్యసంపన్నః. 54

రవిచంద్రగురువులు కలసి నవమమం దుండిరేని ఉత్తముఁడు, వాహనములు ధనము సౌఖ్యము మొదలైనవి గలవాఁ డగును.

రవిచంద్రసితానవమే స్త్రీకలహైర్నష్టసర్వధనసౌఖ్యం,
నృపసంమతం నయజ్ఞం జనయంతి నరం ప్రియాలాపమ్. 55

రవిచంద్రశుక్రులు భాగ్యమందుండిరేని స్త్రీకలహములచే ధనము సుఖము లేని వాఁడు, రాజప్రియుఁడు, నీతి దెలిసినవాఁడు, ప్రియముగ బలుకువాఁ డగును.

సూర్యనిశాకరసౌరా నవమేరాశౌ నరం సదాకుర్యుః,
ప్రబలం చండాచారం పరభృత్యం లోకవిద్విష్టమ్ 56

రవిచంద్రశనులు భాగ్యస్థానముననున్న జాతకుఁడు, బలవంతుఁడు, తీక్ష్ణమగునడ వడిగలవాఁడు, ఇతరులకు సేవనొనర్చువాఁడు, లోకద్వేషియు నగును.

రవిభౌమబుధానవమే కుర్వంతి నరం ప్రియాలాపం,
భుజగమి వాతిక్రుద్ధం సమరపరం నిష్ఠురం ప్రవాసరతమ్. 57

రవికుజబుధులు భాగ్యమందుండిరేని ప్రియముగ బలుకువాఁడు, సర్పమువలె మిక్కిలి కోపముగలవాఁడు, యుద్ధమం దాసక్తి గలవాఁడు, కఠినుఁడు, పరదేశమం దుండువాఁడు అగును.

రవిగురువక్రానవమే జనయంతి నరం సదోద్యుక్తం,
దేవపితృపూజనరతం సమృద్ధదారం గుణోపేతమ్. 58

రవికుజగురువులు భాగ్యస్థానముననున్న జాతకుఁడు ఎల్లపుడు పనులచేయుటకు సంసిద్ధుఁడు, దేవతల పితృదేవతల పూజనొనర్చువాఁడు, భాగ్యవంతురాలగు భార్యగల వాఁడు, గుణవంతుఁడు అగును.

కలహప్రియం కులీనం కన్యానాం దూషకంచ చపలంచ,
దివసకరవక్రశుక్రా నవమే ద్వేష్యం నరం కుర్యుః 59

రవికుజశుక్రులు భాగ్యస్థానముననున్న కలహములన్న ప్రీతిగలవాఁడు, ఉత్తమ వంశముగలవాఁడు, కన్యలను దూషించువాఁడు, చంచలస్వభావముగలవాఁడు, ఇతరులచే ద్వేషింపఁబడువాఁడు అగును.

సాహసిక మతిక్షుద్రం లోకద్వేష్యం ప్రియానృతం శూరం,
పిత్రారహితం బాల్యే కుర్యు ర్వక్రార్కి భానవో నవమే.

రవికుజశనులు భాగ్యమందుండిరేని సాహసము గలవాఁడు, నీచుఁడు, జనద్వేషి, ప్రియులతో అనృతమాడువాఁడు, శౌర్యము గలవాఁడు, బాల్యమందు తండ్రిచే విడువఁబడువాఁడు అగును.

రవిబుధగురవో నవమే భాగ్యసమేతం ధనాన్వితం సుభగం,
నృపతిప్రియం సువేషం జనయంతి నరం సుధీరంచ. 61

రవిబుధగురువులు భాగ్యస్థానముననున్న భాగ్యవంతుఁడు, ధనముగలవాఁడు, సౌందర్యవంతుఁడు, రాజునకు ప్రియుఁడు, మంచివేషముగలవాఁడు, ధైర్యవంతుఁడు అగును.

రవిబుధశుక్రా భాగ్యే జనయంతి నరం ప్రకాశినం కాంతం,
రిపుపక్షపరిక్షీణం నృపతిసమం సారవంతంచ. 62

రవిబుధశుక్రులు భాగ్యమందుండినచో కాంతిగలవాఁడు, శత్రువులను నశింపఁ జేయువాఁడు, రాజతుల్యుఁడు, సారవంతమైనవాఁడు అగును.

పరదారరతం పాపం ప్రవాసశీలంచ నిపుణ మతిధృష్టం,
అనృతికమదైవపరం రవిబుధసౌరా నరంభాగ్యే. 63

రవిబుధశనులు భాగ్యస్థానమున నుండఁగా జన్మించిన పరభార్యలయందు ఆసక్తి గలవాఁడు, పాపుఁడు, ఇతరదేశముల నివసించువాఁడు, నేర్పరి, దుర్మార్గుఁడు, అబద్ధము పల్కువాఁడు, దేవుని నమ్మనివాఁడును అగును.

భాగ్యగృహే రవిశుక్రా జీవశ్చ నరం సుపండితం కాంతం,
బహువిషయపతిం వీరం జనయంతి సుమేధసం ప్రాజ్ఞమ్. 64

రవిగురుశుక్రులు భాగ్యస్థానముననున్న మంచిపండితుఁడు, సౌందర్యవంతుఁడు, అనేకదేశముల కధిపతి, పరాక్రమవంతుఁడు, మంచిబుద్ధిగలవాఁడు అగును.

త్రిదశగురుసౌరసూర్యా నవమే యస్యేహ జాయమానస్య,
సభవే దుత్తమవీర్యో రాజా ధనవాన్గుణైస్సమృద్ధశ్చ. 65

రవిగురుశనులు నవమస్థానమున నుండఁగా జన్మించిన మంచిపరాక్రమముగల వాఁడు, రాజు, ధనవంతుఁడు, గుణవంతుఁడు అగును.

కాంతవిహీనం మలినం భూపతిపరిదండితం విభవహీనం,
జనయంతి నరంభాగ్యే రవిశుక్రశనైశ్చరామూర్ఖమ్ 66

రవిశుక్రశనులు భాగ్యమందుండిన భార్య లేనివాఁడు, రాజదండనగలవాఁడు, ఐశ్వర్యము లేనివాఁడు, మూర్ఖుఁడు అగును.

ధనకనకరత్నభాజం జనయంతి శశిజ్ఞభూమిజాః పురుషం,
ప్రథమే వయసిచ తత్తం భాగ్యగృహే సర్వనాశేన. 67

చంద్రకుజబుధులు భాగ్యస్థానమున నుండిరేని జాతకుఁడు ధనము బంగారము రత్నములు గలవాఁడు, ఐశ్వర్యముగల గృహమునఁబుట్టి బాల్యముననే సర్వనాశమగుటచే దుఃఖమునొందువాఁడును అగును

భౌమనిశాకరజీవాః కుర్వంతి నరం జితేంద్రియం ప్రాజ్ఞం,
గురుదేవభక్తినిరతం విద్యాధనభాగినం సుభగమ్. 68

చంద్రకుజగురువులు భాగ్యస్థానమునవున్న ఇంద్రియములను వశమునఁనుంచుకొనువాఁడు, ప్రాజ్ఞుఁడు, గురువులయందు దేవతలయందు భక్తి విశేషముగాఁగలవాఁడు, విద్య ధనము గలవాఁడు, సౌందర్యవంతుఁడు అగును

వ్రణితాంగ మరూపంవా ప్రభేదినం స్త్రీప్రియం యువతివశ్యం,
యువతివినాశితసారం భృగుశశివక్రానరం నవభే. 69

చంద్రకుజశుక్రులు భాగ్యమందుండిన వ్రణములు మొదలైనవి గలవాఁడు, స్త్రీలకు భేదబుద్ధి గలుగఁజేయువాఁడు, స్త్రీలకు ప్రియుఁడు, స్త్రీవశ్యుఁడు, స్త్రీమూలముగ బలహీనుఁడు అగును.

వ్యాపన్నమాతృవంశం క్షుద్రం బాల్యే నిరాకృతం మాత్రా,
సౌరో భౌమ శ్చంద్రో జనయంతి నరాధమం నవమే. 70

చంద్రకుజశనులు కలిసి భాగ్యమందుండిన నశించిన మాతృవంశముగలవాఁడు, నీచుఁడు, బాల్యమందు తల్లిచే విడువఁబడువాఁడు, నరాధముఁడు అగును.

గురుబుధచంద్రానవమే కులవంశవివర్ధనం కుర్యుః,
ఆచార్యం బహుమిత్రం నృపతిం బహుసాధనోపేతమ్ 71

చంద్రబుధగురువులు భాగ్యమందుండిన కులమును వంశమును వృద్ధిసేయువాఁడు, శ్రేష్ఠుఁడు, అనేకమిత్రులు గలవాఁడు, రాజు, అనేకసాధనములు గలవాఁడు అగును.

మాతృసపత్నీజనకం ప్రముదితమానాన్వితం ప్రచురమిత్రం,
కుర్వంతి సామశీలం భృగుబుధచంద్రానరంభాగ్యే

చంద్రబుధశుక్రులు భాగ్యమందుండిన సవతితల్లి గలవాఁడు, అభిమానము గలవాఁడు, మిత్రబహుళము గలవాఁడు, ఓర్మిగలవాఁడు అగును.

శశిబుధసౌరానవమే క్రూరాచారం సువిక్రమం మలినం,
జనయంతి కుత్సితధియం సంగ్రామపరాఙ్ముఖం దీనమ్. 73

చంద్రబుధశనులు భాగ్యమందుండిన క్రూరుఁడు, పరాక్రమము మాలిన్యము గలవాఁడు, కుబుద్ధి గలవాఁడు, యుద్ధమున భీతిపొందువాఁడు, దీనుఁడు అగును.

చంద్రబృహస్పతిశుక్రా నవమే యస్యేహజాయమానస్య,
సభవతి మహీపతుర్లోకే నృపతికులే భూపతిశ్చైవ. 74

చంద్రగురుశుక్రులు భాగ్యమందుండఁగా రాజకులమందు బుట్టినచో ప్రభు వగును అన్యకులమందు బుట్టిన తత్తుల్యుఁ డగును.

శశిగురుసౌరానవమే కుర్వంతి నరం ప్రియాలాపం,
సత్యవ్రతం సుశీలం విఖ్యాతం సర్వశాస్త్రకుశలంచ 75

చంద్రగురుశనులు భాగ్యమందుండిరేని ప్రియముగ బలుకువాఁడు, సత్యమాఁడు వాఁడు, సౌమ్యమైన స్వభావము ఖ్యాతి గలవాఁడు, సర్వశాస్త్రములను దెలిసినవాఁ డగును.

శుక్రేందుయమానవమే కృషివృత్తిం యోగిపోషణానురతం,
కుర్యుర్మనుజ మపాయం నృపకృత్యం లోకవిఖ్యాతమ్. 76

చంద్రశుక్రశనులు భాగ్యమందుండిరేని కృషిచే జీవించువాఁడు, యోగులను పోషించువాఁడు, రాజకార్యములను సేయువాఁడు, లోకమందు ఖ్యాతిగలవాఁడు అగును

తేజస్వినం విశోకం విద్వాంసం వాక్స్థిరం విశిష్టంవా,
కుజబుధజీవానవమే కుర్వంతి చ మండలాధిపతిమ్. 77

కుజబుధగురువులు భాగ్యమందుండిరేని తేజస్సుగలవాఁడు,శోకహీనుఁడు, విద్వాంసుఁడు, మాటనిలకడ గలవాఁడు, ధనికుఁడు, మండలాధిపతి యగును.

బహువిషయపతిం ఖ్యాతం నరేంద్రసత్కారసత్కృతం చండం,
కుజబుధశుక్రాభాగ్యే కుర్వంతి నరం సతాం సత్యమ్. 78

కుజబుధశుక్రులు భాగ్యస్థానమునయున్న అనేకదేశముల నేలువాఁడు, ప్రసిద్ధిగల
ఁడు, రాజగౌరవము నంగువాఁడు, తీక్ష్ణమైనవాఁడు, సత్యమును పల్కువాఁడు

పరవంచనాసునిపుణం తమోఽధికం సర్వశాస్త్ర మతిబాహ్యం,
బుధభౌమయమానవమే కుర్యుః పరతర్కసంమూఢమ్. 79

కుజబుధశనులు భాగ్యమందుండిరేని పరులను వంచనసేయువాఁడు, కోపముగల
వాఁడు, శాస్త్రముల నెఱుంగనివాఁడు, ఎదిరివారివాదనచే నోడిపోవువాఁడు అగును.

బుధగురుశుక్రాభాగ్యే జనయంతి నరం సురోపమం విశదం,
విఖ్యాతం నరనాథం విద్వాంసం ధర్మశీలంచ. 80

బుధగురుశుక్రులు భాగ్యమున నుండిరేని దేవతలతో సమానమైనవాఁడు, తెలివి
తేటలుగలవాఁడు, ప్రఖ్యాతిగలవాఁడు, రాజు, విద్వాంసుఁడు, ధర్మశీలుఁడు అగును.

శుక్రశనైశ్చరశశిజా నవమస్థా జాతకం ప్రకుర్వంతి,
మేధావినం ప్రకాశం సుపచిరవాక్యం సుఖోపేతమ్. 81

శుక్రశనిబుధులు తొమ్మిదవదగు భాగ్యస్థానమునయున్న మేధావంతుఁడు, ప్రసిద్ధి
గలవాఁడు, సొంపుగామాటలాడువాఁడు, సౌఖ్యవంతుఁడు అగును.

శనిశుక్రామరగురవో భాగ్యగృహస్థా నరం ప్రకుర్వంతి,
ప్రచురాన్నపానవిభవం సుభగం సుఖినం సురూపంచ. 82

శనిశుక్రబృహస్పతులు భాగ్యమున నుండిరేని అన్నపానములు విస్తారముగాఁ
గలవాఁడు, సౌందర్యము సుఖము అందముగల శరీరముగలవాఁడు అగును.

నాల్గుగ్రహములు భాగ్యస్థానమందుండ గలుగుఫలమును జెప్పు
చున్నాఁడు:—

రవిచంద్రభౌమిశశిజా జన్మనిభాగ్యర్క్షగానరం కుర్యుః,
ధనినం విద్యాకుశలం సుభగం నృపసంమతం చైవ. 83

రవిచంద్రకుజబుధులు భాగ్యస్థానమందుండిరేని ధనికుఁడు, విద్యలయందు
నేర్పుగలవాఁడు, సౌందర్యముగలవాఁడు, రాజప్రియుఁడు అగును.

శుక్రేందుభౌమరవయో మాయాచతురం స్వదారసంతుష్టం,
జనయంతి సదాభాగ్యే పురుషం బహునీచకర్మాణమ్. 84

రవిచంద్రకుజశుక్రులు భాగ్యమందుండిరేని మాయసేయువాఁడు, ఏకపత్నీ వ్రతుఁడు, నీచకర్మలు సేయువాఁడు అగును.

శశిసురగురుబుధరవయో జన్మనిభాగ్యర్క్షమాశ్రితాః కుర్యుః
పురుషం ప్రధాన మచలం నరేంద్రపూజ్యం తథాధృష్టమ్ 85

రవిచంద్రబుధగురులు భాగ్యమందుండిరేని శ్రేష్ఠుఁడు, స్థిరుఁడు, రాజులచే సత్కరింపఁబడువాఁడు, దుర్జనుఁడు అగును.

చంద్రబుధశుక్రరవయో ధనేశ్వరం ధార్మికం సమృద్ధంచ,
జనయంతి నవమసంస్థాః పురుషం ప్రియవాదినం శాంతమ్. 86

రవిచంద్రబుధశుక్రులు భాగ్యమందుండిరేని ధనికుఁడు, ధార్మికుఁడు, ప్రియవాది శాంతుఁడు అగును.

తరణిబుధచంద్రసౌరా జన్మని నవమాశ్రితా నరం కుర్యుః,
ధనినం యశస్సమేతం విద్యాకుశలం సువాక్యంచ. 87

రవిచంద్రబుధశనులు నవమస్థానమున నుండిరేని ధనము యశస్సు విద్య సౌష్ఠవమైనవాక్యములు గలవాఁ డగును.

రవిగురుబుధభూతనయా జన్మని నవమే నరం ప్రకుర్వంతి,
దేవపితృపూజనపరం సమృద్ధదారం గుణోపేతమ్. 88

రవికుజబుధగురువులు భాగ్యమందుండిరేని దేవబ్రాహ్మణభక్తి, సంపన్నురాలగు భార్య, మంచిగుణములు గలవాఁ డగును.

శుక్రజ్ఞభౌమసూర్యా నవమే జనయంతి నిష్ఠురం సుభగం,
సాహసనిరతం విధనం రిపుపక్షక్షపితవిభవంచ. 89

రవికుజబుధశుక్రులు భాగ్యమందుండిరేని పరుషవాక్యములు బలుకువాఁడు సాహసము గలవాఁడు, నిర్ధనుఁడు, శత్రువులచే నశింపఁజేయఁబడిన ఐశ్వర్యముగల వాఁడు అగును.

రవిసౌరిచాంద్రిభౌమా నవమే యస్యేహజాయమానస్య,
సభవతి పరదారరతో వినష్టశోక స్సదాదీనః. 90

రవికుజబుధశనులు భాగ్యమందుండిరేని పరదారాసక్తి గలవాఁడు, దుఃఖములేని వాఁడు, దీనుఁడు అగును.

శుక్రగురుభౌమశనయో లోకేద్వేష్యం పిపాసార్తం,
జనయంతి నవమసంస్థాః కన్యానాం దూషకం చపలచిత్తమ్. 91

రవికుజగురుశుక్రులు భాగ్యమందుండెరేని లోకద్వేషి, దాహముచే పీడితుఁడు, కన్యలను చెఱచువాఁడు, చపలచిత్తుఁడు అగును.

గురుభౌమసౌరసూర్యా నవమే సుఖవర్జితం సదోద్యుక్తం,
జనయంతి నరంచండం విక్రమయుక్తం మహాసత్వమ్. 92

రవికుజగురుశనులు భాగ్యమందుండిరేని సుఖములేనివాఁడు, ఎల్లప్పుడు ఉద్యుక్తములు సేయువాఁడు, శూరుఁడు, పరాక్రమము గలవాఁడు, సత్వగుణమును గలవాఁడగును.

రవిబుధజీవసితా స్యుర్నవమే యస్యేహజాయమానస్య,
సభవత్యుత్తమపురుషో ధనకనకైశ్వర్యసంపన్నః. 93

రవిబుధగురుశుక్రులు భాగ్యమందుండిరేని ఉత్తమపురుషుఁడు, ధనము సువర్ణము ఐశ్వర్యము గలవాఁడగును.

భానుజరవిబుధగురవో నవమే జనయంతి మానవం నిధనం,
పాపం పరదారరతం విద్విష్టం నీచకర్మాణమ్. 94

రవిబుధగురుశనులు భాగ్యమందుండిరేని ధనికుఁడు, పాపకర్మరతుఁడు, పరభార్యలనుపొందువాఁడు, లోకముచే నిందింపఁబడువాఁడు, నీచకర్మల నొనర్చువాఁడు అగును.

బుధరవిజరవిసితా స్యుర్భాగ్యస్థానే నరం సుభగం,
జనయంతి ధనసమేతం సత్యరతం లోకవిఖ్యాతమ్. 95

రవిబుధశుక్రశనులు భాగ్యమందుండిరేని సౌందర్యము ధనము సత్యము ఖ్యాతి మొదలైనవి గలవాఁడగును.

రవిగురుసితభానుసుతా జన్మని నవమర్క్షగా నరం కుర్యుః,
సత్యవ్రతం సువాక్యం గురుద్విజాతిథిషు భక్తమ్. 96

రవిగురుశుక్రశనులు భాగ్యమందుండిరేని సత్యమాడువాఁడు, దేవబ్రాహ్మణభక్తి మొదలైనవి గలవాఁడగును.

చంద్రజ్ఞకుజసురేజ్యా జనయంతి నరం పరిచ్ఛదసమృద్ధం,
బాల్యే మాతృవియుక్తం ధనాన్వితం సంస్థితాభాగ్యే. 97

చంద్రకుజబుధగురులు భాగ్యమందుండిరేని గృహాదిసమృద్ధి గలవాఁడును, బాల్యముననే మాతృవియోగము గలవాఁడు, ధనికుఁడు నగును.

భౌమసితశశిజచంద్రా భాగ్యే జనయంతి తాపసం ఖ్యాతం,
వాగ్మిన మతిదాతారం పరలోకపరం మహాప్రాజ్ఞమ్. 98

చంద్రకుజబుధశుక్రులు భాగ్యమందుండిరేని తపస్సుసేయువాఁడు, ఖ్యాతిగలవాఁడు, వాచాలకుఁడు, అతిదాత, మహాప్రాజ్ఞుఁడు, పరలోకమున నమ్మికగలవాఁడు అగును.

రవిజబుధచంద్రభౌమా జనయంతి నరం పరాఙ్ముఖం దీనం
క్షుద్రం మాయాచతురం పరదారరతం స్థితాభాగ్యే. 99

చంద్రకుజబుధశనులు భాగ్యమందుండిరేని పరాఙ్ముఖుఁడు, దీనుఁడు, మోసగాఁడు, పరదారాసక్తి మొదలైన పాపకర్మరతుఁ డగును.

భౌమేందుశుక్రజీవా నృపవంశకరం ప్రధాన మతిశూరం,
విద్యాధనసుసమృద్ధం విఖ్యాతం లోకసంమతంచైవ. 100

చంద్రకుజగురుశుక్రులు భాగ్యమందుండిరేని శౌర్యముగలవాఁడు, విద్య ధనము ప్రఖ్యాతి లోకసమ్మతిగలవాఁడు అగును.

శశివక్రార్కిసురేజ్యా జనయంతి నరం పిపాసార్తం,
కలహప్రియంచ నవమే సౌభాగ్యపరిచ్ఛదాతీతమ్. 101

చంద్రకుజగురుశనులు భాగ్యమందుండిరేని పిపాసచే పీడితుఁడు, కలహము సేయువాఁడు, సౌభాగ్యము సేవకులు లేనివాఁడు అగును.

చంద్రార్కిభౌనుజసితా నవమే జనయంతి నిష్ఠురం పాపం,
మాయావినంచ పురుషం శౌచాచారైర్విహీనంచ. 102

చంద్రకుజశుక్రశనులు భాగ్యస్థానముననున్న నిష్ఠురవాక్యములు పల్కువాఁడు, పాపాత్ముఁడు, మాయనొనర్చువాఁడు, పరిశుభ్రత, మంచినడవడిలేనివాఁడు అగును.

సితగురుశశిజశశాంకా జన్మని భాగ్యర్క్షమాశ్రితాధనినం,
జనయంతి ధర్మసక్తం నరంకలాసు ప్రసిద్ధంచ. 103

చంద్రబుధగురుశుక్రులు భాగ్యమందుండిరేని ధనికుఁడు, ధర్మాసక్తిగలవాఁడు, విద్యలయందు ప్రసిద్ధుఁడు అగును.

ప్రాజ్ఞం నృపతిం కులజం ప్రధాన మతివిత్తసంయుతం కాంతం,
సౌమ్యేందుశుక్రజీవాజనయంతి నథంతు విఖ్యాతమ్. 104

చంద్రబుధగురుశుక్రులు భాగ్యమందుండిరేని ప్రాజ్ఞుఁడు, రాజు, సత్కుల ప్రసూనుఁడు, శ్రేష్ఠుఁడు, ధనము సౌందర్యము ఖ్యాతి గలవాఁడు అగును.

గురుసౌమ్యశుక్రచంద్రా భాగ్యేయుక్తా ప్రజాయమానస్య,
యస్య సభాగ్యేయుక్తో లోకే పురుషోత్తమో జ్ఞేయః. 105

చంద్రబుధగురుశుక్రులు భాగ్యమందుండిరేని ప్రబలభాగ్యవంతులై లోకమందు శ్రేష్ఠు లగుదురు.

భానుజబుధగురుచంద్రా జనయంతి నరం సునేత్రయుక్తం చ,
భాగ్యస్థితా స్సమృద్ధం నీతిజ్ఞం చారువేషం చ. 106

చంద్రబుధగురుశనులు భాగ్యమందుండిరేని సునేత్రములు గలవాఁడు, సర్వ సమృద్ధి గలవాఁడు, నీతి నెఱింగినవాఁడు, సుందరమైన అలంకారమును జేసుకొను వాఁడు అగును.

శనిశుక్రబుధశశాంకా జన్మని భాగ్యస్థితా నరం కుర్యుః,
మేధావినం ప్రచండం జననీతవిశారదం ధన్యమ్. 107

చంద్రబుధశుక్రశనులు భాగ్యమందుండిరేని ధారణార్హమైన బుద్ధిగలవాఁడు, తీక్ష్ణమైనవాఁడు, నీతిజ్ఞుఁడు, ధన్యుఁడు అగును

చంద్రశనిశుక్రజీవా జన్మని నవమస్థితాః ప్రకుర్వంతి,
మాయావినం ప్రచండం నరేష్వజేయం నరంధిరమ్ 108

చంద్రగురుశుక్రశనులు భాగ్యమందుండిరేని మాయాయుక్తుఁడు, జయింపరాని వాఁడు, స్థైర్యముగలవాఁడు అగును.

భౌమజ్ఞసూరిశనయో నవమస్థానోపగా నరం కుర్యుః,
రిపుపక్షపరిక్షీణం రణప్రచండం సుధీరంచ. 109

కుజబుధగురుశనులు భాగ్యమందుండిరేని శత్రువులను నశింపఁజేయువాఁడు, రణమందు శౌర్యము స్థైర్యము గలవాఁ డగును.

భౌమజ్ఞశుక్రశనయో దశానుగతం సుశీలంచ,
జనయంతి నవమసంస్థా ధనయుక్తం భక్తియుక్తంచ. 110

కుజబుధశుక్రశనులు భాగ్యమందుండిరేని సత్స్వభావము గలవాఁడు, ధనము భక్తి గలవాఁడు (దశానుగతం అనఁగా బాల్యాద్యవస్థలయందు యథాక్రమమైన సౌఖ్యమును బొందినవాఁ డనుట) అగును.

భౌమభృగుజీవరవిజా జనయంతి నరంధనైః పరిత్యక్తం,
క్షుద్రం దయావిరహితం విహీనసత్వం స్థితా భాగ్యే. 111

కుజబుధశుక్రులు భాగ్యస్థానమందున్న ధనములేనివాఁడు, నీచుఁడు, దయలేనివాఁడు, బలహీనుఁడు అగును.

త్రిచతుః పంచఖగేంద్రా స్తథాచ షట్సప్తసంస్థితాభాగ్యే,
ప్రాత్యయికం ధనవంతం కుర్యు ర్నృపతిం చ బుధసహితాః 112

మూఁడు నాలుగు ఐదు ఆరు ఏడు గ్రహములు కలిసి భాగ్యస్థానమందుండిరేని విశ్వాసముగలవాఁడు, ధనవంతుఁడు అగును. బుధునితోఁ గలిసియుండిరేని (అనఁగా శుభాధికము గలిగియుండెనేని) ప్రభు వగును.

జనయంతి భాగ్యసంస్థా గురుసౌమ్యవివర్జితా గ్రహాః పురుషం,
వ్యాధిప్రాయమకాంతం జనహీనం బంధనార్త మతిదీనమ్. 113

బుధగురులుఁగాక తక్కిన గ్రహములు భాగ్యస్థానమందుండఁగాఁ బుట్టినవాఁడు వ్యాధియుక్తుఁడు, కాంతిలేనివాఁడు, జనహీనుఁడు, బంధనమువలన పీడితుఁడు, దైన్యమును బొందువాఁడు అగును.

ఉక్తం బహుప్రకారం భాగ్యగృహే బాదరాయణాదికృతం,
గ్రహయోగేక్షణభావై ర్విచింత్య బుధ్యావదేదన్యత్. 114

భాగ్యభావమును గురించి బాదరాయణాదులచే జెప్పఁబడిన ప్రకారభేదము లన్నియు నాచే జెప్పఁబడినవి. గ్రహయోగమును దృష్టిని భావాదులను బుద్ధిచేత నాలోచించి తదితరముల నాలోచించఁదగినది.

ఇతి ద్వాత్రింశోఽధ్యాయః.

---

## కర్మచింతయను ముప్పదిమూఁడవ యధ్యాయము.

లగ్నా ద్దశమే రాశౌ కర్మఫలం యత్ప్రకీర్తితం మునిభిః,
రాశిగ్రహస్వభావై ర్గ్రహదృష్ట్యా తదహమపి వక్ష్యే.

జన్మలగ్నమునకు దశమస్థానమగు కర్మస్థానమువల్లనుండి మునులచేత రాశిగ్రహస్వభావములచేతను గ్రహదృష్టి మొదలుగాఁగలవానిచే యేఫలములు చెప్పఁబడినవో ఆఫలములను జెప్పఁబోవుచున్నాను.

తహోరేంద్వోర్బలయోగాద్యో దశమస్తత్స్వభావజం కర్మ,
స్వాధిపపరివృధ్యా వృద్ధి ర్జ్ఞేయాన్యథా హీనః 2

లగ్నచంద్రులలో నెవరు బలవంతుఁడో వానికి దశమస్థానము కర్మస్థానమని తెలుసుకొని ఆదశమస్థానస్వభావము ననుసరించి కర్మ తెలియఁదగినది. ఆదశమస్థానాధిపతి బలవంతుఁడై యుండెనేని కర్మయొక్క వృద్ధి తెలియఁదగినది బలహీనముగ నుండెనేని హీనము తెలియఁదగినది

జాంగల మథవానూపం తథోభయంవా గృహం పరిక్షేత,
గ్రామ్య మథారణ్యంవా సౌమ్యర్క్షం పాపభవనంవా 3

దశమస్థానము విషరాశియో (వృశ్చికము) జలరాశియో (కర్కటక మీనములు) ఉభయచరరాసులో (ధనుర్మకరములు) గ్రామ్యములో (మేష వృషభ మిథున కన్య తులకుంభములు) ఆరణ్యమో (సింహము) శుభక్షేత్రములో పాపక్షేత్రములో అనువిషయము ఆలోచించవలయును.

ద్విపదచతుష్పదరూపం సరీసృపంవా తథోభయంచైవ,
యద్రూపం తద్భవనం యాదృశకం యత్స్వభావం చ 4

ద్విపద చతుష్పద కీటక ఉభయవిధరాసులలో దశమస్థానము ఏరూపము ఏస్వభావము అయినదో ఆస్వభావము ఆరూపము గలదని తెలియఁదగినది. ఉభయములనఁగా ధనుర్మకరములని తెలిసికొనుఁడు.

ప్రవదేత్తత్సమదేశే ప్రాప్తిం నరస్య తత్సదృశీం,
తస్మా ద్దశమం భవనం ప్రసవే బుధ్యేత యత్నేన. 5

పూర్వము చెప్పఁబడిన ద్విపదాదిరాసులకు సమమైన ప్రదేశమందు తత్సదృశమైన కర్మప్రాప్తి గలుగును గాన దశమస్థానమును ప్రయత్నముచే నాలోచించతగినది.

దశమే నక్షత్రపతే ర్లగ్నా త్పురుషస్య కర్మసంభవతి,
సర్వారంభే సిద్ధిం వినిర్దిశే త్తస్యజాతస్య. 6

లగ్నమువల్లనుంచి, లేక చంద్రలగ్నమువల్ల దశమస్థానము ననుసరించి సర్వారంభసిద్ధిని తెలియఁదగినది.

ద్వ్యంతరయోగాధ్యాయే కథితం కర్మస్థితై ర్గ్రహై ర్లగ్నాత్,
చంద్రా దత్రవిశేషో గ్రహై స్థితై ర్యోక్తమిహ వక్ష్యే. 7

ద్వ్యంతరయోగాధ్యాయమందు లగ్నమువల్లనుంచి దశమస్థానమందున్న గ్రహ ఫలములు జెప్పఁబడినవి చంద్రలగ్నమువల్లనుంచి దశమస్థానస్థితగ్రహఫలమును స్పష్ట మగునట్లు జెప్పఁబోవుచున్నాను.

చంద్రా ద్దశమే సూర్య స్సిద్ధారంభం ధనై స్సమృద్ధంచ,
జనయ త్యుత్తమసత్వం నృపతి ముదగ్రం జనాశ్రయం పుష్టమ్. 8

చంద్రలగ్నమువల్లనుంచి దశమస్థానమందు సూర్యుఁ డుండెనేని ప్రసిద్ధమైన కార్యారంభములు గలవాఁడు, ధనము సాత్వికము రాజు గొప్పవాఁడు జనులచే నాశ్రయింపఁబడువాఁడు అగును. (చంద్ర స్థితరాశివల్లనుంచి దశమస్థానమందు) అనువాక్యములు సర్వత్ర తెలియఁదగినది.

భౌమ స్సాహసనిరతం ప్రత్యంతనివాసినం విషయలుబ్ధం,
క్రూరం నిషాదచరితం జనయతి దశమే స్థితః పురుషమ్. 9

కుజుఁ డుండెనేని సాహసము గలవాఁడు, గ్రామాంతమందు నివసించువాఁడు, క్రూరుఁడు, స్వరభేదముల నెఱింగినవాఁడు, విషయములయం దాసక్తిగలవాఁడు అగును.

విద్వాంసం ధనవంతం బహుశ్రుతం నృపతిసంమతం ఖ్యాతం,
జనయతి సౌమ్యో దశమే పురుషం బహుశిల్పినం ప్రాజ్ఞమ్. 10

బుధుఁడుండెనేని విద్వాంసుఁడు, ధనికుఁడు, సద్గోష్ఠిగలవాఁడు, రాజప్రియుఁడు, ఖ్యాతి శిల్పశాస్త్రజ్ఞానము మంచితెలివితేటలు గలవాఁ డగును.

గురురపి దశమస్థానే సిద్ధార్థం ధార్మికం ధనసమృద్ధం,
జనయ త్యుత్తమచరితం నరేంద్రసచివం నరం ఖ్యాతమ్. 11

చంద్రలగ్నము మొదలుకొని దశమస్థానమున బృహస్పతియుండఁగా జన్మించిన ధనవంతుఁడు, ధర్మపరాయణుఁడు, మంచినడవడిగలవాఁడు, రాజమంత్రి, ప్రసిద్ధిగల వాఁడు అగును.

శశినో దశమే శుక్ర స్సుభగం లలితంచ విత్తవంతంచ,
జనయతి సిద్ధారంభం ధనినం నృపపూజితం పురుషమ్. 12

చంద్రునకు దశమస్థానమందు శుక్రుఁ డుండెనేని సౌందర్యము ధనముఫలించిన్ను కార్యారంభములు రాజసత్కారము గలవాఁ డగును.

సౌరో వ్యాధితదేహం నిఃస్వం దుఃఖాన్వితం ప్రజాహీనం,
కర్మసు నిత్యోద్విగ్నం జనయతి దశమే స్థితఃపురుషమ్. 13

శనియుండెనేని వ్యాధియుక్తుఁడు, నిర్ధనుఁడు, దుఃఖము గలవాఁడు, సంతానము లేనివాఁడు, కర్మలయందు భయస్వభావము గలవాఁడు అగును

భాను ర్భౌమసమేతః కర్మకరాన్ కామశోకమదబహుళాన్,
జ్యోతిర్విదః ప్రకుర్యా ల్లాక్షణికాం స్తార్కికాం శ్చాపి 14

చంద్రునకు దశమస్థానమందు రవికుజులుండిరేని కార్మికుఁడు, ప్రబలకామము శోకము మదము గలవాఁడు, జ్యోతిశ్శాస్త్రము చందశ్శాస్త్రము తర్కశాస్త్రము దెలిసిన వాఁడగును.

సూర్య స్సౌమ్యసమేతో వస్త్రాలంకారభాగినం వణిజం,
జనయతి మేషూరణగః పురుషం జలజీవినం వాఽపి. 15

రవిబుధులుండిరేని వస్త్రాదులచేత నలంకరింపఁబడువాఁడు, వర్తకము సేయువాఁడు, జలమువలన జీవించువాఁడు అగును.

జీవసహాయ స్సూర్య స్సిద్ధారంభాన్న రేంద్రమాన్యాంశ్చ,
జనయతి దశమే పురుషా న్వీరా న్శూరా న్సువిఖ్యాతాన్. 16

రవిగురులు యుండిరేని ఫలించు అరంభములు గలవాఁడు, రాజమాన్యుఁడు, పరాక్రమము శౌర్యము మంచిప్రఖ్యాతి గలవాఁ డగును.

సూర్యసహాయ శ్శుక్రో దశమే స్వజనాశ్రితం నరంకురుతే,
స్త్రీసంశ్రయా త్సమృద్ధం సుభగం నృపవల్లభం చాపి 17

రవిశుక్రులుండిరేని స్వజనుల నాశ్రయించువాఁడు, స్త్రీల నాశ్రయించుటచేత గలిగిన విభవము గలవాఁడు, సౌందర్యవంతుఁడు రాజప్రియుఁడు అగును.

సూర్య స్స్వపుత్రసహితో దశమే వధబంధభాగినం భృతకం,
జనయతి దీనం కృపణం చోరై ర్ముషితం ప్రలాపకరమ్ 18

రవిశనులుండిరేని వధము బంధనమును పొందువాఁడు, వేతనముచే జీవించువాఁడు, దీనుఁడు, కృతఘ్నుఁడు, చోరులచేత నపహరింపఁబడిన ధనముగలవాఁడు, విరివిగ మాట లాడువాఁడు అగును.

భౌమ స్సోమజసహితో జనయతి దశమే నరం బహునృశంసం,
అస్త్రకలావేత్తారం కౌశల మతిజీవినం మహాశూరమ్. 19

కుజబుధులు దశమమందుండిరేని ఘాతసేయువాఁడు, అస్త్రవిద్య నెఱింగినవాఁడు, నేర్పుగలవాఁడు, దీర్ఘాయుష్యు శౌర్యము గలవాఁ డగును.

భౌమ స్సురగురుసహితో దశమే కురుతే బలస్య నేతారం,
మిత్రేభ్యో లబ్ధధనం తదాశ్రయాజీవితం ధన్యమ్. 20

కుజగురులుండిరేని సేనాపతి మిత్రులవలన పొందఁబడిన ధనము, వారినాశ్రయించుటవలన ధన్యమగు జీవితము గలవాఁ డగును.

జనయతి విదేశనిరతం కాంచనయుక్తాదిభి ర్వణిగ్వృథ్యా,
భౌమ శ్శుక్రసమేతో దశమే స్త్రీసంశ్రయాద్వాఽపి. 21

కుజశుక్రులుండిరేని సువర్ణాదివ్యాపారముచే విదేశమందుండువాఁడు, లేక స్త్రీల యొక్క ఆశ్రయముచేతనైన విదేశరతుఁడగును.

భౌమ స్సౌరసహాయో జనయతి దశమే స్థితో నరం ప్రసవే,
సాహసశీలం క్షుద్రం కర్మాయుక్తం రుజాసహితమ్. 22

కుజశనులుండిరేని సాహసముగలవాఁడు, నీచుఁడు, నిత్యకర్మలయం దాసక్తి లేనివాఁడు, రోగయుక్తుఁడు అగును.

సధనం నరేంద్రపూజ్యం ధర్మిష్ఠం బృందనాయకం ఖ్యాతం,
జీవ స్సౌమ్యసహాయో జనయతి మేషూరణే పురుషమ్ 23

బుధగురులుండిరేని ధనికుఁడు, రాజపూజ్యుఁడు, ధార్మికుఁడు, సేనానాయకుఁడు, ఖ్యాతి మొదలైనవి గలవాఁ డగును.

సౌమ్య శ్శుక్రసహాయో జనయతి దశమే సుహృజ్జనోపేతం,
విద్యాస్త్రీధనసౌఖ్యం నృపసచివం విషయనాథంవా. 24

బుధశుక్రులు దశమమందుండిరేని మిత్రయుక్తుఁడు, విద్య స్త్రీధనము సౌఖ్యము గలవాఁడు, మంత్రిగాని దేశాధిపతి అగును.

సౌమ్య స్సౌరిసహాయో మృద్భాండకరం కరోతి దశమస్థః,
ఖ్యాతం విద్యాచార్యం పుస్తకలిపిలేఖ్యకారంచ. 25

బుధశనులుండిరేని కుండలు సేయువాఁడు, ఖ్యాతిగలవాఁడు, ఉపాధ్యాయుఁడు, పుస్తకములను నేర్పుటుచుట వ్రాయుట, చిత్రములనిర్మించుట నెఱిఁగినవాడు అగును.

వచసాంపతి స్సితయుతః కర్మణి కురుతే నరేంద్రవరభృత్యం,
బ్రాహ్మణపతిం విశోకం విద్యాచార్యం సమర్థంచ. 26

గురుశుక్రులు కలిసి దశమమందుండిరేని శ్రేష్ఠుఁడగు రాజసేవకుఁడు, బ్రాహ్మణాధిపతి, శోకహీనుఁడు, విద్యాచార్యుఁడు, సమర్థుఁడు అగును.

సురరాజగురుస్స్వర్క్షే ర్దశమే నీచం పరోపకారరతం,
కురుతే ప్రవృద్ధచేష్టం స్థిరాస్పదం సుస్థిరారంభమ్. 27

గురుశనులుండిరేని నీచుఁడు, పరోపకారుఁడు, అభివృద్ధినొందుపనుల నొనర్చువాఁడు, స్థిరస్థానము స్థిరములగు పనులనుచేయువాఁడు గలవాఁ డగును.

శుక్రస్స్వార్కసహాయశ్చిత్రకరం గంధజీవినం వైద్యం,
జనయతి దశమే పురుషం నీలకరం చూర్ణకారంచ. 28

శుక్రశనులుండిరేని చిత్రపుపనులు సేయువాఁడు, పరిమళద్రవ్యములచే జీవించువాఁడు, వైద్యుఁడు, నల్లనైన హస్తముగలవాఁడు, చూర్ణములఁజేయువాఁడు అగును.

రవిభౌమచంద్రపుత్రాశ్చంద్రాద్దశమస్థితా నరం ధన్యం,
జనయంత్యుత్తమపురుషం నృపతిసమం సర్వజనపూజ్యమ్. 29

జననకాలమున చంద్రలగ్నమునకు దశమస్థానమున రవిచంద్రకుజులుండిరేని ధన్యుఁడు, ఉత్తముఁడు, రాజసముఁడు, సర్వజనపూజ్యుఁడు అగును.

రవిభౌమదేవపూజ్యా దశమస్థానే నరం సుభగం,
శత్రూణాం హంతారం జనయంతి సమృద్ధిసంయుక్తమ్. 30

రవికుజగురులుండిరేని సౌందర్యముగలవాఁడు, శత్రువులను నశింపఁజేయువాఁడు, సర్వసమృద్ధి గలవాఁడు అగును.

చంద్రాద్దశమే భానుర్భూపుత్రో భార్గవశ్చ జనయంతి,
క్రూరం సాహసనిరతం పురధనకరణేఽతినిపుణమతిమ్. 31

రవికుజశుక్రులుండిరేని క్రూరుఁడు, సాహసముగలవాఁడు, పురధనకరణమందు నేర్పుగలవాఁడు అగును.

భానుజరవిభూపుత్రా దశమస్థాః క్రూరకర్మనిరతంతు,
ఉత్పాదయంతి మనుజం మూర్ఖం పాపం దురాచారమ్. 32

రవికుజశనులుండిరేని క్రూరకర్మలను సేయువాఁడు, మూర్ఖుఁడు, పాపుఁడు, దురాచారము గలవాఁడు అగును.

రవిబుధగురవో దశమే విద్వాంసం రూపసంయుక్తం,
ఉత్పాదయంతి పురుషం ధర్మిష్ఠం బంధువల్లభం చైవ. 33

రవిబుధగురులుండిరేని విద్వాంసుఁడు, సౌందర్యయుక్తుఁడు, ధార్మికుఁడు, బంధుప్రియుఁడు అగును.

బుధసూర్యభార్గవసుతా యశస్వినం ధార్మికం విగతరోషం,
జనయం త్యపరాభూతం సౌభాగ్యపరిచ్ఛదసమృద్ధమ్. 34

రవిబుధశుక్రులుండిరేని యశస్సుగలవాఁడు, ధార్మికుఁడు, రోషములేనివాఁడు, గృహావస్తువాహనాది సమృద్ధిగలవాఁడు అగును.

రవిబుధశనయో దశమే క్రూరం చపలం నరం విశీలంచ,
ఉత్పాదయంతి నియతం శస్త్రాగ్నిపరిక్షతాంగంచ. 35

రవిబుధశనులుండిరేని క్రూరుఁడు, చపలుఁడు, దుష్టస్వభావముగలవాఁడు,ఆయుధములచేత అగ్నిచేత గాయపడిన శరీరముగలవాఁడు అగును.

రవిభృగుజదేవపూజ్యా దశమస్థానోపగా నరంకుర్యుః,
సుభగం విద్యాప్తధనం ధర్మరతం భోగభాగినం నిత్యమ్. 36

రవిగురుశుక్రులుండిరేని సుభగుఁడు, విద్యామూలముగ ధనికుఁడు, ధర్మమార్గవర్తి, భోగము ననుభవించువాఁడు అగును.

త్రిదశగురుమందసూర్యా దశమేయుక్తా నరం ప్రకుర్వంతి,
ప్రాయేణ లోకమాన్యం చారిత్రవిలోపినం ధీరమ్, 37

రవిగురుశనులుండిరేని లోకమాన్యుఁడు, మంచినడవడిలేనివాఁడు, ధైర్యముగలవాఁడు నగును.

భార్గవరవిభానుసుతా దశమస్థానోపగా నరంకుర్యుః,
లోభాన్విత మతిచపలం సమస్తజనవిప్రయుక్తంచ. 38

రవిశుక్రశనులుండిరేని లోభగుణము గలవాఁడు, చపలుఁడు, అందఱిసెడబాయువాఁడు అగును.

భౌమేందుజసురపూజ్యా ధర్మిష్ఠం బహుకుటుంబపరివారం,
జనయంతి దశమసంస్థా విద్యాధనభాగినం పురుషమ్ 39

కుజబుధగురువులు దశమమందుండిరేని ధార్మికుఁడు, కుటుంబవృద్ధి పరివారము విద్య ధనము గలవాఁ డగును.

శోభనశిల్పాభిరతా న్మాలాకారా సువర్ణకారాంశ్చ,
కుర్యు ర్బుధభృగువక్రా దశమస్థా స్సర్వలోకదయితాశ్చ. 40

కుజబుధశుక్రులుండిరేని శుభకర్మలయందైన చిత్తరువులయందు నేర్పుగలవాఁడు, పుష్పమాలికలు నేయువాఁడు, బంగారుపనులను నేయువాఁడు, సర్వలోకప్రియుఁడు అగును.

భౌమబుధసూర్యపుత్రా జనయంతి తథా నధర్మశీలంచ,
నిద్రానిరతం ప్రఖలం దశమస్థానోపగా నరం మలినమ్ 41

కుజబుధశనులు చంద్రస్థానమునుండి దశమమున నున్న అధర్మశీలుఁడు, నిద్రాసక్తుఁడు, మిక్కిలి దుర్మార్గుఁడు, నీచుఁడు అగును.

భార్గవసురేజ్యభౌమా దశమస్థానాశ్రితానరా న్కుర్యుః,
ధనసంయుక్తా న్శూరా న్దేవద్విజపూజనానురతాన్. 42

కుజగురుశుక్రులుండిరేని ధనము శౌర్యము దేవబ్రాహ్మణభక్తి గలవాఁ డగును.

విద్యాధనజనహీనా న్కాపురుషా న్సౌఖ్యవర్జితా న్వికలాన్,
జీవాంగారకసౌరా దశమే కుర్యు ర్నరా న్నీచాన్. 43

కుజగురుశనులుండిరేని విద్య ధనము జనము మొదలైనవి లేనివాఁడు, కుత్సితుఁడు, సౌఖ్యహీనుఁడు, నీచుఁడు అగును

సచివా నుత్తమపురుషా న్వనధర్మరతాంశ్చ ధనినశ్చ,
భౌమభృగుసూర్యపుత్రాః కుర్వంతి నరా ననేకకర్మరతాన్. 44

కుజశుక్రశనులుండిరేని మంత్రి, ఉత్తముఁడు, ధార్మికుఁడు, ధనికుఁడు, అనేక కర్మల నొనర్చువాఁడు అగును.

శుక్రబృహస్పతిసౌమ్యా దశమే పురుషస్య శుక్రరాశిస్థాః,
బహువిధ మిష్టం కుర్యు ర్వ్యాధిం చాప్యన్యగృహసంస్థాః 45

బుధగురుశుక్రులు శుక్రక్షేత్రమగు దశమస్థానమందుండిరేని అనేకశుభములను పొందువాఁ డగును. అన్యక్షేత్రమగు దశమస్థానమందుండిరేని వ్యాధి మొదలైనవి గలవాఁడగును.

లిపిలేఖ్యకావ్యనిరతం ధనవంతం బహువిధేయభృత్యంచ,
అటనప్రియం సురూపం బుధగురుసౌరా నరం దశమే. 46

బుధగురుశనులుండిరేని వ్రాయుటయందు కావ్యములయందు నేర్పుగలవాఁడు, ధనికుఁడు, విధేయులైన భృత్యులు గలవాఁడు, తిరుగుటయందు దాసక్తి, మంచిరూపము గలవాఁ డగును.

దశమే విజ్ఞానయుతా న్మల్లా న్పరదేశనిరతాంశ్చ,
కుర్యు ర్బుధభృగురవిజాః కర్మోద్యుక్తం సదాదాంతమ్. 47

బుధశుక్రశనులుండిరేని జ్ఞానవంతుఁడు, పరదేశవాసుఁడు, బలవంతుఁడు, సత్కార్యాసక్తిగలవాఁడు, ఎల్లపుడు గురుశిక్షగలవాఁడు అగును.

విద్వాంసం ధర్మరతం దయాన్వితం సత్యవంతంచ,
భానుజగురుభృగుపుత్రా దశమస్థానోపగా నరంకుర్యుః. 48

గురుశుక్రశనులుదశమమందుండిరేని విద్వాంసుఁడు, ధార్మికుఁడు, దయ, సత్యము గలవాఁడు అగును.

ఏవంత్ర్యాదిషు వాచ్యం జన్మనిపుంసాం ఫలంహి కర్మోత్థం,
త్ర్యాదిగ్రహసంయోగేఽత్రవిశేష స్తమపి వక్ష్యే. 49

జన్మకాలమున ఈప్రకారము చంద్రలగ్నమునకు దశమమందున్న మూఁడు మొదలుగాఁగల గ్రహములయొక్క ఫలములు చెప్పఁబడినది. అయినను ఈగ్రహయోగములయందుండు విశేషములను విస్తరించి చెప్పఁబోవుచున్నాను.

రవిభౌమబుధసురేజ్యా దశమస్థానోపగా నరంకుర్యుః,
శూరం విక్షతగాత్రం దాతారం సర్వకర్మంతమ్. 50

జననకాలమున చంద్రలగ్నమునకు దశమస్థానమున రవికుజబుధగురులుండిరేని శూరుఁడు, గాయములు గలవాఁడు, దాత, సత్కార్యాసక్తిగలవాఁడు అగును.

వక్రార్కశుక్రసౌమ్యా శ్చంద్రాద్దశమం సమాశ్రితాః ప్రసవే,
కుర్యు ర్మాల్యకరాన్ లేఖ్యకరాం శ్చాపి చిత్రకర్మకరాన్. 51

రవికుజబుధశుక్రులు దశమమందుండిరేని మాలికల నిర్మించువాఁడు, లేఖనము సేయువాఁడు, చిత్తరువులు వ్రాయువాఁడు అగును.

రవికుజబుధభానుసుతా దశమస్థానస్థితాః ప్రసవకాలే,
ఉత్పాదయంతి పురుషం ధనవాహనవారణోపేతమ్ 52

రవికుజబుధశను లుండిరేని ధనము వాహనములు ఏనుఁగులు గలవాఁడగును.

రవిజీవశుక్రసౌమ్యా జనయంతి నభఃస్థితా నరా న్సౌమ్యాన్,
కుత్సితవృత్తీనా మపి సుతా న్వరా న్కర్షణోపేతాన్ 53

రవిబుధగురుశుక్రులుండిరేని సౌమ్యుఁడు, కుత్సితుఁడైన తండ్రిగలవాఁడు (అనఁగా తండ్రి దుర్మార్గుఁడు), శ్రేష్ఠుఁడు, వ్యవసాయము సేయువాఁడు అగును.

రవిజీవసౌమ్యసౌరా దశమస్థానస్థితాః కుర్యుః,
పురుషం మాయానిపుణం క్రూరం పరవంచనానురతమ్ 54

రవిబుధగురుశనులుండిరేని కుటిలుఁడు, క్రూరుఁడు, పరులను వంచనసేయు
అగును.

రవిసితబుధభానుసుతా శ్చంద్రాద్దశమస్థితా నరం కఠినం,
ఉత్పాదయంతి సుభగం వాగ్మిన మథ కర్షణానురతమ్ 55

రవిబుధశుక్రశనులుండిరేని కాఠిన్యము సౌందర్యము వాగ్ధాటి దుష్కృత్యయం దా
సక్తి మొదలైనవి గలవాఁ డగును.

రవిగురుభార్గవశనయో మేషూరణసంస్థితాః ప్రసవకాలే,
ఉత్పాదయంతి మనుజం ప్రవాసశీలం వివిధచేష్టమ్ 56

రవిగురుశుక్రశనులుండిరేని పరదేశమం దభిలాషగలవాఁడు, అనేకపనులను
సేయువాఁడు అగును.

భౌమసితబుధసురేడ్యా జన్మనిదశమర్క్షగా నరం నిపుణం,
ఉత్పాదయంతి చతురం శూరం సమరేష్వధృష్యం చ. 57

కుజబుధగురుశుక్రులు కలిసి దశమమందుండిరేని చతురత శౌర్యము గలవాఁడు,
యుద్ధమందు బెదరింప వీలులేనివాఁడు అగును

భౌమబుధమందగురవో జన్మనిదశమస్థితా నరం మలినం,
జనయంతి నరోద్యుక్తం సంగ్రామే రిపువినాశకరమ్ 58

కుజబుధగురుశనులుండిరేని మాలిన్యము గలవాఁడు, యుద్ధమున శత్రునాశము
సేయువాఁడు అగును.

భౌమబుధశుక్రసౌరాః నభఃస్థలే సంశ్రితాః ప్రసవకాలే,
విద్యాబహులం శూరం జనయంతి నరం విశాలాక్షమ్ 59

కుజబుధశుక్రశనులుండిరేని విద్య శౌర్యము విశాలనేత్రములు గలవాఁ డగును.

భౌమగురుశుక్రమందా శ్చంద్రా న్మేషూరణర్క్షగాః ప్రసవే,
జనయంతి నరంధీరం కుటుంబయుక్తం ధనోపేతమ్ 60

కుజగురుశుక్రశనులు చంద్రలగ్నమునకు దశమస్థానమందుండిరేని ధైర్యము
గలవాఁడు, కుటుంబము ధనము గలవాఁ డగును.

బుధగురుభార్గవశనయో జన్మనిదశమస్థితాః కుర్యుః,
పురుషం శాంతమనస్కం సుమేధసం లోకదయితం చ. 61

బుధగురుశుక్రశనులుండిరేని శాంతము, మంచిబుద్ధిగలవాఁడు, జనప్రియుఁడు అగును.

పాపై ర్నభఃస్థలస్థై స్సౌమ్యగ్రహవీక్షితైః ప్రజాయంతే
వైద్యపురోహితగణకా శ్చండాః పరవంచనానురతాః 62

చంద్రలగ్నమునకు దశమస్థానమందు పాపగ్రహములుండి శుభగ్రహములచే జూడఁబడెనేని వైద్యుఁడు, పురోహితుఁడు, గ్రామాధిపత్యము సేయువాఁడు, కోపము గలవాఁడు, పరవంచనయం దాసక్తి గలవాఁడు అగును.

ఏతేసమస్తయోగా స్సౌమ్యగ్రహవీక్షితాః ప్రశస్యంతే,
పాపగ్రహదృష్టియుతాః ప్రాయేణ నభద్రకాః ప్రోక్తాః 63

ఈచెప్పఁబడిన యోగములన్నియు పాపగ్రహములచే జూడఁబడెనేని ప్రశస్తములైనవై మంగళప్రదములైన నగును పాపగ్రహదృష్టియుక్తములై యుండెనేని అమంగళప్రదములైన వగును.

పాపా స్తృతీయషష్ఠా హోరేందుస్థానతో నృణా మిష్టాః,
నేష్టా నిధనాంత్యగతా లగ్నోపగతా విశేషేణ. 64

లగ్నమునుండియు చంద్రునిస్థానమునుండియు తృతీయషష్ఠములయందు పాపగ్రహములుండిరేని మనుష్యులకు శుభము నిచ్చెదరు. అష్టమద్వాదశములనుండిరేని అశుభము నిచ్చెదరు. లగ్నమునుండిరేని అత్యంతాశుభము నిచ్చెదరు

హోరా శశినో ర్బలవా న్యస్తస్మాత్కర్మ భేనవాకథయేత్,
యోబలయుక్తో భావ స్తదధిపతేర్వాఽఽదిశే ద్వృత్తిమ్. 65

లగ్నచంద్రులలో నెవరు బలవంతులో వానిస్థానమునుండి దశమస్థానము ననుసరించి జాతకునివృత్తి నాలోచింపవలెను. లేక ద్వాదశభావములలో నేభావము బలయుక్తమైనదో ఆభావాధిపతి ననుసరించి వృత్తి నాలోచింపతగినది.

ఆరామవృద్ధిసేవా కృషిరసవణి గర్కదూతకార్యేణ,
జీవంతి నరానిత్యం మేషగణే దశమరాశిస్థే. 66

జననకాలమున మేషగణము దశమరాశియందుండెనేని ఆరామస్థాపన కృషి కొండలుజాపానిచే జీవించువాఁ డగును. మేషగణ మనఁగా దశమభావము జాతకపద్ధతి ప్రకారముగా సాధించి ఆభావమునకు షడ్వర్గము జేయవలయును. (లగ్న ప్రకార

ద్రేక్కాణ సప్తాంశ నవాంశ ద్వాదశాంశ త్రింశాంశలయొక్క అధిపతులను సాధించ వలయునవుట) ఇట్లు చేయఁగా మేషకుజాధిపత్యముగల వర్గములు సుమారు మూఁడు నాలుగు ఐదు వచ్చియుండె నేని ఈఫలము జరుగును. ఇట్లే తక్కినవర్గములకును ఆలోచింపవలయునని భావము.

వృషభగణే దశమస్థే శకటచతుష్పదవిహంగమృగజీవీ,
ధాన్యాదిసంగ్రహేణ చ జాంగలదేశే ఫలం ప్రాయః 67

దశమస్థానమున వృషభగణమున్నచో బండ్లు పశువులు పక్షులు మృగములు అను వీనిచే జీవించువాఁడు, నీటిప్రదేశముల ధాన్యము సంపాదించువాఁడు, స్వల్పఫలము గలవాఁడు అగును.

జలవణిజస్సుసమృద్ధ్యా ముక్తాశంఖప్రవాలభాండైశ్చ,
లిపిగణితలేఖ్యజీవీ నృమిథునవర్గే దశమసంస్థే 68

దశమమున మిథునవర్గమున్నచో సుంచిధనముగలవాఁడై ముత్యములు శంఖములు పగడములు అనువీనిచే ఓడలతో వ్యాపారమొనర్చువాఁడు, వ్రాయుట లెక్కలఁ జేయుట చిత్తరువులనిర్మించుట గలవాఁడు అగును.

శస్త్రాగ్ని యోనిపోషణముక్తాసంఖ్యోపజీవనం చైవ,
ఆఖేటకవృత్త్యా వా కర్కిణవర్గే దశమసంస్థే. 69

కర్కటవర్గము దశమమున నున్న శస్త్రశాలల అగ్నిశాలల కాపాడువాఁడు, ముత్యములవలన లెక్కలసేయుటవలన జీవించువాఁడు, వేటవలన జీవించువాఁడు అగును

సన్నాహకామణీనాం పాషాణస్వర్ణరూప్యకూటాశ్చ,
కర్షణనిరతా లేయే గోజీవాధాన్యవాణిజకాః. 70

సింహము దశమమునయున్న రత్నముల సానదీర్చువాఁడు, రాతిపని వెండి బంగారపుపనులను జేయువాఁడు, వ్యవసాయమొనర్చువాఁడు, గోవులవలన జీవించువాఁడు, ధాన్యవర్తక మొనర్చువాఁడు అగును.

శాకటకామణికారాః హైరణ్యాః గంధవిక్రయే నిపుణాః,
గాంధర్వశిల్పలేఖ్యైః కన్యావర్గే సదావిభవాః. 71

దశమమున కన్యావర్గమున్న బండ్లవలన జీవించువాఁడు, రత్నముల సానపట్టువాఁడు, బంగారపుపనిచేయువాఁడు, సుగంధద్రవ్యముల విక్రయించు నేర్పుగలవాఁడు, గానము శిల్పము నెఱిఁగినవాఁడు, విభవవంతుఁడు అగును.

ప్రాయోజ్యానుపదేశాద్ధిరణ్యపరివర్తనాచ్చ మిత్రాచ్చ,
జాయంతే చ మనుష్యా నానావ్యవహారభాగినస్సతతమ్ 72
వాణిజ్యవిపణిజీవా గోజీవా మహిషజీవా శ్చ,
నానాపణ్యసమృద్ధాస్సలిలోద్భవపణ్యవృత్తయః ఖ్యాతాః 73
ధనధాన్యమూలవణిజః ఫలమూలకృషీవలాశ్చైవ,
జాయంతే ఘటవర్గే దశమస్థానస్థితే కలావృత్తాః 74

తులావర్గము దశమమునను న్న న్యాయవాది,ఉపదేశములను జేయువాఁడు, బంగారువర్తకమువలన స్నేహమువలన జీవించువాఁడు, అనేకవ్యవహారముల నెఱిఁగినవాఁడు, వర్తకము అంగడి ఆవులు గేదెలు మున్నగువానిచే జీవించువాఁడు, అనేకవిధములగు అంగడులుగలవాఁడు,నీటియం దుత్పన్నమైనముత్యములు శంఖములు మున్నగువానిచే వర్తకమొనర్చువాఁడు, ప్రఖ్యాతిగలవాఁడు, ధనధాన్యములుగలవాఁడు, ఫలములను గడ్డలను నుత్పత్తి సేయువాఁడు, సమస్తకళల నెఱిఁగినవాఁడు అగును.

స్త్రీసంపర్కజవిభవా జాయంతే కర్షణానునిరతాశ్చ,
నిత్యోద్యుక్తా శ్చోరాః పృథివీపతిసేవకా పాపాః. 75
దేహచికిత్సానిరతా లోహకరా జీవినోఽలిసంజ్ఞర్క్షే,
వర్గే నభస్థలగతే ధాన్యానాం చోపజీవినో నిత్యమ్. 76

వృశ్చికవర్గము దశమమందుండెనేని స్త్రీమూలకముగ ఐశ్వర్యముగలవాఁడు, వ్యవసాయము సేయువాఁడు, చోరుఁడు, రాజసేవకుఁడు, పాపపుపనులు సేయువాఁడు, వైద్యము లోహపుబనులు, ధాన్యవర్తకము మొదలైనవానిచే జీవించువాఁడగును.

నృపసచివదుర్గపాలన గోజీవన వాజికాష్ఠశకునైశ్చ,
యంత్రోపస్కరగణితైర్జీవంతి నరాశ్చికిత్సయా ధనుషః. 77

ధనుర్వర్గమున దశమమున నున్న రాజమంత్రి, దుర్గపాలన, గోరక్షణ, గుఱ్ఱముల కాపాడుట,కట్టెలు పక్షులు మున్నగువానిచేత యంత్రములను బాగుచేయుట,లెక్కలను వ్రాయుట, వైద్యము చేయుటచేత జీవించువాఁడగును.

దశమే కురంగవర్గే జలపణ్యధనో భవేన్మహావిభవః,
ఖట్వారామారోపణరసాయనైర్వర్తతే జాతః 78

మకరమున దశమవర్గమున్న నీటివర్తకముచేత ధనము నార్జించువాఁడు, గొప్ప విభవము గలవాఁడు, మంచములు తోటలు వేయుట, రసాయనముల తయారుజేయుట మొదలైనపనులచే జీవించువాఁడును అగును.

శస్త్రదహనప్రభేదైశ్చౌర్యేణ చ వర్తతే ఖనవృత్త్యా,
దశమే ఘటధరవర్గే భారవహస్కంధబాహుబలాత్ 79

కుంభవర్గము దశమమున నున్న శస్త్రములచే ఛేదించుట, అగ్నిచే దహించుట, దొంగతనము, త్రవ్వుట, బరువులమోయుట, బాహుబలము అనువీనిచే జీవించువాఁడగును.

శస్త్రాత్సలిలాద్యోనిప్రపోషణాది శ్వవిక్రయాద్వాఽపి,
వర్గే మీనప్రభవే దశమస్థే జాయతే వృత్తిః. 80

మీనవర్గము దశమమందుండెనేని ఆయుధములవల్లను ఉదకములవల్లను పక్కుల పోషణ విక్రయము మొదలైనవానిచే జీవించువాఁడగును.

దివసకరాద్యైస్సంస్థైశ్శశిహోరాభ్యాం భవంత్యాద్యాః,
పితృమాతృశత్రుహితజన సహజస్త్రీభృత్యవర్గేభ్యః 81

జననకాలమున లగ్నచంద్రులవల్లనుంచి దశమస్థానమందు రవియుండెనేని తండ్రిమూలకముగను, చంద్రుఁడుండెనేని తల్లిమూలకముగను, కుజుఁడుండెనేని శత్రుమూలకముగను, బుధుఁడుండెనేని మిత్రమూలకముగను, గురుఁడుండెనేని సోదరమూలకముగను, శుక్రుఁడుండెనేని స్త్రీజనమూలకముగను, శనియుండెనేని భృత్యమూలకముగను ధనికుఁడగును (ధనయోగబలము ననుసరించి న్యూనాధికము లాలోచించవలయుననుట.)

హోరాగతైర్ధనగతై రాయగృహస్థైశ్చ చింతయేదర్థం,
బలసంయుతైర్గ్రహేంద్రైరనేకధా దృష్టమాచార్యైః. 82

లగ్నమును పొందినటువంటి ధనస్థానమును పొందినటువంటి లాభస్థానమును పొందినటువంటి బలయుక్తములైన గ్రహముల ననుసరించి ధనాగమము నాలోచించ తగినది.

ఇతి త్రయస్త్రింశోఽధ్యాయః.

---

## లోకయాత్రయను ముప్పదినాలుగవ యధ్యాయము.

లగ్నచింత.—

రవిదృష్టే ప్రాగ్లగ్నే విక్రాంతస్త్రీష్వేషు రోషణః క్రూరః,
పితృపక్షలబ్ధవిభవో వరేంద్రసేవీ భవేత్ఖ్యాతః. 1

లగ్నము రవిచేఁ జూడఁబడఁగాఁ బుట్టినవాఁడు ప్రబలపరాక్రమము స్త్రీలయందు ద్వేషము క్రూరము మొదలైనవి గలవాఁడు, తండ్రిమూలముగ గలిగిన ఐశ్వర్యము గలవాఁడు, రాజసేవ సేయువాఁడు అగును.

స్త్రీణాం వశ్యస్సుభగో దాక్షిణ్యమహోదధిః ప్రచురకోపః,
చంద్రేక్షితే విలగ్నే మార్దవజలపణ్యవా న్భవతి 2

చంద్రుఁడు లగ్నమును జూచిన స్త్రీలకు వశ్యుఁడు, సౌందర్యవంతుఁడు, దయ, అధికమగుకోపము, మృదుత్వము గలవాఁడు, నీటియందు ఓడలద్వారా వ్యాపారము చేయువాఁడు అగును.

సాహససంగ్రామరుచిశ్చండస్స్ఫుటబాంధవో౽తిధర్మరతిః,
ఉదయే కుజసందృష్టే భవతి నరస్థూలదేహశ్చ. 3

లగ్నము కుజునిచేఁ జూడఁబడెనేని సాహసము, యుద్ధమున ప్రీతిగలవాఁడు, మిక్కిలి బంధువులుగలవాఁడు, ధర్మతత్పరుఁడు, స్థూలమగుదేహేంద్రియముగలవాఁడు అగును.

బుధదృష్టే ప్రాగ్లగ్నే శిల్పకలావిద్యయా సమభిపూర్ణః,
భవతి నరో విపులమతిః కీర్తికరో మానసంయుక్తః. 4

బుధుఁడు జూచెనేని శిల్పవిద్యయం దభిమానము గలవాఁడు, సద్బుద్ధి కీర్తి అభిమానము గలవాఁడగును.

ఇజ్యావ్రతనియమపరాన్నృపపూజ్యాః ఖ్యాతకీర్తయో మనుజాః,
లగ్నే సురగురుదృష్టే సజ్జనగుర్వతిథిసంయుక్తాః. 5

లగ్నమును బృహస్పతి చూచెనేని యజ్ఞములయందు వ్రతములయందు నియమములయందు ఆసక్తిగలవాఁడు, రాజుచేఁ బూజింపఁబడువాఁడు, గొప్పఖ్యాతిగలవాఁడు, సత్పురుషులను గురువులను అతిథులను పూజించువాఁడు అగును.

వేశ్యాస్త్రీజనబహులాస్తమణాస్సంపన్నభోగధనసౌఖ్యాః,
శుక్రేక్షితే విలగ్నే భవంతి మనుజాః సురూపాశ్చ. 6

లగ్నమును శుక్రుఁడు చూచెనేని వేశ్యాస్త్రీలు పుష్కలముగాఁగలవాఁడు యౌవనవంతుఁడు, సంపద భోగము ధనము సౌఖ్యముగలవాఁడు, సౌందర్యవంతుఁ అగును.

ఖారాధ్వరోగతప్తాః క్రుద్ధా వృద్ధస్త్రియా యుతా విసుఖాః,
మందేక్షితే విలగ్నే మలినా మూర్ఖాశ్చ జాయంతే. 7

శని జూచెనేని భారాదులచే తపించువాఁడు, వృద్ధస్త్రీలతో రమించువాఁడు, సుఖహీనుఁడు, నీచుఁడు, మూర్ఖుఁడు అగును.

పశ్యన్ గ్రహస్స్వలగ్నం సర్వం విదధాతి సౌఖ్యమర్థం చ,
ప్రాయో నృపప్రియత్వం పాపః పాపం శుభం చ శుభః. 8

లగ్నమును పాపగ్రహము జూచెనేని పాపఫలము నిచ్చును. శుభగ్రహము జూచెనేని శుభఫలము గలుగును సౌఖ్యము ధనము రాజానుగ్రహము మొదలుగాఁగల శుభము శుభపాపసామాన్యముగ తెలియుచుగా లగ్నశాయమునుండి లగ్నమును జూచెనేని గలుగును.

ఏకేనాపి న దృష్టం యమ్ముస్తు సౌమ్యాపవర్జితం లగ్నం,
స్వగృహస్వభావసహితం జనయతి న ఖలు కేవలం విత్తం. 9

లగ్నము ఒకగ్రహముచేతనైనను చూడఁబడక గ్రహహీనమాగాచో లగ్నస్వభావ ఫలము నిచ్చును.

ద్వ్యాదిగ్రహసంపృష్టం ప్రాయేణ సుఖార్థదం భవతి లగ్నం,
ఏకేనాపి శుభేన చ న తు పాపై ర్విదృశ్యతే యచ్చైః 10

లగ్నము ఒకటి రెండు మూఁడు శుభగ్రహములచేఁ జూడఁబడెనేని క్రమాను రోధముగా సుఖము ధనము మొదలైనవి కలుగును. పాపులచే చూడఁబడకుండవలయు ననుట.

సర్వై ర్వర్గగనభ్రమణై ర్దృష్టే లగ్నే భవేన్మహీపాలః,
బలిభిస్సమస్తసౌఖ్యో విగతభయో దీర్ఘజీవీ చ. 11

లగ్నమును సూర్యాదిగ్రహము లన్నియుం బలవంతులై చూచిరేని భూమిని పాలించువాఁడు, సమస్తసౌఖ్యములను పొందువాఁడు, భయములేనివాఁడు, దీర్ఘజీవి యగును.

లగ్నే త్రయో విగతశోకవివర్ధితానాం
కుర్వంతి జన్మశుభదాః పృథివీపతీనాం,
పాపాస్తు రోగభయశోకపరిప్లుతానాం
బహ్వాశనాం సకలలోకతిరస్కృతానామ్. 12

ముగ్గురు శుభగ్రహములు లగ్నమందుండిరేని సమస్తశుభములను పొంది దేశాధిపతి యగును. పాపగ్రహము లుండెనేని రోగము భయము శోకము మొదలైనవిగల వారు, బహ్వాశినులు, సర్వులచే తిరస్కరింపఁబడువారు అగుదురు.

లగ్నాత్షష్ఠమదాష్టమే యది శుభాః పాపైర్నయుక్తేక్షితాః
మంత్రీ దండపతి క్షితేరధిపతిస్త్రీణాం బహూనాం పతిః,
దీర్ఘాయుర్గదవర్జితో గతభయో లగ్నాధియోగో భవే
త్సచ్ఛీలో యవనాధిరాజకథితో జాతః పుమాన్ సౌఖ్యభాక్. 13

జన్మలగ్నమునకు షష్ఠసప్తమాష్టమములయందు శుభగ్రహములుండి పాపగ్రహములచే కూడఁబడక చూడఁబడక యుండఁగాఁ బుట్టినవాఁడు మంత్రి, దండనాయకుఁడు, భూమిని పాలించువాఁడు, అనేకస్త్రీల కధిపతియు, దీర్ఘాయువు మొదలైన సౌఖ్యబహుళము గలవాఁడగును ఇది లగ్నాధియోగ మనఁబడును.

స్వగృహోచ్చసౌమ్యవర్గే గ్రహాఃఫలం పుష్టమేవ విదధాతి,
నీచర్క్షరిపుగృహస్థో విగతఫలః కీర్తితో మునిభిః 14

గ్రహము స్వగృహ ఉచ్చ శుభవర్గములయందుండెనేని పూర్ణఫలము నిచ్చును. నీచశత్రుగృహములయందుండెనేని విఫలము గలుగును.

ధనచింతా:—

రవిరవిజభూమితనయాః కుటుంబసంస్థా విలోకినాద్వాఽపి,
కుర్వంతి ధనవినాశం క్షీణేందునిరీక్షితా విశేషేణ. 15

ద్వితీయస్థానమగు కుటుంబస్థానమందు రవికుజశను లుండిరేని లేక చూచిరేని నిర్ధనుఁడగును. వారలు క్షీణచంద్రునిచేఁ జూడఁబడిరేని ప్రబలనిర్ధనుఁడగును.

రవిభౌమౌ ధనసంస్థౌ త్వగ్దోషదరిద్రతాకరౌ కథితౌ,
మందః కురుతే శుద్ధో మహార్థయుక్తం బుధేక్షితస్తత్ర. 16

ధనస్థానమందు రవికుజులుండిరేని చర్మవ్యాధి, దారిద్ర్యము గలవాఁడగును. శని బలవంతుఁడై ధనస్థానమందుండి బుధునిచేఁ జూడఁబడెనేని ప్రబల ధనికుఁడగును.

రవిరపి విధనం జనయతి యమేక్షితశ్చాస్య తేఽన్యదృష్టశ్చ,
సౌమ్యాః కుటుంబరాశౌ బహుప్రకారం ధనం దద్యుః. 17

రవి ధనస్థానమందుండి శనిచేఁ జూడఁబడెనేని నిర్ధనుఁడగును. ఇతరులచే జూడఁబడెనేని నిర్ధనుఁడు కాఁడనుట. శుభగ్రహములు కుటుంబరాశియందుండిరేని అనేక ప్రకారములుగ ధనాగమము గలవాఁడగును.

బుధదృష్టస్త్రిదశగురుః కుటుంబరాశౌ చ నిఃస్వతాం కురుతే,
సోమతనయోఽపి శశినా నిరీక్షితో హంతి సర్వధనమ్. 18

బృహస్పతి కుటుంబస్థానమందుండి బుధునిచేఁ జూడఁబడెనేని దరిద్రుఁడగును. బుధుఁడుండి చంద్రునిచేఁ జూడఁబడెనేని సర్వధనమును హరించువాఁడగును

చంద్రోఽపి ధనస్థానే క్షీణోఽపి బుధేక్షితస్సదా కురుతే,
పూర్వార్జితార్థనాశం నిరోధమపి చాన్యవిత్తస్య 19

క్షీణచంద్రుఁడు ధనస్థానమందుండి బుధునిచేఁ జూడఁబడెనేని పూర్వార్జితధననాశము రాబోవు ధనవిరోధము గలుగఁజేయును.

శుక్రః కుటుంబభవనే చంద్రేణ నిరీక్షితః ప్రధనదాతా,
సౌమ్యగ్రహేణ దృష్ట స్సఏవ ధనదస్సదా కురుతే 20

శుక్రుఁడు కుటుంబమందుండి చంద్రునిచేఁ జూడఁబడెనేని దాతయగును. శుభగ్రహములచే అనఁగా బుధగురులచేఁ జూడఁబడెనేని ఎల్లప్పుడు దానము సేయువాఁడగును

సహజచింతః—

పాపభవనం తృతీయం సమస్తపాపైర్యుతం సహజహంతృ,
విపరీతమితరైర్దృష్టం సంఖ్యాం తేషాం ప్రవక్ష్యామి. 21

తృతీయస్థానము పాపగ్రహస్థానమై పాపగ్రహయులందరుండిరేని సోదరహీనుఁడు అగును. శుభగ్రహస్థానమై శుభగ్రహములందరుండిరేని సోదరులుగలవాఁడగును.

యావంతో నవభాగా యవాగతాః సహజరాశౌ తు,
తత్సంఖ్యాం కుర్వంతి చ దృష్టాస్త్వన్యైస్తథా బహవః 22

తృతీయస్థానమందు యెన్నినవాంశలు గతములో తావత్సంఖ్యగల సోదరులని తెలియఁదగినది. శుభులచేఁ జూడఁబడెనేని అనేకసోదరులు అని తెలియఁదగినది.

తత్రస్థితో రవిసుతః కుజేన దృష్టో వినాశయతి జాతాన్,
శుక్రో గురుసందృష్టః పుష్ణాతి సదైవ దాయాదాన్. 23

తృతీయస్థానమందు శనియుండి కుజునిచేఁ జూడఁబడెనేని సోదరులను నశింపఁజేయును. శుక్రుఁడుండి గురునిచేఁ జూడఁబడెనేని అనేకసోదరు లుందురని యెఱుంగునది.

మిత్రచింత:—

సౌమ్యోభాస్కరదృష్టస్సుహృదాం పరిసంక్షయం సదా కురుతే,
భావాధ్యాయే కథితం శేషం పరికల్పయేదత్ర 24

తృతీయస్థానమందు బుధుఁడుండి రవిచేఁ జూడఁబడెనేని స్నేహితులయొక్క క్షయమును జేయును ఈచెప్పఁబడినసంగతులుగాక తక్కినవి భావాధ్యాయోక్తప్రకారముగ నాలోచింపఁదగినది.

పుత్రచింత:—

సుతభవనం శుభయుక్తం శుభదృష్టంవా శుభర్క్షమిహయేషాం,
తేషాం ప్రసవః పుంసాం భవత్యవశ్యం న విపరీతే. 25

జననకాలమున పుత్రస్థానము శుభక్షేత్రమైనను శుభయుక్తమైనను శుభదృష్టమైనను గలిగియుండెనేని సంతానము గలవాఁడని తెలియఁదగినది. అట్లు గానిచో సంతానములేదని యెఱుంగవలయును.

ఏకతమే గురువర్గే శుభాంశావాసో భవేత్పుత్రః,
లగ్నాచ్చంద్రాదథవా బలయోగాద్వీక్షితేఽపి వా సౌమ్యైః. 26

లగ్నచంద్రులలో నెవరు బలవంతులో వాని ననుసరించి పంచమభావము శుభక్షేత్రమై భావసాధనరీతిచేత నాగతమైన పంచమభావమునకు షడ్వర్గములో నొకవర్గమైనను గురువర్గమై యుండెనేని ఔరసపుత్రుఁడు గలఁడనియు లేక పుత్రభావమును శుభగ్రహములు జూచినను ఔరసపుత్రుఁడు కలఁడనియుఁ దెలియునది.

సంఖ్యానవాంశతుల్యా సౌమ్యాంశే తావతీ సదా దృష్టా,
శుభదృష్టే తద్ద్విగుణా క్లిష్టా పాపాంశకేఽథవా దృష్టే. 27

భావమం దెన్నినవాంశలు గడచినవో తత్తుల్యసంఖ్యగల పుత్రులు గలుగుదురు. శుభగ్రహనవాంశ అయినయెడల నవాంశతుల్య సంఖ్యగల పుత్రులు జీవించియుందురు. నవాంశము భావము శుభదృష్టమాయెనేని ద్విగుణనవాంశసంఖ్యాతుల్యమైన పుత్రులు గలుగుదు రనియు, పాపగ్రహనవాంశమై పాపగ్రహములచేఁ జూడఁబడెనేని ఉక్తనాశరీత్యము గలుగుననియు నెఱుంగవలయును.

సౌరక్షే సౌరగణో బుధదృష్టో గురుకుజార్కదృగ్ఘీనః,
క్షేత్రజపుత్రం జనయతి బౌధోఽపి గణో రవిజదృష్టః. 28

పుత్రస్థానము శనిక్షేత్రమై ఆక్షేత్రమందు సౌరగణము బుధునిచే జూడఁబడి రవికుజగురులచే జూడఁబడకయుండెనేని క్షేత్రజపుత్రుఁడు గలవాఁడగును (స్వభార్యయందు పరబీజోత్పన్నుఁడు క్షేత్రజుఁడు). లేక బుధగణము శనిచే జూడఁబడెనేని క్షేత్రజపుత్రుఁడు గలవాఁడగును. (అనఁగా జననకాలమునకు స్ఫుటగ్రహములను సాధించి తదుపరి భావసాధనము జాతకపద్ధత్యనుసారముగఁజేసి తదుపరి సర్వగ్రహములకున్ను సర్వభావములకున్ను సప్తవర్గములు జేయవలెను. ఇట్లు పుత్రభావమునకు సప్తవర్గము జేయఁగా సప్తవర్గాంతఃపాతియగు నొకగణము శన్యాధిపత్యము గలదై పుత్రభావమునకు సప్తమభావమం దున్నగణమున బుధుఁడుండిన శన్యాధిపత్యగణమును జూచును ఇట్లు జూచిన నోఁ బుట్టినవాఁడు క్షేత్రజపుత్రుఁడు గలవాఁడగును. సప్తవర్గాంతఃపాతియగు బుధగణమును తత్సప్తమభావమం దున్నగణమందు శనియుండిన ఆగణమును జూచును ఇట్లు జూచినను క్షేత్రజపుత్రుఁడు గలవాఁడగును.) గణమనఁగా లగ్న హోరా ద్రేక్కాణ సప్తాంశ నవాంశ ద్వాదశాంశ త్రింశాంశలలో నొకటి యని తెలియఁదగినది. ఇట్లె యూహించవలయును.

మాందం సుతర్క్షమిందుర్నిరీక్షితే యపి శనైశ్చరేణ యుతం,
దత్తకపుత్రోత్పత్తిః క్రీతస్య బుధేన చైవం స్యాత్. 29

పుత్రస్థానము శనిక్షేత్రమై శనియుండి చంద్రునిచే జూడఁబడెనేని దత్తపుత్రుఁడు గలవాఁడగును. బుధునిచే జూడఁబడెనేని క్రీతపుత్రుఁడు గలవాఁడగును.

సప్తమభాగే కౌజే సౌరయుతే పంచమే సదాభవనే,
కృత్రిమపుత్రం విందాచ్ఛేషగ్రహావర్శనా న్మర్త్యే 30

పంచభావముయొక్క సప్తమాంశము కుజాధిపత్యము గలదై శనితోఁ గలసియుండి ఇతరగ్రహదృష్టి లేకయుండెనేని కృత్రిమపుత్రుఁడు గలవాఁడగును. కృత్రిమపుత్రుఁడనఁగా మాతాపితృలచేత నివ్వఁబడక స్వయము పొందఁబడినవాఁడు కృత్రిమపుత్రుఁడు.

వర్గే పంచమరాశౌ సౌరే సూర్యేణ వాఽత్ర సంయుక్తే,
లోహితదృష్టే వాచ్యో జాతస్య హి బీజజః పుత్రః. 31

పంచమభావమం దొకవర్గము సౌరాధిపత్యము గలదై రవితోఁ గలసియుండి కుజునిచే జూడఁబడెనేని బీజుఁడనెడి పుత్రుఁడు గలవాఁడగును. (బీజుఁ డనఁగా, విధ్యుక్తప్రకారముగా వివాహితగాని భార్యయందు స్వబీజోత్పన్నుఁడైనవాఁడు.)

చంద్రే భౌమాంశగతే ధీస్థే మందావలోకితే భవతి,
గూఢోత్పన్నః పుత్ర శ్శేషగ్రహాదర్శనాయాంతే. 32

పంచమభావమందు చంద్రుఁడుండి కుజాంశను పొంది శనిచేఁ జూడఁబడెనేని గూఢోత్పన్నుఁడైన పుత్త్రుఁడు గలవాఁడగును. ఇతరగ్రహదృష్టి లేకుండవలయు ననుట గూఢోత్పన్నుఁడనఁగా స్వభార్యయందు రహస్యముగ గృహమందున్నవానిచేఁ బుట్టినవాఁడు గూఢోత్పన్నుఁడు.

తస్మిన్నేవ చ భౌమే శనివర్గస్థే నిరీక్షితే రవిణా,
పురుషస్య భవతి పుత్త్రోఽపవిద్ధ ఇతి కరుణమునివచనాత్. 33

పంచమభావమందైన శనివర్గమందు కుజుఁడుండి రవిచేఁ జూడఁబడెనేని అప విద్ధుఁడనుపుత్త్రుఁడు గలవాఁడగును. (తల్లిదండ్రులచే విడువఁబడి తనచే గ్రహింపఁ బడినవాఁడు అపవిద్ధుఁడు)

శనివర్గస్థే చంద్రే శనియుక్తే పంచమే సదా భవనే,
శుక్రరవిభ్యాం దృష్టే పుత్రః పౌనర్భవో భవతి 34

పంచమభావమం దొకవర్గము శనిదై చంద్రుఁడుండి పంచమభావమందు శని యుండి రవిశుక్రులచే జూడఁబడియుండెనేని పౌనర్భవుఁడను పుత్త్రుఁడు గలవాఁడగును. (పౌనర్భవుఁడనఁగా, క్షతయోనియైనను అక్షతయోనియైనను మారుమనువుగల స్త్రీయం దుత్పన్నమైనవాఁడు.)

చూడాయదార్క్యసక్తా కలాచ తస్యైవ పంచమే గేహే,
రవిదృష్టేఽప్యథ సహితే కానీన స్సంభవతి పుత్రః 35

తాత్పర్యము మృగ్యము

వర్గే రవిచంద్రమసో స్సుతగేహే చంద్రసూర్యసంయుక్తే,
శుక్రేణ దృష్టిమాత్రే పుత్రః కథిత స్సహోఢశ్చ 36

పంచమభావమందైన సూర్యచంద్రులవర్గములు సూర్యచంద్రయుక్తములై శుక్రునిచేఁ జూడఁబడెనేని సహోఢుఁడను పుత్త్రుఁడు గలవాఁడగును. (సహోఢుఁ డనఁగా వివాహసమయమునకు తల్లియొక్క గర్భమునందున్న శిశువు.)

పాపైర్బలభిర్యుక్తే పాపర్క్షే పంచమే సదా రాశౌ,
జాతోఽపుత్రః పురుషస్సౌమ్యగ్రహాదర్శనాయాంతే. 37

పంచమస్థానము పాపగ్రహక్షేత్రమై బలవంతులైన పాపగ్రహములతో కలసి యుండెనేని అపుత్త్రుఁడగును. శుభగ్రహదృష్టి లేకుండవలయు ననుట.

సుక్రనవాంశే తస్మిన్ శుక్రేణ నిరీక్షితే త్వపత్యాని,
దాసీప్రభవాని వదేచ్చంద్రాదపి కేచిదాచార్యాః. 38

పుత్రభావమందైన నవాంశములలో నొకటి శుక్రాధిపత్యముగలదై శుక్రునిచేఁ జూడఁబడెనేని దాసీపుత్రులు గలవాఁడగును. ఇట్లె చంద్రునివల్లనుండియుఁ దెలియఁదగినదని కొందఱిమతము.

సితశశివర్గే ధీస్థే తాభ్యాం దృష్టేథవాఽపి సంయుక్తే,
ప్రాయేణ కన్యకాస్స్యుస్సమరాశిగణేఽప చాన్యథాపుత్రాః 39

పుత్రభావమందైన చంద్రశుక్రవర్గములు చంద్రశుక్రులచేఁ జూడఁబడిగాని కూడఁబడిగాని యుండఁగాఁ బుట్టినవానికి కన్యాసంతానము అధికముగ నుండును. ఇంతియె గాక పుత్రభావము సమరాశిగణాంతఃపాతిగా నుండవలయుననుట ఇట్లుగాక వ్యత్యయముగ నుండెనేని అనఁగా పుత్రభావము విషమరాశిగణాంతఃపాతియై పుత్రభావమందైన చంద్రశుక్రవర్గములు చంద్రశుక్రులచే జూడఁబడక కలియక యుండెనేని పురుషసంతానము వృద్ధిగ నుండును.

లగ్నాద్దశమే చంద్రే సప్తమసంస్థే భృగోః పుత్రే,
పాపైః పాతాళస్థైర్వంశచ్ఛేత్తా భవేజ్జాతః 40

లగ్నమునకు దశమమందు చంద్రుఁడు, సప్తమమున శుక్రుఁడు, చతుర్థమున పాపగ్రహములు నుండెనేని వంశనాశకుఁడగును

భౌమః పంచమభవనే జాతంజాతం వినాశయతి పుత్రం,
దృష్టే గురుణా ప్రథమం సితేన నచ సర్వసందృష్టః. 41

పంచమస్థానమందు కుజుఁడుండెనేని బుట్టినసంతానమంతయుఁ మృతినొందును. పంచమస్థానమందున్న కుజుఁడు గురునిచేఁ జూడఁబడెనేని ప్రథమపుత్రుఁడు నశించును. శుక్రుఁడొక్కఁడు జూచినను లేక సర్వగ్రహములు జూచినను అట్లు కలుగదు.

ధనజనసుఖహీనః పంచమస్థైశ్చ పాపై
ర్భవతి వికల ఏవ క్ష్మాసుతే తత్ర జాతః,
దివసకరసుతే చ వ్యాధిభిస్తప్తదేహా
స్సురగురుబుధశుక్రైస్సౌఖ్యసంపద్ధనాఢ్యః. 42

పంచమస్థానమున రవికుజశనులుండిరేని ధనము జనము సుఖము మొదలైనవి లేనివాఁడగును. కుజుఁ డొక్కఁడుండెనేని అంగవైకల్యము గలవాఁడగును. శనియుండెనేని వ్యాధియుక్తమగు శరీరము గలవాఁడగును. బుధగురుశుక్రులుండిరేని సౌఖ్యము సంపత్తు మొదలైనవి గలవాఁడగును.

శత్రుచింత:—

రిపుభావే క్షితిసూనుర్మందేన నిరీక్షితో దిశతి శత్రూన్,
శుభయుక్తశ్శుభదృష్టశ్శత్రుభయం నైవ నాత్యంతం 43

శత్రుస్థానమందు కుజుఁడుండి శనిచేఁ జూడఁబడెనేని శత్రువులు గలవాఁడగును. శత్రుస్థానము శుభయుక్తము, దృష్టము అయియుండెనేని శత్రుహీనుఁడగును.

క్షేత్రగ్రహేంద్రతుల్యాం సంఖ్యాం తేషాం వినిర్దిశేత్ప్రాజ్ఞః,
భావాధ్యాయేఽభిహితం విస్తరతశ్చింతయేచ్ఛేషం 44

భావమం దెన్ని గ్రహము లుండునో తత్తుల్యసంఖ్యగల శత్రువులు గలవాఁడగును. శేషించినవిషయము భావాధ్యాయమందుఁ జెప్పఁబడెను.

కళత్రచింత:—

శుక్రేందుజీవశశిజైస్సకలైస్త్రిభిశ్చ
ద్వాభ్యాం కళత్రభవనే చ తథైకకేన,
ఏషాం గృహేఽపి చ గణేఽపి విలోకితే వా
సంతి స్త్రియో భవనవర్గఖగస్వభావాః. 45

సప్తమభావమున ఎన్నిశుభగ్రహములుండునో తత్తుల్యసంఖ్యగల రాశి వర్గ గ్రహస్వభావముగలభార్య లుందురు. లేక కళత్రస్థానము చంద్రబుధగురుశుక్రక్షేత్రములలో నొకక్షేత్రమాయెనేని కళత్రస్థానమందలి షడ్వర్గములలో నొకటి శుభాధిపత్యము గలదాయెనేని ఎన్నిశుభగ్రహము లుండునో జూచునో తత్తుల్యసంఖ్యగల భార్య లుందురు.

ఏవం క్రూరైర్నాశో లగ్నాచ్చంద్రాద్భవేచ్చ బలయోగాత్,
శశిరవిజయోః కళత్రే భార్యాపుంసాం పునర్భూసాన్యత్. 46

పూర్వోక్తప్రకారముగ క్రూరగ్రహము లుండిరేని తత్సంఖ్యగలభార్యలు నశింతురు. చంద్రశనులు కళత్రస్థానమందుండిరేని మారుమనువుభార్య గలవాఁడగును. ఈబాధ ఫలములు లగ్నచంద్రులలో నేదిబలయుక్తమో దానివనుసరించి తెలియవలెను.

భవనాధిపాంశతుల్యా భవంతి నార్యో నిరీక్షణాద్వాఽపి,
స్త్రైకైవ రవికుజాంశే గురుబుధయోశ్చాపి జామిత్రే 47

సప్తమాధిపతి ఎన్నవనవాంశ యందుండునో ఆతుల్యసంఖ్య భార్యలు గలవాఁడగును. (భావము బలయుక్తమైన శుభగ్రహములచేఁ జూడఁబడుచుండెనేని గలుగు ననుట) సప్తమస్థానమందైన రవికుజాంశలకు గురుబుధులు క్రమముగఁ బొందియుండిరేని ఏకకళత్రము గలవాఁడగును.

ప్రాయేణ చంద్రసితయోర్వర్గే యుక్తేఽథవాపి జామిత్రే,
దృష్టే వా బహుపత్న్యో భవంతి శుక్రే విశేషేణ. 48

సప్తమస్థానమందు చంద్రశుక్రులవర్గమందు శుక్రుఁడుండఁగను జూచినను అనేక భార్యలు గలవాఁడగును.

గురుశుక్రయోస్స్వవర్గా రవికుజశశిభానుజైర్హ్యవంత్యాన్యాః,
శుక్రే వేశ్యాః ప్రాయశ్చంద్రేఽపి వదంతి కేతుమాలాఖ్యాః 49

కళత్రస్థానమందు గురుశుక్రులుండిరేని స్వజాతియందుఁ బుట్టినభార్యగలవాఁడును, రవిచంద్రకుజశను లుండిరేని హీనజాతిగల స్త్రీగలవాఁడును, శుక్రుఁడుమాత్రముండెనేని వేశ్యాస్త్రీగలవాఁడును, చంద్రుఁడు మాత్ర ముండెనేని కేతుమాలవంశమందైన స్త్రీగల వాఁడు నగును.

భౌమే కళత్రసంస్థే నిత్యం వియుతో భవేత్తదా పురుషః,
మ్రియతేవా శనిదృష్టే యోషిదవశ్యం న దృష్టేఽన్యైః 50

కళత్రస్థానమందు కుజుఁడుండెనేని భార్యతో వియోగమును బొందినవాఁడగును. కళత్రస్థానమందున్న కుజుఁడు శనిచేఁ జూడఁబడెనేని శీఘ్రముగ భార్య మృతినొందును. అన్యులచేఁ జూడఁబడకయుండవలయు ననుట.

ద్యూనే కుజభార్గవయోర్జాతః పురుషో భవేద్వికలదారః,
ధీధర్మస్థితయోర్వా పరికల్ప్యం పండితైరేవం. 51

సప్తమస్థానమందు కుజశుక్రులుండఁగాఁ బుట్టినవానిభార్య అవయవహీనమైన దగును. కుజశుక్రులు కలసి పంచమమందుండినను లేక నవమమందుండినను అవయవహీనమైన భార్యగలవాఁడు అగును.

లగ్నాద్వ్యయరిపుగతయోశ్శశాంకభాన్వోర్వదంతి పురుషస్య,
ప్రభవం సమసప్తమునయః క్రమేణ పత్న్యైస్సహైకనయనస్య 52

రవిచంద్రులు షష్ఠద్వాదశములను పొందియుండగా బుట్టినవాడు ఒకకన్ను గలవాడగును. వానిభార్యకూడ నొకకన్నుగలది యగును.

లగ్నస్థే రవితనయే గండాంతే భార్గవే కళత్రగతే,
వంధ్యాపతిస్తదా స్యాద్యది న సుతర్క్షం శుభైర్యుక్తం 53

జననకాలమున శని లగ్నమందుండి గండాంతరాసులు అనగా కర్కాటక వృశ్చిక మీనములలో నొకటి కళత్రస్థానమై అందు శుక్రుడుండి పుత్రస్థానము శుభయుక్తము గాకుండగా బుట్టినవానిభార్య వంధ్యురాలగును.

లగ్నవ్యయాస్తసంస్థైః పాపైః క్షీణే నిశాకరే ధీస్థే,
స్త్రీహీనో భవతి నరః పుత్రైశ్చ వివర్జితో నూనం 54

లగ్నసప్తమవ్యయములయందు పాపగ్రహములు పంచమమందు క్షీణచంద్రుడు ఉండెనేని భార్య పుత్రులు లేనివాడగును.

యమభూమిజయోర్వర్గే ద్యూనస్థే తదవలోకితే శుక్రే,
జాతో భవత్యవశ్యం పత్న్యా సహ పుంశ్చలః పురుషః 55

సప్తమభావమందైన కుజశనివర్గములలో శుక్రుడుండి శని కుజులలో నొకనిచే జూడబడియుండగా బుట్టినవాడు పరస్త్రీగామి, వానిభార్య పరపురుషసంగమముకలది యగును.

బుధభార్గవయోరస్తే స్త్రీహీనో జాయతే హ్యపుత్రశ్చ,
దృష్టే శుభైశ్చ వాచ్యాః పరిణతవయసస్సదా వాచ్యాః 56

సప్తమమున బుధశుక్రులుండిన భార్య పుత్రులు లేనివాడగును. శుభగ్రహములచే జూడబడిరేని పూర్ణాయుస్సుగలభార్య పుత్రులు గలవాడగును.

భార్గవవాక్పతిసౌమ్యైః ప్రమదాభవనే శశాంకయుక్తైశ్చ,
ఏకైకేనైతేషాం పురుషస్య విభూతయో బహ్వ్యః 57

సప్తమస్థానమున చంద్రబుధగురుశుక్రులలో బలవంతుడైనగ్రహము ఒక్కడున్నను ఐశ్వర్యవంతుడగును. శుభులనేకులుండిరేని మహాదైశ్వర్యవంతుడగును. (భావమందు శుభులుండి పాపదృష్టి లేకుండిన భావవృద్ధి గలుగునని భావము).

ఆయచింతః —

రవిదృష్టే యుక్తే వాఽప్యాయక్షేత్రే భవేత్సదా నృపతేః
భవతి ధనం యుద్ధాద్యైశ్చోరవనచతుష్పదాద్యైశ్చ 58

ఏకాదశస్థానము రవియుక్తమైనను దృష్టమైనను ప్రభువులవల్లనుండియు, యుద్ధము చోరులు వనములు చతుష్పదజంతువులు మొదలగువానివలనను ధనము గలవాడగును

స్త్రీజనహస్తిప్రాయం శశాంకవర్గే శశీక్షితే యుక్తే,
క్షీణే తు యోఽథ పూర్ణే వృద్ధిస్స్వల్పా యథా వృత్తేః 59

లాభభావమున చంద్రవర్గముగలిగి చంద్రునిచే కూడియున్నను చూడబడినను స్త్రీజనము ఏనుగులు మొదలైనవి కలవాడగును చంద్రుడు పూర్ణుడాయెనేని వృద్ధిగనుండును క్షీణుడాయెనేని అల్పముగ నుండును

హేమప్రవాలభూషణమాణిక్యధనం కుజే భవేదేవం,
సాహసగమనాగమనైః పావకశస్త్రైశ్చ వక్తవ్యం 60

లాభస్థానమున కుజుడుండెనేని సాహసము మొదలైన వ్యాపారవృత్తిచే బంగారము ముత్యములు మొదలైనవి గలవాడగును

ఆయే బుధేఽపి వర్గే దృష్టే యుక్తేఽథవా భవేన్నిత్యం,
శిల్పాదిలేఖ్యకావ్యైః క్షిప్రాప్తం తథా సుతజ్ఞానైః 61

లాభభావమున బుధుడున్నను బుధునిచే జూడబడినను లేక కూడియుండినను శిల్పవిద్య లేఖనము మొదలైనవానిచే ధనము గలవాడగును.

నగరజనయానభోగైః క్రతుభిశ్చ తథాభీష్టపుణ్యైశ్చ,
హేమప్రాయం వృత్తిం జీవే పితుఃసంగ మాక్షికమ్. 62

లాభభావమున గురువర్గము గురుయుక్తము లేక గురుదృష్టము అగునేని యానాదిభోగమును క్రతువులు సత్కార్యములు స్వర్ణక్రయవిక్రయాదికము అశ్వాదికము కలవాడగును.

వేశ్యాస్త్రీసంభోగైర్గమనాగమనైర్ధనం భవతి పుంసాం,
ఆయే సితేఽపి చైవం ముక్తారజతాది భూయిష్ఠమ్. 63

లాభస్థానమున శుక్రుడుండెనేని వేశ్యామూలకముగ ముక్తారజితాది ధనము గలవాడగును.

నగరపురబృందయోగైః స్థావరకర్మక్రియాభిరపి విత్తం,
లోహాఖరమహిషబహుళం రవిజేఽపి తథాఽన్యవర్గేఽపి. 64

లాభస్థానమున రవివర్గమందు శనియుండెనేని అనేకగ్రామములు మొదలుగాఁ గలవాని అధిపత్యముచేతను వ్యవసాయము మొదలుగాఁగల స్థిరవృత్తిచేతను ధనము మొదలైనవి గలవాఁడగును.

ఏవం ఫలనిర్దేశస్స్వామ్యైర్దృష్టే విశేషతో వాచ్యః,
క్రూరైశ్చ సముపఘాతో మిశ్రైర్మిశ్రస్తదా పుంసామ్. 65

పూర్వము చెప్పఁబడిన యోగములు శుభులచేఁ జూడఁబడెనేని అధికముగనుండును. పాపులచేఁ జూడఁబడెనేని హీనముగ నుండును. శుభపాపులచే మిశ్రముగఁ జూడఁబడెనేని మిశ్రముగ నుండును.

సర్వగ్రహాయుతదృష్టే బహుప్రకారేణ నిర్దిశేద్విత్తం,
బలవాన్యస్తత్ర భవేదతిరిక్తం సంప్రయచ్ఛతి చ. 66

పూర్వముజెప్పిన యోగకర్తలగు గ్రహములను అనేకగ్రహములు జూచెనేని అనేకప్రకారములుగ ధనాగమము గలుగును. ఆగ్రహములలో నేగ్రహము బలయుక్తుఁడైయుండునో తదుక్తరీతిచే అధికధనాగమము గలుగును.

మిత్రస్వగృహగతోఽర్ధం స్వోచ్చే పూర్ణం తథాస్తగః కించిత్,
శత్రుగృహస్థశ్చరణం దదాతి విహగస్తదా యోతు. 67

మిత్రస్వక్షేత్రమందున్నగ్రహములు అర్ధఫలము నిచ్చును. ఉచ్చయందుండెనేని పూర్ణఫలము నిచ్చును. అస్తంగతుఁడాయెనేని స్వల్పఫలము నిచ్చును. శత్రుక్షేత్రమందుండెనేని పాదఫలము నిచ్చును.

ఆజన్మతో నరాణాం భవతి ధనం నిశ్చితం యవనవృద్ధైః,
క్షితిపతి మాండలికానా మపరిమితం ప్రాహ లోకాక్షః. 68

లాభభావమున చెప్పఁబడిన ధనయోగము గలవారికి జన్మాదిగా ధనముగలిగియుండును. మండలాధిపత్యము గలవారికి అపరిమితధనము గలుగునని లోకాక్షుని మతము.

వ్యయచింతా:—

భానౌ క్షీణే చంద్రే వ్యయభవనే భూపతిర్హరతి విత్తం,
భౌమే బుధసందృష్టే బహుప్రకారో భవేన్నాశః. 69

జననకాలమున వ్యయస్థానమునందు రవిచంద్రులుండిరేని, రాజమూలకముగ [illegible] గలుగును. కుజుఁడుండి బుధునిచేఁ జూడఁబడెనేని అనేకవిధములుగ

గురుచంద్రాదానవేజ్యా వ్యయభవనే విత్తపోషణం కురుతః,
భూమితనయేన దృష్టౌ భావాధ్యాయోక్త మన్యచ్చ 70

చంద్ర గురువులకు లుండిరేని ధనవృద్ధి గలుగఁజేయుందురు. కుజునిచేఁ జూడఁబడి నను ధనవృద్ధిని గలుగఁజేయుందురు. శేషవిషయములు భావాధ్యాయమునందుఁ జెప్పఁబడినవి.

లగ్నే బుధద్రేక్కాణే శశినా దృష్టే చతుష్టయస్థానే,
జాతో నృపతికులేష్వపి శిల్పీ స్యాన్నిశ్చితం మునిభిః. 71

లగ్నమున బుధద్రేక్కాణవర్తమానమై లగ్నాద్యన్యతమకేంద్రము చంద్రదృష్ట మగునేని రాజవంశజుఁడైనను శిల్పవృత్తుఁడు జేయువాఁడగును.

నీచే సౌరనవాంశే శుక్రేంత్యే రవిశశాంకయోర్మదనే,
మందేన విలోకితయోర్మాతా దాసీ మహాకులేఽపి స్యాత్ 72

తులాలగ్నమునకు శుక్రుఁడు నీచయగు కన్యయందైన శనినవాంశయందుండియుం సప్తమమున రవిచంద్రులుండి శనిచేఁ జూడఁబడఁగాఁ బుట్టినవానితల్లి మహాకులప్రసూతురాలైనను దాసీతనము సేయునది యగును.

సూర్యాద్ద్వితీయరాశౌ భాస్కరతనయే ఖమధ్యగే చంద్రే,
భౌమే సప్తమభవనే వికలోఽస్మిన్సర్వదా జాతః. 73

సూర్యునకు ద్వితీయమందు శని, లగ్నమునకు దశమస్థానమున చంద్రుఁడు, సప్తమస్థానమున కుజుఁడు నుండెనేని ఎల్లపుడు అంగవైకల్యము గలవాఁ డగును.

మధ్యే పాపగ్రహయోశ్చంద్రే మృగగే రవౌ జంతోః,
శ్వాసక్షయవిద్రధినా గుల్మప్లీహాదిపీడిత స్సుభగః. 74

చంద్రుఁడు పాపగ్రహమధ్యస్థుఁడై యుండి మకరమందు రవియుండఁగాఁ బుట్టినవాఁడు శ్వాసాదివ్యాధిపీడితుఁడు, సౌందర్యము గలవాఁడు అగును.

సూర్యాంశే యది చంద్రశ్చంద్రాంశే భాస్కరో యది శ్లేష్మీ,
సమమేకరాశిగతయో ర్దుర్బలదేహా స్సదా పురుషః. 75

సూర్యాంశయందు చంద్రుఁడు, చంద్రాంశయందు సూర్యుఁడు నుండెనేని శ్లేష్మప్రకృతిగలవాఁడగును. రవిచంద్రులు రాశిభాగకలాసామ్యులై యుండిరేని దుర్బల దేహము గలవాఁడగును.

నిధనధనారివ్యయగా రవిచంద్రకుజార్కజానియతం,
నయనవిఘాతం కుర్యుర్బలవద్గ్రహదోషసంభూతం. 76

రవిచంద్రకుజశనులు నిధనధనషష్ఠవ్యయములను పొందిరేని అందు బలవద్గ్రహదోషముచే నేత్రవిఘాతము గలుగును. అనఁగా ఆగ్రహములలో బలయుక్తమైన గ్రహమునకు వాతపిత్తశ్లేష్మములలో నేదోషము చెప్పియున్నదో ఆదోషకారణముచే నేత్రఘాతము కలుగును.

ధర్మాయసహజసుతగాః పాపాస్సౌమ్యైర్న వీక్షితా జంతోః,
శ్రవణవినాశం కుర్యుస్సప్తమసంస్థాశ్చ దంతానామ్. 77

నవమైకాదశతృతీయపంచమములను పాపగ్రహములు పొంది శుభులచేఁ జూడఁబడకయుండిరేని చెవిటివాఁడగును. సప్తమమందుండిరేని దంతహీనుఁడగును.

ఉదయే దినకరపుత్రే త్రికోణభవనే కుజేచ సోన్మాదః,
క్షీణే శశిని ససౌరే యాంతే వా వ్యయగృహే జాతః. 78

లగ్నమున శని, త్రికోణస్థానమున కుజుఁడులేక శనియుక్తుఁడైన క్షీణచంద్రుఁడ ద్వాదశమందుండెనేనియు ఉన్మాదయుక్తుఁడగును.

ఇతి చతుస్త్రింశోఽధ్యాయః.

---

## రాజయోగములను దెలుపు ముప్పదేనవ యధ్యాయము.

రాజోపయోగిశాస్త్రం యస్మాత్ప్రభవో విశేషతస్తేషాం,
సంచిత్యా నృపయోగాన్స్తానేవాహం ప్రవక్ష్యామి 1

ఏహేతువువలన రాజులకు ఉపయుక్తమైన శాస్త్రము బుట్టఁబడినదో అట్టిహేతువుల ననుసరించి యథామతిగా కొన్ని రాజయోగములను జెప్పఁబోవుచున్నాను.

స్వోచ్చత్రికోణగృహాగైర్బలసంయుతైశ్చ
త్ర్యాద్యైర్నృపో భవతి భూపతివంశజాతః,
పంచాదిభిర్జనపదప్రభవోఽపి సిద్ధో
హీనైః క్షితీశ్వరసమో న తు భూమిపాలః.

జననకాలమున స్థానాదిషడ్బలయుక్తులై తమతమయుచ్చమూలత్రికోణములను పొందిన మూఁడునాలుగుగ్రహములచేత క్షత్రియవంశమందుఁ బుట్టినవారు రాజులౌదురు. తమతమయుచ్చమూలత్రికోణములయందు స్థానాదిషడ్బలయుక్తులై యుండ్లు 2-ఖ.

గ్రహములచేత క్షత్రియవ్యతిరిక్తవంశమందుఁ బుట్టినవారును రాజులౌదురు. 'హీనైః' అనుటచేత, తమతమ యుచ్చమూలత్రికోణములయందు ౧-౨ గ్రహము లుండెనేని క్షత్రియవంశజులు ధనికులగుదురుగాని రాజ్యాధిపతులు గానేరరు. 'హీనైః' అనుటచేత ౫-౬ గ్రహములు స్వోచ్చమూలత్రికోణములయందు స్థానాది బలహీనులై యుండెనేని క్షత్రియవ్యతిరిక్తవంశోద్భవులు ధనవంతులగుదురుగాని రాజులు గానేరరు. పూర్వోక్తసంఖ్యాకగ్రహములలో కొన్ని ఉచ్చస్థానములయందును కొన్ని మూలత్రికోణమునందును ఇట్లైద్విధముచేనైనను చెప్పఁబడినసంఖ్యకు తక్కువపడక యుండెనేని యథోక్తఫలము గలుగునని భావము.

అశుభగగనవాసైస్స్వోచ్చగైః క్రూరచేష్టం
కథయతి యవనేంద్రో భూపతిం విక్రమోతం,
న తు భవతి నరేంద్రో జీవశర్మోక్తపక్షే
భవతి నృపతియోగైస్సత్కృతో రాష్ట్రపాలః. 3

పూర్వము చెప్పినయోగకర్తలు పాపగ్రహంబు లాయెనేని బుట్టినరాజు పరాక్రమము క్రౌర్యము మొదలైనవి గలవాఁడగునని యవనాచార్యులు చెప్పిరి. పాపగ్రహములు యోగప్రదులై యుండిరేని పుడమిఱేఁడు గానేరఁడు గాని రాజయోగములతో కూడుకొనిన ధనికుఁడగును. అని జీవశర్మ చెప్పెను (అనఁగా శుభు లుచ్చయందుండిరేని సత్స్వభావము గలవాఁడు, పాపగ్రహము లుచ్చయందుండెనేని క్రూరస్వభావము గలవాఁడు అగునని భావము).

యేష్విహ భవంత్యవశ్యం భూపతియోగేషు నీచకులపురుషాః,
తా నగ్రతః ప్రవక్ష్యే యథామతం శాస్త్రకారాణామ్. 4

ఏరాజయోగములయందుఁ బుట్టినవారు నీచకులోద్భవులైనను రాజులగుదురో అట్టియోగములను పూర్వశాస్త్రావిరుద్ధముగఁ జెప్పఁబోవుచున్నాను.

స్వోచ్చస్థై రవిభౌమసౌరగురుభిస్సర్వైస్త్రిభిశ్చైకభే
లగ్నే షోడశవృద్ధతాపసగణైస్సందర్శితాః పార్థివాః,
ద్వాభ్యాం చైకతమోదయే స్వభవనే చంద్రే పునష్షోడశ
స్సర్వే నీచకులోద్భవోఽపి వసుధాం పాత్యేవ వాటీమివ. 5

రవికుజగురుశనులు తమతమ యుచ్చస్థానములయందుండి అందొకఁడున్నరాశి జన్మలగ్నమయ్యెనేని నాలుగుయోగము లగుననియుఁ, వీరిలో ముగ్గురు ఉచ్చస్థానములయందుండి అందొకఁడున్నరాశి జన్మలగ్నమయ్యెనేని పండ్రెండు రాజయోగము లగు

ననియుం అనఁగా మేషమందు రవి, కర్కటకమందు గురుఁడు, తులయందు శని ఈరీతిగా గ్రహములుండఁగా మేషము లగ్నమయ్యేనేని ౧. కర్కటము లగ్నమయ్యేనేని ౨ తుల లగ్నమయ్యేనేని ౩ పూర్వోక్తయోగచతుష్టయంబుతోఁగూడ ౭ యోగములు. ఇదియుంగాక కర్కటకమందు గురుఁడు, తులయందు శని, మకరమందు కుజుఁడు ఇవ్విధంబుగా గ్రహములుండఁగా లగ్నము కర్కటకమాయెనేని ౮, తులయయ్యేనేని ౯, మకరమయ్యేనేని ౧౦, ఇదియుంగాక మేషమందు రవి, తులయందు శని మకరమందు కుజుఁడు ఇవ్విధంబున గ్రహములుండఁగా లగ్నము మేషమయ్యేనేని ౧౧, తులయయ్యేనేని ౧౨, మకరమయ్యేనేని ౧౩. ఇదియుంగాక మేషమందు రవి, కర్కటకమందు గురుఁడు, మకరమందు కుజుఁడు ఇవ్విధంబుగా గ్రహంబులుండఁగా లగ్నము మేషమయ్యేనేని ౧౪, కర్కటకమయ్యేనేని ౧౫, మకరమయ్యేనేని ౧౬. ఈప్రకారము పూర్వార్ధమున పూర్వాచార్యులచే ౧౬ యోగములు చెప్పఁబడినవి. చంద్రుఁడు స్వక్షేత్రమందుండఁగా పూర్వోక్త రవి కుజ గురు శనులలో ఇద్దఱు ఉచ్చయందుండఁగా అందొకటి లగ్నమయ్యేనేని ౧౨ యోగములౌను. చంద్రుఁడు స్వక్షేత్రమందుండఁగా ఒకఁడె యుచ్చస్థానగతుఁడై లగ్నమం దుండెనేని ౪ యోగములు. అనఁగా మేషమందు రవి, కర్కటమందు చంద్రగురులు ఇట్లుండ లగ్నము మేషమయ్యేనేని ౧ కర్కటమయ్యేనేని ౨ మేషమందు రవి, కర్కటమందు చంద్రుఁడు, తులయందు శని, ఇట్లుండఁగా లగ్నము మేషమయ్యేనేని ౩ తుల యయ్యేనేని ౪ మేషమందు రవి, కర్కటమందు చంద్రుఁడు, మకరమందు కుజుఁడు. ఇట్లుండ మేషము లగ్నమయ్యేనేని ౫ మకరము లగ్నమయ్యేనేని ౬ కర్కటమందు చంద్రగురులు, తులయందు శని ఇట్లుండ కర్కటము లగ్నమయ్యేనేని ౭ తుల లగ్నమయ్యేనేని ౮ కర్కటకమందు చంద్రగురులు, మకరమందు కుజుఁడు ఇట్లుండ కర్కటము లగ్నమయ్యేనేని ౯ మకరమయ్యేనేని ౧౦ తులయందు శని, మకరమందు కుజుఁడు, కర్కటమందు చంద్రుఁడు ఇట్లుండ లగ్నము తులయయ్యేనేని ౧౧ మకరమయ్యేనేని ౧౨ చంద్రుఁడు స్వక్షేత్రమందుండఁగా నొకగ్రహము ఉచ్చస్థానగతమై లగ్నమును బొందుటవలన నేర్పడుయోగంబులు ఎట్లనిన: కర్కటమందు చంద్రుఁడు, మేషమందు రవి. ఇట్లుండ మేషము లగ్నమయ్యేనేని ౧ కర్కటమందు చంద్రగురులుండఁగా కర్కటకము లగ్నమయ్యేనేని ౨ కర్కటకమందు చంద్రుఁడు, తులయందు శని. ఇట్లుండ లగ్నము తులయయ్యేనేని ౩ కర్కటమందు చంద్రుఁడు, మకరమందు కుజుఁడు ఇట్లుండ మకరము లగ్నమయ్యేనేని ౪ మునుపటి ౧౨ కలిసి ౧౬. ఈప్రకారముగా ఉత్తరార్ధమందు ౧౬ పూర్వార్ధమందు ౧౬ కలిసి ముప్పదిరెండుయోగంబులు

చెప్పఁబడినవి. ఈయోగములయందు నీచకులోద్భవుఁడైనను పువ్వులతోటను సంరక్షించు లాగున భూమిని పాలించువాఁ డగును.

గణోత్తమే లగ్ననవాంశకోద్గమే నిశాకరే శ్చాపిగణోత్తమేఽథవా,
చతుర్గ్రహైశ్చంద్రవివర్జితైస్తథా నిరీక్షితస్స్యాదపి నీచోద్భవో నృపః.

జననకాలమున లగ్నము వర్గోత్తమాంశను పొంది చంద్రవర్జితములైన నాలుగు గ్రహములచేతఁ జూడఁబడెనేని నీచకులోద్భవుఁడైనను పుడమిఱేఁడు అగును. చంద్రుఁడు వర్గోత్తమాంశయందుండి నాలుగు గ్రహములచేఁ జూడఁబడెనేని అట్లె నీచకులోద్భవుఁడైనను పుడమిఱేఁడు అగును. ఈయోగములు ప్రస్తరింపఁగ 30 యోగములగును. (చంద్రవర్జితములగు నాలుగు మొదలగు గ్రహములచే అను గ్రంథాంతరమతానుసారముగా 41 యోగము లగును.)

ఉదయగిరినివిష్టైర్మేషసంస్థైర్గ్రహేంద్రై
శ్శశిరుధిరసురేడ్యైర్జాయతే పార్థివేంద్రః,
జలనిధిరశనాయాః పాలకస్సర్వభూమే
ర్హతరిపుపరివారస్సర్వతః ఖ్యాతకీర్తిః. 7

లగ్నము మేషమై చంద్రకుజగురులు లగ్నమందుండిరేని సార్వభౌముఁ డగును. అనఁగా శత్రురహితుఁడై రాజాధిరాజగును.

స్వోచ్చే గురావవనిజే క్రియగే విలగ్నే
మేషోదయే చ సకుజే వచసామధీశే,
భూపో భవేదిహ నయస్య విపక్షసైన్యం
తిష్ఠన్న జాతు పురతస్సచివాపయస్యాః 8

మేషము లగ్నమై అందు కుజుఁడుండి కర్కాటకమందు గురుఁడుండెనేనియు, కర్కాటకము లగ్నమై అందు గురుఁడు మేషమందు కుజుఁడు ఉండెనేనియు ఈరెండు యోగములయందుఁ బుట్టినవాఁడు ప్రబలపరాక్రమముతోఁ గూడిన పుడమిఱేఁడు అగును.

నిశాభర్తాచాపే భృగుతనయదేవేడ్యసహితః
కుజః ప్రాప్తస్స్వోచ్చం మృగముఖగతః సూర్యతనయః,
విలగ్నే కన్యాయాం శిశిరకరసూనుర్యది భవే
త్తదాఽవశ్యం రాజా భవతి బహువిజ్ఞానకుశలః. 9

కన్యా లగ్నము కర్కాటమున చంద్రగురుశుక్రులు, మకరమున కుజశనులు — లగ్నమున బుధుఁడు ఇట్లుండఁగాఁ బుట్టినవాఁడు జ్ఞానవంతుఁడైన పుడమిఱేఁడగును.

స్వర్క్షే నక్షత్రనాథస్స్ఫుటకరనికరాలంకృతః ప్రాప్తలగ్నో
ద్యూనే సోమస్య పుత్రో యది రిపుభవనం భాస్కరస్సంప్రయాతః,
పాతాళే దానవేడ్యో గురురపి గగనే సౌరభౌమౌ తృతీయే
సద్భూపాలో భవేద్యశ్శశికరధవళం చామరం రాజలక్ష్మీమ్. 10

లగ్నము కర్కాటకము లగ్నమున పూర్ణచంద్రుఁడు, మకరమందు బుధుఁడు, ధనుస్సునందు రవి, తులయందు శుక్రుఁడు, మేషమందు బృహస్పతి, కన్యయందు కుజశనులు ఇట్లుండఁగాఁ బుట్టినవాఁడు వింజామరలు రాజలక్ష్మి మొదలైన చిహ్నములు గల యోగ్యమైన భూపాలుఁడగును.

వర్గోత్తమగతే చంద్రే లగ్నే వా చంద్రవర్జితైః,
చతురాద్యైర్గ్రహైర్దృష్టే జాతో నరపతిర్భవేత్. 11

చంద్రుఁడు వర్గోత్తమమందుండి నాలుగు మొదలగు గ్రహములచేఁ జూడఁబడెనేని రాజగును. ఈయోగము ప్రస్తరించగా ౨౨ యోగము లగును. లగ్నము వర్గోత్తమ నవాంశకలదై నాలుగు మొదలగు గ్రహములచేఁ జూడఁబడెనేని రాజగును. ఈయోగములు ౨౨ అగును.

శిశిరకిరణే స్వోచ్చే లగ్నే పయోంబుధినిధేస్సమే
ఘటధరగతే భానోః పుత్రే మృగాధిపతౌ రవిః,
అళిగృహగతో వాచాం నాథస్స్ఫురత్కరరాజితో
యది నరపతి స్స్ఫీతశ్రీకస్తదా బహువాహనః. 12

లగ్నము వృషభము లగ్నమున చంద్రుఁడు, కుంభమున శని, సింహమున సూర్యుఁడు, వృశ్చికమున గురుఁడు ప్రకాశము గలిగియుండెనేని అధిక ఐశ్వర్యము వాహనములు మొదలైనవి గలిగిన పుడమిఱేఁడు అగును.

మృగే మందే లగ్నే కుముదవనబంధుశ్చ తిమిగ
స్తథా కన్యాం త్యక్త్వా బుధభవనసంస్థః కుతనయః,
స్థితో నార్యాం సౌమ్యో ధనుషి సురమంత్రీ యది భవే
[illegible] జాతో భూపస్సురపతిసమః ప్రాప్తమహిమా. 13

లగ్నము మకరము, లగ్నమున శని, మీనమున చంద్రుడు, మిథునమున కుజుడు, కన్యయందు బుధుడు, ధనుస్సున గురుడు ఇట్లుండ ఇంద్రునితో సమమైన మహిమగల రాజగును.

ఉదయతి మీనే శశిని నరేంద్రస్సకలకలాఢ్యః క్షితిసుత ఉచ్చే,
మృగపతిసంస్థే దశశతరశ్మౌ ఘటధరగే స్యాద్దినకరపుత్రే 14

లగ్నము మీనము. లగ్నమున చంద్రుడు, మకరమున కుజుడు, సింహమున రవి, కుంభమున శని ఇట్లుండ పుడమిఱేడు అగును.

కుజే విలగ్నే చ శశీ యదాస్తే స్ఫుటాంశుసంభారవిరాజితాంగః,
రాజా తదా శత్రుభిరప్రధృష్యో వేదార్థవిద్ధేతుశతానువాదైః 15

లగ్నమున కుజుడు, సప్తమమున పూర్ణచంద్రుడు ఉండెనేని వేదార్థమును తర్కశాస్త్రమును దెలిసినట్టియు శత్రువులను భయపెట్టురాజగును

కరోత్యుత్కృష్టోద్యద్దినకృదమృతాభీశుసహిత
స్థితస్తామ్రగ్రాసం సకలనయనానందజననః,
అపూర్వోఽయం స్మృత్వా నయనజలసిక్తోఽపి సతతం
రిపుస్త్రీశోకాగ్నిర్జ్వలతి హృదయేఽతీవ సుతరామ్ 16

లగ్నమున రవిచంద్రులుండిరేని సకలజనుల నానందింపఁజేయునట్టియు శత్రువులను నశింపఁజేయునట్టియు రాజగును.

శుక్రో ఘటే కుజో మేషే స్వోచ్చే దేవపురోహితః,
యది రాజా భవేన్నూనం స్వయశోధౌతదిఙ్ముఖః 17

శుక్రుడు కుంభమునందు, మేషమున కుజుడు, కర్కాటమున గురుడు నుండెనేని ప్రబలయశస్సుగల రాజగును.

ఉదయతి గురురుచ్చే తప్తహేమప్రభావో
హరితతురగనాథో వ్యోమమధ్యావగామీ,
గవిశశిబుధశుక్రా యస్య సూతౌ నరస్య
స్వజనవిజితభూమిస్సర్వతః పార్థివేంద్రః. 18

కర్కాటకము లగ్నము. లగ్నమున ప్రకాశమానుడగు గురుడు, దశమమున రవి, ఏకాదశమున చంద్రబుధశుక్రులు ఇట్లుండ పుడమిఱేడగును

ధనుషి సురేడ్యశ్శశభృదుపేతో మృగముఖసంస్థః క్షితితనయశ్చ,
ఉదయతి తుంగే సురరిపువంద్యశ్శశితనయో వా యది నృపతిస్స్యాత్.

ధనుస్సునందు చంద్రగురులు, మకరమున కుజుఁడు, లగ్నము మీనమై లగ్నమున శుక్రుఁడు లేక లగ్నము కన్యయై లగ్నమున బుధుఁడు నుండెనేని రాజగును.

చాపార్ధే భగవాన్సహస్రకిరణ స్తత్రైవ తారాధిపో
లగ్నే భానుసుతోఽతివీర్యసహితస్స్వోచ్చే చ భూనందనః,
యద్యేవం భవతి క్షితేరధిపతిస్సంచింత్య శౌర్యం భయా
ద్దూరాదేవ నమంతి యస్య రిపవో దగ్ధాః ప్రతాపాగ్నినా 20

లగ్నము మకరము ధనుస్సునందు రవిచంద్రులు, మకరమున కుజశనులు ఇట్లుండ శత్రువులకు భయపెట్టురాజగును

షష్ఠం మూర్త్యనమథాష్టమం శిశిరగోః ప్రాప్తాస్సమస్తాశ్శుభాః
క్రూరాణాం యది గోచరే న పతితా భాన్వాలయాద్దూరతః,
భూపాలః ప్రభవేత్స యస్య జలధేర్వేలావనాంతోద్భవై
స్సేనామత్తకరీంద్రదానసలిలం భృంగైర్ముహుః పీయతే. 21

జన్మలగ్నమునకు ౬-౭-౮ స్థానములయందు శుభులందఱునుండి పాపగ్రహములచేఁ జూడఁబడకుండిరేని సార్వభౌముఁడగును (ఈశ్లోకముచేఁ జెప్పఁబడినది అధియోగమనఁబడును)

న ప్రాప్నోతి జరా మాశు నోభజత్యరితో భయం,
జాతస్స్యాదధియోగేఽస్మిన్ధృతిసౌభాగ్యసౌఖ్యభాక్ 22

ఈ అధియోగమందుఁ బుట్టినవాఁడు శీఘ్రముగ ముసలితనమును శత్రుభయమును పొందనివాఁడై ధైర్యము సౌభాగ్యము సౌఖ్యము గలవాఁడగును.

బుధస్స్వోచ్చే లగ్నే తిమియుగలగావీడ్యశశినౌ
మృగే మందస్సారో జితమగృహగో దానవసుహృత్,
య ఏవం కుర్యాత్స క్షితిభృదహితధ్వంసనిరతో
నిరాలోకం లోకం చలితగజసంఘాతరజసా. 23

కన్య లగ్నము. లగ్నమున బుధుఁడు, మీనమున చంద్రగురులు, మకరమున కుజశనులు, మిథునమున శుక్రుఁడు ఇట్లుండ శత్రువుల నశింపఁజేయుచు నరేంద్రుఁడగును.

కేసరిగో మహేంద్రసచివో దినకరసహితః
కుంభగతోర్కజ శ్శశధరః ఖలు భవతి వృషే,
వృశ్చికభేక్షితేస్తు తనయో మిథున ఇందుసుతో
మేషలగ్నసముదయో యది సతు మనుజపతిః. 24

మేషము లగ్నము. సింహమున రవిగురులు,కుంభమున శని, వృషభమున చంద్రుఁడు, వృశ్చికమున కుజుఁడు, మిథునమున బుధుఁడు ఇట్లుండ పుడమిఱేఁడగును.

కార్ముకే త్రిదశనాయకమంత్రీ భానుజో వణిజచంద్రసమేతః,
మేషగస్తు తపనో యది లగ్నే భూపతి ర్భవతిసోఽతులకీర్తిః. 25

మేషము లగ్నము లగ్నమున రవి, ధనుస్సునందు గురుఁడు, తులయందు చంద్రశనులు ఇట్లుండ ప్రబలకీర్తిగలరాజగును.

స్వర్క్షే కేంద్రేషుయాతైర్గురుబుధభృగుజై ర్మందభానా్వరయుక్తై
స్స్వోచ్చే చంద్రోఽధితిష్ఠన్జనయతి నృపతిం కీర్తిశుక్లీకృతాశం,
అత్యుచ్చే లగ్నసంస్థో రవిరపి భగవానా్పర్థివం క్రూరచేష్టం
యాతాయాతైస్సమంతాచ్చతురుదధిజలం యస్యసేనాఃపిబంతి. 26

గురుబుధశుక్రులు శనిరవికుజులతోఁ గలిసి స్వక్షేత్రములయందును లేక కేంద్రములయందును చంద్రుఁడు వృషభమందుఉను నుండిన రాజగును. లగ్నము మేషమై పరమోచ్చయందు రవి ఇట్లుండఁ బుట్టినవాఁడు క్రూరచేష్ట గలిగినట్టియుం చతుస్సముద్రపర్యంతము నిర్భయముగ నేలు పుడమిఱేఁడు అగును.

ఉదకచరనవాంశకే సుఖస్థః కమలరిపుస్సకలాభిరామమూర్తిః,
ఉదయతి విహగేశుభే స్వలగ్నే భవతినృపోయది కేంద్రగానపాపాః.

పూర్ణచంద్రుఁడు చతుర్థస్థానమందైన జలనవాంశయందుండియుం, లగ్నము శుభాధిపత్యము గలదై లగ్నాధిపతి లగ్నమందుండియు, కేంద్రములయందు పాపగ్రహములు లేకుండిరేని నరేంద్రుఁడగును

ఆపూర్ణమండలకలాకలితం శశాంకం
పశ్యంతి శుక్రసురపూజితసోమపుత్రాః,
లగ్నాధిపోఽతిబలవాన్పృథివీశ్వరస్స్యా
ద్వర్గోత్తమశ్చ నవమః ఖలు చే ద్విలగ్నే. 28

పూర్ణచంద్రుఁడు బుధగురుశుక్రులచేఁ జూడఁబడియుం, లగ్నాధిపతి బలవంతుఁడై యుండియుం, లగ్నము వర్గోత్తమనవాంశకలదై యుండెనేని నరేంద్రుఁడగును.

వర్గోత్తమేత్రిప్రభృతిగ్రహేంద్రాః కేంద్రస్థితానోశుభసంయుతాశ్చ,
నోరూక్షధూమోనవివర్ణదేహాః కుర్వంతరాజ్ఞఃప్రసవంప్రసన్నాః 29

వర్గోత్తమగతులగు ముప్పురుగ్రహములు కేంద్రములయందుండి పాపగ్రహసంబంధము లేనివారలై యుద్ధమందు పరాభితులు గాకయుండిరేని రాజగును.

ఏకఏవ ఖగస్స్వోచ్చే వర్గోత్తమగతో యది,
బలవా న్మిత్రసందృష్టః కరోతి పృథివీపతిమ్. 30

జననకాలమునం దొకగ్రహము బలవంతుఁడై ఉచ్చయందును వర్గోత్తమాంశ యందును నుండి మిత్రులచేఁ జూడఁబడియుండెనేని రాజు అగును.

శీర్షోదయర్క్షేషు గతా స్సమస్తా
నీచారివర్గే స్వగృహే శశాంకః,
సౌమ్యేక్షితోఽన్యూనకలో విలగ్నే
దద్యాన్మహీం రత్నగజాశ్వపూర్ణామ్. 31

కర్కాటకము లగ్నము పూర్ణచంద్రుఁడు శుభులచేఁ జూడఁబడి స్వక్షేత్ర మందుండి నీచశత్రుగ్రహవర్గములయందుండక చంద్రవ్యతిరిక్తగ్రహములు శీర్షోదయ రాసులగు మిథునకన్యాతులావృశ్చికకుంభములయందుండిరేని నరేంద్రుఁ డగును.

ఉపచయగృహసంస్థో జన్మపో యస్య చంద్రా
చ్ఛుభగృహమథవాంశే కేంద్రయాతాశ్చ సౌమ్యాః,
సకలబలవియుక్తా యే చ పాపాభిధానా
స్స భవతి నరనాథ శ్శక్రతుల్యో బలేన 32

జన్మకాలమున చంద్రుఁడున్న లగ్నాధిపతి చంద్రునివల్లనుంచి ఉపచయస్థాన ములగు 3-౬-౧౦-౧౧ స్థానములలో నొకటియగు శుభక్షేత్రమందును లేక ఆరాసుల యందైన శుభనవాంశలయందును నుండి కేంద్రములయందు శుభులుండి తదితరస్థాన ములయందు పాపగ్రహములు బలహీనులై యుండిరేని ఇంద్రునితో తుల్యబలముగల రాజగును.

అత్యుచ్చస్థా రుచిరవపుషస్సర్వ ఏవ గ్రహేంద్రాః
మిత్రైర్దృష్టా యది రిపుదృశాం గోచరం న ప్రయాతాః,
కుర్యుర్నూనం ప్రసభమరిభిర్గర్జితై ర్వారణాగ్రై
స్సేనాస్స్వైర్యైశ్చలతి చలితైర్యస్య భూః పార్థివేంద్రమ్. 33

బుధేతర సూర్యాదిగ్రహములు పూర్ణతేజస్సుగలవారై పరమోచ్చస్థానముల యందుండి మిత్రులచేఁ జూడఁబడి పాపదృష్టి లేకయుండిరేని మహాపరాక్రమశాలి యగు రాజగును.

పరమోచ్చే స్థిత శ్చంద్రో యది శుక్రేణ దృశ్యతే,
కుర్యా న్మహీపతిం పూర్ణం పాపై రాపోక్లిమోపగైః. 34

చంద్రుఁడు పరమోచ్చయందుండి శుక్రునిచేఁ జూడఁబడి పాపగ్రహములగు రవికుజశనులు ఆపోక్లిమరాసులగు 3-౬-౯-౧౨ స్థానములయందుండిరేని రాజగును.

దృశ్యేతే శుభదైస్స్వకేంద్రభవనే మిత్రై శ్చ పాపై స్తథా
యద్ధే నో రిపుభిర్జితౌ బలయుతౌ జన్మోదయర్క్షాధిపౌ,
భూపస్స్యాన్నిజరాశినాథనవమే చంద్రోదయే చేద్యశో
యస్యేభస్రుతదానలుబ్ధమధుపై శ్చాతుర్దిశం గీయతే 35

జన్మకాలికచంద్రస్థితరాశ్యధిపతి జన్మలగ్నాధిపతి వీరిద్దఱు స్వక్షేత్రములయందు లేక కేంద్రములయందు నుండి శుభులచేతను మిత్రులైన పాపులచేతను జూడఁబడి పరాజితులుగాక లగ్నము చంద్రుఁడు తామున్న రాశ్యధిపతులకు తొమ్మిదవస్థానస్థితు లగుచుండఁగాఁ బుట్టినవాఁడు అనేకములగు మదించిన ఏనుఁగులు మొదలైన పరివారము గల ప్రభువగును.

ఉచ్చరాశి ర్భవే ద్ధోరా యస్యాసౌ కురుతే నృపం,
స్వాంశేఽథ సుహృదుచ్చాంశే దృష్టః కేంద్రోపగైశ్శుభైః 36

జన్మకాలమున లగ్నము ఉచ్చరాశియైనను జన్మకాలికలగ్నమందైన నవాంశము స్వాంశ అనఁగా వర్గోత్తమాంశయైనను లేక సుహృదుచ్చాంశయైనను అయినటువంటిదై కేంద్రములను బొందిన శుభులచేఁ జూడఁబడెనేని రాజగును

స్థితో భానోః పుత్రో విరచితబలః పశ్చిమార్ధే మృగస్య
రవి స్సింహే శుక్ర స్తులిని రుధిరో మేషగః కర్కిణీందుః,
కుమారీం సంప్రాప్తో యది భవతివా శర్వరీనాథసూనుః
ప్రజాతో భూపాల శ్ఛదయతి మహీ మేకశుక్లాతపత్రా 37

మకరోత్తరార్ధమందు బలయుక్తుఁడైన శని, సింహమున రవి, తులయందు శుక్రుఁడు, మేషమున కుజుఁడు, కర్కాటకమున చంద్రుఁడు, కన్యయందు బుధుఁడు ఇట్లుండఁ బుట్టినవాఁడు ఏకఛత్రాధిపత్యముగ పృథివి నేలు రాజగును.

వర్గోత్తమస్వభవనేషు గతా గ్రహేంద్రా
స్సర్వే యదా రుచిరరశ్మిశిఖాకలాపాః,
ఉత్పాద్యతే జగతి సీమమతీం ధరిత్రీం
యః పాలయే త్క్షితిపతి ర్జితశత్రుపక్షః. 38

సర్వగ్రహంబులు ప్రకాశమానము గలవై (అనఁగా సూర్యునకు దూరముగనున్న వనుట) స్వక్షేత్రములయందును వర్గోత్తమములయందును నుండిరేని రాజగును.

కేంద్రే విలగ్ననాథ స్సుహృద్భి రభివీక్షితో విహగైః,
లగ్నస్థితే చ సౌమ్యే భూపతిరిహ జాయతే పురుషః 39

లగ్నమున బుధుఁడు లగ్నాధిపతి కేంద్రమందుండి మిత్రులచేఁ జూడఁబడెనేని భూపతి యగును.

సురపతి గురుస్సేందు ర్లగ్నే వృషే సమవస్థితో
యది బలయుతో లగ్నేశశ్చ త్రికోణగృహంగతః,
రవిశనికుజై ర్వీర్యోపేతై ర్నయుక్తనిరీక్షితో
భవతి స నృపః కీర్త్యా యుక్తో హతాఖిలకంటకః. 40

వృషభము లగ్నము. లగ్నమున చంద్రగురులు లగ్నాధిపతి బలవంతుఁడై త్రికోణస్థానమున నుండి బలయుక్తులైన రవికుజశనులచేఁ జూడఁబడక కలియకయుండి రేని నరేంద్రుఁడగును.

సనీచగృహసంస్థితా నచ రిపో ర్గృహం సంగతా
స్వరాశిమథ వాంశకానుదయగోచ్చమంశం యది,
కలాభిరతిభూషితే కుముదషండబోధప్రదే
సుహృద్భిరభివీక్షితాః క్షితిపతిం విదధ్యుర్గ్రహాః. 41

చంద్రుఁడు పూర్ణుఁడైయుండి గ్రహములన్నియు నీచను శత్రుస్థానమును బొందక స్వక్షేత్ర స్వనవాంశ మిత్రక్షేత్ర ఉచ్చ ఉచ్చాంశలనుబొంది మిత్రదృష్టిగలిగి యుండిరేని రాజగును.

యోయః పూర్ణం శిశిరకిరణం ప్రాప్తవర్గోత్తమాంశం
సుస్పష్టార్చి ర్గగనగమనః పశ్యతి స్వోచ్చసంస్థః,
సక్షోణీశం జనయతి దశాం ప్రాప్య సౌమ్యస్స్వకీయాం
ఖ్యాతం లోకే యది బలయుతాః కంటకస్థానపాపాః 42

పూర్ణచంద్రుఁడు వర్గోత్తమాంశయందుండి ఉచ్చయందుండి తేజస్సుగల (అనఁగా సూర్యునకు దూరముగ నుండుట) శుభగ్రహముచేఁ జూడఁబడెనేనియు పాప గ్రహములు బలవంతులై కేంద్రస్థానములయందు లేకుండిరేని రాజగును. చంద్రునిజూడు [illegible]

జన్మోదయభవనపతీ బలసహితౌ కేంద్రభేఽథ హిబుకేహా,
ఇందుర్జలగృహగశ్చే త్త్రికోణగో వా మహీపాలః 43

జన్మలగ్నాధిపతి జన్మకాలికచంద్రస్థితరాశ్యధిపతి వీరిద్దఱు బలవంతులై కేంద్రములయందుండి చంద్రుఁడు చతుర్థమందు జలరాసులయందు లేక త్రికోణములయందును నుండిరేని రాజగును.

స్వగృహే మిత్రభాగేషు స్వాంశేవా మిత్రరాశిషు,
కుర్వంతి చ నరం సూతౌ సార్వభౌమం నరాధిపమ్ 44

గ్రహములు జననకాలమున స్వక్షేత్ర మిత్రక్షేత్ర స్వనవాంశ మిత్రనవాంశల యందుండిరేని సార్వభౌముఁ డగును.

పరమోచ్చగతాస్సర్వే స్వోచ్చాంశే యది సోమజః,
త్రైలోక్యాధిపతిం కుర్యుర్దేవదానవవందితమ్ 45

బుధేతరసర్వగ్రహంబులు పరమోచ్చలయందును ఉచ్చాంశయందు బుధుఁడు నుండెనేని దేవతలచేతను రాక్షసులచేతను వందితుఁడై త్రిలోకాధిపత్యము జేయు ప్రభువగును

యస్యోత్తరస్యాం భగవాన్వసిష్ఠో బృహస్పతిః ప్రాగపరేచ భార్గవః,
అగస్త్యనామాఖలు దక్షిణస్యాం స నష్టశత్రుశ్చ భవేన్నరాధిపః.

జన్మలగ్నమునకు ఉత్తరమున వసిష్ఠుఁడు, తూర్పున గురుఁడు, పశ్చిమమున శుక్రుఁడు, దక్షిణమున అగస్త్యుఁడు ఇట్లుండిరేని శత్రునాశకుఁడగు రాజగును (అనఁగా: సింహము లగ్నము. అందు గురుఁడు, కుంభమునందు శుక్రుఁడు ఇట్లుండిన వసిష్ఠుఁడు ఉత్తరమున, అగస్త్యుఁడు దక్షిణమున నుండును. ఈవిషయమై సిద్ధాంతములు బాగుగఁ దెలియఁవలెను).

శశీపూర్ణస్స్వాంశం స్వగృహమథవా స్వోచ్చభం వా ప్రయాతో
దివః పాతుర్మంత్రీ దితిజగురుణా వీక్షితః కేంద్రసంస్థః,
రవిర్లగ్నే స్వాంశం యది బలయుతః పశ్యతి స్వాంశభూపః
ప్రభగ్నం యస్యైభైశ్చతురుదధిభూశల్లకీనా మరణ్యమ్ 47

చంద్రుఁడు పూర్ణుఁడై స్వాంశను లేక స్వక్షేత్రమును లే[illegible] బృహస్పతి కేంద్రమందుండి శుక్రునిచేఁ జూడఁబడి రవిలగ్నమం[illegible] స్వనవాంశమును బలవంతుఁడై చూచెనేని భూపతి యగును. (లగ్నమం దేనవాంశ మ[illegible] సప్తమమున

తత్తుల్యనవాంశయందున్న జూచుననుట) దృగ్విషయమై ఇట్లె కొన్నిస్థలములందు పూర్వము వ్రాయఁబడెను.

కుముదగహనబంధౌ వీక్ష్యమాణే సమస్తై
ర్గగనగృహనివాసై ర్దీర్ఘజీవీ నరస్స్యాత్,
ఫల మశుభసముత్థం నైవ కేమద్రుమోత్థం
భవతి మనుజనాథ స్సార్వభౌమో జితారిః 48

చంద్రుఁడు సూర్యాదిషడ్గ్రహములచేతను జూడఁబడెనేని పూర్ణాయుస్సు గలవాఁడైన సార్వభౌముఁడగును ఇట్లు సర్వగ్రహంబులు జూచుటచే ఇరుపార్శ్వముల గ్రహములు లేక కేమద్రుమయోగము పట్టును అట్లున్నను కేమద్రుమయోగదుష్ట ఫలము లేదని తెలియఁనగు.

ఉచ్చాభిలాషు సవితా త్రికోణే
స్వక్షే శశీ జన్మని యస్య జంతోః,
స శాస్తి పృథ్వీం బహురత్నపూర్ణాం
బృహస్పతిః కర్కటకే యది స్యాత్ 49

మేషమున రవి, త్రికోణస్థానమున స్వక్షేత్రమున చంద్రుఁడు, కర్కటకమున గురుఁడు ఇట్లుండ భూమిని పాలించు ప్రభువగును.

తుంగేషు షడ్విబుధమార్గచరా ఉపేతా
స్స్వాంశే మయూఖనికరైః పరిపూరితాంగాః,
ఉత్పాదయంతి కులిశాంకితపాణిపాదం
పృథ్వీపతిం సగరవేణ యయాతి తుల్యమ్ 50

గ్రహములన్నియుం బలముగలవై తమతమయుచ్చక్షేత్రములయందు స్వనవాంశలయందుండెనేని సగరాదులతో తుల్యుఁడగు రాజగును

శుభభవనసమేతై స్సౌమ్యభాగేషు సౌమ్యైః
స్ఫుటరుచిరకరాఢ్యైః ప్రస్ఫురద్భిర్విలగ్నే,
రవిముషితమయూఖై స్తైశ్చ పాపైరమిశ్రై
ర్గిరిగహననివాసీ తాపసస్స్యాన్నరేంద్రః. 51

లగ్నమందు అస్తంగతులుగాని శుభగ్రహములు శుభరాసులయందును శుభగ్రహనవాంశలయందును నుండి అస్తంగతులగు పాపగ్రహములతోఁ గలియకుండిరేని తాపసుఁడగు రాజగును.

శుభఫణపరగాశ్శుభప్రదా ఉభయగ్రహే యది పాపసంచయః,
స్వభుజహతరిపు ర్మహీపతి స్సుగురుతుల్యమతిః ప్రకీర్తితః 52

జన్మలగ్నమువల్లనుంచి పణపరరాసులందు శుభాదిపత్యరాసులయందు శుభగ్రహములు ద్విస్వభావరాసులయందు పాపగ్రహములు ఇట్లుండ స్వయముగ శత్రువులను శిక్షించురాజు అగును

విలగ్ననాథః ఖలు లగ్నసంస్థస్సహ్మాద్గ్రహేమిత్రదృగాంశదృష్టితః,
కరోతి నాథం పృథివీతలస్య దుర్వారవైరిఘ్నమిహాంచమే శుభే 53

జననకాలమున లగ్నాధిపతి లగ్నమందుండెనేనియుఁ లేక మిత్రక్షేత్రమునందుండి మిత్రులచేఁ జూడఁబడెనేనియు పుడమిఱేఁడగును

సంపూర్ణమూర్తిర్భగవాన్మృగాంకో మేషాంశకస్థో గురుణాచదృష్టః,
నీచేన కశ్చిన్నచ వీక్షితోఽన్యైః ప్రాహ క్షితీశం యవనాధిరాజః 54

పూర్ణచంద్రుఁడు మేషాంశయందుండి బృహస్పతిచేఁ జూడఁబడియుఁ ఏగ్రహమైనను నీచస్థగ్రహముచేతను పాపగ్రహములచేతను జూడఁబడకయుండెనేని రాజు అగును

లగ్నాచ్ఛశీ త్రిరిపులాభనభస్థలేషు
సూతావఖండితవపుః పృథివీశ్వరస్స్యాత్,
దృష్టస్సురేంద్రగురుణా నచ వీక్షితోఽన్యై
ర్జన్మాధిపో దశమగ స్స్మరగోఽథవా స్యాత్. 55

చంద్రుఁడు ౩-౬-౧౦-౧౧ స్థానములయందుండి గురునిచేఁ జూడఁబడి అన్యులచేఁ జూడఁబడకయుండెనేనియుఁ లేక జన్మాధిపతి అనఁగా చంద్రస్థలగ్నాధిపతి సప్తమమున లేక దశమమున నుండి గురునిచేఁ జూడఁబడి అన్యులచేఁ జూడఁబడకయుండెనేనియుఁ ఇట్లు రెండుయోగములందుఁ బుట్టినవాఁడు పరాక్రమముగల రాజగును.

బిభ్రద్రశ్మికరాలపూర్ణపరిధి ర్నక్షత్రసంపాలక
స్తుంగాంశే సమవస్థితైశ్చ సకలైః ప్రోద్వీక్షితో వ్యోమగైః,
కుర్యాద్భూమిపతిం యశస్వి చరితం హాస్త్యశ్వసైన్యం జగ
ద్వ్యాప్యచ్ఛేషఫణీంద్రతుల్యమఖిలోర్వీభారఖిన్నశ్వసమ్. 56

పూర్ణచంద్రుఁడు తనఉచ్చాంశలయందున్న సర్వగ్రహములచేతను జూడఁబడెనేని ప్రబలసైన్యము యశస్సు మెండలైనవిగల రాజగును.

సుదామృణాలోపమబింబశోభితశ్శశీ నవాంశే నళినీప్రియస్య,
యది క్షితీశో బహుహస్తిపూర్ణశ్శుభాశ్చ కేంద్రేషు సపాపయుక్తాః

పూర్ణచంద్రుఁడు రవినవాంశయందుండెనేనియు, శుభులు కేంద్రములందుండి పాపగ్రహయుత వీక్షితులు గాకుండిరేని అనేకఏనుఁగులుగల రాజగును.

శశిబుధరుధిరాంగైః స్వాంశకస్థైరనీచై
ర్వ్యయగృహసహజస్థైర్వాపి సూర్యప్రవిష్టైః,
తనయభవనసంస్థే వాక్పతౌ చంద్రయుక్తే
భవతి మనుజనాథః కీర్తిశుక్లీకృతాశః. 58

చంద్రకుజబుధులు నీచను బొందక తృతీయద్వాదశములయందైన స్వాంశల యందుండియు అస్తంగతులు గాకుండియు చంద్రగురులు పంచమస్థానమందుండిరేనియు కీర్తిగల ప్రభువగును.

నీచారివర్గరహితైర్విహగైస్త్రిభిస్తు
స్వాంశోపగైర్బలయుతైశ్శుభదృష్టిదృష్టైః,
గోక్షీరశంఖధవళో మృగలాంఛనశ్చ
స్యాద్యస్య జన్మని స భూమిపతిర్జితారిః. 59

చంద్రుఁడు పూర్ణుఁడై యుండియు మూఁడుగ్రహములు నీచశత్రువర్గములను బొందక బలవంతులై స్వాంశలయందుండి శుభగ్రహములచేఁ జూడఁబడి యుండెనేని నరేంద్రుఁడగును.

కుముదగహనబంధుం శ్రేష్ఠమంశం ప్రసన్నం
యది బలసముపేతః పశ్యతి వ్యోమచారీ,
ఉదయభవనసంస్థః పాపసంజ్ఞో న చైవం
భవతి మనుజనాథస్సార్వభౌమస్సుదేహః. 60

లగ్నమందైన శుభగ్రహ నవాంశయందున్న బలవచ్ఛుభగ్రహముచే పూర్ణచంద్రుఁడు చూడఁబడి యుండెనేని సార్వభౌముఁడగును.

జలచరరాశినవాంశక ఇందౌ తనుభవనే శుభదస్స్వకవర్గే,
అశుభకరః ఖలు కంటకహీనో భవతి నృపో బహువారణనాథః

జలనవాంశవర్తియగు చంద్రుఁడు లగ్నమందును, శుభగ్రహము స్వవర్గమందును ఇట్లుండఁగాఁ కేంద్రములయందు పాపగ్రహములు లేకుండిరేని రాజగును.

వర్గోత్తమే హిమకరస్సకలస్థ్సితోఽంశే
కుర్యాన్మహీపతి మపూర్వయశోఽభిరామం,
యస్యాశ్చ బృందఖురఘాతరజోఽభిభూతో
భానుః ప్రభాతశశినోఽనుకరోతి రూపమ్. 62

పూర్ణచంద్రుఁడు వర్గోత్తమాంశమును పొందియుండెనేని ప్రతాపము సైన్యము అశ్వాదులు మొదలైనవి గలవాఁడగును.

సర్వగ్రహాశ్రితే యోగే చక్రవర్తీశ్వరో భవేత్,
ఏకైకేన తథా జాతా మండలానా మధీశ్వరాః. 63

పూర్వము చెప్పిన సర్వగ్రహములు యోగకర్తలు గానుండఁ బుట్టినవాఁడు చక్రవర్తులకు అధిపతి యగును. అట్లుగాక కొన్నిగ్రహములు యోగకర్తలై యుండిరేని మండలాధిపతి యగును.

ఏకోఽపి విహగః కుర్యాత్పంచమాంశగతో నృపం,
సమస్తబలసంపన్న శ్చక్రవర్తిన మేవ చ 64

స్థానాదిషడ్బలయుక్తుఁడైన యొకగ్రహము పంచమాంశను పొందియుండఁగాఁ బుట్టినవాఁడు చక్రవర్తి యగును. పంచమాంశ యనఁగా ప్రతిరాశియందు పంచమ నవాంశ, మేషమందైన సింహాంశపంచమాంశయని భావము.

యది పశ్యతి చంద్రమసం విబుధగురు ర్వృషభసంస్థితః ప్రసవే,
అవతి పృథివీ ముదగ్రాం స్ఫురన్మణిద్యోతితదిగంతాం. 65

జననకాలమున చంద్రుఁడు వృషభమందున్న గురునిచేఁ జూడఁబడెనేని నరేంద్రుఁడగును.

కుర్యాత్తుంగే త్రికోణే వా స్వరాశిస్థో విలోకయత్,
గ్రహాస్తుషారకిరణం నిషాదమపి పార్థివమ్. 66

చంద్రుఁడు ఉచ్చయందు లేక త్రికోణమందును ఉండి స్వక్షేత్రమందున్న గ్రహముచేఁ జూడఁబడెనేని హీనకులజుఁడైనను రాజగును.

స్వగృహే తృతీయభాగే శశీస్థితః పార్థివం యదా కురుతే,
పరిపూర్ణబల శ్శుభదో యది ప్రసూతౌ మహారాజమ్. 67

పూర్ణచంద్రుఁడు కర్కటకతృతీయ నవాంశయందు బలయుక్తుఁడగునేని మహారాజగును.

స్వాంశే దివాకరే యస్య స్వక్షేత్రే చ క్షపాకరః,
స రాజా గజదానౌఘశీకరోక్షితభూతలః 68

స్వక్షేత్రమున చంద్రుఁడు స్వనవాంశయందు సూర్యుఁడు ఉండెనేని నరేంద్రుఁడగును.

లగ్నే రవిపుత్రసంయుతే దేవేజ్యే ఽస్తగతే నవోదితే,
దృష్టేఽసురరాజమంత్రిణా గ్రామీణో నృపతిర్భవేదిహ. 69

లగ్నమున శని సప్తమమునఉదయమునుబొందిన బృహస్పతి యుండి శుక్రునిచేఁ జూడఁబడెనేని హీనవంశమందుఁ బుట్టినవాఁడైనను రాజగును.

ఉదయేఽసురమంత్రివరో గురుభే గురుదృష్టిపథం చ గతః,
కురుతే నియతం సన్నృపం యది తుంగగతశ్చ బుధః 70

గురుక్షేత్రము లగ్నము. లగ్నమున శుక్రుఁడుండిగురునిచేఁ జూడఁబడియుఁ బుధుఁడుచ్చయందుండెనేని రాజు అగును.

శుక్రభాస్కరేందవో భాగ మేకమాశ్రితాః,
జీవదృష్టమాత్రకా స్స్యాత్తదా మహీపతిః. 71

రవిచంద్రశుక్రులు ఒకరాశియం దొకభాగయందుండి గురునిచేఁ జూడఁబడిరేని నరేంద్రుఁడగును.

లగ్నగాస్సితశశాంకజభౌమాస్సప్తమే శశిని వాక్పతియుక్తే,
తిగ్మరశ్మితనయేన చ దృష్టే జాయతే పృథుయశాః పృథివీశః 72

లగ్నమున కుజబుధశుక్రులు సప్తమమునందున్న శనిచేఁ జూడఁబడిరేని గొప్పదైన యశస్సుగల రాజగును.

విబుధగురుర్యది భౌమనవాంశే రుధిరనిరీక్షితపూర్ణబలశ్చ,
జనయతి కుత్సితజన్మమహీపం క్రియపరిసంస్థితకర్మగతోఽర్కః 73

కర్కటకలగ్నము బృహస్పతి స్థానాదిబలయుక్తుఁడై కుజనవాంశయందుండి కుజునిచేఁ జూడఁబడి దశమస్థానమున రవి ఇట్లుండ కుత్సితుఁడగు రాజు అగును.

తృతీయగాశ్శుక్రశశాంకభాస్కరాః
కుజేఽస్తసంస్థే నవమే బృహస్పతిః,
గణోత్తమో లగ్నగృంవాఽశకోద్గమో
యదా తదా హీనకులో మహీపతిః 74

తృతీయమున రవిచంద్రశుక్రులు, సప్తమమున కుజుఁడు, నవమమున గురుఁడు, లగ్నము వర్గోత్తమాంశకలదై యుండెనేని హీనకులమం దుత్పన్నుఁడైనను భూపాలకుఁ డగును

జీవో బుధో భృగుసుతోఽథ నిశాకరో వా
ధర్మే విశుద్ధతనవ స్స్ఫుటరశ్మిజాలాః,
మిత్రై ర్నిరీక్షితయుతా యది సూతికాలే
కుర్వంతి దేవసదృశం నృపతిం మహాంతమ్ 75

శుభగ్రహములగు చంద్రబుధగురుశుక్రులలో ఇద్దరు లేక ముగ్గురు లేక నలుగురు బలవంతులై నవమస్థానమున ఉండి మిత్రులచేఁ జూడఁబడి లేక కలిసియుండి రేని దేవతలతో తుల్యుఁడగు రాజగును

తపోగృహం యస్య భవే త్తదుచ్చకం
గ్రహేణ తేనాథ యుతం నిరీక్షితం,
గ్రహద్వయం స్వోచ్చగతం యదా భవే
త్తదా కుటుంబీ నియతం మహీపతిః. 76

జననకాలమున లగ్నమునకు నవమస్థానము ఏగ్రహమునకైనను ఉచ్చస్థానమై తదుచ్చాధిపతి యాస్థానమందుండియుం లేక చూచియుం తదితరస్థానములయందు రెండు గ్రహములు తమయుచ్చలయందుండఁ బుట్టినవాఁడు కుటుంబయుక్తుఁడైన రాజగును.

సుతభవనే శశిదేవనమస్యౌ భవనపతిప్రసమీక్షితదేహౌ,
భృగుతనయో యది మీనసమేతో భవతినృపఃఖలుకుత్సితవంశః. 77

పంచమస్థానమున చంద్రగురులుండి పంచమాధిపతిచేఁ జూడఁబడియుం, శుక్రుఁడు మీనమందుండఁ బుట్టినవాఁడు హీనకులజుఁడైనను ప్రభువగును.

చంద్ర స్త్రిపుష్కరస్థస్స్వోచ్చే వచసాంపతిస్సలక్ష్మీకం,
ఉత్పాదయతి స్వామినముత్తమపాత్రం సమగ్రభువః. 78

చంద్రుఁడు తృతీయదశమములలో నొకస్థానమందుండి గురుఁ డుచ్చయందును నుండెనేని ఐశ్వర్యము గలరాజు అగును.

కేంద్రస్స్వోచ్చము పేతస్సురమంత్రీ దశమగో యదా శుక్రః,
నూనం స భవతి పురుష స్సమ స్తపృథ్వీశ్వరః ఖ్యాతః. 79

జన్మలగ్నమునకు కేంద్రస్థానములలో నొకటి కర్కాటమై అందు బృహస్పతి యుండియుం దశమకేంద్రమున శుక్రుఁడు నుండెనేని పృథ్వీశుఁడగును.

స్వర్క్షే శశీ విపులరశ్మిశిఖాకలాపా
స్స్వాంశే స్థితా బుధబృహస్పతిదానవేజ్యాః,
పాతాలగా దినకరేణ నిరీక్షితాశ్చ
సంసూచయంతి నృపతిం నృపముఖ్యజాతమ్. 80

కర్కాటకమున చంద్రుఁడు చతుర్థమున బలవంతు లైనట్టియుం తేజస్సుగలిగిన ట్టియుం (శీఘ్రనీచసమీపస్థులనుట) స్వనవాంశలయందున్న బుధగురుశుక్రులు సూర్యునిచేఁ జూడఁబడిరేని రాజాధిపవంశమందుఁ బుట్టిన రాజగును.

రవిర్న ఖస్థస్స్వత్రికోణగోఽపివా స్వరాశిసంస్థాస్సితజీవచంద్రాః,
తృతీయషష్ఠాయగతాశ్చ చంద్రాత్కుర్వంతి గోపాలమిహాక్షితీశమ్.

రవి దశమస్థానమునను లేక స్వత్రికోణమునను చంద్రగురుశుక్రులు తమతమ స్వక్షేత్రములయందుండి చంద్రునకు ౩-౬-౧౧ స్థానములయందుండిరేని రాజగును.

సప్తమభవనే సౌమ్యా మిత్రాంశగతాస్సుహృద్భిరిహ దృష్టాః,
ఉచ్చే కుజో యది నృప స్సమస్తనృపపాలకశ్శ్రేష్ఠః. 82

సప్తమరాశియందైన మిత్రనవాంశయందు మిత్రగ్రహవీక్షితులగు శుభగ్రహములు కుజుఁడు ఉచ్చయందు ఇట్లుండ రాజాధిరాజగును.

రవిశశిబుధవక్రై ర్గో్వ్యమ్ని మిత్రాంశకిస్థై
ర్నచ రిపుభవనస్థైర్నాప్యదృశ్యైర్న నీచైః,
సతపసి భృగుపుత్రే భూపతిస్స్యాత్ప్రియాణే
గజమదజలసేకైర్లీయతే యస్య రేణుః. 83

రవిచంద్రకుజబుధులు దశమస్థానమందైన మిత్రాంశలయందుండి శత్రువులైనట్టియుం నీచయందున్నట్టియుం గ్రహములచేఁ జూడఁబడకయుండు శుక్రుఁడు నవమమునను నుండెనేని ప్రతాపముగల నరేంద్రుఁడగును.

స్వోచ్చే భానుః ప్రకటితబలో వ్యోమమధ్యే సజీవ
శ్శుక్రో ధర్మే యది బలయుతః స్వాంశవాంశం ప్రపన్నః,
లగ్నే వర్గే శుభగగనగో రాజపుత్రేణ దృష్టః
పృథ్వీపాలో ధవళితజగత్స్యాత్సితైస్సై న్యవర్యశోభిః. 84

కర్కాటకము లగ్నము దశమస్థానమున రవిగురులు, నవమస్థానమున స్వనవాంశగతుఁడగు శుక్రుఁడు లగ్నమందు బుధునిచేఁ జూడఁబడిన శుభగ్రహము లేక లగ్నవర్గ

ముందు బుధునిచేఁ జూడఁబడిన శుభగ్రహము ఇట్లుండఁ బుట్టినవాఁడు అధిక యశస్సు గల భూపతి యగును.

వృషే శశీ లగ్నగతస్సుపూర్ణస్సితేన దృష్టో వణిజి స్థితేన,
బుధోఽపి పాతాళగతో యది స్యాత్తదాన్యజాతోభవతి క్షితీశః

లగ్నము వృషభము. అందు పూర్ణచంద్రుఁడుండి తులయందున్న శుక్రునిచేఁ జూడఁబడియుం చతుర్థమున బుధుఁడు ఇట్లుండ అన్యకులజుఁడైనను నరేంద్రుఁడగును (ఇచట శుక్రునకు విశేషదృష్టి నంగీకరించవలెను).

క్షమాసుతస్స్వోచ్చముపాశ్రితో యదా
రవీందువాచస్పతిభి ర్నిరీక్షితః,
భవేన్నరేంద్రో యది కుత్సితస్తదా
సమస్తపృథ్వీపరిరక్షణే క్షమః. 86

కుజుఁడు ఉచ్చయందుండి రవిచంద్రగురులచేఁ జూడఁబడెనేని హీనకులజుఁడైనను సర్వభూమిని పాలించుటయందు సామర్థ్యముగల రాజగును.

జాయతేఽభిజితి యశ్శుభకర్తా
భూపతి స్సభవతి సోఽతులకీర్త్యః,
నీచవేశ్మకులజోఽపి నరోఽస్మి
రాజయోగ ఇతి సవ్యపదేశః. 87

అభిజిన్నక్షత్రమందుగాని అభిజిల్లగ్నమందుగాని బుట్టినవాఁడు మంచివ్యాపారముగల రాజగును. ఉత్తరాషాఢా చతుర్థచరణము శ్రవణాదిని నాలుగుఘడియలు కలిసి అభిజిన్నక్షత్ర మనఁబడును. సూర్యస్థితరాశికి నాల్గవరాశిఅభిజిల్లగ్న మనఁబడును.

గండాంతవిష్టిపరిఘువ్యతీపాతజాత
స్తారాధిపస్సముదయే యది కృత్తికాయాం,
క్రీడేత్కృపాణఫలకాహితచండవేగ,
ప్రోత్థాపితాఽహితశిరో గులికాభిరీశః. 88

గండయోగముయొక్క అంతమునను విష్టిపరిఘు వ్యతీపాతలయందును కృత్తికా నక్షత్రమందును చంద్రుఁడు లగ్నమందుండఁగాను బుట్టినవాఁడు శత్రుశిరస్సును గుళికలచే క్రీడించు రాజగును.

బుధోదయే సప్తమగే బృహస్పతౌ
చంద్రే కులీరే సుఖరాశిగేఽమలే,
వియద్గతే భార్గవనందనే మృగే
ప్రశాస్తి పృథ్వీం మనుజో నిరాకులః 89

మేషము లగ్నము. అందుబుధుఁడు సప్తమమున బృహస్పతి చతుర్థమగు కర్కాటమున పూర్ణచంద్రుఁడు దశమమగు మకరమున శుక్రుఁడు నుండెనేని నిర్భయముగ భూమిని పాలించువాఁడగును.

ఏకాంతరగైర్విహగైష్షడ్భిశ్చక్రం క్షితీశ్వరం కుర్యాత్,
అత్రైవ శుభే లగ్నే సకలమహీపాలకో నృపతిః 90

లగ్నము శుభక్షేత్రమై ఆరుగ్రహములు ఏకాంతరముగ నున్నయెడల సర్వభూపాలకుఁడగును. ఆరుగ్రహములు మాత్రము ఏకాంతరగతులై యుండిరేని సామాన్యప్రభువగును. (ఏకాంతరగతు లనఁగా ఏస్థానము మొదలుగానైనను ౧-౩-౫ మొదలగు స్థానములయందుండుటయును లేక ౨-౪-౬ మొదలగు స్థానములయందుండుటయును ఏకాంతరగతులనుట)

అయమేవ సముద్రాఖ్యో ద్వౌ లగ్నే యది సంస్థితౌ,
కరోతి భూభుజం నాథం సౌమ్యైః కేంద్రేషు సంస్థితైః 91

రెండుగ్రహములు లగ్నమునను కేంద్రములయందు శుభగ్రహములు ఉండెనేని ప్రభువగును.

నిరంతరం యది భవనేషు షట్సు
గ్రహాస్థితా ఉదయగృహాత్సమస్తాః,
స్వపంక్తిద న్నరపతి మేవ కుర్యు
శ్చతుష్టయా న్నరపతిమంత్రిణం చ. 92

గ్రహములన్నియుం లగ్నము మొదలు ఆరురాసులయందు నిరంతరముగ నుండెనేని నరేంద్రుఁడగును, నాలుగుగ్రహము లుండెనేని రాజమంత్రి యగును.

సుతసుఖదుశ్చిక్యగతా యది కర్మణి కీర్తయంతి యవనాద్యాః,
బంధుసుతార్థగజాఢ్యో బహుభృత్యో జాయతే క్షితిపః. 93

జననకాలమున తృతీయ చతుర్థ పంచమ దశమస్థానములయందు గ్రహములన్నియుం నుండెనేని బంధు సుత ధన గజములు అనేకభృత్యులు కలిగిన రాజగును.

కర్మాస్తజలహోరాసు గ్రహాస్సర్వే ప్రతిష్ఠితాః,
కుర్వంతి నగరం నామ యత్ర స్యాత్పృథివీపతిః 94

కేంద్రములయందు గ్రహములన్నియుం నుండెనేని నగరమను పేరుగల రాజగును.

సుఖతనుమదగా శ్శుభా స్సమగ్రాః
కుజరవిరవిజా స్త్రిధర్మలాభసంస్థాః,
యది భవతి మహీపతిః ప్రశాంతో
యవనపతికృతో హ్యయం మహీపయోగః 95

లగ్నచతుర్థసప్తమములయందు చంద్రబుధగురుశుక్రులు తృతీయనవమలాభస్థానములయందు రవికుజశనులు నుండిరేని శాంతుఁడగు రాజగును.

లాభధర్మస్థితాస్సౌమ్యాః పాపాః కర్మణి సంస్థితాః,
నృపతీనా మయం యోగో భవే త్కలశసంజ్ఞితః. 96

నవమైకాదశముల యందు శుభగ్రహములు దశమస్థానమున పాపగ్రహములు నుండిరేని కలశ యోగము. ఈయోగమందుఁ బుట్టినవాఁడు నేర్పుగల రాజగును.

త్రయో గ్రహాభ్రాతృసుతాయసంస్థాస్తదాశుభౌ ద్వౌరిపుసంజ్ఞితౌ చ,
కళత్రలగ్నం చ గతౌ చ శేషౌ నృపస్య యోగః ఖలుపూర్ణకుంభః.

గ్రహము లన్నిటిలో తృతీయపంచమలాభస్థానములయందు మూఁడు గ్రహములు ఆరింట రెండుశుభగ్రహములు శేషించిన రెండుగ్రహములు లగ్నకళత్రస్థానములయందు నుండెనేని ప్రభువగును ఇది పూర్ణకుంభయోగము

సువిస్తరం నీచకులోద్భవామయా
విచిత్రరూపాః కథితాః క్షితీశ్వరాః,
అతః పరం పార్థివవంశజన్మనాం
భవంతి యోగా మునిభిః ప్రకీర్తితాః. 98

నీచకులోద్భవులు (అనఁగాః పరంపరాప్రాప్తమగు రాజ్యమును పాలించువంశములుగాక తదన్యవంశజులు) రాజ్యాధిపత్యము సేయుం రాజయోగములు అనేకములుగఁ జెప్పఁబడినవి. ముందు పరంపరాప్రాప్తమగు రాజవంశమందుఁ బుట్టినవారి రాజయోగములను పూర్వశాస్త్రానుసారము చెప్పఁబోవుచున్నాను.

సింహోదయే దినకరో మృగలాంఛనో వా
కుంభస్థితో రవిసుతస్స్వగృహే సురేజ్యః,

స్వోచ్చేఽపి భూమితనయః పృథివీశ్వరస్య
జన్మప్రద స్సకలలోకనమస్కృతస్య. 99

లగ్నము సింహము. లగ్నమున రవి లేక చంద్రుఁడు, కుంభమున శని, స్వక్షేత్రమున బృహస్పతి, మకరమున కుజుఁడు ఇట్లుండ రాజవంశజుఁడు రాజ్యాధిపతి యగును.

శుభే లగ్నం యాతే బలవతి తథా ధర్మరాశిం క్రమేణ
శుభై శ్చైషైర్లగ్నం ధనగృహమథత్ర్యాయషట్కర్మగై శ్చ,
మహీపాలశ్శ్రీమాన్భవతి నియతం యస్య మాతంగసంఘాః
ప్రయాణే మేఘానాం స్రుతమదజలై ర్భ్రాంతి ముత్పాదయంతి.100

శుభగ్రహములలో బలవంతుఁడైన శుభుఁడొకఁడు లగ్నమునను తక్కిన ముగ్గురు శుభులు. క్రమముగ ౧-౨-౯ స్థానములను లేక శుభగ్రహములు నలుగురు క్రమముగ ౩ ౬ ౧౦. ౧౧. స్థానములయందును ఇట్లుండ రాజవంశజుఁడు గజైశ్వర్యముగల నరేంద్రుఁడగును.

సురపతిగురుర్బంధు స్థానే స్వవేశ్మగతో యదా
తుహినకిరణస్సంపూర్ణాంగ స్తప స్సమవస్థితః,
త్రితనుభవనప్రాప్తాశ్శేషా గ్రహాః యది భూపతి
ర్భవతి ధృతిమాన్స్ఫీతశ్రీక స్తథా బహువాహనః. 101

జన్మలగ్నమునకు చతుర్థస్థానము గురుక్షేత్రమై బృహస్పతి యుండి పూర్ణచంద్రుఁడు నవమస్థానమునను తక్కినరవికుజబుధశుక్రశనులు ౧-౩ స్థానములయందుండి రేని రాజవంశజుఁడు, అధికసంపత్తుగల ప్రభువగును.

స్వోచ్చోపేదయే కృతపదః కుముదస్య బంధు
ర్జీవోఽర్థగోవణిజిదానవపూజితశ్చ,
కన్యాజసింహగృహగాబుధభౌమసూర్యా
శ్చంద్రాంశునిర్మలయశా భవతి క్షితీశః. 102

లగ్నము వృషభము,లగ్నమున చంద్రుఁడు, ద్వితీయమున గురుఁడు, తులయందు శుక్రుఁడు, కన్య మేష సింహములయందు క్రమముగ బుధకుజసూర్యులు ఇట్లుండ రాజవంశజుఁడు. అధికయశస్సుగల నరేంద్రుఁడగును.

నక్షత్రనాథసహిత స్సవితా నభస్థ
స్సౌరిర్విలగ్నభవనే హిబుకే సురేజ్యః,
దేవారిపూజ్యబుధభూమిసుతైస్సలాభైః
ఖ్యాతో మహీపతిరిహ స్వగుణైర్నరస్స్యాత్. 103

దశమస్థానమున రవిచంద్రులు, లగ్నమున శని, చతుర్థమున గురుఁడు, ఏకాదశమున కుజబుధశుక్రులు ఇట్లుండ రాజవంశజుఁడు, రాజగును.

మృగరాశిం పరిత్యజ్య స్థితో లగ్నే బృహస్పతిః,
కరోత్యవశ్యం నృపతిం మత్తేభపరివారితమ్. 104

మకరముగాక తక్కినరాసులలో నొకటి లగ్నమై లగ్నమున బృహస్పతియుండెనేని పరంపరాప్రాప్తరాజవంశజుఁడు, గజాద్యైశ్వర్యముగలరాజగును. (పరంపరాప్రాప్త రాజవంశజుఁడు అనుపద మంకట తెలియఁ దగిన దనుట)

లగ్నే భౌమో రవిజసహిత స్తీక్ష్ణరశ్మిః ఖమధ్యే
వాచాం స్వామీ దశమగృహగో భార్గవస్సప్తమస్థః,
ఆయే హేమశ్శిశిరకిరణో బంధురాశిం ప్రపన్నో
యద్యేవం స్యాద్విపులయశసో జన్మభూపాలకస్య. 105

లగ్నమున కుజుఁడు, దశమమున రవిగురుశనులు, సప్తమమున శుక్రుఁడు, ఏకాదశమున బుధుఁడు, చతుర్థమున చంద్రుఁడు ఇట్లుండఁ బుట్టినవాఁడు ప్రబలయశస్సుగల నరేంద్రుఁ డగును.

న్యూనోఽపి కుముదబంధుస్స్వోచ్చస్థ పార్థివం కరోతి నరం,
కింపున రఖండమండల కరనికర ప్రకటితదిగంతః 106

క్షీణచంద్రుఁడు ఉచ్చయందుండెనేని రాజకులజుఁడు పృథివీపతియగును. పూర్ణచంద్రుఁడుండెనేని నిశ్చయముగ పృథివీపతి యగును. సందియము లేదు

లగ్నం విహాయ కేంద్రే సకలకలాపూరితో నిశానాథః,
విదధాతి మహీపాలం విక్రమధనవాహనోపేతమ్. 107

లగ్నముగాక తక్కినకేంద్రములయందు పూర్ణచంద్రుఁ డుండెనేని రాజవంశజుఁడు పరాక్రమము మొదలైనవిగల మహీపాలుఁడగును.

యది పశ్యతి దానవార్చితం వచసామధిప స్తదా భవేత్,
నృపతిర్బహునాగనాయకో భుజగేంద్ర ఇవ ప్రతాపవాన్. 108

బృహస్పతి శుక్రునిచేఁ జూడఁబడెనేని అనేకవిమానములుగల రాజగును.

దివౌకసాం పతేర్మంత్రీ కుర్యాత్పశ్యన్పృథం యదా,
శిరోభిశ్శాసనం యస్య ధారయంతి నృపా స్సదా. 109

బుధుఁడు గురునిచేఁ జూడఁబడెనేని ప్రతాపముగల ప్రభువగును.

లగ్నాధిపతిస్స్వోచ్చే పశ్యన్మృగలాంఛనం నృపం కురుతే,
బహుగజతురగబలాఢ్యైః క్షపితవిపక్షం మహావిభవమ్. 110

లగ్నాధిపతి యుచ్చయందుండి చంద్రుని జూచిన అనేకగజములు మొదలైన
నవిగల రాజగును.

ఇందుస్స్వోచ్చే పశ్యన్కరోతి బుధభార్గవౌ నరం నృపతిం,
ప్రణతారిపక్ష ముచ్ఛ్రితయశసం సౌభాగ్యవంతం చ. 111

జననకాలమున ఏరాశియందైనను బుధశుక్రులుండి ఉచ్చస్థచంద్రునిచేఁ జూడఁ
బడఁగాఁ బుట్టినరాజు ప్రతాపముగల నరేంద్రుఁడగును.

అధిమిత్రాంశగ శ్చంద్రో దృష్టో దానవమంత్రిణా,
అనిశం కురుతే లక్ష్మీ స్వామినం భూపతిం నరమ్. 112

చంద్రుఁడు అధిమిత్రగ్రహనవాంశను పొంది శుక్రునిచేఁ జూడఁబడెనేని
ఐశ్వర్యముగల రాజగును.

స్వాంశేఽథమిత్రభాగేవా గురుణా యద దృశ్యతే,
శశీ మహీపతిం కుర్యా ద్దివసే నాత్రసంశయః 113

చంద్రుఁడు స్వాంశయందును, లేక మిత్రనవాంశయందున నుండి గురునిచేఁ
జూడఁబడెనేని పగటియందుఁ బుట్టినవాఁడు నిస్సందియముగ మహీపతి యగును.

జన్మాధిపతిః కేంద్రే బలపరిపూర్ణః కరోతి పరమార్థిం,
బ్రాహ్మణకులేఽపి నృపతిం కింపున రవనీశసంభూతమ్. 114

జన్మకాలికచంద్రలగ్నాధిపతి బలవంతుఁడై కేంద్రమందుండెనేని బ్రాహ్మణ
కులజుఁడైనను నరేంద్రుఁడగును; గాన రాజకులజుఁడు నిశ్చయముగ నరేంద్రుఁడగును.

రవిరప్యధిమిత్రస్థో యది చంద్రసమీక్షితః,
అంగదేశాధిపం కుర్యాద్ధర్మార్థసహితం నృపమ్. 115

సూర్యుఁడు అధిమిత్రగ్రహస్థానమందుండి చంద్రునిచేఁ జూడఁబడెనేని అంగ
దేశాధిపతి యగును.

ఉచ్చస్థశ్శశితనయః కుముదాకరబంధునా చ సమధిగతః,
జనయతి మగధాధిపతిం గజమదగంధేన వాసితదిగంతమ్. 116

బుధుఁడుచ్చస్థుఁడై చంద్రునితో కలిసియుండెనేని గజాద్యైశ్వర్యముగల మగధ దేశాధిపతి యగును.

ప్రధానబలసంయుక్త స్సంపూర్ణ శ్శశిలాంఛనః,
ఏకోఽపి కురుతే జాతం నరాధిప మరిందమమ్. 117

పూర్ణచంద్రుఁడు ఒక్కఁడైనను స్థానాదిషడ్బలయుక్తుఁడై యుండెనేని పరాక్రమముగల నరేంద్రుఁడగును.

కేంద్రే విలగ్ననాథశ్శ్రేష్ఠబలో మానవాధిపం కురుతే,
గోపాలకులోఽపి నరం కింపున ర్వసుధేశ్వరాణాం చ. 118

లగ్నాధిపతి బలయుక్తుఁడై కేంద్రమందుండెనేని గొల్లవాఁడైనను నరేంద్రుఁడగును

కర్కటసంస్థః కేంద్రే బృహస్పతిర్దశమధామగశ్శశినః,
చతురుదధిమేఖలాయాస్స్వామీ భూమేర్భవతి జాతః. 119

కేంద్రములలో నొకటి కర్కటమై బృహస్పతియందుండి అది చంద్రస్థానమునకు దశమమగు నెడ చతుస్సముద్రపర్యంతము నేలు చక్రవర్తియగును.

మేషే సహస్రరశ్మిస్సహ శశినా సంస్థితః కరోతీశం,
కేరళకర్ణాటాంధ్రద్రవిడానాం చోలకస్యాపి. 120

మేషమున రవిచంద్రు లుండిరేని కేరళాదిదేశాధీశుఁడగును.

ఉచ్చస్థస్త్రిదశగురుః కైరవవనబంధుసంగమం ప్రాప్తః,
కాశ్మీరమండలభువాం కరోతి పురుషాధిపమవశ్యమ్. 121

గురుఁడు ఉచ్చయందుండి చంద్రునితో కలిసియుండెనేని కాశ్మీరాదిదేశముల కధిపతి యగును.

తుంగాయ స్వగృహోదయ కంటకనవమేషు యస్య శుక్రగురూ,
సోఽవశ్యం భవతి నరో రాజాంశసముద్భవో నృపతిః. 122

జననకాలమున ఉచ్చ లాభ స్వక్షేత్ర లగ్న కంటక నవమములయందు గురుశుక్రులుండిరేని నృపతి యగును.

దిక్స్థానకాలాదిబలై రుదారా
శుభాః పునః కేంద్రముపాగతాశ్చ,
కుర్వంతి పాపై రవిమిశ్రచారాః
పృథ్వీభుజం త్రిప్రభృతిగ్రహేంద్రాః. 123

ముగ్గురు మొదలగు శుభగ్రహములు స్థానాదిషడ్బలయుక్తులై పాపగ్రహములతో కలియక కేంద్రములయందుండిరేని భూపతి యగును.

రవేర్ద్వితీయే బుధజీవభార్గవా
న చాశుభైర్దృష్టయుతా నవార్కగాః,
స్ఫురత్కరౌఘస్ఫుటపింజరీకృతా
నరం ప్రకుర్యుస్త్రిసముద్రపాలకమ్. 124

సూర్యునకు ద్వితీయమందు బుధగురుశుక్రులు పాపగ్రహములతో కలియకయుం అస్తంగతులు గాకయుం స్ఫుటతేజస్సు గలవారైయుండిరేని (సూర్యునకు దూరవర్తుల నుట) నరేంద్రుఁ డగును.

కుందాబ్జకాశధవళః పరిపూర్ణమూర్తి
ర్జన్మాధిపేన కవినా శుభదేన దృష్టః,
స్త్రీమానభంగనిపుణం దయితః కుపాయాః
ప్రఖ్యాతకీర్తిసునయం కురుతే నరేంద్రమ్. 125

పూర్ణచంద్రుఁడు జన్మకాలికచంద్రలగ్నాధిపతి శుక్రుఁడై అశుక్రునిచేతను లేక శుభునిచేతను జూడఁబడెనేని స్త్రీలయం దాసక్తిగలిగినట్టియుం ఖ్యాతి మొదలైనవి గల ప్రభువగును.

దేవమంత్రీ కుటుంబస్థో భార్గవేణ సమన్వితః,
జనయేద్వసుధాపాలం నిర్జితారాతిమండలమ్. 126

ద్వితీయమున గురుశుక్రు లుండిరేని శత్రుజయము జేసి భూమిని పాలించు రాజగును.

కారకయోగే జాతా భవంతి పృథ్వీభుజో నరాస్తేషాం,
గజతురగపత్తివిచలితరజోవితానం భవేద్గగనమ్. 127

కారకయోగమందుఁ బుట్టినవారు అనేకపరివారాదికముగల నరేంద్రులగుదురు. (కారకయోగములు వెనకఁ జెప్పఁబడినవి.)

కుజే విలగ్నే తరణేశ్చ నందనే
రసాతలే శుక్రబృహస్పతీందుజాః,
మృగోదయే మందనవాంశకస్థితే
రసాతలేశో భవతీహ పార్థివః. 128

లగ్నమున కుజశనులు చతుర్థమున బుధగురుశుక్రులు శనినవాంశగల మకరలగ్నము ఇట్లుండఁ బుట్టినవాఁడు రసాతలాధిపతియగు (అమెరికాది దేశాధిపతి) రాజగును.

స్వోచ్చే గురుస్తనుగతస్స్వగృహే శశాంక
శ్శుక్రో ఝషే పరమ ముచ్చమితోఽసితశ్చ,
మేషే తథైవ భగవాన్సవితా కుజస్స్వ
వర్గాధిపో యది భవే న్నృపతిః ప్రజాతః. 129

లగ్నము కర్కాటకము, లగ్నమున గురుచంద్రులు, మీనమున శుక్రుఁడు, తులయందు పరమోచ్చతుల్యుఁడై శని, మేషమున రవికుజులు ఇట్లుండిన రాజాధిరాజు అగును.

శక్రేడ్యస్ససితశ్శుచిస్తిమియుగే స్వోచ్చే చ పూర్ణశ్శశీ,
దృష్టస్త్రీప్రవిలోచనేన దివికృన్మేషే యదాసౌ నృపః,
సేనాయాశ్చలనేన రేణుపటలైర్యస్య ప్రనష్టే రవా
వస్తభ్రాంతిసమాకులా కమలినీ సంకోచ మాగచ్ఛతి 130

మీనమున అస్తాదిదోషములను పొందని గురుశుక్రులు, వృషభమున పూర్ణచంద్రుఁడు, మేషమున రవియుండి కుజునిచేఁ జూడఁబడెనేని రాజవంశజుఁడు, ప్రబల సేన మొదలైనవిగల నరేంద్రుఁడగును.

క్రూరైర్నీచైరిపుభవనగై ష్షష్ఠదుశ్చిక్యగైర్వా
సౌమ్యైస్స్వోచ్చం పరముపగతై ర్నిర్మలైః కేంద్రగైశ్చ,
ఆజ్ఞాం యాతే శిశిరకిరణే కర్కటస్థే నిశాయా
మేకచ్ఛత్రం త్రిభువనమిదం యస్య సత్పుత్రియేశః 131

జననకాలమున రవికుజశనులు నీచలయందును శత్రుక్షేత్రములయందును లేక తృతీయషష్ఠములయందును నుండుట, బుధగురుశుక్రులు పరమోచ్చయందును, లేక కేంద్రములయందును నుండుట, చంద్రుఁడు దశమమున కర్కాటకమందు రాత్రి జన్మ ఇట్లుండఁగాఁ బుట్టినవాఁడు రాజాధిరాజై త్రిభువనములను అడ్డులేక పాలించువాఁడగును. త్రిభువనములనఁగా భూలోకము, భువర్లోకము, సువర్లోకము అనుట.

నిరక్షము(ఈక్వేటర్)నకు దక్షిణభాగము భూర్లోకమనియు, నిరక్షమునకు ఉత్తరభాగము భువర్లోకమనియు, ఉత్తరధ్రువప్రాంతము (అనఁగా ఇలావృతము) స్వర్లోక మని యిందుకు ప్రమాణము. సిద్ధాంతశిరోమణియందు శ్లో "భూర్లోకాఖ్యో దక్షిణే వ్యక్షదేశాత్తస్మాత్సౌమ్యోఽయం భువస్స్వశ్చ మేరుః" అని యున్నది.

హోరా లేఖాముపేతస్స్ఫుటకరనికరైః పూరితాంగస్సురేజ్య
శ్చంద్రశ్శుక్లార్ధదేహో భవభవనగతస్సోమపుత్రేణ దృష్టః,
చంద్రాద్భానుర్ద్వితీయే యది భవతి తదా నైవ దృష్టః కుజేన
పాతా జాయేత భూమేర్బహుగజతురగక్షుణ్ణభూపృష్ఠపీఠః 132

జననకాలమున స్ఫుటకరణుఁడు (సూర్యునకు దూరవర్తి) అయిన బృహస్పతి లగ్నముననుండుటయు, ఏకాదశస్థానమున పూర్ణచంద్రుఁడుండి బుధునిచేఁ జూడఁబడుటయు, చంద్రునకు ద్వితీయమందు సూర్యుఁడుండి కుజునిచేఁ జూడఁబడకయుండుటయుం ఇట్లుండ గజాదులుగల నరేంద్రుఁడగును. ఏప్రదేశమందు ఆకాశము భూమి నంటినట్లు గనఁబడునో ఆప్రదేశము లేఖాశబ్దముచేఁ జెప్పఁబడును క్షితిజమనిభావము.

రవిశశికుజైర్మేషేలగ్నే సితార్కిబుధై ర్దృష్టే
ధనుషి నవమే దేవేజ్యే చ స్వభాంశ ముపాగతే,
రవిరపి యది స్వోచ్చే వర్గే ప్రధానబలోదయో
భవతి నృపతి ర్విద్వాన్ జాతో మహాతారిగణోద్భవః. 133

లగ్నము మేషమై రవిచంద్రకుజబుధశుక్రశనులచేఁ జూడఁబడియు, నవమస్థానమగు ధనస్సుయందైన స్వాంశయందు గురుఁడుండుటయున్ను, బలవంతుఁడగుసూర్యుఁడు స్వోచ్చస్వవర్గములయందుండి లగ్నగతుఁడాయెనేనియుం విద్వాంసుఁడైనట్టియుం పరాక్రమము గలిగినట్టియుం రాజగును.

సితశశిసుతజీవైః పంచమస్థై ర్నభోగై
రవిరపి రిపురాశౌ స్వోచ్చగే భూమిపుత్రే,
తపసి చ రవిపుత్రే జాయతే పార్థివేంద్రః
ప్రథితవిమలకీర్తి ర్దానధర్మప్రతాపైః. 134

పంచమస్థానమున బుధగురుశుక్రులు, ఆఱింట సూర్యుఁడు, కుజుఁడుచ్చయందు, తొమ్మిదింట శని ఇట్లుండ పార్థివేంద్రుఁడగును.

త్రిదశగురో రవి ర్హిమకరస్య భృగో _స్తనయో
రవితనయః కుజస్య ఖలు దృష్టిపథం గతః,
భవతి విలగ్నగో యది చరోదయరాశిగతః
ప్రథితయశా భవేత్క్షితిపతిః క్షపితారిగణః 135

రవి గురునిచేతను, శుక్రుఁడు చంద్రునిచేతను, శని కుజునిచేతను జూడఁబడి చరరాశి లగ్నమయ్యేనేని ప్రతాపముగల రాజగును.

బుధః కన్యాలగ్నే సురపతిగురుశ్చైవ తిమిగః
స్థితః క్షోణీపుత్రః ప్రసవభవనే వీర్యసహితః,
శనిశ్చతుర్స్థానే త్రిదశరిపుపూజ్యశ్చ హిబుకే
యదైవం స్యాత్సూతౌ స్వభుజవిజయీ భూపతిరిహ 136

కన్యాలగ్నము లగ్నమున బుధుఁడు, మీనమున గురుఁడు, మకరమున బలయుక్తుఁడైన కుజుఁడు, కుంభమున శని, చతుర్థమున శుక్రుఁడు ఇట్లుండ పరాక్రమముగల నరేంద్రుఁ డగును.

యమే విలగ్నే మకరప్రతిష్ఠితే
దివాకరే ద్యూనగతే సితేఽష్టమే,
కుజేఽలిగే కర్కటకే నిశాకరే
భవేత్ప్రసిద్ధో జగతీశ్వరో నృపః. 137

మకరము లగ్నము, లగ్నమున శని, సప్తమమున రవి, అష్టమమున శుక్రుఁడు, వృశ్చికమున కుజుఁడు, కర్కటకమున చంద్రుఁడు ఇట్లుండ ప్రసిద్ధిగల రాజగును.

మృగోదయే భూమిసుతే సునిర్మలే
శనైశ్చరే ధర్మగృహే వ్యవస్థితే,
దివాకరే సప్తమగే సహేందునా
చలస్వభావో నృపతిః ప్రజాయతే. 138

లగ్నము మకరము, లగ్నమున కుజుఁడు, తొమ్మిదింట శని, సప్తమమున రవి చంద్రులు ఇట్లుండ చంచలస్వభావముగల ప్రభువగును.

శనైశ్చరే లగ్నగతే సచంద్రే బృహస్పతౌ సప్తమరాశిగే చ,
శుక్రేణ దృష్టే శశిజే స్వతుంగే జాయేత పృథ్వీపతి రప్రధృష్యః.

లగ్నమున చంద్రశనులు, సప్తమమున గురుఁడుండి శుక్రునిచేఁ జూడఁబడెనేనియు, బుధుఁడు తనయుచ్చయందుండెనేనియు నిట్లుండ పరాక్రమముగల నరేంద్రుఁ డగును.

చాపే భవేత్సురగురుర్హ్యతదృష్టిశుద్ధో
లగ్నే సురారిదయితశ్శశిని స్వరాశౌ,
వాపీతడాగసురవేశ్మకరో నరోఽత్ర
జాయేత మానవపతిర్ద్విజదేవభక్తః. 140

ధనుస్సునందు బృహస్పతి పాపదృష్టి లేనివాఁడైయుండియు, లగ్నమున శుక్రుఁడు, కర్కటమున చంద్రుఁడు ఇట్లుండ దేవబ్రాహ్మణభక్తి సత్కార్యాసక్తి మొదలైనవిగల రాజగును.

ఏకస్స్వోచ్చే శుభగగనగస్సంస్థితో నిర్మలాంశుః
కేంద్రే భానుః ప్రకటితకరః కేవలః పూర్ణవీర్యః,
దృష్టః కుర్యా దమరగురుణా పంచమస్థే నజాతం
భూమేర్నాథం బహుగజపతిం సర్వవంద్యం కృతార్థమ్. 141

స్వచ్ఛమైనకాంతి (సూర్యునకు దూరవర్తి) గల యొకశుభగ్రహము ఉచ్చయందును బలయుక్తుఁడైన సూర్యుఁడు కేంద్రమందును యుండి పంచమమందున్న గురునిచేఁ జూడఁబడెనేని భూపతి యగును.

షష్ఠే కుజార్కిరవయస్సహజేఽథ వాఽపి
సింహే సురారిసచివోఽథ భవర్గసంస్థః,
దృష్ట శ్శుభై ర్దినకరేందువిహీనదృష్టః
కుర్యాన్నృపం స్వభుజనిర్జితశత్రుపక్షమ్. 142

రవికుజశనులు ఆఱింటను లేక మూఁడింటను, సింహమున శుక్రుఁడు లేక ఏకాదశస్థానమున నుండి శుభదృష్టిగలిగిని రవిచంద్రదృష్టి లేక యుండెనేని బలముగల రాజగును.

వహతి మృదుశరీరే నిర్మలవ్యోమమధ్యే
విమలనిరుపసర్గాః ఖేచరావృత్తవైరాః,
ఉదయతి సురవంద్యే మండలే మాతృకాణాం
యది వృషభగృహస్థో భార్గవస్స్వోక్షితీశః. 143

లగ్నమందు గురుఁడు, వృషభమందు శుక్రుఁడు ఇట్లుండిరేని రాజగును.

శశిబుధరుధిరాఖ్యైస్స్వస్వాంశకస్థైర్న నీచైః
వ్యయగృహసహజస్థైర్నాపి సూర్యప్రవిష్టైః,
తనయభవనసంస్థే వాక్పతౌ చంద్రయుక్తే
భవతి మనుజనాథః కీర్తిశుక్లీకృతాశః. 144

జననకాలమున చంద్రకుజబుధులు నీచను బొందకను అస్తంగతులు గాకను యుండి తృతీయవ్యయములయందైన స్వాంశలయం దుండఁగా పంచమమున చంద్రగురులు కలిసియుండిరేని కీర్తిగలరాజగును.

అధిమిత్రగృహే కేంద్రే జన్మాధిపతిర్విలగ్నపతియుక్తః,
పశ్యతి బలపరిపూర్ణో లగ్నం స్యాత్పుష్కలో యోగః. 145

జన్మకాలికచంద్రలగ్నాధిపతికి కేంద్రములలో నొకటి యధిమిత్రస్థానమై అందు లగ్నాధిపతితోఁ గలిసి లగ్నమును జూచెనేని పుష్కలయోగమని తెలియవలయు.

పుష్కలయోగే పురుషా జాయంతే భూమిపాలకా నిత్యం,
సుచిరం భ్రమంతి హతరిపుగజమదగంధేన వాసితదిగంతః 146

పుష్కలయోగమందుఁ బుట్టినవాఁడు శత్రుహింసజేయు రాజగును.

రాశ్యాదౌ లగ్నపతిః కరోతి జాతం నరేంద్రదండపతిం,
మధ్యే మండలనాథం గ్రామపతిం చైవ భవనాంతే. 147

లగ్నాధిపతి రాశ్యాదినవాంశయందుండెనేని రారాజు అగును. మధ్యనవాంశ (పంచమనవాంశ) యం దుండిన మండలాధిపతి యగును. రాశ్యంతిమ నవాంశయం దుండెనేని గ్రామాధిపతి యగును.

పౌష్ణే ఫాల్గున్యాం వా మూలే పుష్యే చ భాస్కరః కురుతే,
లగ్నగతో నరనాథం యోజనశతమాత్రకే దేశే. 148

పుష్యమి పూర్వఫల్గుని ఉత్తరఫల్గుని మూలరేవతి ఈనక్షత్రములయందు సూర్యుఁ డుండి లగ్నగతుఁ డాయెనేని శతయోజనపరిమితిగల భూమిని పాలించువాఁడగును.

కృత్తికా రేవతీ స్వాతీ పుష్యస్థాయీ భృగోస్సుతః,
కరోతి భూభుజాం నాథ మశ్విన్యామపి సంస్థితః. 149

అశ్విని కృత్తిక పుష్యమి స్వాతి రేవతి ఈనక్షత్రములయందు శుక్రుఁ డుండె నేని ప్రభువగును.

విదధాతి సార్వభౌమం లగ్నాంశపతిస్స్వతుంగగః కేంద్రే,
నృపతిం లగ్నాధిపతి ర్జన్మాధిపతి ర్ధనసమృద్ధమ్ 150

లగ్నగతనవాంశాధిపతి కేంద్రములయం దైన తనయుచ్చయం దుండెనేని సార్వభౌముఁడగును లగ్నాధిపతి కేంద్రములయం దైన తనయుచ్చయందుండెనేని రాజగును. చంద్రాక్రాంతరాశ్యాధిపతి కేంద్రమున ఉచ్చగతుఁ డగునేని అధికధనికుఁడగును.

మీనే నిశాకరః పూర్ణస్సుహృద్గ్రహనిరీక్షితః,
సార్వభౌమం నరం కుర్యాత్సిద్ధాజ్ఞాకం న సంశయః. 151

పూర్ణచంద్రుఁడు మీనమందుండి మిత్రులచేఁ జూడఁబడెనేని సార్వభౌముఁడగును.

యాతే భౌమే కర్మస్థానం
శశిశని భృగుబుధై స్తపస్సమవస్థితైః,
ఆయే స్వోచ్చే ప్రాప్తో భాను
స్త్రిదశపతిసచివసహితో యది ప్రసవే భవేత్. 152
క్షోణీ భర్తా యానే యస్య
ప్రవిచలితతురగరజసా దిశః పరితో గతాః,
ఏవం కర్తు ర్భ్యాయోభూయో
ధరణితలపరిమలసుఖం ప్రయాతి రవేర్హయాః. 153

మిథునము లగ్నము, దశమస్థానమున కుజుఁడు నవమస్థానమున చంద్రబుధ శుక్రశనులు, మేషమున రవిగురులు ఇట్లుండఁ బుట్టిన రాజవంశజుఁడు, అనేకగుఱ్ఱములు మొదలైన సేనలుగల నరేంద్రుఁడగును.

శశిసహితే కేంద్రస్థే శనైశ్చరే భవతి జారజాతస్తు,
రాజా భువిగతతురగగ్రామధనై ర్వర్ధిత శ్రీః. 154

చంద్రశనులు కలిసి కేంద్రములయందుండఁగాఁ బుట్టినరాజు జారత్వమువలనఁ బుట్టినవాఁడును, అధికసంపత్తు ఏనుఁగులు మొదలైనవిగల నరేంద్రుఁడగును.

శుక్రవాక్పతిబుధైర్ధనసంస్థైః ర్ద్యూనగైశ్శశిరవిక్షితిపుత్రైః,
జాయతే క్షితిపతిః పృథువక్షాస్సర్వతః క్షపితశత్రుసమూహః. 155

జన్మలగ్నమునకు ద్వితీయస్థానమున బుధగురుశుక్రులు కలిసియున్నను లేక సప్తమమున రవిచంద్రకుజులు కలిసియున్నను ఇట్లుండఁ బుట్టిన రాజవంశజుఁడు, పరాక్రమముగల నరేంద్రుఁడగును.

భానుః ప్రాణీ శశిగృహయుతశ్శీతరశ్మిశ్చ తస్మి
న్నేకస్థోచ్చే యది గగనగో నిర్మలః పూర్ణరశ్మిః.
లగ్నం ప్రాప్తస్సురపతిగురుష్షష్ఠగస్స్యాత్క్షితీశ
శ్చనోన్న యస్య ప్రచలితచమూరేణుభగ్నోవ్యోమమార్గః. 156

కర్కాటమున బలయుక్తులైన రవిచంద్రులు ఉచ్చగతగ్రహము బలయుక్తుఁడై లగ్నమందును, గురుఁడారింటను ఇట్లుండెనేని అనేకసేనగల నరేంద్రుఁడగును.

కుంభస్యాష్టమభాగే త్రికోణసంస్థే నిశానాథే,
జాతో భవత్యవశ్యం రాజా శుభదస్సమస్తలోకస్య 157

త్రికోణస్థానముగుకుంభరాశియందైన ఎనిమిదవభాగయందు చంద్రుఁడుండెనేని సర్వలోకమునకు అధిపతి యగును.

మేషస్య సప్తమాంశే కరోతి పృథ్వీసుతస్థ్సితో నృపతిం,
సింహస్య పంచమాంశే నరమిథునాంశే భవే ద్భూపః 158

మేషసప్తమభాగయందును లేక సింహరాశియందైన పంచమభాగయందును గాని లేక మిథుననవాంశయందునుగాని కుజుఁడుండెనేని రాజగును.

కుంభస్య పంచదశకే భాగే చంద్రస్థితో మహీపాలం,
కర్కాటకస్య చ దశమే కరోతి పురుషం సదా ప్రభవే. 169

రాశిని ముప్పదిభాగములు సేయఁగా నొక్కొక్కభాగమునకు భాగ యనఁబడును. కుంభరాశియందైన ౧౫ నవభాగయందును లేక కర్కాటకమందైన పదియవ భాగయందును చంద్రుఁడుండెనేని భూపాలకుఁడగును.

ధనుషిచ వింశే జీవః కరోతి నృపతిం స్థితో జనఖ్యాతం,
సింహస్య పంచమాంశే తథా చ హేళిర్బుధో జ్ఞేయః. 160

ధనుస్సుయొక్క వింశాంశయందు గురుఁడుగాని లేక సింహముయొక్క పంచమాంశయందును రవిబుధులుండిరేని ఖ్యాతిగల రాజగును.

ఏకస్మిన్పంచకస్తా పంచదశస్యాస్థితశ్చంద్రః,
భాగేషు వీరనృపతిం కరోతి భుజలబ్ధపృథ్వీకమ్. 161

ఏరాశియందైనను నిరువదైదవభాగయందును, పంచదశాంశయందును చంద్రుం డుండెనేని భుజబలముగల నరేంద్రుఁడగును.

మకరస్య పంచమాంశే కరోతి రవిజో నరేశ్వరం సుభగం,
యోగే భూతలతిలకం ధర్మజ్ఞం శాస్త్రనిరతం చ 162

మకరపంచమాంశయందు శనియుండెనేని ధార్మికుఁడు,శాస్త్రజ్ఞుఁడైన నరేంద్రుఁడు సౌందర్యవంతుఁడు అగును.

కర్కటకే శశిజీవౌ పంచసు భాగేషు సంస్థితౌ కురుతః,
భూమిపతి మప్రధృష్యం రవిరివ సర్వగ్రహగణస్య. 163

కర్కటకము.యొక్క మొదటిఅయిదుభాగలయందు చంద్రగురులుండిరేని అడ్డు లేక భూమినిపాలించు ప్రభువగును.

చంద్రః పుష్యే నృపతిం వర్గోత్తమకృత్తికాశ్వినీసంస్థః,
విదధాతి సార్వభౌమం త్రిపుష్కరేవాఽపి పరిపూర్ణః. 164

చంద్రుఁడు అశ్విని కృత్తిక పుష్యమి నక్షత్రములయందును వర్గోత్తమ మందును నుండెనేని సార్వభౌముఁడు (సర్వదేశాధిపతి) యగును పూర్ణచంద్రుఁడు తృతీయ దశమస్థానములయందుండిన రాజగును.

అశ్విన్యనురాధాస్థస్త్విత్శ్రవిష్ఠాసు పార్థివం భౌమః,
కురుతే స్వోచ్చ ముపగతో వర్గోత్తమగశ్చ నాన్యత్ర. 165

కుజుఁడు అశ్విని అనూరాధ ధనిష్ఠ నక్షత్రములయందును, ఉచ్చయందును, వర్గోత్తమమందును నుండెనేని నరేంద్రుఁడగును, తదితరములయందుండెనేని రాజ యోగము లేదు.

వ్యోమ్ని శంఖధవళో నిశాకరో భార్గవస్తపసి సంస్థితశ్శుచిః,
ఆయగాశ్చ యది సర్వఖేచరాః స్యాన్మహీపతిరతుల్యపౌరుషః. 166

దశమస్థానమున పూర్ణచంద్రుఁడు, నవమమున శుక్రుఁడు, తక్కిన గ్రహము లన్నియుం ఏకాదశస్థానమునను నుండెనేని అధికపౌరుషముగల నరేంద్రుఁడగును.

చంద్రాదుపచయసంస్థా గగనసదస్సర్వఏవ యది సూతౌ,
జాయేత మాననిలయస్సమస్తపృథ్వీపతిః పురుషః. 167

చంద్రునివల్లనుంచి ౩-౬-౧౦-౧౧ స్థానములయందు గ్రహములన్నియుం నుండె నేని అభిమానము మొదలైనవిగల నరేంద్రుఁడగును.

జీవనిశాకరసూర్యాః పంచమనవమతృతీయగా వక్రాత్,
యది భవతి తదా రాజా కుబేరతుల్యో ధనైర్వాసః 168

కుజునకు ౩-౫-౯ స్థానములయందు క్రమముగ గురుచంద్రసూర్యు లుండిరేని కుబేరతుల్యుఁడగు నరేంద్రుఁడగును లేక ధనముచేతనైనను కుబేరతుల్యుఁడగును

రవిస్తృతీయే భృగునందనస్సుఖే
బుధస్య చాన్యే యది పంచమే స్థితాః,
న నీచరాశౌ న చ శత్రువేశ్మగా
భవేన్నరేంద్రస్త్రిసముద్రపాలకః 169

బుధునకు తృతీయమున రవి, చతుర్థమున శుక్రుఁడు తక్కినగ్రహములు పంచమస్థానమునను నుండి నీచను శత్రుక్షేత్రమును బొందకయుండిరేని మూడుసముద్రముల పర్యంతము పాలించు ప్రభువగును.

బృహస్పతేర్ఖామదివాకరేందవో
గతా ద్వితీయాంబునభఃస్థలం క్రమాత్,
విపక్షరాశౌ పరిశేషఖేచరా
యదా తదా భూమిపతిర్నృపాత్మజః 170

గురునకు ౨-౪-౧౦ స్థానములయందు క్రమముగ కుజ రవిచంద్రులు అటెంట తక్కినగ్రహములు నుండిరేని భూపాలుఁడగును.

భృగోరపత్యాద్బుధభాస్కరాత్మజౌ
చతుష్టయస్థౌ పరిశేషఖేచరాః,
తృతీయలాభర్క్షగతాస్తు తే తదా
మహీపతిం కుర్యురసంశయం తదా. 171

శుక్రునకు ౧-౪-౭-౧౦ స్థానములయందు బుధశనులు, తక్కినగ్రహములు తృతీయలాభస్థానములయందును నుండిరేని నిశ్చయముగ నరేంద్రుఁడగును.

శుక్రబుధౌ రవితనయాత్కేంద్రే వాచస్పతిర్భవేదుచ్చే,
సింహాసనాధిశాయీ యది రాజా స్యోచ్చగాశ్చ పరిశేషాః. 172

శనికి కేంద్రములయందు బుధశుక్రులు, గురుఁ డుచ్చయందును నుండెనే నియుం శేషించుగ్రహములున్ను, ఉచ్చయందుండిరేని సింహాసనమున శయనించు ప్రభువగును.

సవితు స్తృతీయపంచమలాభర్క్షసమాశ్రితాస్సదా యస్య,
సర్వే గ్రహా స్సనృపతి ర్మంత్రీ సేనాపతిర్వాఽపి. 173

సూర్యునకు తృతీయపంచమైకాదశములయందు గ్రహములన్నియు నుండెనేని మంత్రి లేక సేనాధిపతియు నగును

లగ్నపతేస్స్ఫుటరశ్మేః పాపాలాభే శుభాశ్చ కేంద్రస్థాః,
యది భవతి తదా నృపతిస్స్వభుజార్జితసర్వభూమితలః 174

బలయుక్తుఁడైనట్టియుఁ స్ఫుటకిరణుఁడైనట్టియు (సూర్యునకు దూరవర్తి) లగ్నాధిపతికి ఏకాదశమున పాపగ్రహములు, శుభులు కేంద్రములయందును నుండిరేని స్వయముగ పరాక్రమముచే సర్వభూమిని సంపాదించు నరేంద్రుఁడగును.

లాభే తృతియషష్ఠే యది పాపా జన్మపస్య శుభదృష్టాః,
భవతి తదా ధరణీశస్సమస్తనృపవందితస్సాధుః 175

జన్మకాలికచంద్రలగ్నాధిపతికి 3-౬-౧౧ స్థానములయందు పాపగ్రహములు ఉండి శుభులచేఁ జూడఁబడెనేని రారాజగును.

విచరతి సురపూజ్యో మేషభేదాఽపి సింహే
దహనకిరణదృష్టే భూమిపుత్రే స్వరాశౌ.
నచ గగనవిచారి కశ్చిదేకోఽపి నీచే
యది నృపతిసముత్థో జాయతే పార్థివేంద్రః. 176

జన్మకాలమున గురుఁడు మేషమందును లేక సింహమందును నుండియుఁ కుజుఁడు స్వక్షేత్రమందుండి రవిచేఁ జూడఁబడెనేనియుఁ, సర్వగ్రహములు నీచయందుండకుండెనేనియుఁ ఇట్లుండ రాజవంశజుఁడు నృపతి యగును.

చంద్రాద్గ్రహైర్నిగదితాస్సునఫాదయశ్చ
కేంద్రస్థితైర్యది భవంతి చ తేఽత్ర యోగాః,
విశ్వంభరాధిపకులేషు మహాత్సు జాతా
యోగేషు తేషు మనుజేశ్వరతాం లభంతే. 177

చంద్రునివల్లనుంచి సునఫాగనఫా ధురుధురాయోగములు వెనక చెప్పఁబడినవి. ఆ మూఁడుయోగములలో నేదైనా నొకయోగము లగ్నాత్కేంద్రములయందు సంభవించెనేని రాజవంశమందు జన్మకలవాఁడు రాజగును.

కేంద్రగౌ యదితు జీవశశాంకౌ యస్యజన్మని చ భార్గవదృష్టౌ,
భూపతిర్భవతి సోఽతులకీర్తిర్నీచగో యది న కశ్చిదిహ స్యాత్.

చంద్రగురులు కేంద్రములయందుండి శుక్రునిచే జూడఁబడిరేనియు సర్వగ్రహములు నీచను బొందకయుండిరేనియు కీర్తిగలభూపతి యగును

ఉదయశిఖరిసంస్థో భార్గవో యత్రతత్ర
బుధరవిశశిదృష్టస్స్వాంశకస్థోఽతివీర్యః,
జనయతి నరనాథం వాక్పతౌ పంచమస్థే
భుజబలహతశత్రుం సార్వభౌమం గజాఢ్యమ్ 179

లగ్నమున శుక్రుఁడు బలవంతుఁడై స్వనవాంశయందుండి రవిబుధచంద్రులచేఁ జూడఁబడెనేనియు పంచమస్థానమున గురుఁడు ఇట్లుండ శత్రుహరము సేయు సార్వభౌముఁడగును.

సింహే కమలినీనాథః కులీరస్థో నిశాకరః,
దృష్టౌ ద్వావపి జీవేన పార్థివం కురుతస్తదా 180

సింహమున సూర్యుఁడు, కర్కాటమున చంద్రుఁడు ఇట్లుండి గురునిచే జూడఁబడిరేని నరేంద్రుఁడగును ఇచట గురునకు చతుర్థాష్టమస్థానములయందు దృష్టి అంగీకరింపఁబడినది

బుధః కర్కాటమారూఢో వాక్పతిశ్చ ధనుర్ధరం,
సూర్యభూసుతదృష్టౌ చ యది స్ఫీతో మహీపతిః 181

కర్కాటకమున బుధుఁడు, ధనుస్సునందు బృహస్పతి యుండి రవికుజులచేఁ జూడఁబడిరేని మహీపతి యగును.

శఫరీయుగళే చంద్రః కర్కాటే చ బృహస్పతిః,
శుక్రః కుంభే యదా శక్తస్తదా రాజా భవేదిహ 182

మీనమున చంద్రుఁడు, కర్కాటమున గురుఁడు, కుంభమున శుక్రుఁడు ఇట్లుండ సమర్థుఁడైనరాజగును.

సితదృష్టశ్శనిః కుంభే పద్మినీదయితో భవేత్,
చంద్రే జలచరే రాశౌ యది జాతో నృపో భవేత్. 183

కుంభరాశియందు శనియుండి శుక్రునిచే జూడఁబడియు, ఏకాదశస్థానమున రవి, కర్కాటమున చంద్రుఁడు ఇట్లుండ రాజగును.

కుజోఽలిగోఽథ మేషే వా రవిజీవనిరీక్షితః,
వృషే జ్ఞో జీవసందృష్టస్తదాఽపి పృథివీపతిః. 184

వృశ్చికమున కుజుఁడు, లేక మేషమందైనను నుండి రవిగురులచేఁ జూడఁబడియుం, వృషభమున బుధుఁడుండి గురునిచేఁ జూడఁబడియుం నుండెనేని నరేంద్రుఁడగును.

అమలవపురవక్రః కైరవాణాం వికాసీ
స్వగృహమథ నవాంశం స్వోచ్చభాంశం గతో వా,
హితగగననివాసైః పంచభిర్దృశ్యమానో
జనయతి జగతీశం నీచభేనో యది స్యాత్. 185

పూర్ణచంద్రుఁడు కుజునితోఁ గలియక స్వక్షేత్రమందును, లేక స్వనవాంశయందును, లేక స్వోచ్చాంశయందును నుండి రవిబుధగురుశుక్రశనులచేఁ జూడఁబడెనేని నరేంద్రుఁడగును (నీచను బొందక యుండవలయుననుట).

లాభే మందో గురుభృగుసుతావుద్గమే ఖే శశాంకో
బంధావర్కో బుధకుతనయౌ వక్రగౌ చేత్స భూపః,
యత్సేనాయాస్తతమదజలక్షోభతో వారణేంద్రై
ర్భ్రాయస్సేతోస్మరతి సహసా క్షోభితాంతోఽంబురాశిః. 186

ఏకాదశమున శని, లగ్నమున గురుశుక్రులు, దశమమున చంద్రుఁడు, చతుర్థమున రవి ఇట్లుండి కుజబుధులు వక్రమును పొందిరేని అనేకగజములుగల నరేంద్రుఁడగును.

ఇతి పంచత్రింశోఽధ్యాయః

---

## రశ్మిచింత యను ముప్పదాఱవ యధ్యాయము.

రశ్మిప్రధానమేతద్యస్మాచ్ఛాస్త్రం వదంతి మాణిత్థాః,
తస్మాత్ప్రయత్నతోఽహం కథయామి యథామతం తేషాం. 1

పూర్వము మాణిత్థాదులచే చెప్పఁబడిన ధర్మశాస్త్రమును ప్రయత్నపూర్వకముగను నాబుద్ధ్యనుసారముగను జెప్పఁబోవుచున్నాను

స్వోచ్చస్థే దశసూర్యే నవచంద్రే పంచభూమితనయే చ,
పంచేందుజే సురేడ్యే సప్తాష్టౌ భార్గవే శనౌ పంచ. 2
ఏవం మహేంద్రశాస్త్రే మాణిత్థమయబాదరాయణైః ప్రోక్తే,
సప్తప్రత్యేకస్థా నిర్దిష్టా రశ్మయో గ్రహేంద్రాణామ్. 3

సర్వే ప్రమాణమేతే మునివచనాత్కింతు సప్తసంఖ్యైవ,
బహువాక్యాదస్మాకం నీచగత స్యాన్య ద్విగతరశ్మిః. 4

రవ్యాదిసప్తగ్రహములు తమతమపరమోచ్చలయందుండెనేని క్రమముగ ౧౦-౯-౫-౫-౭-౮-౫ సంఖ్యగల రశ్మలు గలుగును ఈప్రకారమే మహేంద్రశాస్త్రమందు మాణింధమయబాదరాయణులచేఁ జెప్పఁబడినందున నాచేతను జెప్పఁబడినవి. కొందఱు మునులు పరమోచ్చయందున్న ప్రతిగ్రహమునకును భేదములేక ఒక్కొక్క గ్రహమునకు ౭ రశ్మలు. ఈప్రకారము రవ్యాదిగ్రహములకు ౪౯ రశ్మలు అని చెప్పిరి. నీచయందు రశ్మలు శూన్యములు. ఇది సర్వమునిసమ్మతము.

అభిముఖరశ్మిర్నీచాద్భ్రష్టస్స్వోచ్చాచ్చపరాఙ్ముఖో జ్ఞేయః,
అంతరగతేఽనుపాతో యథాతథా సంప్రవక్ష్యామి 5

పూర్వశ్లోకమునందు పరమోచ్చయందున్న గ్రహమునకు ఉక్తసంఖ్యాతుల్యములగు రశ్మలనియు, పరమనీచయందున్న గ్రహమునకు రశ్మలు శూన్యములనియుఁ జెప్పఁబడెనుగదా నీచయందుండి ఉచ్చాభిముఖుఁడై వెళ్లు గ్రహము అభిముఖరశ్మలు గలవాఁడనియుం (క్రమముగ రశ్మలు అధికములౌననుట) ఉచ్చయందుండి నీచాభిముఖుఁడగు గ్రహము పరాఙ్ముఖుఁడు (క్రమముగ రశ్మలు క్షీణించుననుట) ఉచ్చనీచలకు మధ్యయందుండెనేని వక్ష్యమాణప్రకారమైన అనుపాతక్రమముగ నాలోచించ తగినది.

నీచవిహీనో మండలశోధ్యష్షడ్భవనతో యదాభ్యధికః,
ఆత్మీయరశ్మిగుణితా షడ్భక్తా ద్రశ్మయస్తస్మాత్. 6

గ్రహములో నీచ తీసివేయఁగా శేషము ఆఱురాసులకు తక్కువగ నుండెనేని అట్లే యుంచవలెను. ఆఱురాసులకు అధికముగ నుండెనేని పండ్రెండురాసులలో తీసివేయవలెను. ఇట్లు చేయఁగా వచ్చిన రాశ్యాదికమును తమతమ ఉక్తరశ్మలచే గుణించి ఆఱుచే భాగించఁగా రశ్మిసంఖ్య వచ్చును. శేష మక్కఱలేదు. ఉచ్చనీచాంతరము ఆఱురాసులుగాన ఆఱుభాజకమాయెను. బాలావబోధమునకై ఒక ఉదాహరణము రాశ్యాది రవి ౪-౧౦-౦-౦ రవినీచరాశ్యాది ౬-౧౦-౦-౦ గ్రహములో ఉచ్చ తీసివేయఁబడనందున గ్రహములో పండ్రెండురాసులు జేర్చి నీచ తీసివేయఁగా ౧౦-౦-౦-౦ ఆఱురాసులకధికమగుటచే ౧౨ రాసులలో తీసివేయఁగా రాశ్యాది ౨-౦-౦-౦ దీనిని రవిరశ్మిసంఖ్యయగు ౧౦ చే గుణించఁగా ౨౦ దీనిని ౬ చే భాగించఁగా వచ్చిన లబ్ధము రశ్మలు 3. మరియొకయుదాహరణము: రాశ్యాదిరవి ౮-౦-౦-౦ నీచరాశ్యాది

౬-౧౦-౦-౦ తీసివేయఁగా ౧-౨౦-౦-౦ అఱురాసులకు తక్కువగా నున్నందున ౧౨ రాసులలో తీసివేయ నక్కఱలేదు. రవిరశ్మిసంఖ్యయగు ౧౦ చే గుణించఁగా రాశ్యాది ౧౬-౨౦-౦-౦ దీనిని ౬ చే భాగించఁగా లబ్ధము రశ్ములు ౨ ఇట్లే అన్నిగ్రహములకును ఊహించవలయును.

మిత్రద్వాదశభాగే ద్విగుణాస్త్రిగుణాస్స్వకేచ దీధితయః,
వక్రే పునస్తథోచ్చే స్వరాశిగే తద్భవ త్యేవ. 7

గ్రహము మిత్రద్వాదశాంశయందుండెనేని గణితాగతరశ్ములు ద్విగుణించవలెను స్వనవాంశయందుండెనేని 3 చే గుణించవలెను గ్రహము ఉచ్చయందును లేక స్వక్షేత్రమందైనను నుండి వక్రమును బొందెనేని గణితాగతరశ్ములు 3 చే గుణించవలెను.

ద్విగుణాస్స్యుర్దీధితయో వక్రస్థేఽప్యేవమేవ స్యుః,
వైరిద్వాదశభాగే నీచే చ భవంతి షోడశాంశోనాః 8
అస్తంగతో విరశ్మిశ్శనిసితవర్జం గ్రహో జ్ఞేయః,
వక్రాంతస్థే ద్విగుణా వక్రత్యాగేఽష్టభాగహీనాశ్చ,
ఏవం రశ్మివిధానం పూర్వాచార్యైస్సముద్దిష్టమ్. 9

స్వక్షేత్ర ఉచ్చేతరస్థానములయందుండి వక్రమును బొందెనేని గణితాగత రశ్ములు ౨ చే గుణించవలెను గ్రహము శత్రుద్వాదశాంశయందుగాని నీచద్వాదశ యందుగాని యుండినచో గణితాగతరశ్ములు షోడశాంశచే హీనములగును శనిశుక్రులు గాక తదితరగ్రహములు అస్తంగతులాయెనేని గణితాగతరశ్ములు శూన్యములగును. (శని శుక్రులస్తంగతులైన హాని లేదచుట.) వక్రావసానమునగూడ గణితాగతరశ్ములు ద్విగుణములగును. వక్రత్యాగదినమున గణితాగతరశ్ములు అష్టమాంశచే హీనములగును. ఇట్లు హానిభరణలు సేయ స్ఫుటరశ్ములగును. ఇట్లె రశ్మిసాధనము పూర్వులచేఁ జెప్పఁబడెను.

ఏకాదిపంచ యావద్రశ్మిభిరతిదుఃఖితాః కులవిహీనాః,
పరతంత్రకా దరిద్రా నీచరతాస్సంభవంతి నరాః. 10

పూర్వోక్తప్రకారము రశ్మినిర్ణయముజేసి సూర్యాది సప్తగ్రహముల రశ్ములను జేర్చగా ఒకటిమొదలు ఐదువరకు సంఖ్యగల రశ్ములుండెనేని అధికదుఃఖము మొదలైనవి గలవాఁడగును.

పరతో౽దశకం యావద్భృతకాదీనాం విదేశగమనరతాః,
జాయంతే౽త్ర మనుష్యాస్సౌభాగ్యపరిచ్యుతా మలినాః. 11

రశ్మలు ఐదు మొదలు పదివఱకు నుండెనేని కూలినిమిత్తమై విదేశము తిరుగువాఁడు, అదృష్టహీనుఁడు, మాలిన్యము మొదలైనవి గలవాఁడు అగును.

ఊర్ధ్వం పంచదశా స్తిర్యావత్తావద్బహుశ్రుతాస్సుజనాః,
ధర్మాభిరతాస్సుముఖాః కులస్య తుల్యాః ప్రజాయంతే. 12

పది మొదలు ౧౫ వరకు నుండెనేని గొప్పపండితుఁడు, సుజనుఁడు, ధర్మము మొదలైనవి గలవాఁడగును.

ఆవింశతేర్భవేయుః కులాధికా ధర్మయుతా జనఖ్యాతాః,
కీర్తికరాశ్చ మనుష్యా యథాక్రమం స్వజనసంపూజ్యాః. 13

౧౫ మొదలు ౨౦ వరకు నుండెనేని ధర్మము ఖ్యాతి కీర్తి మొదలైనవి గలవాఁడగును.

పూజ్యాస్సుభగా ధీరాః కృతినో భూపాస్తు శరకృతిర్యావత్,
పరతో భవంతి మనుజా స్సంసాధితసకలకరణీయాః. 14

౨౦ మొదలు ౨౫ వరకునుండెనేని పూజ్యత, సౌందర్యము, ధైర్యము, ధన్యత మొదలైనవి గలవాఁడై నరేంద్రుఁడగును.

అత ఉత్తరేణ చండా నృపాశ్రితా నృపతిలబ్ధధనసౌఖ్యాః,
త్రింశద్యావత్సచివాః పూజ్యాశ్చ భవంతి భూపానామ్ 15

౨౫ మొదలు ౩౦ వరకునుండెనేని ప్రతాపముగలవాఁడు, రాజాశ్రయము మొదలైనవి గలవాఁడగును.

ఏకత్రింశద్భిస్తు ప్రచరాః ఖ్యాతా మహీభుజా మిష్టాః,
ద్వాత్రింశద్భిః పురుషాః పంచాశద్గ్రామపతయస్స్యుః. 16

ముప్పదియొకటి అయెనేని ఖ్యాతి మొదలైనవి గలవాఁడగును. ముప్పదిరెండు అయెనేని గ్రామాధిపతి యగును.

గ్రామసహస్రాధిపతి త్రింశత్ర్యధికా కరోతి రశ్మీనాం,
త్రిసహస్రగ్రామాణాం పురుషం సూతే చతుస్త్రింశత్. 17

రశ్మలు ముప్పదిమూఁడు ఉండెనేని వేయిగ్రామముల కధిపతియగును. రశ్మలు ముప్పదినాలుగుఉండెనేని మూఁడువేలగ్రామముల కధిపతి యగును.

పరతో మండలభాజో బహుకోశపరిగ్రహా మహాసత్త్వాః,
ప్రఖ్యాతకాంతియశసో భవంతి సుభగాశ్చ లోకానామ్. 18

౩౫ రశ్ములు ఉండెనేని మండలాధిపతియు అధికధనము సత్త్వము కాంతి సౌందర్యము గలవాఁడగును.

త్రింశత్షడ్భిస్సహితా రశ్మీనాం యస్య జన్మసమయే స్యాత్,
సార్ధం భునక్తి లక్షం స గ్రామాణాం పుమాన్నియతమ్. 19

జననకాలమున గ్రహముల సాముదాయరశ్ములు ౩౬ అయెనేని లక్షా యాభై వేల గ్రామముల కధిపతి యగును.

త్రింశన్మండలసహితా రశ్మీనాం సంభవే భవేద్యేషాం,
లక్షత్రితయపతిత్వం గ్రామాణాం జాయతే తేషామ్. 20

రశ్ములు ౩౭ యుండెనేని మూఁడులక్షలగ్రామముల కధిపతి యగును.

త్రింశత్సనవాగావో జన్మని యేషాం గ్రహోత్థితాస్సంతి,
తే తోషితసకలజనా భవంతి పృథ్వీశ్వరాః పురుషాః. 21

౩౯ రశ్ములు ఉండెనేని సర్వజనహితుఁడు, నరేంద్రుఁడు అగును.

దశజలధిగుణాయా రశ్మిసంఖ్యా నరాణాం
దిశతి పృథులభూమేః పాలకత్వం చ తేషాం,
హతరిపువనితాభి ర్ధ్రియతేఽతీవ కీర్తిః
కరుణరుదితగర్భై రుద్యతాక్రోశశబ్దైః. 22

౪౦ రశ్ములు ఉండెనేని అధికభూపాలకుఁడును, అనేకశత్రువులను హింసించువాఁడును అగును.

శశిజలనిధిసంఖ్యై రశ్మిభి ర్యుజ్యతే యో
జలనిధిరశనాయాః పార్థివస్స్యాత్స భూమేః,
ద్విజలధి రశనాయాః పతి వేదాఖ్యసంఖ్యై ర్
స్త్రిజలధి రశనాయా వహ్ని వేదై స్తథైవ. 23

౪౧ సంఖ్యగల రశ్ములు ఉండెనేని చతుస్సముద్రపర్యంతము నిరుపద్రవముగ పాలించువాఁడగును. ౪౨ సంఖ్యగల రశ్ములు ఉండెనేని రెండుసముద్రముల మధ్యయందుండు భూమిని పాలించుప్రభు వగును ౪౩ సంఖ్యగల రశ్ములు ఉండెనేని మూఁడుసముద్రముల మధ్యయందుండు భూమిని పాలించు నరేంద్రుఁడగును.

వేదాబ్ధిసంఖ్యైశ్చ మయూఖజాలై
ర్జాతా నరేంద్రాః ఖలు సార్వభౌమాః,
సౌమ్యా స్సురబ్రాహ్మణభక్తిశీలా
దీర్ఘాయుష స్సత్వయుతా భవంతి. 24

౪౪ సంఖ్యగల రశ్మలు ఉండెనేని రాజు దేవబ్రాహ్మణభక్తి సాత్వికము దీర్ఘాయుస్సు బలముగలవాఁ డగును.

పరతః పరతః కిరణైర్ద్వీపాంతరపాలకా నిరుపసర్గాః,
సర్వనమస్యాస్సుభగా మహేంద్రతుల్యప్రతాపాశ్చ. 25

౪౫ సంఖ్యగల రశ్మలు ఉండెనేని నిరుపద్రవముగ ద్వీపాంతరములను పరిపాలించునట్టియు, సర్వులచే నమస్కరించఁదగినట్టియు, ఇంద్రతుల్యపరాక్రమముగల నరేంద్రుఁడగును.

చత్వారింశద్వ్యక్తా పంచాదిభిరత్ర యస్య సూతౌ స్యాత్,
జ్ఞేయం తస్యారిష్టం సర్వక్షితిపాలకం ముక్త్వా. 26

స్ఫుటరశ్మలు నలుబదియైదుకన్న నధికముగునెడఁ బుట్టినరాజవంశజుఁడు అధిక రాజయోగప్రదుఁడగును. తదితరవంశజునిజననకాలమును నలుబదియైదుకన్న నధికముగ నుండెనేని నిశ్చయముగ ప్రబలారిష్టము గలుగును.

భవనభరసహిష్ణోస్సర్వతః క్షోణిశత్రో
స్త్రిదశపతిమహిమ్న స్సర్వలోకస్తుతిస్య,
విదధతి విహగానాం రశ్మయోఽతీవ దీప్తా
స్తురగకృతసమానాశ్చక్రవర్తిత్వమేవ. 27

జననకాలమున పూర్వోక్తప్రకారాసీతరశ్మలు ౪౭ అయెనేని భూపాలన సేయునట్టియుఁ, శత్రువులు లేనట్టియు, ఇంద్రునితో సమానుఁడైనట్టియు, సర్వజనముచే స్తోత్రము చేయఁదగినట్టియు చక్రవర్తియగును.

అభిముఖకరప్రవాహాః ఫలం ప్రయచ్ఛంతి పుష్టతరమాశు,
తద్విపరీతం పుంసాం పరాఙ్ముఖాస్తు గ్రహేంద్రాణామ్. 28

ఈయధ్యాయమం దైదవశ్లోకమందుఁ జెప్పినరీతిన గ్రహములు అభిముఖరశ్మఁడై యుండెనేని ఫలము ఉత్తరీతిగా (సంపూర్ణముగ) గలుగును. లేక పరాఙ్ముఖుఁడై యుండెనేని ఫలము స్వల్పముగ గలుగును. ఉదాహరణము; రాశ్యాది రవి ౫-౧౦-౦-౧ కరము

నీచరాశ్యాది ౬-౧౦-౦-౦ ఇచట రవి నీచను అతిక్రమించి ఉచ్చాభిముఖుఁడై యుండుటవలన అభిముఖరశ్మిఁడని తాత్పర్యము. మరియొకయుదాహరణము. రాశ్యాది సూర్యుఁడు ౪-౧౦-౦-౦ ఉచ్చము. రాశ్యాది ౦-౧౦-౦-౦ ఇచట రవి ఉచ్చను అతిక్రమించి నీచాభిముఖుఁడై యుండుటవలన పరాఙ్ముఖుఁ డని తాత్పర్యము.

జన్మసమయే గ్రహాణాం రశ్మీనాం సంక్షయే క్షయో భవతి,
వృద్ధే వృద్ధిర్జ్ఞానా మధమోత్తమతా క్రమేణైవ. 29

జన్మసమయమున గ్రహరశ్మిలు శూన్యముగ నుండెనేని ప్రబలహీనము (సర్వదా క్షయము) గలుగును. రశ్మిలు శూన్యము గాకయుండెనేని రశ్మిలయొక్క వృద్ధిననుసరించి క్రమముగ ఉత్తమోత్తమాది ఫలములు జరగును

ఇతి షట్త్రింశోఽధ్యాయః.

---

## పంచమహాపురుషలక్షణమును దెలుపు ముప్పదేడవ యధ్యాయము.

శ్రీదేవకీర్తిరాజా పంచమహాపురుషలక్షణాన్నృపతేః,
కథయతి యాం స్తా సహామపి కథయామి నిరాకులీకృత్య. 1

పూర్వము శ్రీదేవకీర్తిరాజు ఏ పంచమహాపురుషలక్షణములు గల రాజులను జెప్పెనో ఆయోగములనే ఆలోచించి చెప్పఁబోవుచున్నాను

స్వక్షేత్రేచ చతుష్టయేచ బలిభిస్స్వోచ్చే స్థితైర్వా గ్రహై
శ్శుక్రాంగారకమందజీవశశిజై రేతైర్యథానుక్రమం,
మాలాఖ్యో రుచకశ్శశోఽథ కథితో హంసశ్చ భద్రస్తథా
సర్వేషామపి విస్తరం మతిమతాం సంతుష్య తే లక్షణమ్. 2

జననకాలమున స్వక్షేత్రమందైనను కేంద్రములయందైనను తమతమ ఉచ్చలయందైనను శుక్రుఁడుండెనేని మాలాఖ్యుఁడగును. కుజుఁడుండెనేని రుచకుఁడగును. శనియుండెనేని శశయనువాఁడగును. గురుఁడుండెనేని హంసయనువాఁడగును. బుధుఁడుండెనేని భద్రయనువాఁడగును. వీరల లక్షణము జెప్పఁబోవుచున్నాను.

మహీసుతాత్సత్వముదాహరంతి గురుత్వమిందోస్తనయాద్గురోశ్చ,
స్వరంసితాత్స్నేహమినేశ్చవర్ణం బలాబలైః పూర్ణలఘూనిచైషామ్.

జాతకునికి కుజునివలన బలమును ఆలోచించవలెను. బుధునివలన శరీరముయొక్క గురుత్వము నాలోచించవలెను. గురునివలబట్టి స్వరము నాలోచించవలెను. శుక్రునివలన

స్నేహము నాలోచింపఁదగినది. శనివలన వర్ణ మాలోచింపవలెను. వీనిబలాబలముల ననుసరించి అధికాల్పముల నాలోచింపఁదగినది

మృదుర్దయాలుః ప్రియదానభృత్యస్స్థిరస్వభావః ప్రియసత్యవాదీ,
సురద్విజోపాస్తిరత స్సహిష్ణు ర్భవే న్నర స్సత్త్వగుణప్రధానః 4

రవిచంద్రగురువులు సత్త్వగుణంబునకును, బుధశుక్రులు రజోగుణంబునకును, కుజశనులు తమోగుణంబునకును అధిపతులు కాదగుని పూర్వాధ్యాయ గ్రహాకారాదిభేదాధ్యాయమందుఁ జెప్పఁబడెను, గాన రవ్యాదిసప్తగ్రహంబులలో సత్త్వగుణప్రధానుండగు నొక గ్రహమైనను బలయుక్తుఁడై యుండెనేని మృదుత్వము, దయ, అనేకభార్యలు, భృత్యులు మొదలైనవి గలవాఁడై దేవబ్రాహ్మణభక్తి గలవాఁడగును.

శూరః కలాకావ్యనిధిస్సుబుద్ధి స్త్రీభోగసంసక్తమనాః ప్రవీణః,
ఆడంబరీ హాస్యరతః ప్రగల్భో వేదార్థవిద్రాజసికః ప్రసిద్ధః 5

రవ్యాదిసప్తగ్రహములలో రాజసగుణయుక్తుఁడగు గ్రహము బలయుక్తుఁడై యుండెనేని శౌర్యము గలవాఁడు, సంగీతాది కళలయందును కావ్యములయందును నేర్పు గలవాఁడు, మంచిబుద్ధిగలవాఁడు, స్త్రీభోగేచ్ఛ మొదలైనవి గలవాఁడగును.

మూర్ఖోఽలసో వంచయితా పరేషాం క్రోధీ విపన్నః పిశునోఽతిధూర్తః,
ఆచారహీనో నశుచిస్సదాంధో లుబ్ధః ప్రమాదీ తమసాభిభూతః. 6

రవ్యాదిగ్రహంబులలో తమోగుణప్రధానగ్రహము బలయుక్తుఁడై యుండెనేని మూర్ఖుఁడు, అలసుఁడు, వంచనసేయువాఁడు, క్రోధము మొదలైనవిగలవాఁడగును.

భారో భవతి నృపాణాం భూమ్యర్థం భుంజతాం మనుష్యాణాం,
యేషాం భాగేఽత్యర్థం సకలమహీపాల కా స్తే స్యుః. 7

ఎవరిభాగమున భారము ఎక్కువగా నుండునో ఆతఁడు భూమినిగోరు మనుష్యులలో నందరను మించి రాజగును

సమాస్స్వరైస్సింహమృదంగదంతినాం
రథౌఘభేరీ వృషతోయదాయినాం,
సమస్తభూమండలరక్షణక్షమా
భవంతి భూపా జితశత్రవో నరాః. 8

సింహము మద్దెల ఏనుగ రథగమనము భేరి వృషభము మేఘము యొక్క ధ్వని వంటి కంఠధ్వనిగలపురుషులు, భూమినంతను పాలించువారు, శత్రువులను నశింపఁజేయువారు అగుదురు.

స్నిగ్ధో భవంతి భూపా జిహ్వాత్వగ్దంతనేత్రనఖకేశైః,
రూక్షైరేభి ర్నిస్వా స్స్వరైశ్చ తే జాతకే కథితాః 9

నాలుక చర్మము దంతములు నేత్రములు గోళ్లు కేశములు యథాశాస్త్రముగ నుండెనేని నరేంద్రులగుదురు. అట్లు లేకుండెనేని దరిద్రు లగుదురు

స్నిగ్ధస్తేజోయుక్తశ్శుద్ధోవర్ణః ప్రకీర్తితో నృపతేః,
విపరీతః క్లేశభుజాం సుఖార్థసుఖభాగినాం మధ్యః 10

స్నిగ్ధమగు తేజస్సు పరిశుద్ధము ఉత్తమవర్ణము గలవాఁడు నరేంద్రుఁడగును ఇవి యన్నియు లేనివాఁడు దుఃఖములను బొందువాఁడగును. కొన్నిగుణములు గలవాఁడు స్వల్పమైన సుఖము మొదలైనవి గలవాఁడగును.

వ్యోమాంబువాతాగ్నిమహీస్వభావా
జీవాసురేడ్యార్కిమహీజసౌమ్యైః,
ఛాయామరుత్పిత్తకఫానురూపా
మిశ్రైస్తు మిశ్రా బలిభి ర్నరస్య 11

బృహస్పతి ఆకాశమునకును, శుక్రుఁడు జలమునకును, శని వాతమునకును, కుజుఁడు అగ్నికిని, బుధుఁడు భూమికిని అధిపతులు ఈగ్రహములలో ఏగ్రహము బలయుక్తుఁడై యుండునో ఆగ్రహమునకు చెప్పఁబడిన ప్రకృతిగలవాఁడగును. ఈగ్రహముల బల ననుసరించియే ఈపంచభూతములయొక్క ఛాయాఫలములను తెలియఁదగినది. బలముననుసరించియే వాతపిత్తశ్లేష్మములను తెలియఁదగినది. మిశ్రముగ నుండెనేని మిశ్రఫలము గలుగును.

శబ్దార్థవిన్న్యాయపటుః ప్రగల్భో విజ్ఞానయుక్తో వివృతాస్యభాగః,
చిత్రాంగసంధిఃకృశపాణిపాదో వ్యోమప్రకృత్యా పురుషోఽతిదీర్ఘః. 12

వ్యోమప్రకృతిగల పురుషుఁడు, శాస్త్రజ్ఞుఁడు, న్యాయముగలవాఁడు, ప్రౌఢుఁడు, వెడల్పుగలముఖము కృశించిన పాణిపాదములు దీర్ఘశరీరము మొదలైనవి గలవాఁడగును.

లావణ్యవాహీ బహుభారవాహీ ప్రియాదిభాషీ ద్రవభోజనశ్చ,
చలస్వరూపో బహుమిత్రపక్షః క్షీణోపతిర్నాతిచిరః ప్రగల్భః. 13

అంబు ప్రకృతిగలపురుషుఁడు లావణ్యమైన శరీరఛాయగలవాఁడు, అధికభారమును వహించువాఁడు, ప్రియముగ భాషించువాఁడు, ద్రవయుక్తమైన భోజనము సేయువాఁడు, చంచలస్వభావము మొదలైనవి గలవాఁడగును.

సత్త్వేన వాయోః పురుషః కృశాంగః శీఘ్రం చకోపస్య వశం ప్రయాతి,
కృత్యైకబుద్ధిర్భ్రమతే రతశ్చ దాతా సితో భూపతి రప్రధృష్యః

వాతప్రకృతిగల పురుషుఁడు కృశించినవాఁడు, కోపయుక్తుఁడు, కార్యములయందు స్థిరచిత్తము గలవాఁడు, తిరుగువాఁడు, దాతయు, తెల్లనైనవాఁడును రాజులచే తిరస్కరింపఁబడువాఁడును అగును

శూరః క్షుధార్తశ్చపలోఽతితీక్ష్ణః ప్రాజ్ఞః కృశో గౌరతనుర్విరోధీ,
విద్వాన్సుపాణిర్బహుభక్షణశ్చ వహ్నిస్వభావః పురుషోఽతికాయః

అగ్నిస్వభావముగల పురుషుఁడు శూరుఁడు, క్షుత్పీడితుఁడు, కృశించినట్టియు, కొన్ని అవయవములు గురుత్వమును బొందినట్టివాఁడు, కలహించువాఁడు, విద్వాంసుఁడు, అధికముగ భక్షణసేయువాఁడు నగును.

కర్పూరజాత్యుత్పలపుష్పగంధో భునక్తి భోగాన్ స్థిరలబ్ధసౌఖ్యం,
సింహోభ్రఘోష స్థిరచిత్తవృత్తిర్మహాస్వభావః పురుష స్ససత్త్వః. 16

భూప్రకృతిగలపురుషుఁడు కర్పూరము జాజికలువవంటి గంధముగలవాఁడును, భోగించువాఁడు, స్థిరమైన సౌఖ్యము గలవాఁడు, స్థిరచిత్తము గలవాఁడు అగును.

స్ఫటికోపలసంకాశా స్వచ్ఛా గగనోద్భితా భవే చ్ఛాయా,
నిధిరివ పుంసాం ధన్యా త్రివర్గఫలసాధనీ సౌమ్యా. 17

బృహస్పతి వ్యోమప్రకృతిగలవాఁడని పూర్వమే చెప్పఁబడెనుగదా. ఈబృహస్పతి బలయుక్తుఁడైయుండెనేని స్ఫటికమువలె స్వచ్ఛమైన వ్యోమప్రకృతి ఛాయ గలవాఁడగును.

స్నిగ్ధా సితాచ హరితా కాంతా మాతేవ సర్వసుఖజననీ,
సౌభాగ్యాభ్యుదయశుభా న్కరోతి జలసంభవా చ్ఛాయా 18

శుక్రుఁడు బలయుక్తుడై యుండెనేని మంచి నునుపైనట్టియు తెల్లనైనట్టియు మనోహరమైన పచ్చనివర్ణము గలిగినట్టియు జలప్రకృతిగలచ్ఛాయ గలవాఁడగును. ఈ ఛాయ సుభగత్వము మొదలుగాఁగల శుభముల నిచ్చును.

అసితజలదకాంతిః పాపగంధోఽతిమూఢో
మలినపరుషకాయ శ్శోకసంతానతప్తః,

స వహతి వధదైన్యవ్యాధ్యనర్థార్థనాశా
న్విచరతి పవనోత్థా యస్య కాంతిశ్శరీరే 19

శని బలయుక్తుడై యుండెనేని వాతప్రకృతిఛాయగలవాఁడగును ఇటువంటి ఛాయగల పురుషుఁడు నీలమేఘవర్ణము గలవాఁడు, దుర్గంధయుక్తుఁడు, మూఢుఁడు. మాలిన్యశరీరియు, సంతానాదిశోకము చే తపించువాఁడును, వధదైన్యము వ్యాధి మొదలైనవానిచే పీడితుఁడు అగును

కమలదహనదీప్తిశ్చండదండోఽతిహృష్టం
ప్రణతసకలశత్రుర్విక్రమాక్రాంతభూమిః,
భజతి మణిసువర్ణం సర్వకార్యార్థసిద్ధిం
ప్రశమితగదశోకో వహ్నిజాయాం ప్రభాయామ్. 20

జననకాలమున వహ్నిప్రకృతిగల కుజుఁడు బలయుక్తుడై యుండెనేని అగ్ని ప్రకృతిఛాయగలవాఁడగును. ఆట్టిప్రకృతిగలపురుషుఁడు ప్రజ్వలాగ్ని తుల్యమైన కాంతి గలవాఁడును, ప్రచండమైన దండనగలవాఁడు, మిక్కిలి సంతోషించువాఁడు, శత్రు విజయము సేయువాఁడు, పరాక్రమముచే భూసంపాదకుఁడు, సర్వకార్యసిద్ధిని పొందు వాఁడు, వ్యాధులు శోకములు మొదలైనవి లేనివాఁడు నగును.

ఆజ్యాంబుసిక్తవసుధాగరుతుల్యగంధ
స్సుస్నిగ్ధదంతనఖరోమశరీరకేశః,
ధర్మార్థతుష్టిసుఖభాగ్జనసంప్రియశ్చ
చ్ఛాయా యదా భవతి భూమికృతా మనుష్యే 21

బుధుఁడు బలయుక్తుడై యుండెనేని భూప్రకృతిగల ఛాయగలవాఁడగును. ఆట్టిప్రకృతిగల పురుషుఁడు నెయ్యిచేతను ఉదకముచేతను తడుపఁబడిన భూమితోడను అజ్యాంబుసిక్తమైన అగరుతోడను తుల్యమైన పరిమళము గలవాఁడు, నునుపైన దంతములు నఖములు రోమములు శరీరము కేశములు గలవాఁడు, ధర్మార్థములను సంతోషమును సుఖమును పొందువాఁడు, జనప్రియుఁడు నగును.

శీతార్తో బహుభాషకో ద్రుతగతిర్నావస్థితః కుత్రచి
చ్ఛూరో మత్సరవాన్ప్రజాకరరుచిర్దౌర్భాగ్యయుక్తోఽనఘః,
దంతాన్ఖాదతి నాతిసౌహృదమతిర్గాంధర్వవేత్తా కృశో
మిత్రాణాం సముపార్జనేఽతినిపుణః స్వప్నే చ ఖే గచ్ఛతి. 22
అపగతధృతిరూక్షశ్మశ్రుకేశః కృతఘ్న
స్స్ఫుటితచరణహస్తః క్రోధనో నష్టకాంతిః,

విలపతి చ నిబంధీ విత్త సంహారకారీ
భవతి పురుష ఏవం మారుతైకప్రధానః. 23

రవి పిత్తప్రకృతిగలవాఁడు, చంద్రుఁడు వాతశ్లేష్మప్రకృతి గలవాఁడు, కుజుఁడు పిత్తప్రకృతి గలవాఁడు, బుధుఁడు వాతపిత్తశ్లేష్మప్రకృతి గలవాఁడు, గురుఁడు శ్లేష్మప్రకృతి గలవాఁడు, శుక్రుఁడు వాతశ్లేష్మప్రకృతి గలవాఁడు, శని వాతప్రకృతి గలవాఁడు, అని గ్రహయోనిభేదాధ్యాయమునఁ జెప్పఁబడెను. వాతప్రకృతిగల గ్రహములు బలయుక్తులై యుండిరేని శిశువుచే పీడితుఁడు. అధికముగ మాటలాడువాఁడు, వేగమైన గమనము గలవాఁడు, ఒకచోట స్థిరముగ నుండనివాఁడు, శౌర్యముగలవాఁడు, పండ్లు కొరుకువాఁడు, గాంధర్వము నెఱిఁగినవాఁడు, కృశించినవాఁడు, మిత్రులుగల వాఁడు, స్వప్నమునం దాకాశమునఁ దిరుగువాఁడు, ధైర్యము మొదలైనవి లేనివాఁడు అగును. వాతప్రకృతిగల గ్రహములకు శ్లేష్మపైత్యగుణము లుండెనేని శ్లేష్మపైత్యగుణములు మిశ్రముగ గలవాఁడగును

దుర్గంధీ లఘుతాపనో విపులధీః క్షిప్రప్రసాదః పునః
పీనోరక్తనఖాక్షిపాణిచరణో వృద్ధాకృతిర్ద్రాహవాన్,
మేధావీ యుధినిర్భయో హిమరుచి ర్భ్రాజితే నిగ్రహాప్యపరా
నో భీతిః ప్రణయం ప్రయాతి బహుభిః కుర్యాన్న తేనామప్రియమ్.

స్వప్నే ఒభపశ్యతి సువర్ణదినేశదీపా
న్దావాగ్నికింశుకజపాముఖ-ర్ణికారాన్,
రక్తాబ్జషండరుధిరోఘతటిత్సమూహా
న్పిత్తాధికో నిగదితః ఖలు లక్షణజ్ఞైః 25

పిత్తప్రకృతిగల గ్రహములు బలాధికులై యుండిరేని దుర్గంధయుక్తుఁడు, స్వల్పతాపముగలవాఁడు, మంచిబుద్ధిగలవాఁడు, దయ మొదలైనవి గలవాఁడు, స్వప్నమున అనేక సువర్ణరవిదీప్తులు మొదలైనవానిని జూచువాఁడు నగును ఈపిత్తప్రకృతి గల గ్రహములకు వాతశ్లేష్మప్రకృతు లుండెనేని వాతశ్లేష్మగుణములు మిశ్రములై యుండును.

శ్రీమాన్ శ్లిష్టాంగసంధిర్ధృతిబలసహితస్స్నిగ్ధకాంతిస్సుదేహో
గ్రాహీ సత్త్వోపపన్నో హతమురజఘనధ్వానఘోషస్సహిష్ణుః,
గౌరో రక్తాంతనేత్రో మధురరసరుచిర్బద్ధవైరః కృతజ్ఞః
శ్లేష్మే చ స్యాదభిన్నస్సకలజనసుహృత్పూజకో వా గురూణామ్ 26

సుప్తస్తు పశ్యతి సముద్రనదీసరాంసి
ముక్తాఫలప్రకరహంససితాబ్జశంఖాన్,
నక్షత్రకుందకుముదేందుతుషారపాతాన్
శ్లేష్మాధికో మునివరైః కథితః క్రమేణ 27

శ్లేష్మప్రకృతిగల గ్రహము బలయుక్తుఁడై యుండెనేని సంపద్యుక్తుఁడు, ధైర్యము బలము భేరీమ్రోతవంటికంఠధ్వని పచ్చనిదేహము మొదలైనవి గలవాఁడు, ఎఱ్ఱనైన నేత్రాంతములు గలవాఁడు, స్వప్నమున సముద్రనదీసరస్సులను ముత్యములను తెల్లనైన శంఖములను, నక్షత్రములను, మల్లెపూలను, తెల్లకలువలను తెల్లనైన మంచుబిందువులను జూచువాఁడు నగును.

బలరహితేందురవిభ్యాం యుక్తైర్భౌమాదిభిర్గ్రహైర్మిశ్రాః,
న భవంతి మహీపాలా దశాసు తేషాం సుతార్థయుతాః 28

యోగకారకులగు కుజాదిగ్రహములు దుర్బలులగు రవిచంద్రులతోఁ గలిసియుండినేని మిశ్రమఫలమును బొందెదరుగాని నరేంద్రులుగారు ఆగ్రహదశలయందు ధనము పుత్రులు మొదలయినవి గలుగును.

న స్థూలోష్ఠో న విషమవపుర్నాతిరక్తాంగసంధి
ర్మధ్యే క్షామశ్శశధరరుచిర్హస్తినాదస్సుగంధః,
సందీప్తాక్షస్సమసితరదో జానుదేశాప్తపాణి
ర్మాలవ్యోఽయం విలసతి నృపస్సప్తతిర్వత్సరాణామ్. 29
వక్త్రం త్రయోదశమితాని దశాంగుళాని
దైర్ఘ్యేణ కర్ణవివరం దశవిస్తరేణ,
మాలవ్యసంజ్ఞమనుజస్స భునక్తి నూనం
లాటాన్సమాలవససింధుసపారియాత్రాన్. 30

మాలవ్యుఁడను పేరునొందు మహాపురుషుఁడు సమమైన పెదవులు, సమమైన శరీరము, అత్యంతము రక్తవర్ణముగాని అంగసంధులు, సన్నని నడుము, చంద్రునివంటి కాంతి మొదలైనవి గలవాఁడగును. డెబ్బదిసంవత్సరములు జీవించువాఁడగును. పదమూఁడు అంగుళముల వెడల్పు పదిఅంగుళముల పొడవుగల ముఖము పదియంగుళముల వివరముగల కర్ణములు గలవాఁడై మాలవ పారియాత్ర లాటదేశములను పాలించు నరేంద్రుఁడగును.

### రుచకపురుషలక్షణము.

దీర్ఘాస్యస్స్వచ్ఛకాంతిర్బహురుచిరబలస్సాహసావాప్తకార్య
శ్చారుభ్రూర్నీలకేశశ్చరణరణరతో మంత్రవిచ్చోరనాథః,
రక్తశ్యామోఽతిశూరో రిపుబలమథనః కంబుకంఠః ప్రధానః
క్రూరో భర్తా నరాణాం ద్విజగురువినతః క్షామసజ్జానుజంఘః. 31
ఖట్వాంగపాశవృషకార్ముకవజ్రవీణా
రేఖాంకహస్తచరణశ్చ శతాంగులశ్చ,
మంత్రాభిచారకుశలస్తులయా సహస్రం
మధ్యేచ తస్య కథితం ముఖదైర్ఘ్యతుల్యమ్. 32
వింధ్యాచలసహ్యగిరీన్భునక్తి సప్తతిసమా నగరదేశాన్,
శస్త్రానలకృతమృత్యుః ప్రయాతి దేవాలయం రుచకః 33

రుచకుఁడను మహాపురుషుఁడు పొడవైన ముఖము స్వచ్ఛమైన కాంతి అధిక బలము సాహసముచే కార్యసిద్ధి సుందరమైన కనుబొమ్మలు మొదలైనవి గలవాఁడు, హస్తపాదములయందు ఖట్వాంగాదిరేఖలు గలవాఁడు, నూరుఅంగుళముల పొడవు గలవాఁడు, మంత్రములయొక్క ప్రయోగములయందు నేర్పుగలవాఁడు అగును. శస్త్రములచేతను అగ్నిచేతను మృత్యువును పొందువాఁ డగును.

### శశపురుషలక్షణమ్.

తనుద్విజాస్యోద్రుతగశ్శశోఽయం శఠోఽతిశూరో నిభృతప్రతాపః,
వనాద్రిదుర్గేషు నదీషు సక్తః కృశోదరీ నాతిలఘుప్రసిద్ధః. 34
సేనానాథో నిఖిలనిరతో దంతురశ్చాపి కించి
ద్ధాతోర్వాదే భవతి నిరతశ్చంచలః కోశనేత్రః,
స్త్రీసంసక్తః పరధనగృహో మాతృభక్తస్సుజంఘో
మధ్యే క్షామో బహువిధమతీ రంధ్రవేదీ పరేషామ్ 35
పర్యంక శంఖ హరిశస్త్ర మృదంగమాలా
వీణోపమా యదికరే చరణేచ రేఖాః,
వర్షాణి సప్తతిమితాని కరోతి రాజ్యం
ప్రత్యంతికః క్షితిపతిః కథితో మునీంద్రైః 36

శశయను మహాపురుషుఁడు కృశించిన దంతములు ముఖము గలవాఁడు, తొందర గలవాఁడు, శూరుఁడు, పర్వతములయందు నదీప్రాంతములయందు తిరుగువాఁడు, కృశిం

చిన ఉదరము గలవాఁడు, సేనాధిపతి, చంచలుఁడు, మంచినేత్రములు స్త్రీలయం దాసక్తి పరులధనము గృహము గలవాఁడు, తల్లియందు భక్తిగలవాఁడు, సన్నని మధ్యప్రదేశము గలవాఁడు, పరులలోపములను ఎఱుంగువాఁడు, హస్తములయందును పాదములయందును శంఖచక్రాదిరేఖలు గలవాఁడు, డెబ్బదిసంవత్సరములు రాజ్యము సేయువాఁడు, నరేంద్రుఁడు, లేక మంత్రియైనను అగును.

హంసపురుషలక్షణమ్.

రక్తాస్యోన్నతనాసికస్సుచరణో హంసః ప్రసన్నేంద్రియో,
గౌరః పీనకపోల రక్తకరజో హంసస్వరశ్శ్లేష్మలః,
శంఖాబ్జాంకుశదామమత్స్యయుగలైః ఖట్వాంగచాపాంగద
శ్చిహ్నైః పాదకరాంకితో మధునిభే నేత్రే చ వృత్తం శిరః 37
సలిలాశయేషు రమతే స్త్రీషు నతృప్తిం ప్రయాతికామార్తః,
షోడశశతాని తులితోఽంగులాని దైర్ఘ్యేణ షణ్ణవతిః 38
పాతీహ దేశాన్ఖలుశూరసేనాన్గాంధారగంగాయమునాంతరాళాన్,
జీవే దనూనాం శతవర్షసంఖ్యాం పశ్చాద్వనాంతేసముపైతినాశమ్.

హంసయను మహాపురుషుఁడు ఎఱ్ఱనైన నేత్రములు, ఉన్నతమైన ముక్కు, మంచి పాదములు, బలసిన గండస్థలములు, పాదచరణములయందు శంఖాబ్జాదిచిహ్నితమైన రేఖలుగలవాఁడు, తేనెకండ్లు, వర్తులమైన శిరస్సు, ఉదకప్రాంతములయందు స్త్రీలతో విహరించువాఁడు, కామార్తుఁడై తృప్తిబొందనివాఁడు, ౯౬ అంగుళముల పొడవు గలవాఁడు, గంగాయమునలమధ్యనున్న శూరసేనగాంధారదేశములను పాలించువాఁడు, నూరుసంవత్సరములు జీవించువాఁడు, ౧౬౦౦ల పలముల తూనికెగలవాఁడు అగును.

భద్రపురుషలక్షణమ్.

శార్దూలప్రతిమాననోద్విపగతిః పీనోరువక్షస్థలో
లంబాపీనసువృత్తబాహుయుగళ స్తత్తుల్యమానోచ్ఛ్రియః,
కామీ కోమలసూక్ష్మరోమనికరైస్సంరూఢగండస్థలః
ప్రాజ్ఞః పంకజగర్భపాణిచరణస్సత్వాధికో యోగవిత్ 40
శంఖాసికుంజరగదాకుసుమేషుకేతు
చక్రాబ్జలాంగలవిచిహ్నితపాణిపాదః,
యాత్రాగురుద్విపమదప్రథమాంబుసిక్త
భూకుంకుమప్రతిమగంధతనుస్సుఘోణః. 41

శాస్త్రార్థవిద్ధృతియుతస్సుసంగతభ్రూ
ర్నాగోపమోభవతి చాథ నితాంతగుహ్యః,
సత్కుక్షిధర్మనిరతస్సులలాటశంఖో
ధీరస్థిరస్త్వసితకుంచిత కేశభారః 43
స్వతంత్రస్సర్వకార్యేషు స్వజనప్రీణనక్షమః,
భుజ్యతే విభవశ్చాస్య నిత్యం మంత్రిజనైః పరైః 44
భారస్తులాయాం తులితో యది స్యాచ్ఛ్రీమధ్యదేశేష్వధిపస్తథా సౌ,
యస్త్ర్యాదిపుష్టైస్సహితస్సుభద్రస్సర్వాత్ర రాజా శరదా మశీతిం. 45

భద్రయోగమున మహాపురుషుఁడు పెద్దపులి యంతటి బలముగలవాఁడు, గజగమనము వంటి గమనము మొనతైనవి గలవాఁడు, బలసిన వక్షస్థలము, కాముకుఁడు, కోమలములైనట్టియుఁ సూక్ష్మమైనట్టియు గండస్థలములయందు రోమములు గలవాఁడు, పద్మముల వంటి హస్తములు గలవాఁడు, పాణిపాదములయందు శంఖాదిరేఖలు గలవాఁడు, ఏనుఁగులతోఁగూడ దండయాత్ర సేయువాఁడు, సౌందర్యమైన ముక్కుగలవాఁడు. ధార్మికుఁడు, నల్లనైన వెండ్రుకలు గలవాఁడు, స్వతంత్రుఁడు, స్త్రీలకు మిక్కిలి ప్రియుఁడు, మధ్యదేశములను పాలించువాఁడు, యెనుబదిసంవత్సరములు జీవించువాఁడు అగును.

ఇతి సప్తత్రింశోఽధ్యాయః.

---

## రాజయోగభంగములను దెలుపు ముప్పదెనిమిదవ యధ్యాయము.

విస్తరతో నిర్దిష్టాః క్షితిపతియోగా విచిత్రసంస్థానాః,
భంగశ్చ భవతి తేషాం యథా తథా భవతి సంప్రవక్ష్యామి. 1

పూర్వశాస్త్రానుసారముగ విస్తరించి నాచే చెప్పఁబడిన రాజయోగములకు భంగములను జెప్పఁబోవుచున్నాను

కుజార్కజీవార్కిభి రత్ర నీచైర్ద్వాభ్యాం త్రిభిర్వోఽతమే విలగ్నే,
నిశాకరే వృశ్చికరాశిసంస్థే విశీర్యతే రాజకరో హి యోగః. 2

జననకాలమున రవికుజగురుశనులలో నలుగురు లేక ముగ్గురు లేక ఇద్దరైనను నీచయందుండి వీరిలో నొకఁడు (నీచయందున్నవారిలో నొకఁడు) లగ్నమందుండి చంద్రుఁడు వృశ్చికమందుండెనేని (రాజయోగాధ్యాయమందు జెప్పినరీతిగా రాజయోగము సంభవించిన) రాజయోగభంగము గలుగును.

అంత్యాష్టమాదిభాగే చరరాశ్యాదిషు శశీ యదా క్షీణః,
ఏకేనాపి నదృష్టో గ్రహేణ భంగస్తదానృపతేః. 3

క్షీణచంద్రుఁడు చరరాశియం దంత్యనవాంశయందును స్థిరరాశియం దష్టమ నవాంశయందును ద్విస్వభావరాశియందు ప్రథమనవాంశయందును ఉండి ఏగ్రహముచే జూడఁబడకయుండెనేని రాజయోగభంగము గలుగును

సర్వేక్రూరాః కేంద్రే నీచారిగతా న సౌమ్యయుతదృష్టాః,
శుభదావ్యయరిపురంధ్రే తదాఽపి భంగోభవేన్నృపతేః. 4

లగ్నము మొదలగు కేంద్రములు రవికుజశనులకు నీచశత్రుక్షేత్రములై వారం దుండి శుభులచేఁ జూడఁబడకయు, శుభగ్రహములు ౬-౮-౧౨ స్థానములయందుండి రేని రాజయోగభంగము గలుగును.

లగ్నం గణోత్తమోనం నఖేచరైర్దృశ్యతే తదాభంగః,
భవతి హి నృపయోగానాం దారిద్ర్యాయ ప్రజాతస్య 5

లగ్నము వర్గోత్తమముగాక నేగ్రహముచేతను జూడఁబడక యుండెనేని రాజ యోగభంగము గలిగియుం దరిద్రుఁడగును.

ఘటోదయే నీచగతై స్త్రిభిర్గ్రహై
ర్బృహస్పతౌ సూర్యయుతే చ నీచగే,
ఏకోఽపి నోచ్చేతు శుభేన సంగతాః
ప్రయాంతి నాశం శతశోనృపోద్భవాః. 6

కుంభము లగ్నము మూఁడు పాపగ్రహములు నీచయందుండుట, బృహస్పతి సూర్యునితో గలసి నీచయందుండుట, ఒకగ్రహమైనను ఉచ్చయందు లేకుండుట, నీచను పొందిన గ్రహములు శుభులతో గలియక యుండుట ఇట్లుండెనేని అనేక రాజయోగములున్నను భంగము గలుగును.

శూన్యేషు కేంద్రేషు శుభై ర్నవేందా
వస్తంగతైర్నీచ మధప్రయాతైః,
చతుర్గ్రహైర్వాఽపి గృహే రిపూణాం
ప్రణశ్యతి క్ష్మాధిపతేఽస్తు యోగః 7

శుభగ్రహములగు చంద్రబుధగురుశుక్రులు కేంద్రములయందుండక బాల చంద్రుఁడగుచుండఁగా లేక నాలుగుగ్రహములు అస్తమయమును లేక నీచను లేక శత్రుక్షేత్రమును బొందెనేని రాజయోగభంగము గలుగును. ఇవి రెండు రాజయోగ భంగము

స్వాంశే రవౌ శీతకరే వినష్టే పాపైశ్చ దృష్టే శుభదృష్టిహీనే,
కృత్వాఽపి రాజ్యంచ వనేమనుష్యః పశ్చాత్సుదుఃఖం లభతే గతాశః

రవి స్వాంశయందును చంద్రుఁడు క్షీణుఁడుగను నుండి పాపదృష్టి గలిగి శుభులచేఁ జూడఁబడకయుండి రేని రాజ్యపరిపాలన చేయుచున్నను అనంతరమందు ఆశలేనివాఁడై వనమందు అధికదుఃఖములను బొందువాఁడగును

శిశిరకిరణశత్రుర్లగ్నపశ్చంద్రదృష్ట
స్సహజరిపుమదస్థా భానుభూపుత్రమందాః,
శుభవిరహితకేంద్రైరస్తగైర్వాఽపి సౌమ్యై
ర్నృపతిజననయోగా యాంతి నాశం క్షణేన 9

చంద్రునకు శత్రువు లగ్నాధిపతియై చంద్రునిచేఁ జూడఁబడుట, ౩-౬-స్థానములయందు క్రమముగా రవికుజశనులు ఉండుట, కేంద్రములయందు శుభగ్రహములు లేకుండుట, శుభులస్తమయమును బొందుట యిట్లుండెనేని రాజయోగభంగము శీఘ్రముగ గలుగును. యవనమతముచే చంద్రునకు శత్రువులు గలరు

పంచభిర్నిమ్నగైః ఖేటైరస్తంయాతైర్యదాఽపివా,
ప్రయాంతి విలయం యోగా భూభుజాం యే ప్రకీర్తితాః 10

ఐదుగ్రహములు నీచనుగాని లేక అస్తమయమునుగాని పొందిరేని రాజయోగభంగము గలుగును

ఉల్కాయాః పతనే చైవ నిర్ఘాతవ్యతిపాతయోః,
కేతోశ్చ దర్శనే చైవ యాంతి నాశం నృపోద్భవాః 11

జననకాలమున నక్షత్రములు పడుట (అనఁగా. చంద్రమండలమునకు క్రిందుగా ప్రవహ భూవాయువుల సంధియందుండు నక్షత్రములకు ఉల్కలని పేరు. ఇవియె అప్పటప్పట భూమియందు పడుచుండును.) నిర్ఘాతవ్యతిపాతలు గలుగుట, ధూమకేతువు గనుపడుట యిట్లుండఁగాఁ బుట్టినవానికి రాజయోగభంగము గలుగును

అన్యైః క్రూరోత్పాతైస్త్రిశంకుతారా యదోదయం యాంతి,
సద్యః ప్రయాంతి విలయం నృపయోగా భానుజోయది విలగ్నే 12

జననకాలమున మఱికొన్ని క్రూరఉత్పాతములు కలిగి త్రిశంకుస్వర్గము (అనెడు ఆకాశమున గనుపడుతారలు) ఉదయమును బొందుచుండెనేనియు లగ్నమున శనియుండెనేనియు రాజయోగభంగము గలుగును.

కర్తారో నృపతీనాం గగనసదో యుద్ధకాంతిక్షీణో మలినాః,
రూక్షౌజర్జరదేహా విఘ్నం జనయంతి రాజయోగస్య. 13

రాజయోగమును చేయుగ్రహము యుద్ధమును బొందియు, పరాజయమును బొందియు, అస్తమయము మొదలగు హైన్యావస్థను బొందియుండెనేని, రాజయోగమును బొందఁడు (రాజయోగభంగము గలుగుననుట )

పరనీచంగతే చంద్రే క్షీణో యోగో మహీపతేః,
నాశ మాయాతి రాజేవ దైవజ్ఞప్రతిలోమగః. 14

పరమనీచరాశియందు క్షీణచంద్రుఁడుండెనేని రాజయోగభంగము గలుగును. పుట్టినవాఁడు దైవజ్ఞుఁడు లేని రాజువలెనే నాశమును బొందును.

తులాయాం పద్మినీబంధు స్త్రింశాంశే దశమేస్థితః,
హంతి రాజ్యం యథాలోభ స్సమస్తగుణసంచయమ్ 15

తులారాశియొక్క పదియవత్రింశాంశయందు (అనఁగా. పరమనీచము), సూర్యుఁడుండెనేని రాజ్యమును నశింపఁజేయును.

జూకస్య దశమే భాగే స్థితః కమలబోధనః,
సహస్రం రాజయోగానాం మందమేవ కరోత్యసౌ. 16

పరమనీచయందు సూర్యుఁడుండెనేని అనేకరాజయోగభంగము గలుగును ఈశ్లోకము పునరుక్తదోషాక్రాంతముగ నున్నదిగాని పాఠభేదమని తలఁచవచ్చును.

స్వత్రికోణగృహం కేచిత్స్వోచ్చం యాతాస్స్వమందిరం,
అతినీచే రవిశ్చైకో న తేషాం ఫలసంభవః 17

కొందఱు స్వత్రికోణమును, కొందఱు ఉచ్చము, కొందఱు స్వక్షేత్రమును బొందియున్నను రవి పరమనీచయందుండెనేని రాజయోగభంగము గలుగును

గురుర్మృగే విలగ్నస్థో దుఃఖైస్సంతాపయేన్నరం,
కామార్తమధనం వేశ్యా యద్వచ్చేందుర్న చేత్స్వభే. 1[illegible]

మకరము లగ్నము. లగ్నమున బృహస్పతి యుండియు, చంద్రుఁడు స్వక్షేత్రమున నుండకయుండెనేని దుఃఖములచేత పీడింపఁబడువాఁడు అగును. (అనఁగా: రాజయోగభంగము గలుగుననుట).

ఏకేనాపి శశాంకో గ్రహేణ కేమద్రుమే యది న దృష్టః,
విఘ్నయతి రాజయోగం మలినాచారః ప్రసూతస్స్యాత్. 19

కేమద్రుమయోగము గలుగుచుండఁగా ఒకగ్రహముచేతనైనను చంద్రుఁడు జూడఁబడకయుండెనేని రాజయోగభంగము గలుగును. దురాచారము గలవాఁడగును.

భిక్షామటతి త్ర్యాద్యైర్న చర్క్ష గతైస్సుదుఃఖితో మలినః,
సకలమహీభృత్పుత్రః పరిభూతో జాయతే నిస్స్వః 20

మూఁడుమొదలగు గ్రహములు నీచను పొందియుండిరేని చక్రవర్తి కుమారుఁడైనను దారిద్ర్యాదిమహాదుఃఖములచేత పీడితుఁడై భిక్షాటనసేయువాఁడగును. (రాజయోగభంగము గలుగుననుట).

అత్యరిభవనం ప్రాప్తైః పంచాదిభిస్సగైశ్చ గగనచరైః,
నాశం ప్రయాతి రాజా యది రవిచంద్రౌ న తుంగస్థౌ 21

ఐదు మొదలుగాఁగల గ్రహములు అధిశత్రుస్థానములను బొందినను లేక అస్తంగతులైనను అయియుండి రవిచంద్రులు ఉచ్చలయం దుండకయుండిరేని రాజయోగభంగము గలుగును.

సచివో దానవేంద్రస్య నీచాంశే సమవస్థితః,
సంప్రాప్త మతులం రాజ్యం నరైర్నాపయతే ధ్రువమ్. 22

శుక్రుఁడు పరమనీచాంశను (కన్యయందిరువదేడవ త్రింశాంశయనుట) బొంది యుండెనేని రాజయోగభంగము గలుగును

రాజయోగాస్సమాఖ్యాతాస్తేషాం భంగశ్చ దారుణః,
పరిక్ష్య యత్నతః ప్రాజ్ఞః ఫలం బ్రూయాద్బలాబలాత్. 23

రాజయోగములు రాజయోగభంగములు విశేషముగఁ జెప్పఁబడినవి ఇట్లు చెప్పఁబడినను ప్రాజ్ఞుఁడు గ్రహముల బలాబలము ననుసరించి గుణదోషవిచారణ చేయ దగినది.

కమలభవనబంధుః కన్యయాలింగితాంగ
స్త్వలిని కుజసురేడ్యౌ చంద్రమా మేషసంస్థః,
నచ యది పరిశేషైర్దృశ్యతే స్యాత్స భూపః,
ప్రచలితగజమేఘుచ్ఛాదితాశా నభోఽభ్రః. 24

కన్యయందు సూర్యుఁడు, వృశ్చికమందు కుజగురులు, మేషమున చంద్రుఁడు ఇట్లుండి ఎవరిచేతను జూడఁబడక యుండెనేని రాజవారిజూఁడు, అధికగజసముదాయము గలవాఁడగును.

ఇతి అష్టత్రింశోఽధ్యాయః.

## ఆయుర్దాయమును దెలుపు ముప్పదితొమ్మిదవ యధ్యాయము

అస్మిన్నాయుర్దాయే యస్మాద్భ్రాంతస్సమస్తలోకోఽయమ్,
తస్మాత్పూర్వాగమతః కథయామి నిరాకులీకృత్య. 1

పూర్వశాస్త్రములను బాగుగ నాలోచించి సర్వజనులకు సంశయము లేకుండునట్లు ఆయుర్నిర్ణయమును జెప్పఁబోవుచున్నాను

అంశోద్భవం విలగ్నాత్పైండ్యం భానోర్నిసర్గజం చంద్రాత్,
ఏతేషాం యో బలవానేకతమస్తస్య కల్పయేదాయుః. 2

జన్మకాలమున లగ్నరవిచంద్రులలో లగ్నము బలయుక్తమై యుండెనేని అంశాయుర్దాయముచేత ఆయుర్నిర్ణయము జేయతగినది. సూర్యుఁడుస్థానాదిబలయుక్తుఁడై యుండెనేని పిండాయుర్దాయముచేత ఆయుర్నిర్ణయము జేయతగినది. చంద్రుఁడు స్థానాదిబలయుక్తుఁడై యుండెనేని నిసర్గాయుర్దాయముచేత ఆయుర్నిర్ణయము చేయతగినది.

లగ్నదివాకరచంద్రాస్త్రయోఽపి బలరిక్తతాం యదా యాంతి,
పరమాయుష స్స్వరాంశం దదతి ఖగా జీవశర్మోక్తమ్. 3

లగ్నరవిచంద్రులు ముగ్గురు బలహీనులై యుండిరేని జీవశర్మమతాయుర్దాయంబును గ్రహించతగినది. అదెట్లనిన: పరమాయుస్సు సం-౧౨౦ మా ౫. యొక్కసప్తమాంశము. అనఁగా పరమాయుస్సును ఏడింట పాలుగొనఁగా వచ్చిన సం ౧౭ మా ౧ ది ౨౨ ఘ ౮ విఘ ౩౪ పరమోచ్చగతమైన ఒక్కొక్కగ్రహముయొక్క ఆయుర్దాయమగునని జీవశర్మ చెప్పెను. ఈలగ్నచంద్రులలో ఇద్దఱు బలవంతులై యుండిరేని వారి ఉభయుల ఆయుర్దాయమును జేసి కలపి సగము జేయవలెను. ముగ్గురు బలవంతులయిరేని ముగ్గురి ఆయుర్దాయమును జేసి కలపి మూడుచే భాగించఁగా ఆయుర్దాయము స్ఫుటమగునని భావము. ఇట్లు చేయుటకు ప్రమాణము. కేశవజాతకపద్ధతియందు పుట ౧౧౫. శ్లో. ౨౫. "శ్లో. అంశాయుశ్చతనావి నేధికబలే పైండం నిసర్గం విధౌ, స్వోచ్చే తుల్యబలం ద్వయోర్వ్యతిదలం తజ్జాయుషో స్త్రైత్రయః, త్ర్యాయూంషి త్రిబలై ర్నిహత్యచ యుంతి ర్వీరై ర్యకవ్యాద్యాత్రిజాయుర్యుత్యాత్రిలవోధజైవ ముదితం చే ద్ధీనవీర్యాస్త్రయః" అని యున్నది.

విలగ్నాదికలాభాజ్యా వ్యోమశూన్యయమైస్సమాః,
లభ్యంతేఽర్కహతా శ్శేషాస్స్వమానగుణితాంశకాః. 4

లగ్నమును సూర్యాదిసప్తగ్రహములను స్ఫుటముజేసి ఈఎనిమిదింటిలో తనకు ఇష్టమైన గ్రహమును లిప్తలుజేసి ౨౦౦ చే పాలుగొనఁగా లబ్ధము పండ్రెండుకంటె అధికమాయెనేని ౧౨ చే భాగించిన వత్సరములగును. (ఈ యంశాయుర్దాయము ౧౨ కంటె ఎల్లప్పుడు అల్పమగుట) శేషమును ౧౨ చే గుణించి ౨౦౦ చే భాగించిన మాసములగును. శేషమును ౩౦ చే గుణించి ౨౦౦ చే భాగించిన దినములు. శేషమును ౬౦ చే గుణించి ౨౦౦ చే భాగించగా ఘడియలు. ఇట్లె విఘడియలు సేయవలెను. ఉదాహరణము. తాత్కాలికస్ఫుటగ్రహము రాశ్యాదిరా ౧ భా ౮ క ౪౫ విలి. వీటిని లిప్తలుజేయగా వచ్చినమొత్తము ౨౩౨౫ దీనిని ౨౦౦ చే పాలుగొనగా లబ్ధము ౧౧ ఇది

పండ్రెండింట భాగించుటకు చాలదు గనుక ఈ ౧౧ సంవత్సరములగును. శేషము ౧౨౫ పండ్రెండింట గుణించఁగా అయిన ౧౫౦౦ ను ౨౦౦ చే పాలుగొనఁగా వచ్చిన మాసములు ౭ శేషము ౧౦౦ ను ౩౦ చే గుణించఁగా ౩౦౦౦ దీనిని ౨౦౦ చే భాగించఁగా దినములు ౧౫ శేషము లేదుగనుక గడియలు లేవు. ఇట్లే అన్నిగ్రహములకు లగ్నములకు అంశాయుర్నిర్ణయము జేయతగినది.

హోరా సర్వబలోపేతా రాశితుల్యాని యచ్ఛతి,
వర్షాణ్యన్యాని మాసాది భాగైస్త్రైరాశికాత్సునః. 5

లగ్నము బలయుక్తమైనదాయెనేని మేషాదిగా నెన్నిరాసులు గతములో అన్ని సంవత్సరములనియు, వర్తమానరాశియందు గతమైన భాగాదికము ననుసరించి మాసాదులు త్రైరాశికముచే తెలియతగినవి. ఎట్లన. భుక్తభాగాదులను లిప్తలుజేసి ౧౨ చే గుణించి రాశిప్రమాణలిప్తలు ౧౮౦౦ వీనిచే భాగించఁగా లబ్ధము మాసములు శేషము ౩౦ చే గుణించి ౧౮౦౦ చే భాగించఁగా దినములు. శేషము ౬౦ చే గుణించి ౧౮౦౦ చే భాగించఁగా ఘడియలు అని తెలియఁదగినది.

వర్గోత్తమే స్వభవనే స్వద్రేక్కాణే నవాంశకే,
ద్విగుణం సంప్రయచ్ఛంతి త్రిగుణం వక్రతుంగయోః. 6

వర్గోత్తమమందును స్వక్షేత్రమందును స్వద్రేక్కాణమందును స్వనవాంశయందును నున్న గ్రహములచేతను ఇవ్వఁబడిన ఆయుర్దాయము రెండింట గుణించతగినది. (లగ్నము వర్గోత్తమమాయెనేని ఆయుర్దాయము ద్విగుణించవలయు ననుట.) ఉచ్చయందున్నట్టియు వక్రమును బొందినట్టియు గ్రహముల ఆయుర్దాయము త్రిగుణించవలసినది.

యదా తూపచయస్సర్వస్స్వరాశ్యాదిస్థితైర్గ్రహైః,
సమస్తవర్గణా తత్ర కర్తవ్యా శాస్త్రచింతకైః. 7

గ్రహము స్వక్షేత్ర స్వద్రేక్కాణ స్వనవాంశలయందుండెనేని ఆయుస్సు వృద్ధిగలిగి యుండును సమస్తవర్గణము అనఁగా ఒకగ్రహమునకు రెండు లేక మూఁడు లేక నాలుగుభరణలు [అనఁగా ఒకగ్రహము స్వక్షేత్రమునను స్వద్రేక్కాణమును స్వనవాంశమునను ఉండెనేని సంభవించును. అట్టిసమయమున అన్నియుం చేయతగినది. ఎట్లన ఉదాహరణము —రవి రాశ్యాది ౪-౧౪-౦-౦- స్వక్షేత్రము స్వద్రేక్కాణము స్వనవాంశము వర్గోత్తమాంశము అయియున్నది. సూర్యునకు రాబడిన అంశాయుర్దాయము సం ౧౧ మా ౭ ది ౧౫ స్వక్షేత్రమందుండుటచే ద్విగుణించగా సం ౨౩ మా ౩ ది ౦ స్వద్రేక్కాణమం దుండుటచే ద్విగుణించఁగా సం ౨౩ మా ౩ ది ౦ స్వనవాంశయందుండుటచే ద్విగుణించఁగా సం ౨౩ మా ౩ దిం వర్గోత్తమమందుండుటచే ద్విగుణించఁగా సం ౨౩ మా ౩ ది ౦ అన్నియు మొత్తము సేయు సూర్యుఁడు వర్గచతుష్టయమందుండుటచేత గలుగు ఆయుర్దాయము సం ౯౩ మా ౦ ది ౦ ఘ ౦. ఇట్లే తెలియఁదగినది.

కేంద్రాది సంస్థితే ఖేటే సకలం ద్విగుణైకగాం,
శంసంతి వర్గణాం కేచి న్నచ చూడామణేర్మతమ్. 8

కేంద్రపణపరఆపోక్లిమస్థానములయందు గ్రహములు ఉండెనేని క్రమముగ ౨-౩-౧ వారివారి ఆయుర్దాయమునకు గుణకములగును. ఇట్లు కొందఱు చెప్పిరి. ఇది చూడామణియను గ్రంథకర్తమతము గాదు. కేచిదనుటచే సర్వసమ్మతము గాదనియే తాత్పర్యము.

బహువర్గణసంప్రాప్తౌ యాం కరో త్యేకవర్గణాం,
వరాహమిహిరాచార్యస్సా న దృష్టా పురాతనైః. 9

ఒకగ్రహమునకు అనేకభరణలు (అనేకగుణనలు) సంభవించినచో అధికమైన దొక్కటియే చేయవలయును. సమానమైన భరణలు (గుణనలు) సంభవించినచో ఒక్కటిమాత్రమే జేయవలయును (భరణలుగూడ నీప్రకారంమే యనుట.) ఈప్రకారము వరాహమిహిరాచార్యులచేఁ జెప్పఁబడినవి గాని, పూర్వులమత మట్లుగాదని తెలియఁదగినది (ఈవచన మయుక్తమని కేశవదైవజ్ఞాదులచేఁ జెప్పఁబడినందున వరాహమిహిరమతము గర్గాదిమునిసమ్మతమని దివాకరదైవజ్ఞాదులచేఁ జెప్పఁబడినది).

రిపురాశౌ త్రిభాగోన మర్ధోనం నిమ్నగాస్తగాః,
దాయంగ్రహాః ప్రయచ్ఛంతి నాస్తగా సితభార్గవా. 10

శత్రుక్షేత్రమందున్న గ్రహము తన ఆయుర్వర్షములలో మూఁడవపాలివర్షములను హరించుననియు, నీచను లేక అస్తమయమును బొందిన గ్రహము తన ఆయుర్వర్షములలో సగము వర్షములను హరించును అస్తమయమువలన గలుగు హరణ శుక్రశనులకు లేదని యెఱుఁగవలయు.

సర్వమర్థం తృతీయాంశ శ్చతుర్థః పంచమ స్తథా,
షష్ఠశ్చాంశక్షయం యాతి వ్యయాద్వామం గ్రహే స్థితే 11
సౌమ్యే త్వర్ధమితో యాతి నాశం బహుభిరేకగైః,
ఏక ఏవ బలీ హంతి హ్యాయుషస్సర్వదా గ్రహః. 12

లగ్నమునకు ద్వాదశమందు పాపగ్రహములుండెనేని ఆగ్రహముయొక్క ఆయుష్యు సర్వము క్షయించును ఏకాదశమందు పాపగ్రహము ఉండెనేని ఆగ్రహముయొక్క ఆయుర్దాయములో అర్ధము క్షయించును దశమమందు పాపగ్రహముండెనేని ఆగ్రహముయొక్క ఆయుర్దాయములో మూఁడవపాలు క్షయించును నవమమందు పాపగ్రహముండెనేని చతుర్థాంశము క్షయించును అష్టమమందు పాపగ్రహముండెనేని పంచమాంశము క్షయించును సప్తమమందు పాపగ్రహముండెనేని తన ఆయుర్దాయములో ఆరవపాలు క్షయించును శుభగ్రహములుండెనేని పాపగ్రహములకుఁ జెప్పిన హరణములో సగము క్షయించును అనఁగా శుభగ్రహము లగ్నమునకు ద్వాదశమందుండెనేని ఆగ్రహముయొక్క ఆయుష్యులో సగము హరించును ఏకాదశమందుండెనేని చతుర్థాంశము హరించును దశమమందుండెనేని షష్ఠాంశము హరించును. నవమమందుండెనేని అష్టమాంశము హరించును అష్టమమందుండెనేని దశమాంశము హరించును సప్తమమందుండెనేని ద్వాదశాంశము హరించును శుభగ్రహములుగాని పాపగ్రహములుగాని ఈ వ్యయాదిస్థానములలో నొకస్థానమందు రెండు మూఁడు గ్రహములుండెనేని వానిలోపల అధికబలముగల గ్రహమొక్కటియె ఆస్థానమునకు తనకుఁజెప్పియున్న హరణాంశమును హరించును ఇంతవరకు అంశాయుర్దాయము చెప్పఁబడెను.

## ఇక పిండాయుర్దాయము

ఏకోనవింశతి ర్భానో శ్శశినః పంచవింశతిః,
తిథయః క్షితిపుత్రస్య ద్వాదశైవ బుధస్య తు 13
గురోః పంచదశాబ్దాని శుక్రస్యాప్యేకవింశతిః,
వింశతీ రవిపుత్రస్య పిండాయుస్స్వోచ్చసంస్థితేః. 14

రవి ౨౧ చంద్రుఁడు ౨౫ కుజుఁడు ౧౫ బుధుఁడు ౧౨ గురుఁడు ౧౫ శుక్రుఁడు ౨౧ శని ౨౦ ఇవి పరమోచ్చయందున్న సూర్యాదిగ్రహములు ఇచ్చెడి పరమాయుఃప్రమాణ సంవత్సరములు. మయ, యవన, మణిత్థ, పరాశరుఁడు మొదలుగాఁ గలిగినవారి మతానుసారము పిండాయుఃప్రమాణవత్సరములని తెలియఁదగినది.

స్వోచ్చ శుద్ధో గ్రహశ్శోధ్యష్షడ్రాశ్యూనో భమండలాత్,
స్వపిండగుణితో భక్తో రాశిమానేన వత్సరాః 15

ఇష్టమైన స్ఫుటగ్రహమునకు రాశ్యాదిలిప్తాంతము లెక్క దేర్పరచి అందు పూర్వోక్తమైన ఉచ్చధ్రువములను (సూర్యునకు ౦-౧౦-౦-౦ చంద్రునకు ౧-౩-౦-౦ ఇత్యాదులనుట) త్రోసివేసి శేషము నుంచుకొనఁదగినది. గ్రహము పరమోచ్చభాగము నకు లోపలనే (తక్కువగా) యుండెనేని ఉచ్చధ్రువకము పోవుగాన అపుడు గ్రహములో ౧౨ రాసులను జేర్చి అందు ఉచ్చధ్రువకమును త్రోసివేసి శేషము ఉంచుకొనఁదగినది ఆశేషము ౬ రాసులకు తక్కువగా నుండెనేని దానిని ౧౨ రాసులలో త్రోసివేసి తచ్ఛేషము ఉంచుకొనఁదగినది. ఆరురాసులకు అధికముగ నుండెనేని అదే ఉంచుకోఁదగినది ఈరీతిగా నేర్పడినదానిని రాశ్యాది విలిప్తాంతముగా పెట్టుకొని ఆయాగ్రహపరమాయుర్వర్షముల చేత ప్రత్యేకముగా గుణించి విలిప్తాస్థానమును ౬౦ ట పాలుగొని ఆలబ్ధమును లిప్తాస్థానమందు గూడి ఆలిప్తాస్థానమును ౬౦ ట పాలుగొని ఆలబ్ధమును భాగస్థానమందు గూడి ఆభాగస్థానమును ౩౦ ట పాలుగొని ఆలబ్ధమును రాశిస్థానమందు గూడి ఆరాశిస్థానమును ౧౨ ట పాలు గొనగా వచ్చిన లబ్ధము భగణస్థానమగును. ఆభగణస్థానము సంవత్సరములు రాశిశేషము మాసములు భాగశేషము దినములు లిప్తాశేషము గడియలు విలిప్తాశేషము విఘటికలు. ఇట్లుజేయ సూర్యాదిగ్రహముల ఆయుఃప్రమాణం జేర్పడును. ఉదాహరణము· రాశ్యాదిస్ఫుటరవి ౧-౧౩-౪౮-౦ సూర్యునకుపరమోచ్చము రాశ్యాది ౦-౧౦-౦-౦ స్ఫుటరవిలో త్రోసి వేయఁగా శేషము రాశ్యాది ౧-౩-౪౮-౦ ఇది ఆరురాసులకు తక్కువగా నున్నది గనుక ౧౨ రాసులలో త్రోసివేయఁగా మిగిలినరాశ్యాది ౧౦-౨౬-౧౨-౦ పరమోచ్చాయుఃప్రమాణసంవత్సరసంఖ్యయైన ౧౯ చేత ప్రత్యేకముగా గుణించఁగా వచ్చినది ౧౯౦-౪౯౪-౨౨౮-౦ వీటిని పూర్వోక్తప్రకారము స్వచ్ఛేదముల చేత పాలు గొనఁగా వచ్చినసంవత్సరములు ౧౭ మా ౨ ది ౧౭ ఘడి ౪౮ వి ౦ అని తెలియ దగినది.

పూర్వోక్తం చింతయేత్సర్వం వక్రం ముక్త్వారిరాశిషు,
క్షయ స్తత్ర ప్రకర్తవ్యో నీచేఽర్ధం వృద్ధి రుచ్చగే. 16

ఈపిండాయుర్దాయమునందు కుజునకు శత్రుక్షేత్రహరణ వినాగా రవ్యాది సర్వగ్రహములకు పూర్వమందుఁ జెప్పఁబడిన హరణలన్నియుఁ జేయవలయును. శుక్రశనులకు అస్తంగతహరణ లేదని పూర్వము జెప్పియున్నది. గాన ఈపిండాయుర్దాయమునందున్ను శుక్రశనులకు అస్తంగతహరణ లేదని తెలియదగినది. ఉచ్చయందుండెనేని పూర్ణమనియుం నీచయందుండెనేని అర్ధమనియున్ను అనువిషయము పూర్వోక్త స్వోచ్చశుద్ధో యను శ్లోకముచే సిద్ధమగుగాన వేరే నీచహరణజేయ నక్కఱలేదు.

లగ్ననాయోంశతుల్యస్స్యాదంతరే చానుపాతతః,
తత్పతౌ బలసంపన్నే రాశితుల్యం స్వభాధిపే 17

ప్రకారాంతరముచే లగ్నాయుర్దాయమును జెప్పుచున్నాఁడు నవాంశాధిపతి బలవంతుఁడై యుండెనేని నవాంశసమముగాను, రాశ్యధిపతి బలవంతుఁడై యుండెనేని రాశితుల్యముగను ఆయుర్నిర్ణయముఁ జేయఁదగినది ఎట్లన. లగ్నమం దెన్నినవాంశలు గతములో అన్నిసంవత్సరములు వర్తమాననవాంశమునుబట్టి త్రైరాశికముచే మాసాదులు దెలియఁదగినది. ఇట్లే మేషాది ఎన్నిరాసులు గతములో అన్నిసంవత్సరములు వర్తమానరాశి ననుసరించి మాసాదులు సాధించవలయును.

క్రూరోదయహరణను జెప్పుచున్నాఁడు.—

లగ్నాంశలిప్తికా హత్వా ప్రత్యేకం విహగాయుషా,
భక్త్వా మండలలిప్తాభిర్లబ్ధం వర్షాది శోధయేత్ 18
స్వాయుషో లగ్నగే క్రూరే లబ్ధస్యార్ధం శుభేక్షితే,
ఏవమేవ ప్రకర్తవ్యం జీవశర్మోక్తచంద్రజే. 19

క్రూరగ్రహములగు రవికుజశనులలో నొకఁడు లగ్నమందుండెనేని సర్వగ్రహములయందును క్రూరోదయహరణ జేయవలయును. ఎట్లన మేషము మొదలుకొని గతరాసులను ౧౮౦౦ లచే గుణించవలెను. వర్తమానరాశియందు గతలిప్తలను పూర్వగణకములోఁ జేర్చఁగా మేషాదిగా వర్తమానరాశియందైన వర్తమానలిప్తవరకు గతలిప్తలగును. ఈలిప్తలచేఁ ప్రత్యేకముగా ప్రతిగ్రహముయొక్కయున్ను హరణావశిష్ట శుద్ధాయుర్దాయమును గుణించి చక్రలిప్తలగు ౨౧౬౦౦ చే భాగించఁగా లబ్ధమైన వర్షాదులను ఆయాగ్రహముల శుద్ధాయుర్దాయములో తీసివేయవలయును. (గతలిప్తల చేత ఏగ్రహముయొక్క హరణావశిష్టశుద్ధాయుర్దాయము గుణింపఁబడినదో లబ్ధవర్షాదికము ఆగ్రహముయొక్క హరణావశిష్ట శుద్ధాయుర్దాయములో తీసివేయఁదగినదని భావము.) కొందఱు పాపగ్రహము లగ్నమందుండెనేని జననసమయమునఱకు లగ్న

మంబైన గతలిప్తలచేత ప్రత్యేకప్రత్యేకముగా ప్రతిగ్రహముయొక్కయుం హరణావశిష్ట శుద్ధాయుర్దాయమును గుణించి ౨౧౬౦౦ లచే భాగించఁగా లబ్ధవర్షాదికము ఆయా గ్రహముయొక్క శుద్ధాయుర్దాయములోఁ దీసివేయఁగా పరిశుద్ధాయుర్దాయ మేర్పడు నని జెప్పిరి లగ్నమందున్న క్రూరగ్రహము శుభేక్షితుఁడాయె నేని లబ్ధవర్షాదికమును సగముజేసి శుద్ధాయుర్దాయములో తీసివేయవలయును. ఈప్రకారమే జీవశర్మోక్త ఆయుస్సందును నిసర్గాయుర్దాయమందును తెలియతగినది. పరమాయుస్సును ౭ చే భాగించఁగా ఉచ్చయందున్న ఒకొక్కగ్రహాయుర్దాయము వచ్చునని జీవశర్మ చెప్పెను. ఈవిషయమై జీవశర్మ శ్లో "సప్తదశై (౧౭) కం (౧) ద్వియమా (౨౨) వసవో (౮) వేదాగ్నయో (౩౪) గ్రహేంద్రాణాం, వర్షాద్యుచ్చస్థానాం నీచస్థానా మతోఽర్థంస్యాత్ మధ్యేఽనుపాతత స్స్వ దానయనం శిష్ట మత్ర యత్కించిత్, పిండాయుష ఇవకార్యం తత్సర్వం గణితతత్వజ్ఞైః" అని జీవశర్మ చెప్పియున్నాఁడు గనుక పరమాయుర్దాయమగు సం ౧౨౦ మా ౦ ది ౫ ఈ పరమాయుర్దాయమును ౭ చే భాగించఁగా ఉచ్చయందున్న ఒకొక్కగ్రహముయొక్క ఆయుర్దాయము వర్షాది ౧౭, ౧, ౨౨, ౮ ౩౪, గ్రహము నీచయందుండె నేని మునుపటివలెనే సగము ఖయిం చును. కాఁబట్టి సం ౮ మా ౬ ది ౨౬ ఘ ౪ విఘ ౧౭ ఉచ్చనీచమధ్యయందుండె నేని పిండాయుర్దాయముకు చెప్పినరీతినను లేక మరియొకరీతినను, త్రైరాశికాద్యనుపాతానుసరణముగను ఆయాగ్రహాయుర్దాయమును సాధించవలయును. కుజునకుగాకతక్కిన గ్రహములకు శత్రుక్షేత్రహరణ జేయతగినది. శుక్రశనులకుగాక తక్కిన నాలుగు గ్రహములకు అస్తంగతహరణ జేయతగినది. లగ్నము పాపాక్రాంతమైనప్పుడు సర్వగ్రహములకు క్రూరోదయహరణ జేయవగినది. చక్రపాతిహరణయుం చేయతగినది. ఈ ప్రకారము నాలుగువిధములైన హరణలుజేసి జీవశర్మమతానుసారము ఆయుర్నిర్ణయము జేయతగినది.

వింశతిరేతం ద్వితయం నవధృతిరిహ వింశతిశ్చ పంచాశత్,
వర్షాణామపి సంఖ్యా సూర్యాదీనాం నిసర్గభవాః. 20

రవి ౨౦ చంద్రుడు ౧ కుజుఁడు ౨ బుధుఁడు ౯ గురుఁడు ౧౮ శుక్రుడు ౨౦ శని ౫౦ ఇది నిసర్గాయుర్దాయము. లగ్నరవిచంద్రులలో చంద్రుడు స్థానాదిబలయుక్తుఁడాయె నేని ఈయాయుర్దాయమునకు హరణలుజేసి శుద్ధాయుర్దాయము జేయతగినది. ఎట్లన పిండాయుర్దాయమునకుఁ జెప్పినరీతిగనే ఈచెప్పిన సంఖ్యాకవత్సరములు తమతమపరమోచ్చలయందున్న సూర్యాదిగ్రహములిచ్చెదు పరమాయుఃప్రమాణవత్సరములు తమతమ పరమనీచలయందుండిరేని తదర్ధము. అనఁగా రవికి సం ౧౦

చంద్రునకు మా ౬ కుజునకు సం ౧ బుధునకు సం ౪ మా ౬ గురునకు సం ౯ శుక్రునకు ౧౦ శనికి ౨౫ ఉచ్చనీచలమధ్యయందుండెనేని త్రైరాశికముచే పూర్వోక్త ప్రకారము సాధించతగినది. ఇట్లు సాధించఁగా వచ్చినఆయుర్దాయములో శత్రుక్షేత్ర హారణయు శత్రుక్షేత్రహారణ కుజునకు లేదనుట.) అస్తంగతత్వహారణ (శుక్రశనులకు లేదనుట) చక్రపాతహారణయు క్రూరోదయహారణయు చేయతగినది. ఇట్లు చేసి హారణసహితశుద్ధాయుర్దాయమును అనుసరించి ఆయుర్నిర్ణయముఁ జేయతగినది.

మీనోదయేంశే నవమే పంచవింశతిలిప్తికే,
గవిసౌమ్యేస్వతుంగస్థైశ్శేషైరాయుఃపరం భవేత్. 21

మీనరాశియొక్క కడతిమనవాంశ (తొమ్మిదవనవాంశ) లగ్నమైయుండఁగా బుధుఁడు వృషభమున ౨౫ లిప్తల నతిక్రమించి యుండఁగాను తక్కిన రవిచంద్ర కుజగురుశుక్రశనులు తమతమపరమోచ్చలయం దుండిరేని ఇట్టియోగమునఁబుట్టినవాఁడు పరమాయుఃప్రమాణమైన సం ౧౨౦ మా ౦ ది ౫ జీవించును.

కర్కిలగ్నే గురుస్సేందుః కేంద్రగౌ బుధభార్గవౌ,
శేషైస్త్రిలాభషష్ఠస్థై రమితాయు ర్భవేన్నరః 22

లగ్నము కర్కాటకము లగ్నమున చంద్రగురులు కేంద్రములయందు బుధ శుక్రులు ౩, ౬, ౧౧స్థానములయందు రవికుజశనులు ఇట్లుండఁగాఁ బుట్టినవాఁడు పూర్వోక్తపరమాయుస్సుకంటెను అధికమైన ఆయుర్దాయము గలవాఁడు అగును. అనఁగా ఇట్టియోగమందుఁ బుట్టినవానికి ఆయుర్దాయగణన సేయఁబడలేదని యెఱుంగవలయు.

ద్విఘ్నాష్షష్టి ర్నిశాః పంచ పరమం నరదంతినాం,
ద్వాత్రింశ ద్వాజినామాయుః ఛాగాదీనాం తు షోడశ. 23
ఖరోష్ట్రయోః పంచవర్గ ఏకోపోహ్యాం వృషాదిషు,
శునాంతు ద్వాదశ ప్రోక్తం గణితం పరమాయుషం,
తత్తత్పరం ప్రమాణేన హత్వైషా మాయు రాదిశేత్. 24

మనుష్యుల పరమాయుర్దాయము సం ౧౨౦ మా ౦ ది ౫, గజముల పరమాయుర్దాయము సం ౧౨౦ మా ౦ ది ౫, గుఱ్ఱములు పరమాయుర్దాయము సం ౩౨, మేకలు మొదలైనవానియొక్క పరమాయుర్దాయము సం ౧౬, ఖరములయొక్కయు ఒంటెలయొక్కయు పరమాయుర్దాయము సం ౨౫, వృషభములు, గోవులు

మహిషములు మొదలైనవానియొక్క పరమాయుర్దాయము సం ౨౫, కుక్కలయొక్క పరమాయుర్దాయము సం ౧౨, కుక్కలు అనుటచేత వ్యాఘ్రమార్జారాదులు ఉపలక్షణములు. ఇచ్చట అశ్వాదుల పరమాయువు చెప్పుట అశ్వాదుల జన్మకాలమునుబట్టి ఆయుః ప్రమాణనిర్ణయము జేయుటకని తెలియతగినది. అందుకు అశ్వాదుల పరమాయుః ప్రమాణము ననుసరించి త్రైరాశికగణితముచేత అశ్వాదులయొక్క ఆయుర్నిర్ణయము నేర్పరచతగినది. ఎట్లనఁగా: పూర్వము మనుష్యులకుఁ జెప్పినరీతిగా ఆయుర్నిర్ణయము హారణభరణసహితముగాజేసి స్పష్టమైనతరువాత త్రైరాశికానుపాతము. ఎట్లన ౧౨౦ సంవత్సరముల ౫ రోజులు పరమాయుస్సుగల జంతువునకు చెప్పఁబడిన (రాబడిన) ఆయుర్దాయమైనచో, అశ్వాదిజంతువుల పరమాయుర్దాయమునకు ఎంతఆయుర్దాయము అని అనుపాతము జేయతగినది. "శ్లో. ప్రమాణమిచ్ఛా చ సమానజాతీ అద్యంతయో స్తత్ఫల మన్యజాతిః, మధ్యే తదిచ్ఛాహత మాద్య హృత్స్యా దిచ్ఛాఫలం వ్యస్త విధి ర్విలోమే" అని లీలావతియందుఁ జెప్పఁబడియున్నది. గాన చెప్పఁబడిన (రాఁబడిన) ఆయుర్దాయమును అశ్వాదిజంతువుల పరమాయుస్సుచేత గుణించి మనుష్యపరమాయుర్దాయముచేత భాగించఁగా, ఆయాజంతువులయొక్క ఆయుర్నిర్ణయము తెలియునని తెలియతగినది.

పథ్యాశినాం శీలవతాం నరాణాం
సద్వృత్తభాజాం విజితేంద్రియాణామ్,
ఏవంవిధానా మిదమాయు రత్ర
చింత్యం సదా వృద్ధమునిప్రణీతమ్. 25

మితముగ భోజనము సేయునట్టియు, సత్స్వభావము గలిగినట్టియు, సదాచారప్రవర్తకులైనట్టియు, జితేంద్రియులైనట్టియు మనుష్యులకో అకుగాను. ఈప్రకార మాయుర్నిర్ణయము పూర్వులచే చెప్పఁబడినది (రోగులు మొదలైనవారివిషయము గాదని తెలియవలయు.)

ఇతి ఏకోనచత్వారింశోఽధ్యాయః.

---

మూలదశలను (మహాదశలను) ఫలములను దెలుపు నలుబదియవ యధ్యాయము.

ఆయుర్హి యేన యద్దత్తం సా దశా తస్య కీర్తితా,
స్వదోషగుణయోగేన స్వదశాసు ఫలప్రదా. 1

ఏగ్రహమునకు హారణభరణావశిష్టమైన ఆయుస్సు ఎంత యేర్పడుచున్నదో అంతకాలమే ఆగ్రహముయొక్క దశయనియు, ఆగ్రహముయొక్క గుణయోగము ననుసరించి శుభాశుభఫలముల నాలోచించతగినది.

దివా రాత్రి ప్రసూతస్య రవిశుక్ర పురస్సరాః,
మణిత్థస్యాహతజ్జ్ఞానం ఫలసామ్యేన తద్దశాః 2

పగటియందు జన్మగలవానికి రవ్యాదిగా దశాక్రమమని, రాత్రియందు జన్మగలవానికి శుక్రాదిగా దశాక్రమమని మణిత్థమతము ఇది సర్వగ్రంథకర్తృసమ్మతము గాదని తెలియందగినది.

లగ్నార్కశీతరశ్మీనాం యో బలీ తస్య చాగ్రతః,
తత్కేంద్రాదిస్థితానాం చ దశా స్స్యుస్సత్యభాషితే 3

లగ్నరవిచంద్రులలో లగ్నము బలవంతమై యుండెనేని లగ్నమునకును రవి బలాధికుఁడై యుండెనేని రవికిని చంద్రుఁడు బలాధికుఁడై యుండెనేని చంద్రునకును ప్రథమదశ కల్పించి తరువాత ఆప్రథమదశాధిపతికి కేంద్రములయందున్న గ్రహములకు తదుపరి పణపరములయందున్న గ్రహములకు తదుపరి ఆపోక్లిమములయందున్న గ్రహములకును క్రమముగ దశలు కల్పించతగినది. ఇది సత్యాచార్యమతము. ఇదియె బహుసమ్మతము.

హోరా దినేశ శశినాం ప్రబలో భవే ద్య
స్తత్కంటకాదిషు గతాః కథితా దశేశాః,
పూర్వాదశాఽతిబలిన స్సదృశేద్బహువృద్ధే
స్సామ్యే భవేచ్చ శరదాం ప్రథమోదితస్య. 4

లగ్నరవిచంద్రులలో లగ్నము బలవంతమై యుండెనేని లగ్నమునకును రవి బలాధికుఁడై యుండెనేని రవికిని చంద్రుఁడు బలాధికుఁడై యుండెనేని చంద్రునకును ప్రథమదశను కల్పించి తదుపరి ఆప్రథమదశాధిపతికి కేంద్రములయందున్నగ్రహములకు బలాధికక్రమంబున దశలు కల్పించతగినది. తదుపరి ప్రథమదశాధిపతికి పణపరస్థానముల యందున్న గ్రహములకు బలాధికగ్రహక్రమంబుననే దశలు కల్పించతగినది. తదుపరి ప్రథమదశాధిపతికి ఆపోక్లిమస్థానములయందున్న గ్రహములకు బలాధికగ్రహక్రమంబున దశలు కల్పించతగినది. కేంద్రస్థానములయందు గ్రహములు లేకుండెనేని ప్రథమదశాధిపతి దశానంతరము పణపరస్థానములయందున్న గ్రహములకు దశలు కల్పించతగినది. కేంద్రములయందును, పణపరములయందును గ్రహములు లేకయుండెనేని ఆపో

క్లిమస్థానములయందున్న గ్రహములకే ప్రథమదశాధిపతి దశానంతరమున దశలు కల్పించతగినవి. కేంద్రాదిస్థానములయందు (కేంద్రములయందుగాని పణపరముల యందుగాని ఆపోక్లిమములయందుగాని యనుట) అనేకగ్రహము లుండెనేని బలాధిక క్రమముగ దశలను తెలియతగినదని పూర్వమే వ్రాయఁబడినది. ఆకేంద్రాదిస్థానముల యందున్న గ్రహములకు బలసామ్యము గలుగుచుండఁగా ఆగ్రహములలో ఏగ్రహము ఆయుర్దాయవర్షముల నధికముగా నిచ్చునో ఆగ్రహమునకు ముందరదశ కల్పించతగి నది. ఆ ఆయుర్దాయవర్షములకును సమత్వము గలుగుచుండఁగా ఏగ్రహము సూర్య మండలంబుననుండి (మౌఢ్యమును పొంది) మొదట నుదయించి యుండునో ఆగ్రహము నకు ముందరిదశ కల్పించతగినది.

లగ్నార్క-శీతరశ్మీనాం యది పూర్ణబలం భవేత్,
తదా సత్యమతం శ్రేష్ఠ మన్యథా త్వపరా దశా. 5

లగ్నరవిచంద్రులకు పూర్ణబలము గలిగెనేని సత్యమతరీతిచే దశాకల్పనము చేయుట ఉత్తమమని లగ్నాదులు బలహీనమగుచో మణిత్థాదులమతము గ్రహించదగిన దని తెలియతగినది.

స్వోచ్చస్వరాశినిజభాగసుహృద్గృహస్థా
స్సంపూర్ణవీర్యరుచిరా బలినస్స్వకాలే,
మిత్రోచ్చభాగసహితాశ్శుభదృష్టియుక్తా
శ్శ్రేష్ఠాం దశాం విదధతి స్వవయస్సుఖేటాః. 6

ఉచ్చయందున్నట్టియు స్వక్షేత్ర స్వనవాంశ మిత్రక్షేత్రములయందున్నట్టియు మిత్రనవాంశయందు ఉచ్చనవాంశయందును శుభులచే జూడఁబడునట్టియు గ్రహములు పూర్ణబలవంతులు. ఇట్టి బలవంతులదశలు అధికశుభఫలప్రదములని యెఱుంగునది.

నీచశత్రుగృహం ప్రాప్తా శత్రునిమ్నాంశసూర్యగాః,
విపన్నాః పాపసంబంధా దశాం కుర్యు రశోభనామ్. 7

నీచక్షేత్రమునుగాని శత్రుక్షేత్రమునుగాని శత్రునవాంశనుగాని నీచనవాంశను గాని ఆస్తంగతత్వమునుగాని పరాజయము మొదలైనదానినిగాని పాపసంబంధమునుగాని పొందియుండెనేని తమతమదశలయందు పాపఫలముల నిత్తురని తెలియతగినది.

తుంగాచ్చ్యుతస్య హి దశా సుహృదుచ్చాంశేఽవరోహిణీమధ్యా,
నీచాద్రిపునీచాంశే గ్రహస్య చారోహిణీ కష్టా. 8

గ్రహము తనపరమోచ్చాంశను దాటి పరమనీచాంశకు లోపలనుండెను ఆరు రాసులలో నేరాశియందైనను నుండెనేని ఆగ్రహదశ అవరోహిణి యనంబడును. ఈదశ బుధమఫలము నిచ్చును ఆ అవరోహదశ యేరాశియందైనను మిత్రనవాంశయందు గాని స్వోచ్చనవాంశయందుగాని స్వనవాంశయందుగాని యున్నగ్రహముచేత నియ్యంబడినదయ్యెనేని మధ్యమఫలమునిచ్చును. గ్రహము తనపరమనీచాంశను దాటి ఉచ్చాభిముఖమై యున్నపుడు ఆదశ (అనఁగా తనపరమనీచాంశను దాటి పరమోచ్చాంశకు లోపల నుండెను ఆరురాసులలో నేరాశియందైన నున్నగ్రహదశ) ఆరోహిణి యనంబడును ఈదశ శ్రేష్ఠఫలములనిచ్చును ఆ ఆరోహిణి యనెడుదశ యేరాశియందైనను తనసీచరాశినవాంశయందుగాని శత్రునవాంశయందుగాని యున్నగ్రహముచే నియ్యంబడినదాయెనేని అధమఫలమునిచ్చును

సవితాదశాఫలానాం పాచయితా చంద్రమాః ప్రపోషయితా,
రాశివిశేషేణేందోరతః ఫలోక్తిర్దశారంభే. 9

సూర్యుఁడు గ్రహదశాఫలములను పరిపాకాభిముఖములుగఁ జేయువాఁడు చంద్రుఁడు ఆదశాఫలములను పోషించువాఁడు (అనుభవింపఁజేయువాఁడనుట) గనుక దశారంభమున చంద్రుఁడు ఏరాశియందుండునో దానిననుసరించి ఫలములను తెలియఁదగినది

మూలదశాయా మిందోః కన్యాసు ప్రేక్షితే చంద్రే,
పణ్యాంగనాభిరనిశం సమాగమం ప్రాపు రిహాయవనాః. 10

దశాప్రారంభకాలమున చంద్రుఁడు పూర్ణుఁడై యుండెనేని ఆదశయందు ఎల్లప్పుడు పణ్యస్త్రీలతో సమావేశము కలుగునని యవనులు జెప్పిరి.

సౌమ్యస్త్రీధనలాభః కులీరగేందౌ భవేద్దశారంభే,
కన్యాం దూషయతి నరః కుజభవనే హంతి వాయువతిం 11

దశారంభసమయమున స్ఫుటచంద్రుఁడు కర్కాటకమందుండెనేని యోగ్యమైన భార్య ధనము మొదలైనవి గలుగును. కుజక్షేత్రమందుండెనేని స్త్రీలను దూషించువాఁడును, స్త్రీలను చంపువాఁడును అగును

విద్యాశాస్త్రజ్ఞానం మిత్రప్రాప్తిం కరోతి బుధరాశౌ,
శౌక్రేఽన్నపాన మతులం సౌఖ్యం చంద్రేఽరినాశంచ. 12

దశారంభమున స్ఫుటచంద్రుఁడు బుధక్షేత్రమందుండెనేని విద్యలను శాస్త్రములను తెలిసినవాఁడు,మిత్రులు మొదలైనవి గలవాఁడగును. శుక్రక్షేత్రమందుండెనేని అన్నపానసౌఖ్యము గలవాఁడు, శత్రువులను నశింపఁజేయువాఁడును అగును.

సుఖధనమానాజ్ఞాప్తిం జీవగృహే దిశతి శీతాంశుః,
పరిణతవయసమరూపాం సౌరగృహే వర్ధకీంవాఽపి 13

పూర్వోక్తచంద్రుఁడు గురుక్షేత్రమందుండెనేని ధనము సుఖము అభిమానము ఆజ్ఞ మొదలైనవి గలవాఁడగును శనిక్షేత్రమందుండెనేని శీఘ్రముగ ముసలితనమును బొందినట్టియుం, విరూపిణియైనట్టియుం, జారిణియైనట్టియుం భార్యగలవాఁడగును.

దుర్గారణ్యానివాసం కర్షణగృహకర్మసేతుకర్మాంతం,
సింహే శశీ ప్రకురుతే స్త్రీపుత్రవివాద మరతించ. 14

చంద్రుఁడు సింహమందుండెనేని పర్వతములు అరణ్యములు మొదలైనవాని యందు నివసించువాఁడును, దుష్టట గృహములు కట్టుట మొదలైనవి సేయువాఁడు, భార్యాపుత్రులతో ద్వేషించువాఁడు, ఆసక్తి లేనివాఁడు అగును.

బంధ్వర్థక్షయరోగాః కుజసౌరాభ్యాం బుధేనపాండిత్యం,
దృష్టే తదోన్యనిపమై శ్శేషై శ్చంద్రే నిశాఫలై ర్యోగః. 15

చంద్రుఁడు (దశాప్రారంభమందైన స్ఫుటచంద్రుఁడు) కుజశనులచేఁ జూడఁ బడెనేని ఆదశయందు బంధువులు ధనము నశించును. వ్యాధిగ్రస్తుఁడగును. బుధునిచేఁ జూడఁబడెనేని విద్యాభివృద్ధిగలుగును. తక్కిన గ్రహములచేఁ జూడఁబడెనేని ఆగ్రహ స్వభావఫలములు గలవాఁడగును.

పాకస్వామినిలగ్నే సుహృదాం వర్గేఽథవాఽపి సౌమ్యానాం,
శ్రేష్ఠదశాయాం సూతి ర్లగ్నాదుపచయగృహస్థేవా. 16

పూర్వోక్తప్రకారముగా దశలను దెచ్చి ఆదశాప్రారంభకాలమునకు తాత్కాలిక దృక్సిద్ధోపయోగ సిద్ధాంతగ్రంథరీతిచే లగ్నమును గ్రహములను స్ఫుటము జేయవల యును. ఇట్లు జేయఁగా దశాధిపతి దశాప్రవేశకాలికలగ్నమందున్నను లేక మిత్రవర్గ మందున్నను లేక శుభవర్గమందున్నను (శుభలగ్నమందున్నను) లేక ఉపచయస్థానము లగు 3, ౬, ౧౦, ౧౧ స్థానములయందున్నను ఆదశ శుభఫలప్రదమైనదగును.

మిత్రోచ్చోపచయస్థానే త్రికోణే సప్తమే తథా,
పాకేశ్వరా త్స్థిత శ్చంద్రః కురుతే సఫలాం దశాం. 17

చంద్రుఁడు మిత్రక్షేత్రమందైనను ఉచ్చక్షేత్రమందైనను దశాధిపతియున్న స్థానమువల్లనుంచి ఉపచయస్థానములయందైనను త్రికోణస్థానములయందైనను సప్తమ మందైనను యుండెనేని ఆదశ సఫలమైనది (శుభఫలముల నిచ్చునది) యగును.

విపరీతే స్థితే చంద్రే దశాదౌ పర్యవస్థితే,
స్వోచ్చగస్యాపి ఖేటస్య దశా న ప్రతిపూజితా. 18

దశాదియందైనచంద్రుఁడు పూర్వముచెప్పిన స్థానములకు వ్యత్యయముగ (తది తరస్థానములయందనుట) యుండెనేని దశాధిపతి ఉచ్చయందున్నను ఆదశ అశుభ ప్రదమైనది యగును

శత్రునీచనవాంశేషు శస్తే రాశౌ గ్రహస్య చ,
దశామిశ్రఫలా రిక్తా విబలస్య దశామతా. 19

శుభఫలప్రదరాశియందైనను శత్రునీచనవాంశలయందున్న గ్రహముయొక్క దశ మిశ్రఫలము నిచ్చును దశాధిపతి స్థానాదిబలములచే హీనుఁడైయుండెనేని ఆదశ నిష్ఫలమైనదని యెఱుంగవలయు.

ద్రేక్కాణే చ దశామూర్తేః పూజితా మధ్యమాధమా,
చరే మిశ్రే ప్రతీపా చ స్థిరే పాపేష్టమధ్యమా 20

లగ్నదశాఫలములను వివరించుచున్నాఁడు:—చరరాశి లగ్నమై అందు ప్రథమ ద్రేక్కాణమయ్యెనేని ఆదశ శ్రేష్ఠమైనదగును. ద్వితీయద్రేక్కాణ మయ్యెనేని ఆలగ్నదశ మిశ్రమఫలప్రదమైనదగును. తృతీయద్రేక్కాణమయ్యెనేని అధమమైన దగును. ద్విస్వభావరాశి లగ్నమై అందు ప్రథమద్రేక్కాణ మయ్యెనేని ఆలగ్నదశ అధమఫలప్రదమైనదగును. ద్వితీయద్రేక్కాణమయ్యెనేని మధ్యమఫలప్రదమైన దగును (మిశ్రమఫలమనుట). తృతీయద్రేక్కాణమయ్యెనేని శ్రేష్ఠమైనదగును. స్థిరరాశి లగ్నమై అందు ప్రథమద్రేక్కాణ మయ్యెనేని ఆలగ్నదశ అశుభఫలప్రదమైనదగును. ద్వితీయద్రేక్కాణ మయ్యెనేని శ్రేష్ఠమైనదగును. తృతీయద్రేక్కాణ మయ్యెనేని మిశ్రమఫలప్రదమైనది యగును.

నైసర్గికదశాఫలములను జెప్పుచున్నాఁడు:—

చంద్రారసౌమ్యసితజీవదినాకరార్కిగ్రహాణాం,
క్రమశో హి దశాపరిగ్రహా ఇష్టా నైసర్గికశ్చైవ. 21

నైసర్గికాయుర్దాయమున దశాక్రమము జెప్పుచున్నాఁడు:—చంద్రుఁడు కుజుఁడు బుధుఁడు శుక్రుఁడు గురుఁడు సూర్యుఁడు మందుఁడు వీరలు క్రమముగా దశాధిపతులని తెలియఁదగినది.

స్వోచ్చస్వకాలబలినస్సంపూర్ణబలస్య వా నిసర్గభవా,
ఉత్తమశుభఫలదాసౌ గ్రహస్య నిత్యం దశా భవతి. 22

ఈ నిసర్గదశలయందు స్థానాదిషడ్బలయుక్తుఁడై దృష్టియుం లేక ఉచ్చబలము గలిగి నట్టియు గ్రహముయొక్కదశ అధికశుభఫలప్రదమైనదగును.

స్వరాశౌ స్వత్రికోణే చ స్వాంశే చ శుభమధ్యమా,
స్వోచ్చాభిలాషిణశ్చైవ మిత్రరాశ్యాదిసంస్థితే 23
శుభాధమా దశా జ్ఞేయా విపరీతమత స్థితే,
అనేనైవ విధానేన విజ్ఞేయా పాపదా దశా. 24

పాపుఁడైన దశాధిపతి స్వక్షేత్రముందైనను స్వత్రికోణమందైనను స్వనవాంశ యందైనను నుండెనేని ఆదశ మిశ్రఫలప్రద మైనదగును. తనయుచ్చ పూర్వరాశి యందైనను మిత్రరాశియందైనను మిత్రనవాంశయందైనను మిత్రోచ్చయందైనను నుండెనేని ఆదశ స్వల్పశుభప్రద మైనదగును ఈచెప్పినరీతికి వ్యత్యయముగ నుండె నేని అనఁగా దశాధిపతి శత్రుక్షేత్రమందైనను శత్రునవాంశ యందైనను నీచయందై నను నీచాంశయందైనను నుండెనేని ఆదశ శుభప్రదమైనదగును ఈప్రకారము సర్వ దశలయందును శుభాశుభముల నూహించవలయును.

భానుదశాయాం లభతే నవౌషధాద్యవిషదౌష్ట్యనైరర్థ్యాత్,
గిరిదంతచర్మవహ్నిక్రౌర్యనరేంద్రాహవాద్యైశ్చ. 25
నృపతేరర్థావాప్తిం ధైర్యం భూయస్తథోద్యమం తైక్ష్ణ్యం,
ఖ్యాతం ప్రతాపవృద్ధిం శ్రేష్ఠత్వం భూపతిత్వం చ. 26
భృత్యార్థచోరచక్షుశ్శస్త్రాగ్న్యుదకక్షితీశ్వరాద్బాధాః,
సుతపత్నీబంధుజనైర్నిపీడిత స్స్యాచ్చ పాపరతిః 27
క్షుత్తృష్ణార్తి శ్శోకో హృత్పీడా పైత్తికా స్తథారోగాః,
గాత్రచ్ఛేదో భవతి హి సూర్యదశాయా మనిష్టాయాం. 28

సూర్యుఁడు శుభదశయందున్న నూతనౌషధములు, విషము, పర్వతములు, దంత ములు, చర్మములు, నిప్పు, క్రౌర్యము, రాజయుద్ధములు మొదలగువాని చేరాజువలన ధనము - గూర్చువాఁడు, ధైర్యవంతుఁడు, చురుకైన ప్రయత్నముగలవాఁడు, ఖ్యాతి ప్రతా పము శ్రేష్ఠతగలవాఁడు, రాజు అగును. అశుభదశయందున్న సేవించుట దొంగ నము నేత్రవ్యాధి శస్త్రములు అగ్ని ఉదకము రాజు మున్నగువారివలన బాధనొందువాఁడు, పుత్త్రులు భార్య బంధువులు మున్నగువారిచే బాధనొందువాఁడు, పాపాత్ముఁడు, ఆకలి దప్పి దుఃఖము హృదయము పైత్యరోగము గాయములు గలవాఁడు అగును.

చంద్రదశాయాం విత్తం స్త్రీసంగమమార్దవాత్పథివిహారాత్,
జలతుహినక్షీరరసై రిక్షువికారై స్తథా క్రీడా 29
ద్విజమంత్రిణాం లబ్ధిః పుష్పాంబరసేవనం మధురతా చ,
అర్థవినాశ మకస్మా ద్భూపసదోద్వేష్యతాం లభతే. 30
తైక్ష్ణ్యాటవా ప్తసిద్ధిః పూజాం ప్రాప్నోతి సుమనృపాభ్యాం చ,
మేధాధృతిపుష్టికరీ చంద్రదశా శోభనా నిత్యం. 31

చంద్రదశయందు స్త్రీసంగమమువలన మృదుత్వమువలన మార్గవిహారమువలన ధనము సంపాదించువాఁడు నీరు మంచు పాలు చెఱకురసము మున్నగువానిచే క్రీడించువాఁడు, బ్రాహ్మణులయొక్కయు మంత్రులయొక్కయు వలన పుష్పములను వస్త్రములను మాధుర్యమును పొందువాఁడు, హఠాత్తుగా ద్రవ్యనాశమును రాజువలన తిరస్కారమును పొందువాఁడు. కఠినత్వమువలన కార్యసిద్ధిని సజ్జనుల రాజులపూజను పొందువాఁడు, చురుకైనబుద్ధి ధైర్యము బలముగలవాఁడు అగును.

కురుతే భయం కులస్య చ చంద్రదశా స్వకులవిగ్రహం కష్టం,
నిద్రాలస్యం స్త్రీణాం భయజననీ శోకదా రతిదా. 32

చంద్రుని అశుభదశయందు కులమునకు భయము కులమువారితో తగవు నిద్ర సోమరితనము స్త్రీవలన సుఖదుఃఖములు గలుగును మిశ్రదశయందు మిశ్రమముగ ఫలములు జరుగును అనిభావము.

భౌమదశాయాం లభతే నృపాగ్నిచోరప్రయోగరిపుచూర్ణైః,
వ్యాలవిషశస్త్రబంధనసుతైక్ష్ణ్యకూటైశ్చ ధనలాభం. 33
క్షితిత్యాజావికతాం(?)కస్వర్ణావశ్యాదిభి స్తథాద్యూతైః,
ఆసవకసాయకటుకై రన్యైశ్చ ధనధాన్యభాగ్భవతి. 34

అంగారకుని శుభదశయందు రాజులు నిప్పు, దొంగలు, ప్రయోగము, శత్రువులు, పాముయొక్కవిషము, ఆయుధములు, బంధనములు, తీక్ష్ణత, చురుకుదనము, కూటసాక్ష్యములు, భూములు, మేకలు, గొఱ్ఱెలు, బంగారము, వశీకరణము, జూదము, ఆసవములు, చెఱుకరసాయనములు మున్నగువానిచేత ధనధాన్యవంతుఁ డగును.

మిత్రకళత్రవిరోధో భ్రాతృసుతైర్విగ్రహశ్చ తృష్ణా చ,
మూర్ఛా శోణితదోష శ్శాఖాచ్ఛేదో వ్రణశ్చాపి. 35
పరదారరతిర్ద్వేష్యో గురుసత్యానామధర్మనిరతశ్చ,
పిత్తకృతైరపి దోషై రభిభూతో మానవో భవతి. 36

అంగారకుని పాపదశయందు స్నేహితులతో భార్యతో అన్నదమ్ములతో పుత్త్రులతో వైరము, దురాశ, మూర్ఛ, నెత్తురుచెడిపోవుట, నరములను ద్రెంచు వ్రణము, పరభార్యాసక్తి, గురువులచే ద్వేషింపఁబడుట, అధర్మమున ఆసక్తి, పైత్యాధిక్యమువలన గల్గిన దోషములచే బాధగలవాఁ డగును.

సౌమ్యదశాయాం ప్రాప్తే మిత్త్రాదాఢ్యాద్ధనస్య సంప్రాప్తిః,
దీక్షితనృపతే ర్ద్యూతా ద్వణిగ్జనాచ్చాపి సంభవతి 37
వేసరమహీసువర్ణం శుక్తిద్రవ్యం యశః ప్రశంసా చ,
దూత్యం సౌఖ్యమతుల్యం సౌభాగ్యం మతిచయఖ్యాతిః 38
ధర్మక్రియాసు సిద్ధి ర్హాస్యరతి శ్శత్రుసంక్షయో భవతి,
గణితాలేఖ్యలిపీనాం కౌతుకభాగీ సదా పురుషః 39

బుధుని శుభదశయందు సంపన్నుఁడగు స్నేహితునివలనగాని, దీక్షను చేకొన్న రాజువలనగాని, జూదమువలనగాని, వైశ్యులవలనగాని, ధనలాభము సారవంతమగు భూమి సువర్ణము ముత్యపుచిప్పలు కీర్తి గౌరవము జూదము సాటిలేనిసౌఖ్యము సౌభాగ్యము బుద్ధి ప్రసిద్ధి ధర్మకార్యములనాసక్తి హాస్యమునఁ బ్రీతి శత్రునాశము లెక్కలు చిత్తరువులవ్రాయుట అన్న ప్రీతి ఉత్సాహము గలవాఁడగును.

పీడాం ధాతుత్రితయాత్పారుష్యం బంధనం తథోద్వేగం,
మానసశోకం వాఽపి బుధస్య కష్టా దశా కురుతే. 40

బుధుని పాపదశయందు వాతపిత్తశ్లేష్మములవలన బాధ కాఠిన్యము బంధనము తొందరపాటు మనోదుఃఖము గలుగును.

త్రిదశపతిగురుదశాయాం మంత్రీనృపనృత్యనీతిభిర్విత్తం,
మానగుణానాం లబ్ధిరతిప్రతాప స్సుహృద్వివృద్ధిశ్చ. 41
కాంతాసువర్ణవేసరగజాశ్వభోగీ సదాపురుషః,
మాంగల్యపౌష్టికానాం లాభో ద్విషతాం వినాశశ్చ. 42
లాభో భవతి నరాణాం ప్రీతి స్సదుత్థామిప్తై స్సార్థం,
జనతాయా నృపవక్త్రా త్పణ్యాగ్రా ద్గురుజనాచ్చ ధనలాభః. 43

బృహస్పతి శుభదశయందు మంత్రి రాజులవలన నాట్యము నీతిశాస్త్రము మున్నగువానివలన ధనమునార్జించువాఁడు, అభిమానము ప్రతాపము మిత్త్రులయభివృద్ధి స్త్రీలు సువర్ణము ఒంటెలు ఏనుఁగులు గుఱ్ఱములు మున్నగువానివలన భోగము శుభ

ప్రదములు పుష్టికరములు నగు కర్మలనాచరించుట శత్రునాశము రాజులప్రీతి ప్రజల వలన రాజకార్యమువలన వర్తకము విరివిగాజరుగు (కోస్తా) పట్టణములవలన గురువుల వలన ధనలాభము నందువాఁడు అగును.

వ్యజనాతపత్రసుమనో వస్త్రధ్వజపేయవిశేషతః క్షీణః,
గాత్రశ్వాయుపృథుశోకం పంగుత్వం గుల్మకర్మరోగాంశ్చ,
పుంస్త్వవినాశం మేదః క్షయం నృపతో భయం సమాప్నోతి. 44

బృహస్పతి పాపదశయందు జన్మించినవాఁడు ఛత్రచామరములు పుష్పములు వస్త్రములు ధ్వజములు త్రాగుటకు ఉడుచుటకు బొత్తుగాలేనివాఁడు, శరీరమునవాపు గొప్పదుఃఖము కుంటిదనము గుల్మవ్యాధి చెవిపోటు పురుషత్వములేకపోవుట శరీరము నకు పుష్టినికల్గించు మేధస్సు లేకపోవుట రాజువలనభయము గలవాఁడగును

శుక్రదశాయాం విజయః క్ష్మాభవనవిలాసశయనపత్నీనామ్,
మాల్యాచ్ఛాదనభోజనయశః ప్రమోదో నిధిప్రాప్తిః. 45
గేయంతి స్త్రీసంగో నృపతేః కృషితో ధనస్య సంప్రాప్తిః,
జ్ఞానేష్టసౌఖ్యసుహృదాం మన్మథయోగ్యోపకరణానామ్ 46

శుక్రుని శుభదశయందు జయము భూములు ఇండ్లు విలాసములు శయనములు భార్య పుష్పమాలికలు కట్టుకొనుటకు విలువగలవస్త్రములు షడ్రసోపేతమగుభోజనము యశస్సు సంతోషము నిధిలాభము గానము సంభోగము రాజువలన వ్యవసాయమువలన ధనప్రాప్తి, జ్ఞానము కోరినసౌఖ్యములు స్నేహితులు శృంగారకరములగు వస్తుసముదాయము గలవాఁ డగును.

కులగుణవృద్ధైర్వాదో యానాసనసంభవాని పాపాని,
స్త్రీనృపతికృతావశ్యం లోకవిరుద్ధైస్సహ ప్రీతిః. 47

శుక్రునిపాపదశయందు తనవంశస్థులగు పెద్దలతో విరోధము ప్రయాణసమ యమున కూర్చొనుసమయమున గలిగిన పాపములు, రాజప్రోత్సాహమువలననో స్త్రీ ప్రోత్సాహము వలననో లోకమునకంతకు కీడుగలిగించు దుర్జనులతో సహవాసము గలవాఁడగును.

సౌరేర్దశాం ప్రపన్నః ప్రాప్నోతి పుమాన్ ఖరోష్ట్రమహిషాద్యాన్,
కులటాంజలదంగింవా కులుత్థతిలకోద్రవాదీంశ్చ. 48

బృందగ్రామపురాణా మధికారభవం చ సత్కారం,
లోహత్రపుకాదీనాం స్వకీయపక్షస్థిరాప్తిదం చైవ. 49

శని శుభదశయందు కంచరగాడిదెలు ఒంటెలు గేదెలు వ్యభిచారురాలుగాని లేక మిక్కిలి కోపస్వభావముగలదిగాగాని ఉండుభార్య, ఊలవలు కొఱ్ఱలు గ్రామసమూదాయములలో పట్టణములలో అధికారము వలన గౌరవము సీసము రాగి మున్నగులోహములు తనపక్షమున విరివిగా మనుజులు గలవాఁడగును.

వాహననాశోద్వేగ స్వాతిస్త్రీస్వజనవిప్రయోగశ్చ,
యుద్ధేష్వపజయదోషో మద్యద్యూతోద్భవో మహాకోపః 50
పుత్రైష్వసిద్ధకలహం బంధనతంద్రీశ్వాసం తథాప్యంగం,
భృత్యాపత్యవిరోధో భవతి చ కష్టా యదా దశా సౌరేః. 51

శనియొక్క పాపదశయందు వాహనములు నశించుట వ్యాకులపాటు ప్రీతిలేక పోవుట భార్యతోను బంధువులతోను వియోగము యుద్ధమున ఓడిపోవుట మద్యపానము వలన జూదమువలన కలుగు గొప్పకోపము సత్పురుషులతో కారణములేని కలహము బంధనము భయము సేవకులతో పుత్రులతో విరోధము గలవాఁడగును.

సౌమ్యే పాపఫలం ప్రోక్తం సామాన్యం స్వదశాస్విదమ్,
విశేషేణ ప్రవక్ష్యామి ప్రత్యేకం ఫలభేదతః 52

పూర్వము శుభగ్రహదశయందు సామాన్యముగ పాపఫలములున్ను చెప్పఁబడినవి. అట్టిఫలములను ఫలభేదముచేత విస్తరించి చెప్పఁబోవుచున్నాను.

స్వోచ్చనీచత్రికోణర్క్షం కేంద్రం శత్రుగృహం తదా,
పంచప్రకారసంయుక్తా దశా భానోః ప్రకీర్తితాః. 53

ఉచ్చయందుండు రవిదశ నీచయందుండు రవిదశ త్రికోణస్థానమందుండు రవిదశ కేంద్రములయందుండు రవిదశ శత్రుక్షేత్రమందుండు రవిదశ ఈప్రకారము ఆయాస్థానములయందుండఁగాఁ గలుగు ఆయాగ్రహదశాఫలములను జెప్పుచున్నాఁడు.

రాజ్యం దదాతి విపులం దశా రవేర్లగ్నసుస్థితస్య నృణామ్,
కేంద్రస్థితస్య దద్యాత్కటిగలనేత్రప్రకోపమరిగస్య. 54

లగ్నాది కేంద్రములను పొందిన రవిదశ రాజ్యప్రదమైనదగును. శత్రుక్షేత్రమును పొందిన రవిదశయందు కటిప్రదేశము కంఠము నేత్రములు వీనికి బాధ గలుగును.

నీచస్య దశాభానో ర్నేత్రనాశం జ్వరం శిరోరోగమ్,
బంధన మన్యాశ్చ రుజః కుష్ఠామయ దర్శనం చిహ్నమ్. 55

నీచను పొందిన రవిదశయందు నేత్రనాశము జ్వరము శిరోరోగము బంధనము కుష్ఠరోగము మొదలైనవి గలుగును.

స్వోచ్చ ప్రాప్తస్య దశా దదాతి రాజ్యం సహస్రకిరణస్య,
తురగాతపత్ర చామరకరిరత్న ప్రసంగ్రహితం సమ్యక్. 56

ఉచ్చయందున్న రవిదశ రాజ్యప్రదమైనదియును గుఱ్ఱములు ఛత్ర చామరములు ఏనుఁగులు మొదలైనవి గలుగఁజేయును

సవితు ర్దశా చ పుంసో విదధాతి పురా త్రికోణసంస్థస్య,
ఉత్తమవిషయపతిత్వం విధ్వస్తాశేషదుఃఖస్య. 57

త్రికోణస్థ రవిదశ విస్తారమైన దేశమునకు అధిపతియు దుఃఖములులేనివాఁడును అగును.

శత్రుగృహేర్కదశాయాం నయనవినాశో భవేచ్చ కుబ్జత్వమ్,
జ్వాలాన్నేత్రజరోగా భవంతి కునయః పరిభవాశ్చ 58

శత్రుస్థానమందున్న రవిదశయందు నేత్రనాశము మొదలైనవి గలుగును.

అష్టమగతస్య భానో ర్దశాక్షుమం నయతి సర్వగాత్రం చ,
భ్రమయతి దేశా ద్దేశం ప్రమాపయ త్యపిచ విక్లిష్టమ్. 59

అష్టమమందున్న రవిదశయందు సర్వదేశములు దిరుగువాఁడు కృశించు శరీరము మొదలైనవి గలవాఁడగును.

సామాన్యతశ్చ షోఢా చంద్రదశా భిద్యతే సమాసేన,
స్వోచ్చ సుహృచ్ఛత్రుగృహే నీచే క్షీణే ప్రపూర్ణే చ 60

సామాన్యముగా చంద్రదశ ఆఱువిధములుగఁ జెప్పఁబడును. ఎట్లన: ఉచ్చస్థ చంద్రదశ మిత్రక్షేత్రస్థచంద్రదశ శత్రుక్షేత్రస్థచంద్రదశ నీచస్థచంద్రదశ క్షీణ చంద్రదశ పూర్ణచంద్రదశ అని ఆఱువిధములు.

తత్రోచ్చదశా రాజ్యం నీచదశామరణకరిదశాబంధమ్,
కథయతి నలినీశత్రోర్మిత్రదశా స్వస్వజనసంప్రాప్తిం. 61

ఉచ్చయందున్న చంద్రదశ రాజ్యము నిచ్చును నీచయందున్న చంద్రదశ మరణము గలుగఁజేయును శత్రుక్షేత్రమందున్న చంద్రునిదశ బంధనప్రాప్తి (కట్టుబడుట) మిత్రక్షేత్రమందున్న చంద్రదశ స్వజనప్రాప్తిని గలుగఁజేయును.

క్షీణేందుదశాయోగే చిహ్నాన్యేతాని లక్షయే ద్విద్వాన్,
ఉదరామయజ్వరశిరోనయనోత్థోపప్రతిక్రియాచ్చాపి 62

క్షీణచంద్రుని దశయందు ఉదరమున (కడుపులో) రోగము జ్వరము శిరోరోగము నేత్రరోగము స్వస్థానచ్యుతి మొదలగుఫలములు గలుగును.

బలినః పరపూర్ణస్య చ శశినః కురుతే సదాదశాపుంసామ్,
దయితాసహస్రపరివృత మంతఃపురముత్తమస్త్రీకమ్. 63

బలవంతుఁడైన పూర్ణచంద్రునిదశయందు అనేకభార్యలతో విలసిల్లు అంతఃపురమునందుండి సంతోషించువాఁడగును

భవతి నరస్య భ్రంశో విషయస్యాంతగిపురస్య భృత్యానామ్,
అష్టమచంద్రదశాయాం మ్రియతే చ స్వజనపరిభూతః 64

అష్టమమందున్న చంద్రదశయందు దేశాంతరగమనాదికము బంధుతిరస్కారము మరణము మొదలగు పాపఫలనులు గలుగును.

యంత్రతృణకాష్ఠగోమయవంశకరంజీఫలోదకాజీవీ,
భవతి కదన్నకుచేలీ నృపోఽపి భృతకోఽరిగృహదశాయామ్ 65

శత్రుస్థానమందున్న గ్రహదశయందు యంత్రములు గడ్డి కర్రలు ఆవుపేడ వెదురు మొదలైనవానివలన జీవించువాఁడును, వస్త్రహీనుఁడు, రాజవంశజుఁడైనను నరేంద్రుఁడైనను భృత్యుఁడగును.

లగ్నగృహగస్య హి దశా మండలలాభం తదోచ్చగస్యాపి,
కేంద్రస్థితస్య కురుతే ధనవాహనదేశసంప్రాప్తిమ్. 66

లగ్నమునందున్న గ్రహదశయందు ఉచ్చయందున్న గ్రహదశయందును మండల (రాష్ట్ర) లాభమున్ను కేంద్రమందున్న గ్రహదశయందు ధనము వాహనము దేశము మొదలైనవి గలుగును. రాజవంశజునికి రాష్ట్రము మొదలైనవి గలుగును.

షష్ఠదశా వ్యసనకరీ మరణం చ కరోతి నైధనస్థదశా,
అస్తమితగ్రహపాకో బంధనమాత్రేణ పీడయతి. 67

షష్ఠమమందున్న గ్రహదశ వ్యసనమును జేయును. అష్టమమందున్న గ్రహదశ మరణమును గలుగఁజేయును. అస్తంగతుఁడైన గ్రహదశయందు బంధన (కట్టుబడుట) మొదలైనవి గలుగును.

వక్రోపగస్య హి దశా భ్రమయతి చ కులాలచక్రవత్పురుషమ్,
వ్యసనాని రిపువిరోధం కరోతి పాపస్య నశుభస్య. 68

వక్రగతగ్రహదశ కుమ్మరి చక్రమువలె తిరుగుట గలుగఁజేయును. పాపగ్రహదశయందు అనేకదుఃఖములు శత్రువిరోధము మొదలైనవి గలుగును. శుభగ్రహదశయం దట్లు గలుగదు.

రిక్తాతిరిక్తనిమ్నాతినిమ్న రిపుహ్యాతిరిపుగృహదశాసు,
పృథ్వీపతిరపి భూత్వా స్వభృత్యభృత్యో భవేత్పురుషః 69

నీచరాశియందు పరమనీచయందు శత్రుక్షేత్రమందు వున్నగ్రహదశ అతిపాపఫలము నిచ్చును.

దేశత్యాగో వ్యాధిర్భ్రంశోత్థానం ముహుర్ముహుః కలహాః,
బంధన మరాతిజనితం రిపురాశిగతస్య హి దశాయామ్ 70

శత్రుస్థానమందున్న గ్రహదశయందు స్వదేశత్యాగము, వ్యాధిభ్రమ, ఎల్లప్పుడు కలహము మొదలగు దుష్టఫలములు గలుగును.

మహితకరిగళితమదజలసేకక్షాపీతవారితరజస్కః,
రాజాకష్టసహాయో రిక్తదశాయాం ధ్రువం భ్రమతి. 71

ఏనుఁగులసముదాయములుగల మహారాజైనను స్థానావిచ్యుతులచేతను హీనమైన గ్రహదశయందు నిశ్చయముగ భ్రమణము గలుగును.

అంగప్రత్యంగానాం ఛేదం విదధాతి షష్ఠశత్రుదశా,
కోణాద్యూనారిదశా నిధనారిపదశా శిరచ్ఛేదమ్ 72

షష్ఠస్థానము శత్రుక్షేత్రమై అందుండు గ్రహదశ యందు అవయవఛేదము గలుగును పంచమనవమములుగాని సప్తమాష్టమములుగాని శత్రుక్షేత్రములై అందుండు గ్రహదశయందు శిరచ్ఛేదము గలుగును.

రిపుభయవిదేశగమనం బంధనరోగాదిపీడనం భవతి,
నీచస్థగ్రహపాకే రాజాభిభవో ధ్రువం పుంసామ్. 73

నీచయందున్న గ్రహదశయందు శత్రుభయముచేత విదేశగమనమున్ను బంధనము (కట్టుబడుట) వ్యాధి మొదలైన దుష్టఫలములు గలుగును.

చింతాస్వప్నానుభవైః పరిణమతిఫలం విహీనవీర్యస్య,
పంచమహాపురుషోక్తా ధ్యాయాం స్తాం స్తాన్నియోజయేదత్ర. 74

బలహీనమైన గ్రహదశయందు చింతాదిఫలములు గలుగును. పంచమహాపురుష లక్షణాధ్యాయోక్తఫలమును సర్వదశలయందును గ్రహానురోధముగ దెలియతగినది. అనగా నే గ్రహమునకు జెప్పఁబడినఫలము ఆ గ్రహదశయందును గలుగునని భావము.

ఆదౌ దశాసు ఫలదశ్శీర్షోదయరాశిసహితో విహగః,
ఉభయోదయే చ మధ్యే స్వాంత్యే పృష్ఠోదయేచ నీచస్థే 75

శీర్షోదయరాసులగు మిథున సింహ కన్య తుల వృశ్చిక కుంభములయందున్న గ్రహదశాఫలము ఆదశయొక్క ఆదియందు గలుగును. ఉభయోదయరాశియగు మీనరాశియందున్న గ్రహదశాఫలము ఆదశయొక్క మధ్యమమున గలుగును. పృష్ఠోదయ రాసులగు మేషవృషభధనుర్మకరములయందున్న గ్రహదశాఫలము ఆదశయొక్క అంతమున గలుగును.

ఇతి చత్వారింశోఽధ్యాయః.

---

అంతర్దశాఫలములను దెలుపు నలుపదియొకటవ యధ్యాయము.

అర్ధ మేకస్థితో భాగం త్రిభాగం సుతధర్మయోః,
సప్తమే సప్తమంభాగం చతుర్థం చతురశ్రయోః. 1

మూలదశాసంవత్సరములలో జన్మకాలికగ్రహస్థితినిబట్టి మూఁగర మూలదశాపతికి భాగకల్పనజేసి పిమ్మట మూలదశాపతికి వచ్చిన అంతర్దశాసంవత్సరములకు సమముగా అర్ధాదిభాగంబులు ఏకరాశ్యాదిగతగ్రహంబులకు గల్పించతగినవి. ఎట్లన, మూల దశాధిపతితోఁగూడ నొకరాశియందున్న గ్రహమునకు మూలదశాపతి దత్తాంతర్దశాసం వత్సరములలో అర్ధము కల్పించతగినది. మూలదశాధిపతికి పంచమనవమములయందున్న గ్రహమునకు మూలదశాపతిదత్తాంతర్దశాసంవత్సరములలో తృతీయాంశము కల్పించ తగినది. మూలదశాపతికి సప్తమమందున గ్రహమునకు మూలదశాపతిదత్తాంతర్దశాసంవ త్సరములలో సప్తమాంశము అంతర్దశగా కల్పించతగినది. మూలదశాపతికి చతుర్థాష్టమ ములయందున్న గ్రహమునకు మూలదశాపతి దత్తాంతర్దశాసంవత్సరములలో

చతుర్థాంశము అంతర్దశగా కల్పించతగినది. (పంచమ నవమములలో రెండుస్థానముల యందును గ్రహము లుండెనేని మూలదశాపతి దత్తాంతర్దశాసంవత్సరములయొక్క తృతీయాంశములో అర్ధము పంచమస్థానమందున్న గ్రహముయొక్క అంతర్దశాసంవత్సరములనియు, తక్కినఅర్ధము నవమస్థానమందున్న గ్రహముయొక్క అంతర్దశాసంవత్సరములనియు తెలియదగినది. ఉదాహరణము — మూలదశాపతి దత్తాంతర్దశావర్షములు ౬ మా ౦ ది ౦ తృతీయాంశము సం ౨ మా ౦ కదర్ధము సం ౧ మా ౦ అనగా మూలదశాపతిదత్తాంతర్దశావర్షములలో షష్ఠాంశము సం ౧ మా ౦ ఇదియే పంచమమందున్న గ్రహముయొక్క అంతర్దశామానము. తావత్పరిమితియే నవమమందున్న గ్రహముయొక్క అంతర్దశామానమనియు తెలియదగినది. ఇట్లే చతుర్థాష్టమముల యందున్న గ్రహములకు అంతర్దశానిర్ణయము గల్పించతగినది.

మూలం దశాధినాథస్య కృత్వాంశం స్వగుణైర్గ్రహాః,
కరోత్యంతర్దశాం సత్యాం బలిహారత భాగశః. 2
భాగాస్సదృశాస్సహితా దశాబ్దపిండస్య భాగహారోయం,
ప్రత్యంశతాడితస్సాన్యత్పృథక్పృథక్త్వంతరదశాస్సన్యః. 3

పూర్వశ్లోకమందు చెప్పబడియున్న అర్ధాంశ తృతీయాంశాది స్థానములను సమచ్ఛేదములుగాజేసి అందు క్రిందనున్న ఛేదసంఖ్యలను తోసివేసి మీదనున్న సకల స్థానములను వేర్వేరుగా మూలదశాసంవత్సరములచేత గుణించి ఛేదసంఖ్యావిహీనములై మీదనున్న సంఖ్యల నన్నిటి నొకటిగాగూడి ఆమొత్తముచేత పాలుగొనగా ఏకరాశ్యాశ్రిత గ్రహముల అంతర్దశాకాలములు యథాంశముగా వచ్చునని తాత్పర్యము ఉదాహరణము:—మూలదశాపతికి చతురశ్రములైన చతుర్థాష్టమస్థానముల యందు గ్రహములుండి మూలదశాపతియున్న రాశియందును త్రికోణసప్తమముల యందును గ్రహములు లేకయుండగా న్యాసము

| | | |
|---|---|---|
| ౧ | ౧ | ౧ |
| ౧ | ౪ | ౪ |

వీటికి సమచ్ఛేదములు చేయగా

| | | |
|---|---|---|
| ౧౬ | ౪ | ౪ |
| ౧౬ | ౧౬ | ౧౬ |

వీటియందు క్రిందనున్న ఛేదసంఖ్యలను తోసివేయగా ౧౬, ౪, ౪ ఈసంఖ్యల నొకటిగా గూడినమొత్తము ౨౪. మూలదశావర్షములు ౬. ఈషట్సంఖ్యచేత ప్రథమస్థానమందున్న ౧౬ ను గుణించగా వచ్చిన ౯౬ ను మొదట మొత్తముచేసియున్న ౨౪ చేత పాలుగొనగా మూలదశాపతికి వచ్చిన అంతర్దశాసంవత్సరములు ౪. తిరుగా మూలదశావర్షములు ౬ చేత ద్వితీయ

స్థానమందున్న ౪ ను గుణించఁగా వచ్చిన ౨౪ ను మొదట ఏకీకృతంబై యున్న ౨౪ చేత పాలుగొనఁగా మూలదశాపతికి చతుర్థస్థానమందున్న గ్రహమునకు వచ్చిన అంతర్దశాసంవత్సరములు ౧ తిరుగా మూలదశావర్షములు ౬ చేత తృతీయస్థానమందున్న ౪ ను గుణించఁగా వచ్చిన ౨౪ ను మొదట ఏకీకృతంబై యున్న ౨౪ చేత పాలుగొనఁగా మూలదశాపతికి అష్టమమందున్న గ్రహమునకు వచ్చిన అంతర్దశాసంవత్సరములు ౧. ఈ ముగ్గురి అంతర్దశాసంవత్సరములు కలియగూడఁగా మూలదశావర్షములు ఆఱును యగును. మరియొక యుదాహరణము:—మూలదశాపతికి రూపము ౧ మూలదశాపతితోగూడి యొకరాశియందున్న గ్రహమునకు రూపార్థము ౨. మూలదశాపతికి చతుర్థమందున్న గ్రహమునకు రూపచతుర్థాంశము ౪. అష్టమమందున్న గ్రహమునకు రూపచతుర్థాంశము ౪. మూలదశాపతికి సప్తమస్థానమందున్న గ్రహమునకు రూపసప్తమాంశము ౭ పీటికి న్యాసము

| | | | | |
|---|---|---|---|---|
| ౧ | ౧ | ౧ | ౧ | ౧ |
| ౧ | ౨ | ౪ | ౪ | ౭ |

పీటిని సమచ్ఛేదము చేయఁగా వచ్చినది

| | | | | |
|---|---|---|---|---|
| ౨౨౪ | ౧౧౨ | ౫౬ | ౫౬ | ౩౨ |
| ౨౨౪ | ౨౨౪ | ౨౨౪ | ౨౨౪ | ౨౨౪ |

పీటిలో క్రిందనున్న ఛేదసంఖ్యలను తోసివేయఁగా ౨౨౪-౧౧౨-౫౬-౫౬-౩౨ ఉంచున్నవి. పీటిని కలియగూడఁగా వచ్చిన మొత్తము ౪౮౦ మూలదశావర్షములు ౮. ఈ ౮ చేత ప్రథమసంఖ్యయగు ౨౨౪ ను గుణించఁగా వచ్చిన ౧౭౯౨ ను మొదట మొత్తము చేసియున్న ౪౮౦ చేత పాలుగొనఁగా మూలదశాపతికి వచ్చిన అంతర్దశాసంవత్సరములు ౩ మా ౮ ది ౨౪ తిరుగా మూలదశావర్షములు ౮ చేత ద్వితీయసంఖ్యయగు ౧౧౨ ను గుణించఁగా వచ్చిన ౮౯౬ ను మొదట మొత్తము చేసియున్న ౪౮౦ చేత పాలుగొనఁగా మూలదశాధిపతితోగూడి యేకరాశిగతంబైయున్న గ్రహమునకు వచ్చిన అంతర్దశాసంవత్సరములు ౧ మా ౧౦ ది ౧౨ తిరుగా మూలదశావర్షములు ౮ చేత తృతీయసంఖ్యయగు ౫౬ ను గుణించఁగా వచ్చిన ౪౪౮ ని మొదట మొత్తము చేసియున్న ౪౮౦ చేత భాగించఁగా మూలదశాపతికి చతుర్థమందున్న గ్రహమునకు వచ్చిన అంతర్దశాసంవత్సరములు ౦ మా ౧౧ ది ౬ తిరుగా మూలదశావర్షములు ౮ చేత చతుర్థసంఖ్యయగు ౫౬ ను గుణించఁగా వచ్చిన ౪౪౮ ని మొదట మొత్తము చేసియున్న ౪౮౦ చేత పాలుగొనఁగా మూలదశాపతికి అష్టమమందున్న గ్రహమునకు వచ్చిన అంతర్దశాసంవత్సరములు ౦ మా ౧౧ ది ౬ తిరుగా మూలదశావర్షములు ౮ చేత పంచమసంఖ్యయగు ౩౨ ను గుణించఁగా వచ్చిన ౨౫౬

ను మొదట మొత్తముచేసియున్న ౪౮౦ చేత పాలుగొనఁగా మూలదశాపతికి సప్తమ స్థానమందున్న గ్రహమునకు వచ్చిన అంతర్దశాసంవత్సరములు ౦ మా ౬ ది ౧౨

| | |
|---|---|
| మూలదశాపతికి | స ౩ మా ౮ ది ౨౪ |
| ఏకరాశిగతగ్రహమునకు | స ౧ మా ౧౦ ది ౧౨ |
| చతుర్థమందున్న గ్రహమునకు | స ౦ మా ౧౧ ది ౬ |
| అష్టమమందున్న గ్రహమునకు | స ౦ మా ౧౧ ది ౬ |
| సప్తమమందున్న గ్రహమునకు | స ౦ మా ౬ ది ౧౨ |
| మొత్తము | స ౦ ౮ మా ౦ ద ౦ |

ఇవి మూలదశాసంవత్సరములు మరియొకయుదాహరణము:—మూలదశాపతికి రూపము ౧ మూలదశాపతితోఁగూడిన ఏకరాశియందున్న గ్రహమునకు రూపార్ధము ౨ మూలదశాపతికి త్రికోణస్థానములైన పంచమనవమములలో నొకస్థానమందున్న గ్రహమునకు రూపతృతీయాంశము ౩ చతురశ్రములైన చతుర్థాష్టమములలో నొకస్థానమందున్న గ్రహమునకు రూప చతుర్థాంశము ౪ మూలదశాపతికి సప్తమస్థానమందున్న గ్రహమునకు రూపసప్తమాంశము ౭ వీటికి న్యాసము

| | | | | |
|---|---|---|---|---|
| ౧ | ౧ | ౧ | ౧ | ౧ |
| ౧ | ౨ | ౩ | ౪ | ౭ |

వీటిని సమచ్ఛేదములు జేయఁగా వచ్చినది.

| | | | | |
|---|---|---|---|---|
| ౧౬౮ | ౮౪ | ౫౬ | ౪౨ | ౨౪ |
| ౧౬౮ | ౧౬౮ | ౧౬౮ | ౧౬౮ | ౧౬౮ |

వీటిలో క్రిందనున్న ఛేదసంఖ్యలను తోసివేయఁగా ౧౬౮, ౮౪, ౫౬, ౪౨, ౨౪ ఉంచున్నవి. వీటిని కలియగూడఁగా వచ్చిన మొత్తము ౩౭౪ మూలదశావర్షములు ౧౨. ఈ ౧౨ చేత ప్రథమసంఖ్యయగు ౧౬౮ ని గుణించఁగా వచ్చిన ౨౦౧౬ ను మొదట మొత్తముచేసియున్న ౩౭౪ చేత పాలుగొనఁగా మూలదశాపతికి వచ్చిన అంతర్దశా సం ౫ మా ౪ ది ౨౦ ఘ ౩౨ వి ౫. తిరుగా మూలదశావర్షములు ౧౨ చేత ద్వితీయసంఖ్యయగు ౮౪ గుణించి ఆ ౧౦౦౮ ని మొదట మొత్తముచేసియున్న ౩౭౪ చేత పాలుగొనఁగా మూలదశాపతితోఁగూడి యేకరాశిగతంబైయున్న గ్రహమునకు వచ్చిన అంతర్దశా సం ౨ మా ౮ ది ౧౦ ఘ ౧౬ వి ౨. తిరుగా మూలదశావర్షములు ౧౨ చేత తృతీయసంఖ్యయగు ౫౬ ను గుణించి ఆ ౬౭౨ ను మొదట మొత్తముచేసియున్న ౩౭౪ చేత పాలుగొనఁగా మూలదశాపతికి త్రికోణస్థానముల రెంటిలోను ఒకదానియందున్న గ్రహమునకు వచ్చిన అంతర్దశా సం ౧ మా ౯ ది ౧౬ ఘ ౫౦ వి ౪౧. తిరుగా మూలదశా

సం ౧౨ చేత చతుర్థసంఖ్యయగు ౪౨ ను గుణించి ఆ ౫౦౪ ను మొదట మొత్తము చేసియున్న ౩౬౪ చేత పాలుగొనఁగా మూలదశాపతికి చతురశ్రములలో నొకస్థానమందున్న గ్రహమునకు వచ్చిన అంతర్దశా సం ౧ మా ౪ ది ౫ ఘ ౭ వి ౧ తిరుగా మూలదశావర్షములు ౧౨ చేత పంచమసంఖ్యయగు ౨౪ ను గుణించి ఆ ౨౮౮ ని మొదట మొత్తముచేసియున్న ౩౬౪ చేత పాలుగొనఁగా మూలదశాపతికి సప్తమమందున్న గ్రహమునకు వచ్చిన అంతర్దశాసంవత్సరములు ౦ మా ౯ ది ౬ ఘ ౧౩ వి ౯. ఇట్లువచ్చిన అంతర్దశాసంవత్సరములవివరము.—

మూలదశాపతికి సం ౫ మా ౪ ది ౨౦ ఘ ౩౨ వి ౫
ఏకరాశిగతగ్రహమునకు సం ౨ మా ౭ ది ౧౦ ఘ ౧౬ వి ౨
త్రికోణమందున్నగ్రహమునకు సం ౧ మా ౯ ది ౧౬ ఘ ౫౦ వి ౪౧
చతురశ్రమందున్నగ్రహమునకు సం ౧ మా ౪ ది ౫ ఘ ౭ వి ౧
సప్తమమందున్నగ్రహమునకు సం ౦ మా ౯ ది ౬ ఘ ౧౩ వి ౯
విడువఁబడియున్న స్వల్పశేషము వల్ల వచ్చునవి వి ౨
మొత్తము సం ౧౨ మా ౦ ది ౦ ఘ ౦ వి ౦

ఇవి మూలదశాసంవత్సరములు ఇట్లు తత్తద్గ్రహస్థితినిబట్టి తత్తద్గ్రహాంశకాలానుసారముగా అంతర్దశలను విభజింపవలయును. ఇట్లు అంతర్దశాపాచకులు అనేకులు సంభవించినయెడల—శ్లో. "ఆదా వంతర్దశాపాకో భవత్యేవ దశాపతే రితి" అని గార్గివచనానుసారముగా మొదట మూలదశాపతికి అంతర్దశనిచ్చి తరువాత పూర్వోక్తదశావిభాగక్రమముగా ఉక్తస్థానస్థితగ్రహములకు అంతర్దశలు కల్పించతగినది. ఈప్రకారము లగ్నమునకుగూడ నంతర్దశానిర్ణయము జేయతగినది.

శుభస్య శుభదః పూర్ణః క్రూరస్యాశుభదో భవేత్,
కేంద్రాదివిధినా చాన్యే కేచిత్పాకక్రమేణ తు. 4

అంతర్దశాధిపతి శుభుఁడయ్యేనేని శుభము నిచ్చును. పాపుఁడయ్యేనేని పాపఫలము నిచ్చును. అంతర్దశాక్రమ మెట్లన: మొదట కేంద్రములలో ఉక్తస్థానములయందున్న గ్రహములకు తదుపరి పణపరములలో ఉక్తస్థానములయందున్న గ్రహములకు అని కొందఱి మతము. మరికొందఱు మూలదశానురోధముగ గ్రహములకు అంతర్దశాధిపత్యము గలుగుననియుఁ జెప్పుదురు. (సప్తగ్రహములకును లగ్నమునకును మూలదశలు వచ్చునుగాని అన్ని గ్రహములకు అంతర్దశలు రావనుట.)

సత్యోక్తం తూచ్యతే కశ్చిద్దదాదిబలవాన్గ్రహః,
నిత్యం పాకక్రమాత్కార్యశ్శేషాస్తు పరిపాకదాః. 5

గ్రహములలో బలవంతుడు నొకటియంతర్దశాధిపతియు తనుపరి పారక్రమముగా అనగా ప్రథమశ్లోకోక్తప్రకారముగా అంతర్దశాధిపతు లగుదురు

ఏకర్‌క్షసంస్థితదశా ప్రదిశతి బంధం స్వనాశంవా,
జనయతి కంటకసహితా త్రికోణసంస్థస్య సుఖ మతులమ్ 6

మూలదశాధిపుని కేంద్రములయందుండి ఆమూలదశాధిపతితో గలసియున్న గ్రహముయొక్క అంతర్దశయందు కారాగృహప్రాప్తి ధననాశనము మొదలైనవి గలుగును మూలదశాధిపతికి త్రికోణములయందున్న గ్రహాంతర్దశయందు సౌఖ్యము మొదలైనవి గలుగును.

ఏకస్మిన్ త్రిచతుర్ణాం నక్షత్రే రిపుదశా గ్రహాణాం స్యాత్,
వ్యాధిక్లేశవివాదాన్నృపతేశ్చ భయం తదాజనయేత్. 7

ఒకనక్షత్రమందు మూడు లేక నాలుగు గ్రహములు యుండెనేని ఆగ్రహముల దశ శత్రుదశ యనబడును అట్టి శత్రుదశయందు వ్యాధిమొదలైన దుష్టఫలములు గలుగును.

దారమరణం చ జనయతి సప్తమగాంతర్దశా ప్రణాశంవా,
శత్రోర్దాసీకరణం పరమిపురుషేణోపభోగం వా. 8

మూలదశాధిపతికి సప్తమస్థగ్రహాంతర్దశయందు భార్యామరణము శత్రుసేవ మొదలైనవి గలుగును.

అంతర్దశా గ్రహాణా మష్టమధామ్ని ప్రమాపయేత్పురుషం,
కురుతే చ ధనవినాశం శత్రుగతాబంధనం చ విధ్వంసమ్. 9

మూలదశాధిపతికి అష్టమమందున్న గ్రహము శత్రుక్షేత్రస్థుడాయె నేని వాని యంతర్దశయందు స్వనాశము ధననాశము మొదలైనవి గలుగును

అంతర్దశాయదాస్యాద్ద్విత్రిచతుర్ణా మేకరాశిసంస్థానాం,
బంధనవినాశదైన్యం విదధాత్యశుభం గ్రహాణాంతు 10

ఒకరాశియందు రెండు, లేక మూడు, లేక నాలుగు గ్రహములు యుండగా వారియంతర్దశయందు బాధనము నాశనము దీనత మొదలైన అశుభఫలములు గలుగును.

చతుర్థస్థానసంస్థస్య గ్రహస్యాంతర్దశాభవేత్,
మిత్రారోగ్యకరం నిత్యం సౌఖ్యమానవివర్ధనమ్ 11

మూలదశాపతికి చతుర్థస్థగ్రహాంతర్దశయందు సౌఖ్యము మొదలైనవిగలుగును.

శమయతి రిపుప్రతాపం నీరోగత్వం కరోతి ధనలాభం,
భానుదశాయాం చంద్రః ప్రవిశం స్తన్నాస్తి యన్నశుభమ్. 12

రవిమూలదశయందైన చంద్రాంతర్దశయందు శత్రుతాపము ఆరోగ్యము ధనలాభము మొదలైన శుభఫలములు గలుగును. పాపఫలములు గలుగవు.

విద్రుమసువర్ణమణయస్సంగ్రామజయః ప్రచండతాపుంసః,
అసృజో దశాప్రవేశే సూర్యదశాయాం భవతి సౌఖ్యమ్. 13

రవిమహాదశయందలి కుజాంతర్దశయందు పగడములు సువర్ణము రత్నములు యుద్ధమున విజయము తీక్ష్ణత సౌఖ్యము గలుగును.

దద్రూవిచర్చికాద్యై పామ్నాకుష్ఠైశ్చ గర్హితశరీరః,
తరణిదశాయాం ప్రవిశతి బుధోయదాస్యాదరేర్వృద్ధిః. 14

బుధాంతర్దశయందు దద్రు (దద్దుర్లు) మొదలుగాఁగల రోగములు తామర కుష్ఠరోగము శత్రువృద్ధి గలుగును.

వ్యాధిభి రరిభిర్వ్యసనైః పాపైశ్చ విముచ్యతే తథాఽలక్ష్మ్యా,
అనుయాతి ధర్మపదవీం జీవస్యాంతర్దశాయదాభానోః. 15

గుర్వంతర్దశయందు వ్యాధులచేతను శత్రువులచేతను అలక్ష్మిచేతను విడువఁబడినవాఁడై అనఁగా వ్యాధులు మొదలైనవి లేనివాఁడగుచు ధనవంతుఁడై ధర్మమార్గవర్తియగును.

శిరసోరుగ్గదరోగశ్ఛిద్రం సహసా జ్వరశ్శూలం,
తపనదశాయాం శుక్రే దేశత్యాగో భవే దరిభిః. 16

రవిమహాదశయందలి శుక్రాంతర్దశయందు శిరోరోగము గదరోగము జ్వరము శూల శత్రువులతొందరచేత స్వదేశమునువిడిచి పరదేశముల నాశ్రయించుట గలవాఁడగును.

ఆదిత్యస్యదశాయాం శనైశ్చరాంతర్దశా యదాభవతి,
నృపపరిభూతో దీనో విపక్షసాద్గేన హాతశక్తిః. 17

రవిదశయందైన శన్యంతర్దశయందు రాజతిరస్కారము శత్రుసముదాయముచేత హీనసామర్థ్యము గలవాఁడు అగును.

క్షయరోగభయం శౌర్యం నృపప్రభావం సదావిభవం,
చంద్రదశాయాం పుంసో భానుః కురుతేఽర్థలాభంచ. 18

చంద్రమహాదశయందలి సూర్యాంతర్దశయందు క్షయరోగమువలన భయము కార్శ్యము రాజప్రభావము ఎల్లపుడు వైభవములు ధనలాభము గలుగును.

పిత్తాసృగ్వహ్నిభయం క్లేశం రోగం కరోతి వక్రదశా,
చంద్రదశాయాం చ భయం ప్రమోషణం చైవ చోరైశ్చ. 19

చంద్రమహాదశయందలి కుజాంతర్దశయందు పైత్యరోగము నెత్తురువెడుట వహ్ని వలనభయము కష్టములు రోగములు భయము దొంగలు దోచుకొనుట గలుగును.

చంద్రదశాయాం జ్ఞదశాప్రవేశనే చిహ్న ముత్తమోలాభః,
గజవాజినాం ధనానాం సంప్రాప్తి స్సౌఖ్య మతులం చ. 20

చంద్రమహాదశయందలి బుధాంతర్దశయందు ఉత్తమలాభము ఏనుగులు గుఱ్ఱముల యొక్కలాభము ధనప్రాప్తి సాటిలేనిసౌఖ్యము గలుగును.

చంద్రదశాయాం ప్రాప్తా త్రిదశేడ్యదశా కరోతి ధనలాభం,
యత్నోపాత్తమకస్మా ద్వస్త్రాలంకారవివిధహస్త్యశ్వమ్ 21

చంద్రమహాదశయందలి గుర్వంతర్దశయందు ధనలాభము కొలదిపాటిప్రయత్నము వలన వస్త్రములు భూషణములు అనేకవిధములగు ఏనుగలు గుఱ్ఱములు లభించును.

తుహినకరస్య దశాయాం ప్రవిశత్యంతర్దశాయదాఽస్ఫుజితః,
జలయానహారభూషణబహుపత్నీభి స్సమాగమం కురుతే. 22

చంద్రమహాదశయందలి శుక్రాంతర్దశయందు జలమున ప్రయాణము హారములు భూషణములు అనేకమందిభార్యలు ప్రాప్తించును.

స్వజనాయాసవియోగం రోగాభిభవం తథామహావ్యసనం,
చంద్రదశాయాం సౌరిః కరోతి నిస్సంశయం పుంసామ్. 23

చంద్రమహాదశయందలి శన్యంతర్దశయందు జనబాంధవులవలన దుఃఖములు ఎడబాటు రోగములచేత బాధ గొప్పదుఃఖములు గలుగును.

చండంసాహసనిరతం నరేంద్రసంగ్రామపూజితం ధాత్ర్యాం,
వివిధధనాగమయుక్తం భౌమదశాయాం కరోతి రవిః 24

కుజమహాదశయందలి సూర్యాంతర్దశయందు ముక్కిలికోపముగలవాఁడు, సాహసవంతుఁడు, రాజులయుద్ధమున గౌరవమునందువాఁడు, అనేకవిధముల ధనముయొక్క రాబడి గలవాఁడు అగును.

వివిధధనాగమలాభం సౌఖ్యం బహుమిత్రసంప్రాప్తిం,
వక్రదశాయాం చంద్రః కరోతి ముక్తామణిప్రభృతీన్. 25

కుజమహాదశయందలి చంద్రాంతర్దశయందు అనేకవిధముల ధనముబాబడి సౌఖ్యము అనేకమిత్రులతోఁటికలయిక ముత్యములు రత్నములు మున్నగునవి గలవాఁడగుచు.

దిశతి భయం శత్రుభ్యో వాజిగజానాం ప్రమోషణం చోరైః,
దాహం చ యదా ప్రవిశతి భౌమదశాయాం బుధస్య దశా. 26

కుజమహాదశయందలి బుధాంతర్దశయందు శత్రుభయము ఏనుఁగులు గుఱ్ఱములు మున్నగువానిని దొంగిలించుట గృహములు కాలిపోవుట సంప్రాప్తించును.

వక్రదశాయాం చ గురో స్సుచరితకరణేన శుభధర్మా,
నృపతి ర్విశుద్ధచేతాః పుణ్యాని కరో త్యనంతాని. 27

కుజమహాదశయందలి గుర్వంతర్దశయందు కొనియాడఁదగినఆచారములు మంగళప్రదములగుపనులు రాజగుట నిర్మలమగుమనస్సు లెక్కలేని పుణ్యకార్యములనొనరించుట గలుగును.

రుధిరదశాయాం శుక్రప్రవేశనే భవతి సంగరభయార్తిః,
వ్యాధివ్యసనాయాసై ర్ధనాపహారః ప్రవాసై శ్చ. 28

కుజమహాదశయందలి శుక్రాంతర్దశయందు యుద్ధమున భయము బాధ వ్యాధుల వలన దుఃఖములవలనఁగాని పరదేశవాసములవలనఁగాని ధననాశము గలుగును.

వ్యసనాని వ్యసనానాం భవంత్యుపర్యుపరి జనవినాశశ్చ,
వక్రదశాయాం రవిజే ప్రవిశతి చాంతర్దశాయాం హి. 29

కుజమహాదశయందలి శన్యంతర్దశయందు దుఃఖములపైన దుఃఖములు, ఒకరితరువాత నొకరుగా తనవారందరు నశించుట కలుగును.

ఇందుసుతస్య దశాయాం ప్రవిశతి సూర్యో యదాతదాచిహ్నాం,
కనకాశ్వవిద్రుమగజా న్విదధాతి శ్రియ మకస్మాచ్చ. 30

బుధమహాదశయందలి సూర్యాంతర్దశయందు సువర్ణము ఏనుఁగలు గుఱ్ఱములు పగడములు మేరలేని ఐశ్వర్యము లభించును.

ప్రవిశంతీ చంద్రదశా బుధస్య కండూ కరోతి కుష్ఠం చ,
క్షయరోగ మంగభంగం గజాద్భయం వాహనవినాశమ్. 31

బుధమహాదశయందలి చంద్రాంతర్దశయందు శరీరమంతయుం దురద కుష్ఠురోగము క్షయరోగము అవయవములు వికలముగుట మదపుటేనుఁగవలన అపాయము అశ్వాది వాహనములు నశించుట గలుగును.

మస్తకశూలనిరోధై ర్వానాక్లేశైశ్చ యుజ్యతే జంతుః,
ఇందుసుతస్య దశాయాం భౌమస్యాంతర్దశా యదా భవతి. 32

బుధమహాదశయందలి కుజాంతర్దశయందు మాడుపోటు మొదలగుశిరోరోగములు అనేకవిధముల బహుదుఃఖములు సంప్రాప్తించును.

రిపురోగపాపముక్తః పుణ్యాని కరోతి భూపతే ర్మంత్రీ,
జీవే చరతి దశాయాం బుధస్య పురుషో భవే న్నియతమ్ 33

బుధమహాదశయందలి గుర్వంతర్దశయందు శత్రువులు రోగములు పాపములేకపోవుట గొప్పపుణ్యముల నాచరించుట రాజమంత్రిత్వము లభించును.

గురువిబుధాతిథియుక్తో వస్త్రాలంకారపుష్పగంధరుచిః,
ఇందుసుతస్య దశాయాం శుక్రస్యాంతర్దశా యదా భవతి. 34

బుధమహాదశయందలి శుక్రాంతర్దశయందు గురువులయొక్క పండితులయొక్క సమాగమము విలువగలవస్త్రములు అలంకారములు పుష్పములు సుగంధద్రవ్యములు మొదలగువానియందు అభిరుచి గలుగును.

షండముఖకామసేవీ విలుప్తధర్మార్థభోగసుతవిత్తః,
భవతి నరోఽత్ర దశాయాం బుధస్య మందో యదాచరతి. 35

బుధమహాదశయందలి శన్యంతర్దశయందు నపుంసకులను కాముకులను సేవించువాఁడు, ధర్మము అర్థము భోగము పుత్త్రులు గలవాఁడు అగును.

రిపుభయకలహైర్ముక్తః ప్రయాతి గురుతాం నరేంద్రస్య,
విక్రమసాహససౌఖ్యై ర్జీవదశాయాం రవౌ చరతి. 36

గురుమహాదశయందలి సూర్యాంతర్దశయందు శత్రుభయము కలహములులేనివాఁడు, రాజగౌరవము విక్రమము సాహసము సౌఖ్యము గలవాఁడగును.

పత్నీసహస్రభర్తా జితరోగరిపుః పరోన్నతిం లభతే,
ప్రకటయతి రాజచిహ్నం చంద్రదశా గురుదశాయాం హి. 37

గురుమహాదశయందలి చంద్రాంతర్దశయందు వేయిమందిభార్యలుగలవాఁడు, రోగములు శత్రువులులేనివాఁడు, ఇతరులవలనగౌరవము రాజచిహ్నములను ధరించుట ప్రాప్తించును.

తీక్ష్ణః పరోపతాపీ శూరో రణలబ్ధకీర్తిధనః,
సౌఖ్య మనంతం లభతే జీవదశాయాం కుజే చరతి. 38

గురుమహాదశయందలి కుజాంతర్దశయందు తీక్ష్ణమైనవాఁడు, శత్రువులను బాధించువాఁడు, శౌర్యవంతుఁడు, యుద్ధమువలనగౌరవము ధనము సౌఖ్యముగలవాఁడుఅగును.

వేశ్యామద్యవ్యసనైః పరిభూతో భవతి నిర్ధనస్సోఽపి,
సౌమ్యే జీవదశాయాం విలుప్తధర్మో భవేత్పురుషః 39

గురుమహాదశయందలిబుధాంతర్దశయందు వేశ్యలతోటిసహవాసము మద్యపానము దుర్వ్యసనములు దరిద్రము ధర్మములయందు ఆసక్తిలేకపోవుట కలుగును.

వ్యాధివినాశం సౌఖ్యం మిత్రైస్సహ సంగతిం తథాపూజాం,
మాతాపిత్రోర్భక్తిం జీవదశాయాం బుధే లభతే. 40

గురుమహాదశయందలి బుధాంతర్దశయందు వ్యాధులుపోవుట సౌఖ్యము మిత్రులతోటిసహవాసము గౌరవము మాతాపితరులయందు భక్తి గలుగును.

రిపుభయవినాశదుఃఖై రభిభూతో బ్రాహ్మణోపజీవీ చ,
జీవదశాయాం శుక్రే ప్రవిశతి నిత్యం భవేత్పురుషః. 41

గురుమహాదశయందలి శుక్రాంతర్దశయందు శత్రుభయము స్వజనవినాశము దుఃఖము బ్రాహ్మణులను కొల్చి జీవించుట లభించును.

వేశ్యామద్యద్యూతై రభిభూతో మహిషఖరయుక్తః,
సౌరే జీవదశాయాం విలుప్తధర్మో భవేత్పురుషః. 42

గురుమహాదశయందలి శన్యంతర్దశయందు వేశ్యాసహవాసము మద్యపానము జూదములవలన దుఃఖము, గేదెలు కంచరగాడిదెలు ధర్మనాశనము గలుగును.

గండోదరార్తిరోగైః క్షితిపతితో బంధనాదిభి స్తప్తః,
శుక్రదశాయాం సూర్యే విచరతి నూనం భవేత్పురుషః. 43

శుక్రమహాదశయందలి సూర్యాంతర్దశయందు వ్రణములు ఉదరరోగములు నేత్రరోగములు గలవాఁడు, బంధనాదులవలన మిక్కిలిబాధనొందువాఁడు అగును.

అంతర్దశాదశాయాం సితస్య శశినో యదా భవతి చిహ్నం,
నఖదశనశిరోరోగై స్సహ భవతి చ కామిలారోగః. 44

శుక్రమహాదశయందలి చంద్రాంతర్దశయందు పుప్పిగోళ్లు దంతరోగములు శిరోరోగములు కామెర్లు అగుట కలుగును.

పిత్తాసృక్కృతరోగో భూలాభ స్సంశ్రయో నృపతిత శ్చ,
శుక్రదశాయాం భౌమే మందోత్సాహః పుమాన్ భవతి. 45

శుక్రమహాదశయందలి కుజాంతర్దశయందు పైత్యరోగము రక్తముచెడుట రాజువలనభూలాభము రాజాశ్రయము ఉత్సాహములేకపోవుట గలుగును.

శుక్రదశాయాం పుంసాం బుధస్య చాంతర్దశా యదా భవతి,
యువతికృతం ధనలాభం సౌఖ్యం చ మనోరథం లభతే. 46

శుక్రమహాదశయందలి బుధాంతర్దశయందు స్త్రీవలన ధనలాభము సౌఖ్యము మనోరథసిద్ధి లభించును.

అంతర్దశాదశాయాం భృగో ర్గురో ర్ధర్మశీలసంపత్తిం,
విదధాతి విషయరాజ్యం పుంసాం ధనరత్న మతిసౌఖ్యమ్. 47

శుక్రమహాదశయందలి గురుదశయందు ధర్మము మంచినడవడి దేశాధిపత్యము ధనము రత్నములు మిక్కిలిసౌఖ్యము గలవాఁడగును.

వృద్ధస్త్రీభిః క్రీడాం పురనగరగణాధిపత్య మరినాశం,
శుక్రదశాయాం సౌరిః కరోతి బహుమిత్రసంయోగమ్. 48

శుక్రమహాదశయందలి శన్యంతర్దశయందు వృద్ధస్త్రీలతోటిసాంగత్యము గ్రామములకు పట్టణములకు అధిపతి శత్రునాశము అనేకమిత్రులతోటిసహవాసము గలవాఁడగును.

ధనపుత్రదారనాశం భయ మతులం సందధాతి పురుషస్య,
రవిపుత్రస్య దశాయాం సూర్యస్యాంతర్దశా న సందేహః. 49

శనిమహాదశయందలి సూర్యాంతర్దశయందు ధనము పుత్రులు భార్యనశించుట భయము గలుగును.

స్త్రీమరణం హరణం వా బంధువియోగం పునఃపునః కలహం,
అంతర్దశా దశాయాం శనే శ్శశాంకస్య విదధాతి. 50

శనిమహాదశయందలి చంద్రాంతర్దశయందు స్వస్త్రీమరణము స్వస్త్రీనిహరించుట బంధువియోగము మాటిమాటికి కలహము గలుగును.

దేశభ్రంశం వ్యాధిం దుఃఖాని కరోత్యనేకరూపాణి,
అంతర్దశా దశాయాం రవిజస్య మహీసుతస్య యదా. 51

శనిమహాదశయందలి అంగారకాంతర్దశయందు దేశభ్రంశము వ్యాధులు అనేక దుఃఖములు గలవాఁ డగును.

సౌభాగ్యసౌఖ్యవిజయప్రమోదసత్కారమానధనలాభం,
సౌరిదశాయాం సౌమ్యో విదధాత్యంతర్దశాప్రాప్తః. 52

శనిమహాదశయందలి బుధాంతర్దశయందు సౌభాగ్యము సౌఖ్యము విజయము సంతోషము గౌరవము అభిమానము ధనము గలుగును.

అనుయాతి శిష్టపదవీం గ్రామాదికళత్రసౌఖ్యసంపన్నః,
రవితనయస్య దశాయాం ప్రవిశతి జీవే సదాపురుషః. 53

శనిమహాదశయందలి గుర్వంతర్దశయందు సత్పురుషులవర్తనము ననుసరించుట గ్రామములు భార్య సర్వసౌఖ్యములు లభించును.

వర్ధయతి మిత్రపక్షం భినత్తి శోకాన్యశః ప్రకాశయతి,
సౌరదశాయాం శుక్రః పత్నీధనవిజయలాభకరః. 54

శనిమహాదశయందలి శుక్రాంతర్దశయందు మిత్రులయభివృద్ధి శోకములు నశించుట కీర్తి వ్యాపించుట భార్య ధనము విజయము లభించును.

నీచోచ్చాదివిభేదేన శత్రుమిత్రబలాబలం,
అంతర్దశాసు మతిమా న్చింతయేచ్చ ప్రయత్నతః. 55

నీచ ఉచ్చ శత్రుమిత్రబల దుర్బలాది భేదములచేత అంతర్దశాఫలములను ఆలోచించతగినది.

అంతర్దశాశుభాయాం మూలదశాయాం శుభాయదాభవతి,
భవతి తదా బహుసౌఖ్యం ధనలబ్ధిరతీవపురుషాణామ్ 56

అంతర్దశ మూలదశ రెండును శుభప్రదములాయెనేని సౌఖ్యము ధనలాభము మొదలుగాఁగల యుత్తమఫలములు గలుగును.

రవికిరణముషితదీప్తైర్దశాగ్రహస్య మలినాం తనుం కృత్వా,
మానయశోర్థవిలాస ప్రతాపరూపోద్యమా న్హంతి. 57

అస్తంగతగ్రహదశయందు మిక్కిలి నల్లనగుశరీరము అభిమానము కీర్తి ధనము విలాసములు ప్రతాపము రూపము ఉత్సాహము మొదలగునవి నశించుట కలుగును.

హోరాజన్మాధిపయోశ్శత్రుదశాయాం నరోఽతిమూఢమతిః,
రాజ్యాచ్చ్యుతో విపత్తైరభిభూతోఽన్యం సమాశ్రయతి. 58

లగ్నాధిపతియొక్కయును హోరాధిపతి (జన్మకాలమున చంద్రునిచే ఆక్రమింపఁబడినరాశ్యధిపతి) యొక్కయును శత్రుదశయందు మిక్కిలిమందమగుబుద్ధి రాజ్యచ్యుతి శత్రుపరాభవము ఇతరులను సేవించుట సంప్రాప్తమగును.

వ్యోమలగ్నప్రపన్నస్య దశాయాం రాజ్యమాప్నుయాత్,
నరేంద్రాణాం సమాయోగే సువీర్యస్యాథవా పునః. 59

దశమస్థానమును బొందిన గ్రహదశయందు రాజ్యప్రాప్తి గలుగును. బలయుక్తుఁడాయెనేని రాజానుగ్రహము మొదలైనవి గలుగును.

లగ్నే జీవసితబుధయుతస్సప్తమస్థోఽర్కపుత్రః
కర్మప్రాప్తో దహనకిరణో భోగినాం జన్మకుర్యాః,
కేంద్రే సౌమ్యానశుభగృహగా యత్ర పాపాభిధానా
యద్యేవం స్యాచ్ఛబరనృపతిర్జాయతే విత్తవాంశ్చ 60

లగ్నమున బుధగురుశుక్రులు సప్తమమున శని దశమమున రవి ఇట్లుండఁగాఁ బుట్టినవాఁడు భోగవంతుఁడగును. దశమమందు రవి యుండఁగా లగ్నమున బుధగురుశుక్రుల సంభవములు. ఇట్టివి వజ్రాదియోగములయందుఁ జెప్పఁబడెను గాని వికల్పము జేసిన సంభవమగును. ఎట్లన: లగ్నమున బుధగురుశుక్రులుండిరేని బుట్టినవాఁడు భోగవంతుఁడగును. లేక సప్తమమున శని దశమమున రవి యున్నచో భోగవంతుఁడగును. శుభగ్రహ సంబంధంబులగు మిథున కర్కాటక కన్యా తులా ధనుర్మీనములు కేంద్రస్థానగతములగుచుండఁగా పాపగ్రహసంబంధంబులగు మేష సింహ వృశ్చిక మకర కుంభములు పాపగ్రహయుతంబులై యుండెనేని బుట్టినవాఁడు శబరపక్కరాదులకు రాజై ధనవంతుఁడగునని తాత్పర్యము

ఇతి ఏకచత్వారింశోఽధ్యాయః

---

## దశారిష్టఫలములను దెలుపు నలువదిరెండవ యధ్యాయము.

క్రూరదశాయాం క్రూరః ప్రవిశ్య చాంతర్దశాం యదా కురుతే,
పుంసాం స్యాత్సందేహస్తదాఽరియోగస్సదైవ మహాన్. 1

క్రూరగ్రహదశయందైన క్రూరగ్రహ అంతర్దశయందు పురుషులకు ప్రబలమైన సందేహము (మారకము) గలుగును. శత్రువృద్ధియున్ను గలుగును.

క్షితితనయస్య దశాయాం రవిజస్యాంతర్దశా యదా విశతి,
బహుకాలజీవినామపి మరణం నిస్సంశయం కురుతే. 2

కుజదశయందు శనన్యంతర్దశాకాలమున సంపూర్ణాయుర్దాయము గలవాఁడైనను మృతినొందును.

క్రూరరాశౌ స్థితః పాప షష్ఠే స్యా న్నిధనేఽపి వా,
తత్ స్థితేనారిణా దృష్టస్స్వపాకే మృత్యుదో గ్రహః. 3

షష్ఠాష్టమములలో నొకటి క్రూరరాశియై అందు పాపగ్రహముండి క్రూరక్షేత్ర మందున్న పాపగ్రహముచేఁ జూడఁబడెనేని అట్టిదశయందు మరణము గలుగును.

విలగ్నాధిపతే శ్శత్రు ర్లగ్నస్యాంతర్దశాం గతః,
కరోత్యకస్మా న్మరణం సత్యాచార్యః ప్రభాషతే. 4

లగ్నముయొక్క దశయందైన అంతర్దశాధిపతి లగ్నాధిపతికి శత్రువైన గ్రహమగుచుండఁగా అంతర్దశయందు ఆకస్మికముగ మరణము సంభవించునని సత్యాచార్యులు చెప్పిరి.

ఇతి ద్విచత్వారింశోఽధ్యాయః.

దశారిష్టభంగములను దెలుపు నలువదిమూఁడవ యధ్యాయము.

ప్రవేశే బలవా న్ఖేట శ్శుభై ర్వా సునిరీక్షితః,
సౌమ్యాధిమిత్రవర్గస్థో మృత్యవే న భవే త్తదా. 1

అంతర్దశాప్రవేశకాలమున అంతర్దశాధిపతి క్రూరుఁడైన బలవంతుఁడు శుభులచేఁ జూడఁబడినవాఁడు శుభాధిమిత్రవర్గమందు ఉన్నవాఁడు అయెనేని ఆఅంతర్దశయందు మరణము గలుగదు.

అంతర్దశాధినాథస్య విబలస్య దశా యదా,
బలినస్స్యా త్తదా భంగో దశారిష్టస్య తద్ధ్రువమ్. 2

మూలదశాధిపతి బలవంతుఁడై అంతర్దశాధిపతి బలహీనుఁడైయుండెనేని ఆఅంతర్దశయందు మరణము గలుగదు

యుద్ధే చ విజయీ తస్మి న్గ్రహయోగే శుభే యది,
దశాయాం న భవే త్కష్టం స్వోచ్చాదిషు చ సంస్థితః. 3

యుద్ధమందు జయమును పొందినట్టియుం శుభయుక్తుఁడైనట్టియుం ఉచ్చయం దున్నట్టియుం గ్రహదశయందును అంతర్దశయందును మరణము గలుగదు.

ఇతి త్రిచత్వారింశోఽధ్యాయః.

## ఉచ్చాదులయందుండు గ్రహఫలములను దెలుపు
## నలువదినాలవ యధ్యాయము.

అత్యుగ్రమతిద్రవ్యం మహాంతమపి భాస్కరస్స్వతుంగస్థః,
మృష్టాశనాంబరాఢ్యం సుభూషణం శీతగుః కురుతే. 1

సూర్యుఁ డుచ్చయందుండెనేని ఉగ్రము అధికధనము మొదలగుఫలములు గలుగును చంద్రుఁ డుచ్చయందుండెనేని మృష్టాన్నము నూతనవస్త్రములు భూషణములు మొదలైనవి గలుగును.

తేజస్వినం కుతనయో దుష్ప్రపహం గర్వితం ప్రవాసరతం,
మేధావినం కులాఢ్యం సునిపుణవాక్యం బుధస్స్వచ్చే. 2

కుజుఁడుచ్చయందుండెనేని తేజస్సు గర్వము మొదలైనవి గలుగును. బుధుఁడుచ్చయందుండెనేని ధారణసమర్థమైన బుద్ధి మొదలైనవి గలుగును.

విఖ్యాతం గురురాఢ్యం విద్వాంసం సత్కృతం కుశలం,
స్వోచ్చే భృగోశ్చ తనయో విలాసహాస్యప్రగీతనృత్తరతమ్. 3

గురుఁ డుచ్చయందుండెనేని ఖ్యాతి విద్య మాన్యత మొదలైనవి గలవాఁడగును. శుక్రుఁ డుచ్చయందుండెనేని విలాసాదులయం దాసక్తిగలవాఁ డగును.

స్వోచ్చస్థో రవితనయో నృపలబ్ధనియోగమభిజనయేత్,
గ్రామపురాధిపతిత్వ మరణ్యధాన్యం కునారిలాభం చ. 4

శని యుచ్చమందున్న రాజనియోగము గ్రామాధిపత్యము పట్టణాధిపత్యము అరణ్యములు ధాన్యము సేకరించుట దుష్టప్రవర్తనగలభార్యయును లభించును.

భాను స్త్రికోణసంస్థో ధనవంతం ముఖ్య మతినిపుణాం,
భోక్తారం గుణవంతం శశీప్రసూతౌ త్రికోణగః పురుషమ్. 5

జననకాలమున సూర్యుఁడు త్రికోణమందుండెనేని ధనము బుద్ధి మొదలైనవి గలవాఁడగును. చంద్రుఁడు త్రికోణమందుండెనేని భోగము గుణము గలవాఁడగును.

వక్రోఽపి తస్కరపతిం శూరం ఖలు నిర్దయం చాపి,
సౌమ్యో వినోదశీలం జయినం చ స్వత్రికోణగః కురుతే. 6

కుజుఁడు త్రికోణమందుండెనేని దొంగల కధిపతి శౌర్యము మొదలైనవి గలవాఁడగును. బుధుఁడు త్రికోణమందుండెనేని వింతపనులు సేయువాఁడు, జయమును బొందువాఁడు అగును.

జీవః పునర్విత్తకరం మహత్తరం నయవిదం సుఖోపేతం,
దానవపూజ్యో జనయేద్ధామపురవసిష్ఠమాఢ్యమతిసుభగమ్. 7

బృహస్పతి త్రికోణమందుండెనేని సుఖము మొదలైనవి గలవాఁడగును. శుక్రుఁడు త్రికోణమందుండెనేని శ్రేష్ఠుఁడు, సౌందర్యము ధనము గలవాఁడగును.

ఆత్మత్రికోణఆర్కిర్ధనత్రృప్తం కులయుతం శూరం,
తీక్ష్ణమయూఖః కురుతే మహోగ్రమత్యుచ్చకర్మాణమ్. 8

శని స్వత్రికోణమందుండెనేని ధనము శౌర్యము గలవాఁడగును. రవి స్వక్షేత్రమందుండెనేని ప్రబలుఁడుగ్రము ఉచ్చకార్యాసక్తి గలవాఁడగును.

ధర్మరతం హిమరశ్మిర్మనస్వినం రూపవంత మాత్మర్క్షే,
ఆఢ్యం ప్రచండమచలం భౌమః కురుతే స్వరాశిగః పురుషమ్ 9

చంద్రుఁడు స్వక్షేత్రమందుండెనేని ధర్మాసక్తి మొదలైనవి గలుగును. కుజుఁడు స్వక్షేత్రమందుండెనేని ధనము మొదలైనవి గలుగును.

శశితనయోఽపి విధత్తే వల్గుకథం పండితం వాఽపి,
కావ్యశ్రుతిజ్ఞమాఢ్యం గురుచేష్టం వాక్పతిస్స్వరాశిస్థః. 10

బుధుఁడు స్వక్షేత్రమందుండెనేని పాండిత్యము మొదలైనవి గలుగును. గురుఁడు స్వక్షేత్రమందుండెనేని వేదములు మొదలైనవి దెలిసినవాఁడగును.

దానవపూజ్యః కురుతే కృషీవలం స్ఫీతవిత్తం చ,
కురుతే శనైశ్చరోఽపి చ మాన్యమదుఃఖం స్వరాశిగః పురుషమ్.

శుక్రుఁడు స్వక్షేత్రమందుండెనేని వ్యవసాయము మొదలైనవి గలుగును. శని స్వక్షేత్రమందుండెనేని గౌరవము సుఖము గలవాఁడగును.

మిత్రగృహేఽర్కః ఖ్యాతం స్థిరసౌహృదమర్థదాతారం,
మిత్రర్క్షగశ్శశాంకో యతస్తతో లబ్ధసౌఖ్యబహుమానమ్ 12

రవి మిత్రక్షేత్రమందుండెనేని ఖ్యాతి మొదలైనవి గలుగును. చంద్రుఁడు మిత్రక్షేత్రమందుండెనేని సౌఖ్యము బహుమానము గలవాఁడగును.

అంగారకోఽపి కురుతే సుహృద్ధనారక్షణాసక్తం,
శశిజస్సుహృద్గృహస్థః కరోతి చాతుర్యహాస్యధనవంతమ్. 13

కుజుఁడు మిత్రాలయమందుండెనేని స్నేహితులను ధనమును రక్షించువాఁడగును. బుధుఁడు మిత్రాలయమందుండెనేని చతురత ధనము మొదలైనవి గలవాఁడగును.

వచసా మధిపః పూజ్యం సతాం చ సువిశిష్టకర్మాణం,
మిత్రగృహేభృగుతనయస్సుహృత్ప్రియందయితవిత్తమతిశూరమ్.

బృహస్పతి మిత్రక్షేత్రమందుండెనేని పూజ్యుఁడు, సత్కర్మాసక్తిగలవాఁడు అగును. శుక్రుఁడు మిత్రాలయమందుండెనేని మిత్రప్రియుఁడు, ధనము శౌర్యముగలవాఁడగును.

భాస్కరసూనుః కురుతే పరాన్నభోజనమధర్మకర్మరతం,
నీచే సవితా కురుతే ప్రేష్యం బాంధవజనావధూతం చ. 15

శని మిత్రాలయమందుండెనేని పరాన్నభోజనము సేయువాఁడు, అధార్మికుఁడు అగును. రవి నీచయందుండెనేని ప్రేష్యుఁడు, బంధుద్వేషి యగును.

హిమరశ్మిరల్పపుణ్యం రోగిణమపి దుర్బలం లోకే,
నీచస్థః క్షితితనయోఽనర్థవ్యసనోపతప్త మతినీచమ్ 16

చంద్రుఁడు నీచయందుండెనేని స్వల్పపుణ్యము వ్యాధిదుర్బలము గలవాఁడగును. కుజుఁడు నీచయందుండెనేని వ్యసనము వ్యయము హైన్యము మొదలైనవిగలవాఁడగును.

కురుతే హిమకరపుత్రః క్షుద్రం స్వజ్ఞాతిబంధువైరం చ,
నీచే గురుః ప్రకురుతే మలినం ప్రాప్తావమాన మతిదీనమ్. 17

బుధుఁడు నీచయందుండెనేని క్షుద్రుఁడు బంధువైరము గలవాఁడు అగును. గురుఁడు నీచయందుండెనేని మాలిన్యము అవమానము దైన్యము గలవాఁడగును.

అసురదయితోఽస్వతంత్రం ప్రణష్టదారం విషమశీలం,
కోణో విపన్నశీలం విగర్హితాచార మర్థరహితం చ 18

శుక్రుఁడు నీచయందుండెనేని అస్వతంత్రుఁడు, దారహీనుఁడు, విషమస్వభావము గలవాఁడు అగును. శని నీచయందుండెనేని దుస్స్వభావము నిందితాచారము అర్థహీనము మొదలైనవి గలవాఁడగును.

కురుతే శత్రుగృహేఽర్కో నిఃస్వం విషయప్రపీడితం చాఽపి,
తుహినమయూఖః కురుతే హృద్రోగిణమరిగృహే నరం సతతమ్.

రవి శత్రుస్థానమందుండెనేని దరిద్రుఁడు, ఈప్సితచే పీడింపఁబడువాఁడు అగును. చంద్రుఁడుండెనేని హృదయరోగము గలవాఁడు, శత్రుగృహమందుండువాఁడు అగును. యవనేశ్వరమతముచే చంద్రునకు శత్రువులు గలరుగాన నిచట చంద్రునకు శత్రుక్షేత్రమని చెప్పఁబడెను.

బంధారిభంగభాజం దీనం వికలం చ దుర్భగం భౌమః,
అజ్ఞానమతివిహీనం బుధోఽరిభే నైకదుఃఖమతిదీనమ్. 20

కుజుఁడు శత్రుస్థానమందుండెనేని బంధనము శత్రువులవలన పరాజయము దైన్యముగలవాఁడగును. బుధుఁడు శత్రుక్షేత్రమందుండెనేని అజ్ఞానము మొదలుగాఁ గలవి కలుగును.

క్లీబం గురుర్విధత్తే నయహీనం ధనవిహీనం చ,
శుక్రోఽరిగృహేభృతకం కుతంత్రమతిదుఃఖితం జనయేత్,
భాస్కరసుతోఽపి కురుతే మలినం వ్యాధ్యాదిశోకసంతప్తమ్. 21

గురుఁడు శత్రుస్థానమందుండెనేని నపుంసకుఁడు, నీతిమొదలైనవి లేనివాఁడగును. శుక్రుఁడు శత్రుస్థానస్థుఁడాయెనేని భృత్యుఁడు, కొండెములు జెప్పువాఁడు, దుఃఖములు గలవాఁడు అగును. శని శత్రుస్థానమందుండెనేని మాలిన్యము వ్యాధి శోకము మొదలైనవానిచే పీడితుఁడగును.

స్వోచ్చాచ్ఛుభాగేషు ఫలంసమగ్రం స్వక్షేత్రతుల్యంభవనాంశకేషు,
నీచారిభాగేషు జఘన్యమేవ మధ్యంఫలం మిత్రగృహాంశకేషు. 22

గ్రహములు తమతమ ఉచ్చాంశలయందుండిరేని పూర్ణఫలము నిత్తురు. స్వనవాంశలయందుండిరేని స్వక్షేత్రములకుఁ జెప్పినఫలముల నిత్తురు. నీచశత్రుభాగలయందుండిరేని హీనఫలము నిత్తురు. (నిష్ఫలము గలుగుననుట) మిత్రనవాంశలయందుండిరేని మధ్యమఫలము నిత్తురు.

ద్వావుచ్చగౌ జనయతో ధనినం కీర్త్యాన్వితం సదాపురుషం,
నగరారక్షక మాఢ్యం చమూపతిం త్రయః ప్రథితమ్. 23

గ్రహములు రెండు ఉచ్చయందుండెనేని ధనము కీర్తి మొదలైనవి గలవాఁడగును. మూఁడుగ్రహములుండెనేని నగరాధిపతి సేనాధిపతి యగును.

ఆఢ్యం నృపాత్తకీర్తిం చత్వారో రాజధర్మసంయుక్తం,
ఖ్యాతం నృపతీష్టతమం పంచానేకవిధవృద్ధకోశం చ. 24

నాలుగుగ్రహములు ఉచ్చయందుండెనేని ధనము కీర్తి మొదలైనవి గలవాఁడగును. ఐదుగ్రహము లుచ్చయందుండెనేని రాజప్రియుఁడు, ఖ్యాతి మొదలైనవి గలవాఁడగును.

షడ్గ్రిహాస్స్వోచ్చగాః కుర్యుర్న్రపతిం పురుషం సదా,
ప్రధానమానసంపన్నం బహువాహనమండితమ్. 25

ఆరుగ్రహము లుచ్చయందుండెనేని అనేకవాహనములు మొదలైనవిగల ప్రభు వగును.

స్వోచ్చం యాతాస్సర్వే సముద్రపర్యంతమేదినీనాథం,
జనయంతి చక్రవర్తిన మవనీశం జాతకం చింత్యమ్. 26

బుధుఁడు ఉచ్చనవాంశయందును బుధేతరగ్రహములు స్వోచ్చలయందును నుండఁగాఁ బుట్టినవాఁడు చతుస్సముద్రపర్యంతము భూమిని పాలించు చక్రవర్తి యగును. సూర్యుఁ డుచ్చయందుండఁగా బుధునకు ఉచ్చసంభవించదు గాన ఉచ్చ నవాంశయని వ్రాయఁబడెను. లేనిచో ఈయోగ మసంభవము

ద్వాభ్యాం త్రికోణసంస్థాభ్యాం కుటుంబీ కులవర్ధనః,
శ్రేష్ఠః ప్రఖ్యాతకీర్తిశ్చ గ్రహాణాం భువి జాయతే. 27

ఇద్దరుగ్రహములు త్రికోణములయందుండిరేని కుటుంబి సంతానము ఖ్యాతి మొదలైనవి గలవాఁడగును.

మహాధన స్త్రిభిశ్చైవ గణగ్రామాధినాయకః,
ఆఢ్యో నృపాప్తసత్కారశ్చతుర్భి ర్లోకసంమతః. 28

మూఁడుగ్రహములు త్రికోణములయందుండిరేని ప్రబలగ్రామాధిపతి యగును. నాలుగుగ్రహములు త్రికోణములయందుండిరేని ధనికుఁడు, రాజప్రియుఁడు, జన హితుఁడు అగును.

ఆరక్షణకః ప్రధాన స్సేనాపురనగరభూపకోశానాం,
పంచగ్రహై స్త్రికోణే భవతి కుటుంబీ సుబహుసౌఖ్యః. 29

ఐదుగురుగ్రహములు త్రికోణములయందుండిరేని శ్రేష్ఠుఁడు, సేనాధిపత్యము మొదలైనవి గలవాఁడు, కుటుంబము గలవాఁడు, సౌఖ్యము గలవాఁడగును.

విద్యాదానధనాఢ్యైస్సమన్వితో భవతి షడ్భిరేవ పుమాన్,
రాజ్యం ప్రశాస్తి నియతం గోపాలకులేఽపి సంజాతః. 30

ఆరుగురుగ్రహములు త్రికోణములయందుండిరేని విద్య మొదలైనవి గలవాఁడగును. రాజకులోద్భవుఁడు కాఁడేని ప్రభువగును.

స్వత్రికోణగతైస్సర్వైర్భవేజ్జాతో మహీపతిః,
వసుస్త్రీబలసంపన్నో విద్యాశాస్త్రవిశారదః. 31

సూర్యాదిసప్తగ్రహములు తమతమత్రికోణములయందుండిరేని ధనము స్త్రీ బలము విద్యలు శాస్త్రములు మొదలైనవిగల నరేంద్రుఁ డగును.

ద్వౌ స్వగృహస్థౌ కురుతః కులాధికం బంధుపూజనం ధన్యం,
వంశకర మర్ధసహితం స్థానయశోభిస్త్రయో విహగాః. 32

రెండుగ్రహములు స్వక్షేత్రములయందుండిరేని బంధుసన్మానము మొదలైనవి గలవాఁడగును. మూఁడుగ్రహములు స్వక్షేత్రములయందుండిరేని యశస్సు మొదలైనవిగల కులశ్రేష్ఠుఁడగును.

ఖ్యాతం విశిష్టచేష్టం శ్రేణీపురనగరపంచచత్వారః,
పంచావనీశ్వరసమం ప్రభూతగోభూమియువతిసంపన్నమ్ 33

నాలుగుగ్రహములు స్వక్షేత్రములయందుండిరేని సేనాధిపత్యము గ్రామాధిపత్యము ఖ్యాతి మొదలైనవి గలవాఁడగును. ఐదుగురు గ్రహములు స్వక్షేత్రములయందుండిరేని అధికభూమి స్త్రీలు గోవులు మొదలైనవి గలిగి రాజతుల్యుఁడగును.

షడ్భిః ప్రవృద్ధశబ్దం ద్యుతికోశస్వజనవాజిమానాఢ్యః,
భవతి నృపవంశజాతో నియతం పృథివీపతిస్స్వర్క్షే. 34

ఆరుగ్రహములు స్వక్షేత్రములయందుండిరేని ధైర్యము ధనము మొదలైనవి గలవాఁడగును.

రాజాధినృపం స్వర్క్షే జనయంతి జితారిపక్షమిహ సప్త,
మిత్రాశ్రయం సువృత్తం ద్వౌమిత్రగృహసమాశ్రితౌ కురుతః. 35

రవ్యాదిగ్రహములన్నియుం స్వక్షేత్రములయందుండిరేని రాజ్యము మొదలైనవి గలవాఁడగును. రెండుగ్రహములు మిత్రరాశియందుండిరేని స్నేహితులు సద్వృత్తి మొదలైనవి గలవాఁడగును.

బాంధవసుహృదుపకర్తా త్రిభిర్విశిష్టో భవేద్గుణైః ఖ్యాతః,
బ్రాహ్మణ దేవారాధనపరశ్చతుర్భిర్ధురంధరః ఖ్యాతః. 36

మూఁడుగ్రహములు స్వక్షేత్రములయందుండిరేని బంధువులు స్నేహితులు మొదలైనవారికి ఉపకారము చేయువాఁడు, సద్గుణములు మొదలైనవి గలవాఁడగును. నాలుగుగ్రహములు స్వక్షేత్రమందుండిరేని దేవబ్రాహ్మణభక్తి మొదలైనవి గలవాఁడగును.

రాజోపసేవకస్స్యాత్పంచభిరాఢ్యో నరేశ్వరః కర్తా,
వి స్తీర్ణభోగవాహనవసుమాన్షడ్భిర్న రేంద్రతుల్యస్స్యాత్. 37

ఐదుగురుగ్రహములు స్వక్షేత్రములయందుండిరేని రాజానువర్తి దేశాధిపతి యగును. ఆరుగురుగ్రహములు స్వక్షేత్రములయందుండిరేని అధికభోగము వాహనములు ధనము మొదలైనవి గలిగి రాజతుల్యుఁడు అగును.

సర్వై ర్విర్మిత్రక్షగతైర్బహువాహనభృత్యసాధనో రాజా,
ద్వాభ్యాం నీచే నీచ శ్చింతాబహ్వోగ్రహసమేతః. 38

గ్రహములన్నియును మిత్రక్షేత్రములయందుండెనేని అనేక వాహనములు మొదలైనవిగల నరేంద్రుఁడగును. రెండుగ్రహములు నీచయందుండెనేని నీచుఁడు, అధిక కోపము చింతగలవాఁడగును.

మూర్ఖోఽధర్మరతోఽస్వస్త్రిభిర్దరిద్రోఽర్థవ్యాగో నరః ప్రేష్యః,
ఆలస్యనష్టచేష్ట శ్చతుర్భిరిహ నీచగై ర్భృతకః. 39

మూఁడుగ్రహములు నీచయందుండెనేని మూర్ఖుఁడు, దరిద్రుఁడు, అధర్మము సేయువాఁడు అగును. నాలుగుగ్రహములు నీచయందుండెనేని భృత్యుఁడు, నష్టమగు కార్యములు సేయువాఁడు అగును.

అగృహః ప్రభిన్నదారః పంచభిరిహ కథ్యతే నరో దాసః,
కాసభయశ్రమతప్త షడ్భి ర్నీచో భవే త్క్షామః. 40

ఐదుగురు నీచయందుండిరేని గృహభార్యాదులు లేనివాఁడై దాసత్వము జేయువాఁడగును. ఆరుగురు నీచయందుండిరేని కాసరోగము భయము శ్రమ మొదలైనవానిచే పీడితుఁడగును.

భిక్షు స్త్యక్తా శితభుగ్భవతి పుమాన్విగతసర్వస్వః,
నీచై స్సప్తభిరఖిలై ర్దిశ్చిరవిధృతాంబరస్స్నాతః. 41

గ్రహములన్నియు నీచయందు అనఁగా బుధుఁడు నీచాంశయందును తదితరగ్రహములు నీచయందును నుండెనేని దరిద్రుఁడు, భిక్షాటనము మొదలగు అధిక నీచమును బొందువాఁడగును.

ద్వౌ పరిభవనసమేతౌ క్లేశవతాం నిత్యవిగ్రహరుచీనాం,
అతిపరిభూతానా మపి నృపాణాం జన్మప్రదౌ కథితౌ. 42

రెండు గ్రహములు శత్రుక్షేత్రములయందుండెనేని క్లేశము కలహము తిరస్కారము మొదలైనవి గలుగును.

వివిధవ్యయదుఃఖభుజాం త్రయశ్చారిమోత్పన్నకష్టవిత్తానాం,
చత్వార ఇష్టయోషి త్పుత్రార్థవినాశజాధితప్తానామ్. 43

మూఁడుగ్రహములు శత్రురాసులయందుండెనేని అనేకవిధములైన దుఃఖములు మొదలైనవి గలుగును. నలుగురు శత్రురాసులయందుండిరేని ప్రియులు భార్యాపుత్రులు ధనము మొదలైనవి నశించినవాఁడై అధికదుఃఖములను బొందువాఁడగును.

పంచారిగృహే విహగా ఇష్టవ్యసనాభిఘాతతప్తానాం,
షడ్రోగాంకితవపుషాం దుఃఖవతాం చైవ జన్మకరాః. 44

ఐదుగురు శత్రురాసులయందుండిరేని బంధువ్యసనముచే తపించువాఁడగును. ఆరుగురు శత్రుస్థానములయందుండిరేని రోగాక్రాంతమైన శరీరము దుఃఖములు మొదలైనవి గలవాఁడగును.

సప్తారిభే గ్రహేంద్రా బీభత్సకులే ప్రసూతానాం,
శయ్యాచ్ఛాదనభోజనవంచితకానాం భవంతి సదా 45

గ్రహములన్నియుం శత్రుస్థానములయందుండెనేని నీచకులమందుఁ బుట్టి శయ్యాదులు లేనివాఁడై మహాదరిద్రుఁడగును.

ఇతి చతుశ్చత్వారింశోఽధ్యాయః.

---

## స్త్రీజాతకఫలములను దెలుపు నలువదైదవ యధ్యాయము.

స్త్రీణాం జన్మఫలం తుల్యం పుంభిస్సార్థం యదుచ్యతే,
విశేష స్తత్ర యో దృష్టః కథ్యతే విస్తరేణ సః. 1

పూర్వమున పురుషజన్మకాలమునకుఁ జెప్పఁబడిన ఫలములన్నియుం స్త్రీజన్మకాలమునకు తెలియతగినవి గాని అందు కొన్నివిశేషములను జెప్పఁబోవుచున్నాను.

వైధవ్యం నిధనే చింత్యం శరీరం జన్మలగ్నతః,
సప్తమే పతిసౌభాగ్యం పంచమే ప్రసవ స్తథా. 2

స్త్రీలజన్మరాశికి అష్టమస్థానమువలన భర్తృమరణము తెలియతగినవి. జన్మరాశి లగ్నముల ననుసరించి శరీరస్థితిని, సప్తమస్థానమునుబట్టి భర్తృసౌఖ్యము మొదలైనవి, పంచమస్థానము ననుసరించి సంతానము జెప్పతగినది.

ప్రకృతిస్థా లగ్నేందోస్సమభే సచ్ఛీలరూపాఢ్యా,
భూషణగుణైరుపేతా శుభవీక్షితయోశ్చ యువతిస్స్యాత్. 3

స్త్రీజన్మకాలమున లగ్నచంద్రులు సమరాసులయందుండిరేని స్త్రీస్వభావము గలదగును. ఆలగ్నచంద్రులు శుభగ్రహములచేఁ జూడఁబడిరేని సత్స్వభావము రూపము ఆభరణములు సద్గుణములు మొదలైనవి గలదగును.

పురుషాకృతిశీలయుతా దుశ్శీలా దుఃఖితా విషమరాశౌ,
క్రూరైర్వీక్షితయుతయోః పాపా స్త్రీ స్యాద్గుణైర్విహీనా. 4

లగ్నచంద్రులు విషమరాశియందుండిరేని పురుషరూపము పురుషస్వభావము దుస్స్వభావము దుఃఖములు గలది యగును. పాపులచేఁ జూడఁబడి కలిసియుండిరేని పాపాచారము గలదియు, గుణహీనురాలును అగును. మిశ్రముగ నుండెనేని మిశ్రగుణములు గలది యగును.

లగ్నేందోర్యో బలవాంస్త్రింశాంశేఽధిష్ఠితోఽధిపైః ఫలం క్రమశః,
భూసుతభార్గవబోధనసురగురుమార్తాండదేహభవైః. 5

లగ్నచంద్రులలో బలవంతుఁడు మేషాదిరాసులయందు త్రింశాంశాధిపతులగు కుజశుక్ర బుధగురుశనులలో ఏగ్రహాధిపతి త్రింశాంశయందుండునో ఆత్రింశాంశాధిపతి ననుసరించి ఫలములను జెప్పఁబోవుచున్నాను.

కన్యైవ స్వగృహే దుష్టా భౌమత్రింశాంశకే భవేత్,
కుచరిత్రా తథా శౌక్రే సమాయా బోధనేఽబలా. 6
జీవే సాధ్వీ నటీ దాసీ మాందే స్యాత్కపటీ మతా,
శౌక్రే ఖ్యాతగుణా బౌధే కలాఢ్యా సుగుణా గురౌ. 7
శనౌ పునర్భూర్విజ్ఞేయా దుష్టా కౌజే సితర్క్షగే,
శౌక్రే ప్రకీర్ణకామా చ బౌధే గుణాగతి గురౌ. 8
సతీ శనౌ క్లీబసమా కాపటీ బుధభే కుజే,
స్వచ్ఛందా శశిభే కౌజే శౌక్రే చ కులపాంసనా 9
బౌధే శిల్పాన్వితా నారీ జైవే బహుగుణా స్మృతా,
పతిఘ్నీ చార్కభే కౌజే వాచాలా భార్గవే సతీ. 10
బౌధే పుంశ్చేష్టితా జీవే సతీ మాందే కులచ్యుతా,
కౌజే బహుగుణార్కర్క్షే శౌక్రే వాగ్వ్యాసనీ సతీ. 11

బౌధే విజ్ఞానసంయుక్తా జైవే నైకగుణా స్మృతా,
మందే చాల్పరతిః ప్రోక్తా దాసీ కౌజే తథార్కిభే. 12
అప్రజా చ భవేచ్ఛాక్రే బుధే దుష్టాఽబలా తథా,
జీవే పతివ్రతా నిత్యం మందే నీచానుసేవినీ. 13

కుజక్షేత్రమందలి కుజత్రింశాంశయందు లగ్నచంద్రులలో బలవంతుఁడు ఉండఁగాఁ బుట్టినస్త్రీ పెండ్లిగాకముందరనే పురుషసంపర్కము జేయును. కుజక్షేత్రమందలి శుక్రత్రింశాంశ యందుండఁగాఁ బుట్టినస్త్రీ దురాచారయుక్తురా లగును బుధత్రింశాంశయందుండెనేని మాయతోఁగూడినదగును. గురుత్రింశాంశయందుండెనేని పతివ్రతయగును. శనిత్రింశాంశయందుండెనేని దాసీభావమును బొందునదియు, నాట్యము సేయునదియునగును. లగ్నచంద్రులలో బలవంతుఁడు శుక్రక్షేత్రమందైన శుక్రత్రింశాంశయందుండఁగాఁ బుట్టినస్త్రీ సౌశీల్యాదిగుణములచే ప్రసిద్ధురాలగును. బుధత్రింశాంశయందుండెనేని గీతాదికళల నెఱింగినదగును. గురుత్రింశాంశయందుండెనేని మంచి గుణములుగలదౌను. శనిత్రింశాంశయందుండెనేని వివాహానంతరము తిరిగి మరియొకరిని పెండ్లియాడునది యగును. కుజత్రింశాంశయందుండెనేని దుర్మార్గురాలగును. లగ్నచంద్రులలో బలవంతుఁడైనవాఁడు బుధక్షేత్రమందైన శుక్రత్రింశాంశయందుండఁగాఁ బుట్టినస్త్రీ అనేకపురుషులయందు వ్యాపించిన కామముగలదౌను. బుధత్రింశాంశయందుండెనేని సుగుణములు గలదౌను. గురుత్రింశాంశయందుండెనేని పతివ్రత యగును. శనిత్రింశాంశయందుండెనేని నపుంసకసమానురా లగును. కుజత్రింశాంశయందుండెనేని కపటము గలదౌను. లగ్నచంద్రులలో బలవంతుఁడు చంద్రక్షేత్రమందైన కుజత్రింశాంశయందుండఁగాఁ బుట్టినస్త్రీ యథేష్టవ్యవహారిణి యగును. శుక్రత్రింశాంశయందుండెనేని వ్యభిచారిణి యగును. బుధత్రింశాంశయందుండెనేని శిల్పకర్మలు సేయునట్టిదౌను. గురుత్రింశాంశయందుండెనేని అనేకసుగుణములు గలదౌను. శనిత్రింశాంశయందుండెనేని మగని జంపునట్టిదగును లగ్నచంద్రులలో బలవంతుఁడు రవిక్షేత్రమందైన కుజత్రింశాంశయాదుండఁగాఁ బుట్టినస్త్రీ పురుషాచారము గలదౌను శుక్రత్రింశాంశయందుండెనేని వ్యభిచారిణి యగును. బుధత్రింశాంశయందుండెనేని పురుషస్వభావము గలదౌను. గురుత్రింశాంశయంగుండెనేని పతివ్రత యగును. శనిత్రింశాంశయందుండెనేని తనస్వకులమును విడిచిపెట్టినది యగును. లగ్నచంద్రులలో బలవంతుఁడు గురుక్షేత్రమందైన కుజత్రింశాంశయందుండఁగాఁ బుట్టినస్త్రీ బహుగుణములు గలదౌను. శుక్రత్రింశాంశయందుండెనేని విస్తరించి మాటలాడునదియుం బతివ్రత యగును. బుధత్రింశాంశయందుండెనేని శాస్త్రజన్యజ్ఞానయుక్తురాలగును.

గురుత్రింశాంశయందుండెనేని బహుగుణములు గలదౌను. శనిత్రింశాంశయందుండెనేని అల్పమైన రతిగలదౌను. లగ్నచంద్రులలో బలవంతుఁడు శనిక్షేత్రమందైన కుజత్రింశాంశయందుండఁగాఁ బుట్టినస్త్రీ దాసియగును. శుక్రత్రింశాంశయందుండెనేని గోడ్రాలగును. బుధత్రింశాంశయందుండెనేని దుర్మార్గురాలగును. గురుత్రింశాంశయందుండెనేని పతివ్రతయగును. శనిత్రింశాంశ యందుండెనేని నీచపురుషగామినియగును. (కుజక్షేత్ర మనఁగా మేషవృశ్చికము లనుట) ఇట్లైె అంతటను తెలియఁదగినది.

శుక్రాసితౌ యది పరస్పరభాగసంస్థౌ
శౌక్రే చ దృష్టిపథగౌ వుదయే ఘటాంశే
స్త్రీణా మతీవ మదనాగ్నిమదః ప్రవృద్ధ
స్త్రీభి శ్శమం చ పురుషాకృతిభి ర్లభంతే. 14

శుక్రశనులు ఏరాశియందైనను శనినవాంశయందు శుక్రుఁడు శుక్రనవాంశయందు శని యుండువారలై ఒకరినొకరు జూచుచుండిరేనియు. ఇది యొకయోగము. శుక్రక్షేత్రములగు వృషభతులలలో నొకరాశి జన్మలగ్నమై ఆలగ్నవాంశ కుంభనవాంశ యయ్యెనేనియుం ఇది యొకయోగము. ఈరెండింటిలో నొకయోగమందుఁ బుట్టినస్త్రీ అతికామార్తురాలై పురుషసంయోగంబుచే తృప్తిబొందక చర్మమయలింగమును గట్టుకొన్న మరియొకస్త్రీతో రమించునని తెలియఁదగినది.

శూన్యేఽస్తే కాపురుషో బలహీనస్సౌమ్యదర్శనవిహీనే,
చరభే ప్రవాసశీలో భర్తా క్లీబో జ్ఞమందయోశ్చ భవేత్. 15

లగ్నచంద్రులలో బలవంతుఁడైనవానివల్లనుంచి సప్తమస్థానము గ్రహవర్జితమైనదయ్యెను, బలహీనమైనదయ్యెను, శుభదృష్టిలేనిదయ్యెను నుండఁగాఁ బుట్టినస్త్రీ యొక్క పెనిమిటి కుత్సితపురుషుఁడగును. ఆసప్తమరాశి చరరాశి యయ్యెనేని ఎల్లపుడు భర్త పరదేశము దిరుగువాఁ డగును. సప్తమస్థానమున బుధశనులలో నొకఁడుండఁగాఁ బుట్టిన స్త్రీయొక్క మగఁడు పుంస్త్వహీనుఁ డగును. ఇట్లు చరరాశికి ఫలము జెప్పుటవలన స్త్రీజన్మరాశికి సప్తమరాశి స్థిరరాశి యయ్యెనేని ఎల్లపుడు గృహమందే యుండును. ద్విస్వభావరాశి యయ్యెనేని కొన్నిదినములు దేశాంతరమందును కొన్నిదినములు స్వగృహమందును నుండును.

ఉత్సృష్టో సూర్యే స్తే కుజే చ విధవా నవోఢైవ,
కన్యైవా శుభదృష్టే శనైశ్చరే వృద్ధతాం యాతి. 16

పూర్వోక్తసప్తమరాశియందు రవియుండెనేని బుట్టినస్త్రీ మగనిచే విడువఁబడిన దగును. కుజుఁడుండెనేని బాల్యమందే విధవయగును. శనియుండి పాపగ్రహములచేఁ జూడఁబడుచుండఁగాఁ బుట్టినకన్యక వివాహము లేకయే ముసలితనమును బొందును.

అశుభే క్షీణేఽస్తగతే త్యక్తాపత్యా భవే దశుభదృష్టే,
క్రూరైర్విధవాఽస్తగతై ర్భవతి పునర్భూ స్తథామిశ్రైః. 17

లగ్నచంద్రులలో బలవంతుఁడైనవానికి సప్తమస్థానమందు సర్వబలహీనమైన పాపగ్రహముండి పాపగ్రహముచేఁ జూడఁబడఁగాఁ బుట్టినస్త్రీ పెనిమిటిచే విడువఁబడిన దగును. పాపగ్రహములు సప్తమరాశియందుండఁగాఁ బుట్టినస్త్రీ విధవయగును. శుభపాపులు మిశ్రముగనుండిరేని మొదటిమగని విడచి మఱియొకని పెండ్లియాడునది యగును.

అన్యోన్యభాగగతయోస్సితకుజయోరన్యపురుషసక్తా స్యాత్,
ద్యూనేవా శశిసహితౌ తౌ యువతి రనుజ్ఞయా భర్తుః. 18

ఏరాశియందైనను శుక్రనవాంశయందు కుజుఁడును కుజనవాంశయందు శుక్రుఁడును ఉండఁగాఁ బుట్టినస్త్రీ స్వేచ్ఛచేతనే పరపురుషసంగతురాలగును. సప్తమమందు శుక్రాంగారకులు చంద్రసహితులై యుండఁగాఁ బుట్టినస్త్రీ పెనిమిటి యనుజ్ఞచే పరపురుషసంగతురాలగును.

సౌరారగృహే తద్వచ్ఛశిని సశుక్రే విలగ్నగే జాతా,
మాత్రాసాకం కులటా క్రూరగ్రహవీక్షితే భవతి. 19

శనికుజక్షేత్రములగు మకరకుంభ మేషవృశ్చికములలో నొకటి లగ్నమై అందు చంద్రశుక్రులుండి పాపులచేఁ జూడఁబడుచుండఁగాఁ బుట్టినస్త్రీ తల్లితోఁ గూడ వ్యభిచారిణి యగును.

ద్యూనే తు కుజనవాంశే శనినా దృష్టే సరోగయోనిస్త్రీస,
సద్గ్రహభాగే చారుశ్రోణీ పతివల్లభా భవతి. 20

సప్తమస్థానమందైన కుజనవాంశ శనిచేఁ జూడఁబడుచుండఁగాఁ బుట్టినస్త్రీ వ్యాధిపీడితభగ యగును. సప్తమరాశియందు శుభగ్రహములును శుభనవాంశయునై యుండఁగాఁ బుట్టినస్త్రీ సుభగయును, మగనికి ఇష్టురాలును అగును.

ద్యూనే వృద్ధో మూర్ఖస్సౌరగృహే స్యాన్నవాంశకే నాథః,
స్త్రీలోలః క్రోధపరః కుజభేఽథ నవాంశకే భర్తా. 21

సప్తమస్థానము శనిక్షేత్రమై అందు శని నవాంశయైనను అయ్యేనేని బుట్టిన స్త్రీయొక్క మగఁడు ముసలివాఁడు, మూర్ఖుఁడు అగును. కుజక్షేత్రమైనను అందు కుజ నవాంశయైనను అయెనేని భర్త స్త్రీలోలుఁడు, క్రోధస్వభావము గలవాఁడు అగును.

శుక్రగృహేఽథ నవాంశేఽతిరూపసౌభాగ్యసంయుతో భర్తా,
నైపుణవిజ్ఞానయుత స్తథైవ బౌధేఽథవా నవాంశేవా. 22

వృషభతులలలో నొకరాశిగాని ఆనవాంశగాని సప్తమమందుండఁగాఁ బుట్టిన స్త్రీయొక్క పెనిమిటి రూపము సౌభాగ్యము గలవాఁడగును బుధక్షేత్రములగు మిథున కన్యలలో నొకరాశిగాని అనవాంశగాని సప్తమమందుండెనేని బుట్టినదానిమగఁడు మంచినేర్పు జ్ఞానము మొదలైనవి గలవాఁడగును.

మదనార్తో మృదుచిత్తశ్శశిభే నవమేంశకేఽథవాభర్తా,
గురుభే భాగేఽప్యథవా గుణవాన్విజితేంద్రియో భవతి 23

కర్కటకము లేక తన్నవాంశము సప్తమమందుండఁగాఁ బుట్టినదానిమగఁడు కామాతురుఁడు, మృదుస్వభావము గలవాఁడు అగును. గురుక్షేత్రమైనను అనవాంశ యైనను సప్తమమందుండఁగాఁ బుట్టిన వనితభర్త గుణవంతుఁడు, జితేంద్రియుఁడు అగును.

అతికర్కశకృదతితీక్ష్ణో రవిభేఽప్యథవాంశకే భవతి భర్తా,
సప్తమభవనోపేతే నిత్యం స్త్రీణాం సమవధార్యం. 24

రవిక్షేత్రమైనను రవినవాంశయైనను సప్తమమందుండఁగాఁ బుట్టిన స్త్రీయొక్క మగఁడు మృదుస్వభావము గలవాఁడు, బహువ్యాపారములు సేయువాఁడు నగును.

ఈర్ష్యాన్వితా సుఖపరా లగ్నే సితచంద్రయోర్బుధేందోశ్చ,
సుఖితా కలాసు కుశలా గుణశతసహితా వినీతా స్యాత్. 25

చంద్రశుక్రులు లగ్నమందుండఁగాఁ బుట్టినస్త్రీ మాత్సర్యయుక్తురాలు, సుఖా సక్తురాలును అగును. చంద్రబుధులుండిరేని సుఖముగలదియు, గీతావాద్యాదికళలయందు నేర్పరాలును, సుగుణవతియు నగును.

శుక్రబుధయోర్విలగ్నే రుచిరాసుభగా కలాసు నిపుణా చ,
దాస్యంబరసౌఖ్యయుతా శుభేషు పాపేషు విపరీతా. 26

బుధశుక్రులు లగ్నమందుండిరేని మనోహరమైనదియు, సౌందర్యమైనదియు, గీతాదుల నెఱింగినదియు నగును. ముగ్గురు శుభగ్రహములు లగ్నమందుండిరేని అనేక

విధములైన సౌఖ్యములు గలదగును. పాపగ్రహములుండిరేని అనేకవిధములైన కష్టములు గలదౌను.

పాపేఽష్టమే తు విధవా నిధనాధిపతిర్న వాంశకే యస్య,
తస్య దశాయాం మరణం వాచ్యం తస్యాశ్శుభైర్ద్వితీయస్థైః. 27

జన్మలగ్నమునకు అష్టమమందు పాపగ్రహముండెనేని అష్టమస్థానాధిపతి ఏగ్రహముయొక్క నవాంశయందుండునో వివాహానంతరమందు ఆగ్రహము దశాధిపతి లేక అంతర్దశాధిపతి యైనపుడు వైధవ్యము సంభవించునని తాత్పర్యము. ద్వితీయమున శుభగ్రహములుండి పాపగ్రహములు అష్టమమందుండఁగాఁ బుట్టినస్త్రీకి భర్తకంటె ముందర మరణము గలుగును.

కన్యాళివృషభసింహే శశిరమయూఖేఽల్పపుత్రా స్యాత్,
పుత్రభవనే శుభయుతే నిరీక్షితే వా తథైవ స్యాత్. 28

చంద్రుఁడు కన్యావృశ్చికవృషభసింహములయందుండఁగాఁ బుట్టినస్త్రీ స్వల్ప పుత్రులు గలదియగును. పుత్రస్థానము శుభయుతమైనను జూడఁబడినను స్వల్పపుత్రులు గలది యగును.

రిక్తైర్బుధేందుభృగుజై రవిజే చ మధ్యే
శేషై ర్బలేన సహితై ర్విషమర్క్షలగ్నే,
జాతా భవేత్పురుషిణీ యువతీ సదైవ
పుంశ్చేష్టితా విచరతి ప్రథితా చ లోకే 29

చంద్రబుధశుక్రులు బలహీనులై యుండఁగాను. శని మధ్యబలుఁడై యుండఁగాను, తక్కిన రవికుజగురువులు బలవంతులై యుండఁగాను, విషమరాసులగు మేషమిథున సింహతులాధనుకుంభము లలో నొకటి జన్మలగ్నమయ్యెనేని బుట్టినస్త్రీ పురుషస్వభావ చేష్ట కలదియై లోకమందు ప్రసిద్ధిని బొందునది యగును.

క్రూరే జామిత్రగతే నవమే యది ఖేచరో భవతి నూనం,
ఆప్నోతి ప్రవ్రజ్యాం పాపగ్రహసంభవా మబలాం. 30

జననకాలమున సప్తమస్థానమున పాపగ్రహముండఁగా నవమస్థానమున మరియొక పాపగ్రహముండెనేని నవమస్థానమందున్న గ్రహమునకు సమమైన ప్రవ్రజ్యను బొందును.

బలిభిర్బుధగురుశుక్రైశ్శశాంకసహితైర్ద్విలగ్నగైస్సమభే,
స్త్రీబ్రహ్మవాదినీ స్యా దనేకశాస్త్రార్థకుశలా చ 31

చంద్రబుధగురుశుక్రులు బలయుక్తులై యుండఁగా లగ్నము సమరాసులగు వృషభ కర్కాటకస్యావృశ్చిక మకరమీనములలో నొకటి యయ్యెనేని బుట్టినస్త్రీ అనేక శాస్త్రములయందు సమర్థురాలును బ్రహ్మజ్ఞానము గలదియు నగును.

జన్మకాలే వివాహే చ చింతాయాం వరణే తథా,
చింత్యం స్త్రీణాం తు యత్ప్రోక్తం ఘటతే తత్పతిష్వపి 32

ఈస్త్రీజాతకఫలమంతయు జన్మకాలమందును వివాహకాలమందును ప్రశ్నకాలమందును స్త్రీలకు నేఫలము జెప్పఁబడినదో అది తత్పతులకును జెప్పఁదగినది. అనఁగా నీఫలము తత్పతులకుఁగూడ సంభవించును.

ఇతి పంచచత్వారింశోఽధ్యాయః

## నిర్యాణఫలములను దెలుపు నలువదాఱవ యధ్యాయము.

శిఖిజలశస్త్రజ్వరజస్త్వామయతృట్క్షుత్కృతో భవేన్మృత్యుః,
సూర్యాదిభిర్నిధనగైః పరదేశపథి స్వకేచరాద్యైశ్చ. 1

జన్మలగ్నమునకు అష్టమస్థానమందు రవియుండెనేని అగ్నివల్లను, చంద్రుఁడుండెనేని ఉదకమువల్లను, కుజుఁడుండెనేని ఆయుధమువల్లను, బుధుఁడుండెనేని జ్వరమువల్లను, గురుఁడుండెనేని తెలియఁబడని దీర్ఘవ్యాధివల్లను, శుక్రుఁడుండెనేని దప్పివల్లను, శనియుండెనేని ఆఁకలివల్లను మరణము గలుగును. అష్టమరాశి చరరాశి యయ్యెనేని పరదేశమందును, ద్విస్వభావరాశియయ్యెనేని మార్గప్రదేశమందునను, స్థిరరాశియయ్యెనేని స్వదేశమందును మరణము గలుగును.

యో బలయుక్తో నిధనం పశ్యతి తద్ధాతుకోపజో మృత్యుః,
తత్సంయుక్తస్తనుజో బహుభిర్బలిభిర్బహుప్రకారస్స్యాత్. 2

జన్మలగ్నమునకు అష్టమస్థానము గ్రహశూన్యమైనపుడు బలయుక్తమైన ఏగ్రహముచేఁ జూడఁబడునో ఆగ్రహధాతుజనితమైనవ్యాధివలన మరణము గలుగును అది యెట్లనిన: రవికి పైత్యము, చంద్రునకు వాతశ్లేష్మములు, కుజునకు పైత్యము, బుధునకు వాతపిత్తశ్లేష్మములు, గురునకు శ్లేష్మము, శుక్రునకు వాతశ్లేష్మములు, శనికి వాతము అష్టమస్థానగతమైనరాశి కాలపురుషునియొక్క ఏయంగమందుండునో ఆయంగ[illegible]

ఏగ్రహముచేత అష్టమస్థానము జూడఁబడునో ఆగ్రహమునకుఁ జెప్పిన ధాతుదోషము వలన మరణము సంభవించును. అనేకగ్రహములు బలయుక్తులై గ్రహవర్జితమైన అష్టమ స్థానమును జూచుచుండెనేని ఎన్నిగ్రహములు జూచునో అన్నిగ్రహములకుఁ జెప్పఁ బడిన వాతపిత్తాదిదోషములు కాలపురుషుని ఏయంగమందు అష్టమరాశియుండునో ఆయంగమందు ప్రకోపించి మరణమును జేయునని తెలియఁదగినది.

సూర్యాంగారకయోః ఖబంధుగతయోశ్శైలాగ్రపాతోద్భవో
మృత్యుర్భ్యోనయేందుభానుతనయైః కూపే ఖసప్తాంబుగైః,
పాపాలోకితయోర్ద్విమోష్ణకరయోః కన్యాస్థయోర్బంధతో
లగ్నే సూర్యశశాంకయోస్తిమియుగే తోయే యదా మజ్జతి 3

ఏకాలమున రవికుజులు దశమమందుగాని చతుర్థమందుగాని యుండఁగాఁ బుట్టినవానికి పర్వతాగ్రమున రాతిదెబ్బలు తగులుటచేత మరణము గలుగును. కుజ చంద్రశనులు క్రమముగ దశమ సప్తమ చతుర్థములయందుండఁగాఁ బుట్టినవాఁడు బావియందుఁబడి చచ్చును. పాపగ్రహములచేఁ జూడఁబడుచున్న సూర్యచంద్రులు కన్యారాశియందుండఁగాఁ బుట్టినవాఁడు తనబంధువులవలన చంపఁబడును. మీనము లగ్నమై రవిచంద్రు లందుండఁగాఁ బుట్టినవాఁడు ఉదకమందు మునిఁగిపోవును.

కర్కిణి మందే మకరే చంద్రే మృత్యుర్జలోదరకృతస్స్యాత్,
పాపాంతస్థే చంద్రే కుజభవనే శస్త్రవహ్నిభవః 4

కర్కటమున శని మకరమున చంద్రుండుండఁగాఁ బుట్టినవాఁడు జలోదర మనెడు వ్యాధిచే మరణము నొందును. కొందఱు జలమధ్యమున మరణము గలుగు నని చెప్పిరి. చంద్రుఁడు కుజక్షేత్రమందు పాపగ్రహమధ్యస్థుఁడై యుండఁగాఁ బుట్టినవానికి శస్త్రములవలనను అగ్నివలనను మరణము గలుగును.

కన్యాయాం పద్మినీశత్రుః పాపమధ్యగతస్తదా,
రక్తోత్థశోషజం మృత్యుం కరోతి ధ్రువమేవ హి. 5

చంద్రుఁడు కన్యయందు పాపమధ్యగతుఁడై యుండఁగాఁ బుట్టినవానికి గుప్త రక్తముచేతనైనను క్షయవ్యాధిచేతనైనను మరణము గలుగును.

సౌర్యర్క్షే శుభయోర్మధ్యే శశీ రజ్జ్వగ్నిపాతజం,
కుర్యాన్మృత్యుం న సందేహాశ్చాణక్యవచనం తథా. 6

చంద్రుఁడు శనిక్షేత్రమందు శుభమధ్యస్థుఁడై యుండఁగాఁ బుట్టినవానికి పగ్గము చేతగాని అగ్నిచేతగాని పడుటచేతగాని మరణము గలుగును.

నవమసుతయో రశుభయోః పాపగ్రహదృష్టయోర్భవేన్మృత్యుః,
ద్రేక్కాణైః పాశభుజగనిగళైశ్ఛిద్రేఽథ వా గుప్త్యాం. 7

పంచమనవమములయందు రెంటియందును పాపగ్రహములుండి పాపగ్రహములచేఁ జూడఁబడఁగాఁ (గ్రహములకు విశేషదృష్టి నంగీకరించవలయుననుట) బుట్టినవానికి బంధనముచే మరణము గలుగును. అష్టమరాశియందు సర్పపాశ ద్రేక్కాణముగాని నిగళద్రేక్కాణముగాని ఉదయించుచుండఁగాఁ బుట్టినవానికి బంధనమువలన మరణము గలుగును. ఆద్రేక్కాణను లెవ్వియన కర్కటకాంత్యంబును మీనాంత్యంబును సర్పపాశ ద్రేక్కాణములు మకరప్రథమము నిగళద్రేక్కాణము.

మీనోదయే దినకరే చంద్రే పాపాన్వితేఽస్తగే మేషే,
స్త్రీహేతుకం తు మరణం స్వమందిరే స్యాద్వదంత్యేకే. 8

మీనము లగ్నమై సప్తమమగు కన్యయందు పాపగ్రహయుక్తుఁడైన చంద్రుఁడుండఁగా మేషమున రవియుండెనేని స్వమందిరమున స్త్రీమూలకముగ మరణము గలుగును.

రుధిరే సుఖేఽథ వార్కే వియతియమే క్షీణచంద్రసంయుక్తైః,
పాపైస్త్రికోణలగ్నే శూలప్రోతస్య నిర్దిశేన్మరణం. 9

చతుర్థమున కుజుఁడైనను రవియైన నుండఁగాను దశమమందు శనియుండఁగాను బుట్టినవాఁడు శూలముచేత వ్రక్కలింపఁబడిన శరీరముగలవాఁడై మృతినొందును. క్షీణచంద్రసహితములైన పాపగ్రహములన్నియుం ఏకకాలమందు లగ్నపంచమనవమములయందే యుండెనేనియుఁ బుట్టినవాఁడు శూలోద్భిన్నశరీరుఁడై మృతినొందును.

హిబుకేఽర్కే వియతి కుజే క్షీణేందుయుతేఽర్కజేన సందృష్టే,
కాష్ఠే నాభిహత స్సన్మ్రియతే జాతో న సందేహః. 10

చతుర్థమున రవియుం దశమమున కుజుఁడుండి వీరలలో నొకఁడు క్షీణచంద్రయుక్తుఁడగు శనిచేఁ జూడఁబడఁగాఁ బుట్టినవాఁడు కట్టెచేఁ గొట్టఁబడినవాఁడై మృతినొందును

క్షీణేందుభూతనయభాస్కరపుత్రసూర్యై
శ్ఛిద్రాస్పదోదయసుఖైర్లగుడాహతస్య,
మృత్యుర్వ్యయన్నవమలగ్నసుతస్థితైస్తై
ర్ధూమాగ్నిబంధనశరీరనికుట్టనైస్స్యాత్ ,

జన్మకాలమునందు లగ్నమున శనైశ్చరుఁడు చతుర్థమున సూర్యుఁడు అష్టమమందు క్షీణచంద్రుఁడు దశమమున కుజుఁడు ఇట్లుండఁగా జనించినవాఁడు దుడ్డుకోలచే కొట్టఁబడినవాఁడై చచ్చును. దశమమున క్షీణచంద్రుఁడు నవమమున కుజుఁడు లగ్నమున శని పంచమమందు రవి ఇట్లుండఁగాఁబుట్టినవానికి పొగ చేతగాని అగ్ని చేతగానిబంధనము చేతగాని అంకుశాదులచేతగాని మరణముఁ గలుగును.

హిబుకాస్తకర్మసహితైః కుజభానుశనైశ్చరైర్భవతి మృత్యుః,
ఆయుధహుతభుగ్భూపతికోపప్రభవ స్సదా పుంసాం. 12

చతుర్థమున కుజుఁడు సప్తమమున రవి దశమమున శని ఇట్లుండఁగాఁ బుట్టినవానికి ఖడ్గాద్యాయుధములవల్లగాని అగ్నివల్లగాని రాజకోపమువల్లగాని మరణము గలుగును.

కర్మాంబువిత్తసంస్థైః కుజేందుమందైః క్షతక్రిమికృతోఽంతః,
ఖస్థేఽర్కే సుఖసంస్థే భౌమే యానప్రపాతాచ్చ. 13

దశమమున కుజుఁడు చతుర్థమున చంద్రుఁడు ద్వితీయమున శని ఇట్లుండఁగాఁ బుట్టినవానికి వ్రణములయందుఁ బుట్టిన పురుగులచేత మరణము గలుగును. దశమమున రవి చతుర్థమున కుజుఁడు ఇట్లుండఁగాఁ బుట్టినవాఁడు ఆందోళనాది వాహనములమీఁద నుండి పడి మృతినొందును.

సప్తమభవనే భౌమే క్షీణేందుదివాకరార్కిభిర్లగ్నే,
మరణం జాతస్య వదే ద్యంత్రోత్పీడనభవ మవశ్యం. 14

సప్తమమున కుజుఁడు లగ్నమున క్షీణచంద్రరవిశనులు ఇట్లుండఁ బుట్టినవానికి యంత్రపీడనజనితమైన మరణము గలఁగును.

తులాయాం రుధిరే యాతే కుజర్క్షే భాస్కరౌ స్థితే,
చంద్రే మందగృహం ప్రాప్తే విణ్మధ్యే మరణం భవేత్. 15

తులయందు కుజుఁడు మేషమందు శని మకరమందుగాని కుంభమందుగాని చంద్రుఁడు ఇట్లుండఁ బుట్టినవాఁడు అమేధ్యమధ్యయందు మృతినొందును.

గలితేందూర్కభూపుత్రైర్గతైర్వ్యోమాస్తబంధుషు,
విణ్మధ్యే తు భవే న్మృత్యు స్సిద్ధసేవః ప్రభాషతే. 16

దశమమందు క్షీణచంద్రుఁడు సప్తమమున సూర్యుఁడు చతుర్థమందు కుజుఁడు ఇట్లుండఁగాఁ బుట్టినవాఁడు అమేధ్యమందు మృతినొందును.

బలినా కుజేన దృష్టే క్షీణేందౌ రంధ్ర గేఽర్కజే మృత్యుః,
గుల్మమహావేదనయా క్రిమిదాహాయుధకృతో భవతి. 17

క్షీణచంద్రుఁడు బలయుక్తుఁడైన కుజునిచేఁ జూడఁబడుచుండఁగా శనైశ్చరుఁ డష్టమమందుండఁగాఁ బుట్టినవానికి గొప్పగుల్మవ్యాధిచేతనైన పురుగులు మొదలైనవి గలిగి వానివలనను ఆయుధములచే శస్త్రము జేయుటచేతను మృతి గలుగును. నిప్పుతో కాచుటవల్లను గూడ మృతిగలుగును.

రవౌ రుధిరగే ద్యూనే నిధనే రవిసంభవే,
రసాతలస్థే హిమగౌ మృత్యుః పక్షికృతో భవేత్. 18

సప్తమమున రవికుజులు అష్టమమున శని చతుర్థమున చంద్రుఁడు ఇట్లుండఁ బుట్టినవాఁడు పక్షికృతమైన మరణమును బొందును.

లగ్నచ్ఛిద్రత్రికోణేషు రవ్యర్కార్క్యరనిశాకరైః,
మృత్యుస్స్యాచ్ఛైలపాతేన శస్త్రకుడ్యాదిపాశజః. 19

లగ్నమునరవి పంచమమున కుజుఁడు అష్టమమందు శనినవమమందు చంద్రుఁడు ఇట్లుండఁగాఁ బుట్టినవానికి పర్వతశిఖరములవల్లనుండి పడుటవల్లగాని శస్త్రముల వల్లగాని గోడ తనమీఁద పడుటవల్లగాని గోడమీఁదనుండి పడుటవల్లగాని బంధనవల్ల గాని మరణము గలుగును.

ఉదయనవాంశాధిపతేస్సమానభూమౌ వదంతి యవనేంద్రాః,
గ్రహయోగేక్షణకాద్యైః పరికల్ప్యం చాన్యదపి తద్జ్ఞైః. 20

లగ్ననవాంశాధిపతియొక్క రాశిసమానభూమియందనను హోరానవాంశాధిపతితో కూడినట్టియుం లేక చూడఁబడినట్టియు గ్రహములయొక్క రాశిసమానభూమియందు మరణము గలుగునని కొందఱు చెప్పుదురు. అదెట్లనిన: లగ్ననవాంశాధిప యుక్తమైనరాశి మేషమయ్యెనేని మేకలు గొఱ్ఱెలు తిరిగెడు భూమియందును వృషభమయ్యెనేని వృషభప్రచారభూమియందును మిథునమయ్యెనేని గృహమందును కర్కటకమయ్యెనేని బావియందును సింహమయ్యెనేని అడవియందును కన్యయయ్యెనేని జలప్రాయప్రదేశమందును తులయయ్యెనేని అంగడియందును వృశ్చికమయ్యెనేని గుంటయందును ధనస్సుఅయ్యెనేని అశ్వసంచారభూమియందును మకరమయ్యెనేని జలప్రాయ ప్రదేశమందును కుంభమయ్యెనేని గృహమందును మీనమయ్యెనేని జలప్రాయ ప్రదేశమందును మృతిగలుగును. అనేకప్రదేశములు సంభవించిన బలము ననుసరించి

తెలియతగినది. ఎచ్చటనైనను బహుత్వమందు బలము ననుసరించియె తెలియతగినది యనిభావము.

ఉదితాంశనవమోహాన్స్వాశేన నిరీక్షితే ద్విగుణతస్స్యాత్,
త్రిగుణశ్శుభైశ్చ దృష్టే సమస్తమునయో వ్యవస్యంతి. 21

జన్మించినపుడు లగ్నమందు గడచిన నవాంశల కెంత కాలమగునో తత్తుల్యకాలము మృత్యుసమయమందు ఒళ్లు దెలియకుండును. అనఁగా లగ్నప్రమాణము నాలుగుఘడియ లైనపుడు 15 భాగలు గతమాయె నేని రెండుఘడియలకాలము ఒళ్లు దెలియకయుండు నని భావము. బృహజ్జాతకమందు అనుదితాంశతుల్యకాలము ఒళ్లు దెలియక యుండు నని యున్నది. లగ్నము స్వాధిపదృష్టమాయె నేని నవాంశతుల్యకాలమునకు రెండంతల కాలము స్మృతిదప్పియుండును. లగ్నము శుభులచేఁ జూడఁబడుచుండె నేని నవాంశతుల్య కాలమునకు మూఁడంతలకాలము స్మృతిదప్పియుండును. అని సమస్తమునులు జెప్పిరి.

ఉదయా ద్ద్వావింశతి మద్రేక్కాణే భవతి కారణం మృత్యోః,
తస్యాధిపతిభవో వా నిర్యాణం సూచయేత్స్వగుణైః. 22

ఈచెప్పఁబడినయోగములలో నొకయోగఁబును లేక అష్టమస్థానము గ్రహసంయోగవీక్షణరహితమైనదై యుండఁగా జన్మలగ్నమందే ద్రేక్కాణమున నరుండు జన్మించునో ఆద్రేక్కాణము మొదలు ౨౨ వ ద్రేక్కాణమునకు అధిపతి ఏగ్రహమో ఆగ్రహమునకు అగ్నిజ్వాలాదులలో ఏహేతువు చెప్పఁబడియున్నదో ఆహేతువువల్ల మరణము సంభవించుననియు అట్లుగాకున్న అష్టమరాశ్యాధిపతిగానున్న గ్రహమునకు చెప్పఁబడియున్న అగ్నిజలాదికారణములవలన మరణము సంభవించుననియు తాత్పర్యము. ౨౨ వ ద్రేక్కాణం బెట్లనఁగా: లగ్నప్రథమద్రేక్కాణమందు జననమాయె నేని అష్టమరాశియందైన ప్రథమద్రేక్కాణము ౨౨ వ ద్రేక్కాణమని భావము.

మేషాద్యేద్రేక్కాణే క్రూరగ్రహవీక్షితే చ సంయుక్తే,
అంబ్వాహి విషపిత్తకృతం మరణం నృణాం సమాదేశ్యమ్. 23

మేషప్రథమద్రేక్కాణము క్రూరగ్రహయుతముగాని దృష్టముగాని అయె నేని బుట్టినవాఁడు ఉదకము పాములు మొదలైనవానిచే మృతినొందును. ఈప్రకారమే సర్వద్రేక్కాణములయందును తెలియవలెను.

వింద్యాద్ద్వితీయభాగే మరణం జలకృమిహిమారణ్యైః,
ఏవం తృతీయభాగే తటాకకూపప్రపాతాద్యా. 24

మేషద్వితీయద్రేక్కాణము క్రూరగ్రహయుతముగాని దృష్టముగాని ఆయెనేని జాలాదులచే మరణము గలుగును. తృతీయద్రేక్కాణ మట్లాయెనేని తటాకాదుల యందు పడుటచే మరణము గలుగును.

కరభాశ్వఖరోష్ట్రేభ్యో మృత్యుర్జ్ఞేయో వృషస్యాద్యే,
పిత్తాగ్నివాతచోరాద్ద్వితీయభాగే వృషస్యైవ. 25
వింద్యాత్తృతీయభాగే యానాసనవాజిపాతకృతమ్,
పుంసాం భవతి హి మరణం రణశిరసి మహాస్త్రకృతమేవ. 26

వృషభప్రథమద్రేక్కాణ మట్లుండెనేని లొట్టిపిట్ట అశ్వము మొదలైనవాని చేతను, ద్వితీయద్రేక్కాణ మట్లుండెనేని పైత్యము అగ్ని మొదలైనవానిచేతను, తృతీయ ద్రేక్కాణమట్లుండెనేని పల్లకి ఆసనము గుఱ్ఱము మొదలైనవానిమీఁదనుండి పడుట చేతను మరణము గలుగును.

ఆద్యే మిథునత్ర్యంశే కాసశ్వాసోద్భవో భవతి,
మృత్యుర్మహిషవిషాద్యాద్ద్వితీయభాగేచ సంనిపాతాద్వా. 27
వనవాసి చతుశ్చరణాత్పర్వతపతనాద్గజాత్తథారణ్యాత్,
భవతి హి మృత్యుః పుంసా మంత్యభాగే తు జతుమస్య. 28

మిథునప్రథమద్రేక్కాణ మట్లుండెనేని కాసాదిరోగములచేతను, ద్వితీయ ద్రేక్కాణ మట్లుండెనేని మహిషాదులచేతను, తృతీయద్రేక్కాణ మట్లుండెనేని వన మృగములు మొదలుగాఁగలవానిచేతను మరణము గలుగును.

గ్రాహేణ మద్యపానాత్కంటకదోషేణ వా తథా స్వప్నాత్,
భవతి హి కర్కటకాద్యే మృత్యుర్నృణాం తృతీయభాగేతు. 29
అభిఘాతాద్విషపానా న్మధ్యే త్ర్యంశే భయం సమాదిష్టమ్,
విహగప్రమేహగుల్మా సృక్తంద్రీదోషేణ చ తథాన్యే. 30

కర్కటకలగ్నముయొక్క ప్రథమద్రేక్కాణము పాపగ్రహయుతమైనను దృష్ట మైనను మద్యపానాదులచే మరణము గలుగును. ద్వితీయద్రేక్కాణ మట్లుండెనేని దెబ్బలుతగులుటచేతను విషపానముచేతను మరణము గలుగును. తృతీయద్రేక్కాణ మట్లుండెనేని పక్షికృతమైనట్టియు మేహాదివ్యాధులచేతను మరణము గలుగును.

సలిలవిషపాదరోగాత్సింహాద్యే త్ర్యంశకే భవేన్మృత్యుః,
మధ్యే తృతీయభాగే జలామయకృతో వనోద్దేశే. 31

విషశస్త్రరోగదోషైరభిశాపాద్వా తథా చ పాతాద్వా,
అంత్యే సింహత్ర్యంశే భవతి హి మృత్యుర్న సందేహః. 32

సింహప్రథమద్రేక్కాణము పాపగ్రహయుతముగాని దృష్టముగాని అయెనేని ఉదకము విషము పాదములయందు రోగము మొదలైనవానిచే మృతిగలుగును. ద్వితీయ ద్రేక్కాణమట్లుండెనేని జలరోగముచేతను వనప్రాంతమున మరణము గలుగును. తృతీయ ద్రేక్కాణ మట్లుండెనేని విషశస్త్రాదులచే మృతిగలుగును.

ఆద్యే కన్యాత్ర్యంశే మస్తకరోగాత్తథానిలాన్మృత్యుః,
వ్యాలగిరిదుర్గవనజో మధ్యే భూపాత్మజా దథవా. 33
కరభఖరశస్త్రతోయా దతిఖాతాత్ స్త్రీకృతాన్నపానాద్వా,
అంత్యే కన్యాత్ర్యంశే నృణాం మృత్యుస్సదా దృష్టః. 34

కన్యాప్రథమద్రేక్కాణ మట్లుండెనేని శిరోరోగము మొదలుగాఁగలవానిచే మృతిగలుగును. ద్వితీయద్రేక్కాణ మట్లుండెనేని సర్పము పర్వతములు మొదలుగాఁ గలవానిచే మృతిగలుగును. తృతీయద్రేక్కాణ మట్లుండెనేని ఒంటె గాడిదె మొదలైన వానిచే మృతిగలుగును.

ఆద్యే వణిక్త్రిభాగే యువతిచతుష్పాన్నిపాతదోషేణ,
మధ్యే తు జఠరరోగైరంత్యే వ్యాలాంబుజాతేభ్యః. 35

తులాప్రథమద్రేక్కాణ మట్లుండెనేని పూర్ణవయస్సుగల ఆడజంతువుమీఁద నుండి పడుటచే మృతిగలుగును. ద్వితీయద్రేక్కాణ మట్లుండెనేని జఠరరోగములచే మృతిగలుగును. తృతీయద్రేక్కాణ మట్లుండెనేని పాములు ఉదకమందు పుట్టినవి మొదలుగాఁగలవానిచే మృతిగలుగును.

ఆద్యేఽలినిత్రిభాగే విషశస్త్రస్త్రీకృతాన్నపానభవః,
మధ్యేతు వస్త్రభారస్రంసనరోగైర్భవతి మృత్యుః. 36
అంత్యే తృతీయభాగే లోష్ఠకపాషాణజనితవేదనయా,
భవతి హి మరణం హ్యథవా నృణాం జంఘాస్థిభంగకృతమ్. 37

వృశ్చికప్రథమద్రేక్కాణ మట్లుండెనేని విషముచేతను శస్త్రముచేతను స్త్రీకృతమైన అన్నపానాదులచేతను మృతిగలుగును. ద్వితీయద్రేక్కాణ మట్లుండెనేని మొలగజ్జి మొదలుగాఁగల బట్టకట్టుకొనుటకు శక్యముగానివ్యాధిచే మృతిగలుగును. తృతీయద్రేక్కాణ మట్లుండెనేని చిల్లపెంకు రాయి మొదలైనవానివలన కలుగువేదనచే మృతిగలుగును. లేనిచో పిక్కలయందు ఎముకలు విరుగుటచే మృతిగలుగును.

చాపస్యాద్యే త్ర్యంశే గుదానిలసముద్భవై ర్వివిధరోగైః,
మధ్యే విషగురుదోషైరనిలకృతై ర్వా భవేన్మృత్యుః 33
అంత్యే తృతీయభాగే జలమధ్యే తత్సముద్భవై ర్వాఽపి,
మృత్యుర్నరాణాం దృష్టో జఠరామయదోషసంఘాతః. 39

ధనుఃప్రథమద్రేక్కాణము పాపగ్రహయుతము గాని దృష్టముగాని అయె నేని గుదప్రదేశమందైన వాతరోగముచే మృతికలుగును ద్వితీయద్రేక్కాణ మట్లుండె నేని విషదోషముచేతను వాతరోగములచేతను మృతిగలుగును. తృతీయద్రేక్కాణ మట్లుండె నేని జలమధ్యయందుగాని జలసంభవములైన వివిధరోగములచేగాని లేక జఠరరోగముచే గాని మృతిగలుగును.

మకరాద్యే ద్రేక్కాణే నృపహింసా వ్యాఘ్రకారణాన్మృత్యుః,
ఊరువినాశా దథవా జలచరసత్త్వాద్విషైకశోషసర్పాత్. 40
దహనాస్త్రతస్కరేభ్యో జ్వరాదమానుషవిభేదనాన్మధ్యే,
అంత్యే మకరత్ర్యంశే స్త్రీణాం మృత్యు స్సదా దృష్టః. 41

మకరప్రథమద్రేక్కాణమట్లుండె నేని రాజదండన మొదలైనవానిచేతను, ద్వితీయ ద్రేక్కాణమాయె నేని అగ్ని అస్త్రములు దొంగలు మొదలైనవానిచేతను, తృతీయ ద్రేక్కాణమాయె నేని స్త్రీమూలముగను మరణము గలుగును.

కుంభే ప్రథమత్ర్యంశే స్త్రీభ్య స్తోయై స్తథా జఠరరోగైః,
జ్ఞేయో మృత్యుర్నరాణాం పర్వతగహనద్విపాద్యై ర్వా 42
మధ్యే స్త్రీకృతదుఃఖైర్గుహ్యజరోగైర్భవతి మృత్యుః,
అంత్యే మిథునవదతుష్పదముఖరోగకృతై ర్భవేత్పుంసామ్. 43

కుంభప్రథమద్రేక్కాణ మట్లుండె నేని స్త్రీమూలముగను ఉదకములచేతను ఉదర రోగములచేతను మృతి గలుగును. ద్వితీయద్రేక్కాణమాయె నేని స్త్రీకృతములైన దుఃఖములచేతను గుహ్యప్రదేశమందైన రోగములచేతను మరణము గలుగును. తృతీయ ద్రేక్కాణమాయె నేని ముఖప్రదేశమందైన రోగములచేతను మరణము గలుగును.

అంశే మీనయుగాద్యే గుల్మగ్రహణీప్రమేహయువతిభ్యః,
జంఘాజఠరజరోగైర్గజగ్రహకృతైస్సమాదిశేన్మృత్యుః. 44
నౌభేదాజ్జలమధ్యే ఝషే దృగాణద్వితీయజాతాయాం,
అంత్యే భవతి హి మరణం కుత్సితరోగైర్న సందేహః. 45

మీనప్రథమద్రేక్కాణము పాపగ్రహాయుంతముగాని దృష్టముగాని ఆయెనేని గుల్మరోగముల (కడుపులో బల్ల పెరుగుట) చేతను అతిసారముచేతను మేహరోగము చేతను స్త్రీలచేతను మరణము గలుగును. ద్వితీయద్రేక్కాణమట్లుండెనేని జలమధ్యయందు నావ బ్రద్దలగుటచేతను, తృతీయద్రేక్కాణమట్లుండెనేని కుటిలరోగములచేతను మరణము గలుగును.

ఇతి షట్చత్వారింశోఽధ్యాయః.

---

## నష్టజాతకమందైనలగ్నగుణములను దెలుపు నలువదేడవ యధ్యాయము.

జన్మవిధావజ్ఞానే ప్రశ్నోత్థవికల్పతో భవేత్పృష్టుః,
జన్మసమయో నరాణా మతః ప్రయత్నేన సంచింత్యః. 1

జంతువులయొక్క జన్మకాలము ననుసరించి ముఖ్యముగ ఫలములు నాలోచించవలయును. జన్మకాలము దెలియనిచో పృచ్ఛకునిప్రశ్నకాలము ననుసరించియైనను జన్మకాలస్థితి నాలోచించతగినది.

దశవిధచిహ్నైర్జ్ఞాత్వా జాతం పురుషం ప్రసాధయేల్లగ్నమ్,
అత ఏవ ప్రథమతరం తాని సమస్తాన్యహం వక్ష్యే. 2

జన్మకాలము తెలియనివానినిగూర్చి చెప్పఁబోవు దశవిధములైన చిహ్నముల ననుసరించి లగ్ననిశ్చయము జేయఁదగినదిగాన వానినన్నిఁటిని జెప్పఁబోవుచున్నాను.

మేషవిలగ్నే జాతః ప్రచండరోషో విదేశగమనరతః,
లుబ్ధః కృశోఽల్పసౌఖ్యస్స్వేష్వశ్లక్ష్ణలలితాభిధాయీచ. 3
పిత్తానిలోష్మరోగైరభితప్తతనుః క్రియాపటుర్భీరుః,
మేషస్థే ధర్మపరశ్చలోఽల్పమేధాః పరార్థనాశరతః. 4
భోక్తాఖ్యాతః కునఖో భ్రాతృవిహీన స్తథా పితృత్యక్తః,
శీఘ్రగతి ర్మందసుతో వివిధార్థయుత స్సుశీలశ్చ. 5
కుకులోద్గతాం విశీలాం స్వజనేఽపి చ నిర్ఘృణాం స్త్రియం లభతే,
అపకృష్టోదయసౌఖ్యః కుధర్మసంవర్ధితార్థశ్చ. 6

అధికరోషము విదేశమందుండుటయుం దాసక్తి మొదలైన గుణములు గలవాఁడు, భయస్వభావము గలవాఁడు, సోదరులు లేనివాఁడు, తండ్రిచే విడువఁబడువాఁడు, ధనికుఁడు, కుత్సితవంశమందుఁ బుట్టినట్టియుం దుస్స్వభావము గలిగినట్టియుం స్వజనమందు నిర్దయుండైనట్టియుం భార్యమొదలైనవి గలవాఁడాయెనేని మేషలగ్నమందుఁ బుట్టినవాఁడని తెలియఁదగినది. ఇట్లె అన్నిలగ్నములయందును గుణముల ననుసరించి తెలియఁదగినదని భావము.

వృషభవిలగ్నే శూరః క్లేశసహిష్ణుస్సుఖీరిపువిహంతా,
బాల్యే సంచయయుక్తః పృథుపీనలలాటఘోణగండోష్ఠః. 7
ఉద్యుక్తకర్మసుభగః పితుర్జనన్యాస్సుశర్మకృద్దాతా,
వివిధవ్యయోఽతిరౌద్రః కఫానిలాత్మా పితాకుమారీణామ్. 8
స్వజనావమర్దనపరో ధర్మనియుక్తోఽబలాప్రియశ్చపలః,
భోజనపాననిగృధ్నుర్నానాంబరభూషణైకమతిః. 9

వృషభలగ్నమునఁబుట్టినవాఁడు శౌర్యవంతుఁడు, కష్టములనోర్చువాఁడు, సౌఖ్యవంతుఁడు, శత్రునాశనమొనర్చువాఁడు, పసితనమునుండియే ధనముకూడఁబెట్టువాఁడు, విశాలమైనది బలిసినదియౌనగు నుదురుముక్కు చెక్కిళ్లు పెదవులు గలవాఁడు, ఆరంభించినపనులను పూర్తిఁజేయువాఁడు, తల్లిదండ్రులకు సౌఖ్యమొనగూర్చువాఁడు, దాత అనేకవిధముల వ్యయమొనర్చువాఁడు, మిక్కిలిరౌద్రవంతుఁడు, కఫవాతప్రకృతి గలవాఁడు, స్త్రీసంతానముగలవాఁడు, బంధువులహింసించువాఁడు, ధర్మపాలనయందు నియమింపఁబడువాఁడు, స్త్రీప్రేమగలవాఁడు, చంచలమగుస్వభావము అన్నపానములకు లోటులేకుండుట అనేకవిధములగువస్త్రములు సొమ్ములు మున్నగువానియందు ప్రీతిగలవాఁడును అగును.

మిథునవిలగ్నే జాతః ప్రియదారో భూషణప్రదానరతిః,
పూజ్యతమస్సుమనస్వీ ద్విమాత్మకో రిపువినీతసాన్త్వాత్ 10
గాంధర్వశిల్పకుశలశ్శ్రుతిశాస్త్రార్థప్రశస్తకావ్యపటుః,
సౌభాగ్యోఽథ మండనరుచిర్మదవశ్యస్సౌఖ్యతసానాం సత్యః. 11
అసహిష్ణురనిష్టసుతశ్శోఽల్పబంధుశ్చ సంస్థితో భవతి,
హీనాధికాంగపాదో వినీతవృత్తాక్షిపక్ష్మా చ. 12
చండాకారో వశ్యో దారుణరిపుపక్షసంహారణశీలః,
భూరత్నకాంచనోర్మికజలార్థభాగీ భవేత్పురుషః. 13

మిథునలగ్నమున జన్మించినవాఁడు మిక్కిలి అనురాగముగలభార్య ఆమెకు సొమ్ములు ఇచ్చుటయందు ప్రీతియుంగలవాఁడు, మిక్కిలిగౌరవస్థుఁడు, మంచివాగ్ధాటి గలవాఁడు, ఇద్దరుతల్లులుంగలవాఁడు శత్రువులకువశమైనవాఁడు, గానమును శిల్పమును చక్కఁగానెఱిఁగినవాఁడు, వేదములయందు వేదాంగములగు ధర్మశాస్త్రాదులయందు హాస్యమున కావ్యములయందు మిక్కిలియభిరుచిగలవాఁడు, నెమ్మదియైనవాఁడు, అలంకారమున్న ప్రేమగలవాఁడు, సత్పురుషులచిత్తముచొప్పున వర్తించువాఁడు, సత్యశీలుఁడు, ఓర్పులేనివాఁడు, తనకు స్వాధీనులుకానిపుత్త్రులు దుర్మార్గము కొలదిపాటిబంధువులు పొట్టిశరీరము పొడవగుకాళ్లుగలవాఁడు, ముడతలుపడిన కనురెప్పలుంగలవాఁడు, భయంకర స్వరూపముగలవాఁడు, వశ్యుఁడు, వంగనిశత్రువులనైనా సంహారింపఁగలవాఁడు, భూములు రత్నములు సువర్ణము ఉంగరములు నీటివలనధనము గలవాఁడగును.

కర్కిణిలగ్నే భీరు ర్నైకనివాస శ్చల ప్రజ్ఞః,
మేధాన్వితోఽతిధుర్యో గుహ్యారుగార్తో నిహంతి రిపూన్. 14
అంతర్విషమః కామీ ద్విజదేవాత్యర్చనప్రదానరతః,
ధర్మరతః కఫబహులో యువతితనుసంస్థితో గుణైర్నియుతమ్. 15
కన్యానుజో నబంధుర్దృష్టాల్పసుతో విగర్హితకుటుంబః,
బహుమతకుత్సితయువతిః పరార్థభాగీ దృఢగ్రాహీ. 16
పరదేశగ స్సుధీర స్సాహసకర్తా జలాధిగతవిత్తః,
స్త్రీభూషణాంబరసుఖైర్భోగైశ్చ సమన్వితో భవతి 17

కర్కాటలగ్నమున జన్మించినవాఁడు, భయశీలుఁడు, ఒకచోట స్థిరముగానుండని వాఁడు, చంచలమగుబుద్ధిగలవాఁడు, మంచిమేధావంతుఁడు, మిక్కిలిభారమునువహించు వాఁడు, గుహ్యరోగములుగలవాఁడు, శత్రునాశమొనర్చువాఁడు, లోపల కపటముగల వాఁడు, కాముకుఁడు, బ్రాహ్మణులను దేవతలను పూజించువాఁడు, ధర్మాత్ముఁడు, కఫ ప్రకృతిగలవాఁడు, భార్యావశ్యుఁడు, ఆడతోబుట్టువులు గలవాఁడు, బంధువులులేని వాఁడు, కొంచెముపాటి సుతులుగలవాఁడు, నిందింపఁదగిన కుటుంబముగలవాఁడు, తనకు మిక్కిలిఇష్టురాలు కుత్సితమైనబుద్ధిగలదియుం నగు భార్యగలవాఁడు, పరులసొత్తు పొందువాఁడు, దృఢమగుపట్టుదలగలవాఁడు, పరదేశముల వసించువాఁడు, ధైర్య వంతుఁడు, సాహసవంతుఁడు, జలమువలనపొందిన ధనముగలవాఁడు, ఎల్లప్పుడు స్త్రీల తోను భూషణములతోను వస్త్రములతోను సౌఖ్యములతోను భోగములతోను కూడు కొనియుండువాఁడు అగును.

సింహోదయే ప్రసూతో మాంసరుచిర్న్రపతిలబ్ధమానధనః,
ధర్మాచ్చ్యుతోఽన్యసంస్థః కుటుంబకార్యేషు రతవామః 18
సింహాస్య సమానముఖ స్థిన్తిమాన్గాంభీర్యసత్వసంయుక్తః,
ధృష్టోఽల్పవచా లుబ్ధః పరఘాతకరో బహూశోవాక్. 19
పర్వతవనానుసారీ సురోషణో దృఢసుహృత్ప్రమాదీ చ,
దుష్ప్రసహో హతశత్రుః విఖ్యాతః ప్రణతసాధుజనః. 20
కృష్యాదికర్మధనవాన్వ్యాపారరతో బహువ్యయో భవతి,
వేశ్యానటీనియమనాద్భార్యాతశ్చాతిసంతరోగాచ్చ. 21

సింహలగ్నమున జన్మించినవాఁడు మాంసమునప్రీతిగలవాఁడు, రాజువలన ధనము గౌరవమునందువాఁడు, ధనహీనుఁడు, కుటుంబపుపనులయందు శ్రద్ధలేనివాఁడు, రతియందు ఆసక్తిలేనివాఁడు, సింహముతో సమమైనముఖముగలవాఁడు, స్థితివంతుఁడు, గాంభీర్యము బలముగలవాఁడు, దుర్మార్గమొనర్చువాఁడు, వాగ్ధాటిలేనివాఁడు, లోభి, ఇతరులను హత్యయొనర్చువాఁడు, అనేకవృషభములుగలవాఁడు, పర్వతములయందు వనములయందు వసించువాఁడు, మిక్కిలిరోషముగలవాఁడు, ప్రేమగలస్నేహితులు గలవాఁడు, ఎక్కువప్రమాదములకు లోనగువాఁడు, ఎదుర్కొనుటకు వీలులేనివాఁడు, నశించిన శత్రువులు గలవాఁడు, ప్రసిద్ధుఁడు, సత్పురుషులచే నమస్కరింపఁబడువాఁడు, వ్యవసాయమొనర్చువాఁడు, ధనవంతుఁడు, వ్యాపారమున ప్రేమగలవాఁడు, మిక్కిలి వ్యయమొనర్చువాఁడు, వేశ్యలవలన భార్యవలన దంతరోగమువలన ధనవ్యయము నొనర్చువాఁడు అగును.

షష్ఠే సాధుత్వయుతశ్శ్రుతౌ గాంధర్వకావ్యశిల్పపటుః,
ప్రియవల్లుకిథాభాషీ ప్రణయీ దానోపచారరతః. 22
కన్యాప్రీణాసత్వస్థితి గ్దయావాన్పరస్వభోక్తా చ,
భోక్తా దేశభ్రమణ స్త్రీప్రకృతి ర్వినయవాక్కితవః. 23
భూమండలవర్ధనభాక్సుభగః కామీ యశోచ్ఛ్రియం లభతే,
ఋజుధర్మవాన్సురూపస్సురుచిః కాంతో గురూణాం చ. 24
పాపైరపహార్యవృత్తైస్సహాయైశ్చ సమం విరుద్ధశ్చ,
కన్యాప్రజోఽనిలకఫో నీచారివివర్జితకథశ్చ. 25

కన్యారాశియందు జన్మించినవాఁడు సత్పురుషుఁడు, శిక్ష(వేదాంగములగుఆరింటిలో మొదటిది) గానము శిల్పము కావ్యరచన మున్నగువానియందు నేర్పరి ప్రియముగా మనోహరముగా మాటలాడువాఁడు, ప్రేమగలవాఁడు, దానపరాయణుఁడు, కన్యలు విలాసములు మనశ్శక్తిగలవాఁడు, దయగలవాఁడు,పరాన్నము ననుభవించువాఁడు, దేశభ్రమణమువలన జీవించువాఁడు, స్త్రీనడవడివంటి నడవడిగలవాఁడు, వినయవంతుఁడు, జూదగాఁడు, భూమి నభివృద్ధినొనర్చువాఁడు, సౌందర్యవంతుఁడు, కాముకుఁడు, కీర్తిగలవాఁడు, ఋజువగు ప్రవర్తనగలవాఁడు, మంచివర్చస్సుగలవాఁడు, గురువులకుగూడ మనస్సునకు సంతోష మొనర్చు దేహసౌభాగ్యముగలవాఁడు, జన్మమువలనవచ్చినవియుం మధ్యనలవాటునొనర్చుకొనినవియు నగు పాపములచే నందరితో విరోధముగలవాఁడు, స్త్రీసంతతిగలవాఁడు, వాతకఫప్రకృతిగలవాఁడు, నీచుఁడు, శత్రువులులేనివాఁడును అగును.

సప్తమలగ్నే జాతో విషమాంగశ్శీలవర్జితశ్చపలః,
ఉపచితహీనద్రవిణస్సుఖహ్యాద్దేహానుసారీ స్యాత్. 26
కఫవాతికకలిరుచికో దీర్ఘముఖశరీరధర్మమతివేత్తా,
బహుదుఃఖభాక్సుమేధాః పరావమర్దీ సుచారుకృష్ణాశ్చ 27
అతిథిద్విజదేవరతిః క్రతుక్రియావా న్గురుషు భక్తాః,
పూజ్యః పితాన్యభాజాం జాతస్సత్యశ్చ మృదుశుక్లః. 28
భ్రాతృప్రియోఽర్కముఖ్యశ్శుచిశ్చ పాపోపచారబంధుశ్చ,
కాంతః కుత్సితవృత్తో ధర్మవ్యవసాయనీచమతిః. 29

తులాలగ్నమున జన్మించినవాఁడు వికలమగు అవయవములుగలవాఁడు, మంచి నడవడిలేనివాఁడు, చపలుఁడు, ద్రవ్యము నార్జించి నాశ మొనర్చువాఁడు, సౌఖ్యము హృదయమునకు తగిన దేహము కఫము వాతము గలవాఁడు, పొడవగుముఖము శరీరము గలవాఁడు, ధర్మముగలవాఁడు, అనేకదుఃఖములు గలవాఁడు, మంచిమేధస్సుగలవాఁడు, శత్రువులజయించువాఁడు, మంచిఅందముగల నల్లరూపుగలవాఁడు, అతిథిబ్రాహ్మణుల యందు ఆదరముగలవాఁడు, క్రతువులనొనర్చువాఁడు, గురువులయందు భక్తిగలవాఁడు, పూజ్యుఁడు, తండ్రివలనగాక ఇతరులవలన జన్మనందినవాఁడు, సత్యపరాయణుఁడు, మృదువైనవాఁడు, సోదరులన్న ప్రేమగలవాఁడు, సూర్యునారాధించువాఁడు, పరిశుభ్రతగలవాఁడు, చెడ్డనడవడిగల బంధువులుగలవాఁడు, అందమైనవాఁడు చెడ్డనడవడిగలవాఁడు, ధర్మకార్యముల నాసక్తిలేమి నీచబుద్ధిగలవాఁడు అగును.

వృశ్చికలగ్నే పురుషః పీనతనుర్వ్యాయతాంగతీక్ష్ణశ్చ,
అంతర్విషమశ్శూరో మాతురభీష్టో రణోద్యత స్త్యాగీ 30
గంభీరపింగలోద్ధతదృక్సుమహోహ్యున్నిమగ్నజఠరశ్చ,
అంతర్విలగ్నఘోణ స్సాహసనిరత స్థిరశ్చండః. 31
విశ్వాసహాసవశ్యః పిత్తరుగార్తః కుటుంబసంపన్నః,
గురుసుహృదాం ద్రోహరతః పరాంగనాకర్షణానురతః 32
బంధోల్బణవక్త్రస్స్యాద్భూపతిసేవీ సశత్రుపక్షస్స్యాత్,
ప్రయతోర్థదస్సుయువతిర్ధర్మం పతివత్సలః క్షుద్రః. 33

వృశ్చికలగ్నమున జన్మించినవాఁడు బలిసినశరీరముగలవాఁడు విశాలమైనదేహము గలవాఁడు, తీక్ష్ణమైనవాఁడు, లోపల కపటముగలవాఁడు, శౌర్యముగలవాఁడు, తల్లికి ప్రియముగలవాఁడు, యుద్ధమున ప్రేమగలవాఁడు, త్యాగి గాంభీర్యముగలవియుం పచ్చనవియుఁ భయజనకములు నగు నేత్రములుఁగలవాఁడు, గొప్పహృదయముగలవాఁడు, లోతైనపొట్టగలవాఁడు, సొట్టముక్కుగలవాఁడు, సాహసవంతుఁడు, స్థిరమైనవాఁడు, కోపముగలవాఁడు, నమ్మకము హాస్యముగలవాఁడు, పైత్యరోగముగలవాఁడు, గొప్ప కుటుంబముగలవాఁడు, గురువులకు స్నేహితులకు ద్రోహమొనర్చువాఁడు, పరస్త్రీల నాకర్షించువాఁడు, నోటివట్లు వైశాల్యముగల ముఖముగలవాఁడు, రాజుల సేవించువాఁడు, శత్రుపక్షముగలవాఁడు, నియమముగలవాఁడు, ధనమునొసఁగువాఁడు, మంచిభార్యగల వాఁడు, ధర్మపరాయణుఁడు, యజమానునియందు భక్తి నీచముగలవాఁడు అగును.

కార్ముకలగ్నే జాతస్థూలరద స్తుంగపృథులమూర్ధాచ,
ప్రణతానాం ప్రియకారి ధృతిసత్వసమన్వితస్సునయః. 34
మలినాసికోష్ఠకునఖిహ్రీమానతిపీవరోరుజఠరశ్చ,
విజ్ఞానశాస్త్రకుశలః ప్రత్యగ్రమతిః ప్రకోపశ్చ. 35
బలినామమర్షణపరః కులముఖ్యో నాశితారిపక్షశ్చ,
సంగ్రామపదశ్రేష్ఠ శ్చలబహుళశ్ఛద్రబంధుగుణః. 36
శిల్పాదికర్మనిరతస్స్వకర్మ వాగ్బంధువర్గశుభదశ్చ,
కాంతో వదనాత్మగదో నృపాఢ్యకార్థస్సుధర్మరతః. 37

ధనుర్లగ్నమున జన్మించినవాఁడు పొడవైనదంతములుఁగలవాఁడు, పొడవైలావైన శిరస్సుగలవాఁడు, తనస్వాధీనులకు ప్రియమునొనర్చువాఁడు, ధైర్యము [illegible] వాఁడు, నీతిశాస్త్రజ్ఞుఁడు, మలినమైననాసిక పెదవులు గోళ్లు [illegible]

వాఁడు, బలిసినదియు గొప్పదియు నగు ఉదరముగలవాఁడు, పదార్థవిజ్ఞానశాస్త్రము నెఱింగినవాఁడు, మిక్కిలిచురుకైనబుద్ధి మిక్కిలితీక్ష్ణమైన కోపముగలవాఁడు, బలవంతులను లెక్కజేయనివాఁడు, వంశమునఁగలవారిలో శ్రేష్ఠుఁడు, శత్రునాశమునొనర్చువాఁడు, యుద్ధమున పూజ్యతగలవాఁడు మిక్కిలిదోషములుగలవాఁడు, దుష్టులగు బంధువులుగలవాఁడు, శిల్పశాస్త్రము మున్నగువానియందు నేర్పరి, స్వకర్మలనాచరించు వాఁడు, శుభమైనవాక్కు బంధువర్గము శుభమునొనర్చువాఁడు, అందమైనవాఁడు, వదనరోగములు నేత్రరోగములు గలవాఁడు, రాజువలన ధనమునొందువాఁడు, ధర్మపరాయణుఁడు అగును.

మృగేఽదనే లగ్నస్థే కృశగాత్రో భీరురేణవక్త్రశ్చ,
వాతవ్యాధిభిరార్తః ప్రదీప్తతుంగోగ్రనాసస్స్యాత్. 38
లఘుసత్వోఽమితతనయో రోమచితః పాణిపాదవిస్తీర్ణః.
ఆచారగుణైర్హీన స్త్రృషార్తరామాభిరామమతిః. 39
గిరివనచారీ శూర శ్శాస్త్రశ్రుతిశిల్పగేయవాద్యజ్ఞః,
క్షుద్రబలస్సకుటుంబో ద్విష్టో దుష్టశ్చ బంధుశౌర్యః. 40
కుత్సితశీలః కాంతః కుత్సితదారోఽనసూయకో ధనవాన్,
ధర్మరతో నృపసేవీ న చాతిదాతా సుఖీ సుభగః. 41

మకరలగ్నమున జన్మించినవాఁడు కృశించినశరీరము మిక్కిలిభయము జింకవంటి ముఖము వాతరోగములు ఎత్తైన వాడియైన నాసికగలవాఁడు, కొలదిపాటి మనశ్శక్తి గలవాఁడు, గొప్పసంతానముగలవాఁడు, శరీరమంతయు రోమములు పొడవగు చేతులు పాదములుగలవాఁడు, ఆచారగుణములులేనివాఁడు, దాహముగలవాఁడు, స్త్రీలకిష్టముగల బుద్ధిగలవాఁడు, పర్వతములయందు అరణ్యములయందు సంచరించువాఁడు, శౌర్యవంతుఁడు, శాస్త్రములు వేదములు శిల్పశాస్త్రము గానము వాద్యము నెఱిఁగినవాఁడు, నీచులగు పరిజనముగలవాఁడు, కుటుంబవంతుఁడు ద్వేషించఁదగినవాఁడు, దుష్టుఁడు, బంధువుల కప్రియమొనర్చువాఁడు, చెడ్డనడవడిగలవాఁడు, అందమైనవాఁడు, చెడ్డభార్యగలవాఁడు, అసూయలేనివాఁడు, ధనవంతుఁడు, ధర్మపరాయణుఁడు, రాజసేవనొనర్చువాఁడు, విరివిగా దానము చేయనివాఁడు, సౌఖ్యవంతుఁడు, సౌందర్యవంతుఁడు అగును.

కుంభవిలగ్నే పురుషస్సునీచకర్మా కులాధికో మూర్ఖః,
స్ఫుటితాగ్రనసో నీచ స్సక్రోధపరోఽలసాత్మా చ. 42

వైరప్రియోఽప్రహృష్టః పారుష్యద్యూతనీచదాసీష్టః,
ఉపహృతబంధుః క్షుద్రః తోయోదయీ ప్రాప్తవిత్తశ్చ. 43
పిశునశ్శరో దరిద్రో వినష్టబంధుర్బహిష్కృతో లోకే,
నోసంమతః పరేషాం ప్రకృష్టసంపద్గురురతిశ్చ. 44
కుంభోదయో నశస్తో లగ్నవిధౌ సర్వథైవ సత్యమతే,
యవనైర్వర్గోపి తథా చాణక్యో వదతి నోవర్గమ్ 45

కుంభలగ్నమున జన్మించినవాఁడు మిక్కిలి నీచపుపనులనొనర్చువాఁడు, వంశమునకుపెద్ద, మూర్ఖుఁడు, వంకరలేరిగిన ముక్కుకొనగలవాఁడు, నీచుఁడు, క్రోధముగలవాఁడు, సోమరి కలహములన్న ప్రేమగలవాఁడు, సంతోషముగలవాఁడు, కఠినమైనవాఁడు, జూదము నీచదాసీజనులయందు ప్రీతియుంగలవాఁడు, బంధుజనులులేనివాఁడు, క్షుద్రుఁడు, నాశమొందువాఁడు, ధనవంతుఁడు, లోభి, శరుఁడు, దరిద్రుఁడు, బంధువులు నశించినవాఁడు, లోకబహిష్కృతుఁడు, శత్రువుల కిష్టములేనివాఁడు, ప్రకృష్టమైన సంపదగలవాఁడు, గురువులయెడ ప్రీతిగలవాఁడు అగును. లగ్నశాస్త్రమున కుంభలగ్నము శుభమైనదికాదని సత్యాచార్యులమతము. కుంభలగ్నద్వాదశాంశము శుభమైనదికాదని యవనులమతము లగ్నమే అశుభకరముగాని ద్వాదశాంశ అశుభకరముగాదని చాణక్యునిమతము.

మీనవిలగ్నే జాతో ధన్యస్స్ఫుటనాసికోఽస్ఫుటాక్షశ్చ,
విజ్ఞానకావ్యబుద్ధిర్మానాదరలబ్ధకీర్తిశ్చ. 46
విపృతోష్ఠరదః కుష్ఠీ విదారితాస్యో వృషాదిసంలుబ్ధః,
దాక్షిణ్యప్రత్యయివా న్మేషచ్ఛాగాదిసంపన్నః, 47
శౌచాచారశ్శ్రుతివాగ్ధృతిమాన్కన్యాప్రజో వినీతశ్చ,
సౌమ్యమతి స్సత్వయుతో గాంధర్వస్త్రీరతిజ్ఞశ్చ. 48
బహుశీలోఽదారమతిర్ఖ్యాతిశ్రుధనోఽమర్షణ స్సుబంధుశ్చ,
బలవతిరాశౌ వేత్తత్తదధిపతౌ వా బలం సర్వమ్. 49

మీనలగ్నమున జన్మించినవాఁడు ధన్యుఁడు, స్ఫుటముగుముక్కు నేత్రములు విజ్ఞానములు కావ్యమునాసక్తి అభిమానము కీర్తిగలవాఁడు, విశాలములగుకడుపు దంతములుగలవాఁడు, కుష్ఠురోగము గలవాఁడు, నోరుభూచినవాఁడు, లోభి దయ విశ్వాసముగలవాఁడు, మేకలు గొఱ్ఱెలు గలవాఁడు, పరిశుభ్రత ఆచారముగలవాఁడు, వేదాధ్యయనమొనర్చువాఁడు, ధైర్యవంతుఁడు, స్త్రీసంతతిగలవాఁడు, వినయముగలవాఁడు,

సౌమ్యమగుబుద్ధి మనశ్శక్తి గానము స్త్రీరతి నెఱుఁగుట గలవాఁడు, మంచినడవడిగలవాఁడు, భార్యయందు ప్రేమలేనివాఁడు, సోదరులధనము గలవాఁడు, ఓర్పులేనివాఁడు, మంచి బంధువులులేనివాఁడుఅగును. లగ్నముగాని లగ్నాధిపతిగాని బలవంతుఁడైన ఈశాస్త్రమున చెప్పఁబడినఫలములు పూర్ణముగానుండును.

ఇతి సప్తచత్వారింశోఽధ్యాయః.

## హోరాగుణములను దెలుపు నలువదెనిమిదవ యధ్యాయము.

రక్తోత్కటదృక్కౄరో ధనపశ్వక్తాధికోగ్రదారరతః,
పీనోన్నతః ప్రచండ స్తస్కరనాథః క్రియాదిహోరాయామ్. 1
చోరః ప్రమాదబహుళః ఖరాగ్రపాదాంగుళిర్ద్వితీయాయామ్,
స్నిగ్ధాయతాక్షచతురః పృథుపీనతను స్సమేధాశ్చ. 2

మేషలగ్నముయొక్క ప్రథమహోరయందు (హోర యనఁగా లగ్నములో సగభాగము) జన్మించిన శూన్యమైనచూపు, క్రౌర్యము, ధనము, అధికవీర్యము, ఉగ్రురాలగుభార్యగలవాఁడు, బలిసినవాఁడు, తీక్ష్ణమైనవాఁడు, దొంగల కధిపతి అగును. ద్వితీయహోరయందు పుట్టిన దొంగ, ప్రమాదములు, సన్నని కాలివ్రేళ్లు, నిగనిగలాడు వెడల్పగుకండ్లు, నేర్పు, మిక్కిలి లావైనశరీరము, మంచిమేధగలవాఁ డగును.

శ్యామో విశాలచక్షుర్లలాటపక్షః ప్రగల్భరతివశ్యః,
స్థూలాస్థితనుర్వృషభప్రథమార్ధే స్యాద్వపుష్మాంశ్చ. 3
పృథ్వాయతవృత్తతను ముదారసత్వం సమూర్ధజం జనయేత్,
వ్యస్తకటిం వృషభాక్షం వృషభే హోరాద్వితీయాయామ్. 4

వృషభముయొక్క ప్రథమహోరయందు పుట్టిన నల్లనికండ్లు, విశాలమగునుదురు, మిక్కిలి సంభోగమునఆదరము, లావైనఎముకలు, శరీరము సౌందర్యవంతుఁడు, ద్వితీయహోరయందు జన్మించిన పొడవైనది లావైనది గుండ్రనైనదియగు నగుశరీరము, గొప్ప బలము, మంచివెంట్రుకలు, వ్యత్యస్తమగుకటిప్రదేశము, వృషభమువంటి నేత్రములు గలవాఁడును అగును.

మధ్యాయతోఽతిదక్షో మధ్యతనుర్మృదుశిరోరుహశ్మశ్రుశ్చ,
మిథునాద్యార్థేశూర స్సురతేప్సుస్స్యాద్ధనీ ప్రాజ్ఞః. 5
మధురాయతాక్షకామీ శూరోమృదుకర్మకో వచస్వీచ,
సతవారదత్తదేహో భవేన్నృమిథునద్వితీయహోరాయామ్ 6

మిథునలగ్న ప్రథమహోరయందు జన్మించిన లావైననడుము, మిక్కిలి నేర్పు, ఒకపాటిప్రమాణముగలశరీరము, మృదువులగువెంట్రుకలు, పాదములు సురతమున ఉత్కటమగువాంఛ, ధనము ప్రాజ్ఞతగలవాఁడు, ద్వితీయహోరయందైన మధురములై విశాలములగునేత్రములు కాముకుఁడు, శౌర్యవంతుఁడు, మృదువులగుపనులు, మంచి వాక్కు, ఇతరులభార్యలయందు జన్మగలవాఁ డగును.

ఉద్ధతమూర్తిస్సుశిరాః ప్రగల్భధీర్మందదృక్చలాంగశఠః,
శ్యామతనుస్సుకృతఘ్నో భగ్నాగ్రరదః కులీరహోరాయామ్. 7
ద్యూతేరతోఽధ్వనిరతః పృథువక్షాః స్సత్ప్రమాణసంపన్నః,
కఠినశరీరః క్రోధీ జాయేత కుళీరభద్వితీయాంయామ్. 8

కర్కాట ప్రథమహోరయందు జన్మించిన పొడవగుదేహము, మంచిశిరస్సు, ప్రగల్భమగుబుద్ధి, చూపుతక్కువ, పోకిరితనము, నల్లనిశరీరము, కృతఘ్నతగలవాఁడు, ద్వితీయహోరయందైన జూదమున దేశాటనమున ఆదరము, విశాలమగువక్షస్థలము, కఠినమగుశరీరము, మిక్కిలి కోపముగలవాఁడు, ప్రమాణసంపన్నుఁడును అగును.

రక్తాంతదృక్ప్రగల్భో గురురాయతవిగ్రహశ్చ సింహాద్యే,
జిహ్మాస్వభావసుఖభాగంతస్థిరకార్యసత్వశ్చ. 9
స్త్రీమృష్టపానభోజనవస్త్రేప్సుర్బహువిచేష్టకఠినాంగః,
దాతాధ్వరతోఽల్పసుతో భోగీ స్థిరసౌహృదోఽంత్యార్థే. 10

సింహ ప్రథమహోరయందు జన్మించిన ఎఱ్ఱనికన్నుయొక్కకొనలుగలవాఁడు, ప్రగల్భమైనవాఁడు, పొడవైనదేహము కపటము సౌఖ్యము, స్థిరములగుపనులు బలము గలవాఁ డగును. ద్వితీయహోరయందు జన్మించిన స్త్రీలను మృష్టాన్నములను పానీయములను వస్త్రములను కోరువాఁడు, మిక్కిలి దుష్కార్యములు కఠినములగుఅవయవములు గలవాఁడు, దాత, మార్గమునచరించువాఁడు, కొంచెము సంతానము భోగము స్థిరులగు స్నేహితులు గలవాఁడగును.

సుకుమారమూర్తికాంతస్సువాక్యగీతాంగనారతిర్మధురః,
గాంధర్వవిద్యవిత్యాస్సుభగః పూర్వార్థజ శ్శ్రేష్ఠః. 11
ప్రాప్తోవాహశ్రుతార్థ స్థూలశిరా స్సమ్మతో వివాదీ చ,
సేవాలేఖ్యలిపిజ్ఞః క్షయవృద్ధియుత స్సుఖీ ద్వితీయార్థే 12

కన్యాలగ్న ప్రథమహోరయందు జన్మించిన సుకుమారమగుదేహము, మంచి మాటలు, గానమున స్త్రీలయందు ఆదరము, సౌందర్యము, శ్రేష్ఠతగలవాఁడు, ద్వితీయ

హోరయందు జన్మించిన పొట్టివాఁడు, పంతముగలవాఁడై చదువుకొనువాఁడు, లావైనతల వివాదము సేవించుటయందు వ్రాయుంటయందు నేర్పు, క్షయవృద్ధులు సౌఖ్యముగలవాఁ డగును.

వృత్తాననఉచ్చనస_స్త్వసితాయతసునయనో విలాసీ స్యాత్,
పీనాయతతోఽస్థిసారో ధనవా న్స్వజనప్రియస్తులాద్యర్ధే 13
బహ్వర్థభాక్ష్విరార్ధ శ్శ్యామాంకుంచితశిరోరుహాశ్చ శఠః,
వృత్తాక్ష_స్త్వపరార్ధే సుత్వఘ్నీనాగ్ర పాదశ్చ 14

తులా ప్రథమహోరయందు జన్మించిన గుండ్రనిముఖము, ఎత్తైనముక్కు, నల్లని పొడవగునేత్రములు, విలాసములు, బలిసినదేహము, ధనము, బంధువులయెడ ప్రీతిగల వాఁడు, ద్వితీయహోరయందు జన్మించిన గొప్పధనము, నల్లనిపొట్టివెండ్రుకలు, గుండ్రని కండ్లు, మంచిశరీరము, పొట్టిపాదములుగలవాఁ డగును.

రక్తాంతపింగదృష్టిస్సాహసకర్మాన్వితో రణే శూరః,
దుష్టస్వభావరామాప్రియోఽర్థభాగ్వృశ్చికాద్యర్ధే. 15
విస్తీర్ణోపచితాయతపీనాంగః క్ష్మాధిపోపసేవీ స్యాత్,
బహ్వృణమిత్రసమేత స్స్ఫుటితాక్షో వృశ్చికాపరార్ధేస్యాత్. 16

వృశ్చికపూర్వార్ధమున జన్మించిన ఎఱ్ఱనికొనలుగల్గి పచ్చనైననేత్రములు, సాహ సములైనపనులు, యుద్ధమున పరాక్రమము, చెడువర్తనముగలస్త్రీయెడ ప్రేమ, ధనము గలవాఁడు, ద్వితీయహోరయందు జన్మించిన మిక్కిలి పొడవులావుగలశరీరము, రాజ సేవ, చాలాఋణములు, స్నేహితులు, స్ఫుటమైననేత్రములుగలవాఁ డగును.

దారితపృథుముఖదంతః పరికుంచితనేత్రగండస్స్యాత్,
బాల్యే త్యక్తాత్మగురు శ్చాపాద్యర్ధే తపస్వీ చ. 17
పద్మాక్షో దీర్ఘమహాబాహుశ్శాస్త్రార్థవిత్సుమూర్తి స్స్యాత్,
వాక్సుభగో ధన్యోఽపి చ ధనురపరే నిర్వృతో యశస్వీ చ 18

ధనుర్లగ్నప్రథమహోరయందు జన్మించిన నోటిపూత, వెడల్పగుఱొమ్ము, చిన్న నేత్రములు, దవడలుగలవాఁడు, పసితనముననే తలిదండ్రులులేనివాఁడు, తపస్సు చేయుం వాఁడు అగును. ద్వితీయహోరయందు జన్మించిన పద్మములవంటినేత్రములు, పొడవగు [illegible]శాస్త్రములపరిచయము, మంచిదేహము, మాటలనేర్పు, ధన్యతగలవాఁడు, [illegible]కీర్తిగలవాఁడును అగును.

శ్యామో మృగాక్షో ధన్యస్స్త్రీనిర్జితసౌఖ్యమూర్తిశ్శఠ ఆఢ్యః,
మృష్టాశనస్సుచేష్టో మృగాద్యభాగే తనూచ్చఘోణస్స్యాత్. 19
రక్తాంతదృష్టిరలసో గుసదీర్ఘాటనపరో భవతి మూర్ఖః,
శ్యామో రోమచితాంగస్తీక్ష్ణస్సహాస స్సురౌద్రకర్మా చ. 20

మకర ప్రథమహోరయందు జన్మించిన నల్లనిదేహము, సింహమువంటి నేత్రములు గలవాఁడు, ధన్యుఁడు, స్త్రీలవలన నశించని సౌఖ్యముగలవాఁడు, పోకిరి, సంపన్నుఁడు, మృష్టాన్నము నారగించువాఁడు, మంచిపనుల నొనర్చువాఁడు, పెద్దముక్కుగలవాఁడు, అగును. ద్వితీయహోరయందు జన్మించిన ఎఱ్ఱనికనుగొనలుగలవాఁడు, సోమరి, ఎల్లపుడు మార్గమున సంచరించువాఁడు, మూర్ఖుఁడు, నల్లనిదియు అంతటను రోమములు గల్గినదియు నగుదేహము, మిక్కిలి కోపము, సాహసము, రౌద్రముగలవాఁ డగును.

స్త్రీమిత్రభాగరసవిన్మృదులోఽల్పసుతశ్చ సద్గుణశ్శూరః,
తామ్రో భాస్కరవర్ణో యానమతిః కుంభపూర్వార్థే. 21
ఆతామ్రదారితాక్షః కృశస్థిరోఽత్యల్పమూర్తిరలసస్స్యాత్,
నైష్కృతిక స్సువిషాదీ కృపణః కుంభాపరే కుశఠః. 22

కుంభప్రథమహోరయందు జన్మించిన స్త్రీల మిత్రులు సౌఖ్యముగలవాఁడు, మృదువైనవాఁడు, కొలఁదిపాటిపుత్త్రులు, సద్గుణములు, సూర్యునివలె ఎఱ్ఱనగు దేహము, దేశాటనమునప్రీతిగలవాఁ డగును. ద్వితీయహోరయందైన ఎఱ్ఱనినేత్రములు, చిక్కిన దేహముగలవాఁడు, పొట్టివాఁడు, సోమరి, అపవాదమొనర్చువాఁడు, దుఃఖవంతుఁడు, లోభి, దుర్మార్గుఁడు అగును.

హ్రస్వః పృథుచారుతనుర్మహాలలాటో బృహద్వదనవక్షాః,
స్త్రీదయితో మీనార్థే ప్రథమే సుయశాః క్రియాపటుశ్శూరః. 23
దాతాసుతుంగనాసో నిపుణో మేధాన్వితశ్శుభదనేత్రః,
నృపదయితస్స్త్రీసుభగ శ్చారు ర్మీనాపరే సువాక్యస్స్యాత్. 24

మీనలగ్న ప్రథమహోరయం దుత్పన్నమైన పొట్టివాఁడు, మంచిసౌందర్యము గలదేహము, వెడల్పగునొసలు, వెడల్పగుముఖము, వక్షస్థలము, స్త్రీలయెడప్రీతి, గొప్పకీర్తి, కార్యములపట్టుదల, శౌర్యముగలవాఁ డగును. ద్వితీయహోరయందు జన్మించినదాన పొడవగుముక్కు, నేర్పు, చురుకైనబుద్ధి, శోభనకరములగు నేత్రములు, రాజప్రీతి, సౌందర్యము, మంచిమాటలుగలవాఁ డగును.

చంద్రార్కయో రేకతరే బలస్థే హోరాపతేః పశ్యతి కేంద్రగోవా,
హోరా యథోద్దిష్టఫలప్రదా స్యాద్గర్భస్థసత్వస్య సముద్భవేషు. 25

హోరాధిపతి బలవంతుఁడైనను లేక హోరాధిపతి కేంద్రమందున్నను సంపూర్ణ ఫలము గలుగునని భావము.

ఇతి అష్టచత్వారింశోఽధ్యాయః.

---

## నష్టజాతకాధ్యాయమందలి ద్రేక్కాణఫలములను దెలుపు నలువదితొమ్మిదవ యధ్యాయము.

దాతాహర్తాదీ ప్తః ఖ్యాతో యోదయో సంగరప్రచండస్స్యాత్,
ప్రియవిగ్రహస్త్రిభాగే మేషాగ్రే బంధుషూగ్రదండశ్చ. 1
స్త్రీచంచలో విహారీ రతిమా స్గీతప్రియో మనస్వీ స్యాత్,
మిత్రార్థభాక్సురూప స్త్రీస్వవిత్తరుచి ర్ద్వితీయే చ. 2
గుణవాన్పరదోషకర శ్చలసత్రయుతో నరేంద్రసేవీ స్యాత్,
స్వజనప్రియోఽతిధర్మ స్తృతీయభాగే ప్రియాదరోఽజ్ఞశ్చ. 3

మేషరాశియొక్క ప్రథమద్రేక్కాణమున (ద్రేక్కాణ మనఁగా రాశియొక్క మూఁడవభాగము) జన్మించినవాఁడు దాత, చోరుఁడు, లోకమంతట ఖ్యాతిఁజెందిన వాఁడు, నాశోన్ముఖుఁడైనవాఁడు, యుద్ధమున మిక్కిలి తీక్ష్ణమైనవాఁడు, అందమైన స్వరూపముగలవాఁడు, బంధువులను కఠినముగా శిక్షించువాఁడు అగును. ద్వితీయ ద్రేక్కాణమున జన్మించిన స్త్రీచాపల్యము, విలాసముగా తిరుగుట, సంభోగము గాన మున ప్రీతి, అభిమానము, స్నేహితులధనము లభించుట, మంచిరూపము, భార్యకు సంబం ధించినధనమున ప్రీతిగలవాఁడగును. తృతీయద్రేక్కాణమున జన్మించిన గుణవంతుఁడు, ఇతరుల దోసగుల నెన్నువాఁడు, నిశ్చలములేనిరూగాదులుగలవాఁడు, రాజసేవ నొనర్చువాఁడు, బంధుప్రేమగలవాఁడు, మిక్కిలి ధర్మాత్ముఁడు, ఆదరముగలవాఁడు, అంతగా సర్వవిషయములు తెలియనివాఁడును అగును.

ప్రియపానభోజ్యనారీ వియోగతప్తో వృషస్య పూర్వాంశే,
వస్త్రాలంకారయుతో యువతీప్రకృతానుసారీ స్యాత్. 4
సౌమ్యవపు స్త్రీస్వసుభగో మహార్ధరో రూపధనయుక్తః,
ధనవా న్ధీనరో మనస్వీ లుబ్ధస్త్రీణాం ప్రియో ద్వితీయే స్యాత్. 5

చతురోఽల్పభాగ్యవీరో మలీమసస్స్యాద్ధనాస్యపాదాయ,
సంతప్యతే తు పశ్చా ద్వృషస్య భాగే తృతీయే చ. 6

వృషభరాశియొక్క ప్రథమద్రేక్కాణమున జననంబైన ఇష్టులు పానయోగ్య పదార్థములు భోజనసామగ్రి భార్య మున్నగువారివియోగమువలన దుఃఖించువాఁడు, వస్త్రములు భూషణములు స్త్రీ ఇష్టముచొప్పున నడచుట మున్నగునవి గలవాఁడగును. ద్వితీయద్రేక్కాణమున జన్మించిన లోటులేని దేహముగలవాఁడు, స్త్రీలకు చాలా సౌందర్యముగా నుండువాఁడు, మంచిరూపము ధనము స్థైర్యము అభిమానము లోభము గలస్త్రీలయందు ప్రేమగలవాఁ డగును. తృతీయద్రేక్కాణమున జన్మించిన నేర్పుతి, కొంచెముపాటిధనము పరాక్రమముగలవాఁడు, మిక్కిలి నీచుఁడు, మొదట ధనము నార్జించిపిదప దుఃఖించువాఁడు అగును.

మిథునాదిమేద్రుగాణే పృథూత్తమాంగో ధనాన్వితః ప్రాంశుః,
కితవో గుణీ విలాసీ నృపాప్తమానో వచస్వీ స్యాత్. 7
ప్రాస్యాననస్సురూపస్సౌమ్యవపుస్స్నిగ్ధమూర్ధజతనుస్స్యాత్,
ధన్యో మృదుర్మహాధీ ర్ద్వితీయభాగే ప్రతాపవాన్సయశాః. 8
స్త్రీద్వేషణో వపుష్మా న్మహాశిరా శ్శత్రుసంయుతః ప్రాంశుః,
రూక్షనఖాంఘ్రికరతలశ్చలార్థవిభృతో ద్దృఢస్తృతీయే స్యాత్. 9

మిథునరాశియొక్క ప్రథమద్రేక్కాణమున జన్మించిన లావైనతలగలవాఁడు, ధనవంతుఁడు, పొడవైనవాఁడు, జూదగాఁడు, గుణములు విలాసములు రాజువలన గౌరవము వాగ్ధాటిగలవాఁడు అగును. ద్వితీయద్రేక్కాణమున జన్మించిన చిన్నముఖము గలవాఁడు, లోటులేనిదేహము, పొట్టివెండ్రుకలు శరీరముగలవాఁడు, ధన్యుఁడు, మృదువైనవాఁడు, గొప్పబుద్ధి ప్రతాపము యశస్సు గలవాఁ డగును. తృతీయద్రేక్కాణమున జన్మించిన స్త్రీలను ద్వేషించువాఁడు, మంచిశరీరముగలవాఁడు, గొప్పశిరస్సుగలవాఁడు, శత్రువులుగలవాఁడు, పొడవైనవాఁడు, వాడియైనగోళ్లు పాదములు హస్తములు నిలకడలేనిధనము వైభవము దార్ఢ్యముగలవాఁ డగును.

కర్కటకాదిమభాగే దేవబ్రాహ్మణరతశ్చలో గౌరః,
కృత్యకరశ్చ పరేషాం సుధీస్సుమూర్తిశ్శుభాంగనస్సుభగః. 10
లుబ్ధస్స్వాద్వదనపరస్స్వప్నరతస్త్రీణ్జితోఽభిమానీ స్యాత్,
సహజాన్వితో విలాసీ చపలో బహూదరో ద్వితీయే చ. 11

స్త్రీచంచలోర్ధభాగీ విదేశనిరతః ప్రియాసవస్వాదుః,
కాననతోయానురతో గుర్ద్విప్రేష్టస్త్వాల్యవాం స్తృతీయే స్యాత్. 12

కర్కాటరాశియొక్క ప్రథమద్రేక్కాణమున జన్మించిన దేవబ్రాహ్మణులయెడ భక్తిచంచలమగుస్వభావము పచ్చనిశరీరముగలవాఁడు, ఇతరులకు సేవచేయువాఁడు, బుద్ధిమంతుఁడు, శుభాచారములుగలభార్య సౌందర్యముగలవాఁ డగును. ద్వితీయద్రేక్కాణమున జన్మించిన లోభి తీపిభుజించువాఁడు, నిద్రించువాఁడు, స్త్రీవలన ఓడిపోవువాఁడు, అభిమానము సోదరులు విలాసములు చాంచల్యము అనేకరోగములుగలవాఁ డగును. తృతీయద్రేక్కాణమున జన్మించిన స్త్రీచాపల్యము ధనము పరదేశమునవసించుట మద్యములయందు ప్రీతిగలవాఁడు, సత్పురుషుఁడు, అరణ్యములయందు నీటియందు సంచరించువాఁడు, చూపుతగ్గినవాఁడు, మాలికలను ధరించువాఁడు అగును.

సింహాదిద్రేక్కాణే దాతా భర్తారినిర్జిగీషుస్స్యాత్,
బహుధనయోషిత్సుహృద్భవనృపసేవకస్సుసత్త్వశ్చ. 13
సుచిరకారీ దాతా స్థిరో వపుష్మాన్ర ణేప్సుస్స్యాత్,
సుఖభాక్ప్రీతిధర్మరుచిర్విస్తీర్ణమతిర్ద్వితీయే చ. 14
లుబ్ధః పరస్వహరణే కల్యస్సబ్ధో మహామతిః కితవః,
నాయతతనుమూర్తిస్స్యాన్నైకాపత్యః ప్రగల్భోఽన్యే. 15

సింహలగ్నముయొక్క ప్రథమద్రేక్కాణమున జన్మించిన దాత, పోషించువాఁడు, శత్రువులను జయించువాఁడు, చాలాధనము స్త్రీలు స్నేహితులుగలవాఁడు, అనేకరాజులను గొల్చువాఁడు, మంచిబలముగలవాఁడు అగును. ద్వితీయద్రేక్కాణమున పుట్టిన మంచిపనులఁజేయువాఁడు, దాత నిలకడగలవాఁడు, అందమైనవాఁడు, యుద్ధమున ఇష్టముగలవాఁడు, సౌఖ్యము వేదవిహితములగుధర్మములయందు ప్రీతి విశాలమగుబుద్ధిగలవాఁ డగును. తృతీయద్రేక్కాణమున జన్మించిన లోభి, ఇతరులధనము నేర్పుగా నపహరించువాఁడు, స్తబ్ధుఁడు, గొప్పబుద్ధిగలవాఁడు, జూదగాఁడు, పొట్టిశరీరముగలవాఁడు అనేకమంది పుత్త్రులుగలవాఁడు అగును.

శ్యామస్సువాగ్విసితః ప్రాంశుస్సుకుమారమూర్తిరబలాద్యైః,
స్త్రీభోగ్యోఽర్థభాగనిష్ఠో దీర్ఘశిరా మధురసమాక్షరశ్చ. 16
ధీరో విదేశభాగీ శిల్పకథాపండితస్సమరశౌండః,
వాచాటశ్శ్రీతవాక్యో వసౌకసాం సమ్మతో ద్వితీయే స్యాత్. 17

గీతాపరార్థభాగీ సంగీతరతి ర్నరేంద్రదయితస్స్యాత్,
హ్రస్వస్వరూపవేష శ్చాంతే పృథుదృక్కిరస్కశ్చ 18

కన్యారాశియందలి ప్రథమద్రేక్కాణమున జన్మించిన నల్లనివాఁడు, మంచి వాగ్ధాటి వినయము పొడవైనశరీరముగలవాఁడు, సుకుమారి, స్త్రీలవలన భాగ్యమునందు వాఁడు, అసిష్టమైనవాఁడు, పొడవైనశిరస్సుగలవాఁడు, తేనెవలె తియ్యనిమాటలాఁడు వాఁడు అగును. ద్వితీయద్రేక్కాణమున జన్మించిన స్థైర్యము విశేషము లక్షించుట శిల్పశాస్త్రమున పాండిత్యము యుద్ధమున నేర్పు మంచివాగ్ధాటిగలవాఁడు,మాటనాలించు వాఁడు, అరణ్యవాసులకు ఇష్టుఁడు అగును. తృతీయద్రేక్కాణమున జన్మించిన గానము చేయువాఁడు, ఇతరులసొత్తు నపహరించువాఁడు, సంగీతమున ప్రేమగలవాఁడు, రాజ ప్రేమగలవాఁడు, పొట్టివాఁడు, పెద్దలల నేత్రములుగలవాఁడు అగును.

కందర్పరూపనిపుణ స్తులాదిభాగేఽధ్వనేవజ్ఞః,
శ్యామకలాపణ్యరతో నియోగధీర స్సుమేధావీ 19
పంకజవిశాలనేత్రస్సురూపవాక్సాహసః కలాపీ స్యాత్,
ఖ్యాతస్స్వవంశవర్ధితవృద్ధానుచరో ద్వితీయే చ. 20
చపలశ్శఠః కృతఘ్నో విరూపజిహ్వోపచితమూర్తిః,
నష్టసుహృద్ద్రవిణయశాస్స్వల్పమతిర్భాగకే తృతీయే స్యాత్. 21

తులారాశియొక్క ప్రథమద్రేక్కాణమున జన్మించిన మన్మథునివలె సౌందర్య వంతుఁడు,' మార్గమున పోవ నెఱిఁగినవాఁడు, నల్లనివాఁడు, వర్తక మొనర్చువాఁడు, నియోగించుటయందు స్థైర్యముగలవాఁడు, మేధావంతుఁడు అగును ద్వితీయద్రేక్కాణ మున జన్మించిన పద్మమువలె విశాలములైన నేత్రములుగలవాఁడు, మంచిరూపము వాగ్ధాటి సాహసము ప్రఖ్యాతి తనవంశమున పేరుగన్న పెద్దల ననుసరించుటగలవాఁ డగును. తృతీయద్రేక్కాణమున జన్మించిన చపలచిత్తుఁడు, శఠుఁడు, కృతఘ్నుఁడు, కురూపి, కపటి, స్నేహితులధనము, ప్రఖ్యాతినశించినవాఁడు, స్వల్పబుద్ధిగలవాఁడు అగును.

గౌరస్థినరః ప్రచండో రణోత్కటస్స్యాన్నరో విశాలాక్షః,
స్థూలవిశాలశరీరః కలిప్రియో వృశ్చికాద్యాంశే. 22
మృష్టాన్నపానచతురశ్చలేక్షణో హేమగౌరమూర్తిస్స్యాత్,
శాంతః పరవిత్తయుత శ్శీలకలావా న్ద్వితీయేంశే. 23

నిశ్శ్మశ్రురోమహింస్రః పింగాక్షమహోదరః ప్రహర్తా చ,
సహజచ్యుత స్తృతీయే పీవరబాహుస్సుధీరహృదయశ్చ. 24

వృశ్చికలగ్నముయొక్క ప్రథమద్రేక్కాణమున జన్మించిన పచ్చనిశరీరముగలవాఁడు, స్థిరమైనవాఁడు, మిక్కిలి కోపముగలవాఁడు, యుద్ధమున గొప్పప్రీతిగలవాఁడు, విశాలములగునేత్రములు లావైనవి పొడవైనవియు నగుశరీరముగలవాఁడు, కలియుగాచారములయందు ప్రీతిగలవాఁడు అగును. ద్వితీయద్రేక్కాణమున జన్మించిన మృష్టాన్నము, పానీయములు, నిలకడలేనినేత్రములు, బంగారమువలె పచ్చనైనదేహము, సౌందర్యము, ఇతరులసొత్తు మంచినడవడి మంచికళలు గలవాఁడగును. తృతీయ ద్రేక్కాణమున జన్మించిన గడ్డము మీసములు శరీరమున రోమములులేనివాఁడు, ఘాతకుఁడు, గొప్పకడుపుగలవాఁడు, ఇతరుల దండించువాఁడు, సోదరులులేనివాఁడు, బలిసినబాహువులుగలవాఁడు, ధైర్యముగల హృదయముగలవాఁడు అగును.

పరిమండలాక్షవక్త్రో గుణేషు ముఖ్యో ధనుర్ధ్రగాణాద్యే,
స్వోపచితస్స్వాచార స్తథా మృదుర్భవతి సంజాతః. 25
శాస్త్రార్థవిత్ప్రవక్తా క్రతుశతహర్తా ద్వితీయే చ,
మంత్రభృతాం శ్రేష్ఠతమ స్త్వనేకతీర్థాయతనచారీ. 26
బంధుప్రధానచతురస్సతాంగతిర్ధర్మభా క్తృతీయేఽపి,
మానీ పరాంగనాభా గ్రూపయశోభాజనో విజిష్ణుశ్చ. 27

ధనుర్లగ్నముయొక్క ప్రథమద్రేక్కాణమున జన్మించిన గుండ్రనికండ్లు ముఖము మంచిగుణములుగలవాఁడు, మంచిఉపచారములు ఆచారములు మార్దవము గలవాఁడగును ద్వితీయద్రేక్కాణమును జన్మించిన శాస్త్రార్థము తెలిసినవాఁడు, మంచి వక్త, నూరుయజ్ఞములనొనర్చువాఁడు, మంత్రశాస్త్రవేత్తలలో నగ్రగణ్యుఁడు, అనేక తీర్థముల దేవాలయముల సంచరించువాఁడు అగును. తృతీయద్రేక్కాణమున జన్మించిన బంధుప్రీతి, నేర్పు, సత్పురుషులయెడనాదరము, ధర్మపరాయణత, అభిమానము, ఇతరస్త్రీలతోటిపొత్తు, మంచిరూపము, యశస్సు, విజయముగలవాఁ డగును.

వాల్యంబభుజశ్శ్యామః ప్రథితయశో రూపకాంతిశతః,
స్మితభాషీ మకరాద్యే స్త్రీషు జితో వల్గుచేష్టధనయుక్తః. 28
అల్పవదనశ్చ మధ్యే చలః పరస్త్రీధనాపహర్తా స్యాత్,
చతురస్సతాం గతిజ్ఞః ప్రదానశీలో దురంతపాదస్స్యాత్. 29
వాచాలః కలుషకృశో దీర్ఘాంగః పితృవియుక్తశ్చ,
లభతే విదేశగమనాద్వ్యసనాని మృగముఖస్యాంతే. 30

మకరలగ్నముయొక్క ప్రథమద్రేక్కాణమున జన్మించిన పొడవగుబాహువులు గలవాఁడు, నల్లనివాఁడు. గొప్పకీర్తిగలవాఁడు, మంచిరూపము శౌర్యముగలవాఁడు, నవ్వుచు మాట్లాడువాఁడు, స్త్రీలవలన ఓడిపోవువాఁడు, అందమగువ్యాపారములు ధనము గలవాఁ డగును. ద్వితీయద్రేక్కాణమున జన్మించిన చిన్నముఖము, చపలము, స్త్రీల ధనము నపహరించుట, నేర్పు. గమనమున నేర్పు, గానము పొడవగుపాదములు గలవాఁ డగును. తృతీయద్రేక్కాణమున జన్మించిన వాగ్ధాటిగలవాఁడు, కృశించినవాఁడు, పొడవైనవాఁడు, తండ్రిలేనివాఁడు,విదేశగమనముపలన దుఃఖములనొందువాఁడు అగును.

స్త్రీమానయశోమూర్తి స్ఫీతప్రభవో ఘటస్యాద్యే,
ప్రాంశుః కర్మసు నిష్ఠో ధనవాన్నృపసేవకో జాతః 31
లుబ్ధస్సమర్థమధురో గౌరః పింగోద్ధతాక్షహాస్యధనః,
ఉద్ధతృష్టవచామతిమాన్బహుమిత్రస్స్యాద్ద్వితీయేతు. 32
దీర్ఘశ్శఠః ప్రతాపీ కృశోఽల్పబాహుస్సుతార్థభాక్ స్తబ్ధః,
బహ్వానృతోఽంతర్విషమో విదారితాక్షో రతివిదంత్యే. 33

కుంభలగ్నముయొక్క ప్రథమద్రేక్కాణమున జన్మించిన, స్త్రీలఅభిమానము కీర్తి గొప్పప్రభావముగలవాఁడు, పొడవైనవాఁడు, పనుల నోపికతోఁజేయువాఁడు, ధనవంతుఁడు, రాజసేవకుఁడు అగును. ద్వితీయద్రేక్కాణమున జన్మించిన, లోభి సమర్థుఁడు మధురముగా మాటలాడువాఁడు, పచ్చనిదేహము పచ్చనికండ్లు పరిహాసము చేయుం అలవాటుగలవాఁడు, ధాటిగలమాటగలవాఁడు, బుద్ధిమంతుఁడు, స్నేహితులు విరివిగాఁగలవాఁడు అగును. తృతీయద్రేక్కాణమున జన్మించిన పొడవైనవాఁడు, పోకిరి, ప్రతాపవంతుఁడు చిక్కినవాఁడు, పొట్టిచేతులుగలవాఁడు, పుత్త్రులవలన ధనమునొందు వాఁడు, అసత్యము బలుక్కువాఁడు, కపటి చీలిననేత్రములుగలవాఁడు, సంభోగమున చతురుఁడు అగును

మధుపింగాక్షో గౌరో మేధావీ సత్క్రియారతిజ్ఞశ్చ,
సుఖభాగీ మీనాద్యే జలచరయుతో విసితశ్చ 34
నార్యుపచారప్రవరో మృష్టాన్నరుచిః పరార్థభుక్కామీ,
స్త్రీసజ్జనాతిదయితో వదతాం శ్రేష్ఠో ద్వితీయేతు. 35
శ్యామః కలాసు నిపుణః పృథుపాదసుహృత్ప్రదానశ్చ,
మృష్టాన్నపానహాస్యో మీనయుగాంత్యే భవేత్పురుషః. 36

మీనలగ్నముయొక్క ప్రథమద్రేక్కాణమున జన్మించిన తేనెకండ్లుగలవాఁడు, పచ్చనిశరీరముగలవాఁడు, మేధావంతుఁడు, సత్కార్యముల నాచరించువాఁడు, సౌఖ్యవంతుఁడు, నీటియందు ప్రయాణముచేయువాఁడు, వినయవంతుఁడు అగును. ద్వితీయ ద్రేక్కాణమున జన్మించిన స్త్రీలసేవించువాఁడు, మృష్టాన్నము నారగించువాఁడు, ఇతరులధనము హరించువాఁడు, కాముకుఁడు, స్త్రీలయందు సత్పురుషులయందు ప్రేమ గలవాఁడు, వాగ్ధాటిగలవాఁడు అగును. తృతీయద్రేక్కాణమున జన్మించిన నల్లనివాఁడు. కళలయం దారితేరినవాఁడు, పొడవగుకాళ్లుగలవాఁడు, మృష్టాన్నము దివ్యములగు పానీయములుగలవాఁడు, పరిహాసనిపుణుఁడు అగును.

ఇతీరితోఽయం స్వగుణస్వభావో
ద్రేక్కాణజానాం గుణవద్వికల్పైః
ద్రేక్కాణకే వీర్యవతి స్వదృష్టే
ద్రేక్కాణకల్పంతు ఫలం విదధ్యాత్ 37

ద్రేక్కాణము బలయుక్తముగ నుండి స్వాధిపతిచే చూడఁబడెనేని ద్రేక్కాణ ఫలము సంపూర్ణముగ గలుగునని భావము.

ఇతి ఏకోనపంచాశోఽధ్యాయః.

---

నష్టజాతకాధ్యాయమందలి నవాంశఫలమును దెలుపు
ఏబదవ యధ్యాయము

అతోంఽశకే లగ్నగతే తు వక్ష్యే వర్ణస్వభావాకృతిలక్షణాని,
ప్రధానవీర్యాంశపతౌ శశీవ తత్స్వామిరాశిక్రమశో విధత్తే 1

ఏ హేతువువలన చంద్రచారమును దెలుపు ౩౬వ అధ్యాయమునందలి ౮౦వ శ్లోకోక్తరీతిని రాశి రాశ్యధిపతి నవాంశాధిపతి పూర్ణబలయుక్తులై యుండినయెడల అంశము చెప్పఁబోవువర్ణము స్వభావము ఆకృతి లక్షణము మొదలుగాఁగలవి పూర్ణముగా నుండునో ఆ హేతువువలన అంశఫలములను జెప్పఁబోవుచున్నాను. నవాంశఫలముల ననుసరించి ఆయాయి నవాంశయందుఁ బుట్టినవాఁడని తెలియఁదగినదని భావము.

అజసంస్థానముఖస్స్యాన్మేషాద్యాంశేఽల్పనాశికాంగభుజః,
చండధ్వనిర్విరూపస్సంకుచితాక్షః కృశోఽక్షతాంగశ్చ. 2

శ్యామగురుస్కంధభుజో హ్రస్వలలాటస్సుజత్రుకస్స్ఫుటదృక్,
దీర్ఘాస్యనసో మృదువా గ్ద్వితీయభాగే కృశాంఘ్రిసంధిశ్చ. 3
వ్యాలుప్తకేశగౌరో వ్యస్తభుజశ్చారునయననాసశ్చ,
వాక్పండిత స్తృతీయే జాతస్తు కృశోరుజానుజంఘశ్చ. 4
విభ్రాంతదృష్టిచండో ప్రాప్వనసోఽటనఖరాంఘ్రిరోమశ్చ,
అభ్రాతృకః కృశస్స్యాచ్చతుర్థనవభాగజః పురుషః 5
దృష్టో గజేంద్రనయనో పృథునాసాభ్రూలలాటకోమధ్యే,
పీనోపచితాగ్రతనుః ఖరతరరోమాంఘ్రితనుకేశః, 6
శ్యామో మృదుర్మృగాక్షో గురుః కృశస్ఫిక్కరోరచరణస్స్యాత్,
వ్యస్తోదరకభుజాంస ష్షండో భీరుశ్చ బహుభాషీ. 7
దూర్వాంకురాభచపలస్నితనేత్రస్సప్తమే భవేత్పురుషః,
కుటిలాంతర్కృశాంసో విశాలవిస్తీర్ణమూర్తిస్స్యాత్ 8
వానరముఖప్రసక్తా ఖరపింగలనుశ్చ గుహ్యగద,
హింస్రోఽస్మృతఘాతుకస్సుహృత్ప్రయోగస్సదాష్టమజః 9
దీర్ఘః కృశో పహారి న్యస్తలలాటశ్రవోఽశ్వవదనశ్చ,
బహ్వాభిధానాభిరత స్త్వనృజుర్నవమాంశజో భవతి 10

మేషలగ్నముయొక్క ప్రథమాంశమున (అంశమనఁగా లగ్నమును తొమ్మిది భాగములు చేయఁగా అందొక్కభాగమునకు పేరు దీనికే నవాంశమని వ్యవహారము కలదు) జన్మించిన మేకవంటిముఖము, పొట్టిముక్కు చేతులు శరీరము కఠోరమగు కంఠధ్వనిగలవాఁడు, కురూపి చిన్నకండ్లుగలవాఁడు, చిక్కినవాఁడు, గాయపడనిశరీరము గలవాఁడు అగును ద్వితీయాంశమున జన్మించిన నల్లనివాఁడు, పొడవగు చేతులుఁగల వాఁడు, పొట్టిమెడగలవాఁడు, మంచి నేత్రములు, పొడవగుముఖము, ముక్కు, మృదువగుమాటలు, కృశించినవ్రేళ్లుగలవాఁడు అగును. తృతీయాంశమున జన్మించిన వెంట్రుకలు లేనివాఁడు, పచ్చనివాఁడు, వంకరచేతులుగలవాఁడు, అందమైననేత్రములు ముక్కుగలవాఁడు, మాటలయందు నేర్పరి చిక్కినతొడలు మోఁకాళ్లు పిక్కలుగలవాఁడు అగును. చతుర్థాంశమున జన్మించిన తిరుగుడుకండ్లుగలవాఁడు, ప్రచండమైనవాఁడు, పొట్టిముక్కుగలవాఁడు, దేశద్రిమ్మరి, గాడిదకాళ్లవంటి నిండారోమములుగలవాఁడు, సోదరులులేనివాఁడు, చిక్కినవాఁడు అగును. పంచమాంశమున జన్మించిన గర్వముగల వాఁడు, ఏనుగకువలె చిన్నకనేత్రములుగలవాఁడు, గొప్పప్రఖ్యాతి పొడవైనకను

బొమ్మలు బలిసినశరీరము వాడియైనవెంట్రుకలుగలవాఁడు, పొడవగు కాళ్లుగలవాఁడు అగును. షష్ఠాంశమున జన్మించిన నల్లనివాఁడు, మృదువైనవాఁడు, లేడివంటికండ్లుగల వాఁడు, పొడవగువాఁడు, చిక్కినపిఱుదులు కఠినములగు పాదములుగలవాఁడు, వంకర చేతులు పొట్టగలవాఁడు, నపుంసకుఁడు,భయశీలుఁడు,బహుభాషి అగును. సప్తమాంశమున జన్మించిన గడ్డిపోచవలె చపలమైనవాఁడు, తెల్లనికండ్లు జారిణియగుభార్యగలవాఁడు, దుర్మార్గుఁడు విశాలమైనశరీరముగలవాఁడు అగును. అష్టమాంశమున జన్మించిన కోతివంటి ముఖము వాగ్ధాటికంచరగాడిదవలె ఎఱ్ఱనిశరీరముగలవాఁడు,రహస్యరోగములుగలవాఁడు, ఘాతకుఁడు, అసత్యమాడువాఁడు, స్నేహితులయెడ ప్రీతిగలవాఁడగును. నవమాంశమున జన్మించిన సన్ననివాఁడు, పొట్టివాఁడు, విలాసముగా తిరుగువాఁడు, సొంపులేని నుదురు చెవులుగలవాఁడు, గుఱ్ఱమువంటిముఖముగలవాఁడు, అనేకపేర్లుగలవాఁడు, కపటి అగును.

వృషభ రాశియందు:—

సమకృష్ణతనుః స్తబ్ధః పూర్వమఘాంత్యేఽంత్యకీర్త్యా స్యాత్ ,
నీచః ప్రకృతివిరుద్ధో విషమాక్షోనిరిక్షణో వృషస్యాద్యే 11
గంభీరదృగలసాత్మా వినతశిరావక్త్రకశ్చ లఘుమేధాః,
ప్రతికూలకర్మమిథ్యా బహుప్రలాపీ ద్వితీయే స్యాత్. 12
మృద్వంగవాన్వపుష్మాన్ససస్పష్టాయతాక్షబృహదంగః,
యజ్ఞాదికర్మనిరత స్త్రీనరపార్ష్ణికర స్తృతీయనవమాంశే. 13
హ్రస్వోదరస్సురోషో మేషాక్షః పింగల స్స్వధనయుక్తః,
పరధనహరణాభిరతశ్చతుర్థభాగే వృషస్య నరః. 14
వ్యాలస్సుతుంగఘోణో మహార్ఘభాకారవక్త్రఘనకేశః,
స్యాత్పంచమే విలాసీ బృహద్భుజస్కంధకటిగౌరః. 15
స్వాక్షస్థిరస్సుకేశస్స్నిగ్ధతనుర్వల్గువాక్ప్రియగల్పస్స్యాత్ ,
మాధుర్యహాస్యనిరతః కృశస్సునిపుణో భవేత్షష్ఠే. 16
మృతసుతయువతిషు రతో మనాక్ప్రలంబాగ్రనాసికాక్షస్స్యాత్ ,
ఉద్బద్ధాంగస్స్వజనద్వేషీ గురుపాదసూక్ష్మకేశశ్చ. 17
వ్యాఘ్రేక్షణస్సుదశన స్త్వజితస్స్ఫుటనాసికోఽల్పకర్మాస్స్యాత్ ,
ఉద్వృత్తనీలకేశోగ్రనఖో ముఖర స్తదాఽష్టమజః 18

మానో౽ల్పసత్వభీరుః క్రోధీ సమరుచిరమూర్తికితవస్స్యాత్,
సంచితధనః ప్రసిద్ధః కృశస్త్వధస్స్యాత్పరిలాప్యంతే. 19

వృషభరాశియొక్క ప్రథమాంశమున జన్మించిన నల్లనివి అంతపొట్టివియుం కాని దేహముగలవాఁడు, నీచుఁడు, ప్రపంచపరుద్ధుఁడు, ఎగుడుదిగుడు కండ్లుగలవాఁడు అగును. ద్వితీయాంశమున జన్మించిన గాంభీర్యముగల నేత్రములు, సోమరితనము, వంగిన తల ముఖము, స్వల్పబుద్ధిగలవాఁడు, ప్రతికూలములగుపనుల నాచరించువాఁడు, అబద్ధములను పలుక్రువాఁడు, బహుభాషి అగును. తృతీయాంశమున జన్మించిన మృదువగుశరీరము మాటలుగలవాఁడు, సౌందర్యవంతుఁడు, మంచినేత్రములుగలవాఁడు,మంచిముక్కు పెద్దశరీరముగలవాఁడు, యాగాదిక్రతువు లొనర్చువాఁడు, స్థిరమగుసేవకులుగలవాఁడు అగును. చతుర్థాంశమునఁగలిగిన చిన్నపొట్ట, మంచిరోమము, మేకపంటికండ్లు, పచ్చని శరీరముగలవాఁడు, ధనహీనుఁడు, ఇతరులధనము నపహరించువాఁడు అగును. పంచమాంశమున జన్మించిన పాముపలె క్రూరుఁడు, మిక్కిలి ఎత్తైనముక్కు, అబోతువంటి ముఖము చాలావెంట్రుకలు, విలాసములు, గొప్పభుజములు, మూపుకటిప్రదేశము, పచ్చనిశరీరముగలవాఁ డగును. షష్ఠాంశమున జన్మించిన మంచినేత్రములు, వెంట్రుకలు నున్నని శరీరము మనోహరములగుమాటలుగలవాఁడు, స్థిరమైనవాఁడు, డాంభికుఁడు, మధురమైనవాఁడు, పరిహాసకుశలుఁడు, చిక్కినవాఁడు నేర్పరి అగును. సప్తమాంశమున జన్మించిన మృతులైనపుత్రులను భార్యను స్మరించుకొనువాఁడు, కొంచెము పొడుగు వాడిగలముక్కు నేత్రములు చిక్కినదేహముగలవాఁడు, బంధువులను ద్వేషించువాఁడు,పొడవగుకాళ్లు పొట్టివెంట్రుకలుగలవాఁడగును. అష్టమాంశమున జన్మించిన పెద్దపులివంటి నేత్రములుగలవాఁడు, మంచిదంతములుగలవాఁడు,జయింపవీలులేనివాఁడు, స్ఫుటమగునాసికగలవాఁడు,చిన్నచిన్నపనుల నొనర్చువాఁడు,బిరుసైన నల్లనైన వెండ్రుకలుగలవాఁడు, వాడిగలగోళ్లుగలవాఁడు, వాగుబోతు అగును. నవమాంశమున జన్మించిన పూజ్యతగలవాఁడు, అల్పగాలముగలవాఁడు, భయశీలుఁడు, కోపముగలవాఁడు, ప్రమాణమైన సౌందర్యముగలశరీరముగలవాఁడు, జూదరి, ధనము నార్జించువాఁడు, ప్రసిద్ధిఁజెందినవాఁడు, నీచముగా మాటలాడువాఁడు అగును.

మిథునరాశియందుః—

రోమోపచితాంసభుజో ఘనాసితాపాంగదృక్తథోచ్చనసః,
మూర్ఖాకాండశ్యామః కృశాంఘ్రిపాణిస్తృతీయభవనాద్యే.

ఘటశీర్షో శుచికర్మా ఘాతరుచిర్మిథునలగ్నఘోణాస్స్యాత్,
బహుభాషీ బహుచేష్టో ద్వితీయభాగే తు విగ్రహాధిపతిః 21
గౌరోఽతిరక్తనయనస్సునాసికస్సుతనుస్సుమేధాస్స్యాత్,
దీర్ఘాననోసితభ్రూర్వాచాపటుస్తృతీయేంశే. 22
సుభ్రూర్లలాటకామీ సితోత్పలమూర్తిః పృథువక్షాస్స్యాత్,
సితదంతో మృదువక్త్రః ప్రశస్తకాంచితకేశశ్చతుర్థేంశే. 23
పృథ్వాననో బృహస్ఫిక్పటుభుజశ్చ ఖలః,
స్థూలశిరా మాయాపి సితాంబరాన్వితస్తు పంచమజః 24
మధ్వేక్షణః ప్రలాపీ వ్యస్తలలాటస్సుమస్సుతనుః,
కితవశ్చలశ్చ రుధిరోష్ఠః షష్ఠే తు సత్వయుతః. 25
తామ్రాయతాక్షవక్షస్సుముఖశ్చతురో విశాలవక్షాస్స్యాత్,
శిల్పేషు శిల్పనిపుణో హాస్యరతస్సప్తమే జాతః 26
శ్యామో గుణైర్మనస్వీ లఘుతో మధురభాషకశ్చ,
వ్యస్తవివృద్ధశరీరో దీర్ఘాసితకుటిలాంగపృష్ఠభుజః. 27
వృత్తాసితదృక్సుతనుస్స్నిగ్ధో మేధావిలోలతిజ్ఞస్స్యాత్,
విజ్ఞానకావ్యనిరతో నవమే జాయేత మిథునస్య. 28

మిథునలగ్నము యొక్క ప్రథమాంశమున జన్మించిన రోమములుగల భుజములు బాహువులుగలవాఁడు, నల్లని క్రీగంటిచూపు, ఎత్తైనముక్కు, గరికవలె నల్లనిశరీరము సన్నని కాళ్లుచేతులుగలవాఁడు అగును. ద్వితీయాంశమున జన్మించిన కడవవంటితలగల వాఁడు, పరిశుభ్రములగుపనుల నొనర్చువాఁడు, ఇతరులను హింసించువాఁడు, పొడవగు ముక్కుగలవాఁడు, ఎక్కువగా మాటలాడువాఁడు, ఎల్లపుడు ఏదేనొకపని నాచరించు వాఁడు, యుద్ధమునకు అధిపతియు నగును. తృతీయాంశమున జన్మించిన పచ్చని దేహము, ఎఱ్ఱనికండ్లు, మంచిముక్కు, సన్నమైనశరీరము, మంచి తీక్ష్ణమగుబుద్ధి పొడవగుమొగము, నల్లనికనుబొమలు, మాటలయందు నేర్పుగలవాఁడగును. చతుర్థాంశమున జన్మించిన మంచికనుబొమలు నుదురుగలవాఁడు, కాముకుఁడు, నల్లకలువవంటి దేహముగలవాఁడు, విశాలమగువక్షస్థలము, తెల్లనిదంతములు, మృదువైనముఖము, యోగ్యములగు వెంట్రుకలుగలవాఁడగును. పంచమాంశమున జన్మించిన వెడల్పుముఖము, పెద్దపిఱుదులు, బలిసిన ఱొమ్ము భుజములుగలవాఁడు, దుర్మార్గుఁడు, పెద్దతలగలవాఁడు, మోసగాఁడు, నల్లని నేత్రములుగలవాఁడు అగును. షష్ఠాంశమున జన్మించిన తేనెకండ్లు, బహుమాట్లాడుట

ములు గలవాఁడగును. ద్వితీయాంశమునఁ జన్మించిన రక్తవర్ణముగలపాదములు వక్షస్థలము గలవాఁడు, కళాప్రియుఁడు, పిల్లివంటి ముఖము నేత్రములుగలవాఁడు, త్యాగి చిక్కని మోఁకాళ్లు పిక్కలు గలవాఁడగును. తృతీయాంశమున జన్మించిన పచ్చనిశరీరము మంచి నేత్రములు మంచిమాటలు సౌకుమార్యము లావైననడుము స్త్రీలఅవయవములనుపోలిన వియుం అగు అవయవములుగలవాఁడు, బుద్ధిమంతుఁడు, మృదువైనపనుల నొనర్చువాఁడు సోమరిఁయగును చతుర్థాంశమున జన్మించిన నల్లనిదేహము వంగినకనుబొమలు గలవాఁడు, విలాసవంతుఁడు, బలిసి ఎత్తైనవాఁడు, మంచిముక్కు కండ్లుగలవాఁడు, చిక్కనవాఁడు, దాత మంచికార్యముల నొనర్చువాఁడు అగును పంచమాంశమున జన్మించిన ఘంటవంటిశిల వంగినముఖము మంచికనుబొమలు పొడవైనబాహువులు గలవాఁడు, సేవనొనర్చువాఁడు, చెడ్డపనులనుచేయువాఁడు, ఓర్పులేనివాఁడు, స్వల్పమగుబుద్ధిగలవాఁడు అగును షష్ఠాంశ మున జన్మించిన పొడవైన విశాలమైనశరీరము మంచినేత్రములుగలవాఁడు,ఎల్లపుడు పర దేశములనసించువాఁడు,పచ్చనిశరీరము మంచివెదురువంటి ముక్కుగలవాఁడు,మంచివక్త, పొడవైనదంతములు గలవాఁడగును. సప్తమాంశమున జన్మించిన ఒకరంగుతలవెంట్రుకలు వేరొకరంగు దేహమున రోమములు పెద్దశరీరము నరములుకాన్పించుపిక్కలు ఇతరుల గృహములనుకాపాడుట కాకివంటిశరీరము గలవాఁడగును. అష్టమాంశమున జన్మించిన ఘంటవంటితలగలవాఁడు, చెడ్డశిల్పములఁజేయువాఁడు, మంచిముఖము భుజములు అవ యవములుగలవాఁడు, తాఁబేలువలెనడుచువాఁడు, నడుము వంగినముక్కుగలవాఁడు, నల్లనివాఁడు అగును. నవమాంశమున జన్మించిన పచ్చనిశరీరము చేపలవంటినేత్రములు మృదువగుపొట్ట విశాలమై బలిసినఱొమ్ము పొడవగుదవడలు పొడవైనపెదవులు గొప్ప తొడలు చిక్కనమోఁకాళ్లు చీలమండలు గలవాఁడగును.

సింహరాశియందు:—

మందోదరః ప్రచండో రక్తాగ్రనసో బృహచ్ఛిరాశ్శూరః,
ఉన్నతమాంసలవక్షాస్సింహే ప్రథమే భవేద్భాగే. 38
ఉన్నతవితతలలాటశ్చతురశ్రతనుర్విలోమనేత్రశ్చ,
దీర్ఘభుజోన్నతవక్షాః పృథ్వాగ్రఘోణో ద్వితీయేఽంశే. 39
రోమాన్వితాయతభుజశ్శకోరనయనశ్చలస్త్యాగీ,
ఉన్నాసికస్తృతీయే స్నిగ్ధతనుర్బాహువృత్తగలః 40
ఘృతమందగౌరగాత్రో దీర్ఘాసితలోచనో మృదుశిరోజః,
భిన్నధ్వనిశ్చతుర్థే మృదుకరచరణశ్చ భేకకుక్షిస్స్యాత్. 41

ఘంటాశిరోఽల్పకేశోఽసితఘోణాక్షశ్చ లోమశాంగతనుః,
లంబోదరః ప్రచండో దంష్ట్రోత్కటపీనహ్రస్వమధ్యే. 42
ప్రస్తాల్పరోమమూర్తి స్స్నిగ్ధసమాసితవిలోచనోదీర్ఘః,
శ్యామస్త్రీణాం చతురో వికత్థనో వాక్యపండితష్షష్ఠే. 43
దీర్ఘాననస్సిరాలః పీనతనుస్త్రీషు దుర్భగః కృష్ణః,
స్యాత్సప్తమే సుచండో రోమచితః క్రూరనిష్ఠురాభాషీ 44
ఉత్కృష్టవాక్ఛిరాంగ స్సుభగో గంభీరదృగ్వికత్థాచ,
నిస్స్వః కూటకరస్స్యాదష్టమభాగే ప్రసూతస్య. 45
రాసభముఖోఽసితాక్షో వ్యాలంబభుజస్సుపార్ష్ణి జంఘశ్చ,
శ్వాసనిపీడితవక్షా నవమాంశే జాయతే మనుజః 46

సింహలగ్నముయొక్క ప్రథమాంశమున జన్మించిన చిన్నకడుపుగలవాఁడు, మిక్కిలి కోపముగలవాఁడు, ఎఱ్ఱనిముక్కుకొనగలవాఁడు, పెద్దతలగలవాఁడు, శౌర్యవిశిష్టుఁడు, ఎత్తైన బలిసినవక్షస్థలముగలవాఁడు అగును ద్వితీయాంశమున జన్మించిన ఎత్తైన విశాలమైననొసలు నలుచదరముగుశరీరము ఎగుడుదిగుడుకండ్లు పొడవగుచేతులు ఎత్తైన బొమ్మ విశాలమై ఎత్తైనముక్కు గలవాఁడగును. తృతీయాంశమున జన్మించిన రోమములుగలభుజములు చకోరపక్షివంటి నేత్రములు గలవాఁడు, చంచలమైనవాఁడు, త్యాగి ఎత్తైనముక్కు నున్ననిశరీరము చేతులవలె గుండ్రనైన మెడగలవాఁడగును చతుర్థాంశమున జన్మించిన పేరిన నేతిమీఁద తేరిననేయివలె పచ్చనిశరీరము పొడవై నల్లనైననేత్రములు మెత్తనివెండ్రుకలు అనేకధ్వనులు గలవాఁడు, పొడవైనకాళ్లుచేతులు గలవాఁడు, కప్పవంటి కడుపుగలవాఁడగును పంచమాంశమున జన్మించిన ఘంటవంటితల పొట్టివెండ్రుకలు పెద్దముక్కు నల్లనికండ్లు దేహమంతటను రోమములు పెద్దకడుపు అధికమగుకోపము గలవాఁడగును. షష్ఠాంశమున జన్మించిన దేహమంతటను రాలిపోయి కొలదిగామిగిలిన రోమములు గలవాఁడు, నల్లనిపొడవైన నిగనిగమై [illegible] నేత్రములు [illegible] పొడవైనవాఁడు, నల్లనివాఁడు, స్త్రీలను సంతోషపరచువాఁడు. [illegible] వాక్పండితుఁడును [illegible]. సప్తమాంశమున జననంబైన పొడవగునట్టి [illegible] [illegible] దేహము అందములేకపోవుట కుష్ఠరోగము మిక్కిలికోపము దేహమంతటరోమములు క్రూరములు కఠినములు నగుమాటలు గలవాఁడగును. అష్టమాంశమున జన్మించిన మంచిమాటలు బలిష్ఠములగు అవయవములు సౌందర్యము గాంభీర్యముగలనేత్రములు చెడ్డపనులు ధనములేకపోవుట కూటసాక్ష్యములుచెప్పుట గలవాఁడగును. నవమాంశమున జన్మించిన గాడిదవంటి

ముఖము గలవాఁడు, నల్లని నేత్రములు పొడవై వ్రేలాడుభుజములు మంచిమోచేతులు పిక్కలు ఆయాసముచే బాధపడుగుండె గలవాఁడగును

కన్యారాశియందు:—

సారంగాక్షో వక్తా ప్రదానసంభోగవాన్ధనాఢ్యశ్చ,
శ్యామోన్నతహృదయస్స్యాత్షష్ఠే ప్రథమాంశకే జాతః 47
పూర్ణాననస్సుచక్షుస్స్నిగ్ధో మృదువాదశీలశ్చ,
లంబోదరశ్చలస్స్యాద్ద్వితీయభాగే మహోరుశ్చ 48
స్ఫుటనాసికాస్ఫుటస్స్యాత్ప్రశస్తపాదశ్చ పీనపాదభుజః,
విస్పష్టవాక్చ గౌరః కన్యాసు సుహృత్తృతీయేఽంశే. 49
శ్రుతవాక్స్త్రీషు చ రమతే సుకుమారో మధురరక్తగౌరశ్చ,
తీక్ష్ణశ్చతుర్థభాగే ప్రబోధనోధఃకృశో ద్విమూర్ధా చ 50
స్థూలోష్ఠబాహురున్నతతనుః పృథుశిరోరుహాంసస్స్యాత్,
పంచమజః పృథువక్షాః పరాశ్రయోద్బద్ధజంఘశ్చ 51
స్నిగ్ధచ్ఛవిస్సువాక్యశ్శస్తతనుశ్శాస్త్రకృతమతిప్రచురః,
లిపిలేఖ్యకలాభిజ్ఞస్సుమనాష్షష్ఠాంశజో విహారీచ 52
హ్రస్వవదనోన్నతాంసస్స్నిగ్ధభుజోఽంతే చ కేశగౌరస్స్యాత్,
సప్తమజః పృథుజఠరః పృథుతరచరణాంబుఫీరుశ్చ, 53
సుకుమారగౌరపీక్షశ్చిత్రోన్నతదృక్ప్రచండమానీ స్యాత్,
వ్యాలంబపీనబాహుః పింగలరోమాష్టమే జాతః. 54
ఖ్యాతో మృదుసుఖమూర్తిర్విశాలనేత్రో బలాసదృశసత్వః,
చతురో నవమేఽంశే స్యాన్నతాంసలేఖ్యాదివిద్వాంశ్చ. 55

కన్యారాశియొక్క ప్రథమాంశమున జన్మించిన వేడివంటికండ్లు వాగ్ధాటిదాన గుణముసంభోగసామర్థ్యముధనము నల్లనిదేహము ఉదారమగుహృదయము గలవాఁడగును. ద్వితీయాంశమున జన్మించిన విశాలమగుముఖము మంచినేత్రములు మంచిస్నేహము మృదువగుమాటలు వ్రేలాడుబొజ్జ చపలబుద్ధి పెద్దపెద్దతొడలు గలవాఁడగును. తృతీయాంశమునజన్మించిన స్ఫుటమగుముక్కు బలిసినవియుం శ్రేష్ఠములైనవియుం నగుకాళ్లు బలిసినభుజములు స్పష్టమైనమాటలు కన్యతోటిసహవాసము గలవాఁడగును. చతుర్థాంశమున జన్మించిన పండితుఁడు స్త్రీలోలుఁడు సుకుమారి అందమై ఎఱుపుపసుపుకలిసిన వర్ణమువంటి దేహముగలవాఁడు, మిక్కిలికోపము జ్ఞానముగలవాఁడు, చిక్కినవాఁడు

రెండుతలలుగలవాఁడు అగును పంచమాంశమునజన్మించిన లావైనపెదవులు బాహువులు గొప్పశరీరము పొడవగువెంట్రుకలు గొప్పమూఁపు వెడల్పగుఱొమ్ము ఇతరులనాశ్రయించుట పిక్కలుపట్టుకొనుట మున్నగునవి గలవాఁడగును. షష్ఠాంశమున జన్మించిన నిగనిగమెఱయుదేహము మంచిమాటలు శాస్త్రపరనమువలన సంస్కారమునొందినబుద్ధి వ్రాయుట చిత్తరువులవ్రాయుట చతుష్షష్టికళలు మంచిమనస్సు ఉపకారము గలవాఁడగును. సప్తమాంశమునజన్మించిన చిన్నముఖము గొప్పమూఁపు సన్ననిబాహువులు నల్లనివై కొననఎఱుపురంగుగలవెంట్రుకలు గొప్పకడుపు పెద్దపాదములు చాలాభయము గలవాఁడగును అష్టమాంశమున జన్మించిన సౌకుమార్యము, పొడవై పచ్చనైన దేహము చిత్రములై పెద్దవైనకండ్లు గొప్పకోపము వ్రేలాడుపొడవైనబాహువులు పచ్చనివెంట్రుకలు గలవాఁడగును. నవాంశమునజన్మించిన ప్రఖ్యాతి మార్దవము సౌఖ్యము విశాలములగునేత్రములు మిక్కిలిగొప్పబలము నేర్పు వంగినభుజములు వ్రాయచదువనేర్పు గలవాఁడగును.

తులాంశయందు:—

గౌరో విశాలనేత్రశ్శ్మాశ్రు దీర్ఘాననోఽర్ధగోష్ఠా స్యాత్,
సవపఙ్క్త్యేకస్మిన్కుశలస్తులాధరాద్యంశజస్సువిఖ్యాతః. 56
ప్లుతమండలనేత్రస్స్యాత్కరాళదంతోసిమగ్నమధ్యస్తు,
లిఙ్గే విస్మృతిహృది యుక్తః కుతనుర్ఘనసంహతభ్రూశ్చ 57
గౌరోఽశ్వముఖస్సుదీర్ఘో మహోన్నతాంసః కృశోఽపి లబ్ధయశాః,
దీర్ఘాంఘ్రిః మహాఘోణస్తృతీయజస్స్యాత్సుచరణశ్చ. 58
తన్వంసబాహుభిర్యస్తూన్నతదంతః కృశో మృగతకలదృక్,
హ్రస్వనసస్సువివాదీ శ్యామో శీలశ్చతుర్థజో భవతి. 59
గంభీరదృక్ఘనరక్తో సుహృత్ప్రియః పంచమే హ్యమానీ స్యాత్,
ఖరకేశస్సమనేత్రో మధ్యప్రతిలగ్నఘోణావృష్టిశ్చ. 60
పీనాంగో గౌరస్స్యాద్వి శాలనేత్రస్సునాశకాపంశః,
స్నిగ్ధనసస్సనయజ్ఞష్షష్ఠేఽంశే శాస్త్రవిజ్ఞాతః 61
రక్తావదాతమతిమాన్స్తుంగహ్రస్వతనుః కృశో లలాటే స్యాత్,
లుబ్ధః ప్రచండదుర్గస్సప్తమభాగే మనస్వీ చ. 62
తుంగాంసగండభోక్తా కఠినతనుర్దీర్ఘకృష్ణభ్రూః,
నిర్భిక్తవాక్పరిశాంతస్సద్వ్రతేష్వర్థమస్తకోఽష్టమజః 63

స్వక్షః ప్రసన్నగౌరస్సుమచారుతనుః పటుః కలాభిరతః,
దాక్షిణ్యహాస్యనిరతో విటస్వభావో భవేన్నవమే. 64

తులాలగ్నముయొక్క ప్రథమాంశమునఁ బుట్టిన పచ్చనిశరీరము పెద్దకండ్లు గొప్పఖ్యాతి పొడవగుముఖము ధనమునార్జించి కూడబెట్టుట నూత్నవ్యాపారము నారంభించుట గలవాఁడగును ద్వితీయాంశమునజన్మించిన గుండ్రనికండ్లు పొడవగుపెంతములు సన్ననినడుము విశాలమగువక్షస్థలము చెడ్డదేహము మంచిదట్టమగుకనుబొమలు గలవాఁడగును. తృతీయాంశమున జన్మించిన పచ్చనిదేహము గుజ్జువంటిముఖము మంచిదంతములు విశాలములగునేత్రములు సన్ననిశరీరము గొప్పకీర్తి పొడవగుకోళ్లు ముక్కు మంచిపాదములు గలవాఁడగును చతుర్థాంశమున జన్మించిన సన్ననిమూపు చేతులు మిక్కిలిభయము పొడవగుదంతములు లేడివలె చంచలములగునేత్రములు పొట్టిముక్కు ఎల్లపుడుదుఃఖములు నల్లనిశరీరము గలవాఁడగును. పంచమాంశమునఁ జన్మించిన గంభీరమైనచూపు నిలకడగలమనస్సు స్నేహితులయెడప్రేమ అభిమానములేకపోవుట బిరుసైన వెంట్రుకలు మంచినేత్రములు నడుమవంగినముక్కు గర్వము గలవాఁడగును. షష్ఠాంశమునజన్మించిన బలిసినశరీరము పచ్చనిదేహము విశాలములగునేత్రములు వెదురువలె పొడవగుముక్కు నీతిశాస్త్రమున మంచినేర్పు శాస్త్రవిజ్ఞానము గలవాఁడగును. సప్తమాంశమున జన్మించిన అనురాగము గలవారినుద్ధరించుబుద్ధి మిక్కిలిపొట్టిదేహము సన్ననినుదురు లోభము ఇతరులుచూరరానిదుర్గములు అభిమానము గలవాఁడగును. అష్టమాంశమున జన్మించిన పెద్దమూపు వెడల్పైనచెక్కిళ్లు కఠినమైనదేహము పొడవై నల్లనైనకనుబొమలు స్ఫుటమగుమాటలు ప్రశాంతి మంచిబొమ్మ చిన్నతల గలవాఁడగును. నవమాంశమునజన్మించిన మంచినేత్రములు పచ్చని అందమగుదేహము దేహపుష్టి కళలనేర్పు దయ పరిహాసము విటచేష్టలు గలవాఁడగును.

వృశ్చికరాశియందు:—

ప్రాంశోన్నతోష్ఠఘోణస్సులలాటస్స్యాద్దృఢాంగగౌరశ్చ,
దర్దురకుక్షిర్ఘటకోఽష్టమరాశౌ ప్రథమనవభాగే. 65
గౌరఃపృథ్వాయతహృద్బాహుస్తామ్రోగ్రదృగ్ద్వితీయే స్యాత్,
ఉద్వృత్తబలనిహంతా సాహసకృదనల్పకేశశ్చ. 66
ప్రాజ్ఞదృఢాంసబాహుః ప్రయత్నకోశో విశుద్ధవాక్యస్స్యాత్,
శానీనకో వపుష్మాన్ గౌరోరుచిరాధర స్తృతీయేఽంశే. 67

పరదారద్రోహరతిః క్షేత్రాధిపశ్చతుర్థజో దీర్ఘః,
శ్యామోఽసితకేశాక్షో నటప్రగల్భశ్చ పీనరోమాంసః 68
గంభీరస్తామ్రాక్షో మగ్ననసః పంచమే ధీరః,
మృష్టోదరోగ్రకర్మా వ్యస్తదృఢాంగో యశస్వీ స్యాత్. 69
ధృష్టో వరిష్ఠబుద్ధిః పృథ్వాస్యనసో గభీరసత్వః స్యాత్,
సుజనః ప్రచండకర్మా షష్ఠే దక్షోఽల్పకచఘనభ్రూశ్చ 70
దారితముఖః స్థిరాంగః ప్రవిరళరదనోఽపనద్ధాంగః,
నిమ్నోదరః ప్లవాక్షస్స్యాత్సప్తమే భవేదంశే 71
స్ఫుటితాగ్రనఖతలో విపన్నశీలో మలీమసాంగస్స్యాత్,
భిన్నోష్ఠకైశ్శనైర్జై స్సంత్యక్తమతిస్తథాష్టమజః. 72
గౌరో మృగాక్షతామ్రనఖః ప్రశాంతపింగాక్షో మృదుపీనః,
సుసమేతశ్చ గుణానాం మతః ప్రజాతో నవమభాగే. 73

వృశ్చికరాశియొక్క ప్రథమభాగమున జన్మించిన పొట్టిపెదవులు పొడుగైన ముక్కు మంచిలలాటము పుష్టిగల్గి పచ్చనైనశరీరము కప్పవంటిపొడుపు గలవాఁడగును. ద్వితీయాంశమున జన్మించిన పచ్చనిదేహము మిక్కిలిపొడవైనబాహువులు ఎఱ్ఱని భయంకరములగునేత్రములు మిక్కిలి బలిసి గర్వించినవారినిఁగూడ ఓడించుశక్తి సాహసము చాలావెంట్రుకలు గలవాఁడగును. తృతీయాంశమున జన్మించిన తెలిసినవాఁడు, దృఢములైన బాహువులు మూపుగలవాఁడు, ప్రయత్నపూర్వకముగా సంపాదించి కూడఁబెట్టిన ధనముగలవాఁడు, పరిశుభ్రములగుమాటలు మంచిదేహము అందమగుపెదవులు గలవాఁడు, కన్యాగర్భమునఁబుట్టువాఁడు నగును. చతుర్థాంశమున జన్మించిన ఇతరులభార్యలకు ద్రోహముసల్పువాఁడు, అందర నాక్షేపించువాఁడు, ధైర్యవంతుఁడు, నల్లని పొడవైనవాఁడు, నల్లనికండ్లు వెంట్రుకలు గలవాఁడు, నాట్యమున నేర్పరి బలిసినమూపు గలవాఁడగును. పంచమాంశమున జన్మించిన గంభీరమైనవాఁడు, ఎఱ్ఱనికండ్లుగలవాఁడు, వంగిన ముక్కు ధైర్యము గొప్పఉదరము భయంకరములగుపనులు ఎగుడుదిగుడై బలముగలఅవయవములు గొప్పకీర్తియు గలవాఁడగును. షష్ఠాంశమున జన్మించిన దుర్మార్గుఁడు, తీక్ష్ణమైనబుద్ధి పొడవైనముక్కు గొప్పబలము తీక్ష్ణములగుపనులు నర్పుకొలది వెంట్రుకలు గొప్పకనుబొమలు గలవాఁడగును. సప్తమాంశమున జన్మించిన పగిలినముఖము స్థిరములగు అవయవములు విడివిడిగానుండుదంతములు వంగినతల లోతైనపొట్ట గుండ్రనికండ్లు జీర్ణమైనశరీరము గలవాఁడగును. అష్టమాంశమున జన్మించిన వంకరముక్కు నల్లనిదేహము

చెడ్డనడవడి జాస్తిమెంట్రుకలుగల్గి చాలిచిదగచే బుద్ధిచెదరుట మున్నగునవి గలవాఁడగును. నవమాంశమున జన్మించిన సింహమువలె పచ్చని దేహము శాంతములగుపచ్చనికండ్లు దేహమున రోమములు గలవాఁడు, గురుభక్తుఁడైనవాఁడు అగును

ధనుస్సునందు:—

సుబృహన్నసోజదృష్టిస్స్ఫుటాగ్రభాషీ సుదంతరోమా చ,
గౌరస్సుబద్ధవృషణ శ్చాపాద్యంశే ప్రచండస్స్యాత్ 74
ప్రోత్తుంగశంఖో స్థిరపదస్తీక్ష్ణాక్షి గుయస్థిరాయశ్చ,
విక్రాంతాక్షిననో దీర్ఘో మహాహనుస్స్యాద్ద్వితీయేంశే. 75
శిల్పీశాస్త్రమతజ్ఞః ప్రగల్భగంభీరమూర్తిసునయశ్చ,
స్త్రీవల్లభో మనస్వీ తృతీయజో హాస్యశిల్పజ్ఞః. 76
దక్షో మధుమండలదృగ్గౌరః కృచ్ఛ్రప్రవృద్ధమతిస్స్యాత్,
ప్రాజ్ఞోటనస్సుకేశః పృథుశుభమూర్తిశ్చతుర్థే స్స్యాత్. 77
పృథుకంఠ నేత్రవదనః ప్రవృద్ధహారివిగ్రహో మహాభోగస్స్యాత్,
పీనోన్నతాంసహంతా పంచమజో రూక్షరోమదృఢబుద్ధిః. 78
స్నిగ్ధాసితాంతపృథుదృఙ్మహాలలాటస్సువృత్తికావ్యరతః,
పృథుపీనముఖో హీన షష్ఠే విద్వాన్కథాభిరతః. 79
శ్యామో మృదుర్వచస్స్య తుంగశిరా స్సంగ్రహానుసంధిరతః,
దీర్ఘో విశాలనయనో దాక్షిణ్యపటుశ్చ సప్తమజః. 80
చిపిటాగ్రనాసికస్స్యాద్ద్వివర్ణశిరాస్సుబద్ధపైరశ్చ,
విభ్రాంతదృక్ప్రలాపి గురుష్వభిమతోఽష్టమాంశభవః. 81
గౌరోహాయాకృతిముఖో దీర్ఘాసితదృక్తథాల్పవాక్యస్స్యాత్,
సత్యస్సతాం విషాదీ నవమే కుటిలోరుజంఘశ్చ. 82

ధనుర్లగ్నముయొక్క ప్రథమాంశమున జన్మించిన పెద్దముక్కు మేకవంటికండ్లు స్ఫుటమైనమాటలు మంచిదంతములు రోమములు పచ్చనిదేహము గొప్పవృషణములు తీక్ష్ణమగుస్వభావము గలవాఁడగును. ద్వితీయాంశమునజన్మించిన పొడవైనతల స్థిరమైన బుద్ధి విశాలములగునేత్రములు గొప్పపెదవులు తొడలు వంకఱముక్కు పొడవైనదవడలు పొడవగుశరీరము గలవాఁడగును. తృతీయాంశమున జన్మించిన శాస్త్రము నెఱిఁగిన బుద్ధి గాంభీర్యమైనవిగ్రహము నీతిశాస్త్రముననేర్పు స్త్రీలవిషయమునసౌందర్యము అభిమానము వివాహము శిల్పశాస్త్రజ్ఞానము గలవాఁడగును. చతుర్థాంశమునజన్మించిన నేర్పు

గంభీరదృక్సుఘోణో రక్తాస్యో భిన్ననఖశిరోజస్స్యాత్,
ఉద్బద్ధతనుశ్శక్తో౽ష్టమజో ఘటపృథులగాటశ్చ 90
విపులాక్షిహృత్సుమేధాః పూర్ణముఖో గీతవాద్యనిరతశ్చ,
మాధుర్యసత్వయుక్తస్సాధు ర్నవమే భవే త్సుజనః. 91

మకరలగ్నముయొక్క ప్రథమాంశమున జన్మించిన నడుమనడుమ సందులుగల దంతములు నల్లనిదేహము ఒకదానికొకటి సంబంధములేనిమాటలు వాడిగలశిరస్సు పొడవగుగోళ్లు మోకాళ్లు గానమున హాస్యమునప్రీతి మార్గాయాసములేకపోవుట ధనవంతుఁడు, సన్ననివాఁడు అగును. ద్వితీయాంశమున జన్మించిన సోమరి శరుఁడు వంకరముక్కు గానమునప్రీతి విశాలమగుశరీరము స్త్రీలయందు ఎక్కుడుప్రీతి బహుభాషిత్వముగలవాఁడగును. తృతీయాంశమునజన్మించిన గానమున చతుష్షష్టికళలయందు కామశాస్త్రమున అభిమానము ఖ్యాతివచ్చునికండ్లు మంచిముక్కు అనేకస్నేహితులు బంధువులప్రీతి మంచికర్మపరాయణుఁడు అగును. చతుర్థాంశమునజన్మించిన ఎఱ్ఱని గుండ్రనినేత్రములు గొప్పనుదురు భుజములుచిక్కినశరీరము పలచనిజుట్టు నడుమనడుమ సందులు గలదంతములు గలవాఁడగును పంచమాంశమున జన్మించిన పొడవైనముక్కు పెద్దకడుపు నల్లని గుండ్రనితొడలుగలవాఁడు, గొప్పభుజములు స్థిరములగుకార్యారంభముల గలవాఁడగును. షష్ఠాంశమునజన్మించిన నిగనిగమగుశరీరము మంచివేషముగలవాఁడు, కాముకుఁడు, చిన్నసన్నని దంతములుగలవాఁడు, మంచివక్త పెద్దదవడలు వెడల్పగునుదురు గలవాఁడగును. సప్తమాంశమున జన్మించిన నల్లనివాఁడు, సోమరి మంచివక్త ఉష్ణప్రకృతి గల్గి విశాలమగుదేహము మృదువులగుపాదముల చేతులుగలవాఁడు, బుద్ధిమంతుఁడు, మంచినడవడిగలవాఁడు అగును. అష్టమాంశమున జన్మించిన గంభీరమగుచూపు మంచిముక్కు ఎఱ్ఱనిముఖము చిట్లినగోళ్లు వెంట్రుకలు బిగిసినదేహము ఘటమువలె విశాలమైన నుదురు గలవాఁడగును నవమాంశమున జన్మించిన విశాలములగునేత్రములు హృదయము మంచిబుద్ధి విశాలమగుముఖము గానమున వాద్యమున నేర్పు మాధుర్యము బలము సౌజన్యము గలవాఁడగును.

కుంభలగ్నమందు:—

శ్యామో మృదుః కృశాంగః క్షీణహనుశ్శాస్త్రకావ్యమతిః.
కామీ రతిమాన్కాంతః కుంభస్యాద్యంశకే భవేజ్జాతః. 92
త్య్వజ్మఖదృష్టిశిరోజైః ఖరైశ్చ సువిషన్నవత్సలస్సాధుః,
దీర్ఘో విశిరా మూర్ఖో ద్వితీయభాగే భవేజ్జాతః. 93

సంస్కృతనుః ప్రమదాప్రియశ్చ వైదూర్యకాంతిధరః,
శాస్త్రార్థవిత్ప్రియోక్తా తృతీయ నవభాగసంజాతః 94
కాంతానురతో గార్తో విదారితాస్యో రిపుప్రణాశకరః,
గంభీరధీరసత్వ శ్చతుర్థజో భోగరతియుక్తః. 95
స్పష్టార్థవిత్కలాజ్ఞః ఖరరోమధరాంఘ్రిరుగ్రస్స్యాత్,
సంరుద్ధగండకర్ణః పంచమజః కృష్ణవర్ణశ్చ 96
వ్యాఘ్రాననః ప్రగల్భః కుంచితకేశస్సునిశ్చితార్థశ్చ,
వ్యాలమృగోరగహంతా షష్ఠేంశే వల్లభో నృపతేః. 97
మేషాక్షిముఖస్తీక్ష్ణో గ్రామ్యరతి స్త్రీషు పరిభూతః,
పిత్తపగర్దితదేహ స్సప్తమజ స్సత్వాధృతియుక్తః 98
స్థిరసత్వబుద్ధి రతిమాన్నరేంద్రయోధో నరేశ్వరస్సుభగః,
స్థూలరదో విపులాక్షః కుంభే స్యా దష్టమేంశకే పురుషః. 99
శ్యామస్సమగ్రదశనో విశేషితస్సుధనదారపుత్రశ్చ,
నవమాంశజస్సువాక్యః ప్రథితశ్శక్తో భవేత్పురుషః 100

కుంభలగ్న ప్రథమాంశమున జన్మించిన నల్లనివాఁడు, మృదువైనవాఁడు, చిక్కిన వాఁడు, బలిసినదవడలుగలవాఁడు, శాస్త్రములయందు కావ్యములయందు నాసక్తిగల వాఁడు, కాముకుఁడు, రతిగలవాఁడు, సౌందర్యవంతుఁడు అగును. ద్వితీయాంశమున జన్మించిన తీక్ష్ణములగుశరీరము గోళ్లు వెంట్రుకలు చూపుగలవాఁడు, దుఃఖించువారి నాదరించువాఁడు, సత్పురుషుఁడు, పొడవైనవాఁడు, చెడ్డతలగలవాఁడు, మూర్ఖుఁడు అగును. తృతీయాంశమున జన్మించిన మెత్తకశరీరము స్త్రీలయెడప్రీతి వైదూర్యమువంటి కాంతి శాస్త్రజ్ఞానము గలవాఁడగును చతుర్థాంశమునజన్మించిన స్త్రీలయెడప్రీతి పచ్చని దేహము నోటిపూతగలవాఁడు, శత్రునాశ మొనర్చువాఁడు, గాంభీర్యము ధైర్యము భోగము రతిగలవాఁడగును. పంచమాంశమున జన్మించిన స్పష్టముగా అర్థముతెలిసిన వాఁడు, చతుష్షష్టికళావేత్త బిరుసైనవెంట్రుకలు పెదవులు పాదములుగలవాఁడు,మిక్కిలి కోపము దవడలకానుకొనిన చెవులు నల్లనిదేహము మున్నగునవి గలవాఁడగును. షష్ఠాంశమునజన్మించిన పెద్దపులివంటి ముఖముగలవాఁడు, ఒప్పించిసామర్థ్యముగలవాఁడు, పొట్టి వెంట్రుకలు గలవాఁడు, సర్వార్థముల నెఱిఁగినవాఁడు, సర్పములను మృగములను సంహ రించువాఁడు, రాజునకు ప్రేమగలవాఁడు అగును. సప్తమాంశమున జన్మించిన మేకవంటి కండ్లు ముఖముగలవాఁడు, మిక్కిలికోపముగలవాఁడు, గ్రామ్యరతి స్త్రీలవలన పరాభవము

గలవాఁడు, పైత్యరోగము బలము ధైర్యము గలవాఁడగును. అష్టమాంశమున జన్మించిన స్థిరమగుబలము బుద్ధి రతిఁగలవాఁడు, రాజసేవకుఁడు, రాజు సౌందర్యవంతుఁడు, పెద్దపెద్ద పండ్లు విశాలములగునేత్రములుం గలవాఁడగును నవమాంశమున జన్మించిన నల్లనివాఁడు, కొనలుగల దంతములుగలవాఁడు, ధనము భాగ్యపుత్రులుగలవాఁడు, మంచిమాటలు ప్రఖ్యాతి గలవాఁడగును

మీనరాశియందు:—

గౌరోఽపి రక్తదేహః ప్రభామృదుస్త్రీష్వనుతిప్రచలచిత్తః,
హ్రస్వగలః కృశమధ్యో మీనస్యాద్యాంశకే పురుషః. 101
పృథుపీనముగ్రనాసః క్రియాపటుర్మాంసభుగ్రుచిరదేహః,
కాననపర్వతచారీ బృహచ్ఛిరాస్స్యాద్ద్వితీయేంశే. 102
గౌరశ్శఠస్సుచతుశ్శస్తతనుర్ధర్మవాన్సువిద్వాంశ్చ,
దాక్షిణ్యవాన్సునీతస్తృతీయజో రూపవాంశ్చతురః 103
గుణవాన్విపన్నశీలః ప్రవృద్ధసేవీ క్రియాపటుర్విద్వాన్,
సత్వాధికో నయజ్ఞస్తుంగనసస్స్యాచ్చతుర్థే తు 104
దీర్ఘోఽసితః ప్రతాపీ తుంగాంగస్స్వల్పనాసికస్స్వతః,
హింసారతిశ్శుభరదో దుష్ప్రసహః పంచమే ప్రతాపీ స్యాత్. 105
కాంతః ప్రతాపగుణవాన్ప్రసన్నవంశోఽల్పనాసికోమానీ,
తిర్యగ్వదనః ఖ్యాత షష్ఠేంశే స్యాత్తథా నిపుణః. 106
పురుషాభిమానపరకృద్ధర్మరుచిశ్శ్రేష్ఠగశ్చ సచివస్స్యాత్,
ప్రబలో విషాదశీలశ్శూరోఽస్థిర స్సప్తమే భాగే 107
దీర్ఘో బృహచ్ఛిరాస్స్యాత్ప్రాంశోఽలసో రూపనేత్రకేశశ్చ,
మందాత్మజోఽర్థనిరతో రణవశలో హ్యష్టమే భాగే. 108
హ్రస్వో మృదుస్సుధీరో విశాలవక్షో ఘనాసికస్స్నిగ్ధః,
విహితాంగబుద్ధిగుణవాన్నవమేంశే స్యాత్సుమాఖ్యాతః 109

మీనలగ్నమున ప్రథమాంశమున జన్మించిన పచ్చనివాఁడైనను ఎఱ్ఱనిదేహముగల వాఁడు, మృదువైనవాఁడు, ఆడబుద్ధి చంచలమగుమనస్సు పొట్టిమెడ సన్నని నడుము గలవాఁడగును. ద్వితీయాంశమున జన్మించిన పొడవై లావైన భయంకరమగుముక్కు— [redacted]శక్తి లావైనశరీరము అందమగుదేహము అరణ్యముల పర్వతముల సంచ

ప్రథమవహోరయందు ప్రశ్న జేసెనేని సూర్యుఁడు ఉత్తరాయణమగు మకరాదిషట్క మందుండఁగా జననమనియు, ద్వితీయవహోరయందు ప్రశ్న జేసెనేని దక్షిణాయనమగు కర్కాటాదిషట్కమందుండఁగా జననమనియు తెలియతగినదని భావము.

ఋతుర్వాచ్యో దృగాణాంశే లగ్నసంస్థేపివా గ్రహైః,
అయనస్య విలోమేతు పరివర్తః పరస్పరమ్. 2

గ్రహయోనిభేదాధ్యాయమందు శ్లో. ౧౭ "శశిరాదీనా మీశా శ్శనిసితభౌమేందుబుధజీవాః." అని చెప్పఁబడియున్నదిగాన ప్రశ్నలగ్నమందు శనియున్నను శనిద్రేక్కాణమైనను శిశిరఋతువునందు జననమనియు ప్రశ్నలగ్నమందు శుక్రుఁడున్నను శుక్రద్రేక్కాణమైనను వసంతఋతువునందనియు, ప్రశ్నలగ్నమందు కుజుఁడున్నను కుజద్రేక్కాణమైనను గ్రీష్మఋతువునందనియు, ప్రశ్నలగ్నమందు చంద్రుఁడున్నను చంద్రద్రేక్కాణమైనను వర్షఋతువనియు, ప్రశ్నలగ్నమందుఁ బుధుఁడున్నను బుధద్రేక్కాణమైనను శరదృతువనియు, ప్రశ్నలగ్నమందు గురుఁడున్నను గురుద్రేక్కాణమైనను హేమంతఋతువనియు జననము తెలియతగినది. లగ్నమం దనేకులుండిరేని బలాధికముచే తెలియతగినది. గ్రహశూన్యమాయె నేని ద్రేక్కాణము ననుసరించియే తెలియతగినదని భావము. ఇట్లు ఋతునిర్ణయము చేయఁగా అయనవ్యత్యయము గలిగెనేని చెప్పఁబోవురీతిన నిర్ణయించతగినదని భావము.

శశిజ్ఞగురుభి స్సార్థం సితలోహితసూర్యజైః,
ద్రేక్కాణేఽర్థే భవేత్పూర్వో మాసఃపూర్వః పరేపరః. 3

అయనవ్యత్యయము గలుగుచుండఁగా శుక్రఋతువయ్యెనేని చంద్రఋతువనియు, కుజఋతువయ్యెనేని బుధఋతువనియు, శనిఋతువయ్యెనేని గురుఋతువనియు తెలియతగినది. అనఁగా ఉత్తరాయణమందు వర్షఋతువని తెలిసెనేని వసంతఋతువందు జననమనియు, దక్షిణాయనమందు వసంతఋతువని తెలిసెనేని వర్షఋతువందు జననమనియు, ఉత్తరాయణమందు హేమంతఋతువని తెలిసెనేని శిశిరమందు జననమనియు, దక్షిణాయనమందు శిశిరమని తెలిసెనేని హేమంతమందు జననమనియు, ఉత్తరాయణమందు శరదృతువని తెలిసెనేని గ్రీష్మర్తువందు జననమనియు, దక్షిణాయనమందు గ్రీష్మఋతువని తెలిసెనేని శరదృతువునందు జననమనియుఁ జెప్పతగినది. మాసము తెలియుక్రమం బెట్లనిన: ప్రశ్నలగ్నముయొక్క ద్రేక్కాణభాగలు ౧౦ టిలో మొదటి ౫ భాగలయందు ప్రశ్న జేసెనేని వచ్చిన ఋతువులో మొదటిమాస

మనియుం ప్రశ్నలగ్నద్రేక్కాణభాగలు ౧౦ టిలో ఉత్తరార్ధమందున్న ౫ భాగల యందు ప్రశ్న జేసెనేని వచ్చిన ఋతువులో రెండవమాసమనియుఁ దెలియతగినది.

అనుపాతాత్తిథిః కల్ప్యా కేచిదాహురినాంశజాం,
లగ్నభాగైర్ద్విరభ్యస్తైః పంచభిర్లబ్ధ్యతే గురుః 4

ద్రేక్కాణమునకు ౬౦౦ లిప్తలు. ఆద్రేక్కాణార్ధమైన ౩౦౦ల లిప్తలచేత మాసము జెప్పెదము. గనుక మరికొన్ని లిప్తల కొక్కొక్క తిథిప్రకారముగా ఆద్రేక్కాణమం దెన్నిలిప్తలు జెల్లెనో దెలిసుకొని తిథినిర్ణయము జేయుతగినది. కొందఱు ప్రశ్నకాలమున సూర్యుఁడున్న రాశియందు ఎన్నిభాగలు భుక్తములై యుండునో అన్నితిథులు జన్మమాసమందు శుక్లప్రతిపదాదిగా గతించినవని యెఱిఁగి తత్కాలమాసమందు సూర్యుఁడెన్నవభాగయందుండునో అన్నవతిథియందు జననమనియుఁ జెప్పతగినదని జెప్పుదురు. ప్రశ్నలగ్నమం దెన్నిభాగలు భుక్తములగునో ఆభాగలను ౨ చే గుణించి ౫ చే భాగించఁగా లబ్ధము ప్రశ్నలగ్నము మొదలు గురుఁడున్నరాశి యని తెలియతగినది. అనఁగా రాశికి ముప్పదిభాగలుగాన రెండున్నరభాగ కొక్కొక్కరాశియందు గురుఁ డుండునని భావము.

వయోనుమానాద్వర్షాణి ద్వాదశఘ్నాని కల్పయేత్,
రాత్రిరాత్రనామధేయేషు విలోమాజ్జన్మసంభవః. 5

దృష్టాంతరప్రశ్న జేసినవాని ఆకారమును జూచి వీనికి ఇన్నిసంవత్సరముల వయస్సుండునను ఊహావల్ల సంవత్సరములను కల్పించి చెప్పవలయును. ఎట్లనిన: బృహస్పతి ౧౨ సంవత్సరముల కొక్కమారు ద్వాదశరాశిసంచారము సేయును. గనుక పూర్వోక్తప్రకారముగా జన్మకాలమున గురుపున్నరాశి నెఱింగి వర్తమానముగు ఈసంవత్సరమున ఈరాశియందుండెనుగదా రమారమిగా ఇన్ని గురు భగణములును గతించియుండవచ్చునని దెలిసికొని తదుపరి వీనిజననం బీసంవత్సరమందని నిశ్చయించి చెప్పతగినది. దివారాత్రులు దెలియుక్రమం బెట్లనిన: రాత్రిసంజ్ఞలైన మేషవృషభమిథునకర్కటకధనుర్మకరములలో నొకటి ప్రశ్నలగ్నం బాయెనేని పగలు జననమనియుం, దివాసంజ్ఞలైన సింహకన్యాతులావృశ్చికకుంభమీనములలో నొకటి ప్రశ్నలగ్నంబాయెనేని రాత్రి జననమనియుం తెలియతగినది.

లగ్నభాగైః క్రమేణైవ వేలామ్యగ్యాఽనుపాతతః,
లగ్నత్రికోణరాశీనాం యో బలీ జన్మకృద్భవేత్. 6

ప్రశ్నకాలమున లగ్నగతలిప్తలను దెలిసికొని ఆలిప్తలను రాత్రియందు జననమాయెనేని దివాప్రమాణముచే గుణించి రాత్రిప్రమాణముచే భాగించఁగా రాత్రి జననఘటికలేర్పడును. పగటియందు జననమాయెనేని ఆలిప్తలను రాత్రిప్రమాణముచే గుణించి దివాప్రమాణముచే భాగించఁగా పగటియందైన జననకాలఘటికలేర్పడును. లగ్నకాలపరిమాణములలో ఏరాశి ఉత్తమబలయుక్తమై యుండునో ఆరాశియందు చంద్రుఁడుండఁగాఁ బుట్టెనని చెప్పఁగినది.

శీర్షాదసంస్పృశేత్స్పృష్టా పృచ్ఛేత్తద్రాశిమాదిశేత్,
యావద్గతిశ్చ లగ్నాచ్చంద్రాత్తావతి జన్మభమ్. 7

పూర్వమందు చెప్పఁబడియున్న కాలపురుషుని అంగములలో ఏరాశి యుండెడు అంగమును పృచ్ఛకుఁడు స్పృశించునో ఆరాశియందు చంద్రుఁడుండఁగాఁ బుట్టెనని యైనను జెప్పవచ్చును. చంద్రుఁడు ప్రశ్నలగ్నము మొదలు ఎన్నవరాశియందుండునో చంద్రుఁడున్నరాశి మొదలు అన్నవరాశియందు జన్మమని తెలియవలెనని.

మీనోదయే వదేన్మీనం లగ్నాంశసదృశోదయం,
లగ్నాద్భానుదృగాణే చ యావత్యర్కాచ్చ తావతి. 8

మీనము ప్రశ్నలగ్నమయ్యెనేని మీనమందు చంద్రుఁడుండఁగా జననమని తెలియవలెనది. ప్రశ్నలగ్నమున ఏరాశిసంబంధమైన నవాంశ ముదయించునో ఆ రాశియే జన్మలగ్నమగునని తాత్పర్యము. మరియు ప్రశ్నలగ్నద్రేక్కాణము మొదలు రవియున్నద్రేక్కాణమువరకు లెక్కింపఁగా ఎన్నియగునో ప్రశ్నలగ్నము మొదలు లెక్కింపఁగా అన్నవరాశి జన్మలగ్నమౌనని తెలియవలెనది. ద్రేక్కాణములు ౧౨ కి అధికమయ్యెనేని ౧౨ పుచ్చి తక్కినవి లెక్కపెట్టి జన్మలగ్ననిర్ణయము జేయవలెనని భావము.

విలగ్నం కథయేత్ప్రాజ్ఞ ఇతి శాస్త్రస్య నిశ్చయః,
లగ్నగే హ్యర్కగే వాఽపి ఛాయాంగుళహతే హృతే. 9
రవిభిర్జన్మశిష్టం హి కథయేదవిశంకితః,
తిష్ఠతశ్శయనస్థస్య నివిష్టస్యోత్థితస్య చ. 10
లగ్నాదికేంద్ర పశ్యాని వదేజ్జన్మనిధౌ క్రమాత్,
భావం విచార్య సకలం యద్యత్తుల్యం తు తత్తదా. 11

మరియొకరీతిని లగ్ననిర్ణయము జెప్పుచున్నాఁడు. ప్రశ్నలగ్నమందున్న గ్రహమును తాత్కాలికగ్రహముగా పెట్టుకొని లిప్తలుజేసి ద్వాదశాంగుళశంకుజనితమైన

టమునకు ౪ ధనుస్సుకు ౯ కుంభమునకు ౧౧ మీనమునకు ౧౨ గ్రహగుణకారములు గురునకు ౧౦ కుజునకు ౮ శుక్రునకు ౭ రవిచంద్ర బుధశనులకు ౫

| మే | వృ | మి | క | సి | క | తు | వృ | ధ | మ | కు | మీ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ౭ | ౧౦ | ౮ | ౪ | ౧౦ | ౫ | ౭ | ౮ | ౯ | ౫ | ౧౧ | ౧౨ |

| ర | చ | కు | బు | గు | శు | శ |
|---|---|---|---|---|---|---|
| ౫ | ౫ | ౮ | ౫ | ౧౦ | ౭ | ౫ |

ప్రశ్నలగ్నమును లిప్తలుజేసి ఈచెప్పఁబడిన క్రమంబున రాశిగుణకారములచే గుణించి తదుపరి ప్రశ్నలగ్నమం దొకగ్రహముండెనేని ఆగ్రహగుణకారము చేతనుం గుణింపవలయును అనేకగ్రహములుండెనేని అన్నిగ్రహముల గుణకారములచేతను గుణింపవలయును. లగ్నము గ్రహశూన్యమయ్యెనేని గ్రహగుణకము లేదనిభావము. తదుపరి సంవత్సర ఋతు మాస తిథి దిన రాత్రి రాశి నవాంశవేళలను ఎఱుంగు తెఱఁగును జెప్పుచున్నాఁడు.—ప్రశ్నలగ్నలిప్తలను రాశిగ్రహగుణకారానంతరమునందు మరల ఆసంఖ్యను నాలుగుతావులయందుంచి అందు మొదటనున్నదాని ౧౦ టను రెండవచోట నున్నదాని ౮ టను మూఁడవచోట నున్నదాని ౭ టను నాలవతావున నున్నదాని ౫ టను గుణించి ఆనాలుగువిధములైన సంఖ్యలయందును నవకదానవిశోధనము జేయవలయును. ఎట్లన· భట్టోత్పలమతానుసారముగ ప్రశ్నలగ్నమందు ప్రథమద్రేక్కాణ మయ్యెనేని ఆనాలుగువిధములైన సంఖ్యలయందును ౯ కూడవలయును ద్వితీయద్రేక్కాణ మయ్యెనేని కూడనక్కరలేదు తీయనక్కరలేదు. తృతీయద్రేక్కాణ మయ్యెనేని ౯ తీయవలయును. ఇట్లు నవకదానవిశోధనము జేసి వక్ష్యమాణప్రకారముగ వర్షాదిసంఖ్యలచేత పాలుగొనఁగా వర్షర్తుమాసాదులు పేర్పడును· ఎట్లనః ౧౦ ట గుణించి నవకదానవిశోధనము జేసినసంఖ్యను పరమాయుఃప్రమాణములైన ౧౨౦ చేత పాలుగొనఁగా శేషము పృచ్ఛకుని వర్తమానవర్షసంఖ్యయగును. కొందఱు ఆసంఖ్యను ౬౦ ట పాలుగొనఁగా ఎన్నిమిగులునో ప్రభవాదిగా అన్నవ సంవత్సరమందు జననమని చెప్పవచ్చునందురు. ఆపదింట గుణించినసంఖ్యనే ఋతువికల్పమైన ౬ ట పాలుగొనఁగా నెన్నిమిగులునో శిశిరాదిగా అన్నవఋతువందు జననమని చెప్పవలయును. ఆఋతుశేషసంఖ్యనే మాససంఖ్యావికల్పములైన ౨ ట పాలుగొనఁగా ౧ మిగిలినేని ఆఋతువునందు మొదటమాసమనియుం, రెండు మిగిలినేని అనఁగా శేషము లేకుండెనేని రెండవమాసమనియుం తెలియఁతగినది. ఈరీతిగా దశసంఖ్యాగుణితసంఖ్యవలన వర్షఋతుమాసములు తెలుసుకొనతగినవి. ఆప్రకారముగనే ౮ ట గుణించి నవకదానవిశోధము జేసినసంఖ్యను పక్షవికల్పమైన ౨ ట పాలుగొనఁగా ౧ మిగిలెనేని శుక్లపక్షమనియుం, శూన్యమయ్యెనేని కృష్ణపక్షమనియుం తెలియఁతగినది. ఆ ౮ ట గుణించినసంఖ్యనే తిథివికల్పమైన ౧౫ ట పాలుగొనఁగా ఎన్నిమిగులునో

మార్జారాదిజననమనియుం, చంద్రుఁడు వృశ్చికద్వాదశాంశయం దుండెనేనియుం లగ్నము వృశ్చికమైనను సర్పవృశ్చికకీటాదిజననమనియుం, చంద్రుఁడు ధనుర్ద్వాదశాంశో త్తరార్ధమం దున్నను లగ్నము ధనురుత్తరార్ధమైనను అశ్వగర్దభాదిజనన మనియుంను, చంద్రుఁడు మకరద్వాదశాంశపూర్వార్ధమం దున్నను లగ్నము మకరపూర్వార్ధమైనను మృగజననమనియుం, ఉత్తరార్ధమందుండెనేని కప్పమొదలగు జలచరజంతుజనన మున్నూ చంద్రుఁడు మీనద్వాదశాంశయందుండెనేనియు లగ్నము మీనమైనను మత్స్యజననమనియుంఁ జెప్పవలయుం.

వర్ణాకృతిప్రభేదాద్గ్రిహయోగనిరీక్షణైర్మునిభిరుక్తాః,
తానహమపి ప్రవక్ష్యే విశేషత స్సారమాదాయ. 6

గ్రహయోగమును దృష్టిని అనుసరించి వర్ణము ఆకృతి మొదలైనవి యోని జన్మభేదములను పూర్వశాస్త్రానుసారముగ అందలిసారమును గ్రహించి విస్తరించి చెప్పఁబోవుచున్నానని భావము.

మేషవృషౌ ముఖగలయోరంసకపాదేషు మిథునమీనౌస్థః,
పృష్ఠోదయపార్శ్వేషు చ నివేశితౌ కర్కికుంభధరౌ. 7
సింహమృగౌ జఘనస్థౌ పశ్చిమచరణే స్థితౌ యువతిచాపౌ,
గుహ్యావృషణప్రదేశస్ఫిక్పుచ్ఛౌ జూకకీటర్క్షౌ 8

చతుష్పాదాది నానావిధములైన జంతువులయొక్క ముఖము మొదలైనవి మేషాదిరాసుల ననుసరించి తెలియఁదగినది. ఎట్లన: మేషము ముఖము, వృషభము కంఠము, మిథునము భుజములు, మీనము పాదములు, కర్కాటకము వీపు, కుంభము రెండుప్రక్కలు, సింహమకరములు జఘనములు. అనఁగా రెండుపిక్కలు, కన్యాధనుస్సులు పాదములయొక్క వెనుకభాగములు, తుల పిఱుఁదులు, వృశ్చికము తోక, తుల గుదస్థానము, వృశ్చికము మేఢ్రవృషణములున్నూ అని తెలియఁదగినది బృహజ్జాతక మునం దీయవయవములు భిన్నముగ నున్నవి.

మిథునాదయ స్తులాంతాస్సవ్యేభాగే చతుష్పదానాం చ,
వామేఝషఘటధరమృగకార్ముకభృద్వృశ్చికాః ప్రోక్తాః. 9

మిథునకర్కాటసింహకన్యాతులలు చతుష్పదాది జంతువులయొక్క సవ్యభాగ మనియుం, వృశ్చికధనుర్మకరకుంభమీనములు వామభాగమనియుం తాత్పర్యము. దీని ననుసరించి పూర్వశ్లోకమందుఁ జెప్పఁబడిన భుజములు పాదములు మొదలైన ప్రదేశ ములయొక్క సవ్యవామభాగముల విమర్శ జేయఁదగినదని భావము.

మేషాదిభిరుదయస్థైరంశైర్వా గ్రహాయుతైశ్చ దృష్టైర్వా,
స్వంస్వం వర్ణం బ్రూయాద్గాత్రే చిహ్నం వ్రణం వాఽపి. 10

వియోనిజంతువర్ణాదులను జెప్పుచున్నాఁడు లగ్నమందు ఏగ్రహముండునో ఆగ్రహమునకుఁ జెప్పఁబోవురీతిని ఏవర్ణము చెప్పఁబడియున్నదో అవర్ణమును వియోని జంతువునకు చెప్పతగినది. లగ్నమందు గ్రహములేనిపక్షమందు ఏగ్రహముచేఁ జూడఁబడుచున్నదో ఆగ్రహముయొక్కవర్ణమును వియోనిజంతువుకుఁ జెప్పతగినది. లగ్నము ఏగ్రహముచేతను జూడఁబడక కూడఁబడక యుండెనేని లగ్నమందు ఏరాశి నవాంశ ముదయించుచున్నదో ఆరాశికి చెప్పినవర్ణమును వియోనిజంతువుకు చెప్పతగినది. అనేకగ్రహములు లగ్నమందున్నను చూడఁబడినను బలవద్గ్రహవర్ణమును బాహుళ్యముగాఁ జెప్పి బలహీనగ్రహవర్ణమును హీనముగఁ జెప్పతగినది. ఆగ్రహములను నవాంశను అనుసరించియే అంగములయందు పుట్టుమచ్చలు వ్రణములు మొదలైనవి తెలియతగినవి.

స్వగృహాంశకసంయోగాద్వింద్యాద్వర్ణాన్పరాంశకే సూతౌ,
సప్తమసంస్థాః కుర్యుః పృష్ఠే రేఖాం స్వవర్ణసమామ్. 11

లగ్నముగాని లగ్ననవాంశముగాని స్వస్వామియుక్తదృష్టమై యుండెనేని అప్పుడు అవర్ణమునే చెప్పవలయును. వియోనిజంతువుయొక్క ఏఅంగమందు ఏగ్రహముండునో ఆఅంగమందు అవర్ణము జెప్పతగినది. సప్తమస్థానమందున్న గ్రహముల చేత వీపునందైన రేఖలను దెలియతగినది.

వీక్షంతే యావంతో వియోనివర్ణాశ్చ తావంతః,
బలదీప్తో గగనచరః కరోతి వర్ణం వియోనీనామ్. 12

ఎన్నిగ్రహములు లగ్నమందుండునో జూచునో అన్నిగ్రహములవర్ణమును దెలియతగినది. బలాధికగ్రహవర్ణము అధికముగ నుండును.

పీతం కరోతి జీవ శ్శశీసితం భార్గవో విచిత్రం చ,
రక్తం దినకరరుధిరౌ రవిజః కృష్ణం బుధ శ్శబలమ్. 13

పసుపుచాయకు బృహస్పతి, తెలుపుచాయకు చంద్రుఁడు, విచిత్రములైన నానా విధవర్ణములకు శుక్రుఁడు, రక్తవర్ణమునకు రవికుజులు, నీలవర్ణమునకు శని, పసురు వన్నెకు బుధుఁడు అధిపతు లగుదురని తాత్పర్యము.

స్వేరాశౌ పరభాగే పరరాశౌ స్వాంశకే తిష్ఠన్,
పశ్య న్గ్రహోఽపి లగ్నం స్వవర్ణవర్ణం తదా కురుతే 14

గ్రహము స్వక్షేత్రమందు పరనవాంశయందైనను పరక్షేత్రమందు స్వనవాంశయందైనను నుండి లగ్నమును జూచెనేని ఆగ్రహవర్ణము గలుగును.

పరిఘుపరివేషజలదైశ్శంకుకవేధైర్ధ్వజైశ్చ వృత్తైశ్చ,
వృషమృగదండైస్సరై ర్వాశక్రధనుః పాంసుభిర్వాఽపి. 15
యద్వర్ణేన వృతస్స్యాద్గ్రహ స్తమిహవర్ణమాదిశేన్మతిమాన్,
స్వాభావికైర్గ్రహాణాం వర్ణైర్వర్ణా భవంతి జాతానామ్. 16

వియోనిజన్మకు కర్తయగు గ్రహము పరివేషాదులచేత ఏవర్ణము గలిగియుండునో బుట్టినజంతువు ఆవర్ణము గలదియగును. అట్లు లేనిచో ఆగ్రహవర్ణమే గలిగియుండునని భావము.

విహగోదితద్రేక్కాణే గ్రహేణ బలినా యుతేచ చరభాంశే,
బౌధేంశేవా విహగా స్థలాంబుజాశ్శనిశశీక్షితాద్యోగాత్. 17

పక్షిజన్మజ్ఞానసాధనము ఎట్లన పక్షిద్రేక్కాణము అనఁగా మిథునద్వితీయద్రేక్కాణము సింహప్రథమద్రేక్కాణము తులాద్వితీయద్రేక్కాణము కుంభప్రథమద్రేక్కాణము పక్షిద్రేక్కాణములు గనుక యేటిలో నొకద్రేక్కాణము శని దృష్టమైకాని యుక్తమైకాని యుండెనేని మెట్టయందైన పక్షిజన్మమును జెప్పవలయును. పక్షిద్రేక్కాణము చంద్రయుక్తమైనను దృష్టమైనను జలపక్షులజన్మమును జెప్పతగినది. ఇది యొకయోగము. బలయుక్తమైన గ్రహముతోఁగూడిన చరరాశిగాని చరనవాంశగాని శనియుతదృష్టమై యుండెనేని స్థలపక్షిజననమున్ను చంద్రయుతదృష్టమై యుండెనేని జలపక్షిజననమున్ను చెప్పవలయును. ఇది రెండవయోగము. జన్మలగ్నమందు బుధనవాంశములగు మిథునకన్యలలో నొకనవాంశము బలవద్గ్రహయుతమై యుండి శనియుతదృష్టమై యుండెనేని స్థలపక్షిజననమున్ను చంద్రయుతదృష్టమై యుండెనేని జలపక్షిజననమున్ను జెప్పవలయును.

లగ్నే జలజే బంధౌ పక్షీ స్యాద్వీక్షితేఽపివా జలజః,
స్థలజే వా తద్దృష్టే గ్రహవర్ణసమస్థలప్రభవః. 18

లగ్నము జలరాశియైనను జలగ్రహముచేఁ జూడఁబడినను జలపక్షియనియును, స్థలరాశిలగ్నమగునేని స్థలపక్షి యనియును దెలియఁదగినది.

లగ్నార్కజీవచంద్రైరబలైశ్శేషైశ్చ మూలయోనిస్స్యాత్,
స్థలజలభవనవిభాగాః వృక్షాదీనాం ప్రభేదకరాః. 19

లగ్నము చంద్రుఁడు రవి గురుఁడు వీరలు బలహీనులై ప్రశ్నకాలమున నుండిరేని వృక్షజన్మ ప్రశ్న జేయుచున్నాఁడని తెలియఁదగినది. అందు స్థలజలవిభాగ మున్ను వృక్షభేదమున్ను జెప్పఁబోవుచున్నాను.

అంతస్సారాన్ వృక్షాన్ భానుర్దుర్గాన్ కరోతి తద్రూపాన్,
క్షీరస్నేహసమేతాన్ శశీ గురుః ఫలసమేతాన్. 20

కటుకంటకినో రుధిరస్సుదుర్భగాస్తరణిజస్తథాశుక్రః,
కుసుమఫలస్నేహయుతాన్ బుధశ్చ బలవర్జితం జనయేత్. 21

జన్మలగ్నమందైన నవాంశాధిపతి రవియయ్యేనేని మధ్యదృఢంబులగు శింశుపాదివృక్షంబులను పుట్టించును. చంద్రుఁడు నవాంశాధిపతి యయ్యేనేని పాలతోఁ గూడిన చెరుకు మొదలైనవానిని బుట్టించును. గురునవాంశ యయ్యేనేని సఫలవృక్షములను బుట్టించును. కుజుఁడు నవాంశాధిపుఁ డయ్యేనేని ముండ్లతోఁగూడిన చంద్ర మొదలగు వృక్షములను బుట్టించును. శని నవాంశాధిపతి యయ్యేనేని మనశ్చక్షుస్సులకు అప్రియమైన వృక్షములను బుట్టించును. శుక్రుఁడు నవాంశాధిపతి యయ్యేనేని మాలతీచామంతికాది పుష్పవృక్షములను బుట్టించును. బుధుఁడు నవాంశాధిపతియయ్యేనేని ఫలహీనములైన వృక్షములను బుట్టించునని తాత్పర్యము.

క్రూరస్సౌమ్యగృహస్థో వృక్షమనిష్టం కరోతి శుభదేశే,
సౌమ్యశ్చ పాపభవనే కుత్సితదేశే శుభం చాపి 22

వ్యామిశ్రైశ్శుభభూమతా భవంతి మిశ్రాస్సదావృక్షాః,
స్థలజలపతయస్తేషాం స్థలజలజానాంతు సంభవేదక్షాః. 23

లగ్ననవాంశరాశి స్థలరాశిగాని జలరాశిగాని తదధిపతియైన పాపగ్రహము తత్కాలంబున శుభగ్రహక్షేత్రమం దుండెనేని చెడ్డచెట్టు మంచి ఉద్యానాదులయందుఁ బుట్టినని చెప్పవలయును. నవాంశాధిపతి శుభగ్రహమై పాపరాశియం దుండెనేని మనోహరమైన వృక్షమును అశుభభూములగు శ్మశానాదులయందుఁ బుట్టినదానినిగా తెలియఁదగినది. నవాంశాధిపతి శుభగ్రహమై శుభరాశియం దుండెనేని మంచిభూమియందు మంచిచెట్టు పుట్టినదని తెలియఁదగినది. నవాంశాధిపతి అశుభగ్రహమై అశుభరాశియం దుండెనేని చెడ్డభూమియందు చెడ్డచెట్టు మొలచినదని తెలియఁదగినది. స్థలజలాధిపత్యముల ననుసరించి సంఖ్య మొదలైనవి తెలియఁదగినది.

స్థలజలఖగౌ విలగ్నాద్యావతిరాశౌ తు తేఽపి తావంతః,
స్వాంశాత్పరాంశగామిషు యావత్సంఖ్యా భవంతి తావంతః. 24

స్థలజలరాశినవాంశాధిపతియైన గ్రహము లగ్నముమొదలు ఎన్నవరాశియందుం డునో తత్తుల్యసంఖ్యయని తెలియతగినది. మరియుం లగ్ననవాంశాధిపతి స్వనవాంశము నుండి చలించినవాఁడై ఎన్నవదైన నవాంశయందుండునో అన్నిసంఖ్యలుగల తజ్జాతీయ ములైన వృక్షములు స్థలమందుగాని జలమందు గాని మొలచియున్నవని తెలియ తగినది.

స్వాంశే సౌమ్యైరబలైర్వియోనిలగ్నే వియోనిజాతంచ,
తద్వద్బలిభిః పాపైః స్వరాశిసదృశాంశసంయుక్తైః. 25

శుభగ్రహములు బలహీనులై లగ్నమందైనను స్వనవాంశయందైనను నుండె నేని వియోనిజన్మ గలుగును. మరియు పాపగ్రహములు బలయుక్తులై స్వక్షేత్రమందైనను స్వనవాంశయందైనను నుండెనేని వియోనిజన్మ గలుగును.

అబలగ్రహరాశిగతా అస్తంయాంతాః పరాజితాభిన్నాః,
క్రూరయుతా దృష్టా వా సద్యో నిఘ్నంతి తే నిత్యమ్. 26

ఆయోగకారకులగు గ్రహములు స్త్రీగ్రహములతోడను స్త్రీరాసులయందును నుండి అస్తంగతులైనను పరాజితులైనను చెట్లు విరిగిపోవును. క్రూరయుతులైనను దృష్టిగలవారైనను పుట్టినవెంటనే చచ్చిపోవును.

ఉద్భిజ్జజరాయుజానాం తథైవ సంస్వేదజాండజానాంచ,
ప్రసవం వ్యస్తసమస్తం గ్రహయోగైర్లక్షణైర్వాచ్యే. 27

ఉద్భిజ్జములు జరాయుజములు స్వేదజములు అండజములు అని సృష్టి చతుర్విధ ములు గలవి. గాన గ్రహయోగముల ననుసరించి దాని నిచట జెప్పవలెనని తాత్ప ర్యము.

దుర్బలగృహే గ్రహేంద్రా మేషో రాశిర్యదోదయం యాతి,
భానుశ్చతుష్పదగృహే చతుష్పదస్తత్ర భవతి సామాన్యే 28

గ్రహములు బలహీనరాశియందుండి మేషరాశి లగ్నమయి సూర్యుఁడు చతుష్పద రాశియం దుండెనేని చతుష్పదజంతుజననమని తెలియఁదగినది.

సామాన్యేనాభిహితో వియోనిసంజ్ఞో మయా సమాసేన,
అధునా కౌతుకజననం విశేషత స్సంప్రవక్ష్యామి. 29

సామాన్యముగ వియోనిజన్మ నాచే సంక్షేపముగఁ జెప్పఁబడెను. ఇపుడు విస్త రించి వియోనిజన్మను జెప్పఁబూనితిని.

ఇహాతు ద్వాదశభాగో రాశౌరాశౌ ప్రచోదితః పూర్వం,
జనయంతి తే వియోనిం యాంతా బలిభిశ్శశాంకరవిలగ్నే. 30

ప్రతిరాశియందుగల ప్రతిద్వాదశాంశ ననుసరించి వియోనిజన్మ ౧౪౪ విధములు గలదిగనుండును. దాని నిచట వివరించెదనని తాత్పర్యము.

మేషే శశీ తదంశే ఛాగాదిప్రసవమాహురాచార్యాః,
గోమహిషాణాం గోంశే నరరూపాణాం తృతీయేంశే. 31

ఆధానజననప్రశ్నకాలములయందు చంద్రుఁడు మేషమందైనను మేషాంశయందైనను నుండెనేని మేకలు గొఱ్ఱెలు మొదలైనవాని జననమగును. వృషభద్వాదశాంశయందుండెనేని వృషభమహిషాదిజననమున్ను మిథునాంశయందుండెనేని మనుష్యజన్మయనియుం దెలియతగినది.

తత్ర చతుర్థే భాగే కూర్మాదీనాం భవే దుదకజానాం,
వ్యాఘ్రాదీనాం పరతః పరతో జ్ఞేయం నరాణాం చ. 32
వణిగంశే నరరూపా వృశ్చికభాగే తథా భుజంగాద్యాః,
ఖరతురగాద్యా నవమే మృగశిఖినాం స్యాత్తథా దశమే 33
జ్ఞేయాశ్చ తత్ర వివిధా వృక్షా స్తృణజాతయశ్చిత్రాః,
ఏకాదశే చ పురుషా జలజా నానావిధాశ్చాంత్యే 34

కర్కటకాంశయందు చంద్రుఁడుండెనేని కూర్మాదులజన్మమున్ను సింహాంశయందుండెనేని వ్యాఘ్రాదులజననమున్ను కన్యాంశయందుండెనేని మనుష్యజననమున్ను తులాంశయందుండెనేని నరజననమనియుం వృశ్చికాంశయందుండెనేని సర్పాదులజననమున్ను ధనుర్ద్వాదశోత్తరార్థమందుండెనేని అశ్వగర్దభాదిజననమనియుం మకరద్వాదశాంశపూర్వార్థమందుండెనేని మృగజననమున్ను ఉత్తరార్థమందుండెనేని కప్పలు మొదలగు జలచరజంతువుల జననమనియుం మకరాంశయందుండెనేని వివిధములైన వృక్షములు తృణజాతులు తెలియతగినవి. కుంభాంశయందుండెనేని పురుషజననమనియుం మీనాంశయందుండెనేని మత్స్యాదులజననమనియుం తెలియతగినది. అంశయనఁగా ద్వాదశాంశయని భావము. ఈవిషయము పూర్వము ౫౧ వ శ్లోకతాత్పర్యమునందు ప్రసంగరీతిచే విస్తరించఁబడినది.

మేషే ద్వాదశభాగే జాయంతే జాతయో వివిధరూపాః,
శేషేష్వపిచైవం స్యాద్భువనేషు యథాక్రమం నియతమ్. 35

మేషరాశియందైన మేషద్వాదశాంశయందు అనేకవిధములైన జంతువులు పుట్టుచున్నవి. తక్కినరాసులయందును ఈరీతిగనే యూహించఁతగినది.

యో యత్ర భవేదాద్యస్తస్యాకృతిమాదిశేత్క్రతే తత్ర,
బ్రూయాత్క్రమేణ మతిమాన్ద్వాదశభాగాత్మకే నవమే. 36

ఏరాశియొక్క ప్రథమనవాంశయందైనను ద్వాదశాంశయందైనను జననమయ్యెనేని ఆనవాంశద్వాదశాంశాధిపత్యముయొక్క ఆకృతిగల జంతువు పుట్టును

జ్ఞేయా దేవం పుంగ్రహనవాంశకైర్లగ్నగైర్ద్విపమూర్తిభ్యః,
ఆద్యాంశే యోగైరపి జాయంతే బహువిధాస్సత్వాః 37

తాత్పర్య మతిసులభము

శ్వప్రభృతీనాం ప్రసవే యావంతో ద్వాదశాంశకే లగ్నే,
తావంతి వదే త్ప్రాజ్ఞః పుంస్త్రీసంజ్ఞాన్యపత్యాని 38

కుక్కలు మొదలైనవానియొక్క ప్రసవకాలమున లగ్నమం దెన్ని ద్వాదశాంశలు గతములో అన్ని స్త్రీపురుషసంజ్ఞలుగల సంతానములని తెలియతగినది నవాంశాధిపతులయొక్క స్త్రీపురుషభేదములవలనను స్త్రీసంఖ్యను పురుషసంఖ్యను దెలియతగినదని భావము

లగ్నే జీవోఽథవా సౌరశ్చంద్రోవాఽపి స్థితోభవేత్,
కూర్మాదీనాం తథాసంఖ్యా ద్వాదశాంశేషు యావతీ. 39

లగ్నమున గురుఁడుగాని లేక శనిగాని లేక చంద్రుఁడుగాని యుండఁగా లగ్నమం దెన్నిద్వాదశాంశలు గతములో అన్నికూర్మములు పుట్టునని భావము.

శుక్రో భౌమో బుధోవాఽపి చంద్రోవాఽపి శనైశ్చరః,
కుర్వంతి బలయుక్తాని భాగేష్వంగాని పూర్వవత్. 40

శుక్రుఁడుగాని కుజుఁడుగాని బుధుఁడుగాని చంద్రుఁడుగాని శనిగాని లగ్నమందుండిరేని లగ్నరాశి పూర్వోక్తప్రకారమే అవయవమగునో ఆ అవయవము బలము గలిగియుండును కొందఱు వీరలు యేయేస్థానములయందుందురో ఆయాస్థానములకు చెప్పిన అవయవములన్నియు బలముగలిగి యుండునని తాత్పర్యము.

స్వాంశాత్పరస్యభాగే యస్మిన్కాలే గ్రహాస్సముపయాంతి,
తత్ర వికారా జ్ఞేయా లోకవిరుద్ధా ధ్రువం ప్రాజ్ఞైః. 41

గ్రహములు స్వాంశవల్లనుంచి పరనవాంశకుఁ బోవుసమయమున జంతువులకు లోకవిరుద్ధములైన వికారములు గలుగునని నిశ్చయముగఁ జెప్పఁదగినది.

వృశ్చికలగ్నే భవనే తన్నవభాగేఽథవా ద్విపదసంజ్ఞే,
బిలవాసినాం ప్రసూతి ర్ఘోరాణాం నిర్దిశే త్తత్ర. 42
గోధానాం సర్పాణాం లోపాశానాం చ శల్యకానాం చ,
మూషకబిలేశయానాం రాశిమతాం చాపి కీటానామ్. 43

వృశ్చికలగ్నమందు వృశ్చికనవాంశయైనను లేక ద్విపదనవాంశ అనఁగా: మిథున కన్యాతులధనుఃపూర్వార్ధ మకరోత్తరార్ధ కుంభరాసులయొక్క నవాంశలైనను ఉదయమగుచుండెనేని బిలవాసులగు సర్పములు వృశ్చికములు మొదలైనవాని జనన మని తెలియఁదగినది.

హయనరవిదేహలగ్నే ద్వాదశభాగే నవాంశకే వాఽపి,
పశ్యతి నరేంద్రసచివ స్తత్రోత్పత్తి ర్భవే దేషామ్. 44
లూతానాం నకులానాం వృశ్చికషడ్బిందుజాతకానాం చ,
అవిషాణాం సర్పాణాం శ్వభ్రాశ్మనివాసినాం చైవ. 45
వాజిఖరాశ్వతరాణాం గోమహిషాణాం తథోషాణాం,
గురువర్ణకల్పరూపా న్ప్రవదే న్మతిమా న్బలేనైవ. 46

ధనుర్లగ్నమందు కీటద్వాదశాంశయైనను నవాంశయైనను ఉదయమగుచుండఁగా గురుఁడు చూచెనేని సాలెపురుగులయొక్కయుం ముంగిసలయొక్కయుం విషములేని సర్పములు అజగరము (కొండచిలువ) మొదలైనవానియొక్కయుం రాళ్లలోనుండు జంతువులయొక్కయుం గుఱ్ఱములు మొదలుగాఁగలవానియొక్కయుం జననము గలుగునని తెలియఁదగినది.

మృగవదనే లగ్నస్థే తన్నవభాగే తథాఽపి సూర్యాంశే,
ఆరణ్యానాం సూతిం సత్వానాం నిర్దిశేత్క్రమశః. 47
నాగానాం ఖండానాం వృకశరభవరాహవానరాణాం చ,
ఋక్షోగ్రసృగాలానాం వ్యాఘ్రాదీనాం భవేత్సూతిః. 48

మకరలగ్నమందు మకరనవాంశ లేక రవినవాంశ యైనను ఉదయించుచుండెనేని అరణ్యములగు ఏనుఁగులు మొదలగువానిజననము అని తెలియఁదగినది.

మీనే మీనాంశేవా తజ్జే సూక్ష్మాంశకేఽపి వా లగ్నే,
గురుదృష్టే విజ్ఞేయో బహుదకోత్థ స్సదాసత్వః. 49

మీనలగ్నమందు మీనాంశయందైనను మీనద్వాదశాంశయందైనను గురుదృష్టి గలుగుచుండఁగా అధికజలమందుఁ బుట్టు జంతుజననమగునని తెలియతగినది.

మేషే మేషాంశే వా భౌమేన నిరీక్షితే సదా జావీ,
వృషభే తు వదేత్తద్వద్గోమహిషాద్యాన్సదా భృగుణా. 50

మేషలగ్నమందు మేషాంశకుజునిచేఁ జూడఁబడుచుండఁగా ఉదయమయ్యెనేని మేకలు గొఱ్ఱెలు మొదలగువాని ప్రసవము గలుగునని తెలియతగినది వృషభలగ్నమందు వృషభాంశము శుక్రునిచేఁ జూడఁబడుచుండఁగా ఉదయమయ్యెనేని గోవులు గేదెలు మొదలగువాని ప్రసవము గలుగునని తెలియతగినది.

స్వంస్వం పూర్వవిలగ్నం స్వైస్స్వైర్యద్దృష్టం యదేహపతిభిస్తు,
స్వభవనసదృశాన్విద్యాన్నృవదే దవిశంకితం తత్ర. 51

లగ్నాధిపతి లగ్నమును జూచుచుండెనేని లగ్నరాశి సదృశమైన జంతువు బుట్టునని తెలియతగినది.

గ్రామ్యగృహేషు నవాంశాః పంచమనవమాష్టరాశిసంయుక్తాః,
ఆరణ్యానాం సూతిం గ్రామేషు సునిశ్చితాం కుర్యుః. 52

గ్రామ్యరాసులగు మేష వృషభ మిథున కన్య తుల ధనుస్సు కుంభములలో నొకరాశి లగ్నమై అందు ఆలగ్ననవాంశ రాశిలగ్నము మొదలు పంచమాష్టమనవమ రాసులలో నొకటి యయ్యెనేని గ్రామములో అరణ్యజంతువుయొక్క ప్రసూతి గలుగునని తెలియతగినది.

స్థలజలరాశివిభాగా నాగరభవనేషు లగ్నసంస్థేషు,
స్థలజలచరసత్వానాం జనయంతి భవం హి విటపానామ్. 53

పూర్వోక్తములగు గ్రామ్యరాసులు లగ్నము లగుచుండఁగా ఆలగ్నములయందైన స్థలసంజ్ఞగల నవాంశలు ఉదయించుచుండఁగా మెరకప్రదేశమందు చెట్లుపుట్టుననియుం జలసంజ్ఞగలనవాంశలు ఉదయించుచుండఁగా జలప్రదేశములయందు చెట్లుపుట్టుననియుం తెలియతగినది.

ఉదయతి వణిగ్విలగ్నే తద్ద్రేక్కాణే సితేన సందృష్టే,
శుకశారికాన్యపుష్టాశ్చకోరభాసాశ్చ జాయంతే. 54

తులాలగ్నమందు శుక్రాధిపద్రేక్కాణము శుక్రునిచేఁ జూడఁబడెనేని అట్టి సమయమున చిలుకలు గోరలు కోకిలలు చకోరములు అనఁగాఁ చక్రవాకములు మొదలైనవి పుట్టును.

సింహోదయే తథాద్యే సూర్యాంశే రవినిరీక్షితే సూతిః,
కుక్కుటమయూరతిత్తిరిపారావతవంతునాదీనామ్ 55

సింహాలగ్నమందు ప్రథమద్రేక్కాణముగాని ప్రథమద్వాదశాంశగాని రవి జూచుచుండఁగాఁ ఈ యుదయమయ్యేనేని కోడి నెమలి మొదలగువాని జననము గలుగును.

స్థిరభోదయమేతదంశే శేషాగ్రహాసంయుతే వ దృష్టే చ,
ప్రాసాదగృహాదీనాం ముత్పత్తిః పూర్వవద్జ్ఞేయా 56

స్థిరరాశిలగ్నము లగ్నమందలి నవాంశకూడ స్థిరరాశిసంబంధియై గ్రహయుతదృష్టమగునేని ప్రాసాదాదుల జన్మయని తెలియఁదగినది.

ఇతి త్రిపంచాశోఽధ్యాయః

---

అష్టకవర్గబిందుఫలములను దెలుపు ఏఁబదినాలవ యధ్యాయము.

తిర్యగ్రేఖోర్ధ్వవృందం గిరిగిరిశపదం న్యస్య చక్రం తదూర్ధ్వం
మేషాద్యా రాశయస్స్యుర్గ్రహగణసహితా శిష్టమిష్టస్య సద్మ,
తస్యాద్యస్సోఽపి ముఖ్యం గ్రహగణముదయం చా...త్మా త్రిమేర
న్యస్యాథస్స్వీయచక్రే స్వపదసహితభా క్వాష్టకే బిందురేఖా 1

పూర్ణైర్బిందుభిరష్టభిః పదగతైః క్షీణోఽపి భూపో భవే
దేకైకోనతయా క్రమాత్ఫలవిధిస్సర్వేష్వి............,
............ప్రియసుహృత్పాపిష్టిర్విపన్నార్ఛనష్టతా
విత్తానామపి హానిరాధికృశతా శూన్యక్రమే సంక్షయః 2

సూర్యస్యాష్టసుబిందుషు క్షితిపతే రాష్ట్రాదిభూతి ర్భవేత్
............శౌర్యవిజయ ష్షట్సు ప్రతాపోన్నతిః,

ఇత్థం హోరాశాస్త్రం రచితం కల్యాణకోపిచేనైవ,
పూర్వాచార్యైర్నిర్మిత ... ... ... దైవజ్ఞః. 10
పౌలిశరోమశవాసిష్ఠయవనబాదరాయణాశ్వక్తిః,
అత్రిశ్చ భారద్వాజో విశ్వామిత్రోగుడాగ్నికేశౌచ 11
గర్గ .. ..........................విస్తరం రచితం,
.........శాస్త్రేషూక్తం జాతకమితిచిత్రగుప్తకృతమ్ 12

ఈఅధ్యాయము అంతయుఁ శ్లోకములు పూర్తిగా లేకుండుటంబట్టియుఁ మరియొక పుస్తకము లభింపకపోవుటంబట్టియుఁ సంభవములగు బృహజ్జాతకాదిగ్రంథములయందు ఈఅధ్యాయము లేకుండుటంబట్టియుఁ సామాన్యముగనైన సవరణ చేయుటకు వీలు లేకుండుటంబట్టియుఁ తాత్పర్యము వ్రాయఁబడలేదు

ఇతి కల్యాణవర్మవిరచితాయాం సారావళ్యాం
చతుఃపంచాశోఽధ్యాయః.



చెన్నపురి : వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి
"వావిళ్ల" ప్రెస్సున ముద్రితము—1935.